## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US | Search

. COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4365 BETWEEN 10.30 AM AND 5 PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri

Telugu Tamil Sanskrit Kannada Hindi English

Online Subscription

Panchangam

Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam

Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham

Maha Bharatham Vol 1... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేదముల యథార్థ స్వరూపము




వైదిక సాహిత్య ప్రచార సమితి

[illegible]

ओ३म्

पण्डितधर्मदेवविद्यामार्ताण्डविद्यावाचस्पतिना विरचितम्

# वेदानां यथार्थस्वरूपम्

आन्ध्रानुवादकः

'चतुर्वेदभाष्यानुवादभास्करः'

**ब्रह्मश्री पण्डितलोकमलहरिसिद्धान्ताचार्यः**

परिष्कर्ता - सम्पादकश्च

सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः

**आचार्य डॉ. मर्रि कृष्णारेड्डी**

वैदिकसाहित्यप्रचारसमितिः, भाग्यनगरम्-६०, आन्ध्रप्रदेशः

2007



# THE TRUE NATURE OF THE VEDAS


***Author***

Pandita Dharmadeva Vidyamartanda, Vidyavachaspathi

***Translated in to Telugu By***

**BRAHMASRI PANDITA LOKA MALAHARI**

**SIDDHANTACHARYA**

***Editor***

**Acharya Dr. MARRI KRISHNA REDDY,** M A, M Ed, Ph.D



**Vaidika Sahitya Prachara Samithi, Hyderabad - 60.**

**2007**

ఓ౩మ్

పండిత ధర్మదేవ విద్యామార్తాండ, విద్యావాచస్పతి విరచిత

# వేదముల యథార్థస్వరూపము

అనువాదకర్త

'చతుర్వేదభాష్యానువాదభాస్కర' - శతాధికగ్రంథకర్త

బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య

పరిష్కర్త - సంపాదకులు

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

ఆచార్య డా॥ మట్టి కృష్ణారెడ్డి, M A , M Ed , Ph D

వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరాబాద్-60

2007

# "వైదిక సాహిత్య ప్రచారసమితి" ప్రచురణలు

## వేదముల యథార్థస్వరూపము


**ద్వితీయ ముద్రణ** : శ్రీ వ్యయ పుష్యం, జనవరి - 2007.

**ప్రతులు** : 1000

**వెల** : **రూ. 400/- లు** మాత్రమే

(పోస్టేజి అదనము)





**ముద్రణ** : **సాయిలిఖిత ప్రింటర్స్,** ఖైరతాబాద్, హైదరాబాదు.

ఫోన్ : 98490 05182


## ప్రతులకు :

1. **వైదికసాహిత్య ప్రచారసమితి,** 3-30; హనుమాన్ నగర్, ఆర్యసమాజం ఎదురువీధి, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60. ఆం.ప్ర., ఫోన్ : 040 - 24051322, 9849583929, 9441200322

2. **దిల్‌సుఖ్‌నగర్ ఆర్యసమాజం,** బాదంకాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్‌రోడ్డు; దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060, ఫోన్ : 9849468084, 9395376410

3. వేదగిరి, తూంపల్లి గ్రామం, కొందుర్గు మండలం, మహబూబ్‌నగర్ జిల్లా. ఫోన్ : 9441200322, 9849583929

4. **భీమాస్ డీలక్స్ హోటల్,** 34-38, జి.కార్ స్ట్రీట్, రైల్వేస్టేషన్ ఎదురుగా, తిరుపతి. ఫోన్ : 0877-2225521

5. **విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో) హైదరాబాద్, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి, కాకినాద.

# వేదము - వేదప్రాశస్త్యము

**వేదం**

- ఈశ్వరీయ జ్ఞానం
- మానవ ధర్మమునకు మూలం
- విశ్వవిజ్ఞాన కోశం
- సమస్త సత్యవిద్యల గ్రంథం
- అందరిచే ఉపాసింపదగింది
- ప్రతిచోట ఉండదగింది
- ప్రతిచోట ఉంచదగింది
- ప్రతినోట అనదగింది
- ప్రతి వ్యక్తి వినదగింది
- ప్రతి వ్యక్తి ఆచరింప దగింది

**వేదాలు**

- విశ్వములోని జ్ఞానవిజ్ఞానములకు మూల స్రోతస్సులు
- సృష్టిరహస్యాలను ప్రకటించు జ్ఞాన భాండాగారాలు
- సమస్త కళలను పరిఢవిల్లజేయు విద్యుల్లతలు
- సామాజిక, సాంకేతిక విజ్ఞాన బోధకములు
- మానవజాతిని ఆదర్శవంతంగా తీర్చిదిద్దే విజ్ఞానగనులు
- సకలలోక ధర్మ సర్వస్వభూతాలు
- సనాతన మైన జ్ఞాననేత్రాలు
- జ్ఞాన విజ్ఞాన నిధులు
- భారతీయ సంస్కృతికి మూలదర్పణాలు
- మానవ జీవితానికి దిక్సూచికలు
- నిత్యపారాయణ గ్రంథాలు
- జీవిత గమ్యబోధకములు
- మానవజాతి మనుగడకు మూలాధారాలు
- ముక్తి నిర్దేశకములు
- మానవజాతి సత్కర్మలన్నింటికీ ప్రమాణాలు
- మానవ జీవిత లక్ష్య సాధకాలు
- విశ్వసాహిత్య వికాసానికి మూలకందాలు
- విశ్వమానవ మేధోవికాసానికి ప్రతీకలు
- భువిని దివిగా మార్చు కావ్యాలు
- సర్వదా ఆచరణీయ సన్మార్గబోధకములు
- భారతీయ తాత్త్విక జీవిత అంతర్వాహినులు
- మానవత్వమునకు పట్టుకొమ్మలు

వేయిమాటలేల అణువు మొదలు విశ్వాంతరాళ ఖగోళ రహస్యములు సమస్తము వేదాలయందు నిక్షిప్తమైయున్నది

# వేదముల పట్ల శ్రద్ధను కలిగియుండుడు

వేదముల మహత్త్వము ఈ పుస్తకములో కావలసినంత వ్రాయబడి యున్నది. దీనిని పాఠకులు ద్వితీయాధ్యాయమునందు, మరియు ఇతర అధ్యాయములందును జూడగలరు. ఐనను వేదోపదేశములు సమన్వయాత్మకములు, మరియు సార్వభౌమికములను విషయము నిచ్చట చూపుచున్నాము. అందు శ్రద్ధను గూర్చి;

**శ్రద్ధాం ప్రాతర్హవామహే శ్రద్ధాం మధ్యన్దినం పరి ।**

**శ్రద్ధాం సూర్యస్య నిమ్రుచి శ్రద్ధే శ్రద్ధా పయేహ నః ॥ ఋ.౧౦-౧౫౧-౫॥**

మున్నగు మంత్రముల ద్వారా ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలములందు శ్రద్ధ కొరకై ప్రార్థన జేయుటకును, దానిని ధారణ మొనర్చుకొనుటకును ఉపదేశము గలదు. దానితో బాటు

**మేధాం సాయం మేధాం ప్రాతర్మేధాం మధ్యన్దినం పరి।**

**మేధాం సూర్యస్య రశ్మిభిర్వచసా వేశయామహే ॥ అథర్వ ౬-౧౦౮ - ౫ ॥**

మున్నగు మంత్రములలో అదే ప్రకారము ప్రాతః మధ్యాహ్న, సాయంకాలములందు (అనగా ఎల్లవేళలందును) మేధను - శుద్ధబుద్ధిని, తర్క-శక్తిని ధారణ మొనర్చుకొనుటకు ప్రార్థన, మరియు ఉపదేశము గలదు. 'శ్రద్ధ' యను దానికి అంధవిశ్వాస మను అర్థము లేదు. కాని 'శ్రత్' అనగా- సత్యమును శుద్ధ బుద్ధి ద్వారా దెలిసికొని దానిని సంపూర్ణముగా ధారణ మొనర్చుటయే. ఈ విధముగా వేదములు శ్రద్ధ, మరియు మేధాసంపత్తిని కలిపి ఆచరణ మొనర్చుకొనుట కుపదేశింపబడినవి. ఇందులకై ప్రార్థన నొనర్చుటను నేర్పుచున్నవి.

**అగ్నే సమిధమాహార్షం బృహతే జాతవేదసే నమః।**

**శ్రద్ధాం చ మేధాం చ జాతవేదాః ప్రయచ్ఛతు ॥ అథర్వ ౧౯-౬౪-౧॥**

మున్నగు వానిని జ్ఞానులనోట యనిపించినవి. అనగా సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడునగు పరమేశ్వరుని యెడ నాయాత్మను సమర్పించుకొందును. ఆ పరమాత్మ నాకు శ్రద్ధ, మరియు మేధ (ధారణావతి యగు శుద్ధ బుద్ధి) ని ప్రసాదించుగాక.

ఈ సమన్వయాత్మక ఉపదేశముల కారణమున వేదములందు అంధవిశ్వాసముల కవకాశము లేదు. ఈ విధమగు వందలాది ఉదాహరణములు మతమతాంతరుల ఇతిహాసములందు గాంచనగును. వేదముల ఈ విశేషతను స్వర్ణాక్షరములలో వ్రాయదగియున్నవి.



# సంపాదకీయం

ఇది ఒక అద్భుత గ్రంథం.

ఇది వైదిక సిద్ధాంత మార్గగాములకు దిగ్దర్శనగ్రంథం.

ఇది వేదములపట్ల గలుగు అనేక సందేహములకు సంపూర్ణ సమాధానం తెలిపే అపూర్వ గ్రంథం.

ఇది వేదముల యథార్థస్వరూపమును సప్రమాణంగా నిరూపణ జేసే ప్రామాణిక గ్రంథం.

ఇది వేదముల అపౌరుషేయత్త్వమును, నిత్యత్త్వమును స్థాపితం చేసే సాక్షాత్కార నిదర్శన గ్రంథం.

ఇది వేదముల పట్ల ప్రాచీన, మధ్యకాలీన, అర్వాచీన విద్వాంసుల అభిప్రాయములను తెలిపే అపురూప గ్రంథం.

ఇది వేద, వేదాంగ, వేదోపాంగ, బ్రాహ్మణారణ్యకోపనిషదాది ప్రమాణములద్వారా వేదమహత్త్వమును తెలుపు వివేకోదయ గ్రంథం.

ఇది ఋషులు మంత్రకర్తలుగారు, మంత్రద్రష్టలని హేతువులతో నిరూపించే నిసర్గ గ్రంథం.

ఇది యజ్ఞయాగాది క్రతువుల వాస్తవికతను తెలియజేయు యౌగికార్థ విభూషిత గ్రంథం.

ఇది అవైదిక, అజ్ఞానాంధకారమును తొలగించి వేదభాస్కరకిరణాలను దశదిశలా ప్రసరింపజేయు ప్రకాశక గ్రంథం.

ఇది మూఢ మతానుయాయుల మతులను పరివర్తనము చేయు మహాగ్రంథం.

......ఇది మొత్తానికి వైదిక సిద్ధాంత ప్రతిపాదిత గ్రంథం.

ఇట్టి గొప్పగ్రంథాన్ని హిందీభాషలో పం. ధర్మదేవవిద్యావాచస్పతి, విద్యామార్తాండగారు ఎన్నో శ్రమప్రయాసల కోర్చి ఎన్నో గ్రంథములనధ్యయనంచేసి అనేకమంది విద్వాంసుల అభిప్రాయములను సేకరించి నిజమైన వేదసిద్ధాంత ప్రతిపాదకంగా నిర్మించారు. ఇలాంటి గ్రంథాన్ని బ్రహ్మ శ్రీ పం. లోక మలహరి సిద్ధాంతాచార్యులవారు పది సం॥రాలకు పూర్వమే అనువదించగా నా అదృష్టవశాత్తు నాకు లభించడం భాగ్యంగా భావిస్తున్నాను. వెంటనే దీనిని ముద్రించుటకు పూనుకున్నాను. ప్రథమ ముద్రణ 2000లో జరిగింది. ఈ ద్వితీయముద్రణ తిరుమల తిరుపతి దేవస్థానములవారి సహకారంతో జరుగుచున్నది.

ఈ గ్రంథానికి తమ అమూల్యమైన అభిప్రాయములను వ్రాసిచ్చిన పండిత వరేణ్యులు ఆచార్య వేదవ్రత మీమాంసగారికి, కవిశాసన రఘుమన్నగారికి, డా. మసన చెన్నప్పగారికి అభివాదములు.

గ్రంథారంభంనుండి అంతంవరకు నాకు పూర్తిగా సహకరించిన నా అర్ధాంగి శ్రీమతిరాధాదేవికి అభినందనలు.

చివరగా ఈ గ్రంథముద్రణ భాగ్యమును కలిగింపజేసిన పండిత లోకమలహరి దంపతులకు శతాధిక వందనాలు.

ఈ గ్రంథాన్ని వేదాభిమానులు, వేదానుయాయులు చదివి లాభాన్వితులు కాగలరని కోరుతున్నాను.

సంపాదకుడు:

- మెట్టి కృష్ణారెడ్డి

ఓ౩మ్

# రచయిత మాటలు

కాంగ్డీ గురుకుల విశ్వవిద్యాలయ స్వామిత్వము గల పంజాబు ఆర్య ప్రతినిధి సభ యొక్క వైదిక పరిశోధన సమితి యొక్క సమావేశము క్రీ శ ౩౧-౧౨-౧౯౫౨ లో వైదిక పరిశోధనా కార్యాలయము కాంగ్డీ గురుకులము నందు జరిగినది అందు నేనే గాక సదస్యులైన దిగువ మహానుభావులును పాల్గొనియుండిరి.

౧. శ్రీ దీవాన్ బద్రీదాస్ జీ, సభా ఉపప్రధాని

౨. శ్రీ పం. విశ్వనాథ జీ, విద్యాలంకార్

౩. శ్రీ ఆచార్య ప్రియవ్రత జీ, వేదవాచస్పతి

వీరేగాక శ్రీ పం బుద్ధ దేవుజీ విద్యాలంకార్, శ్రీ పం. రామనాథ్ జీ వేదాలంకార్, వేదోపాధ్యాయ; మరియు శ్రీ పం భావద్దత్తజీ వేదాలంకార్, అనుసంధాన విద్వాన్ గురుకులము కాంగ్డీగారిని విశేష రూపములో ఆహ్వానించుకొని యుంటిమి

శ్రీ దీవాన్ బద్రీదాసు గారు విశ్వవిద్యాలయములందు చదివించబడుచుండు వివిధ ఇతిహాస పుస్తకములనుండి వేద విషయములను చదివి వినిపించినారు పాశ్చాత్య విద్వాంసులును కొందరు భారతీయ విద్వాంసులును వేదముల గూర్చి వ్రాయుచున్నది గాంచి వేదములు ఈశ్వరీయ జ్ఞానమగుటచే మన యభిప్రాయములపై గొప్ప ప్రహారము (దెబ్బ) పడుచున్నది దానికి సమాధానము వ్రాయుట ఎంతయో అవసరమని తెలిపి మా మనస్సులను ఈ వైపునకు మరలించినారు సదస్యులెల్లరును శ్రీ దీవాన్ గారి అభిప్రాయమునకు తమ సమ్మతిని దెలిపినారు. వాదోపవాదముల తిరువాత సర్వ సమ్మతితో ఇట్లు నిశ్చయింప బడినది

పాశ్చాత్య విద్వాంసులద్వారా మరి కొందరు భారతీయ విద్వాంసుల ద్వారా యొనర్చబడు వేద విషయక ఆక్షేపణములకు మరియు అభిప్రాయములకు సమాధానమొనర్చు సాహిత్యమవసరము దానిని సిద్ధపరచి ప్రచురించుకార్యము గురుకుల పరిశోధనా విభాగపక్షమున అతిత్వరలో జరుగుట ఆవశ్యకము మరియు ఈ విషయములో బొంబాయి భారతీయ విద్యాభవనము ద్వారా ప్రచురితమైన *"The Vedic Age"* అను పుస్తకములో వేదములపై వేయబడిన ఆక్షేపణలకు సమాధానము మొట్టమొదట సిద్ధము చేయించవలయును ఈ పుస్తకమున గత ఆక్షేపణలకు సమాధానమును వ్రాయించుటకై శ్రీ పం విశ్వనాథ విద్యాలంకార్ గారు, శ్రీ పం ధర్మదేవవిద్యావాచస్పతి గారు, శ్రీ పం. బుద్ధదేవ విద్యాలంకార్ గారు ప్రార్థింపబడిరి

ఒకవేళ మాన్య ఉపాధ్యాయ శ్రీ పం విశ్వనాథ విద్యాలంకార్ విద్యామార్తాండ గారు,లేక శ్రీ.పం బుద్ధదేవ విద్యాలంకార్ విద్యామార్తాండగారు ఈ బృహత్కార్యమును తమ చేతుల మీదుగా పూర్తిజేసిన నేను చాల ఆనందించెడివాడను ఈ స్థితియందు నేను స్వయముగా వ్రాయు ఆవశ్యకతయుండక పోయెడిది దౌర్భాగ్యవశమున కొన్ని కారణములచే ఆ యిరువురు సుయోగ్యవిద్వాంసులు ఈకార్యమును సాధించుటకు సిద్ధముగా లేనందున వారి యాజ్ఞ, మరియు సమితి యొక్క నిర్ణయము ననుసరించి నేనే యీకార్యమును సాధించుటకు సిద్ధపడితిని మేనెల ౧౯౫౩ నుండి ఆగష్టు ౧౯౫౪ వరకు దాదాపు నా సమయమంతయును 'వైదిక్‌ఏజ్' మరియు అటువంటిదే యగు

ఇతర సాహిత్యమును ఎంతో ధ్యాన పూర్వకముగా చదివి దానిని సిద్ధపరచుట యందు నిమగ్నమై గడిపితిని. నే నధికముగా సంతసించదగిన విషయమేమనగా, ఈ కార్యములో నాకు అనేక మాన్య విద్వాంసుల నిర్దేశనములు ప్రాప్తించుచుండినవి. వీరందరిలో ముఖ్యముగా చెప్పుకొనదగినవారు శ్రీ పం. విశ్వనాథ విద్యామార్తాండగారు. వీరు కేవలము సూచనలిచ్చుటయేగాక పుస్తకము సిద్ధమైన పిదప ఎన్నో దినముల వరకు దానిని మొదటి నుండి చివరి వరకు వినెడి శ్రమకోర్చినారు. ఇందులకు శ్రీ పండితులవారికి ఋణపడి యుండుటయే గాక వారి యెడ కృతజ్ఞతా పూర్వక శ్రద్ధాంజలులను సమర్పించుకొనుచున్నాను. పుస్తకము యొక్క నామకరణమును గురుకుల ఆచార్యులగు మాన్యశ్రీ పం. ప్రియవ్రత వేదవాచస్పతిగారు నిర్ణయించినారు. గురుకుల శిక్షాధ్యక్షులగు శ్రీ పం. సుఖదేవ దర్శనవాచస్పతి గారు కూడా ఆ యా సమయములందు అనేక మంత్రముల తాత్పర్యములందు తన విద్వత్తాపూర్ణ నిర్ణయములను ప్రకటించుచుండిరి. ఇదే విధముగా శ్రీ పం. బుద్ధ దేవ విద్యామార్తాండ మొదలగు ఇతర విద్వాంసుల పుస్తకముల నుండి నాకెంతయో సహాయము లభించినది. వారందరకు నా ధన్యవాదముల నర్పించు కొనుచున్నాను. పంజాబు ఆర్య ప్రతినిధి సభ యొక్క ప్రధాన్ శ్రద్ధేయ స్వామి ఆత్మానంద సరస్వతి గారికి నే నెంతయో కృతజ్ఞుడను. ఈ పుస్తకము శీఘ్రముగా ప్రకటింప బడుటకు వారు ఎంతో శ్రద్ధను చూపి దీనికొరకు సభనుండి తగిన వ్యవస్థ గూడ నొనర్చినారు.

విద్వాంసులగు పాఠక మహాశయుల మనస్సులందు ఒక ప్రశ్న ఉత్పన్నమగుట స్వాభావికమే. అదే మన, ఇట్టివే వందలాది పుస్తకములుండగా, వైదిక పరిశోధనా సమితి ఈ 'వైదిక్ ఏజ్' నే ఆవశ్యకమని ఏల తలచినదో? ఇందుకు సమాధానమేమన, 'వైదిక్ ఏజ్' భూమిక యందు భారతీయ విద్యాభవన్ బొంబాయి అధ్యక్షులు శ్రీ కన్హయ్యాలాల్ మున్షీ గారు ఇట్లు వ్రాసినారు.

*In the course of my studies I had long felt the inadequacy of our so called Indian histories I was Planning an elaborate history of India in order that not only India's Past might be described by her sons, but also that the world might catch a glimpse of her soul as Indians see it The Bharatiya Vidya Bhavan which I founded in 1938, took over the scheme*

*-The Vedic Age, Foreword P7*

"అనగా నేను నా అధ్యయనకాలమున ఎంతో కాలమునుండి భారతీయ ఇతిహాసములు, యథార్థ రూపములో సరిపడునవ్విలేవని అభిప్రాయపడినాను. కావున అనేక సంవత్సరముల నుండి నేను భారత దేశ ఇతిహాసమునకు ఒక విస్తృత ప్రణాళికను సిద్ధము జేయుచుంటిని. దీనివల్ల భారత మాత పుత్రుల ద్వారా ఈ దేశపు భూతకాలపు వర్ణన చేయబడుటయే గాక, భారతీయులవలె విశ్వమంతయును దీని యాత్మ యందలి నిజ స్వరూపమును జూడగలుగవలెను. నా ద్వారా 1938లో ప్రారంభించబడిన భారతీయ విద్యాభవనము ఈ ప్రణాళికను తన హస్తములలోనికి దీసికొనినది."

పై భూమికను చదివినప్పుడు భారత దేశపు ప్రాచీన ఇతిహాసమును యథార్థ రూపములో ఎరుగుకొనుటకు లభించినది కదా! అని నే నెంతయో ఆనందించితిని. కాని ఎప్పుడైతే ఈ పుస్తకమును చదువుచు పోయితినో అప్పటినే నా యావేదన, నిరాశ వృద్ధియైనది. ఏలన? వేదము, వేదకాలము మున్నగు విషయములలో *'Vedic Age'*లో ప్రకటించబడిన విషయములందు భారతీయత్వముగాని దాని మౌలికత్వముగాని లేదు. కాని పక్షపాతముతో పాశ్చాత్యలేఖకుల అవివేక పూర్ణమగు ఆలోచనలననుసరించుటయేగాదు, వారి కంటే ఒక అడుగు ముందుకే వేసినారు.

దీనికి శ్రీ అవినాశ చంద్ర బోసు *M.A., Ph.D.,* భూమికను వ్రాసినారు. ఈ పుస్తకము అనేక భారతీయ విశ్వ విద్యాలయములందు పాఠ్య పుస్తక రూపమున స్వీకరింపబడినది. దీని వల్ల విద్యార్థులందు వేదము, మరియు వైదిక కాల విషయములో భయంకరమగు భ్రమ వ్యాపించు అవకాశము గలదు. కావున నేను ఆ భ్రమను తొలగించుట మిక్కిలి ఆవశ్యకమని యెంచినాను. 'వైదిక్ ఏజ్' పు.౨౨౫లో భాషా సంబంధమున అన్నిటికన్న ప్రాచీన ఋగ్వేద భాషను దాదాపు క్రీ.పూ ౧౦౦౦ ఒక్క వేయి సంవత్సరములని ఎంచవచ్చునని, పు. ౩౭౮లో వైదిక ధర్మమును బహు దేవతా పూజావాదియని ఇంకా అచ్చటచ్చట అద్వైతవాదియనియు చూపుటకు ఈ లేఖకులు ప్రయత్నించినారు. పు. ౩౮౯లో వివాహ కాలములందు గోవులను చంపి, వాని మాంసముచే అతిథులను తృప్తి పరచబడుచుండెడివారని, పు ౩౯౩లో వైదిక కాలములో సారాయి లోకప్రియ వస్తువై యుండెననియు వ్రాసినారు. అథర్వవేద విషయములో, దాని యందు చేతబడులు, మంత్ర తంత్రములు, ప్రయోగములు, గారడి మాయలకన్న మరేమియు లేదనియును మున్నగునట్టివానిని వ్రాసినారు.

ఇట్టి అసత్యములగు కల్పనలెన్నియో వ్రాసి విద్యార్థుల మస్తిష్కములందు, మనస్సులందు వేదశాస్త్రముల యెడ అశ్రద్ధ, విముఖతను గలుగజేయుటకు ప్రయత్నించుట ఎంత అనుచితమో చూడుడు కావుననే రేయింబవళ్లు శ్రమ పడి అట్టి ఆక్షేపణములకు సప్రమాణముగ, యుక్తి యుక్తముగా సమాధాన మీ పుస్తకము ద్వారా యిచ్చుటకు ప్రయత్నించినాను 'వైదిక్ ఏజ్' పుస్తకములో అధికాధికముగా పక్షపాతముతో పాశ్చాత్య విద్వాంసులను అవివేక పూర్ణముగా అనుసరించుటయేగాక రచయితలు వారి కంటే ఒకడుగు ముందుకే వెళ్లినారు.

ఆంగ్లమునెరిగినట్టి మిత్రుల కోరికననుసరించి ఆవశ్యకమనిపించిన చోట అనేక మంత్రముల అనువాదము, మరియు ఆంగ్ల మూల ఉదాహరణములను గూడా ఇచ్చినాను ఇందువల్ల వారు కూడా లాభము నొందగలరు. శిక్షిత వ్యక్తులకిది ఎంతయో ఉపయోగపడగలదని ఆశించబడుచున్నది 'వైదిక్ ఏజ్' లేఖకులు తా మొనర్చిన ఘోర అపరాధములను దెలిసికొని రెండవ ముద్రణమున ఉచితమగు పరివర్తనమొనర్చి తమ సత్య ప్రియత్వమును చాటుకొందురు గాక

నేను అత్యంత మాన్య విద్వాంసులగు శ్రీ ప్రిన్సిపల్ అవినాశ చంద్ర బోసు *M.A., Ph D*, (డబ్లిన్) కు ఎంతయో కృతజ్ఞుడను వారీపుస్తకమునకు అత్యుత్తమమగు భూమికను ఇంగ్లీషులో వ్రాసి నన్ననుగ్రహించి యీ పుస్తకము యొక్క ఉపయోగమును పెంచినారు వారు భారతీయ విద్యాభవన్ ద్వారా వెలువడు *The call of the Vedas* మరియు 'ప్రబుద్ధ భారత్' అను పత్రికల యందు ప్రచురింపబడిన ఆంగ్ల లేఖలను చదివినాను వారికి గల వేద విషయ జ్ఞానమెంత విస్తృతమో ఈ లేఖల ద్వారా తెలియును.

**ఆనంద కుటీరము జ్వాలాపూర్**
**(సహారన్ పూర్)**

**గ్రంథకర్త**
**ధర్మదేవవిద్యామార్తాండ**

# అనువాదకుని నివేదన

ఇది కాంగ్డీ గురుకుల విశ్వ విద్యాలయాచార్యులగు శ్రీమాన్ పం. ధర్మ దేవ విద్యా వాచస్పతి విద్యా మార్తాండ గారి 'వేదోంకా యథార్థ స్వరూప్' అను హిందీ మూల గ్రంథమునకు 'వేదముల యథార్థ స్వరూప' మను పేరుతో తెలుగు భాషలోకి నే ననువదించిన గ్రంథము. నేను విద్వాంసుడను గాను. కొద్దిపాటి తెలుగు మాత్రము వ్రాయను చదువను గలను. ఇంతకు పూర్వము యజుర్వేద, సామవేద, అథర్వ వేదభాష్యములను కూడా తెలుగులోనికి అనువాదమొనర్ప సాహసించితిని.

పరమ పిత పరమేశ్వరుని అపార కృప, నా జననీ జనకుల ఆశీర్వాదము, నా పూర్వ జన్మ సుకృతము, మరియు శ్రీ పూజ్యపాదులు బ్ర. వేదవ్రత మీమాంసకులు, కామారెడ్డి ఆర్షగురుకులాచార్యుల ప్రేరణ చేతనే నే నీ సాహస మొనర్ప నడుకట్టితిని "నీకిది సాధ్యము గాదని తెలిసియు ఇంతటి సాహస మేల జేయవలసి వచ్చిన దనియు, అందులోనూ ఇది దార్శనిక విషయము గదా! నీ వేమి చదువుకొన్నా" వనియు విద్వాంసు లెందరో అనుకొనుటయే గాదు, నాతో అన్నారు కూడా. ఇందుకు సమాధానము పై దెలిపిన సాహసమే యనుటకన్నా ఏమియు చెప్పలేను.

మన తెలుగునాట విద్వాంసులు లేరని కాదు. దిగ్గజములవంటి విద్వాంసులు, కవులు, పండితులు, వ్యాఖ్యాత లెందరో యున్నారు. మన తెలుగు భాషలో వైదిక, దార్శనిక సాహిత్యము నామమాత్రముగా నున్నది. అది సంస్కృత, హిందీ భాషలందు పుష్కలముగా నున్నది. దానిని మన విద్వాంసులు తెలుగువారి కందించు ఔదార్యమును కనబరచలేదు. వారి పాండిత్య పటిమనంతయును నవలలు, నాటకములు, కథలు, గేయములు మున్నగు కల్పిత వర్ణనలందే వినియోగించుచు పేరు ప్రఖ్యాతులు, సత్కార సన్మానములు పొందుచూ ధనార్జనమునందే పోటీలు పడుచున్నారు. వారి కీ వైదిక దార్శనిక సాగరమున నీదులాడుటకు సమయ మేది? ఎవరైనా ఇందుకు సాహసించిన విమర్శించుటకు వారికి కావలసినంత సమయ ముండును. ఇట్టి కార్యమును జేయతలపెట్టినచో వారి కిది సులభ సాధ్యమే. కాని రేయింబవళ్లు కదలక కూర్చుండి దీక్షా పూర్తియొనర్చు ఓపిక వారి కుండదు. ఇది నా విమర్శ గాదు, ఆవేదనయే. ఇకనైనను విద్వాంసు లీ వైదిక, దార్శనిక సాగరమున మునకలు వేయుచు అపార, అమూల్య ఆణిముత్యపు రాసులను వెలికిదీసి తెలుగు సోదరులకు ప్రసాదించి తరింతురు గాక యని ప్రార్థించుచున్నాను.

ఇంతటి సాహసముతో కూడిన కృషి యొనర్చినను ఏమిటి ఫలితము? వీనిని ముద్రణ మొనర్ప జేసి తెలుగు ప్రజలకందించు మహాదాత లెక్కడ? మన మధ్యన లక్షాధిపతులు, కోటీశ్వరులు పెక్కురు గలరు. కాని వీనిని ముద్రణ యొనర్పజేయుటకు సమర్థులైన దాత లెవ్వరును ముందుకు రారే! ధనార్జన మంత గొప్ప కార్యము గాక పోవచ్చును. కాని దాతృత్వమునన దున్నదే! అది పూర్వ జన్మ సుకృతమున వచ్చును.

"నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర సుదుర్లభః।
వివేకో దుర్లభస్తత్ర దాతృత్వఞ్చ విశేషతః ॥" నీతి శాస్త్రము

కోటీశ్వరులెందరో తమ ధనమునంతయును ఇచ్చటనే వదలివేసి ఎవ్వరికిని దెలియని ఊరు, పేరు లేని ప్రదేశమునకు వెళ్లి పోవుదురు, కాని తరతరాల వారికి తమ పేరు ప్రతిష్ఠలనిచ్చుట స్థాపించి స్వయముగా తరించి జాతిని తరింప జేయు భాగ్యము సుకృతవంతులకే సాధ్యము.

ఏ కాలమందైనను విద్వాంసులు ముందుకు వచ్చి వీనికి శుద్ధ ప్రతులు వ్రాసి మహాదాతల ఉదారముతో వీనిని ప్రచురించి జాతికి సమర్పించగలరని విశ్వసించు చున్నాను. ఎనిమిది దశకముల ఆయువును వెనుకకు నెట్టి వేసినవాడను, వీని ప్రచురణను ఈ నా కన్నులతో నేను జూడలేనను నిరాశ నాకు లేదు. రాబోవు తరముల వారికైనను ఈ యవకాశమును లక్ష్మీపతులు గలిగించగలరను ఆశ నాకు సంపూర్ణముగా నున్నది. చదువు సంస్కారములు, విద్యా విశేషములు లేని ఈ

సాహసికు డెట్లుండెనో యని రాబోవు తరముల వారనుకొనకుండా నన్నీ సాహసమునకు సదా ప్రేరణ నిచ్చుచూ నాకన్ని విధముల సహకరించుచున్న నా ధర్మపత్ని శ్రీమతి కృష్ణవేణితో గూడా తీయించిన నా ఛాయాచిత్రమును దీనితో జతపరిచితిని. సాంసారిక జీవితములో పరస్పరము విడిచి యుండరాదను వైవాహిక సమయము నాటి ప్రతిజ్ఞను ఈ విధముగా వెల్లడించుటయే జరిగినది విజ్ఞులు అన్యధా భావించకుందురు గాక

పై భావములు ప్రకటించిన కొంతకాలమునకే దైవయోగముచే నా భాగ్యవశమున ఈ భాగ్యనగరమందే యువకవి, అనేక గ్రంధ రచయిత శ్రీ మర్రి కృష్ణారెడ్డి ఎమ్. ఏ., ఎం. ఎడ్., (పి హెచ్.డి) సిద్ధాన్తాలంకార గారి దర్శనము లభించినది వీరు ''**చతుర్వేద సంహిత**''ను తెలుగు లిపిలో మంత్ర,ఋషి దేవత, ఛందస్సు, స్వరము (ఉదాత్తానుదాత్తస్వరితము)లతో బాటు సంహితం విస్తృత పరిచయము నొసగుచు ప్రకాశపరచినారు ఈ నాల్గు వేదముల మంత్రానుక్రమణికను గూడ వ్రాసి వాని పూర్ణత్వములను స్థిరపరచినారు నాచే అనువదింపబడిన ఈ ''**వేదముల యథార్థ స్వరూప**''మను గ్రంధమును చూచి కడు సంతృప్తి చెంది దీని ప్రమరించుట కెంతయో కృషి సలిపినారు ఇది సామాన్య కార్యము గాదు

నేను చాలాకాలము క్రిందటనే తెలుగు భాషలోని కనువదించిన యజుస్సామాథర్వవేద భాషాభాష్య వ్రాతప్రతులను చూచి అత్యంతానందముతో వీనిని ముద్రింపజేయు భారము తనపై వేసికొని నన్ను కృతార్థునొనర్చినారు ''**ఆలస్యాదమృతం విష**'' మ్మను ఆర్యోక్తిననుసరించి కార్యమునారంభించినారు ఇంతయేగాదు అనువాదముగాక మిగిలియున్న మహా గొప్పదగు ఋగ్వేద భాష్యమును గూడ తెలుగులోనికనువదించుమని నాకు నూతనోత్సాహమును గలిగించినారు కాదనలేక తొంబదేండ్ల వయస్సులో ఈశ్వరునిపై భారముంచి నే నా కార్యము నారంభించినాను.

శ్రీ కృష్ణారెడ్డిగారింకా వేదవేదాంగోపాంగములను, బ్రాహ్మణారణ్యక ఉపనిషత్తులను లభ్యమైనంతవరకు తెలుగులోనికి తేవలెనను ఆకాంక్షతోనున్నారు ఈ బృహత్కార్యమునందు వీరి ధర్మపత్ని శ్రీమతి రాధా కృష్ణారెడ్డి గారు సహచారిణిగానే గాక సహాయకారిణిగా కూడా తోడ్పడుచున్నారు ఈ ఆదర్శ దంపతుల సంకల్ప సిద్ధికై పరమేశ్వరుడు వీరికి సంపూర్ణాయువును ఆరోగ్యమును ప్రసాదించుగాక! మరియు వీరికి ప్రేరణా రూపేణ, ధనరూపేణ పుష్టినిచ్చుచున్న ఉదారదాతలెల్లరకును ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక!

యహ మత్ కహో కే జగ్ మేం కర్సక్తా క్యా అకేలా।
లాఖో మేం కార్యకర్తా హై సూరుమా అకేలా ॥

ఇట్లు
వేదానుయాయుల పాదధూళి

**లోక మలహరి**

వైదిక పురోహితుడు
ఆర్యనగర్, ఇందూరు-జిల్లా, ఆంధ్రప్రదేశము - ౫౦౩ ౦౦౧
౧౦-౧-౧౯౯౧ అనువాదము;
ముద్రణ : జూలై, ౨౦౦౦

# FORE WORD

## Principal Abinash Chandra Bose M.A,.Ph.D.

*I extend a hearty welcome to Pandit Dharmadeva Vidyamartand's book on the Vedas which is the result of life-long work on the subject by this most devoted Vedic scholar*

*There are two main aspects of the Vedas · first, the facts about their composition, and second, the contents and their significance Traditionally the Vedas have been considered to be immortal. without human authorship revealed in the souls of sages Oriental scholars, on the other hand, have tried to show them as near modern times as possible But one thing stands out clearly that the truths dealt with by the Vedas and the values upheld by them are what should be classed as ultimate. In this sense the Vedas are no more bound down to a date than, say, the law of gravitation is bound down to Newton's age*

*In respect of contents, different views have been held about the meaning of the Vedas by different schools of interpreters One of them is Sayanacharya who, in spite of his monumental work, is found to have read the mythologies of his own times (14th century A D ) into the Vedas Western orientalists struck out new lines, but being (some of them with missionary zeal) attached to Christianity (exceptions are rare), they have shown a distinct tendency to consider everything that is at variance with their own religion (with its belief in a God in heaven exercising His will as He likes) to be crude and primitive Sometimes they were disabled by a repressed mentality to realise the vedic joy of living and the Vedic ennoblement of human nature through affiliation to a higher spiritual life To their old-world sin-consciousness and modern 'obscenity' - consciousness, certain robust poetic visions of life, dealing particularly with married love, have appeared shocking There have been Indian scholars, too, who, unacquainted with the spiritual background of the Vedic religion and its noble history through the ages have indulged in cheap denunciation of the Vedas, often surpassing their 'authorities', the western orientalists, in the virulence of their attack But their surrender to their authorities is sometimes more dogmatic than the surrender of medieval European scholars to theological authorities Pandit Dharmadeva has selected a book containing such an approach to the Vedas, for special criticism It is, 'Vedic Age', published in Bombay, which is found on the list of textbooks of many Indian Universities for students of ancient Indian history The writer on Atharva Veda in that book states*

*"Bloomfield's excellent monograph on the Atharva Veda,------offers practically everything that a student of the Vedic literature might wish to know about the Atharva Veda The Section on the Atharva Veda in this chapter is mainly based on Bloomfield's monograph - (Vedic Age, p 239, quoted on p - 41 of this book)"*

*Our enthusiastic worshipper of authority did not know that a student of Vedic literature or any other literature might wish to know many more things than what even a Bloomfield could offer Our scholar not only accepts Bloomfield as his authority, but gives him a certificate for perfection.*

*...... there can be no doubt that Bloomfield was perfectly right in characterising the Atharva*

*Veda as follows - On the whole, Atharva Veda is the bearer of the old tradition not only in the line of popular charms, but also to some extent its hieratic material - (Vedic Age p 232)*

*The disciple outbids the authority in his logic, based on it :*

*"The 17th Kanda, consisting of only one hyman of purely magical contents, is a curious anomaly and must be regarded as a late accretion, though Partly appearing also in the Pippalada text. - Vedic Age p 234.*

*The authority does not say that the 'hieratic material' cannot fill the whole or most of a single chapter*

*Speaking of the Rigveda, the learned contributor to the Vedic Age says*

*The Rigveda repeatedly refers to the attacks on the aborigines - Vedic Age p 261*

*One should ask, does the Rigveda say the aborigines were attacked or do the western authorities say so? Our scholar continues*

*They are called krishnatvach (black skinned) metaphorically. - Vedic Age p 261*

*How does our scholar know that krishnatvach is used metaphorically?*

*Do the European authorities find a metaphor in the expression?*

*Pandit Darmadeva has not mentioned the fact that the writer on the Rigveda in 'Vedic Age' considers the hymans to have been just 'manufactured'. There is at least one trait of the western orientalist that our Indian scholar did not share - the former's wide acquaintance with world literature, ancient and modern, and keen sensitiveness to poetic values A reason for the lack of the right response to the appeal of the Vedas has been pointed out by a modern Professor of Literature, T Mascaro, whom Pandit Dharmadeva quotes in his book.*

*"If Sanskrit could find a group of translators with the same feeling for beauty of language and the sacred text in the original as the Bible has found in England, eternal treasures of old wisdom and poetry would enrich the times of today Among those compositions, some of them living words before writing introduced, the Vedas, the Upanishads and the Bhagavad Gita would rise above the rest like Himalayas of the spirit of man "*

*- The Himalayas of the soul by J Mascaro, p 151*

*I congratulate our author on the vast learning that his book discloses and the masterly hold on the subject as a lover of literature I should wish the contents of the Vedas to be intensively studied for their spiritual, poetic, moral and social significance independently of the question of their divine or human origin Even when so approached, the Vedas will appear to carry a deeper sense of spiritual, aesthetic and a more comprehensive vision of life than the modern man can claim to have experienced And they will give a clue to the perennial spring at which the sages saints and philosophers of the land have drunk through the millenniums and kept the soul of India alive.*

***- A.C. Bose.***

# బ్ర. శ్రీ వేదవ్రత మీమాంసక ఆచార్యులు
# ఆర్ష గురుకులము కామారెడ్డి వారి శుభ సందేశము

వేదములు ఒక దేశానికి, కాలానికి, తెగకు కట్టుబడినవి కావు అవి కాలమున కతీతములు. అవి ప్రపంచమందు సమస్త దేశాలలో నివసించు సకల మానవులకు మూడు కాలాలలో ఒకే విధముగా ఉపకరించును. వాటిలో నున్న సిద్ధాంతములు వైజ్ఞానికములు, ప్రమాణములపై ఆధారపడినవి అవి మానవుని ద్వారా రచింపబడినవి కావు వేదము లేనిదే ఎవరికిని జ్ఞానము లభింపదు. అట్టిచో విద్యాజ్ఞానము లేని మానవుడు వేదముల నేవిధముగా రచించగలడు?

వేదములు సమస్త సత్య విద్యల గ్రంథములు. మహర్షి అగ్నివేశుడు తను రచించిన చరక సంహితను ముగిస్తూ **''యదిహాస్తి తదన్యత్ర యన్నే హాస్తి న తత్ క్వచిత్''** ఈ శాస్త్రములో ప్రతిపాదించబడిన చికిత్సయే ప్రపంచములో కనబడును. ఇచట వ్రాయబడని విషయమేదియు ప్రపంచములో లేదని వ్రాసినాడు. మహా భారతములో ఉపసంహార శ్లోకము గూడా ఇదే విధముగా నున్నది సుశ్రుత సంహితను గురించి వ్రాయుచు ఆంగ్ల వైద్య పట్టమును పొందిన శ్రీ భాస్కర గోవింద ఘాణేకర్ **''కాయబాలగ్రహోర్ధ్వ చ జరాదంష్ట్రవిషే తథా, యదన్యత్ర తదిహాస్తి శల్యం చాస్య న తు క్వచిత్''** అని వ్రాసినాడు. అనగా ప్రపంచము ఈనాటి వరకు వికసించిన శరీర, బాల, గ్రహ, ఊర్ధ్వాంగ, జరా, దంష్ట్ర విషములకు సంబంధించిన విజ్ఞానము ఈ శాస్త్రములో నున్నది కాని ఈ శాస్త్రములో గల శల్యచికిత్సా విజ్ఞానము ప్రపంచములో ఎచ్చటను లేదని గట్టిగా నొక్కి చెప్పుచున్నారు సమస్త ఆయుర్వేదానికి మూలము వేదమే అని స్వయముగా ఆయుర్వేదమే పేర్కొనుచున్నది

ఆయుర్వేదము శరీర విజ్ఞానము, ఆత్మ విజ్ఞానము వాటికి సంబంధించిన రోగాలు, వాటి చికిత్సా విషయములో సముద్రమువంటి శాస్త్రము ఇటువంటి శాస్త్రము ప్రపంచములో నాకు వినబడలేదు, కనబడలేదు

వేదాలలో నుండి వెలికి తీయబడిన అనేక విద్యలలో నుండి ఒక విద్యయే ఇంత గొప్ప స్వరూపమును సంతరించుకొని యున్నదనిన దానిలో నున్న సమస్త విద్యల విస్తార మెంత కాగలదో మానవుడు ఊహించగలడా?

ఒకటేమిటి? శరీర విజ్ఞానము, మనో విజ్ఞానము, ఆత్మ విజ్ఞానము, పరమాత్మ విజ్ఞానము, భూగోళ విజ్ఞానము, ఖగోళ విజ్ఞానము, నక్షత్ర విజ్ఞానము, ఔషధ విజ్ఞానము, వనస్పతుల విజ్ఞానము, కృషి విజ్ఞానము, పశు విజ్ఞానము, పక్షి విజ్ఞానము, జల విజ్ఞానము, వాహన విజ్ఞానము, నౌకా విజ్ఞానము, విమాన విజ్ఞానము, గృహ విజ్ఞానము, వస్త్ర విజ్ఞానము, పదార్థ విజ్ఞానము, రసాయన విజ్ఞానము, గణిత విజ్ఞానము, అక్షర విజ్ఞానము, వ్యాకరణ విజ్ఞానము, నిర్వచన విజ్ఞానము, స్వర విజ్ఞానము, కావ్య విజ్ఞానము, అలంకార విజ్ఞానము, సంగీత విజ్ఞానము, అర్థ విజ్ఞానము, తర్క విజ్ఞానము, తత్వ విజ్ఞానము, రాజనీతి విజ్ఞానము, సమాజ విజ్ఞానము, నీతి విజ్ఞానము, ధర్మ విజ్ఞానము, యజ్ఞ విజ్ఞానము, మృద్విజ్ఞానము, పరలోక విజ్ఞానము, కర్మ విజ్ఞానము, కర్మఫల విజ్ఞానము, బంధ మోక్ష విజ్ఞానము మొదలగు విజ్ఞానములు అసంఖ్యాకములు

ఒక్కొక్క విభాగములో విభాగ ప్రతి విభాగములు కూడా ఉండును. ఇన్ని విషయాలతో కూడిన వేదమును మానవుడు ఎక్కడినుండి, ఎప్పుడు ఏవిధముగా సంపాదించగలడు? వ్రాయగలడు? ఈ విజ్ఞానములు కూడా నిదర్శనమాత్రములే వేదములలో ఎన్ని విషయములు ప్రతిపాదింపబడినవో ఇంత వరకూ ఎవరూ కూడా చెప్పజాలకపోయినారు మహర్షి మనువు వేదాల విషయములో **''భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి''**, **''సర్వ జ్ఞానమయో హి సః''** భూత భవిష్యద్వర్తమానాలలో మానవులకు కావలసిన సమస్త విషయములు వేదములలో ప్రతిపాదింపబడినవి. ఏలన! ఇవి సర్వజ్ఞానమయములు అని వ్రాసినారు.

వేదాల ప్రచారము ప్రపంచములో నున్నపుడు మానవులు పూర్ణలౌకిక, పార లౌకిక సుఖము ననుభవించినారు. దాని ప్రచారము తగ్గుతూ వచ్చిన కొలది మానవుని దుఃఖములు పెరుగుతూ వచ్చినవి. ఇప్పుడు వేద ప్రచారము

లుప్తప్రాయ మగుచున్నది అందువలన మానవులు వేదములను చదువుట మానివేయడమేగాక వాటి స్వరూపమునే మరచిపోసాగినారు

ఋషి దయానందుని కృపవలన ఒకసారి మళ్ళీ వేదములకు వసంతము సమీపించినది ఈనాడు వందలమంది వేదవిద్వాంసులు దేశవిదేశాలలో గోచరించుచున్నారు దేశములోనే గాక విదేశములో కూడా వేదములపై పరిశోధన జరుగుచున్నది యజ్ఞము, సంస్కృతభాష మున్నగు విషయములు బుద్ధిమంతులను కూడా విస్మితుల జేయుచున్నవి సంస్కృతభాష యొక్క వైజ్ఞానిక స్వరూపమును చూచి మేధావులు ఆశ్చర్యములో మునిగిపోవుచున్నారు. సంస్కృతభాషయే ఒక మహా విజ్ఞానము. దాని వైజ్ఞానిక స్వరూపమును, అనంతవిశాల అర్థమును అభివ్యక్తము చేయగల దాని సామర్థ్యమును చూచి విస్మితులగుచున్నారు. నిజముగా సమస్త ఉన్నతికి సాటి లేని ఉపాయము, సాధనము 'సంస్కృతభాష' అని ఒప్పుకొనక తప్పుట లేదు సకల విషయములను వ్యక్తము చేయగల శబ్ద రాశితో కూడుకొన్న ఏకైకభాష సంస్కృత భాషయే కేవలము సంస్కృతములోనే భాషాలక్షణములు గలవు 'సకల మానవుల సకల వ్యవహారములకు సరియగు భాష సంస్కృతమే' అనునది పరమ సత్యము

మానవుల భావాభివృద్ధికి సంస్కృతము సర్వ విధముల సమర్థవంతమైనటుల వారి సామూహిక సర్వాంగీణ వికాసానికి, జీవిత లక్ష్య పూర్తికి వేదము మూల స్తంభము వంటిదే యని వేరుగా చెప్పనవసరము లేదు దానివలన ప్రాణికోటికి హితము జరుగునని, మానవ జాతికి పరిపూర్ణ శాంతి లభించునని చెప్పవచ్చును సకల మానవులకు కల్యాణదాయకమగు వేదమును ఋషిదయానందుడు పునరుద్ధరించినాడు మధ్యకాలమున, వర్తమాన కాలమున వికృతము చేయబడిన దాని స్వరూపమును ఋషిదయానందుడు విమలము చేసినాడు ఆ తరువాత ఆయన గ్రహించిన సత్యమును పలువురు వేదవిద్వాంసులు ప్రపంచములో వ్యాపింపజేయుటకు యత్నించినారు యత్నించుచున్నారు

వేదములకు సంబంధించిన అనేక విశిష్ట గ్రంథములు సంస్కృతములో ఆర్య భాషలో గలవు వేదముల ఉత్పత్తి, వేద స్వరూపము, వేద ప్రామాణ్యము, వేదములలోని విద్యలు ఆధునిక యుగములో వేదముల ఉపయోగము మున్నగు విషయములకు సంబంధించిన గ్రంథములు వందల సంఖ్యలో నున్నవి కేవలము తెలుగు తప్ప సంస్కృత, ఆర్య భాషలు తెలియని వారికి అవి ఉపయోగపడవు తెలుగు తెలిసినవారికి కూడా అటువంటి గ్రంథముల నందించవలయును అదే క్రమములో కీ శే పండిత ధర్మదేవవిద్యామార్తాండగారు **''వేదోఁకా యథార్థ స్వరూప్ ''** అను గ్రంథ రాజమును రచించినారు అందులో వారు వేదములయెడ ప్రాచీన మహాపురుషుల అభిప్రాయములు, మధ్యకాలములోని విద్వాంసుల అభిప్రాయములు, దానితో పాటు ఆధునికకాలములోని మహావిద్వాంసుల అభిప్రాయములు తెలిపినారు వేదముల మహత్త్వము, వాటి నిర్మాత, వాటిలోని ఏకేశ్వర వాదము, యజ్ఞము యొక్క ప్రతిపాదన, దాని స్వరూపము, ఆర్యానార్యులు, దస్యులు, పునర్జన్మ మొదలగు విషయములు ప్రమాణములతో ప్రతిపాదించినారు వేదాల పట్ల గల అపోహలకు, మిథ్యా ఆక్షేపాలకు, భ్రాంతులకు సప్రమాణముగా సమాధానము వ్రాసినారు

వేదముల యథార్థ స్వరూపమును తెలిసికొనగోరు వారికి ఇదియొక ఆకర్షక గ్రంథము ఈ విశాల కాయగ్రంథమును శ్రీ పం లోకా మల్లారి గారు చాలా ధైర్యముతో తెలుగులోనికి మార్చినారు నేను వారికి ఈ గ్రంథము యొక్క మహత్త్వమును సూచించి తెలుగులో ఇట్టి గ్రంథములు అవసరమని సూచించితిని వారు ఈ మహా గ్రంథమును తెలుగులోనికి మార్చడము ఒక తపస్సు నేను వారి ఈ కృతికి సాధువాదము తెలుపుచున్నాను భగవంతుడు వారికి దీర్ఘాయుష్యము, ఆరోగ్యము, ఉత్సాహము, ధైర్యము, జ్ఞానము, ఆనందమును ప్రసాదించుగాక! వారు వేదసిద్ధాంత వ్యాప్తి కొరకు తమ శక్తిని వినియోగించి పుణ్యమును సంపాదింతురు గాక! వేద ప్రియులు, వేద భక్తులు ప్రేరితులగుదురు గాక



# వేదమే సంపూర్ణ సమాధానం

**కవిశాసన రఘువన్న**

**తెలుగు విభాగాధ్యక్షులు**

**ఉస్మానియాయూనివర్సిటి, హైదరాబాద్ - 7**

| ఆధునిక సమస్యలు | వైదిక సమాధానాలు (పరిష్కారాలు) |
|---|---|
| **అవిద్య** | **విద్య** |
| 1. అజ్ఞానమయ జీవనం - నాస్తికం | 1. జ్ఞానమయ జీవనం ఆస్తికం |
| 2. అనబడే మతం, వర్గం, వాదం, కులం, స్థలం వంటి వానికి వర్తించినాడు మానవుడు | 2. వీనికి అతీతంగా ధర్మమూలమైన విశ్వమానవుడుగా నిర్మాణమైనాడు వర్ణాశ్రమ జీవనం - సామాజిక న్యాయం. |
| 3. ప్రదూషణ మానవుడు అనార్యమయం | 3. ప్రాజ్ఞ మానవుడు - ఆర్యమయం |
| 4. పాశ్చాత్య ప్రభావితులు, బానిస మేధావులు | 4. పవిత్ర ప్రకాశితులు, స్వాధీన ఋషులు |
| 5. దుశ్శాసనం - దుష్టరక్షణం. అన్యాయ ధూర్తనం | 5. ఆదర్శ శాసనం - శిష్ట రక్షణం-న్యాయవర్తనం |
| 6. ధనస్వామ్యం-జనస్వామ్యం. సామ్యవాదం - దౌర్భాగ్యం. | 6. ధర్మస్వామ్యం, సౌభాగ్యం (ధర్మం-న్యాయం) |
| 7. ధనగౌరవం - అజ్ఞానగౌరవం | 7. జ్ఞానగౌరవం |
| 8. కర్మఫలరోగం - కర్మఫలభంగం | 8. కర్మఫలభోగం - త్యాగం |
| 9. కుటుంబ విచ్ఛిత్తి, అసమాజికం కుసంస్కారజాలం | 9. వసుధైవ కుటుంబకం - షోడశ సంస్కార శీలం పంచయజ్ఞమయం |
| 10. వ్యభిచార శిక్షణం | 10. బ్రహ్మచర్యదీక్ష |
| 11. గురువులేని దుస్థితి, దురహంకార మాధ్యమం. అజ్ఞాన బోధలు. | 11. జగద్గురుత్వ నీతి - నిరహంకార నిర్వికారం. జ్ఞానబోధలు |
| 12. మానవులు అనేక జాతులు | 12. మానవులు ఒకేజాతి |
| 13. వర్ణాలనేకం | 13. రెండే వర్ణాలు- ఆర్యులు-అనార్యులు (జ్ఞానులు - అజ్ఞానులు) |
| 14. రోగం | 14. యోగం |
| 15. కాలహరణం | 15. కాలయుక్తం |
| 16. క్రీస్తు శకం కాలజ్ఞానానికి చెల్లదు. | 16. సృష్ట్యబ్ది-యుగగణనం |
| 17. లక్ష్యరహిత జీవనం | 17. చతుర్విధ పురుషార్థ సిద్ధి లక్ష్యం |
| 18. భ్రాంతి - అశాంతి | 18. క్రాంతి - శాంతి |
| 19. ప్రకృతిని దుష్కృతిగా స్వీకరించుట | 19. ప్రకృతి - జీవాత్మ - పరమాత్మలను సత్కృతిగా అనుష్ఠించుట |

| | |
|---|---|
| 20. వైజ్ఞానిక ఫలితం నాశనం | 20. వైజ్ఞానిక ఫలితం శ్రేయస్సు |
| 21. అనేక మాతృభూములు - ద్వేషాలు | 21. ఒకే మాతృభూమి - పృథివీ మండలం - అనురాగాలు |
| 22. అనేక దేవతారాధనలు, ఆకారాలు - అవతారాలు. | 22. ఏకైకదేవతోపాసనం - నిరాకారం అవతరించడు. దివ్యశక్తి. |
| 23. స్త్రీ పురుష ద్వేషం | 23. స్త్రీపురుష పరస్పరానురాగం |
| 24. అహిత సాహిత్యం పేర మహాభారతం నుంచి ఆధునికం వరకు అనార్షం | 24. వేదాలననుసరించి రామాయణం వరకు ఆర్షం. |
| 25. అనేక భాషలు. అజ్ఞాన యాసలు. | 25. ఒకే దేవభాష - పూర్ణభాష |
| 26. కలుషితం | 26. స్వచ్ఛత |
| 27. హింస | 27 అహింస |
| 28. ఆదిమానవులు అజ్ఞానులు - మాంసాహారులు. | 28. జ్ఞానులు, అజ్ఞానులు శాకాహారులు |
| 29. విద్య అందరికి, అది విద్యకాదు. అబ్బింది లేదు. దుష్టానుసరణం | 29. విద్య అందరికి, శ్రేష్ఠానుసరణం |
| 30. శీలభ్రష్టత - అనైక్యత. నోటి వాదనం | 30. శీలనిర్మాణం. చరిత్ర నిర్మాణం, ఐక్యత. ఆచరణం - వివేచనం. |
| 31. సృష్టి శూన్యం నుంచి అదంతకదే అయ్యింది. | 31. అన్యప్రమేయం వల్ల, నిమిత్త సూక్ష్మ మూల కారణం (పరమాత్మ) వల్ల అయ్యింది. (కార్య కారణ సంబంధం) చక్ర గమన శీలం. అనాది- అనంతం |
| 32. జ్ఞానం పుస్తకగతం, విస్మృతం-మృతం. | 32. జ్ఞానం మస్తిష్కగతం, పదార్థస్థితం, ఆత్మా విష్కరణం-శ్రుతం-స్మృతం-అమృతం. |
| 33. పాతరాతి కొత్తరాతి యుగాల భ్రమ, సృష్టి 4004 సం॥ కిందట అంటూ అంటూ 200 కోట్లు అంటున్నారు | 33. సృష్ట్యాది కృత, త్రేత, ద్వాపర, కలి యుగాల క్రమం. సృష్టి జరిగి 197 కోట్ల సం॥లు. |
| 34. ఒక జీవయోని నుంచి మరో జీవయోని పరిణామం (కోతి నుంచి మానవుడు) అపూర్ణం నుంచి పూర్ణం అనే వాదన. | 34. ఒక జీవయోని నుంచి మరో జీవయోని పరిణమించదు. కోతి కోతే, మనిషి మనిషే, పూర్ణం నుంచి పూర్ణమే అవుతుంది. అపూర్ణం నుంచి పూర్ణం కాదు. సూక్ష్మంలో పూర్ణమే. స్థూలంలో అదే ! పరమాణువులో ఏగుణాలుంటాయో స్థూల పదార్థంలో అవే వుంటాయి. కర్మ ఫలానుసారం పరమాత్మ చేత ఒక యోని మరో జీవ యోనిగా జన్మ పొందుతుంది. |

| | |
|---|---|
| 35. ఆధునిక జ్ఞానం సమాధానరహిత సమస్య | 35. వేద జ్ఞానం సంపూర్ణ సమాధానం. ఆత్మ పరమాత్మ వివేకము |
| 36. మానవతావాదం పేర మానవుడు తన్ను తాను తెలుసుకోలేడు. | 36. మనుర్భవ జనయా దైవ్యం జనమ్ (ఋ.10-53-6) 'దివ్యగుణ సంపన్నమే ' జ్ఞానవర్తనమే, 'ఆత్మవత్ సర్వభూతాని' యే మానవత్వం, మానవతావేదం |
| 37. బజారు భ్రష్ట వాతావరణంలోని విద్యాలయాల వల్ల బుద్ధినష్టం. అవిద్యాంధకారం | 37. ''ఉపహ్వరే గిరీణాం సంగమే చ నదీనాం ధియా విప్రో అజాయత'' (యజు. 26-15) గిరిసమీపం - నదీసమీపం బుద్ధి విద్యావర్ధనం. |

## వేదమే ఎందుకు ప్రమాణం?

''దేవస్య పశ్య కావ్యం న మమార న జీర్యతి'' (అధర్వ 10-8-32)

అనాది కాలానికి చెందిన శాస్త్రమైనందుకు.
మానవ జాతి ప్రప్రథమ శాస్త్రమైనందుకు.
అపూర్వ అనంత జ్ఞాన నిధి అయినందుకు.
సంపూర్ణ జ్ఞానానికి బీజరూపమైనందుకు.
అనంత తాత్విక భూమిక అయినందుకు.
సత్య విద్యా మూలమైనందుకు.
కార్యకారణ బద్ధమైనందుకు.
నిర్ భ్రాంతమైనందకు.
అజ్ఞానానికి ఏమాత్రం తావు లేనందుకు.
సార్వకాలిక సార్వదేశిక సార్వజనీనమైనందుకు.
ప్రకృతి, జీవాత్మ, పరమాత్మ, స్వరూప స్వభావాలు వైజ్ఞానికమైనందుకు,
అంటే, ఈ సమస్త సృష్టి, సృష్టి విజ్ఞానం, సృష్టి కారణవిజ్ఞానం ఉన్నందుకు.
మానవ భాషగా, మహోన్నత పరిపూర్ణ జ్ఞానభాషగా, సమస్త భాషలకు
మూలభాషగా ఉన్నందుకు,
నేటి భాషలెల్ల అది లేనిది జీవింపజాలనందుకు.

కర్మ, కర్మఫలం, ఫలాధీనత, దివ్యతత్త్వం (దేవుడు) ప్రతిపాదించినందుకు మానవులకు కర్తవ్యాకర్తవ్యాలు ఉపదేశించినందుకు.

దుఃఖరాహిత్యం, జన్మరాహిత్యం, బంధరాహిత్యం ప్రతిపాదించినందుకు

జ్ఞానమే దేవుడని, అనంత దివ్యప్రకాశమే దేవుడని, అనంత శక్తియే దేవుడని, అనంత కారణమే దేవుడని, ప్రకృతి జీవాత్మలకు మించిన అతీతతత్త్వమే దేవుడనీ, ఆకార రహితుడు దేవుడనీ, అదే బ్రహ్మమని, అదే శివమనీ, అదే విష్ణువమనీ, అదే ఏకైకమనీ, ఆనందమనీ సిద్ధాంతీకరించినందుకు.

అనాదిగా ఋషులు, మునులు, మహాపురుషులు దానినే ప్రమాణంగా యథార్థంగా ఆచరిస్తూ వస్తున్నందుకు,
పాశ్చాత్య మేధావులెందరో ప్రశంసించినందుకు.
కవి, కావ్యం, రసం, ఆత్మ, కావ్య ప్రయోజనం, లక్ష్యం, అలంకారం, ఛందం మున్నగునవి సాహిత్యతత్త్వమయినందుకు.
నేటి భాషా సాహిత్యాలెల్ల ఏది వర్ణించినా దాని ఉచితానుచితాలకు ప్రామాణిక పరీక్ష అయినందుకు.
గత 2 వేల ఏండ్ల ప్రపంచ సాహిత్యాల్లో పాక్షిక శ్రేయస్సులకు పరిపూర్ణ శ్రేయస్సును ప్రతిపాదిస్తున్నందుకు,
ధర్మం, న్యాయం, దయ స్థాపిస్తున్నందుకు.
రామాయణ భారతేతిహాసాదులు, తదనంతర పురాణకావ్యాదులు వేదం పేర ప్రస్తావిస్తున్నందుకు.
ఇప్పటి మతాలు, వర్గాలు, కులాలు, స్థలాలు, అజ్ఞాన బలాలెల్ల వేదానికి విరుద్ధమైనందుకు,
పాశ్చాత్యానుకరణం నుంచి ఉద్ధరించుటకు, పరాగ్రీనం కాకుండుటకు. అందుకు వేదమే ప్రమాణం. సంపూర్ణ సమాధానం

ఆకాశం లేకుంటే పదార్థాల ఉనికికి ప్రశ్నార్థకం. అట్లే వేదం లేకుంటే జ్ఞానానికి ఆశ్చర్యార్థకం ! అది దేవకావ్యం. అపౌరుషేయం. పరమాత్మదత్తం. ఋషి హృదయ ప్రకాశితం

అధర్మానికి, అన్యాయానికి, మూఢవిశ్వాసాలకు, మూఢాచారాలకు ఏమాత్రం తావు లేనందుకు వేదమే పరమప్రమాణం.

అనాదిగా వేలాది వైదిక పరివారాలు స్వరయుక్తంగా మంత్ర సంహితలను అష్టవిధపాఠంగా, పరంపరగా శ్రుతి హితంగా పరిరక్షించుకొంటూ వస్తున్నందుకు. ఇంతటి సువ్యవస్థ ప్రపంచమం దేశాస్త్రానికి లేనందుకు, మనుస్మృతికి పరమ ప్రమాణమైనందుకు.

''వేదోఽఖిలో ధర్మ మూలమ్'' (మను 1-125)
''సర్వజ్ఞానమయో హి సః'' (మను 1-126)
''వేదమేవాభ్యసేన్నిత్యం'' (మను. 4-147)
''వేదశ్చక్షుః సనాతనమ్ '' (మను. 12-94)

వేదం ఆధారంగా స్మృతులు, ఉపవేదాలు, సాంగోపాంగాలు, బ్రాహ్మణాలు ఆరణ్యకాలు, ఉపనిషత్తులు మున్నగు ఆర్ష వాఙ్మయమంతా విలసిల్లుతున్నందుకు - వేదమే ప్రమాణం. అదే శబ్ద ప్రమాణం. ఆప్త ప్రమాణం. అప్పుడే పరమాత్మ. జీవాత్మకు లక్ష్యం.

## వేదానికి మించిన మరో ప్రమాణం లేనందుకు వేదమే ప్రమాణం.

**- రఘుమన్న**

సృష్ట్యాదిలో మహా మహిమాన్వితులైన మహర్షుల ద్వారా భగవంతుడు ప్రకటించిన నిత్యసత్యాలే వేదాలు. దివ్యజ్ఞాన సంపన్నులు, దయాళువులైన మహర్షులు మనకందించిన వాఙ్మయమే వేదవాఙ్మయం. వేదమనే పునాదిపైనే కాలం గడిచే కొలది ఎన్నో మత మతాంతరాలు వెలసినాయి. కనుకనే సమస్త సాహిత్యానికీ, ధర్మానికీ, సంస్కృతికీ వేదమే మూలాధారమని ప్రపంచంలోని సమస్త భాషా, మత, తత్త్వవేత్తల అభిప్రాయం. **- చతుర్వేద భూమిక నుండి**

## ''వేదభాష్యానువాద భాస్కర'' బిరుదాంకితులు

# శ్రీ పండిత లోకమలహరి సిద్ధాన్తాచార్య గారి పరిచయం

**డా .. మసన చెన్నప్ప** ఎం.ఏ.,ఎం.ఫిల్.,పిహెచ్.డి.

ఉ.వి. విద్యాలయం భాగ్యనగరం,

లోకమలహరిగారు ఆంధ్రప్రదేశ్‌లోని ఇందూరు (నిజామాబాద్) జిల్లా, దోమకొండ మండలంలోని బీబీపేట గ్రామంలో **1911**లో ఒక నిరుపేద చేనేతకుటుంబంలో జన్మించి పండితలోకానికే ఆదర్శప్రాయులైనారు. వీరి తల్లిదండ్రులు లోకా లక్ష్మయ్య వేంకమాంబలు, సోదరులు బాలకిష్టయ్య, విఠల్, పురుషోత్తం, శంకర్ మరియు మున్సీగార్లు సోదరీమణి లక్ష్మీదేవి గారు.

లోకమలహరిగారు బడిలో చదివింది మూడో తరగతే ఐనా, గుడిలో విన్నది పురాణాలే ఐనా, అమ్మఒడిలో కూర్చొని నేర్చుకొన్నదీ, మహర్షి దయానందుని ''సత్యార్థప్రకాశం'' ద్వారా కూర్చుకొన్నదీ తన జీవితానికి రాచబాటయై అంతేవాసులకు అనుసరణీయమైంది. బాల్యంలో కృషీవలురై శ్రమశక్తి విలువను గుర్తించినారు. పాడడం తెలియకున్నా పాటలల్లినారు, ఛందస్సు తెలియకున్నా పద్యాలు చెప్పినారు, లక్షణం తెలియకున్నా కవిత్వం రచించినారు, సహజమైన సాహిత్యంతో సహృదయుల మెప్పు పొందినారు.

బాల్యంలో హరికథలకూ, యక్షగానాలకూ, వీధిభాగవతాలకూ మనస్సు పరవశించినప్పటికీ, వివిక్త జ్ఞానంతో బుద్ధిని వేదవిద్య వైపు మళ్ళించినారు. పదిరూపాయల జీతాన్నే పదివేలుగా లెక్కించి, వీధిబడినే విశ్వ విద్యాలయంగా భావించి విద్యార్థులను తీర్చి దిద్దుతూనే అప్పటి పరిస్థితులను బట్టి ''మున్షీ'' పరీక్షలో ఉత్తీర్ణులై, అరబ్బీ, పర్షియన్‌భాషలు నేర్చినారు. తన సమయాన్ని ఒక వైపు విద్యాలయానికీ, మరోవైపు వైద్యాలయానికీ అంకితం చేస్తూ పల్లెపట్టులలో బాలబాలికలకు శారీరక మానసిక వికాసాన్ని కూర్చినారు.

''సత్యార్థ ప్రకాశమే'' లోకమలహరి గారి జీవితంలో గొప్ప ప్రకాశాన్ని నింపింది. ఆ ప్రకాశంలో వారు ఎంతో ఎత్తుకు ఎదిగినారు. స్వాధ్యాయశీలురై ఆర్ష వాఙ్మయాన్ని దయానందుని మార్గంలో ఆవిష్కరించినారు. నూటికి పైగా గ్రంథాలను రచించినారు, వైదిక వాఙ్మయాన్ని సామాన్యుని ముంగిట నిలిపిన కీర్తి లోకామలహరి గారిది. వారు చేసిన వేదభాష్యానువాదాలు సామాన్యులకు సైతం అర్థమవుతాయి. యజుస్సామాథర్వణ వేదభాష్యాలకు సరళ సుందరమైన అనువాదం చేసి ఇప్పుడు ఋగ్వేద భాష్యానికి తెనుగు సేతను అందిస్తున్నారు. సుమారు 20వేల పుటల్లో నాల్గు వేదాలకు సమగ్రమైన తెలుగు వ్యాఖ్యానం లోకామలహరి పండితుల ద్వారా తెలుగులోకానికి అందడం గొప్ప అదృష్టమనే చెప్పాలి. మరో విశేషమేమంటే వీరు కామారెడ్డి గురుకుల ఆచార్యులు శ్రీ వేదవ్రత మీమాంసకుల ప్రేరణతో ఇటీవల తెనిగించిన ''వేదముల యథార్థస్వరూపము'' వేద సిద్ధాంతంపట్ల అనురక్తిని కల్గిస్తున్నది. అనేకమైన అనుమానాలను తీర్చి వేదధర్మ ప్రతిష్ఠాపన గావిస్తున్నది. ఇంతటి మహత్తరమైన గ్రంథం తెలుగులో ఇంతకు పూర్వం లేదంటే అతిశయోక్తికాదు.

తొంబై ఏళ్ల వయస్సులోనూ లోకమలహరి గారి శరీరంలో జవసత్వాలు తగ్గలేదు. మాటల్లో పొరపాటు లేదు. చిత్తంలో మాలిన్యంలేదు. ఎప్పుడు చూసినా వారి కళ్లు అమృతాన్ని వర్షిస్తుంటాయి. ఆరడుగుల ఎత్తుగల లోకామలహరిగారు అనువాదంలో నూరడుగుల ఎత్తుకు ఎదిగిన శతాధిక గ్రంథకర్తలు. వీరి వేదభాష్యానువాదాలను తెలుగువారికి అందిస్తున్న వైదిక పండితుడు, యువకవి, తెలుగులో నాలుగు వేదాలను లిప్యంతరీకరణం చేసిన శ్రీ మట్టి కృష్ణారెడ్డిగారు అదృష్టవంతులు

పండిత లోకమలహరి గారి సాహిత్యం ముముక్షువులకు అవశ్య పఠనీయం. వారు తమ అనువాదంలో స్పృశించని లోకవృత్తం లేదు. వారి తెలుగు సేతచే హిందీ భాష తెలుగువారికి సన్నిహితమైంది. వైదిక సాహిత్యాన్ని అపూర్వమైన రీతిలో తెనిగించిన లోకామలహరి గారు చతుర్వేద భాష్యానువాద కర్తగా ధర్మ ప్రియుల హృదయాలలో ఎల్లకాలం నిలిచి ఉంటారు. మిత్రులు శ్రీ మట్టి కృష్ణారెడ్డి గారి సంపాదకత్వంలో నుడు పరిష్కరింపబడి వెలువడుతున్న ''వేదముల యథార్థ స్వరూపం'' లోక ప్రియం కావాలని ఆశిస్తున్నాను.

**మసన చెన్నప్ప**

# సంకేతనిర్ణయము

| | |
|---|---|
| అ | అథర్వవేదము |
| అష్టా. | అష్టాధ్యాయి |
| ఉ. - ఉప. | ఉపనిషత్తు |
| ఉ.. | ఉత్తరార్చిక(సామవేద) |
| ఋ. ఋగ్. | ఋగ్వేదము |
| ఐ. బ్రా | ఐతరేయబ్రాహ్మణము. |
| కా. సం. | కాండము, సంహిత |
| గృ. సూ. | గృహ్యసూత్రము |
| గో. ఉ. | గోపథబ్రాహ్మణ ఉత్తరార్ధము |
| ఛా. | ఛాన్దగ్యోపనిషత్తు |
| తై. బ్రా. | తైత్తిరీయబ్రాహ్మణము. |
| పూ. | పూర్వార్చిక(సామవేద) |
| బృ. ఉ. బృహ. | బృబదారణ్యకఉపనిషత్తు |
| బృ. పా. | బృహత్పారాశరస్మృతి |
| మ. భా. | మహాభారతము. |
| ము. | ముణ్డకోపనిషత్తు. |
| మీ. | మీమాంసాదర్శనము |
| య. యజు. | యజుర్వేదము |
| రాజని. | రాజనిఘంటువు. |
| సము. | సముల్లాసము. |
| శత. బ్రా | శతపథబ్రాహ్మణము. |
| *V.A.* | వెదిక్ ఏజ్. |

# వేదముల యథార్థ స్వరూపము

## విషయసూచిక

ఓ౩మ్

# వేదముల యథార్థ స్వరూపము

## ప్రథమాధ్యాయము - ప్రథమ ఖణ్డము

### వేద విషయములను గూర్చి ప్రాచీన, మధ్య కాలీన, అర్వాచీన, మతముల పక్షపాత రహిత వివేచనము

### 1.1 వేదములను గూర్చి ప్రాచీనుల అభిప్రాయము

వేదములు ఈశ్వరీయ జ్ఞానమని ఆర్యుల పరంపరానుగత విశ్వాసమై యున్నది. పరమ కరుణామయుడు, సర్వజ్ఞుడునగు పరమేశ్వరుడు సృష్ట్యాదియందీ పవిత్ర జ్ఞానమును మానవమాత్రుల కల్యాణార్థము అగ్ని, వాయువు, ఆదిత్య, అంగిరసులను ఋషుల పవిత్రాంతఃకరణములందు ప్రకాశపరచినాడు. దానిద్వారా మానవులెల్లరకును వైయక్తిక, పారివారిక, సామాజిక, రాష్ట్రీయ, మరియు విశ్వ విషయములను గూర్చి సమస్త కర్తవ్యముల జ్ఞానప్రాప్తి గలిగి సుఖశాంతులతో ఆనంద ప్రాప్తి నొందవలెనని ఈ జ్ఞానము నుపదేశించినాడు. సమస్త ప్రాచీనసాహిత్యము నందీ విశ్వాసము స్పష్టముగా గాన్పించుచున్నది. సకల స్మృతికారులు, దర్శన శాస్త్రకారులు, ఉపనిషత్కారులు, మరియు రామాయణ మహాభారతముల, శ్రౌత సూత్రముల, గృహ్యసూత్రముల రచయితలు, పురాణ కర్తలు సైతము వేదము ఈశ్వరీయజ్ఞానమని, అవి స్వతః ప్రమాణములని ఇతర సమస్త గ్రంధములు పరతఃప్రమాణములని స్పష్టముగా దెలిపియున్నారు. ప్రథమ ధర్మశాస్త్రకారుడగు మనుమహారాజు మనుస్మృతియందు

#### 1.1 మనుస్మృతి వచనములు

**'వేదోఽఖిలో ధర్మమూలమ్'** ॥ మనుస్మృతి ౨-౬ ॥

అనగా ఋగ్యజుస్సామాథర్వ వేదములే ధర్మమునకు మూలము. అవియే ధార్మిక విషయములందు స్వతఃప్రమాణములని తెలిపినాడు.

**'ధర్మం జిజ్ఞాస మానానాం ప్రమాణం పరమం శ్రుతిః'** ॥ మను ౨ ౧౩ ॥

అనగా ధర్మజ్ఞానము నభిలషించువారికి వేదములే పరమ ప్రమాణములు. ఈ శ్లోకమునకు కుల్లూకభట్ట కృత టీకయందు, జాబాలస్మృతి, భవిష్యపురాణము, జైమినీ మునికృత మీమాంసా శాస్త్రము మున్నగు అనేక ఇతర శాస్త్రములందును మనుస్మృతి యొక్క ఈ యుక్తిని సమర్థించుటకు ఉదాహరించిన యనేక ప్రమాణములను ప్రసంగవశముననిట స్పష్టపరచుట అనుచితముకాజాలదు.

**ధర్మం చ జ్ఞాతుమిచ్ఛతాం ప్రకృష్టం ప్రమాణం శ్రుతిః ।**

**ప్రకర్షబోధనేన చ శ్రుతిస్మృతివిరోధే స్మృత్యర్థో నాదరణీయ ఇతి భావః ॥**

**అతఏవ జాబాలః - శ్రుతిస్మృతివిరోధే తు శ్రుతిరేవ గరీయసీ॥**

భవిష్య పురాణేఽప్యుక్తమ్ - శ్రుత్యా సహ విరోధే తు బాధ్యతే విషయం వినా॥

జైమినిరప్యాహ - విరోధే త్వనపేక్షం స్యాదసతిహ్యనుమానమ్ ॥

మీమాంసా శాస్త్రే ౧-౩-౩- శ్రుతివిరోధే స్మృతివాక్యమనపేక్ష్యమ్ అప్రమాణమ్

అనాదరణీయమ్ ।అసతి విరోధే మూలవేదానుమానమిత్యర్థః ॥

(మనుస్మృతి కుల్లూకటీకా సహిత నిర్ణయ సాగర ప్రెస్, బొంబాయి ముద్రితము, పుట ౩౨)

ధర్మమును గూర్చి తెలిసికొన నభిలషించు వారికి అన్నిటికన్న స్పష్టము మరియు ముఖ్య ప్రమాణము వేదమే దాని విస్పష్ట అర్థ మేమన 'ఎచ్చటనైన శ్రుతి (వేదము) మరియు స్మృతి యందు విభేదము గాన్పించినచో శ్రుతినే ప్రమాణముగ నెంచవలెను కాని, స్మృతిని గాదని మనుస్మృతి శ్లోకమునందు విశదపరచబడినది

వేదముల మహత్త్వమును గూర్చి మనుమహారాజెంతవరకు తెలిపినాడో చూడుడు.

పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనమ్ ।

అశక్యం చాప్రమేయం చ వేద శాస్త్రమితి స్థితిః ॥ మను. ౧౨-౯౪॥

చాతుర్వర్ణ్యం త్రయో లోకాః చత్వారశ్చాశ్రమాః పృథక్ ।

భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి ॥ మ. ౧౨-౯౭॥

బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్ ।

తస్మా దేతత్పరం మన్యే యజ్జన్తోరస్య సాధనమ్ ॥ మను. ౧౨-౯౯॥

సారాంశమేమన, వేదములు పితృదేవతలతో సహా మనుష్యు లెల్లరకును సనాతన మార్గదర్శక నేత్రములవలె నున్నవి వాని మహిమను సంపూర్ణముగా ప్రతిపాదించుట గాని, వానిని సంపూర్ణముగా దెలిసికొనుట గాని చాలా కఠినము. చాతుర్వర్ణ్యములు, ముల్లోకములు, చతురాశ్రమములు, భూత భవిష్యద్వర్తమాన విషయక జ్ఞాన మెల్లయును వేదముల యందే ప్రసిద్ధమై యున్నది. సనాతన (నిత్య) వేద శాస్త్రములు సకల ప్రాణులను ధారణ మొనర్చుచు సకల మానవులకు భవసాగరమును దాటుటకు సాధనమై యున్నవి

### 1.2 యాజ్ఞవల్క్య స్మృతి యుపదేశము

న వేద శాస్త్రాదన్యత్తు కించిచ్ఛాస్త్రం హి విద్యతే ।

నిస్సృతం సర్వశాస్త్రం తు వేదశాస్త్రాత్సనాతనాత్ ॥

వేద శాస్త్రమును మించిన శాస్త్రమేదియును లేదు. ఇతర శాస్త్రములన్నియును సనాతనము మరియు నిత్యములైన వేదశాస్త్రముల నుండియే వచ్చినవి.

**1.3 అత్రి స్మృతి యుపదేశము**

**నాస్తి వేదాత్పరం శాస్త్రం నాస్తి మాతుః సమో గురుః ॥**

అనగా, వేదమును మించిన శాస్త్ర మేదియును లేదు. తల్లిని మించిన గురువును లేడు. బ్రాహ్మణము లందును, ఉపనిషత్తులందును వేదములను ఈశ్వరీయ జ్ఞానమని విశ్వసించుట యను నంశము స్పష్టముగా ప్రతిపాదించబడినది.

**1.4 ముణ్డకోపనిషద్వచనము**

**అగ్నిర్మూర్ధాచక్షుషీ చన్ద్ర సూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః** ॥ ముం.2-1-4॥

**తస్మాదృచః సామయజూంషి దీక్షాః** ॥ ముం 2-1-6 ॥

ఆ పరమేశ్వరుని మస్తకము అగ్ని, సూర్య చంద్రు లాయన నేత్రములు, దిశలాయన కర్ణములతుల్యములు, వేదము లాయన వాణులు, అనగా ఈశ్వరీయ జ్ఞానముగా నెంచుడు.

శతపథ బ్రాహ్మణాంతర్గత బృహదారణ్యకోపనిషత్తునం దిట్లు స్పష్టపరుచ బడినది.

**ఏతస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతద్ యదృగ్వేదో యజుర్వేదః**
**సామవేదో౽థర్వ వేదః** ॥ బృ. 4-5-11 ॥

ఋగ్యజుస్సామాథర్వ వేదము లా పరమేశ్వరుని శ్వాసనుండి వెడలిన వని యెంచుడు.

**1.4 శతపథ బ్రాహ్మణమునందలి ఇతర వచనములు**

శతపథ బ్రాహ్మణమునందే మరొక చోట వేదములను ఛందముల పేరుతో సంబోధించుచు ఆ శబ్దముయొక్క వ్యుత్పత్తి నిచ్చియున్నారు. దాని వల్ల బ్రాహ్మణకారుని మనస్సునందు వేదములయెడ అత్యంత ఆదరభావము సూచిత మగుచున్నది. దీనిని నిమ్న శబ్దములందు గాంచగలము

**యదేభిరాత్మానమాచ్ఛాదయన్ దేవా మృత్యోర్బిభ్యతః తచ్ఛన్దసాం ఛన్దస్త్వమ్ ॥**

అనగా దేవతలు సత్య నిష్ఠ విద్వాంసులు – **(సత్య సంహితా వై దేవాః సత్యమయా ఉ దేవాః విద్వాంసో వై దేవాః ఇత్యాది ప్రామాణ్యాత్)** మృత్యువుచే భయభీతులై వేదములను ఆచ్ఛాదిత మొనర్చుకొనిరి. కావుననే వేదములను **'ఛన్దము'** లందురు. తాత్పర్యమేమన; వేద విజ్ఞానమే మృత్యు భయము నుండి సర్వదా విముక్తి నొసగును

ఇదే విధముగా ఛన్దము యొక్క వ్యుత్పత్తి తాణ్డ్యమహాబ్రాహ్మణాంతర్గత ఛాన్దోగ్యోపనిషత్తు నందు ఈ విధముగా నున్నది

**దేవా వై మృత్యోర్బిభ్యతస్త్రయీం విద్యాం ప్రావిశన్ తే ఛన్దోభిరచ్ఛాదయన్,**

**యదేభిరచ్ఛాదయన్ తచ్ఛన్దసాం ఛన్దస్త్వమ్** ॥ ఛా 1-4-2 ॥

అనగా దేవతలు (సత్య నిష్ఠగల విద్వాంసులు) మృత్యువుచే భయభీతులై త్రయీ విద్యా (జ్ఞానకర్మోపాసన యను త్రివిద్యలను ప్రతిపాదించు వేదములను) ఆశ్రయించినారు. తమ్మితాము వేదమంత్రములతో ఆచ్ఛాదిత మొనర్చుకొనినారు (కప్పుకొనినారు). ఏమన, ఈ వేద మంత్రములతో వారు తమ్మాచ్ఛాదిత మొనర్చుకొని నందుననే ఇవి **'ఛందము'**లను పేరుతో పిలువబడుచున్నవి. బ్రాహ్మణముల, ఉపనిషత్తుల రచయితలకు వేదముల యెడ అత్యధిక శ్రద్ధ గల దనుటయందేమాత్రము సందేహము లేదు. ఐతరేయ బ్రాహ్మణమందును వేదములను ఈశ్వరీయ జ్ఞానమని నమ్మిచు స్పష్టపరచినారు.

**'ప్రజాపతిర్వా ఇమాన్‌వేదానసృజత'**

అనగా ''సమస్త ప్రాణుల స్వామియగు పరమేశ్వరుడు ప్రజల కల్యాణార్థము వేదముల నిర్మాణమొనర్చినాడు.'' ఈ వచనములపై ఎలాంటి టీకా టిప్పణమొనర్చు అవసరము లేదు. ఈ ప్రసంగమునందే తైత్తిరీయ బ్రాహ్మణము యొక్క ఈ దిగువ ఆఖ్యాయిక గూడ ఉల్లేఖించదగియున్నది. దీని యందు వేదములను సమస్త జ్ఞానములకు నిధి యనియు విద్యాదృష్టితో నవి 'అనంతము' లనియు చెప్పబడినవి ఈ యాఖ్యాయిక ఈ విధముగా నున్నది.

**భరద్వాజో హ త్రిభిరాయుర్భి'ర్బ్రహ్మచర్యమువాస । తం హ జీర్ణం స్థవిరం శయానమ్ ఇన్ద్ర ఉపవ్రజ్యోవాచ భరద్వాజ! యత్తే చతుర్థమాయుర్దద్యాం కిమనేన కుర్యా దితి । బ్రహ్మచర్యమేవైతేన చరేయమితి హోవాచ తం తంత్రీన్ గిరిరూపానవిజ్ఞాతానివ దర్శయాంచకార తేషాం హైకైకస్మాన్ముష్టిమాదదే। స హోవాచ భరద్వాజేత్యామన్త్ర్య వేదావా ఏతేऽనన్తా వై వేదాః ఏతైస్త్రిభిరాయుర్భిరన్వవోచథాః అథ త ఇతరదనూక్తమేవ ॥ తై. బ్రా3-౧౦-౧౧-3॥**

అనగా, భరద్వాజుడు 300 వత్సరముల పర్యంతము (మనుష్యుని 3 ఆయువు - 'శతాయుర్వైపురుషః' ననుసరించి ౧౦౦ × 3 = 300) బ్రహ్మచర్యము అనగా వేదాధ్యయన మొనర్చినారు. ఈ విధముగా వారత్యంత వృద్ధావస్థకు చేరునంత వరకు అధ్యయన మొనర్చుచునే యుండిరి. అప్పుడు ఇంద్రుడు వారి వద్దకు వచ్చి 'మీకింకను ఆయువు లభ్యమైనచో దానితో మీ రేమి ఉపయోగము పొందగల'రని ప్రశ్నించెను. అందుకు భరద్వాజుడు ''దాని వల్లను నేను వేదముల అధ్యయనాది రూపములో బ్రహ్మ చర్యమునే పాటించెద''నని సమాధానమిచ్చినాడు ఇంద్రుడు పర్వతముల వలె మూడు జ్ఞాన రాశి రూపములగు వేదములను చూపినాడు వానిలోని ప్రతి రాశిని పిడికిట బట్టుకొని భరద్వాజునితో ''ఈ వేదములీవిధముగా జ్ఞానరాసులు లేక పర్వతముల వంటివియై యున్నవి. ఈ వీని జ్ఞానమునకు అంతమనునది లేదు. నీవు మూడు ఆయువుల (300 వత్సరముల) పర్యంతము వేదముల యధ్యయన మొనర్చినను నీకు వాని సంపూర్ణ జ్ఞానము యొక్క అంతము ప్రాప్తించ జాల''దని తెలిపినాడు

బ్రాహ్మణకారుని దృష్టి యందు వేదముల మహత్త్వమెంత యున్నతమో ఈ ఆఖ్యాయిక ద్వారా స్పష్టమగుచున్నది వర్తమాన యుగమునందలి మహావైదిక ధర్మోద్ధారక శిరోమణి, ఆచార్య ప్రవరుడగు మహర్షి దయానందుడు ఈ ఆఖ్యాయిక యొక్క భావమునే తన శబ్దములలో నియమముల రూపములో **''వేదము**

సమస్త సత్య విద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట; మరియు వినుట, వినిపించుట; ఆర్యులందరికిని పరమ ధర్మ''మని ప్రకటించినారు.

**1.5 మహాభారతములో వేద గౌరవ విషయక వచనము**

మహర్షి వేదవ్యాసులు మహాభారతమునందు 'వేదములు నిత్యములు, మరియు ఈశ్వర కృతములు' అని యనేక స్థానములందు దెలుపుచు వానిని అర్థసహితముగ అధ్యయన మొనర్చుటను గట్టిగా బలపరచినాడు ఋషుల, మరియు పదార్థముల పేర్లను వేదములనుండియే గ్రహించి పెట్టినారనియు తెలిపినాడు మహాభారతము లోని దిగువ శ్లోక మీ విషయమున ఉల్లేఖించదగినదై యున్నది.

**అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా ।**

**ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః** ॥ మ. భా. శాం. ప. 232-24

అనగా సృష్ట్యాదియందు స్వయంభువగు పరమేశ్వరుడు వేద రూప నిత్య దివ్యవాణిని ప్రకాశపరచినాడు దాని ద్వారా మానవుల సకల ప్రవృత్తులు విశదమగును. ఇది ఋగ్వేద సుప్రసిద్ధ మంత్రమగు 8-75-6 నకు అనువాదమని యెంచుడు

**తస్మై నూనమభిద్యవే వాచా విరూపనిత్యయా। వృష్ణే చోదస్వసుష్టుతిమ్ ॥**

దీని యందు వేదవాణి నిత్యము మరియు వివిధ విషయముల నిరూపించి ప్రతిపాదించునదగు కారణమున 'విరూపా' యనబడినది. ఈ యధ్యాయమునందే

**నానా రూపం చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనమ్ ।**

**వేద శబ్దేభ్య ఏవాదౌ, నిర్మిమీతే స ఈశ్వరః ॥**

**నామధేయానిచర్షీణాం యా శ్చ వేదేషు దృష్టయః ।**

**శర్వయన్తే సుజాతానాం తాన్యేవైభ్యో దదాత్యజః** ॥ మ భా. శాం. ప. మోక్ష. 232-25,26,27 ॥

అనగా, పరమేశ్వరుడు వస్తువుల పేర్లను, కర్మలను వేద శబ్దములతో నిర్మాణ మొనర్చినాడు. ఋషుల నామములు మరియు జ్ఞానములను గూడా ప్రళయాంతమున అనగా సృష్ట్యారంభమున వేదముల ద్వారా ప్రకటించినాడు.

వేదములను అర్థసహితముగ నధ్యయన మొనర్చు విషయమును బలపరచుచు మహర్షి వేదవ్యాసులిట్లు తెలిపియున్నారు.

**యో వేదే చ శాస్త్రే చ, గ్రన్థధారణతత్పరః ।**

**న చ గ్రన్థార్థతత్త్వజ్ఞః, తస్య తద్ధారణం వృథా ॥**

**భారం స వహతే తస్య, గ్రన్థస్యార్థం న వేత్తి యః ।**

**యస్తు గ్రన్థార్థ తత్త్వ జ్ఞో నాస్య గ్రన్థాగమో వృథా** ॥ మ. భా. శా. మో. అ. 30౫-౧3-౧౪ ॥

అనగా, వేద శాస్త్రములను అర్థము, తత్త్వమును దెలిసికొనకుండా కేవలము చదువుకొనువారు నిష్ఫలముగ వాని భారమును మోయువారే యగుదురు. కావున ఎల్లరును వేదాదిశాస్త్రములను అర్థతత్త్వ సహితముగ దెలిసికొను ప్రయత్నమొనర్చవలెను.

### 1.6 నిరుక్త వచనము

ఈ విషయమునే నిరుక్తమందు శ్రీయాస్కాచార్యులిట్లు దెలిపియున్నారు.

**''స్థాణురయం భారహారః కిలా భూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్।**

**యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూతపాప్మా** ॥నైగమకాండ ౧-౧౮॥

దీనితాత్పర్య మేమన! వేదములను వాని అర్థజ్ఞానమును దెలిసికొనక కేవలము పఠించువారు భారము మోయు పశువులవలె నుందురు. అర్థ భావ సహితముగ చదువుకొనినవారు సమస్త సుఖములతో కల్యాణ ప్రాప్తి నొందెదరు. ఆ పవిత్ర జ్ఞానము ద్వార వారు పాపముల నుండి తప్పుకొని పరమానంద రూప మోక్ష ప్రాప్తి నొందుదురు.

నిరుక్తము యొక్క మొదటి యధ్యాయము, మొదటి పాదము, రెండవ ఖండము నందలి ఈ దిగువ వచనము గూడ ఈ విషయము నుల్లేఖించుచున్నది.

**' పురుషవిద్యాఽనిత్యత్వాత్ కర్మసమ్పత్తిర్మన్త్రో వేదే॥ '**

తాత్పర్యమేమన, పురుషుని విద్యాజ్ఞానములు అనిత్యములు, అగుట వలన వేదములందు మంత్రముల ద్వారా కర్తవ్యకర్మలు నిత్యపూర్ణరూపమున ప్రతిపాదించబడినవి ఈ వచనమువల్ల రెండు విషయములు స్పష్టమగుచున్నవి. నిరుక్తకారుడగు శ్రీ యాస్కాచార్యుడు వేదముల నిత్యత్త్వమును ఈశ్వరీయ జ్ఞానమును విశ్వసించును. పురుషునిజ్ఞాన మనిత్యమను ( పురుష విద్యాఽనిత్యత్వాత్) యుక్తి నిచ్చు అవసరము లేకుండెను.

రెండవ విషయమేమన, దాని ననుసరించి వేదములనగా మంత్ర సంహితలనియే గాని బ్రాహ్మణ గ్రంథములు, ఉపనిషత్తులు కావు. కావుననే అచ్చట మంత్రశబ్దమే ప్రయోగించబడినది.

ప్రసంగము ననుసరించి నిరుక్తముయొక్క ఈ దిగువ వచనము నిచ్చట ఉల్లేఖించుట ఉచితము, మరియు ఆవశ్యక మనియే సూచించబడినది.

**సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుస్తేఽవరేభ్యోఽసాక్షాత్కృతధర్మభ్య ఉపదేశేన మన్త్రాన్ సమ్ప్రాదుః । ఉపదేశాయ గ్లాయన్తో ఽవరే బిల్మ గ్రహణా-యేమం గ్రన్థం సమామ్నాసిషుర్వేదం చ వేదాంగాని చ । బిల్మం భిల్మం భాసనమితి వా ॥** నిరుక్తమ్ ౧-౧౯ ॥

దీని భావమేమనగా! మొదటి ఋషులు సాక్షాత్కృతధర్ములైయుండిరి. అనగా, ఋషులు వేదప్రతిపాదిత ధర్మములను సాక్షాత్కార మొనర్చికొనియుండిరి. వారు ధర్మము యొక్క యథార్థ తత్త్వమును కన్నులతో గాంచినట్లుగా ఎరిగినవారై యుండిరి. ధర్మమును సాక్షాత్కారమొనర్చు కొనని వారికి వారు మంత్రముల ద్వారా ధర్మము నుపదేశించిరి. ఇట్టి ఉదేశము పొందిన వారు రెండవ తరగతి మనుష్యులై యుండిరి. ఇక మూడవ శ్రేణికి చెందిన మనుష్యులు ఈ మొదటి, రెండవ తెగకు చెందిన మనుష్యుల కన్నా మందమతులై యుండిరి. కావుననే వీరు ఈ సమామ్నాయ పదవాచ్య నిఘంటువును వేదముల, వేదాంగముల (సమ్ ఆమ్నాసిషుః)ను చక్కగా అభ్యాసమొనర్చి వాని నన్నిటిని ఇతరుల ఉపకారార్థము లిపిబద్ధమొనర్చిరి. వేదములను వారు రచించియుండిరని భ్రాంతి వశమున కొందరు తలచెదరు. కాని యది సరిగాదు. ఏలన, మంత్రములు పూర్వము నుండియే విద్యమానమై యుండెను వానిని సాక్షాత్కారమొనర్చుకొనిన ఋషులు ధర్మమును ద్వితీయ శ్రేణి ( అవరేభ్యః) వారి కుపదేశించిరి. ఈ ద్వితీయశ్రేణికి చెందిన ఋషులు తృతీయ శ్రేణికి చెందిన (పై రెండు శ్రేణులకన్న మందబుద్ధులు) వారి కుపదేశించిరి. రాబోవు తరమువారికి కూడా మేలు కలుగవలెనను ఉద్దేశ్యముతో ఆ మంత్రములను నిఘంటువు మరియు వేదాంగముల సహితముగా చక్కగా అభ్యాసమొనర్చి లిపిబద్ధ మొనర్చిరి. 'బిల్మం' అను పదమునకు అర్థము 'ప్రకాశము' లేక 'స్పష్టీకరణ' మని పై పేర్కొనిన నిరుక్త వచనమందు తెలుపబడియున్నది.

## 1.7 వేదముల గురించి దర్శనశాస్త్రముల అభిప్రాయము

న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, వేదాంతము, మీమాంస లనబడునవి ఆరు దర్శన శాస్త్రములు. వీనిని క్రమముగ గౌతముడు, కణాదుడు, కపిలుడు, పతంజలి, వేదవ్యాసుడు, జైమిని యను నామములు గల ఋషులు రచించినారు. ఈ దర్శనము లన్నిటియందును వేదముల మహత్త్వము స్పష్టముగా స్వీకరించబడి యున్నది ఉదా:- న్యాయదర్శనము యొక్క **౨-౧-౬౭ ''మన్త్రాయుర్వేదవత్ప్రామాణ్యవచ్చ; తత్ ప్రామాణ్యమాప్తప్రామాణ్యాత్''** మున్నగు సూత్రములందు పరమాప్తుడగు పరమేశ్వరుని వాణి యగుటచే, అసత్యము, పరస్పర విరుద్ధము, పునరుక్తి మున్నగు దోషములు లేకుండుటచే వేదములు పరమ ప్రమాణములుగ అంగీకరించబడినవి

వైశేషిక శాస్త్రకారుడగు కణాదముని **''తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యమ్''** ఈసూత్రము ద్వారా పరమేశ్వరవాణి యగుటచే **'ఆమ్నాయ'** అనగా వేదముల ప్రామాణికతను ప్రతిపాదన మొనర్చియున్నాడు

సాంఖ్యకారకుడగు కపిలమునిని కొందరు ఆధునికాలోచనాపరులు నాస్తికుడని యనుకొంచిరి కాని ఆయన కూడా **''నిజ శక్త్యభివ్యక్తేః స్వతః ప్రామాణ్యమ్''** మున్నగు సూత్రముల ద్వారా వేదములను ఈశ్వరీయ

శక్తిగా అభివ్యక్త పరచుటచే స్వతః ప్రమాణములుగా స్వీకరించినాడు. సాంఖ్య సూత్రములందు జగత్కర్తయగు పరమేశ్వరుని **''స హి సర్వజిత్ సర్వకర్తా''** మున్నగు సూత్రముల ద్వారా స్పష్టముగ ప్రతిపాదన మొనర్చబడినది. కావున కపిలమునిని నాస్తికుడనుట గొప్ప పొరపాటు.

ఈ ప్రసంగమునందు మరొక విషయమును స్పష్టమొనర్చుట ఆవశ్యకమై యుండును. ఏమన, కొందరు సాంఖ్య దర్శనము యొక్క **''ఈశ్వరాసిద్ధేః౧-౯౨''** ఈ సూత్రమును ఆధారముగా గొని ''సాంఖ్యకారుడగు'' కపిలముని ఈశ్వరుని అస్తిత్వమును స్వీకరించకుండెనని యందురు. ఇట్టి యెడ **''నిజశక్త్యభివ్యక్తేః స్వతః ప్రామాణ్యమ్''** దీనికి ఈశ్వరీయ శక్తితో వేదముల అభివ్యక్తిత్వము మరియు స్వతః ప్రమాణత్వ పరక (సంబంధ) అర్థము ఎట్లు పొసగ గలదు? ఈవిషయమున మేము ''బౌద్ధమతము మరియు వైదిక ధర్మము'' అను పేరుగల గ్రంధము నందు (ఆర్య సమాజము... దీవాణహాల్, ఢిల్లీ ద్వారా ప్రకాశితము, మరియు ప్రాప్తవ్యము) సంపూర్ణముగా (వలసినంత) వివరించియున్నాము. ఇచ్చట కేవలము **'ఈశ్వరాసిద్ధేః'** అను సూత్రము ప్రత్యక్ష ప్రకరణమున వివరించబడినదాని లక్షణమును తెలుపుదుము. కపిలముని **''యత్సంబద్ధం సత్ తదాకారోల్లేఖివిజ్ఞానం తత్ప్రత్యక్షమ్'' ౧-౮౯** ॥ ఈ రూపమున వివరించినాడు కావున **'ఈశ్వరాసిద్ధేః'** అనుదాని అభిప్రాయము ప్రత్యక్ష ప్రమాణము ద్వారా ఈశ్వర సిద్ధి గాజాలదు. ఏలన నాతడు సర్వ వ్యాపక నిరాకారుడగుటచే ప్రత్యక్ష విషయము గాదు అని తెలుపుట చాలును, దీనితోనే ఈశ్వరుని ఉపాదానకారణత్వము **''తద్ యోగేఽపి న నిత్యముక్తః। ప్రధానశక్తి యోగాచ్చేత్ సఙ్గాపత్తిః । సత్తామాత్రాచ్చేత్ సర్వైశ్వర్యమ్। ప్రమాణాభావాన్న తత్ సిద్ధిః । సమ్బన్ధాభావాన్నానుమానమ్। శ్రుతిరపి ప్రధాన కార్యత్వస్య ॥''** పంచమాధ్యాయము లోని ఈ సూత్రములందు నిషేధించబడినది దీని తాత్పర్యమేమన 'ఈ సృష్టికి ఉపాదాన కారణము ఈశ్వరుడని నమ్మినచో ఆ యీశ్వరుడు నిత్యముక్తుడై యుండజాలడు ఏలన ఉపాదాన కారణమును అంగీకరించినచో నిత్యముక్తుని యందుండగూడని రాగాది ప్రవృత్తుల నంగీకరించవలసి యుండును ఉపాదానకారణ గుణములు కార్యమునం దుండును. ఈశ్వరుని జగత్తున కుపాదాన కారణమని నమ్మినట్లైన ఈశ్వరుని యందు గల సర్వజ్ఞత్వము మున్నగు గుణములు ఈ జగము నందుండవలెను గదా! కాని అట్లు చూడబడుటలేదు కావున ఆయన జగత్తునకుపాదాన కారణము గాదు. ప్రత్యక్ష ప్రమాణ మెద్దియును లేనందువలన ఈశ్వరుని జగత్తున కుపాదాన కారణము సిద్ధింపజాలదు. ఇంతే కాదు అనుమాన ప్రమాణముల ద్వారా కూడా ఈశ్వరుని జగదుపాదాన కారణము సిద్ధింపదు శ్రుతియును ప్రధానముగా ప్రకృతినే జగత్తున కుపాదాన కారణముగా స్వీకరించినది.'

ఈశ్వరు నీజగత్తునకు నిమిత్తకారణ రూపమున ఆయన అస్తిత్వము వలననే నిరాకరించుచున్నట్లు సాంఖ్యకారుని ఈ సూత్రముల వల్ల భ్రమనొందుట సరిగాదు, ఆతని ఈ దిగువ సూత్రములు ఉల్లేఖించదగినవిగనున్నవి

స హి సర్వవిత్ సర్వకర్తా ॥ సాం 3-౫౬ ॥

ఈశ్వరుడు తన సర్వజ్ఞత్వము, మరియు నిమిత్తకారణ రూపమున జగత్కర్తయై యున్నాడు

ఈదృశేశ్వర సిద్ధిః సిద్ధా ॥సాంఖ్య. 3-౫౭॥

ఇట్లు జగన్నిమిత్త కారణరూప సర్వజ్ఞుడగు ఈశ్వరసిద్ధి సిద్ధించుచున్నది.

**వ్యావృత్తోభయరూపః** ॥సాంఖ్య.౧-౧౬౦॥

ఆపరమేశ్వరుడు ప్రకృతి పురుష(ఆత్మ) లిరువురకన్న భిన్నస్వరూపుడని ప్రకటించు సాంఖ్యశాస్త్రము నిరీశ్వరవాదమును ప్రతిపాదించుటలేదు. దీనియందు నిత్యబ్రహ్మయొక్క ప్రతిపాదనము గలదు ఈవిషయమును మహాభారత శాంతిపర్వము నందలి మోక్షధర్మ విభాగములో 30౧ వ అధ్యాయము గూడా స్పష్టముగా ప్రతిపాదించుచున్నది.

**అత్ర తే సంశయో మాభూత్, జ్ఞానం సాంఖ్యం పరం మతమ్।**

**అక్షరం ధ్రువమేవోక్తం,పూర్ణం బ్రహ్మ సనాతనమ్।**

**అనాదిమధ్యనిధనం, నిర్ద్వన్ద్వం కర్తృశాశ్వతమ్।**

**కూటస్థం చైవ నిత్యం చ, యద్వదన్తి మనీషిణః** ॥మ.భా. శాం.30౧-౧౧౧-౧౧॥

మహాభారత శాంతిపర్వము (మోక్షధర్మ పర్వము) ఇరువదేడవ యధ్యాయమందు కపిలుని నిమ్న వచనము సైతము ద్రష్టవ్యమైయున్నది. దీనివల్ల నాతనికి వేదము, మరియు బ్రహ్మము రెండింటిపై పూర్ణనిష్ఠ గలదని స్పష్టముగా దెలియుచున్నది

**వేదాః ప్రమాణం లోకానాం, న వేదాః పృష్ఠతః కృతాః।**

**ద్వే బ్రహ్మణీవేదితవ్యే, శబ్దబ్రహ్మ పరం చ యత్ ॥౧॥**

**శబ్దబ్రహ్మణి నిష్ణాతః, పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥౨॥**

అనగా, వేదము సకలమానవులకు ప్రమాణమైయున్నది అది తరువాత సిద్ధ పరచబడినదిగాదు బ్రహ్మ పదమునకు రెండర్థము లవశ్యముగా గలవు ఒకటి వేదము, రెండవది పరబ్రహ్మ పరమేశ్వరుడు. శబ్దబ్రహ్మ అనగా వేదములందు నిపుణులగువారు పరబ్రహ్మ ప్రాప్తినొందెదరు. ఈవిధముగ కపిలముని నాస్తికత్వము సంపూర్ణముగ నిరాకరణ మగుచున్నది.

యోగదర్శనకారుడగు పతంజలిముని "**స ఏష పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్**" సమాధిపాదము ౨౬వసూత్రము ఇత్యాదులందు పరమేశ్వరుడు నిత్యవేదజ్ఞానము నిచ్చుకారణమున నతడు పూర్వజులెల్లరకును ఆదిగురువని ఎంచబడినది.

వేదాంతశాస్త్ర కర్తయగు వేదవ్యాసుడు "**శాస్త్రయోనిత్వాత్** ॥౧-౧-3॥" '**తథా అత ఏవచ నిత్యత్వమ్** ॥౧-3-౨౯॥" మున్నగు సూత్రములద్వారా పరమేశ్వరుని ఋగ్వేదాది రూపుడు, సర్వజ్ఞానభండారము,

శాస్త్రములకర్త యని స్వీకరించుచు వేదముల నిత్యత్వమును ప్రతిపాదించినాడు. **'శాస్త్రయోనిత్వాత్'** ఈ సూత్రమునకు భాష్య మొనర్చుచు సుప్రసిద్ధ దార్శనికుడగు శ్రీశంకరాచార్యులు ఈ ప్రసంగమునకు గొప్పమహత్త్వము నిచ్చియున్నందున ఉల్లేఖించ దగినదైయున్నది ఏమనగా;

**''ఋగ్వేదాదేః శాస్త్రస్యానేకవిద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్ సర్వార్థా వద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ। న హీదృశస్యర్గ్వేదాది లక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి॥**

అనగా ''ఋగ్వేదాది నాలుగువేదములు అనేక విద్యలచే గూడియున్నవి. సూర్యునివలె సమస్త సత్యార్థములను ప్రకాశపరచునవి య్యైయున్నవి. వాని నిర్మాత సర్వజ్ఞత్వాది గుణములచే గూడియున్న పరబ్రహ్మయే. ఏలన; సర్వజ్ఞ పరబ్రహ్మగాక ఏ జీవియును సర్వజ్ఞగుణయుక్తమగు ఈ వేదములను నిర్మించుట అసంభవము ఇత్యాదులు.'' మీమాంస శాస్త్రకర్తయగు జైమినిముని **'చోదనా లక్షణోఽర్థో ధర్మః'** 'వేదము లాదేశించినది ధర్మము, వేదవిరుద్ధమైనది అధర్మ' మని తెలిపినాడు.

ఈ ప్రకారముగ సకల శాస్త్రములు ఏకస్వరమున వేదముల నిత్యత్వము, మరియు స్వతఃప్రమాణత్వమును ప్రతిపాదించినవి

## 1.8. గీత యందలి కొన్ని వాక్యములు

భగవద్గీత ఒక మహత్త్వపూర్ణమగు జగద్విఖ్యాత గ్రంథము. ఇది మహాభారతాంతర్గతమైనది. వేదముల మహత్త్వవిషయమును ప్రకాశమొనర్చు కొన్ని మహాభారత శ్లోకములను పైన పేర్కొనియుంటిని. ఐనను గీత సుప్రసిద్ధ గ్రంథమగు కారణమున దానియందలి వేదవిషయకమగు కొన్ని శ్లోకములను ఈప్రకరణమునం దుల్లేఖించుట ఉచిత మనిపించును. గీతయందలి మూడవ యధ్యాయమందు యోగిరాజగు శ్రీకృష్ణుడు యజ్ఞనిరూపణమునందు

**అన్నాద్ భవన్తి భూతాని, పర్జన్యాదన్నసమ్భవః।**
**యజ్ఞాద్ భవతి పర్జన్యః, యజ్ఞః కర్మసముద్భవః॥**
**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి, బ్రహ్మాక్షరసముద్భవమ్।**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ, నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్** ॥ భగవద్గీత 3-౧౪,౧౫॥

''ప్రాణులజీవనము అన్నముపై నాధారపడియున్నది ఆ యన్నము మేఘముల వలన ఉత్పన్నమగును మేఘములు యజ్ఞములచే నిర్మాణమగును అట్టి యజ్ఞములు కర్మద్వారా సంపన్నమగును. ధర్మ కర్మల యుత్పత్తి, మరియు జ్ఞానము **'బ్రహ్మ'** అనగా వేదముల ద్వారా జరుగును ఆబ్రహ్మ అనగా వేదములు అక్షరుడు మరియు అవినాశియగు పరమేశ్వరునిచే ఆవిర్భూతమగును. కావున సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు

సర్వదా యజ్ఞములందు ప్రతిష్ఠితుడైయుండునని తెలియుడు.'' ఈ శ్లోకములో వేదముల యుత్పత్తి అవినాశియగు పరమేశ్వరునుండి యని స్పష్టముగా జూపబడియున్నది '

*ఈశ్లోకముల భాష్యమునందు శ్రీ శంకరాచార్యులీ విధముగ వ్రాసినాడు -*

కర్మ (బ్రహ్మోద్భవమ్) బ్రహ్మవేదః స ఉద్భవః కారణం యస్య తత్ కర్మ బ్రహ్మోద్భవమ్(విద్ధి) జానీహి బ్రహ్మ పునర్వేదాఖ్యమ్ (అక్షర సముద్భవమ్) అక్షరం బ్రహ్మ పరమాత్మా సముద్భవో యస్య తదక్షరసముద్భవం బ్రహ్మ వేద ఇత్యర్థః।

**యస్మాత్ సాక్షాదపరమాఖ్యాదక్షరాత్ పురుషనిఃశ్వాసవత్ సముద్భూతం బ్రహ్మ తస్మాత్ సర్వప్రకాశకత్వాత్ సర్వగతమ్। సర్వగతమపి సన్నిత్యం సదా యజ్ఞవిధిప్రధానత్వాద్ యజ్ఞే ప్రతిష్ఠితమ్॥**

॥శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యే అ 3-౧౫॥

'శ్రీమద్భగవద్గీత శాంకరభాష్యాదిసప్తటీకోపేతా' గుజరాతి ముద్రణాలయము ముంబయి పుట ౧౦౧ దీని తాత్పర్యమేమన కర్మోత్పత్తి వేదమునుండి, వేదము అవినాశియగు పరమాత్మనుండి యైనది. వేదములు సాక్షాత్తు పరమాత్మనుండియే పురుషశ్వాసవలె వెడలినవి. కావున నవి సకల విషయముల ప్రకాశకములగు కారణమున వానినే **'సర్వగతము'** అని తెలుపబడినవి. ఆసర్వగత బ్రహ్మ (వేదములు) యజ్ఞవిధి ప్రధానుడగుటచే యజ్ఞమందు ప్రతిష్ఠితుడని ఎఱుగవలయును.

ఈశ్లోకముల భావము నందు శ్రీఆనందతీర్థ (మధ్వాచార్య) భాష్యము శ్రీ శంకరాచార్యుల భాష్యము కొంత భిన్నముగనున్నను వేదముల నిత్యత్వము, మరియు ఈశ్వరీయత్వము:

**'తాని చాక్షరాణి నిత్యాని 'వాచా విరూప నిత్యయా । వృష్ణే చోదస్వ సుష్టుతిమ్ ॥**

**అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా। అత ఏవ చ నిత్యత్వమ్ ।**

**ఇత్యాది శ్రుతిస్మృతి భగవద్వచనేభ్యః ॥ న చ సర్వజ్ఞత్వే యది వేదస్రష్టా కిమితి న జగత్ స్రష్టా సర్వజ్ఞః**

**తస్మాద్ వేదప్రమాణకత్వమేవాత్ర వివక్షితమ్।**

**అతో నిత్యాన్యక్షరాణి యత ఏవం పరమ్పరయా యజ్ఞాభివ్యజ్గ్యం బ్రహ్మ తస్మాన్నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥**

మున్నగు శబ్దముల ద్వారా స్పష్టము చేయబడినది. **'వాచావిరూప నిత్యయా'** యనివేదములు, **'అనాదినిధనా నిత్యా'** అని మహాభారతము, వేదాన్తసూత్రము **'అత ఏవ చ నిత్యత్వమ్'** మున్నగు నుదాహరణములతో పుష్టపరచినవి రామానుజాచార్యుల అమృతతరంగిణీ టీక యిందును,

**వేదాత్ కర్మోత్పత్తిః స చ బ్రహ్మనిఃశ్వాసస్తేన తథా। బ్రహ్మణః పురుషోత్తమత్వజ్ఞాపనార్థం**

**విశినష్టి అక్షరసముద్భవమ్। అక్షరస్య సముద్భవో యస్మాత్ తాదృశమ్ ॥**

మున్నుగు వచనములద్వారా వేదముల నిత్యత్వము ప్రతిపాదింపబడినది. నీలకంఠ టీక యందింతకన్న స్పష్టముగ ఈశ్లోకము యొక్క టీకను గూర్చి వ్రాయబడినది.

**కర్మ (బ్రహ్మోద్భవం) వేదోద్భవం వేద ఏవ ధర్మేప్రమాణం న తు పాఖండాదిప్రణీతాగమః । బ్రహ్మ వేదోఽపి అక్షరసముద్భవమ్ ।**

**అస్యమహతో భూతస్య నిఃశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేదః ఇత్యాదిశ్రుతేః। సాక్షాత్పరమేశ్వరా దేవోత్పన్నోఽతో న తత్ర భ్రమవిప్రలమ్భత్వాదిదోషాక్రాన్తపాఖండాదివాక్యవదప్రామాణ్యశం కాస్తీతి భావః ।**

**యస్మాదేవం తస్మాత్ సర్వస్మిన్ దేశే కాలే చ వర్తమానం బ్రహ్మ వేదః ఏతేన వేదస్య నిత్యత్వం శబ్దస్య విభుత్వం చ దర్శితం నిత్యం నియమేన యజ్ఞే ప్రతిష్ఠితం తాత్పర్యేణ పర్యవసన్నమ్** ॥ నీలకంఠీ టీకా పు-౧౮౩ ॥

అనగా, కర్మ విషయమున వేదము ప్రమాణమై యున్నది. అట్టి వేదముల యుత్పత్తి పరమాత్మచే నైనది కావున వాని ప్రామాణికత యందేమాత్రము సందేహముండ జాలదు.

భగవద్గీతయందలి పదునేడవ యధ్యాయమునందు **'ఓంమ్ తత్సత్'** ద్వారా బ్రహ్మయొక్క నిర్దేశమొనర్చుచు ౨౩వ శ్లోకమందిట్లున్నది

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**

**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చవిహితాపురా** ॥ భ. గీ. ౧.౮,౨౩॥

బ్రహ్మను గూర్చి 'ఓం తత్ సత్' ఇట్టినామములచే శాస్త్రములందు నిర్దేశించబడినది. వానిచే బ్రాహ్మణుల, (బ్రహ్మజ్ఞానులగు వేదవేత్తల) వేదముల, యజ్ఞముల విధాన మొనర్చబడినది అనగా, వేదముల అధ్యయనాధ్యాపనములందు రేయింబవళ్ళు తత్పరుడైయుండు జ్ఞాని పరమేశ్వరుని నిజమైన భక్తుడు, ఆయనకు జ్యేష్ఠపుత్రుడని పించుకొనును. యజ్ఞకర్మ లెవని ద్వారా నిర్వహింపబడునో అట్టి బ్రహ్మయే వేదముల నుపదేశించగలడు. ఈమూడింటి యుత్పత్తి ఆపరబ్రహ్మయే యని యెంచబడినది. ఈ శ్లోకమందును వేదములు ఈశ్వరీయములని స్పష్టముగా దెలుపబడినది.

భగవద్గీతయందు వేదముల నిందగలదని, వాని తుచ్ఛత్వము దిగువశ్లోకములందు గలదని కొందరభిప్రాయపడు చున్నారు.

**యామిమాం పుష్పితాం వాచం, ప్రవదన్త్యవిపశ్చితః ।**

**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతివాదినః** ॥౨-౪౨॥

**కామాత్మానః స్వర్గపరాః, జన్మకర్మఫలప్రదామ్ ।**

**క్రియావిశేషబహులాం, భోగైశ్వర్యగతిం ప్రతి** ॥౨-౪౩॥

**భోగైశ్వర్యప్రసక్తానాం, తయాఽపహృతచేతసామ్।**

**వ్యవసాయాత్మికా బుద్ధిః, సమాధౌ న విధీయతే ॥ ౨-౪౪ ॥**

**త్రైగుణ్యవిషయా వేదాః, నిస్త్రైగుణ్యో భవార్జున।**

**నిర్ద్వన్ద్వో నిత్యసత్వస్థో, నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ ౨-౪౫ ॥**

**యావానర్థ ఉదపానే, సర్వతః సంప్లుతోదకే।**

**తావాన్ సర్వేషు వేదేషు, బ్రాహ్మణస్య విజానతః ॥ ౨-౪౬ ॥**

వాస్తవముగా ఈ శ్లోకములందు వేదములను గూర్చిన నిందలేదు. కాని వేదముల ననుసరించి ఆచరణ మేదియును లేక కేవలము వేదవిషయక వాదవివాదములందు తత్పరులైయుండువారి, మరియు ఈ బాహ్య యజ్ఞయాగాదుల కతిరిక్తముగా మరియే యితర కర్తవ్యములు లేనేలేవని, (వేదవాదరతాః పార్థ, నాన్యదస్తీతివాదినః) భోగైశ్వర్యముల ప్రాప్తికొరకే యజ్ఞయాగాదులొనర్చుచు భోగములందాసక్తులై యుండు వారి నిందగలదు. అట్టివారి నింద స్వయముగ వేదములందును గలదు. చూడుడు.

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః।**

**యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్ తద్విదుస్త ఇమే సమాసతే** ॥ ఋ.౧-౧౬౪-౩౯॥

**న తం విదాథ య ఇమా జజానాన్యద్ యుష్మాకమన్తరం బభూవ।**

**నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరన్తి** ॥ ఋ.౧౦-౮౨-౭య ౧౭-౩౧॥

ఏ యవినాశియగు పరమేశ్వరుని యాధారమున సకలదేవతలు, సూర్య, చంద్రనక్షత్రాది తారాగణము, మరియు సత్యనిష్ఠగల విద్వాంసులు నిలిచియున్నారో వానిని దెలిసికొనక, కేవలము వేదమంత్రములను చదివి వారేమి చేయుగలరు? ఫలమేమి? ఆ పరమేశ్వరు నెరుగువారే ప్రశాంతముగ నుండగలరు కావున ఓమానవులారా! ఈ సకల పదార్థములను, ప్రాణులతో గూడిన సృష్టికర్తయగు నా పరమేశ్వరుని మీరు దెలిసికొను ప్రయత్నము జేయుటలేదు. ఆయన మీకు భిన్నమై యుండియును మీలోపలను ఉన్నాడు. ఐనను మీరు అజ్ఞానాంధకారముచే ఆచ్ఛాదితులై యుండి ఆచరణనొనర్పక కేవలము మాటల చేతనే సంతృప్తులగుచుందురు. మీరు మీస్వంత ప్రాణములను తృప్తిపరచుటయందు, మరియు ఉదరపోషణయందు తత్పరులై యుందురు ఈశ్వరుని వేదోక్తమగు ఆజ్ఞలను పాటింపక కేవలము నామము నుచ్చరించుచు, వేదవాణిని కథన మొనర్చుటయందే సమయమును వృథా నష్టపరచు కొనుచున్నారు.

వేదమంత్రముల తాత్పర్యము వేదముల నింద కాదు. వేదోక్తఆజ్ఞలను పాలించక, వేదముల ముఖ్యప్రతిపాదిత (కఠోపనిషత్తు ౨-౧౫ యొక్క **'సర్వేవేదాయత్పదమామనన్తి'**, మరియు భగవద్గీత ౮-౧౧ యొక్క **'యదక్షరం వేదవిదో వదన్తి'** ని అనుసరించి) పరమేశ్వరు నెరుగుటకు ప్రయత్నించకుండుట.

అనగా పై గీతాశ్లోకముల తాత్పర్యమును దెలిసి కొనకుండుటయే యగును. **'త్రైగుణ్య విషయావేదాః'** గీత-౹౨-౪౫ శ్లోకముయొక్క తాత్పర్యము స్పష్టముగ వేదములందు ప్రకృతి యొక్క సత్వ రజస్తమము లను నీ మూడు గుణములచే నిర్మితమైన పదార్థముల జ్ఞానభండారము గలిగియుండు కారణముయొక్కవర్ణనగలదు. ఐనను మనుష్యుని కర్తవ్యమేమన! ఆతడా సకల పదార్థజ్ఞానమును ప్రాప్తించుకొని ఈమూడు గుణములనుండి విముక్తుడై నిత్యసత్యమునందు నివసించవలెను. దీనియందు వేదనింద ఏమాత్రము లేదు. కాని ఇది దాని జ్ఞానరూపమును ప్రతిపాదించుచున్నది.

**'యావానర్థ ఉదపానే'** ఈశ్లోకము యొక్క వాస్తవికార్థ మేమన (సర్వతః సంప్లుతోదకే) నలుదిశలనుండి వరదలు వచ్చినపుడు (ఉదపానే) నూతియొక్క స్వచ్ఛజలము (యావాన్ అర్థః) ఎంతప్రయోజనకారియో(విజానతః బ్రాహ్మణస్య) జ్ఞానియగు బ్రాహ్మణునకు (సర్వేషువేదేషు) వేదముల ప్రయోజన మంతగా నుండును. భావార్థమేమన; నలువైపులనుండి వరదలు వచ్చినపుడు త్రాగుటకు స్వచ్ఛజలములు లభ్యముగావు, ఏలన, ఆనీరు మిక్కిలియధికముగ నుండియు త్రాగుటకు యోగ్యముగ నుండదు కాని నూతినీరు అతితక్కువ పరిమాణములో నున్నను శుద్ధముగ నుండు కారణమున పానమొనర్చుటకు వరదనీటికన్నను ఎంతయో ప్రయోజనకారిగా నుండును. ఇదేవిధముగ వరదనీటి వలె అక్కడిక్కడి పుస్తకముల నుండి అనేక విషయముల జ్ఞానము కొంత ప్రాప్తించగలదు. కాని కూపజలము వలె శుద్ధ పవిత్ర జ్ఞానము మాత్రము వేదముల ద్వారానే లభించగలదు. ఇతరత్రా లభ్యముగాజాలదు. ఇది ఒకవిధముగా ఋగ్వేదమునందును,

**యస్తిత్యాజ సచివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి।**

**యదీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పన్థామ్** ॥ ఋ.౧౦-౭౧-౬ ॥

దీని భావార్థమిట్లు గలదు.- పరమేశ్వరుని ప్రాప్తించుకొనుటకు యథార్థ తత్వోపదేశ మొనర్చు వేదరూప మిత్రుని పరిత్యజించు వారి వాణియందు కీర్తించదగిన అంశములు లుప్తమైపోవును. అక్కడిక్కడి నుండి వినిన అశుద్ధ, అసత్యము లాతని ధర్మమార్గమును (న ప్రవేద) అతిశయముగ, ఉత్తమముగ పూర్ణవిశుద్ధ రూపమున దెలిసికొన నీయవు. గీతా శ్లోకములందు వేదముల నిందగల దని యనుకొనుట సర్వదా అసమంజసమే గీత ద్వారా వేదముల యథార్థ జ్ఞానము యొక్క మహత్త్వమే ప్రకటితముగుచున్నది.

భగవద్గీతయందు ఈదిగువ శ్లోకము ద్వారా వేదము సత్య ప్రమాణరూప శాస్త్రమని ఉద్ఘోషించబడినది.

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే, కార్యాకార్యవ్యవస్థితౌ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మ కర్తుమిహార్హసి** ॥ గీత౧౬-౨౪॥

కార్యము, మరియు అకార్యముల నిర్ణయమునందు శాస్త్రములే నీకు ప్రమాణములు. కావున శాస్త్రవిధానమును దెలిసికొని దాని ననుసరించి కార్యము నొనర్చుట నీ కుచితము ఏలన; అవి ఈశ్వరీయములు ఈవిషయమున ప్రమాణముతో గూడిన నిరూపణము పైనచూపబడినది.

ఈవిధముగ సమస్త ప్రాచీన సంస్కృత సాహిత్యము నందు వేదముల మహత్త్వమును వర్ణించుటను మనము జూచుచున్నాము. అవి ధర్మ జ్ఞానముకు మూలములు. నిత్యములు, అపౌరుషేయములు, మరియు ఈశ్వరోక్తములని తెలుపబడునది. వేదవిషయమునం దిట్లు దాదాపు సర్వసమ్మతప్రాచీనవిశ్వాసమై యున్నది.

### 1.9. ఉపనిషత్తులందు వేదవిరుద్ధ క్రాంతిగలదా?

ఈ ప్రథమఖండము సమాప్తమొనర్చుటకు పూర్వము మరొక విషయము నాలోచించుట ఆవశ్యకమని తలతును ఉపనిషత్తులందు వేదములకు విరుద్ధమగు నొక క్రాంతి గలదని శిక్షితులగు అనేకవ్యక్తులు అభిప్రాయపడుచున్నారు. అనగా వేదములను **'అపరవిద్య'** అను పేరుతో బిలుచుచు అవి తుచ్ఛము, మరియు హేయములని చూపబడినది. మరియు వేదోక్త యజ్ఞములు, కర్మకాండ యొక్క నిస్సారత ప్రతిపాదించబడినది **'ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపాః'** మున్నగు వచనముల ద్వారా బలపరచబడినది మే మీవిషయమును ముణ్డకోపనిషత్తు యొక్క రెండు వచనములను ఈఖండమునందు ఉధృతపరచి ఉపనిషత్తులు వేదములను స్పష్టముగా ఈశ్వరీయ జ్ఞానమని దెలుపుటను చూపుచున్నాము

**''అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్ర సూర్యౌ, దిశఃశ్రోత్రే వాగ్ వివృతాశ్చ వేదాః।**

**వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్త రాత్మా॥** ముణ్డకో' ౨-౧-౪॥

మరియు

**తస్మాదృచః సామయజూంషి దీక్షాః** ॥ ముణ్డకో. ౪-౧-౬ ॥

ముణ్డకోపనిషత్కారుడగు ఋషికి వేదవిద్య తుచ్ఛమను నాలోచన యున్నచో ఆయన తన ఉపనిషత్తునందు 'సర్వభూతాన్తరాత్మా' అను వచనమును పరమేశ్వర వాణియగు వేదముల విషయమున వ్రాయకుండెడివాడు. వేదముల యుత్పత్తి పరమాత్మనుండియే జరిగినదని అతడు ప్రకటించినాడు.

**ద్వే విద్యే వేదితవ్య ఇతి స్మ హయద్ బ్రహ్మవిదో వదన్తి పరా చైవాపరా చ। తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి। అథ పరా యయా తదక్షరమధిగమ్యతే** ॥ ముణ్డకో. ౧-౧-౪॥

దీని యర్థమును గ్రహించుటయందు భ్రమగలిగిన దని యనవచ్చును. బ్రహ్మవేత్తలు పరా, అపరా యనురెండు విధములగు విద్యల జ్ఞానమును ప్రాప్తించుకొనవలెనని యందురు అపరా విద్యయనగా ప్రపంచమందలి ధర్మ కర్మలు, మరియు సకల పదార్థముల యధార్థజ్ఞానమును ప్రాప్తించుకొనుట దీనియందు ఋగ్యజుస్సామాథర్వ వేదములు, శిక్ష, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛన్ద, జ్యోతిష్యములు చేరియున్నవి కావుననే వీని ద్వారా ధర్మ కర్మలు, మరియు సమస్త పదార్థముల యధార్థజ్ఞానము సంప్రాప్తించగలదు కేవలము నాశరహితమగు బ్రహ్మను దెలిసికొనదగినదే పరావిద్య యనబడును. అపరావిద్య శ్రేష్ఠ మైనది గాదని దీని భావముగాదు. '౧౭౬౦ వ శతాబ్దమునందు రెండవముద్రణయైన 'బ్రాహ్మధర్మః' అనుపుస్తకమునందు 3వ.

పుటలో 'అపరా' యనగా 'అశ్రేష్ఠ' మని చూపబడినది. నిజమునకది శ్రేష్ఠమైనది గాదని కాదు. ఇంకా ఆ పుస్తకమునందు వేదముల వలన బ్రహ్మజ్ఞానము ప్రాప్తించజాలదని చూపు సాహసము కూడ ఒనర్చబడినది. వేదములందు కేవలము బ్రహ్మవిద్యయేగాక ధర్మ కర్మల, మరియు ప్రపంచమునందలి ఇతర పదార్థముల, అనగా, అగ్ని, వాయువు, పృథివి, జలాకాశములను పంచభూతములు మున్నగు వాని యథార్థ స్వరూపము గూడా ప్రతిపాదించబడినది. ఇవి సాక్షాత్తుగ పరా విద్యాంతర్గతమైనవి గావు.

**సర్వే వేదా యత్పదమామనన్తి** ॥ కఠో. ౨-౧౫ ॥

**తథా తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వి విదిషన్తి** ॥ బృహదారణ్యకము ౪-౪-౨౨ ॥

అనేక ఉపనిషత్తులందు ''వేదములన్నిటి యందు ఆ ప్రాప్తవ్య సచ్చిదానంద స్వరూపుడగు పరబ్రహ్మ ప్రతిపాదనగల'' దని స్పష్టముగా దెలుపబడియున్నది. మరియును బ్రాహ్మణులు వేదాధ్యయనము ద్వారా ఆ పరమాత్మను దెలిసికొనుటకే ప్రయత్నింతురు. వేదములను చదివి, విని మననమొనర్చనంత వరకు, ఆ శిక్షల (ఉపదేశముల) ను హృదయమందు స్థిరమొనర్చుకొన నంతవరకు బ్రహ్మయొక్క సాక్షాత్‌జ్ఞానము గలుగజాలదు. ఈకారణముననే వేదములను అర్థసహితముగ వినుటమాత్రము అపరా, మరియు బ్రహ్మవిద్యను మననమొనర్చుచు నిదిధ్యాసనము ద్వారా సాక్షాత్కారమొనర్చుకొని ప్రాప్తించుకొను జ్ఞానము పరా విద్యయనబడును కావున దీనిని వేదనింద యని దలచుట భ్రమయే యనవచ్చును సమస్త ఉపనిషత్తుల ఆధారమంతయు యజుర్వేదముయొక్క ౪౦వ అధ్యాయముగు ఈశోపనిషత్తు పైననే గలదు ఇది కాణ్వశాఖానుసారము గలదు ఇతర ఉపనిషత్తులం దనేక స్థానములందును

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే** ॥

(ఋగ్వేద. ౧-౧౬౪-౨౦, ముణ్డకో. 3-౧-౧, శ్వేతాశ్వతర ౪-౬ ॥)

**తదేవాగ్నిస్తదాదిత్యస్తద్ వాయు స్తదు చన్ద్రమాః.**

**తదేవ శుక్రం తద్ బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః** ॥ యు 3౨-౧, శ్వేతాశ్వ. ౪-౨॥

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః,** ।

**యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్ తద్విదుస్త ఇమే సమాసతే॥** ఋ ౧-౧౬౪-3౯, శ్వేతాశ్వతర ౪-౮॥

**యుంజతే మన ఉత యుంజతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః।**

**వి హోత్రా దధే వయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః** ॥ యజు ౧౧-౪, శ్వేతాశ్వతర ౨-౪॥,

ఈవిధముగా వందలకొలది వేదమంత్రములు ప్రమాణరూపమున సీయబడినవి. ఇట్టి స్థితిలో ఉపనిషత్తులందు వేదవిరుద్ధక్రాంతిగల దనుట కేవలము భ్రాంతియే యగును. కేవలము వేద పఠనముతోనే సంతృప్తి జెంది ఇంతియే చాలునని యనుకొనక వేదప్రతిపాద్య పరమాత్మ జ్ఞానము హృదయంగముగా

వర్ణింపబడి యున్నది. పైన చూపబడిన ఋగ్వేదము యొక్క **''ఋచో అక్షరే పరమే వ్యోమన్.. యస్తన్న వేద కిమృచా కరిష్యతి''** యను మంత్రము నందును, గీత ప్రకరణము నందును ఈ విషయము స్పష్టముగా వ్రాయబడినది. దీనినిబట్టి ఉపనిషత్తులందు వేదముల నిందగలదని యనుకొనుట, మరియు ఉపనిషత్తులను వేద విరుద్ధవిప్లవ మనుకొనుట గొప్ప భ్రాంతియే యగును

**ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః** ॥ ముణ్డకో. ౧-౨-౭॥

ఇట్టి ఉపనిషద్వచనములను 'వేదోక్త యజ్ఞముల నింద' యని తలచుటయును భ్రమయే యనవచ్చును ఏలన 'ఉపక్రమము' (ప్రారంభము) మరియు 'ఉపసంహారము' (సమాప్తము) మున్నగు వానిని జూచి అర్థము నిర్ణయ మొనర్చబడును. ఏ ఖండమునందు **'ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపాః'** అనగా ఈ యజ్ఞ రూప నౌకలు గొప్ప శక్తి వంతమైనవి గాను భావముగల వను శబ్దములు వచ్చి యున్నవో ఆ ఖండము ప్రారంభము నిమ్న వచనములతో యగుచున్నది

**తదేతత్ సత్యం మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సన్తతాని।**

**తాన్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాః సుకృతస్య లోకే** ॥ ముణ్డకో ౧-౨-౧॥

**యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే।**

**తదాజ్యభాగావన్తరేణాహుతీః ప్రతిపాదయేత్** ॥ ముండ ౧-౨-౨॥

**ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు యథాకాలం చాహుతయో హ్యాదదాయన్।**

**తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో యత్ర దేవానాం పతిరేకోఽధివాసః** ॥ముండ ౧-౨-౫॥

**ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి।**

**ప్రియాం వాచమభివదన్త్యోఽర్చయన్త్య ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః** ॥ ముండ ౧-౨-౬ ॥

వీని తాత్పర్యమేమన, వేద మంత్రములందు ఋషులు ఏ యజ్ఞాది కర్మల విధానము నేర్పరచినారో వానియొక్క హౌత్ర, ఆధ్వర్యవ, ఔద్గాత్రమను ఈ మూడింటి సంయోగ రూపము త్రేతా, అనగా త్రేతా యుగము నందు విశేష రూపముగ ప్రచారమైనది. నీవు కూడా సత్యమును కాంక్షించుచు నిశ్చల రూపమున ఆ యజ్ఞముల ఆచరించుము, అనుష్ఠాన మొనర్చుము. ఈ లోకమునందు నీకు పుణ్యమున కిదియే మార్గము ఉదయ సాయంకాలములందు అగ్నిని చక్కగా ప్రదీప్తమొనర్చి ఆహుతుల నీయవలెను. దేదీప్య మానమగు అగ్ని శిఖల యందు యథా సమయములలో ఆహుతుల నిచ్చుచు అగ్ని హోత్రము మున్నగు శుభకర్మల నొనర్చువారిని సూర్యరశ్మలు, లేదా ప్రాణములు దేవాధి దేవత యగు పరమేశ్వరుని దిశకు గొనిపోవుచుండును. ఇదియే నీ పుణ్య కర్మల ఫలమగు పవిత్ర బ్రహ్మలోకమై యున్న దను ప్రియవాణిచే యజమానుల సత్కరించుచు మోక్షప్రాప్తి గలిగించును. ఇట్టి కవితామయ ఆలంకారిక వర్ణనలు ఉపనిషత్కారులు వేదమంత్రముల ద్వారా విధి విధానముగా నొనర్చబడు యజ్ఞములకు గొప్ప మహత్త్వము నిచ్చు చుండిరని మనకు స్పష్టముగా

దెలియుచున్నది. అవి ఈశ్వర ప్రాప్తియందు మనకు గొప్ప సహాయకులని ఎంచుచుండిరి. ఉపరోక్త వచనములచే యజ్ఞ కర్మలను గురించిన నింద ఏ రూపమునందును గాన్పించదు. మీదు మిక్కిలి **'తాన్యాచరథ నియతం సత్య కామాః' 'ఆహుతీః ప్రతిపాదయేత్'** మున్నగు వాని ద్వారా వానిని శ్రద్ధతో నియమ పూర్వకముగా ఆచరించు విధానమిచట గలదు యజ్ఞముల విషయమునందింత స్పష్టముగ విధానము నొనర్చిన ఏ యాప్త ఋషియైనను స్వయముగా వాని నిందయొనర్చినాడనిన ఏ బుద్ధిమంతుడైనను ఈ మాటల నంగీకరింపగలడా? మనమైనను విశ్వసింతుమా ? ఈ విధి పూర్వకవచనముల పిదప,

**ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః అష్టాదశోక్తమవరం యేషు కర్మ ।**

**ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి ॥** ముం. ౧-౨-౭॥

మున్నగు వచనములు ఉపనిషత్తులందు గలవు. మనము భ్రమ పడినట్లు వాని తాత్పర్యము వేదోక్త యజ్ఞముల నింద గాదు కాని ఈ బాహ్య యజ్ఞములే సర్వస్వమని ఎంచి సత్యజ్ఞాన ప్రాప్తికై ప్రయత్నము నొనర్చనివారిని గూర్చిన నిందయై యున్నది. పదే పదే జన్మ మరణ చక్రమున బడుచుందురని తిట్టి యజ్ఞానుల విషయముననే చెప్పబడియున్నది ఏలయన జ్ఞాన రహితముగ నున్న ఈ బాహ్య యజ్ఞ రూప నౌకలు దృఢమైనవి గావని అవి లక్ష్యమును చేర్చుటకు సమర్థవంతమైనవి గావని భావము.

**'అవరమ్ – కేవలమ్ జ్ఞానరహితం కర్మేతి శంకరాచార్యాః'**

ఇదేవిధముగ జ్ఞానరహితులై కేవలము బాహ్యయజ్ఞయాగాది కర్మలనే సర్వస్వమని తలచువారినింద ఈ దిగువ వచనములందును గాంచనగును.

**అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితమ్మన్యమానాః ।**

**జంఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః** ॥ముం.౧-౨-౮॥

**అవిద్యాయాం బహుధా వర్తమానాః వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః ।**

**యత్ కర్మిణో న ప్రవేదయన్తి రాగాత్ తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే** ॥ముం ౧-౨-౯॥

**ఇష్టాపూర్తం మన్యమానావరిష్ఠం 'నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః' ।**

**నాకస్య పృష్ఠే తే సుకృతే ఽను భూత్వేమం లోకం హీనతరం చావిశన్తి** ॥ముం ౧-౨-౧౦॥

వీని భావార్థమిట్లున్నది ౧ అవిద్య (అజ్ఞానము) యందు చిక్కుకొని స్వయముగా బుద్ధిమంతుడనని తలచు మూర్ఖుడు గ్రుడ్డివానివెంటనడచు గ్రుడ్డివానివలె అటు నిటు భ్రమించి తిరుగుచుండును ౨ అవిద్యయందు పడి యున్న మూర్ఖుడు తన్నుతాను కృతకృత్యుడనని యెంచి కూర్చుండిపోవును కర్మనొనర్చువారును రాగాదుల కారణమున జ్ఞానప్రాప్తినొందనప్పుడు దుఃఖితులై దుర్గతిపాలగుదురు. 3 యజ్ఞములు మరియు కూపములు, తటాకములు మున్నగువాని నిర్మాణముమే అన్నిటికన్న శ్రేష్ఠకర్మలని యెంచి

వీనికన్న ఆవశ్యకమగు ఉత్తమకర్మ లేవియును లేవని తలచి జ్ఞానహీనులై యుండు అత్యంత మూర్ఖులు తమ పుణ్యకర్మల ఫలము ననుభవించుచు హీనగతి నొందెదరు.

ధ్యానపూర్వకముగా మనమీ ప్రకరణమును చదివినపిదప మనకు దెలియున దేమనగా, ఈసింద వేదోక్త యజ్ఞములది గాదని, బాహ్యయజ్ఞములే సర్వస్వమని సంతృప్తులై బ్రహ్మ మరియు ఆత్మజ్ఞానమును ప్రాప్తించుకొను ప్రయత్నమైనను జేయని వారి విషయమే యని మనకు స్పష్టమగును. దీనిని వేదముల, మరియు వేదోక్త యజ్ఞముల నిందయని తలచువారు, ఉపనిషత్తులందు వేదవిరుద్ధక్రాంతి గలదని యనుకొనువారి భ్రమను తొలగించుటకు మాకీ వివేచనము ఆవశ్యకమనిపించినది.



ఓ౩మ్

# వేదముల యథార్థస్వరూపము

## ప్రథమాధ్యాయము

## ద్వితీయ ఖండము

### 1.20. మధ్యకాలీన ఆచార్యుల అభిప్రాయములు

మధ్యకాలమునందు శ్రీశంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, వల్లభాచార్యులు, నింబార్కాచార్యులు, స్కందస్వామి, భరతస్వామి, సాయణాచార్యులు, ఉవ్వటుడు, మహీధరుడు మున్నగు ఆచార్యులు వేదభాష్యకారులైనారు. వారెల్లరును వేదములను ఈశ్వరోక్తజ్ఞాన మని యంగీకరించుచు వానిని పరమ ప్రమాణముగ నంగీకరించినారు. శ్రీ శంకరాచార్యుల వేదాంతభాష్యమునుండి కొన్నియుదాహరణములు ఇదివరకే ఈయబడినవి. శ్రీ మధ్వాచార్యులు ద్వైతమత ప్రతిపాదన యందు సుప్రసిద్ధ ఆచార్యులై యుండిరి ఋగ్వేదము యొక్క మొదటి నలుబది (౪౦) సూక్తముల భాష్యమొనర్చి దాని ప్రారంభముననిట్లు వ్రాసెను

**మునిస్తు సర్వవిద్యానాం, భగవాన్ పురుషోత్తమః।**

**విశేషతశ్చ వేదానాం, యో బ్రాహ్మణమితి శ్రుతిః॥**

**ఋగ్వేదాదికమస్యైవ, శ్వసితం ప్రాహ చాపరః॥**

అనగా సకలవిద్యల, విశేషించి వేదముల జ్ఞానదాత విష్ణుభగవానుడే. ఎట్లన,

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై**

**తం హ దేవం ఆత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥** శ్వేతాశ్వతరశ్రుతి

రెండవ శ్రుతియగు బృహదారణ్యకోపనిషత్తునందు ''**ఏతస్య వా మహతో భూతస్య నిఃశ్వసితమేతద్ యద్ ఋగ్వేదో యజుర్వేదః, సామవేదోऽథర్వవేదః;**'' మున్నగువాని ద్వారా ఋగ్వేదాదులు భగవానుని శ్వాసరూపములని చెప్పబడినవి శ్రీ మధ్వాచార్యులు (స్వామీ ఆనందతీర్థులు) తన సిద్ధాంతముల సమర్థనకై బ్రహ్మసూత్రాది భాష్యములందు చాలవరకు వేదముల ప్రమాణములనే యుదాహరించినాడు అచ్చటచ్చట పురాణముల వచనములను సైతము తన గ్రంథములందు ఉదాహరించినాడు కాని స్పష్టముగా

**పురాణస్యోపజీవ్యశ్చ వేద ఏవ న చాపరః।**

**తద్విరోధే కథం మానం తత్తత్ర చ భవిష్యతి॥**

అనగా పురాణముల కాధారభూత ప్రమాణము వేదములేగాని వేరుకావని వ్రాసినాడు కావున వేదములకు విరుద్ధమగునవి ప్రమాణముగా ఎట్లు స్వీకరింపబడును? ఇదేవిధముగ ఇతర మధ్యకాలీనాచార్యుల

గ్రంథములనుండియును వేదముల మహత్త్వ విషయక ప్రమాణముల నీయవచ్చును. గ్రంథవిస్తరణ భీతిచే అట్లుచేయబడలేదు.

### 1.21. మధ్యకాలీన విద్వాంసుల కొన్ని భయంకరమైన పొరపాట్లు

మే మిప్పుడు వేదవిషయమునందు ప్రాచీన సర్వశాస్త్రసమ్మత సిద్ధాంతములను గూర్చి ఆర్వాచీన విద్వాంసుల ద్వారా యుక్తి యుక్తముగ సమర్థింపబడిన వివేచనమును ప్రారంభించుటకు పూర్వము మధ్యకాలీన విద్వాంసుల భయంకరమగు కొన్ని పొరపాట్లను నిర్దేశించుట ఆవశ్యకమని తలచుచున్నాము. ఈ కారణమునసే పాశ్చాత్య విద్వాంసు లనేకులు, మరియు వారి ననుసరించిన భారతీయులు వేదముల విషయమున భ్రాంతిపరులైనారు ఈ గ్రంథమునందు ప్రమాణయుక్తముగా వాని వివేచన మొనర్చబడినది కొన్ని ముఖ్య పొరపాట్లు దిగువ చూపబడినవి.

౧. వేదములనగా ఋగ్యజుస్సామాథర్వములను చతుర్వేద మంత్ర సంహితలనేగాక ఋషి కృతములగు బ్రాహ్మణ గ్రంథముల, ఉపనిషత్తులను ( యజుర్వేదము యొక్క '४०వ అధ్యాయమునందలి కొన్ని మంత్రములను వదలి ఈశోపనిషత్తు) వారు వేదములందు సమ్మిళితముమొనర్చినారు. వాస్తవమునకు బ్రాహ్మణ గ్రంథములు వేదముల వ్యాఖ్యాన రూపమేయై యున్నవి. వానియందనేక ఋషుల చరిత్రలు గూడా గాన్పించును. ఋషులు ఉపనిషత్తులను తమ యనుభవముల, మరియు వేదముల యాధారముగ నిర్మించారు. వానియందు వేదములు స్వయముగ పరమేశ్వరుని వచనములు, మరియు నిఃశ్వాసరూపములని నమ్మబడినది ఈ విషయమున మొదటనే ఉదాహరించబడినది.

౨. శ్రీ సాయణాచార్యుడు మున్నగు భాష్యకారులు గూడా వేదములు నిత్యములు మరియు అపౌరుషేయములని అంగీకరించినారు.

**'తస్మాదపౌరుషేయత్వాన్నిత్యత్వాచ్చ కృత్స్నస్యాపి వేదరాశేః' (అథర్వ భాష్యోపోద్ఘాతే) మరియు**

**యస్య నిఃశ్వసితం వేదాః, యో వేదేభ్యోఽఖిలం జగత్।**

**నిర్మమే తమహం వన్దే, విద్యాతీర్థమహేశ్వరమ్ ॥**

వేదభాష్యారంభమున వ్రాయబడిన ప్రతి శ్లోకముతో 'వేదములందు ఋషుల, మరియు రాజుల అనిత్య ఇతిహాసము సైతము గలదని ఎంచినారు. మరియు అట్టి యెంపిక యాధారముననే వేదమంత్రముల భాష్యమును వ్రాసినారు. ఇంతయే గాదు వారిట్టి అనేక అనుచితములగు కథలను కూడా వ్రాసినారు వానిని చదివిన ఏయాలోచనాపరుడైనను లజ్జితుడు కాగలడు. ఋషులనబడు వారు మంత్రకర్తలుగ నెంచినారు

**౩. 'ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః** ॥ఋగ్వే ౧-౧౬४-४౩॥

**య ఏక ఇత్ తము ష్టుహి కృష్టీనాం విచర్షణిః ॥ పతిర్జజ్ఞే వృషక్రతుః** ॥ ఋ ౬-४౫-౧౬

మున్నగు వందలాది మంత్రములందు స్పష్టముగా ఏకేశ్వరవాదము ప్రతి పాదించ బడినది. ఐనను వందలకొలది దేవీదేవతల పూజా విధానమును మధ్యకాలీన ఆచార్యులు, మరియు వేద భాష్యకారులు తమ గ్రంథములందు

వ్రాసినారు. వాస్తవముగనవి సంపూర్ణముగ వైదిక విద్యలకు విరుద్ధమైయున్నవి. ముందుకు నడచి ఈ విషయమునందు కొంత విస్తారముగ, సప్రమాణముగ వివేచన మొనర్చబడును.

**అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి । స ఇద్ దేవేషు గచ్ఛతి** ॥ ఋ. ౧-౧-౪॥

**దేవో దేవానామసి మిత్రో అద్భుతో వసుర్వసూనామసి చారురధ్వరే** ॥ఋ.౧-౯౪-౧౩॥

**భద్రో నో అగ్నిరాహుతో భద్రారాతిః సుభగా భద్రో అధ్వరః । భద్రా ఉత ప్రశస్తయః**

॥ ఋ.౮-౧౯-౧౯, సామ. య. ౧౧౧॥

ఇట్టి శతాధిక మంత్రములందు యజ్ఞము అధ్వర మనుపేరుతో పిలువబడినది. శ్రీ యాస్కాచార్యులు దానియర్థము తన నిరుక్తము నందు **'అధ్వర ఇతి యజ్ఞనామ ధ్వరతిర్హింసా కర్మా తత్ప్రతిషేధః'** ॥ నిరుక్త ౧-౭ ॥ వ్యుత్పత్తి ఆధారముపై హింసారహిత శుభకర్మలని తెలిపినారు. ఈమధ్యకాలీన ఆచార్యులెల్లరును యజ్ఞములందు మేకలు, అశ్వములు, గోవులు, ఎద్దులు మరియు ఇతర ప్రాణులే గాక మనుష్యుల హింస (చంపుట)ను గూడ శాస్త్రవిహితములు, స్వర్గప్రాప్తికి సోపానములని పుణ్యజనకము లనియు చూపినారు. దీనివల్ల బుద్ధ భగవానుడు మున్నగు వారికి ఇట్టి పశు హింసాత్మక యజ్ఞములకు విరుద్ధముగా గొప్ప ఆందోళనము జరుపవలసి వచ్చినది. చార్వాకము వంటి నాస్తిక మతముల యుత్పత్తి యందును ఇట్టి వేద విషయక అశుద్ధ ఆలోచనలే కారణమనిన అసత్యము గాదు.

**౪. యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః** ॥ యజు. ౨౬-౨ ॥

**పంచజనా మమ హోత్రం జుషధ్వమ్** ॥ ఋ.౧౦-౫౩-౪ ॥

**సమానం మన్త్రమభిమన్త్రయే వః** ॥ ఋ ౧౦-౧౯౧-౩॥

ఇట్టి అనేక మంత్రములందు మానవమాత్రులెల్లరకును వేదములను చదువుటకు, చదివించుటకు, యజ్ఞాదులను చేయుటకు, చేయించుటకు అధికారము గలదని యుండగా ఈ మధ్య కాలీన ఆచార్యులనేకులు స్త్రీశూద్రులను ఈ కర్తవ్య కర్మల నుండి వంచితుల నొనర్చినారు. దీనివల్ల వారు అజ్ఞానమను అగాధమునందు పడిపోవుచునే యున్నారు. మరియు పాఖండము వృద్ధియగుచునేయున్నది.

౫. పైవాని నాధారముగా గొని ''మూలవేదములందు కేవలము కర్మకాండయే గాని జ్ఞాన కర్మ ఉపాసనా సముచ్చయము లేదనియు, వాని వ్యాఖ్య ననుసరించి ఆకాలమున ప్రచలితమైయున్న పౌరాణిక, తాంత్రిక విశ్వాసముల మరియు ఆచార విచారములచే అనేక అంశములందు ప్రజలు ప్రభావితులైనారు. వేదములందు అగ్ని, ఇన్ద్ర, మిత్ర, వరుణ, సరస్వతి, రుద్ర, మరుతః మున్నగువాని స్తుతి ప్రార్థనలే గలవని, జీవనోపయోగము లగు తత్త్వముల, సదాచారముల, మానవ కర్తవ్య ప్రతిపాదక ఉపదేశము లందు లేవనియు వ్రాసిపెట్టినారు. అట్టి పురాణ గ్రంథములందు దేవీదేవతల చరిత్రములను దాదాపు అత్యంత హీనముగ చిత్రించినారు. మద్య మాంసాదుల సేవనము, జూదములు, ప్రయోగములు, తంత్రములు మున్నగు అనేక అంశములు వేదములందు నిండియున్న వని వ్రాసినారు. వాస్తవముగా వారి వ్రాతలు మిక్కిలి ఏహ్యములు, జుగుప్సాకరములునై యున్నవి. రాబోవు

ప్రకరణములందు ఇవి వివరముగ చూపబడును. పాశ్చాత్య విద్వాంసు లనేకులు ఈ మధ్యకాలీన వేద భాష్యములను అధికాధికముగా అనుసరించినారు. పక్షపాతముతో నిండిన కల్పనలను తమ ఈసాయి మత శ్రేష్ఠత్వమును ప్రతిపాదన మొనర్చుకొనుటకు, తమ ప్రచార సాధనమునకు ఉపయోగించుకొనినారు. ఇందువల్ల వారు వేదముల యథార్థ విశుద్ధ స్వరూపమును దెలిసి కొనుటయందసమర్థులైనారు. మరియు ఇతరులను సైతము పథభ్రష్టుల నొనర్చుటకు కారణమైనారు. ఈమధ్యకాలీన సాయణాచార్య, ఉవ్వట మున్నగువారు వ్యాకరణాదుల విద్వాంసులై యుండియును, యోగులు, ఋషులు గాకుండినందున వారికి వేదాంతర్గత వివిధ విద్యల జ్ఞానము లేకుండెను కావున **'నహ్యేషు ప్రత్యక్షమస్త్యనృషేరతపసో వా।.... పారోవర్యవిత్సు తు ఖలు వేదితృషు భూయో విద్యః ప్రశస్యో భవతి ॥** నిరుక్త ౧-౧౮॥ ఈ వచనము ననుసరించి 'ఋషులు' మరియు తాపసులు గాని వారు వేద మంత్రార్థముల సాక్షాత్కార మొనర్చుకొనజాలరు వేద పఠన మొనర్చువారిలో వివిధ విద్యల నెంత అధికముగా నెరుగువా రెంద రుందురో వారంతగా ప్రశంసనీయులై యుందురు మరియు నట్టివారే వేదముల వాస్తవికార్థముల నెరుగుటయందు సమర్థులై యుందురు వీరు వేద మంత్రముల రహస్యము నెరుగుటలో ప్రాయః అసమర్థులగుటవలన అనేక స్థానములందు ఇట్టి అశ్లీల, మరియు భ్రష్టార్థముల నొనర్చి వేదములను కళంకితపరచినారు అట్టివానిని చదువునప్పుడు లజ్జాభారముతో తల వంగిపోగలదు. ఇట్టి పొరపాట్లను మరియు వాని పరిణామములను మేము ప్రకరణానుసారముగా రాబోవు అధ్యాయములందు ప్రదర్శించగలము ఈ మధ్యకాలీన రచనలందు పరస్పర విరుద్ధత్వము అసంగతత్వము, సామాన్యముగ బుద్ధిహీనత్వము అనేక స్థానములందు గాన్పించును

## 1.22. మహాత్మా గౌతమ బుద్ధుడు- వేదములు

మహాత్ముడగు గౌతమ బుద్ధుడు ఒక జగద్విఖ్యాత మహాపురుషుడై యుండెను. ఈయన ౨౫౦౦ వ జయంతిని ప్రపంచమంతటను గొప్ప ఆడంబరముగ గత వైశాఖ పూర్ణిమ దినమున జరుపబడినది ఈయన గొప్ప సంస్కర్తయై యుండెను జన్మ సిద్ధజాతి భేదములు, యజ్ఞములందు పశుబలులు మున్నగు కురీతులను దూరమొనర్చుటకాయన ప్రశంసనీయమగు ప్రయత్నము నొనర్చినాడు ఆ విషయమునందు ఆయన వేదములకు ప్రబల విరోధియై యుండెనని తలచబడుచున్నది. వాస్తవముగ నాతడు వేదముల మరియు నిజమైన ధార్మిక వేదజ్ఞుల యెడ గొప్ప ఆదరభావము గలిగి యుండెను. ఇట్టి విషయ మాతని 'సుత్తనిపాతా' ది గ్రంథముల వలన స్పష్టమగుచున్నది అందుకొన్ని అతిస్పష్ట వచనముల నిచ్చుట ఉల్లేఖింతుము.

## 1.23. వేదజ్ఞుల మహత్త్వము

వేదవేత్తల, లేక వేదిజ్ఞుల మహత్త్వమును మహాత్మా బుద్ధుడిట్లు తెలిపినాడు.

**'సమం సమాదాయ వతాని జన్తు ఉచ్చావచం గచ్ఛతి సఞ్ఞసత్తో ।**

**విద్వా చ వేదేహి సమేచ్చ ధమ్మం, న ఉచ్చావచం గచ్ఛతి భూరిపఞ్ఞో ॥॥** సుత్తనిపాత ౨౯౨॥

అనగా ఇంద్రియములను స్వాధీనమునం దుంచుకొని ఇచ్ఛానుసారముగ కర్మల మరియు తపముల నొనర్చుచు లోకులు ఉచ్చనీచావస్థలను పొందుదురు. కాని

**'విద్వాంశ్చ వేదైః సమేత్య ధర్మం, నోచ్చావచం గచ్ఛతి భూరిప్రజ్ఞః'।**

వేదముల ద్వారా ధర్మ జ్ఞానముల ప్రాప్తించుకొను విద్వాంసులు చంచలావస్థ యందు జిక్కుకొనకుందురు.

ఈ శ్లోకముచే బుద్ధ భగవానునకు వేదముల యెడ గల గొప్ప శ్రద్ధ సూచితమగుచున్నది. మరియు వాస్తవమగు ధర్మ జ్ఞానములు వేదముల ద్వారానే సాధింపబడగలవను అభిప్రాయమాతనికి గలదని స్పష్టమగుచున్నది.

సుత్తనిపాతమునందలి 3౨౨వ శ్లోకము (నాబాసుత్తము) నందిట్లు తెలిపినాడు.

**ఏవం పి యో వేదగు భావితత్తో, బహుస్సుతో హోతి అవేధ ధమ్మో।**

**సో ఖో పరే నిజ్ఞపయే పజానాం, సోతోవధానూపనిసూపపన్నో॥**

వేదముల నెరిగినవారు, తమను స్వాధీనమునందుచుకొనువారు బహు శ్రుతులు, నిశ్చయ పూర్వకముగ ధర్మము నెరిగినవారు. స్వయముగ వాస్తవ జ్ఞానులై ఇతరులకు శిక్షణనిచ్చుట యందు శక్తి గలవారు మాత్రమే జ్ఞానము నిచ్చుటకు సమర్థులు గాగలరు

వేదములనెరుగు ధర్మాత్ములు, సంయమము గలవారే ఇతరులకు సత్యజ్ఞానము నీయజాలుదు రని బుద్ధ భగవానుడు స్పష్టపరచినాడు. దీనివల్ల నాతనికి వేదములు, నిజమైన ధర్మాత్ములు, వేదజ్ఞుల యెడ అధికశ్రద్ధ గలదని తెలియుచున్నది. సుత్తనిపాతమందలి ౫౦3 శ్లోకమునందు మహాత్మా గౌతమ బుద్ధు డీ విధముగా తెలిపియున్నాడు.

**యో వేదగూ జ్ఞానరతో సతీమా, సమ్బోధిపత్తో సరణం బహూనామ్।**

**కాలేన తమ్హి హవ్యం పవేచ్ఛే, యో బ్రాహ్మణో పుఞ్ఞపేఖో యజేథ॥**

దీని సంస్కృతానువాదము

**యో వేదజ్ఞో ధ్యానరతః స్మృతిమాన్, సంబోధప్రాప్తః శరణం బహూనామ్।**

**కాలేన తం హి హవ్యం ప్రవేశయేత్, యో బ్రాహ్మణః పుణ్యప్రేక్షోయజేత॥**

వేదములనెరుగు వారు, ధ్యాన పరాయణులు, ఉత్తమ స్మృతిమంతులగు జ్ఞానులు, అనేకులకు శరణము నిచ్చువారు, పుణ్యమునుగోరి యజ్ఞములనొనర్చువారు, అతిథులను సత్కరించు ఉత్తమ గుణములు గల వేదజ్ఞుల యెడ (వేదశిక్షణానుసారము ఆచరించువారి యెడ) బుద్ధభగవానునకు ఎంతో ఆదర భావము గలదని పై శ్లోకము వల్ల స్పష్టమగుచున్నది.

వేదజ్ఞ బ్రాహ్మణ ప్రశంస :-

సుత్తనిపాతమందలి ౧౦౫౯వ శ్లోకమందు బుద్ధుని ఈ దిగువ ఉక్తి గలదు. ''యం బ్రాహ్మణం వేదగుం అభిజఞ్ఞా, అకించనం కామభవే అసత్తమ్।''

**అద్ధా హి సో ఓఘమిమీం అతారి, తిణ్ణో చ పారం అఖిలో అకంఖో॥**

దీని సంస్కృతానువాదము

**యం బ్రాహ్మణం వేదజ్ఞం అభిజ్ఞాతవాన్, అకిఞ్చనం కామభవే అసక్తమ్ ।**

**అద్ధా హి స ఓఘమిమం అతారీత్ తీర్ణశ్చ పారం అఖిలః అకాంక్షః ॥**

వేదజ్ఞులగు బ్రాహ్మణులను చక్కగా దెలిసికొనినవారు, తమ వద్ద ధనము లేకున్నను సాంసారిక కామితములందాసక్తులు గానివారగు ఆకాంక్షా రహితులు మాత్రమే నిజముగా ఈ సంసార సాగరము నుండి తరించగలరు. మరియు సుత్తనిపాత ౧౦౬౦వ శ్లోకము నందిట్లు దెలిపియున్నాడు

**విద్వా చ సో వేదగూ నరో ఇధ, భవాభవే సంగం ఇమం విసజ్జా ।**

**సో వీతతణ్హో అనిఘో నిరాసో, అతారి సో జాతి జరాంతి బ్రూమీతి ॥**

**దీని సంస్కృతానువాదము**

**విద్వాంశ్చ స వేదజ్ఞో నరః ఇహ, భవాభవే సంగమిమం విసృజ్య ।**

**సవీతతృష్ణోఽనఘో నిరాశీః అతారీత్ స జాతిజరామితి బ్రవీమి ॥**

అనగా, వేదములనెరుగు విద్వాంసులు ఈ విశ్వ మందలి జనన మరణము లందాసక్తి భయములను పరిత్యజించి తృష్ణా పాపములు మరియు జన్మజరామృత్యువులనుండి విముక్తులై యుందురని నా యభిప్రాయము

ఇచ్చట గూడ యథార్థ వేదజ్ఞ బ్రాహ్మణుల యెడ బుద్ధ భగవానునకు ఆదర భావము గలదని స్పష్టమగుచున్నది వేదనిందకుని, నాస్తికుని మనోభావము లెప్పుడును పై శ్లోకములందు సూచించునట్లుండవు గదా!

సుత్తినిపాతము ౮౪౬ వ శ్లోకము నిచ్చట ఉదహరించుచు ఈ ప్రసంగము నిచ్చటనే ముగించుచున్నాను అందిట్లున్నది.

**న వేదగూ దిట్ఠియా న ముతియా స మానమేతి నహి తన్మయోసో।**

**న కమ్మునా నాపి సుతేన నేయ్యో అనూపనీతో సో నివేశనేసు ॥**

**సంస్కృతానువాదము**

న వేదజ్ఞో దృష్ట్యా న మిథ్యా సమానమేతి నహి తన్మయః సః ।

న కర్మణా నాపి శ్రుతేన నేయః అనూపనీతః స నివేశనేషు ॥

వేదముల నెరిగినవాడు ప్రపంచ వ్యామోహముచే, అసత్యాలోచనలచే ఎప్పుడును అహంకారము గలిగియుండడు అతడెట్టి భ్రమల యందును బడిపోవకుండును. కేవల కర్మచే మరియు శ్రవణాదులచే ప్రేరితుడు గాకుండును. ఈ విధమగు నిష్పక్ష భావముల అనుశీలనము వల్ల 'బుద్ధ భగవానుడు వేదముల మరియు వేదజ్ఞుల యెడ గొప్ప ఆదర భావము గలవాడై యుండె' నను పరిణామమునకు చేరుదుము బుద్ధ భగవానుడు వేదముల, మరియు వేదజ్ఞుల యెడ అనాదర భావము గలిగియుండెననుట సరిగాదు. పవిత్రాచరణ లేని వారి యెడ, యజ్ఞములందు పశుహింసలు మున్నగు ప్రాచీన ధర్మ విరుద్ధ కార్యములన్నియు నిందనీయములని తెలిపినాడు.

నామమాత్ర వేదపాఠకులను సైతము ఆయన ఏవగించుకొనినాడు. ఇట్టివానిని వేదముల, వేదజ్ఞుల మరియు వాస్తవమగు ధర్మాత్ముల నిందకుడని తలచుట గొప్ప భ్రమయే యగును. **'సున్దరిక భారద్వాజ సుత్తము'** నందొక కధ యిట్లున్నది. ''సున్దరిక భారద్వాజుడు యజ్ఞమును ముగించుకొని యజ్ఞశేషము నొక సద్బ్రాహ్మణున కీయదలచియుండెను. ఆతడు సంన్యాసియగు గౌతమ బుద్ధుని జూచి ఆతని జాతిని గూర్చి ప్రశ్నించెను అప్పుడాయన ఈ విధమగు సమాధానము నిచ్చినాడు. మహాశయా! జాతిని గురించి ప్రశ్నించవలదు. నేను బ్రాహ్మణుడ నని తెలిపి బుద్ధు డాతనికి ఇట్లు సత్యోపదేశ మొనర్చెను. **''యదన్తగూ వేదగూ యఞ్ఞకాలే, యస్సాహుతి లభే తరస ఇజ్ఝేతి బ్రూమి''** (సుత్తనిపాత ४७०॥)

అనగా, వేదములను చక్కగా నెరిగినవాడెవరి ఆహుతులను ప్రాప్తించుకొనునో వారి యజ్ఞములు సఫలమగునని నేను చెప్పుచున్నాను. ఇంతకన్నను స్పష్టమేమన ఆయన వేదముల, వేదజ్ఞుల, యజ్ఞముల యెడ గొప్ప ఆదరభావము గలవాడు ఇట్టి వానిని 'నాస్తికు' డని యెట్లనగలము? సుందరిక భారద్వాజుడు గాద్గదిక స్వరమున ''మహా పురుషా! నా యజ్ఞము సఫలమైనది. మీవంటి వేదజ్ఞుడగు మహా పురుషుని దర్శనమున నా జన్మ పావనమైనది. ఒక వేళ తమ దర్శనము గాకున్న నా యజ్ఞశేషము నెవడో యొక సామాన్య వ్యక్తి దినివేసెడివా'' డని యనినాడు.

## 1.24. గౌతముని వేదాధ్యయనము

సిద్ధార్థ గౌతమ బుద్ధుడు బ్రహ్మచర్య దీక్షతో నియమపూర్వకముగ వేదాధ్యయన మొనర్చినాడని 'లలిత విస్తర' మను పేరు గల బుద్ధుని జీవిత చరిత్ర యందు స్పష్టముగా వ్రాయబడియున్నది.

**స బ్రహ్మచారీ గురుగేహ వాసీ, తత్కార్యకారీ విహితాన్నభోజీ।**

**సాయం ప్రభాతం చ హుతాశసేవీ, వ్రతేన వేదాంశ్చ సమధ్యగీష్ట॥**

భావమేమన, ఆ సిద్ధార్థ గౌతముడు బ్రహ్మచారియై గురుకులమున గురువుల సేవలొనర్చుచు శాస్త్రానుకూల భోజనము, ప్రాతః సాయం సమయములందు యజ్ఞముల నొనర్చుచు వ్రత ధారియై వేదాధ్యయనమొనర్చినాడు.

వేదముల, యజ్ఞముల విషయమునం దాయనకు ఎంత యాదర భావముండెనో (విస్తరణ భయముతో ఇచ్చట క్లుప్తంగా నీయబడినది) దీని వల్ల విదితము కాగలదు ఐతే గౌతమ బుద్ధుడు వేద నిందకుడని ఎట్లు ప్రసిద్ధుడైనాడు? ఆతని అనుయాయులు వేద విముఖులు మరియు నాస్తికులుగా ఎట్లు మారినా రను ప్రశ్న యుత్పన్నమగుచున్నది. ఈవిషయమిట్లు జరిగియుండు ననిపించుచున్నది. గౌతమబుద్ధుడు బాల్యావస్థయందు గురుకులమున వేదాధ్యయన మొనర్చినాడు. ఆయనకు వేదములయందు శ్రద్ధా భక్తి విశ్వాసము లుండెను ఐనను ఆయన వేదములందు ధురంధర విద్వాంసుడు గాకుండెను. సుత్తనిపాత్తమందలి కలహ వివాద, సుత్త, చూల్ వియూహసుత్తమను పుస్తకముల యధ్యయనము చే మహాత్ముడగు బుద్ధుడు వాద వివాదములకు దూరముగ నుండుటనే గోరుచుండె నని ఆయన శిష్యులను సైత మదే విధముగ నుండుట కాదేశించుచుండె నని స్పష్టమగుచున్నది. ఆకాలములో యజ్ఞములందు పశు హింసాపరులగు కొందరు బ్రాహ్మణులు వేదముల పేరుతో హింసలను సమర్థించుచు శాస్త్రార్థ వాద వివాదములకు పిలిచిన వానికి విముఖుడై యుండవచ్చును. (వేదశాస్త్రార్థము

మరియు వాద వివాదమునందు వేదములందు ధురంధరులై యుండు టావశ్యకము) వేదములందు పశు హింస సమర్థించబడిన దనుదానిని నేనంగీకరించను. ఒకవేళ వేదములు హింసను సమర్థించుచో) నేనట్టి వేదములను సైతము నమ్ముటకు సిద్ధముగా లే నని యనియుండవచ్చును. ఇట్లు వ్రాయునప్పుడు నాకు గాంధీ మహాత్ముని దిగువ విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది.

క్రీ శ. ౧౯౩౩ మార్చి నెల ౬వ తేదీ మాట యిది. వార్తాలాప సందర్భమున గాంధీ మహాత్ముడు నాతో నిట్లనినాడు. ''పూనే మున్నగు స్థానములనుండి అనేక పండితులు నావద్దకు వచ్చి మీరు హింసను సమర్థించరు. కాని వేదములందు అశ్వములు, వృషభములు, గోవులు, మేకలు మున్నగువానిని యజ్ఞములందు బలియిచ్చు విధానము గలదని యనుచుందురు. వేదములవంటి పవిత్రగ్రంథములం దిట్టి నీతి విరుద్ధ, బుద్ధివిరుద్ధ విషయము లుండవని నేనందును. వారు గట్టిగా వాదించినప్పుడు నిజముగా వేదములు హింసను సమర్థించినట్లైన అట్టివేదములను గూడ నేను నమ్ముటకు సిద్ధముగా లేనని యన్నానని'' తెలిపినాడు అప్పుడు నేను పూజ్యమహాత్మా! మీనోటి నుండి ఇట్టి విషయములు శోభావంతముగ లేవు. బుద్ధుని అనుయాయులవలె మీయనుయాయులును నాస్తికు లగుదురు గదా! వేదములందు పశు హింసాత్మక యజ్ఞవిధానము నిజముగా లేదుగదా! అనియంటిని. అందుకు వారు, నేనుకూడా దీనిని నమ్మను, నేను వేద విద్వాంసునిగాదు గదా! నే నేపండితులతో శాస్త్రార్థమొనర్పలే నని యనినారు. ''మీయాజ్ఞయగుచో ఆ విద్వాంసులతో నేను శాస్త్రార్థమొనర్ప గలను కాని మీముఖమునుండి ఇట్టి వాక్యములు శోభించ''వని యన్నాను.

బుద్ధమహాత్ముని వేదవిషయక మనోవృత్తియును గాంధీ మహాత్ముని వలెనే యనిపించుచున్నది. 'బ్రాహ్మణ ధమ్మిక సుత్త' మున్నగు గ్రంథముల ద్వారా స్పష్టమగున దేమన పశుహింసాత్మక యజ్ఞముల నాతడు వేదవిహితములని విశ్వసించక వానిని ధూర్తుల ప్రక్షిప్తములని నమ్ముచుండెను. వేదములు 'పశుహింసాత్మకము' అను కల్పిత నిందల నాతడు విశ్వసించకుండెను. కాని శాస్త్రార్థములకు తగి న యోగ్యత, మరియు అభిరుచి యుండని కారణమున ఎప్పుడైన ఆయన ముఖమునుండి 'వేదములందట్టి విధానమున్నచో నేను వానిని కూడా నమ్ముటకు సిద్ధముగా లేనను వాక్యము వెళ్ళి యుండెనేమో, ఇదియే వేదనింద, వేదములపై అవిశ్వాస రూపమున ప్రచారము జరిగి యుండుటయును సంభవమే.

### 1.25. గురుగ్రంథసాహెబు - వేదములు.

వేదముల విషయమున మధ్యకాలీన విద్వాంసుల, మరియు భాష్యకారుల యభిప్రాయముల చర్చ నొనర్చుచు సిక్కు-మత ప్రవర్తకులగు నానక్ గురువుల, మరియు ఇతర గురువుల అభిప్రాయముల నుల్లేఖించుట ఉచిత మనిపించుచున్నది.

వారు వేదవిషయములో అనేక స్థానములందు తమ భక్తివిశ్వాసములను ప్రదర్శించియుండిరి. దీనిని ప్రత్యక్షముగ పేర్కొను టావశ్యక మనిపించుచున్నది. ఏలన వర్తమానకాలమున సిక్కు- లనేకులు వేద విముఖులు, విరోధులు నైయున్నారు, మరియు అనేకులు తాము ఆర్యహిందువులకు భిన్నమనియే తలచుచున్నారు.

స్పష్టమగు కొన్ని ముఖ్యవచనములను ఇచ్చుట ఉదాహరించబడుచున్నది.

**౧. ‘ఓంకారవేదనిరమయే’** (రాగరామకలీ మహలా ౧, ఓంకారశబ్దము ౧)

అనగా పరమేశ్వరుడు వేదములను నిర్మించినాడు.

**౨. ‘హరి ఆజ్ఞా హోయే’ వేద పాప పున్న విచారి ఆ** (మారుడఖణే మహలా ౫ శబ్ద ౧)

పరమేశ్వరు నాజ్ఞతో వేదములైనవి. వానివల్ల మానవుడు పాపపుణ్యముల నాలోచించగలుగును.

**3. సామవేద, ఋగ్జ జుర అథర్వణ । బ్రహ్మే ముఖ మాఇయాహై త్రై గుణ ।**

**తాకీ కీమత కీత కహ న సకై తిఉ బోలై జిఉ బోలాఇద ॥ (మారుసోలహే మహలా ౧ శబ్ద ౧౭)**

ఇచ్చుట గూడ నాలుగువేదముల నుట్టంకించుచు ‘అవి అమూల్యములు, అనంతములు, మరియు వాని విలువ (మహత్త్వము) నెవ్వరును వర్ణింపజాల’ రని కలదు. ౪..

**ఓంకార ఉత్పాతీ । కియా దివస సభరాతీ వణత్రిణత్రిభవన పాణీ । చారవేద చారే ఖాణీ ॥**

(రాగ మారు మహలా ౫ శబ్ద ౧౭)

ఓంకారము (పరమేశ్వరుడు) మాత్రమే దివా రాత్రములను, వన తృణ ములను, ముల్లోకములను, జలము మున్నగు వానిని రచించినాడు. మరియు నాతడే చతుర్వేదములను నాలుగు గనుల (జ్ఞానకోశముల) వలె సృష్టించినాడు.

వసంత అష్టపదియాం మహలా ౧ అ. 3 లో వేదజ్ఞానము యొక్క అనంతత్వ వర్ణన ఈదిగువ శబ్దముల యందు గలదు.

**౫. వేద బఖాన కహహి ఇక కహియే । ఓహ బేఅన్త అన్త కిన లహియే?**

వేదజ్ఞానముచే అజ్ఞానము నశించును. వాని పఠనము వల్ల బుద్ధి శుద్ధమై పాపములు నశించును. ఈ విషయము నిమ్న శబ్దములందు సూచించబడినది.

**౬. దీవా తలేఅన్ధేరా జాఈ । వేద పాఠ మతి పాపా ఖాఈ । ఉగవై సూర న జాపై చన్ద, జహ గియాన (జ్ఞాన) ప్రగాస అగియాన మిటన్త ।**

అనంతమగు గ్రంథములున్నను అన్నిటికన్న వేదపఠనము ముఖ్యమైయున్నది. ఈవిషయము జపూజీ ౧౭ లో దిగువ శబ్దములలో వర్ణించబడియున్నది.

**౭. అసంఖ గ్రన్థ ముఖి వేద పాఠ**

వేదశాస్త్రములందు ముఖ్యముగా పరబ్రహ్మను గూర్చియే ప్రతిపాదించబడియున్నది. ఈవచనమునందు ‘సర్వే దేవా యత్పదమామనన్తి’ ననుసరించి గౌండ మహలా ౫ శబ్ద ౧౭ నందు ఈవిధముగా చూపబడియున్నది.

**౮. స్మృతి సాసత్ర (శాస్త్ర) వేద పురాణ । పార బ్రహ్మ కా కరహిం బఖియాణ ॥**

౯ సాధు సజ్జనులు సదా వేదవ్యాఖ్యానమొనర్చెదరు. కాని భాగ్యహీనులు, నీచమానవులు ఏమియును దెలిసికొనజాలరు. ఈవిషయమును టోడిమహలా ౫ శబ్దము ౨౯.లో దిగువ విధముగా తెలుపబడినది.

**'వేద బఖియాన కరత సాధుజన, భాగహీన సమఝత నహీం'**

౧౦. వేదములు చదువుటవల్ల, ఈశ్వరకృపవల్ల ఉత్తమ విద్యలు పెంపొందును. ఈవిషయమును సలోక సహస్కృత మహలా ౫-౧౪ యందు దిగువ శబ్దములలో వర్ణించబడినది.

**'కహంత వేదా గుణన్త గుణియా, సుణత బాలా వహ విధి ప్రకారా।**

**దృఢంత సువిద్యా హరి హరి కృపాలా' ॥**

౧౧. గాథా మహలా ౫-౨౦ లో వేదశాస్త్రములను చదువుటవల్ల పరమేశ్వరుని స్మరణ మగుచున్నది. అట్టి వారి వంశము తరించుచున్నది. ఈవిషయము నిమ్నశబ్దముల ద్వారా సూచితమొనర్చబడియున్నది.

**'వేద పురాణ సాసత్ర విచారం, ఏకం కార నామ ఉరధారం।**

**కులహ సమూహ సగల ఉదారం, బడభాగీ నానక కో తారం॥'**

౧౨. వేదములందు ఏకేశ్వరోపాసనయే ఉపదేశించబడినది. ఈవిషయమును రాగ సోరఠ మహలా ౯ శబ్దము ౫ లో దిగువ శబ్దముల ద్వారా ప్రకటించబడినది

**'కల మే ఏక నామ కృపానిధి జాహి జపే గతి పావై।**

**ఔర ధరమ తాకే సమ నాహన ఇహ విధి వేద బతావై॥**

౧౩. కబీర్‌గారి దిగువ వచనములు కూడా విశేషరూపమున ఉల్లేఖించదగినవై యున్నవి. వీనిని గురుగ్రంథ సాహెబు యొక్క రాగ ప్రభాతీ కబీరజీ 3వ శబ్దము నందు జూడనగును. ఈప్రకరణమునకివి మహత్త్వపూర్ణమైనవి

**'వేద కతేబ కహహు మత ఝూఠే ఝూఠా జో న విచారే॥'**

వేదశాస్త్రములను బూటకములని యనకుము. వీనిపై మనన మొనర్చక వాగు నాతడే బూటకము లాడువాడని తలచుము.

౧౪. దశమ గురు గ్రంథసాహెబులో వేదప్రశంసను గూర్చిన అనేక ఉపదేశము లున్నవి. వానినుండి 'విచిత్రనాటక'౪ వ అధ్యాయమందలి గురు గోవిందసింహుల దిగువ శబ్దములు ఉద్ధృత పరచబడుచున్నవి'

(భుజంగ ప్రయాసఛందము)

**జినై వేద పఠ్యో సువేదీ కహాఏ, తినే ధరమ కే కరమ నీకే చలాఏ।**

**పఠే కాగదం మద్ర రాజా సుధారం, ఆపో ఆపమే వైరభావం విసారం॥౧॥**

**నృపం ముకలియం దూత సో కాసీ ఆయం, సబై వేదియం భేద బాఖే సునాయం।**

**సభే వేద పాఠీ చలే మద్ర దేశే, ప్రణామం కియో ఆన కై కై నరేసే॥౨॥**

**ధునం వేదకీ భూప తాతే కరాఈ, సభేపాస బైఠే సభా బీచ భాఈ।**

**పడే సామవేదం జజారవేదకత్థం, ఋగం వేద పాఠ్యం కరే భావ హత్థం॥3॥** (రసావల ఛన్ద :-)
**'అథరవేద పఠయం। సునియో పాప నఠియం। రహా రీఝ రాజా।దీఆ సరబ సాజా ॥4॥**

ఈవర్ణనమందు 'వేదములను చదివిన వారు **'వేది'** యనబడుదు' రని కలదు. (గురుగోవిందుల వారి జననము వైదిక పరివారమునందే జరిగినది) వారు ఉత్తమ ధర్మ సంబంధకర్మలను నడపినారు. వేదపాఠకులు 'మద్ర' దేశమునకు వెళ్ళినప్పు డచ్చటి రాజు వారికి ప్రణామ మొనర్చినాడు. అట్టి వేదపాఠకుల ద్వారా రాజు వేదపఠన మొనర్పజేసినాడు. సామవేదము, యజుర్వేదము, ఋగ్వేదము, అథర్వవేదములను చతుర్వేద పఠన మొనర్పజేసినాడు. వానిని వినుటవల్ల పాపములు పటాపంచలైపోయినవి. రా జత్యంత ప్రసన్నుడై వేదపాఠకులకు భూరి దక్షిణ లిచ్చినాడు. ఇట్టివే అనేక వచనము లందుగలవు. ఈవిధముగ వేదముల పవిత్రత, మరియు వాని శ్రేష్ఠత్వమును గూర్చిన ప్రతిపాదన మందు గలదు.

**చార దీవే చహూ హథ దీఏ. ఏకా ఏకీ వారీ ॥** వసంత హిండోల మహలా ౧శబ్దము ౧ ॥

ఒక వచనమందు నలుగురు ఋషుల ద్వారా నాలుగు వేదములు ప్రతిపాదించబడిన వను స్పష్టమగు వర్ణనగలదు. మరియు,

దీని భావమేమనగా : చార దీవే ( దీపములు) అనగా నాల్గు వేదములు ( చహ హధ దీఏ) అగ్ని, వాయువు, ఆదిత్య, అంగిరా యను నలుగురి ద్వారా ఒకేసారి ఈయబడినవి. ( అనగా సృష్ట్యారంభములో నాల్గువేదములు నలుగురు ఋషులద్వారా ప్రకటింపబడినవి) గురువచనములం దెచ్చటనైన వేదనింద యని తోచిన నది వేదముల నిందగాదు. అది కేవలము వేదపాఠ మొనర్చియును వాని ననుసరిరంచి పవిత్రాచరణ లేనివారి నింద యని తలచ వలయును.

ఈ ప్రకారముగా గురు గ్రంథ సాహెబు నందలి అనేక వచనముల ద్వారా వేదముల మహత్త్వము, మరియు వాని ఈశ్వరీయత్వము స్పష్టముగ సూచితమగుచున్నది.

దురహంకారి, మతాంధకారి, కుఖ్యాతుడగు ఔరంగజేబు జ్యేష్ఠభ్రాతయగు 'దారాశికోహ' యను నాతడు వేదమహత్త్వమును గూర్చి విశేషముగా వ్రాసియున్నాడు. ఆయన 'ఈశోపనిషత్తు', మరియు ఇతర ఉపనిషత్తుల యనువాదము పారశీక భాషయం దొనర్చినాడు. ఆతడు వేదములు ఈశ్వరీయ జ్ఞానమని విశ్వసించినాడు. కురానులోని అనేక స్థానములందు ఈశ్వరీయ జ్ఞానము యొక్క సంకేతముగలదు. వానియందు వేదజ్ఞానముకన్న మించి ఏమియును లేదని తలచినాడు. ఆతని యాలోచనలు మేము'వేదముల మహత్త్వము, మరియు దాని కారణ' మను విషయమును ద్వితీయాధ్యాయమునందు వ్రాయుదుము. అనేక అన్యమతావలంబు లగు విద్వాంసులు వేదముల ఉన్నత ఉపదేశములచే ప్రభావితులై ప్రకటించిన వచనములను గూర్చియు ఆ యధ్యాయమునందే చూపుదుము. ఇప్పు డిచ్చట సంక్షిప్తముగ వర్తమానకాలపు విద్వాంసుల వేదవిషయక అభిప్రాయములను మాత్రమే చూపుచున్నాము. ఇందు కవసరమగు వివేచనము ఈగ్రంథమునందలి ఇతర అధ్యాయములందు ప్రకరణానుసారము చేయబడును.



# వేదముల యథార్థ స్వరూపము

## మొదటిధ్యాయము

## తృతీయ ఖణ్డము

### 1.26. వేదముల విషయమున వర్తమానకాలపు విద్వాంసుల యభిప్రాయములు.

వర్తమాన యుగమునందు పాశ్చాత్య విద్వాంసు లనేకులు వేదముల విషయములో ఎంతయో వ్రాసియున్నారు వారియందు ప్రొ.మైక్స్‌మూలర్, రోజక్, లుడ్వింగ్, గ్రాస్‌మన్, (వేదముల జర్మనీభాషానువాదకుడు) ఓల్డెన్ బర్గ్, డా. వీబర్, కోల్‌బ్రుక్, సర్ విలియం జోన్స్, బర్నఫ్, రుడాల్ఫ్‌రాథ్ , విల్సన్ (సాయణుని ఋగ్వేదభాష్యమునకు ఆంగ్లనువాదకుడు) బ్లూమ్‌ఫీల్డు, హ్విట్నీ, (అథర్వవేద ఆంగ్లభాషానువాదకుడు) కీథ్, మైక్డోనల్, హ్వింటసీజ్, జైకోబీ, గ్రిఫిథ్, (నాల్గువేదముల ఆంగ్లభాషానువాదకుడు) రెవరెండు స్టీవన్సన్ (సామవేద ఆంగ్లభాషానువాదకుడు) మున్నగువారు గొప్ప ప్రసిద్ధిగలవారు. ఇందులో 'రాథ్' వంటి కొందరు విద్వాంసులను వదలి మిగిలినవారు సాయణ, మహీధరాది పౌరాణిక భాష్యకారుల అనుయాయులైయుండిరి విల్సన్ అనునాతడు సాయణుని ఋగ్వేదభాష్యమునకు ఆంగ్లభాషానువాదకుడైయుండగా ఇతరులు సైతము దాదాపు ఆతని మరియు మధ్యకాలీనులగు పౌరాణిక, మరియు వామమార్గీయులగు మహీధరాదుల ననుసరించినారు. కావుననే వారి గ్రంధములందు అనేక దోషములు గాననగును వానిని మేము ఇదివరకు కొంతనిర్దేశమొర్చియుంటిమి. 'గ్రిఫిథ్' తన యజుర్వేదానువాద భూమిక యందు స్పష్టముగ వ్రాసియున్నాడు.

"All that I have attempted to do is to give a faithful translation to the best of my ability, of the texts and sacrificial formulas of the Vedas with just sufficient commentary chiefly from Mahidhar to make them intelligible."

అనగా, నేను నా యోగ్యతానుసారము మహీధరుని భాష్యమునే ఆధారముగాగొని వేద మంత్రముల, మరియు యాజ్ఞిక ప్రక్రియలకు యథాతథముగా అనువాదమొనర్చినాను. పాఠకులు దీనిని చక్కగా అవగాహన మొనర్చుకొందురుగాక యని వ్రాసినాడు. మహీధరుడు వామమార్గీయుడై యుండెను. ఆతడు యజుర్వేద మంత్రములకు అత్యంత అశ్లీలము, మరియు జుగుప్సాకరమునగు భాష్యమొనర్చినాడు దాని నిస్సారతను, మరియు అశుద్ధతను గూర్చి ప్రకరణానుసారము ముందర తెలుపుదుము. తోడ్తోడ వర్తమాన యుగపు ధురంధర వైదిక విద్వాంసులు, స్వనామధన్యులు నగు మహర్షి దయానందసరస్వతి బ్రాహ్మణగ్రంధములు మున్నగువాని యాధారముపై నొనర్చిన యా మంత్రముల వ్యాఖ్యను గూడ చూపుదుము. ఇప్పుడు స్వయముగ పౌరాణిక విద్వాంసులు గూడ ఆ మహీధరుడు ఒరొనర్చిన అర్థములను పరిత్యజించి దయానందుల ఉత్తమ యౌగిక శైలి ననుసరించియే రాజప్రజాధర్మ సంబంధము, మరియు ఆధ్యాత్మికమునైన వ్యాఖ్యల నొనర్చుచున్నారు. ఈపాశ్చాత్యవిద్వాంసు లనేకులు వేదముల అనువాదమును, వేదవిషయక గ్రంథముల వ్రాయు ఉద్దేశ్యము పక్షపాతరహితము, (నిష్పక్షము) మరియు విశుద్ధముగ లేకుండెను. మీదుమిక్కిలి ప్రాచీన ఆర్య (వేద) ధర్మమును

కించపరచుచు, ఈసాయి ( ఏసుక్రీస్తు) మతముయొక్క ఘనత, శ్రేష్ఠత్వము, మరియు వికాసవాదమును గూర్చిన గొప్పదనమునే ప్రతిపాదించుట యైయుండెను. ఈవిషయమున మైక్డొనెల్, మోనియర్ విలియమ్స్, కీథ్ అను పాశ్చాత్య విద్వాంసులను ప్రముఖరూపమున దీసికొనవచ్చును. వారు ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయమున సంస్కృత ప్రొఫెసరుల ( ఆచార్యుల) రూపమున బొడన్ ట్రస్టు వైపు నుండి అనేక సంవత్సరముల వరకు పని చేసినారు. వీరి యుద్దేశ్యమును గూర్చి 'మోనియర్ విలియమ్స్' అను నాతడు తన సుప్రసిద్ధ *"Sanskirt English Dictionary"* యొక్క భూమికయందు వ్రాసిన శబ్దములను గూర్చి విశేషముగ ధ్యానముంచదగినవి. వారిట్లు వ్రాసినారు.

"That the special object of his (Boden's) munificent bequest was to Promote the translation of the Scriptures into Sanskrit, so as to enable his country men to proceed in the conversion of the natives of India to the christian religion".

అనగా; బొడన్ మహోదయుని ఉదారదానము యొక్క ముఖ్యోద్దేశ్యము ఈసాయీల ధర్మగ్రంథములను సంస్కృతమునందనువాదమొనర్చుటయై యుండెను. వీనిద్వారా వారీదేశవాసులు భారతీయులకు క్రీస్తుమత దీక్ష నొసగు కార్యమున అధిక సౌకర్యముగ నుండగలదు.

ప్రాచ్యవిద్యావిశారదులందు ముఖ్యుడగు ప్రొ.మైక్స్‌మూలర్ ఉద్దేశ్యము గూడ వేదానువాదము మున్నగు వానియందు శుద్ధముగ లేకుండెను. భారతీయులను క్రైస్తవ మతమునందు పరివర్తన మొనర్చుటయేయై యుండెను ఈవిషయము దిగువ పత్రవ్యవహారము వలన స్పష్టముగ దెలియగలదు.

ప్రొ.మైక్స్‌మూలర్ ఆకాలమున భారతదేశమంత్రిగా నున్న 'డ్యూక్ఆప్ఆర్గాయల్' కు క్రీ.శ.౧౮౬౮ డిసెంబర్ ౧౬న పంపిన ఒక పత్రమునం దిట్లు వ్రాసినారు

The ancient religion of India is doomed and if Christianity does not step in, whose fault will it be?

అనగా, భారతదేశము యొక్క ప్రాచీనధర్మనాశ మిప్పుడు నిశ్చయమే. ఇప్పు డొకవేళ క్రైస్తవ మతము వచ్చి ఆస్థానము నాక్రమించకున్న ఆ దోష మెవరిది?

౧౮౬౮లో తన భార్యపేర జాబువ్రాయుచు మైక్స్‌మూలర్.

"I hope I shall finish that work and I feel convinced though I shall not live to see it, yet this edition of mine (of the Rigveda) and the translation of the Vedas will hereafter tell to a great extent on the fate of India and on the growth of millions of souls in that country. It is the root of their religion and to show them what the root is, I feel sure, 'the only way of uprooting' all that has been sprung from it during the last three thousand years."

అనగా, నేనీకార్యముల (వేదముల సంపాదనాదుల) ను పూర్తియొనర్పగల నను యాశనాకు గలదు ఒకవేళ నేను దీనిని జూచుటకు జీవించియుండకున్నను నాయొక్క ఈఋగ్వేద సంస్కరణము, మరియు వేదముల అనువాదము భారతదేశ భాగ్యమును మరియు లక్షలాది భారతీయుల ఆత్మ వికాసమును ప్రభావపరచునదిగా గా గలదు. వేదములు వీరి ధర్మమునకు మూలములై యున్నవి. మూలమును జూపుచు దాని నుండి గత మూడువేల సంవత్సరములందు ఏమి వచ్చినదో దానిని సమూలముగా పెరికి వేయుటకు ఇది సర్వోత్తమకార్యమై యున్నది.

### 1.27. ప్రొ. మైక్స్‌మూలర్‌కు పుసె గారి పత్రము

ప్రొ. మైక్స్‌మూలర్‌కు ఆతని ఘనిష్ఠమిత్రుడగు ఈ.బి పుసె అనునాతడు వ్రాసిన పత్రమును ఈప్రసంగమునందు ఉల్లేఖించదగినదై యున్నది ఆతడిట్లువ్రాసినాడు

'Your work will form a new era in the 'efforts for the conversion of India' and Oxford will have reason to be thankful that by giving you a home, it will have facilitated a work of such Primary and lasting importance on the conversion of India, and which by enabling us to compare that early 'false religion' with the true, illustrates the more than blessedness of what we enjoy.'

అనగా, 'మీకార్యము భారతీయులను ఈసాయిలుగా మార్చుటకు జేయు ప్రయత్నమునందు క్రొత్తయుగమునే తెచ్చునదిగా నుండగలదు అప్పుడు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయము తన్నుతాను ధన్యమైతి ననుకొను అవకాశము గలుగును ఏలన, అదియే ఈకార్యమున కాశ్రయముగలిగించి భారతదేశమును ఈసాయిదేశముగ మార్చుటకు ప్రథమ, మరియు అత్యావశ్యక కార్యమును సుగమ మొనర్చినది. దీనితో బాటు తమ యీకార్యము మమ్ము పాతదగు బూటక ధర్మమును సత్య ( ఈసాయి) ధర్మముతో పోల్చు ఆనందమున ముంచి వేయగలదు' ఇత్యాదులు.

భారతీయులను ఈసాయిలనుగా జేయు పట్టుదల ప్రొ మైక్స్‌మూలర్ బుద్ధిలోనికి ఎట్లు ప్రవేశించినదో, శ్రీ ఎన్. కే మజూందార్ అను ఒక బ్రహ్మ సమాజ సజ్జనునకు ౧౮౯౯లో మాక్స్‌మూలర్ వ్రాసినలేఖ వల్ల స్పష్టపడగలదు ఆలేఖ క్రింద ఈయబడుచున్నది

Tell me some of your chief difficulties that prevent you and your country men from openly following Christ and when I write to you. I shall do my best to explain how I and many who agree with me have met them and solved them. . From my point of view India, at least the best part of it is already converted to Christianity. You want no persuation to become a follower of Christ. Step boldly forward; it will not break under you and you will

find many friends there to welcome you on the other shore and among them none more delighted than your old friend and fellow- Labourer, F. Maxmuller.

*- Life and letters of F.M. Mulle published by Mrs. Georgina Maxmuller, London, 1902*

అనగా; మీకు మరియు మీ దేశవాసులకు బహిరంగముగా ఈసా మసీహ్ శరణమునకు వచ్చుటయం దేమైన ఇబ్బందులున్నచో స్పష్టముగా నాకు దెలియపరచినచో ఆవిషయమును నాపత్రము ద్వారా సమాధానపరచగలను. నాదృష్టియం దిప్పటికే భారతదేశము అధికభాగము ఈసాయి మతమునందు పరివర్తితమైనది. మీకిప్పుడు ఈసాయిగా మారుటకు ప్రేరణసైతము అవసరము లేదు కావున ఇప్పుడు సాహసపూర్వకముగా, నిర్భయముగా ముందుకు సాగుడు. మీస్వాగతమునకై ఇతరులతో బాటు మీపురాణమిత్రు డగు మైక్స్‌ముాలర్ కూడ చేరి యుండగలడు

ఇప్పుడు చూడుడు మాక్స్‌ముాల్‌వేదముల యెడ శుద్ధభావన సత్యాగ్రహణము ద్వారా ప్రేరితుడై వేదముల అనువాదము వంటి కార్యముల నొనర్చినాడా? వైదిక ధర్మమును కించపరచి నష్టపరచుటకై ఈసాయీ మత శ్రేష్ఠత్వమును ప్రదర్శించుటకనియే తెలియుచున్నదిగదా!

The RigVeda and Vedic Religion రచయిత. క్లేటన్ ప్రొ. మైక్స్ ముాలర్ విషయములో తన పుస్తకము ౧౫౬ వ పుటయందిట్లు వ్రాసినాడు

Prof. Maxmuller did not hesitate to say, it must not be forgotten that though the Historical interest of the Veda can hardly be exaggerated, large numbers of the Vedic hymns are 'Childish in the extreme' tedious and common place. Many of them convey no clear meaning, or are full of vain repetitions. It is not the rule but the exception to find in this great collection of literature any cry of the soul, any glimpse of a spiritual instinct, any grasp of a high revelation

*(The RigVeda and Vedic Religion by claytion P.156)*

దీనిభావార్థమేమన, ప్రొ. మైక్స్‌ముాలర్ ననుసరించి వేదములందు ఐతిహాసిక మహత్త్వ మధికముగ నున్నది వైదిక సూత్రములు అత్యధిక సంఖ్యలో బాలిశములు, అందు మూర్ఖత్వము పరాకాష్ఠకు చెందినది అవి నీరసము మరియు తుచ్ఛమగు ఆలోచనలతో నిండియున్నవి, అందులోని అనేకములకు అర్థమే యున్నట్లు గాన్పించదు మరియు నవి పునరుక్తిచే నిండియున్నవి, కేవలము అపవాద రూపములో ఈ సూక్తములందు ఆత్మను గూర్చి, ఆధ్యాత్మిక కాంతి కిరణదృశ్య మెచ్చటనో గానిపించును గాని నియమముగా గానరాదు.

ఇట్టి ఉద్దేశ్యములు, మరియు ఆలోచనలచే ప్రేరితులై చేసిన కార్యమును నిష్పక్షిక మనుట అసంభవము ఇట్టి పక్షపాతముతో నిండిన మనోవృత్తుల కారణముననే దాదాపు పాశ్చాత్య విద్వాంసులు వేదములనెంతో అనర్థము పాల్జేసినారు దీనిని గాంచి ఎంతో ఆశ్చర్యము, మరియు దుఃఖము గలుగక మానదు. వీరు వేదముల యథార్థస్వరూపమును మరియు వాని ఉన్నత తత్త్వములను దెలిసికొనుట యందు అసమర్థులే యై యుండిరనిన

సత్యదూరముగాదు. సాధ్యమైనంతవరకు వారు వేదధర్మ విద్యలను ఆటవికములని ఈసాయి మతము శ్రేష్ఠత్వమని ప్రకటించుటకు శక్తివంచన లేని ప్రయత్నమొనర్చినారు. వీరియం దనేకులు వేదములను బాలుర వచ్చిరాని మాటలు (Prattlings of children) గొఱ్ఱెలకాపరుల పాటలు లేక చెత్తచెదార (Rubbish) మను నంతవరకు సాహసించినారు దాదాపు వేదములు ఏసుక్రీస్తుకంటె ఒకటి రెండు వేల సంవత్సరములకు పూర్వపు రచనలే యని నిరూపించుటకు కపోలకల్పితములు, మరియు ఊహామాత్రపు యత్నముల నొనర్చినారు. ఇంతటితో తృప్తిపడలేదు. వేదములు ప్రకృతిపూజ, మరియు వేలాది దేవదేవతల పూజావిధానము నొనర్చినవి వైదికయజ్ఞములందు గొఱ్ఱెలు, మేకలు, అశ్వములు, వృషభములు మున్నగు జంతువులే గాక నరబలులు గూడా ఈయబడు చుండెడివి. సోమరసమను పేరుతో వైదికార్యులు సారాయి మున్నగు మాదక పానీయముల త్రాగి కామోద్రేకమున వందలాది స్త్రీలను వివాహమాడుచుండిరి. వారి సదాచారమునకు ఉన్నత మానదండ (Standard) మేదియును లేకుండెను. ఒక్క వరుణుడు తప్ప మిగతా ఇంద్రాది దేవతలెల్లరును ముఖస్తవమున నుబ్బిపోవువారైయుండిరి. మరియు చరిత్రహీనులై యుండిరి ఋషులు వారిని స్తోత్రమొనర్చుటకు వేదమంత్రముల నిర్మాణ మొనర్చు చుండిరి ఇత్యాది హీనమగు అభిప్రాయములను వారియందనేకులు తమ గ్రంథములందు వెళిబుచ్చుటయే గాక నికృష్టమగు కల్పితాధారములతో వేదమంత్రముల అర్థముల ననర్థము పాల్జేయుటకు సాహసించినారు ఇట్టి పాశ్చాత్య విద్వాంసుల ఆకతాయి వేదార్థశైలిని సమీక్షించుచు జగద్విఖ్యాతుడగు శ్రీ అరవింద యోగిగారిట్లు వ్రాసియుండిరి.

*'If ever there was toil of interpretation in which the loosest vein has been given to an ingenuous speculation, in which doubtful indications have been snatched at as certain proofs, in which the boldest conclusions have been insisted upon with the scantiest justification, the most enormous difficulties ignored and preconceived prejudices maintaind in face of the clear and often admitted suggestions of the text, it is surely this labour so eminently respectable, other wise for its industry, good will and power of research, performed through a long century by European Vedic scholarship'*

*- Daynanda and Veda by shri Aravinda*

అనగా! ఒకవేళ ఎవరైన వేద వ్యాఖ్యానమందు పరిశ్రమించిన అది ఘనకార్యమే కానివారు వానియందు అతితుచ్ఛమగు ఆధారములతో చతురతా పూర్ణమగు ఆలోచనా రూపముల నిచ్చి యున్నారు వాని యందు సందిగ్ధ సంకేతములకు నిశ్చిత ప్రమాణముల రూప మీయబడినది వానిని అత్యంత తుచ్ఛము, నికృష్టమగు ప్రమాణముల ఆధారమున సాహసపూర్ణ పరిణామము దీయుటకు కృషి చేయబడినది. వానియందు అతిస్పష్టము, మరియు దుర్గమమైన కాఠిన్యములు గూడ ఉపేక్షించబడినవి వేదమంత్రములందు స్పష్టమగు సద్దేశముండియున్నను వానికి ప్రతికూలముగ, కేవలము పక్షపాతముతో నిండిన ఆలోచనలకే ప్రాధాన్యత ఈయబడి నది ఐనను ఈపాశ్చాత్య విద్వాంసుల వేదవిషయక పరిశ్రమ ప్రశంసనీయమైనదే. వీరి యీ నికృష్ట ఉద్దేశ్యము మాత్రము హేయము, పాపభూయిష్ఠము, సాహసోపేతమైయున్నది. కొందరు పాశ్చాత్య విద్వాంసులు నిష్పక్షిక భావముతో వేదాధ్యయన మొనర్చినారు. వారు వేదముల మహత్త్వము నంగీకరించినారు. వానిని మేము రాబోవు

అధ్యాయములందు చూపుదుము ఒకవేళ పాశ్చాత్య విద్వాంసులు తెలిసియుండియు పక్షపాతవశమున, లేక అజ్ఞానవశమున కేవలము వేదములపై ఇట్టి కుఠారాఘాతము నొనర్చిన ఉపేక్షించబడెడిదేమో కాని మిక్కిలి క్షమించరాని విషయమేమన; ఇంగ్లీషు ప్రభుత్వము తన శాసనకాలమున ఒకశిక్షా ప్రణాళిక నేర్పరచినది దాని ఉద్దేశ్యము దాని సంస్థాపకుడగు 'లార్డ్‌మైకాలే' శబ్దములందే చూడుడు.

*'English education would train up a class of persons, Indian in blood and colour, but English in tastes, in opinions, in morals and in intellect.'*

''అంగ్రేజి శిక్షణచే భారతీయులందనేకులు రక్తము మరియు వర్ణముచే భారతీయులై యుందురేకాని వారి యభిరుచి, విశ్వాసము, ఆచారవ్యవహారములు మరియు బుద్ధిపరముగా అంగ్రేజివారై పోయెదరు '' అని యభిప్రాయమును ప్రకటించినాడు అదేవిధముగ ఈశిక్షా పద్ధతి యొక్క భయంకర పరిణామము మనము చూచుచునేయున్నాము

ఇది గొప్ప దౌర్భాగ్యము, మరియు దుఃఖదాయకమైన విషయమై యున్నది. అంగ్రేజి శిక్షణను పొందిన మనదేశీయులనేకులు వైదికధర్మము, మరియు ప్రాచీన సంస్కృతి విషయములో పక్షపాతగ్రస్తులగు పాశ్చాత్యలేఖకులనే అనుసరించినారు ఈవిధముగా వారు తమ దాస్యమనోవృత్తినే ప్రకటించుకొనినారు శ్రీరాజేంద్రలాల్ మిత్ర అనునతడు తన "Indo Aryans" పేరుగల పుస్తకమునందు 'ప్రాచీన ఆర్యవైదికకాలమున గోమాంసము, మద్యము మున్నగు వానిని నిస్సంకోచముగ సేవించుచుండి' రన్నాడు శ్రీ రమేశచంద్రదత్తు అనునాతడు కూడా ఋగ్వేదబంగ్లా భాషానువాదమున చాలవరకు పాశ్చాత్యవిద్వాంసులనే అనుసరించినాడు. ఐనను బ్రహ్మసమాజ ప్రవర్తకుడగు రాజారామమోహనరాయలు చివరివరకు వేద ప్రామాణ్యమునే విశ్వసించెడివాడు కాని బాల్యావస్థ నుండి ఈసాయీ విద్యాలయములందు శిక్షితులగు శ్రీ కేశవచంద్రసేన్ మున్నగు వారి ప్రేరణచే మహర్షి దేవేంద్రనాథుని నేతృత్వమునందు బ్రహ్మసమాజము వారి కిష్టము లేకున్నను 'ఏగ్రంథమునైనను (వేదమునైనను) నిర్భ్రాంతముగ ఈశ్వరీయజ్ఞానమని విశ్వసించజాల' మని ఆయన ప్రకటించవలసివచ్చినది మాన్యులగు శ్రీబాలగంగాధరతిలక్ వంటి దేశభక్తులగు విద్యావేత్తలపైనను పాశ్చాత్యవిద్యల కుసంస్కార ప్రభావము అధికాధికముగానే బడిన దనవచ్చును వారు వేదార్థములను పాశ్చాత్యశైలినే అనుసరించుచు Orion మరియు Arctic Home in the Vedas అనురెండు గ్రంథములను వ్రాసినారు. వాని ననుసరించి వారు వేదకాలము క్రీస్తుకు పూర్వము దాదాపు ఎనిమిదివేల సంవత్సరములదే యని చూపినాడు. ఈవిధముగా వారు పాశ్చాత్యుల ద్వారా నిర్దిష్టపరచబడిన జ్యోతిషశాస్త్రాదుల కాలము ఒకటి ఒకటిన్నర, లేక రెండువేలసంవత్సరములు క్రీస్తుకు పూర్వము అను విషయమును పాశ్చాత్యపద్ధతి ననుసరించుచు కూడ నిరాకరించినాడు, బాధాకర విషయమేమన! వేదసంబంధమగు ప్రాచీనపరంపరాగత విశ్వాసమును నాత డే మాత్రము లక్షపెట్టలేదు 'మానవేర్ మున్నగు జన్మభూమి' అను పుస్తకరచయిత యగు శ్రీ ఉమేశచంద్ర విద్యారత్నగారు లోకమాన్యతిలక్ గారిని గలిసి ఆయన గావించిన వేదమంత్రార్థముల, మరియు వాని యాధారమున కల్పితమగు 'ఆర్యుల నివాసము ఉత్తరధృవమైయుండె' నను వాదమును ఖండించినాడు అప్పుడు తిలక్‌గారు 'మనము మూలవేదములను చదువలేదు గదా' పాశ్చాత్య విద్వాంసులద్వారా ఒనర్చబడిన అనువాదములనే అధికముగా అనుశీలన మొనర్చి మన ఆలోచనలను

(అభిప్రాయముల స్థిర పరచికొనినాము) శ్రీ ఉమేశ్ చంద్ర విద్యారత్న 'మానవేర్ ఆది జన్మభూమి' ౧౨౮వ పుట యందు తన శబ్దములనిట్లు వ్రాసికొనినాడు ఈ నిమ్న శబ్దములుకొన్ని అటు నుండి యే గ్రహింపబడినవి

**ఆమి గతవత్సరే తిలక మహోదయేర వారితే ఆతిధ్య గ్రహణ కరియా ఛిలామ! తాంహార సహిత యే విషయే ఆమార క్రమాగత పాంచదిన బహు సంలాప హఇయా ఛిలో! తిని ఆమాకే తాంహార ఫితల గృహే బసియా సరళ హృదయే వలియా ఛేనయే. ఆమీ మూల వేద అధ్యయన కరినాం ఈఆమి సాహిబి దిగేర అనువాద పాఠ కరియాఛి**
(మానవేర్ ఆది జన్మభూమి పుట ౧౨౮)

శ్రీ రఘునందనశర్మ కృత 'వైదిక సంపత్తి' ప్రథమ సంస్కరణ ౯ వ పుట యందు శ్రీ ఉమేశ్చంద్ర విద్యారత్న గారి పుస్తకపు ఈ యంశమును దిగువ శబ్దములలో ప్రచురించినాడు

బాబూ ఉమేశ చంద్ర విద్యారత్నగారిట్లు వ్రాసినారు ''తిలక్ మహోదయుని మతమును సంశోధించుటకు గత వర్షము వారి గృహమునకు వెళ్లి యుంటిమి ఐదు దినముల వరకు ఈ విషయమున వారితో వాదించితిమి'', మేము మూల వేదములను చదువలేదు తెల్ల దొరల అనువాదములనే చదివి యుంటి'' మని సరళముగనే చెప్పినారు

RegVeda India మరియు Rigvedic culture అనుదాని రచయిత యగు శ్రీ. అవినాశచంద్రదాసు ఎమ్ ఏ,పి హెచ్ డి గారు పాశ్చాత్యుల ద్వారా నిర్ధారించబడిన, మరియు లోకమాన్యతిలక్ ద్వారా పరివర్ధనముతో బాటు స్వీకరించబడిన వేదరచనా కాలమును అశుద్ధమని తెలుపుచు ''వారు వేదాలు కనీసము క్రీస్తుకు పూర్వము ఎనుబది వేలవత్సరములకు పూర్వము వని నిరూపించుట అనేకాంశములందు ప్రశంసనీయకార్యమై యున్నది వారు వైదిక సభ్యత మహోన్నతమైనదని ధృవపరచుట అభినందించదగిన కార్యమే. ఐనను వారి గ్రంథములందు అనేక స్థలములలో పాశ్చాత్యాభిప్రాయముల ముద్రయే స్పష్టముగ గాన్పించును వారు Rigvedic India అను పుస్తకమునందు ౨౭౫నుండి ౨౭౭వ పుట వరకు వేదములందు వంధ్యాగోవులు(గొడ్డుబావులు) మరియు ఎద్దులను బలియిచ్చుట, మరియు గోమాంస భక్షణను గూర్చి అసఫలప్రయత్నమొనర్చినారు.

There is also evidence of beef having been eaten by the ancient Aryas'

'There is evidence of the ox having been killed in sacrifices and its cooked flesh offered to the gods especially to Indra who seemed to have developed a keen taste and inordinate desire for it.'

అనగా, ప్రాచీనార్యులు గోమాంసభక్షణమొనర్చుచుండిరని, యజ్ఞములందు ఎద్దులను బలి నిచ్చుచుండిరనియు, వాని మాంసమును పాకమొనర్చి దేవీదేవతలకు అర్పించుచుండిరని నిర్దేశములు లభించుచున్నవి విశేషించి ఇంద్రునకిట్టి మాంసము పై అభిరుచి బాగుగానుండెను. ఆర్యుల, దస్యుల, ద్రవిడుల విషయమందును వారి లేఖలు ఈవిధముగనే భ్రాంతి పూర్ణము, మరియు పాశ్చాత్యవిద్వాంసుల అనుకరణ మాత్రమే మైయున్నవి దీనిని మేము ప్రకరణానుసారముగ ముందు చూపెదము.

బెంగాల్‌దేశపు మరొక విద్వాంసుడగు శ్రీ ద్విజేంద్రదాసు ఎమ్.ఏ ఎల్, ఎల్ బి ప్రిన్సిపాల్ చిట్గాంగ్ కాలేజి గారి. RigVeda unveiled అను పుస్తకము ఇతరులకన్న కొంతమెరుగు గానున్నది. దానియందు వైదిక ఏకేశ్వర వాదమును సమర్థించుటకు వారు ప్రశంసనీయమగు ప్రయత్నము నొనర్చినారు. మరియు ప్రొ. మైక్స్ మూలర్ యొక్క Henotheism మున్నగు వాదములను ప్రమాణ యుక్తముగ, యుక్తియుక్తముగ త్రోసివేసినారు. ఐనను పై వాక్యములందు వారు కూడా పాశ్చాత్య విద్య యొక్క కుసంస్కారవశమున భ్రాంతిపూర్ణమగు విషయములను కూడా వ్రాసినారు.

పాశ్చాత్య శిక్షణల కుసంస్కార మీ భారతీయ విద్వాంసులపై ఎంతగా నిండిపోయినదో మనకనేక ఉదాహరణల ద్వారా స్పష్టపడగలదు. ఇప్పుడే పైన ప్రొ. అవినాశచంద్రదాసు గారి Rigvedic India ను చూపియుంటిమి వారు గోమాంస భక్షణ ప్రకరణము నందు ఋగ్వేద ౬-౩౯-౧వ మంత్రమగు **'దేవేషో యువస్య గృణతే గో అగ్రాః'** యందు ఈ యంశమును సాయణాచార్యుని **'గృణతే స్తువతే (గో అగ్రాః) గావో ఉగ్రే యాసాం తాదృశాః (ఇషః) అన్నాని సంయోజయ!** అను నీ భాష్యభాగమును ఉదాహరించుచు వ్రాసి యుంటిమి.

This of course, may be interpreted to mean that by the word f® or Cow is implied not her flesh but her milk and milk products like butter and ghee etc'.

అనగా ఇచ్చట గోవును ప్రధానముగా అన్నము కొరకు ప్రార్థించబడినప్పుడు, దాని తాత్పర్యము గోమాంసమును గూర్చికాదు కాని దాని పాలు, పెరుగు, వెన్న, నేయి మున్నగు పదార్థములగూర్చియే సంభవమగును దీనిని గూర్చి నిరుక్తము నందు స్పష్టముగ వ్రాయబడియున్నది.

**'తద్ధితవన్నిగవా భవన్తి - గోభిః శ్రీణీత మత్సరమ్- గోభిః సన్నద్ధాఅసివీడయస్వ।**

ఇచ్చట తన దాస మనోవృత్తిని ప్రకటించుచు డా. దాసుగారిట్లు వ్రాసినారు.'

'This may be a possible explanation, but as professor Wilson says : There does not seem to be any thing in the Veda that militates against the literal interpretation'

ఇచ్చట విల్సన్‌గారనినట్లు 'పేర్కొని డా. దాస్ నిరుక్త సమ్మతము, వేదభావములకు పూర్తిగా అనుకూలమైన వాఖ్య (వేదములో గోవును అఘ్న్యా చంపదగనిది అని వందల సార్లు పేర్కొనబడినది) ను ఉపేక్షించినారు. అంతేకాదు వైదిక ఆర్యులు గోమాంస భక్షకులని అనుచిత ఆక్షేపణ చేసినారు.

ప్రొ విల్సన్ నామము పై డా. దాసు గారొక ఉచితమగు వ్యాఖ్యనొనర్చినారు. వేదభావనకు పూర్తిగా అనుకూలమైన వ్యాఖ్యను (గోవును గూర్చి 'అఘ్న్యా' అనగా చంపదగినది గాదని అనేక వందల సార్లు ఉల్లేఖింపబడినది) మరియు నిరుక్త సమ్మతమైన దానిని ఉపేక్షించినారు వైదికార్యులపై మాంసభక్షణము మున్నగు అనుచితమగు ఆక్షేపణలను చేసినారు.

మేమీ The 'Vedic Age' Published by the Bharatiya Itihas Samiti, Bomay, London George Allen of Unwin Ltd., అను గ్రంథము అనేక భ్రాంతి పూర్ణాంశములపై విశేషముగా సమాలోచనాత్మక

దృష్టిని ప్రసరించదలచినాము. దాని యందనేక స్థలములందు పాశ్చాత్య విద్వాంసుల అవివేక పూర్ణముగ అనుసరణ మొనర్చుచు వారి దృష్టి కోణమునే స్వంతమొనర్చికొనినారు.

ఋగ్వేద నిర్మాణకాలమును ఈ Vedic Age లేఖకులు (General Editor R.C Majumdar M.A., Ph.D. Hon. Head of the Department of History Bharatiya Vidya Bhavan Bombay), (Asst. Editor A.D. Pusalkar M.A., L.L.B. Ph.D., (Head of the Department of Sanskrit) దాదాపు క్రీ పూ. ౧౦౦౦ సంవత్సరములని నమ్మినారు ఇదే విధముగ డా బి.కే ఘోష్ D.Phil (Munich), D Litt (Paris) Vedic Literature - General View అను శీర్షికతో ౧౦వ అధ్యాయమందిట్లు వ్రాసియున్నారు

On Linguistic grounds the Language of the RigVeda the oldest Veda, may be said to be about 1000 B.C. (P. 225)

అనగా, ''భాషా సంబంధమగు ఆధారముపై అన్నిటి కన్న పూర్వపు దగు ఋగ్వేదము దాదాపు క్రీ పూ ౧౦౦౦ సంవత్సరముల దని ఎంచ వీలగుచున్నది ''

''వైదిక ధర్మమును బహుదేవత పూజావాది, మరియు చివరకు అక్కడక్కడ అద్వైత వాదమును జూపుటకు లేఖకులు ప్రయత్నించినారు. దీని ననుసరించి వేదములలో ప్రాకృతిక దేవిదేవతల పూజ, మరియు వారి ముఖస్తుతి యొనర్చుటకు ప్రయత్నించబడినది. పాశ్చాత్యులనే అనుసరించుచు వారిట్లు వ్రాసినారు.''

'It has been generally held that the Rigvedic Religion is essentially a polytheistic one, taking on a Pantheistic colouring only in a few of its latest hymns.'

- Vedic Age P 378

''అథర్వ వేదముపై ఈ గ్రంథ రచయితలు ఎట్టి అసంగత, అనుచిత విషయములను వ్రాసియున్నారో వాని యందు పాశ్చాత్యుల అవివేక పూర్ణమగు విషయములనే అనుసరించినారని స్పష్టముగ గాన్పించుచున్నది ప్రొ బ్లూంఫీల్డు యొక్క 'అథర్వ వేద విషయక' పుస్తకమునకు వంతెన గట్టుచు వారిట్లు వ్రాసినారు

*'Bloomfiled's excellent mono-graph on the Atharna Veda like which unfortunately there is as yet nothing on the other Samhitas - offers practically every thing that a student of the Vedic Literature might wish to know about the Atharva Veda. The section on the Atharva Veda in this chapter is mainlv based on 'Bloomfield's monograph.'*

*-Vedic Age P. 239*

అనగా, బ్లూంఫీల్డు యొక్క 'అథర్వ వేద విషయక' ఆదర్శ పుస్తకమునందు ( దౌర్భాగ్య వశమున ఇతర సంహితలపై దీనికి సమమగు పుస్తకమేదియును ఇంతవరకు లేదు ) క్రియాత్మక రూపమున విద్యార్థులు దెలుసుకొనదగిన సమస్త విషయములు గలవు. ముఖ్యముగా ఈ పుస్తకము యొక్క ఈ భాగము బ్లూంఫీల్డు యొక్క ఆ పుస్తకాధారము పైననే వ్రాయబడినవి.

బ్లూంఫీల్డు వ్రాసిన ఆ పుస్తకమునందు అథర్వ వేద విషయములో ఎంతటి అశుద్ధమగు ఆలోచనలు గలవో మేము ముందర చూపుదుము. ఈ లేఖకులు దానినే అవివేకముగా అనుసరించుచు దానినే ఆదర్శమని ఎంచినారు. ఇందువల్ల వాస్తవముగ మన అంగ్రేజి శిక్షిత భారతీయ విద్వాంసుల దాసమనోవృత్తి ప్రస్ఫుటముగగాన్పించుచున్నది. ఇది అంగ్రేజి శాసకుల ద్వారా భారత దేశమునందు ప్రవర్తింప జేయబడిన అంగ్రేజి శిక్షణా పద్ధతి యొక్క స్వాభావిక పరిణామమే. వైదిక కాలమున గోమాంసభక్షణను నిరూపించుచు ఈ గ్రంథ లేఖకులిట్లు వ్రాసినారు

The guests are entertained with the flesh of cows killed on the occasion of marriage'. (Vedic Age. P. 389.)

అనగా, వివాహ సంస్కారములందు గోవులను చంపి వాని మాంసముచే అతిథులు తృప్తిపరచబడుచుండిరి. ఇదే విధముగ సారాయి విషయమందిట్లు వ్రాసినారు.

*'In the Rigvedic Period, Sura was the popular drink, extremely intoxicating as compared to the Soma which though mildly inebrating was an invigorating beverage'. (Vedic Age. P. 393.)*

అనగా; వైదిక కాలమునందు సురా, లేక సారాయి లోక ప్రియ పేయ(పానీయ)మై యుండెను అది సోమ రసము కన్న అత్యధిక మత్తు పదార్థము. మేమీ ఆలోచనలను సంపూర్ణముగ అశుద్ధమనియే తలతుము ఇక దీని తరువాత ప్రమాణ పూర్వకముగా సమాలోచన మొనర్చెదము అంగ్రేజి సుశిక్షితులగు స్వదేశ ఆధునిక విద్వాంసులు అవివేక పూర్ణమగు పాశ్చాత్యుల ఆలోచనలనే అనుసరించినారు. మరియు నీ విధముగ వేదముల వాస్తవిక తత్త్వమును దెలిసికొనుటయందు సంపూర్ణముగ అసమర్థులైపోయినా రని మాత్రమే ఇప్పుడు చూపదలచితిమి అనేక విషయములందు వారు పాశ్చాత్య విద్వాంసులను అవివేక పూర్ణముగ అనుసరించినారు వారికి తమ వేద విషయక జ్ఞానము ఉండ సంస్కృత జ్ఞానము సైతము అత్యంత సీమితముగనే యుండెను. వారిలో కొన్ని సంస్కృత వాక్యములనైనను చెప్పు యోగ్యతకూడా లేకుండెను. తోడ్తోడ ఈసాయిమతము యొక్క శ్రేష్ఠత్వము, వైదిక ధర్మము యొక్క హీనత్వమే వారికి గాన్పించుచుండెడిది. ఇట్టి పక్షపాత పూర్ణమగు మనోవృత్తిచే ప్రేరితులై వారు కార్యముల నొనర్చుచుండిరి ఇట్టి పరిస్థితి యందు వారి యనుసరణ పరిణామము ఉత్తమముగా నెట్లుండగలదు? వైదిక సాహిత్యముపై వ్రాయ సాహసించిన ధురంధరులగు అనేకానేక పాశ్చాత్య విద్వాంసుల సంస్కృత విషయకయోగ్యతలను మహాత్మా నారాయణ స్వామి కృత **'వైదిక రహస్య'** మను గ్రంథమున సాక్ష్యాధారములతో గాంచ నగును.

అనేక సంవత్సరముల క్రిందట మనదేశపు సంస్కృత, మరియు అంగ్రేజి విద్వాంసు డొకడు ప్రభుత్వముచే అనుమతి పొంది సంస్కృతమున విశేష అధ్యయనము చేయుటకు ఇంగ్లాండు వెళ్లియుండెను ఆకాలములో సంస్కృత భాషయందు వార్తాలాపము లొనర్చునప్పుడు మైక్డోనైల్ ఆయునతో సంస్కృతమున మాట్లాడలేకపోయినాడు అప్పుడు మైక్డోనైల్ వారితో ''సంస్కృతమునందు మీకు గల యోగ్యత నాకు లేదు. మిమ్మిచ్చటికి సంస్కృత సాహిత్యాధ్యయనమునకు పంపించినారనుట సరిగాదు మీరిచ్చటికి కేవలము పాశ్చాత్య

విద్వాంసుల అన్వేషణా ప్రణాళిని అభ్యసించుటకు పంపబడినారని నమ్మవచ్చు'' నని యనినాడు (వైదిక రహస్యము, పు ౨౪౮)

మీరు దీనిని పక్షపాతముతో గూడిన అత్యుక్తిగా దలచవలదు. మేమీ విషయమును కేవలము పాశ్చాత్య విద్వాంసుల సంస్కృత యోగ్యతల పరిచయము నిచ్చుటకే ఉట్టంకించినాము కొంత కాలమునుండి మేము దక్షిణ భారతమునందుండియును అనేక తడవలు సంస్కృత, వైదిక సాహిత్యమునందు ధురంధురులగు పాశ్చాత్య విద్వాంసులను గలిసికొను నవకాశము గలిగినది అందుముఖ్యముగా ఆక్స్ఫర్డు సంస్కృత విభాగాధ్యక్షులగు ప్రొ థామస్, ప్యారిస్ విశ్వ విద్యాలయములో భారతీయ విద్య, లేక Indology అధ్యక్షులగు ప్రొ రేనూ, ప్రొ తుచ్చీ ఇటలీ మున్నగువారుండిరి కాని ప్రొ తుచ్చీని ఇటలీ వదలివేసి సంస్కృతమున కొంత వరకు వ్యాకరణ విషయములో అశుద్ధముగా తమ భావమును ప్రకటించగలుగుచుండిరి మేమెవ్వరి యందును సంస్కృత భాషణ యోగ్యతను జూడలేదు ౧౯౩౭లో All India Oriental Conference (ప్రాచ్య విద్యా సమ్మేళనము) త్రివేంద్రములో జరుపబడినది దాని అధ్యక్షుడగు ప్రొ ఎఫ్ డబ్ల్యూ థామస్ వద్దకి వెళ్లి నేను సంస్కృతములో

**'సంస్కృత భాషాయాం భాషణస్యాభ్యాసో వర్తతే కిం శ్రీమతామ్'** అనగా; మీకు సంస్కృతములో మాట్లాడు అభ్యాసము గలదా? అని యడిగితిమి వారు ఇంగ్లీషు నందే

'How I wish I could speak in Sanskrit fluently like you, but unfortunately I have no practice' అని సమాధానమిచ్చినారు

అనగా , సంస్కృతములో మీవలె ధారాప్రవాహ రూపమున మాట్లాడవలెనను కోరిక ఎంతయో గలదు కాని దౌర్భాగ్యవశమున నాకు దీని యభ్యాసము లేదు ఇట్టి సమాధానమునే ప్రొ రేనూ యను నాతడు ఢిల్లీ యందు నాకొసగినాడు. ఇది ఢిల్లీ యూనివర్సిటి యందు సంస్కృత సాహిత్యముపై ఈయబడియుండెను మరల నేను 'స్వామి దయానంద సరస్వతి గారి వేద భాష్యాదులను పాశ్చాత్య సంస్కృతజ్ఞులగు విద్వాంసులు చదువుదురా? ఐనచో వారి యభిప్రాయమేమి? అనియడిగినాను అందుకు ప్రొ రేనూ 'అచ్చట సంస్కృతజ్ఞ విద్వాంసులు కూడా మూల సంస్కృత గ్రంథములను దెలిసికొను యోగ్యత గలిగి యుండరు. వీని యనువాదములు అంగ్రేజి భాషయం దైనప్పుడే వానిని చదివి అవగాహన మొనర్చుకొనగలిగెదరేమో! ఈ కారణము వల్ల ఆ గ్రంథముల ప్రచార మచ్చట జరిగియుండలేదు. అని యనినాడు ఈ విషయమును ప్రస్తావించుచూ మేము పాశ్చాత్య విద్వాంసుల ఆలోచనాత్మక దృష్టిని గూర్చి వ్రాయదలచినాము. వారు సంస్కృత సాహిత్యాధ్యయనము యెల్ల మక్కువ చూపుదురు ఉపయోగకరములగు అనేక విధములగు పరిశోధనల విషయములో పరిశ్రమింతురు వారు వేదములు, మరియు సంస్కృత యోగ్యతను సంపాదించుటకు అధిక కృషి యొనర్చినారు ఇట్టి విషయములందు భారతీయ విద్వాంసులు శ్రద్ధ గలిగియుండక భయంకరమగు తప్పిదము చేసినారని వ్రాయవలసివచ్చినది. మనమేగాదు అనేక సుప్రసిద్ధ పాశ్చాత్య విద్వాంసులు కూడా ఈ విషయము స్వీకరించినారు ఉదాహరణకు '(టాక్స్ వాక్' (పిటోరియా) యొక్క 'టామిస్ ఫిట్జ్' అనునొక సుప్రసిద్ధ విద్వాంసుడు ఒకనాటి తన వ్యాఖ్యానము నందిట్లనినాడు

''కొందరు పాశ్చాత్య విద్వాంసులు వేదముల విషయమున వెలిబుచ్చిన అభిప్రాయముపై నాకే మాత్రము విశ్వాసము లేదు. ఏలన ఈ పండితుల సంస్కృత విద్వత్త, మరియు వేదముల జ్ఞానము ఏమాత్రము లేని దానితో సమానమే. ఈ విషయముపై మేము కేవలము దయానందుల భాష్యమునే ప్రామాణికముగ విశ్వసింతుము'' అని, ఈ విషయమును 'పాఖండ ఖండనీ పతాక కాశీ' నామక మాసపత్రిక ౧౯ ౩౯ జూన్ ౧౫వ తేదీ గల అంకమునందు ౫వ పుటను జూడనగును.

## 1.28. వేద మహత్త్వ విషయమున మహర్షి దయానందుల సింహ గర్జన :-

ఇప్పుడు ౧౯ మరియు ఇరువదవ ఈ శతాబ్ద కాలపు మహానుభావులు వేదములను ప్రజల యెదుటికి యథార్థ రూపమున తెచ్చి అత్యంతాభినందన కార్యమొనర్చిన విద్వాంసులలో సార్థక నాములు, స్వనామ ధన్యులు నగు మహర్షి దయానందుల స్థానము సర్వోన్నతమై యున్నది. వారి కాలమున భారత దేశము యొక్క సుశిక్షిత సంస్కృత వర్గమునందును వేదములు నితాంతము ఉపేక్షించబడుచుండెడివి. గొప్ప గొప్ప పండితులు గూడా దాని యర్థము, భావములను దెలిసికొనుటకు ప్రయత్నించెడివారు గాకుండిరి ఈ విషయము కాశీ శాస్త్రార్థము ద్వారా స్పష్టమగుచున్నది విశుద్ధానందస్వామి, బాలశాస్త్రి వంటి కాశీలోని మహాపండితులకు సైతము వేద జ్ఞాన మేమియును లేకుండెను. వారు దర్శన శాస్త్రములు, మరియు స్మృతులు మున్నగు గ్రంథముల అనుశీలనము నందే తమ అధిక కాలమును వ్యయపరచుచుండిరి శ్రీ దేవేంద్ర నాథ ఠాకూరు గారు తన ఆత్మ చరిత్ర (Auto - Biography) యందు బెంగాల్‌దేశమును గూర్చి వ్రాసిన విషయమే సంపూర్ణ భారత దేశ చిత్రణమని యనవచ్చును. వారిట్లు వ్రాసినారు.

"The Vedas had become virtually extinct in Bengal, Nyaya and Smriti Shastras were studied in every tol (Sanskrit School) and many Pandits versed in these Shastras came forth thence, but the Vedas were totally ignored. The business of the Brahmans, that of learning and teaching the Vedas, had altogether disappeared from the country, there remained Brahmans only in name, bereft of all Vedic knowledge, bearing the sacred thread alone, with the exception of one or two learned Brahman Pandits, they did not even know the meaning of their dailyPrayers.'

Auto-biography of Maharshi Devendra Nath Tagore, P. 41.

అనగా , వేదములు బెంగాలు నుండి దాదాపు సమాప్తమేయైపోయినవి. న్యాయ మరియు స్మృతి శాస్త్రములు మాత్రము అన్ని పాఠశాలలందును చదివించబడుచుండెడివి బెంగాలు నం దీ శాస్త్రముల నిపుణులగు పండితులు అనేకు లుండిరి. ఐనను వారు వేదములను దాదాపు ఉపేక్షించిరనియే యనవచ్చును దేశమందంతటను బ్రాహ్మణులు వేదములను చదువుట చదివించుట యను కార్యమును వదిలివేసినారు. కేవలము నామ మాత్ర బ్రాహ్మణులు కొంద రుండిరి. వారికి వైదిక జ్ఞానమేమియును లేకుండెను. వారు కేవలము యజ్ఞోపవీతమును

ధరించుచుండిరి. విద్వాంసులగు బ్రాహ్మణుల నొక రిద్దరిని వదలి వారికి దైనిక సంధ్యావందన మంత్రముల అర్థము గూడా తెలియకుండెడిది. ఇత్యాదులు ఎక్కడనైన కొందరు వేదాధ్యయన మొనర్చుచుండినను వారు కేవలము వేద పఠనము నభ్యసించుటయందే సమయమంతయు వ్యర్థమొనర్చుచుండిరి వాని అర్థము సాయణాచార్య, మహీధరాది పౌరాణికుల, మరియు తాంత్రిక భాష్యకారుల ననుసరించి ఎచ్చటనో కొన్ని చోటులలో చదివింపబడుచుండెను. వానిని చదివిన పిదప లోకులందు మిగిలియున్న కొద్దిపాటి శ్రద్ధ సైతము లుప్తమై పోవుచుండెడిది. శ్రీ దేవేంద్ర నాథగారు వేదముల తత్త్వమునెరుగుటకు ఆనందచంద్ర, తారకనాథ, వనేశ్వర, రామనాథులను పేర్లు గల నలుగురు విద్యార్థులను వేదాధ్యయనము కొరకు బనారసు (కాశీ) కు పంపించియుండిరి అచ్చట సాయణుడు మున్నగు వారి భాష్యములను చదివి తిరిగి వచ్చి వారు చెప్పిన దేమనగా 'వేదములు అసంబద్ధ, అశ్లీల, అసంగత మగు మాటలచే నిండియున్నవి. వానిలో యజ్ఞములందు పశుహింసను గూర్చిన విధానమున్నది ఇంకా అందు జుగుప్సాకరమగు విషయములెన్నియో గలవు అదివిన్న శ్రీ దేవేంద్రనాథునకు 'వేదములు నిర్భ్రాంతములు, అవి ఈశ్వరీయ జ్ఞానమని విశ్వసించుట దోషమే' యను నిశ్చయమునకు రాక తప్పినది కాదు సాయణుడు మున్నగు వారొనర్చిన అశుద్ధ భాష్యమును చదివి వేదముల విషయమున అవాస్తవిక భావనలతో తిరిగి వచ్చిన ఆ నలుగురు విద్యార్థుల అభిప్రాయము వారిపై స్థిరపడినది బ్రహ్మసమాజము వారి వలె వేదములు ఈశ్వరీయ జ్ఞానమను పరంపరాగత ఆర్య సిద్ధాంతమును త్రోసిపుచ్చుట అనుచితమే. ఐనను శ్రీ కేశవ చంద్రుని వంటి ప్రభావశీలుడు, ఈసాయీ (క్రైస్తవ) విద్యాలయములందు చిన్ననాటి నుండియే శిక్షితుడైన యువకుని ప్రేరణా ప్రోత్సాహముల చేతను, స్వయముగా వేద విద్వాంసుడు కానందు వల్లను శ్రీ దేవేంద్రనాథునకు వేదములపై గల కొద్దిపాటి యభిమానము కూడా వదలిపోయినది. బ్రహ్మసమాజ ప్రవర్తకుడగు శ్రీ రాజా రామమోహనరాయలు స్పష్టముగా నెప్పుడును వేదముల ప్రామాణికతను నిరాకరించ కున్నను వేదములనగా చాలావరకు ఉపనిషత్తులనియే ఆయన యెంచుచుండిరి. ప్రొ. మైక్స్ మూలర్ వ్రాసిన 'Biographicals says' లో వ్రాసి పెట్టిన నిమ్న సంఘటన దీనిని స్పష్టముగా సూచించుచున్నది. వేదములు అనగా సంహితల విషయములో వారియభిప్రాయము ఉత్తమముగా లేకుండెను. ప్రొ మ్యాక్స్ మూలరిట్లు వ్రాసినారు

'The Raja Rama Mohan Roy was in London and saw Friedrich Rosen at the Brithish Museum busily engaged in copying manuscripts of Rig Veda. The Raja was surprised and told Rosen that he ought not to waste his time on the hymns, but that he should study the Upanishads'

Max Muller's Biographical Essays, P. 39 Quoted by A.C. Clayton in 'The Rig Veda and Vedic Religion,' P. 21.

అనగా రాజారామమోహనరాయలు లండన్‌లో నున్నప్పుడు బ్రిటీష్ మ్యూజియంలో ఫ్రైడరిక్ రోజన్ అనునాతడు ఋగ్వేద హస్తలిపి గ్రంథమును ఎత్తి వ్రాయుట (కాపీ చేయుట) యందు నిమగ్నమై యుండుటను జూచినాడు. అప్పుడాయనకు ఆశ్చర్యము కలిగినది. అప్పుడాయన రోజన్‌తో 'మీరు వేదము అనగా మంత్రి

సంహితలపై వ్యర్థముగా సమయమును నష్టపరచకుడు మీరు దీనికన్న ఉపనిషత్తుల అధ్యయనమొనర్చిన ఎంతయో బాగుండెడిది.'

A.C. Clayton అనునాతడు The Rig Veda and Vedic Religion (Published by the Christian Literature Society for India, London, and Madras 1913) అను పేరు గల పుస్తకమునందు ఈ సందర్భమును ప్రొ. మైక్స్ మ్యూలర్ పుస్తకము నుండి ఉదాహరించుచు ఇట్లు వ్రాసినాడు

'Max Muller relates an incident which shows the opinion of the intrinsic value of the hymns of the Vedas held by a highly educated Hindu thinker, and probably by not a few others, at that time.'

అనగా; ప్రొ.మైక్స్‌మ్యూలర్ ఒకసంఘటనను వ్రాసినాడు. దానిద్వారా ఆకాలమునందలి ఒక అత్యంత సుశిక్షితుడగు, ఆలోచనాపరుడగు హిందువు దృష్టియందేగాక ఇతర సుశిక్షితులైన హిందువు లనేకుల ఆలోచనములందును వేదమంత్రముల మహత్త్వమును గూర్చిన భావములు మనకు స్పష్టపడగలవు

పాశ్చాత్య విద్వాంసులు వేదములను పక్షపాతబుద్ధితో అధ్యయనమొనర్చి తమ గ్రంథముల ద్వారా ఆ దినములలో గావించిన ఉపద్రవమును గూర్చి పైన వ్రాయబడినది ఇట్టిస్థితి యందు మహర్షి దయానందులు;

'వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట; మరియు వినుట వినిపించుట ఆర్యులందరి పరమధర్మము' అను నియమమును జేయుట మరియు **'వేదములవైపుకు నడువుడు'** అను ప్రబల నినాద మొనర్చుట ఎంత సాహసపూర్ణమగు కార్యమో చూడుడు. ఐనను మహర్షి దయానందులు ఎంతటి నిర్భయత్వముతో ట్టికార్య మొనర్చినారో దానినుల్లేఖించకుండుట మహోకృతఘ్నత సూచకమే యగును సుశిక్షితులగు భారతీయుల దాసమనోవృత్తి పాశ్చాత్యులను మాత్రమే వేదములు మున్నగు విషయములందు పరమ ఆప్తులుగా నెంచుచుండెడిదో దానిని మహర్షి దయానందులు స్పష్టముగా నిరాకరించినారు. వారు తన సత్యార్థప్రకాశమునందలి ఏకాదశ సముల్లాసము నందు ఈపాశ్చాత్యవిద్వాంసుల సంస్కృతయోగ్యతను గూర్చి ఇట్లు వ్రాసినాడు.

''ఇంతవరకు సంస్కృతవిద్యాప్రచారము ఆర్యావర్త దేశములందు ఎంతగా కలదో ఏ ఇతర దేశమునందును లేదు జర్మనీ దేశములో సంస్కృత ప్రచారము ఎంత అధికముగా గలదో, మ్యాక్స్ మూల రెంత సంస్కృతమును చదివియున్నారో అంతగా ప్రపంచము నందెచ్చటను జరుగలే' దను విషయము కేవలము మాట మాత్రమే ఏలన,

**'నిరస్తపాదపే దేశే, ఏరణ్డోఽపి ద్రుమాయతే'**

అనగా; 'వృక్షములు లేని దేశములో ఆముదపు చెట్టే మహా వృక్షముగా నెంచబడు' నన్నట్లు యూరోపుదేశమునందు సంస్కృతవిద్యాప్రచారము లేనందున జర్మనులు, మరియు మైక్స్‌మ్యూలర్‌గారు కొద్దిపాటి చదివినదే వారి దేశములో అధికము గదా! కాని ఆర్యావర్తము వైపు జూచినప్పుడది అతిన్యూనమైనదే. ఏమన, నేను జర్మనీదేశస్థుడగు ఒక ప్రిన్సిపాల్‌గారిని ఎరుగుదును. వారొకనాడిట్లనినారు 'జర్మనీదేశమునందు సంస్కృత

జాబుకు ( చిట్టికి) అర్థము నొనర్చువారు చాలతక్కువగా నున్నారు మైక్స్‌మూలర్‌గారి సంస్కృతసాహిత్యము మరియు కొద్దిపాటి వేదవ్యాఖ్యను జూచినప్పుడిట్లు తోచును మ్యాక్స్‌మూలర్‌గారు అక్కడిక్కడ ఆర్యావర్తీయులు చేసిన వ్యాఖ్యలను జూచి ఉన్నదున్నట్లుగా కొంత వ్రాసినాడు. జర్మనీదేశము మరియు మైక్స్‌మూలర్ గారిలో సంస్కృతవిద్యయం దెంతటి పాండిత్యముగలదో దీనిద్వారా మన మూహింపవచ్చును ॥ (సత్యార్థప్రకాశము.౧౧వ సముల్లాసము ౩౪౦వపుట ఆర్యసాహిత్యమండలి, అజ్మీర్, చతుర్థావృత్తి )

ఇదేవిధముగా భ్రాంతినివారణ మను గ్రంథమున 'ప్రిన్సిపాల్ మహేశ్చంద్ర న్యాయరత్న' గారు, గ్రిఫిత్ హోగ్ మున్నగువారికి 'ఏకేశ్వరవాదము'న గల భావములు ఖండించుచు మహర్షి దయానందు లీవిధముగా వ్రాసినారు.

డాక్టర్ ఎమ్ హోగ్ , సి హెచ్ టానీ మరియు గ్రిఫిత్ మున్నగు కొందరు ఈశ్వరులు కారు వారు వ్రాసినదంతయూ ఆలోచించక మరియు పరీక్షించక విశ్వసించదగినదిగాదు. డా.ఎమ్ హోగ్ మున్నగు వారు ఋషి మునుల కన్న గొప్ప వారైయుండిరా? పం మహేశచంద్ర న్యాయరత్నగారు మహోన్నతులని యెంచి తలపై నెక్కించుకొనుటకు వారి రచనలు మన ప్రాచీన గ్రంథములకన్న మిన్నయైనవియా? న్యాయరత్నగా రట్లొనర్చినను నాదృష్టియందు మాత్రము వారెంతో అంతే. (మహర్షి దయానందకృత భ్రాంతి నివారణము ౧౦ వపుట)

ఆర్యులు భారతదేశమునకు బయటి (మధ్యాఆశియా మున్నగు ప్రాంతముల) నుండి వచ్చినట్లు పాశ్చాత్యలేఖకులు ఒక భ్రమను వ్యాపింప జేసినారు. వచ్చిన ఆర్యులు ఇచ్చటివారిపై అనేక అత్యాచారము లొనర్చినారని, వీరు ఇచ్చటి దస్యులు , లేక ద్రవిడులపై అనేక యుద్ధము లొనర్చినట్లు అనేక వర్ణనలు వేదములందును గలవని అనేక కల్పనలను పాశ్చాత్యులు తమ గ్రంథములందు వ్రాసినారు మహర్షి దయానందులకాల మందును ఇట్టిభ్రాంత విషయములు చాలా వ్యాప్తి యందుండెను ఈవర్తమాన కాలమునందును ఇతిహాస లేఖకు లెల్లరును దీనిని తథ్యమనియే నమ్ముచున్నారు మేమింత వరకెన్ని ఐతిహాసికగ్రంథములు, వేదాదుల విషయమున పాశ్చాత్యులు, మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసులు వ్రాసిన గ్రంథములను జూచియున్నామో వానిలో- *(Rig Veda Un-veiled by Shri Dwij Das, M.A.LL.B. Rigvedic India and RigVeda culture by Shri Abinash Chandra Das M.A PH.D., Vedic Age* మున్నగునవి చేరియున్నవి ) ఈయున్నటియందును ఈవిషయమునే పునరుచ్చరించుట జరిగినది కాని మహర్షి దయానందులు విదేశీయుల ఈకల్పనలను నిరాధారములని చూపుచు సత్యార్థ ప్రకాశము అష్టమసముల్లాసము నందిట్లు వ్రాసినారు

**ప్రశ్న:** - మొట్టమొదట ఈదేశము పేరేమి? ఇచ్చట ఎవరు నివసించుచుండిరి?

**ఉత్త:** - పూర్వమిచ్చట ఎవ్వరును లేకుండిరి దీనికొట్టి పేరును లేకుండెను. ఆర్యులకు పూర్వమిచ్చట ఎవ్వరును నివసించలేదు సృష్ట్యాదియం దార్యులు కొంత కాలము తరువాత త్రివిష్టపము ( తిబెట్టు) నుండి నేరుగా ఇచ్చటికే చేరియుండిరి.

**ప్రశ్న:** - ''ఆర్యులు ఈరాక్ నుండి వచ్చినారు కావుననే వీరిపేరు ఆర్యులుగా నిలిచినది వీరికి పూర్వము ఇచ్చట ఆటవికులు నివసించుచుండిరి. వీరినే అసురులు, మరియు రాక్షసులు అని చెప్పుకొనుచుండిరి వారు

యుద్ధములను జేయుచుండిరి. వానినే దేవాసుర సంగ్రామములని కథలలో వర్ణించినారు.'' అని అనేకులందురు గదా!

**ఉత్త:-** ఈవిషయము సంపూర్ణముగా నిరాధారము. ఎందుకన;

**'విజానీహ్యార్యాన్ యే చ దస్యవో బర్హిష్మతే రన్ధయా శాసదవ్రతాన్' ॥ఋ. ౧-౫౧-౮ 'ఉత శూద్ర ఉతార్యే' ॥ అథర్వ.౧౯-౬౨ ॥**

ఆర్యులనగా; ధార్మికులు, శ్రేష్ఠులు, విద్వాంసులు, ఆప్తపురుషులు మున్నగువారు ఇందుకు విపరీతగుణములు గలవారు దస్యులు. అనగా, దుష్టులు, బందిపోట్లు, ధర్మహీనులు, అవిద్వాంసులగువారు మరియు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, అను ఈద్విజుల పేర్లు ఆర్యులు మరియు శూద్రుల పేర్లు అనార్యులు అనగా అజ్ఞానులని వ్రాసియుంటివి. వేదము లిట్లు చెప్పుచుండ విదేశీయుల కపోల కల్పితములను ఏబుద్ధిమంతుడును, ఎప్పుడును నమ్మలేడు. ఏ సంస్కృత గ్రంథమందును మరియు ఇతిహాస గ్రంథమందును 'ఆర్యులు ఈరాక్ నుండి వచ్చినారు, ఇచ్చటి ఆటవికులతో పోరాడి వారిని పారద్రోలి ఈదేశమునకు రాజులైనారు అని వ్రాసియుండలేదు. అట్టిచో విదేశీయుల ఇట్టి రచనలెట్లు మాననీయము లగును?' (సత్యార్థప్రకాశము, అష్టమ సముల్లాసము, ఆర్యసాహిత్యమండలి, చతుర్థ ప్రకాశనము, ౨౭౩ వ పుట).

ఈవిధముగా విదేశీయుల దాసమనోవృత్తిని భారతీయులనుండి దూరమొనర్చ దయానందు లిట్లువ్రాసియున్నారు. ఏవిధముగా పరమేశ్వరుడు పవిత్రుడు, సకలవిద్యావేత్త, శుద్ధగుణకర్మ స్వభావములుగలవాడు, న్యాయకారి, దయాళువు మున్నగు గుణములు గలవాడో, అదేవిధముగ ఏపుస్తకమునందు ఈశ్వరగుణకర్మస్వభావముల కనుకూలమగు కథనము గలదో అదియే ఈశ్వరకృతమగును గాని అన్యమెట్లగును? కాదుగదా! ఎద్దానియందు సృష్టిక్రమము, ప్రత్యక్షాది ప్రమాణములు, ఆప్తుల, మరియు పవిత్రాత్మల వ్యవహారములకు విరుద్ధములగు కథనములుండవో అవియే ఈశ్వరోక్తములు, ఏవిధముగా ఈశ్వరజ్ఞానము నిర్భ్రాంతమో, అదే విధముగా ఏ పుస్తకము భ్రాంతి రహితమగు జ్ఞానమును ప్రతిపాదించునో అదియే ఈశ్వరోక్తమగును. ఏవిధముగా సృష్టిక్రమమునందుచూపబడినదో, అదేవిధముగా ఈశ్వరుడు, సృష్టికార్యకారణములు, జీవుని ప్రతిపాదనము దేనియందు గలదో అదియే పరమేశ్వరోక్తమగు పుస్తక మగును ప్రత్యక్షాది విషయములవిరుద్ధముగా నుండి, శుద్ధాత్మ స్వభావమునకు విరుద్ధముగా నుండనివే వేదములు కాని ఇతరములగు బైబిల్, కురాన్ మున్నగు పుస్తకములు మాత్రముగావు వీని వ్యాఖ్యను బైబిల్ మరియు కురాన్‌ల ప్రకరణము ౧౩, ౧౪ వ సముల్లాసములందు స్పష్టముగాగలదు. (సత్యార్థ ప్రకాశము, సప్తమసముల్లాసము. ౨౪౩వ పుట)

ఇంకను ప్రబలమగు అనేక యుక్తులతో మహర్షి దయానందులు వేదములను పరమేశ్వరోక్తములని సిద్ధి పరచుచు ఇట్లువ్రాసినారు.

వేదములు పరమేశ్వరోక్తములు, మానవులెల్లరును వానిననుసరించి యే నడచుకొనవలయును తల్లితండ్రు లేవిధముగా తమ సంతానముపై కృపాదృష్టితో వారి ఉన్నతిని కోరుదురో, అదేవిధముగ పరమేశ్వరుడు మానవులపై

కృపగలవాడై వేదములను ప్రకాశపరచినాడు. వీనిద్వారా మనుష్యులు అవిద్యాంధకారమను భ్రమజాలమునుండి విముక్తులై విద్యా విజ్ఞానరూప సూర్యుని ప్రాప్తిజేసికొని అత్యంతానందమునం దుండి విద్యా సుఖములను వృద్ధిపరచుకొనవలెను

వేదములు నిత్యములు మరియు అపౌరుషేయములు. (వీనివిషయములో యుక్తి ప్రమాణాదులు ముందరఈయబడును. వీని సమర్థనము నందు ఇతర నానామతావలంబులగు నిష్పాక్షిక విద్వాంసుల ఉదాహరణములు గూడ ఈయబడును) వీనియందు అనిత్యమగు అసంబద్ధమగు ఇతిహాసము, రాజుల మహారాజుల, ఋషి మునుల పేర్లు మరియు చరిత్రలు ఉండజాలవు. వేదముల శబ్దములు యౌగికమైనవి. వానిని యౌగికమని విశ్వసించియే వాని వ్యాఖ్య యొనర్చబడును. కాని వ్యక్తి, దేశము మున్నగు విశేష సంజ్ఞామానముగ గాదు. వేదములందు సమస్త సత్యవిద్యలను బీజరూపముగా గాంచనగును. కావుననే వానియధ్యయనము మానవులెల్లరకును ఉపయోగకరమైనది వీని ద్వారము లెప్పుడును మానవమాత్రు లెల్లరకొరకును తెరచియే యుండును. ఎట్లన;

**యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః।**

**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ** ॥ య ౨౬.౨ ॥

మున్నగు వేదమంత్రములందు స్పష్టముగా చెప్పబడియున్నది ఏమన, పరమేశ్వరుడ నగు నేను కల్యాణీ అనగా ఇహ పరలోకముల సుఖములను ప్రసాదించునట్టి ఋగ్వేదము మున్నగు నాలుగు వేదముల వాణిని సకల మానవులకు అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అతిశూద్ర స్త్రీపురుషులెల్లరికొరకును ఎట్లు ఉపదేశించుచున్నానో ఇదేవిధముగా మీరును ఒనర్చుడు మానవులెల్లరును వేదములను చదువుట చదివించుట, మరియు వినుట వినిపించుట ద్వారా విజ్ఞానమును పెంపొందించుకొనవలయును. ఉత్తమ గుణములను స్వీకరించుచు చెడువిషయములను త్యజించి దుఃఖములనుండి విముక్తులై యుండు డని పరమేశ్వరుని ఉపదేశము పరమేశ్వరుడు శూద్రుల మేలును కోరనివాడా? ఈశ్వరుడు పక్షపాతియా? వేదములను చదువుటను, వినుటను శూద్రులకొరకు నిషేధించినాడా? ఇవి ద్విజుల కొరకే ప్రసాదించినాడా? పరమేశ్వరుడు పృథివి, జలము, వాయువు, సూర్యచంద్రాదులు, అన్నము మున్నగు పదార్థములను ఏవిధముగా సమస్త మానవుల కొరకు ప్రసాదించినాడో వేదజ్ఞానమునుగూడా ప్రసాదించినాడు గదా! నిర్మాణాత్మక మూర్తులగు స్త్రీలను సైతము '**స్త్రీశూద్రౌనాధీయతామితిశ్రుతేః**' యను కపోల కల్పిత శ్లోకముల ద్వారా స్త్రీలనుసైతము శూద్రులతో గలిపి వారికి వేదపఠనమును నిషేధించినారు. ఈబ్రాహ్మణాది చాతుర్వర్ణములను గనినది తల్లియేగదా! స్త్రీలను వేదపఠనమునుండి వంచితుల నొనర్చువారిని మూర్ఖులే గాదు పరమ మూర్ఖులని యన్నను దోషము గాదు. ఇది స్వార్థము, మరియు బుద్ధిహీనతాప్రభావమే వేదములందు కన్యలు వేదములను చదువుటకు అధికారులే యనిగలదు

**బ్రహ్మచర్యేణ కన్యా యువానం విన్దతే పతిమ్** ॥ అథర్వ ౧౧-౬-౧౮॥

ఇందువల్ల స్త్రీలుకూడా బ్రహ్మచర్య పూర్వకముగ విద్యల నవశ్యముగా గ్రహించవలెను

**ప్రశ్న:**- స్త్రీలు కూడా వేదములను చదువవచ్చునా?

**ఉత్త:**- అవశ్యముగా చదువవచ్చును.

వేదసమ్మతమగు దయానందుని యుదారత అత్యంత మహత్వపూర్ణమైయున్నది మధ్యకాలీన ఆచార్యులెల్లరును ( ఋషి పత్నుల సమానమగు శ్రేష్ఠ స్త్రీలకు కొంతవరకు వేదాధికారము నంగీకరించు శ్రీమధ్వాచార్యులు తప్ప) మిగతా ఆచార్యులెల్లరును తమ గ్రంథములు, మరియు వేదాంతభాష్యము మున్నగు వానియందు 'శూద్రకులోత్పన్నులగు పురుషులకు, మరియు సమస్త స్త్రీలకు వేదములను చదువు అధికారము లేదని చండశాసకులుగా శాసించినారు, ఉదా;- శంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యము నందిట్లు వ్రాసినాడు.

**'ఇతశ్చన' శూద్రస్యాధికారః । యదస్య స్మృతేః శ్రవణాధ్యయనార్థప్రతిషేధో భవతి ।**

**వేదప్రతిషేధో వేదాధ్యయనప్రతిషేధస్తదర్థ జ్ఞానానుష్ఠానయోశ్చ ప్రతిషేధః శూద్రస్యస్మర్యతే ।**

**శ్రవణ ప్రతిషేధస్తావత్**

**'అధ్యాస్య వేద ముపశృణ్వతస్త్రపుజతుభ్యాం శ్రోత్రపరిపూరణమితి ।'**

**'పద్యు హ వాఏతత్ శ్మశానం యత్ శూద్రః తస్మాత్ శూద్రసమీపే'**

**నాధ్యేతవ్యమ్ ఇతి । అత ఏవాధ్యయనప్రతిషేధః । యస్య హి సమీ**

**పేऽపి నాధ్యేతవ్యం భవతి స కథమశ్రుతమధీయీత భవతి చ**

**వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేదః ఇతి । అతఏవ చార్థా**

**దర్థజ్ఞానానుష్ఠానయోః ప్రతిషేధో భవతి 'న శూద్రాయ మతిం' దద్యాత్**

**ఇతి శ్రావయేచ్చతురో వర్ణాన్ ఇతి చేతిహాసపురాణా ధిగమే**

**చాతుర్వర్ణ్యస్యాధికారస్మరణాత్।**

**వేదపూర్వకస్తు నాస్త్య ధికారః శూద్రాణామితి స్థితమ్ ॥** బ్రహ్మసూత్ర శాంకరభాష్యమ్ ౧౨౭వ పుట. అ 3 పద. 3 సూ. 3౮ భాష్యమ్.

అనగా.-స్మృతి ద్వారా శూద్రులు వేదములను చదువుట, వినుట నిషేధించబడినది (గౌతముని పేర కల్పితస్మృతి) అందు శూద్రు డొకవేళ వేదశబ్దమును వినినచో అతని చెవులను సీసముతో మరియు లక్కతో నింపివేయవలయును. శూద్రుడనగా నడచునట్టి శ్మశానము కావున వాని సమీపమున అధ్యయన మొనర్చరాదు. ఇందుచేతనే అధ్యయనము నిషేధింపబడిన దని స్పష్టమగుచున్నది. వాని సమీపమునందు అధ్యయనము సైతము చేయగూడదు వినకున్న అధ్యయనమెట్లు చేయగలము? వేదముల నుచ్చరించినచో జిహ్వాచ్ఛేద ( నాలుకను కోసివేయుట) మరియు శరీర భేదము ( శరీరమును ముక్కచెక్కలుగా నరికి వేయుట) కు విధానము గలదు. కావుననే వేదముల అర్థజ్ఞానము, మరియు దాని ననుసరించి ఆచరణ నిషేధించబడినది 'శ్రావయేచ్చతురో వర్ణాన్' మున్నగు మహాభారత వచనముల ద్వారా ఇతిహాస పురాణముల అధ్యయనమునకు నాల్గు వర్ణములకును

అధికారముగలదని తెలియుచున్నది. కాని శూద్రుల వేదపూర్వక అధ్యయనము నిషిద్ధపరచబడినది. బృహదారణ్యకోపనిషత్తునందు

**'అథ య ఇచ్ఛేద్ దుహితా మే పణ్డితా జాయేత ॥ బృ.౬-౪-౧౭॥'**

**అనగా:-** నాకూతురు పండితురాలు గావలయును. ఈయావిధమగు ఆహారవ్యవహారము లొనర్చవలయునను నట్టి అనేకవర్ణనలు వచ్చినవి. వాని వ్యాఖ్యానమందు శ్రీశంకరాచార్యులిట్లు వ్రాసినారు.

**'దుహితుః పాండిత్యం గృహతంత్ర విషయమేవ వేదేఽనధికారాత్ ॥**

అనగా; ఈయుపనిషత్తునందలి కన్యల పాండిత్య ప్రతిపాదనము కేవలము

గృహకృత్యముల వర కనియే యని ఎరుగవలెను. ఏలన వారికి వేదపఠనాధికారములేదు.

శ్రీరామానుజాచార్యులును వేదాన్త ౧.౩-౩౮ భాష్యమున ఇట్లు వ్రాసినాడు.

**శూద్రస్య వేదశ్రవణతదధ్యయనతదర్థానుష్ఠానాని ప్రతిషిధ్యన్తే ।**

**పద్యుహవా ఏతత్ శ్మశానం యచ్ఛూద్రః తస్మాత్ శూద్రసమీపే నాధ్యేతవ్యమ్ ।** (వసిష్ఠస్మృతి ౧౮-౧)

**తస్మాత్ శూద్రో బహుపశూరయజ్ఞియ ఇతి బహుపశుః పశుసదృశ ఇత్యర్థః ।**

**అనుపశృణ్వతోఽధ్యయన తదర్థజ్ఞానతదర్థానుష్ఠానాని న సంభవన్తి ।**

**అతస్తాన్యపి ప్రతిషిద్ధాన్యేవ । స్మర్యతే చ శ్రవణాదినిషేధః ।**

**అథ హాస్య వేదముపశృణ్వతస్త్రపుజ తుభ్యాం**

**శ్రోత్రపరిపూరణముదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేద ఇతి ।**

**న చాస్యోపదిశేద్ ధర్మ న చాస్య వ్రతమాదిశేత్ ॥ ఇతి చ ।**

**అతః శూద్రస్యానధికార ఇతి సిద్ధమ్ ॥'** మను ౪-౮౦.

అనగా; శూద్రునకు వేదముల శ్రవణాధ్యయనములు, మరియు వాని అనుష్ఠానాచరణములు నిషిద్ధములు. శూద్రుడు తిరుగులాడునట్టి స్మశానమై యున్నాడు. కావున వాని సమీపమున అధ్యయన మొనర్చరాదు. ఆతడు పశువుతో సమానము. వేదశ్రవణమే ఆతనికి నిషేధమై యున్నప్పుడు వాని యధ్యయనము, అర్థజ్ఞానము, వైదికాచరణ విషయము సంభవముగాదనియేగదా! శూద్రుడు వేదమును వినినచో వాని చెవులయందు సీసము, మరియు లక్కను కరిగించి నింపివేయవలయును. వాడొకవేళ వేదమంత్రము నుచ్చరించినచో వాని నాలుకను కోసివేయవలయును. వేదమంత్రమును జ్ఞాపకమొనర్చుకొనిన వాని శరీరమును ముక్కలు ముక్కలుగా నరికివేయవలెను. కావుననే శూద్రుడు వేదాధ్యయనము మరియు బ్రహ్మవిద్యా ప్రాప్తియందు సదా అనధికారియైయున్నాడు.

శ్రీమధ్వాచార్యులు( స్వామి ఆనందతీర్థ గారు) కూడా శూద్రుల వేదాధికారమును నిషేధించుచు ఉపర్యుక్త వేదాంతసూత్రము 3-3-38న నిట్లు వ్రాసియున్నాడు.

**శ్రవణే త్రపుజతుభ్యాం శ్రోత్రపరిపూరణమ్ అధ్యయనే జిహ్వాచ్ఛేదః**

**అర్థావధారణే హృదయవిదారణమ్ ఇతి ప్రతిషేధాత్ । నాగ్నిర్న యజ్ఞః**

**శూద్రస్య, తథైవాధ్యయనం కుతః । కేవలైవ తు శుశ్రూషా త్రివర్ణానాం**

**విధీయతే । ఇతి స్మృతేశ్చ ॥ బ్రహ్మసూత్రాణుభాష్యే. పృ.౯౭ ॥**

ఇచ్చట స్మృతి వచనముల పాఠము శ్రీ శంకరాచార్య, మరియు శ్రీ రామానుజాచార్యుల ద్వారా ఉదాహరించిన పాఠమునకు కొంత భిన్నముగ నున్నను అర్థము మాత్రము అదియే ఏమన; ఒకవేళ శూద్రుడు వేద శబ్దమును వినినచో వాని చెవులను సీసము, మరియు లక్కతో నింపివేయవలయును. వేదాధ్యయన మొనర్చినచో వాని నాలుకను కోసివేయవలెను. అర్థ జ్ఞానము నిశ్చయమొనర్చుకొనినప్పుడు హృదయమును ముక్కలుగ జేసివేయవలెను శూద్రునకు అగ్ని హోత్రము, యజ్ఞము, అధ్యయనాదుల అధికారము లేదు. వాని కర్తవ్యము కేవలము పై మూడు వర్ణముల సేవ యొనర్చుటయే యని స్మృతులందు గలదు మున్నగునవి

పైన వ్రాసినట్లు మధ్వాచార్యులు,

**ఆహురప్యుత్తమస్త్రీణాం అధికారం తు వైదికే ।**

**యథోర్వశీ యమీ చైవ శచ్యాద్యాశ్చ తథాపరాః ॥'**

మున్నగు వచనముల ద్వారా ఉత్తమ స్త్రీలు వేదాధికారమును స్వీకరించు ఔదార్యము చూపబడినది. **'వేదా అప్యుత్తమస్త్రీభిః కృష్ణాద్యాభిరిహాఖిలాః' 'ఉత్తమ స్త్రీణాం తు న శూద్రవత్'** ఉత్తమ స్త్రీల యొక్క వేదాధికారమును సమర్థించు వచనము లాయన గ్రంథములందు గాన్పించును. వీనిద్వారా శ్రీ శంకరాచార్యులకన్న కొంత ఉదారత్వము వీరియందు సూచితమగుచున్నది.

శుద్ధాద్వైత మత ప్రవర్తకులగు వల్లభాచార్యులు కూడా అత్యంత స్పష్ట శబ్దములలో శూద్రుల వేదాధ్యయనమును నిషేధించుచు ఇట్లు వ్రాసినాడు

**'శూద్రే హ్యధికార చిన్తా వేదస్య శ్రవణాధ్యయనమర్థజ్ఞానం త్రయమపి**

**తస్య ( శూద్రస్య) ప్రతిషిద్ధం తత్సన్నిధావన్యస్య చ । అథాస్య వేదముప**

**శృణ్వతస్త్రపుజతుభ్యాం శ్రోత్రపరిపూరణమితి ఉచ్చారణే జిహ్వాచ్ఛేదో**

**ధారణే శరీరభేదః । స్మృతియుక్త్యాపి వేదార్థే న శూద్రాధికార ఇత్యాహ**

**స్మృతేశ్చ; వేదాక్షరవిచారేణ శూద్రః పతతి తత్క్షణాత్ ॥**

'పారాశరస్మృతి ౧-౭౩ । బ్రహ్మ సూత్రాణు భాష్యే వల్లభాచార్య కృతే ఆర్యభాను ప్రెస్ పృ - ౯౯ ॥'

అనగా; శూద్రునకు వేదములను చదువుట, వినుట, అర్థ జ్ఞానము పొందుట యను నీ మూడును నిషేధించబడినవి కావున ఆతని వేదాధికారము మాట చాల దూరపు విషయము. శూద్రుడు వేద మంత్రము వినినచో వాని చెవులలో సీసము, మరియు లక్కను నింపి వేయవలెను, ఉచ్చరించినచో వాని నాలుకను కోసివేయవలెను. మంత్రమును జ్ఞప్తి యందుంచుకొనిన వాని శరీరమును ముక్కలు ముక్కలుగా జేసి వేయవలెను వేదము యొక్క ఒక్క అక్షరమును గూర్చి ఆలోచించినను అదే క్షణములో శూద్రుడు పతితుడైపోవును. ఈ విధముగా పరాశరస్మృతి యందు గలదు. మున్నగునవి.

ఈ ప్రకారముగా మనము మధ్యకాలీన ఈ సుప్రసిద్ధ ఆచార్యుల వేదాధికారమును గూర్చిన సంకుచిత స్వభావమును జూచినపుడు మహర్షి దయానందుల గొప్ప ఉదారత్వము మన కన్నుల యెదుటికి వచ్చును వేద ప్రచార విషయమందలి వారి అచంచల నిష్ఠను గూర్చి సంపూర్ణ పరిచయము లభించగలదు అది యెంతయో అభినందనీయమై యున్నది బెంగాలు రాష్ట్రముకు చెందిన సుప్రసిద్ధ వైదిక విద్వాంసుడగు శ్రీ పం సత్యవ్రత సామశ్రమీగారు 'శూద్రులు, వారి వేదాధికార విషయ' సంబంధమున మహర్షి దయానందుల మంతవ్యమును సమర్థించుచు ఇట్లు వ్రాసినారు.

**'శూద్రస్య వేదాధికారే సాక్షాత్ వేదవచనమపి ప్రదర్శితం స్వామి దయానందేన యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః। బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ** ॥ యజు ౨౬ - ౨॥

**తదేవం వేదవిధేః పక్షపాతదోష భాక్త్వం న కథమపీతి సిద్ధమ్ ఐతరే యాలోచనమ్.** ॥ పృ ౧౭॥

మహర్షి దయానందుల ఈ ఉదారత్వము యెడ శ్రద్ధాంజలి నర్పించుచూ జగద్విఖ్యాత ఆలోచనాపరుడగు రోమాన్ రొలాండ్ గారిట్లు యధార్థముగా వ్రాసినారు

It was in truth an epochmaking date for India when a Brahman not only acknowledged that all human beings have the right to know the Vedas, whose study had been previously prohibited by orthodox Brahmins, but insisted that their study and propaganda was the duty of every Arya. (Life of Rama Krishna by Roman Rolland P. 59).

అనగా ; వాస్తవముగా భారతదేశమున ఒక నవయుగ నిర్మాత కాలము వచ్చినది పాఖండ మార్గపు బ్రాహ్మణులు వేదములు చదువు అధికారము కేవలము బ్రాహ్మణులకు గాక మరెవరికీ లేదను ఆంక్ష పెట్టినప్పుడు ఆ బ్రాహ్మణుడు (స్వామి దయానంద సరస్వతి) మానవమాత్రులెల్లరును వేదములను చదువుటకధికారము గలిగియున్నారని వేదాధారముతోనే బలపరిచినాడు ఇంతే గాక వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట మరియు వినుట వినిపించుట ఆర్యులెల్లరి పరమ ధర్మము అను నియమ మేర్పరచినారు మహర్షి దయానందులు వేదోక్త యజ్ఞముల సత్య స్వరూపమును విద్వన్మండలి సమక్షమున నుంచుచు, స్వీయ కల్యాణమునకు మరియు లోక హితమునకై యొనర్పు సమస్త సత్కార్యములు యజ్ఞములనబడునని. వైదిక యజ్ఞములందు పశుబలులనిచ్చుట సర్వదా వేద విరుద్ధము. ఎట్లనగా యజ్ఞముల నామమే అధ్వరము దీని అర్థము యాస్కాచార్యులు నిరుక్తము నందు స్పష్టముగా ఇట్లు వ్రాసి యున్నాడు

**'అధ్వర ఇతి యజ్ఞ నామ ధ్వరతిర్హింసాకర్మా తత్ప్రతిషేధః'** ॥ నిరు. ౧-౭ ॥

యజ్ఞములద్వారా జలవాయువులు శుద్ధియగుటయే గాక బుద్ధియును తీవ్రము మరియు పవిత్రము నగును. ఈ విధమగ జగత్కల్యాణము జరుగును.

అశ్వమేధము, గోమేధము, నరమేధము మున్నగు శబ్దముల అభిప్రాయము అశ్వములు, గోవులు, మనుష్యులను యజ్ఞములందు బలియిచ్చుట గాదు ( అజ్ఞానవశమున మధ్యకాలీన ఆచార్యు లెల్లరును, శాక్తేయ, కాపాలికాదులును, ఆర్వాచీన విద్వాంసులు కూడా చాలవరకు దీనిననుసరించుచున్నారు ఇది కడు ఆశ్చర్యము మరియు దుఃఖకరమగు విషయము' ) అని వ్రాయుచు

**'వీర్యం వా అశ్వః** ॥ శత పథ.. ౨-౧-౪-౨౩౨౪॥

**రాష్ట్రం వా అశ్వ మేధః** ॥ శత. ౧౩-౧-౩, తై ౩-౮-౯-౪, ౩-౯-౪-౫॥'

మున్నగు వచనముల ననుసరించి రాష్ట్రమునందు న్యాయపూర్వకమైన ఉత్తమ శాసనమొనర్చుట మరియు రాష్ట్రవాసుల శక్తుల నన్ని విధముల సమృద్ధి పరచుటయే అశ్వమేధము, 'గోవు' అనగా పృథివి, వాణి మరియు ఇంద్రియాదులని గూడ అర్థమగును. 'మేధ' యనునది 'మేధృ-మేధా సంగమనయోః', అను ధాతువునుండి సిద్ధమగు చున్నది. పవిత్ర పరచుట మరియు కలిపివేయుట యని దీని యర్థము. ఈ విధముగ భూమి యందు ఉత్తమ పంటలు ( ధాన్యముల) నుత్పన్నమొనర్చుట, వాణిని శుద్ధమొనర్చుట మున్నగు అర్థములు గోమేధమున కగును. నరమేధమను దాని యర్థము నరులెల్లరును పరస్పరము ప్రేమతో గలసియుండుట (సంగమన) వారి యందు ప్రేమ మరియు సహయోగ భావననుత్పన్న పరచుటయే యగును. మరియు మనుస్మృతి యందు **'నృయజ్ఞోఽతిథి పూజనమ్** ॥౩-౭౦'' ॥ ననుసరించి 'అతి థులను పూజించవలె' నను అర్థముకాగా మనుష్యులను దేవీదేవతలకు బలినీయవలెనను అర్థమొనర్చుట ఎంతటి రాక్షసత్వమో ఆలోచించుడు. యజ్ఞ శబ్దము **'యజ్-దేవ పూజా సంగతీకరణదానేషు'** అనుధాతువుతో నేర్పడుచున్నది. పరమేశ్వరుని, మరియు విద్వాంసుల పూజనము (గౌవరించుట, సత్కరించుట) మానవులందు ఐకమత్య భావన నుత్పన్నమొనర్చుట, అనగా వస్తువులను చక్కని యనుపాతమున గలిపి శిల్పము మున్నగు కార్యముల నొనర్చుట, మరియు సుపాత్ర దానము ఇవియన్నియు గలిసియున్నవి ఈ విషయములో పౌరాణికులు, తాంత్రికులు, పాశ్చాత్యులు మరియు వారి అనుయాయులగు దాస భావలేఖకులు ఏభ్రమను గలిగించియున్నారో దాని వివేచనమును మేము వైదిక యజ్ఞ విషయక అధ్యాయమునందు కొంత విస్తారముగా, ప్రమాణయుక్తముగా ముందు వ్రాయుదుము. మహర్షి దయానందులు తన భాష్యమునందు యజ్ఞము విషయములో విస్తృత వ్యాపకముగా నున్న అర్థమును వేదములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, గీత మున్నగు వాని యాధారమున ఏ పరిచయము నిచ్చి యున్నాడో అది వారి అగాధమగు వైదిక జ్ఞానము, మరియు ఋషిత్వమునకు చక్కని నిదర్శనమై యున్నది. చూడుడు.

**ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాః యోగయజ్ఞాస్తథాపరే ।**

**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః** ॥గీత. ౪-౨౮॥

**విద్వత్సఙ్గవిద్యోన్నతిహోమశిల్పా శ్చైర్యజ్ఞైర్వాయువృష్టిజలశుద్ధయశ్చ సదైవ కార్యాః** ॥ యజుర్వేద ౧-౨౧ వ మంత్ర భావార్థము ॥

ఇచ్చట విద్వాంసుల సత్సంగము, విద్యా ఉన్నతి, హవనము, శిల్పము మున్నగు వానిని వారు యజ్ఞ శబ్దముచే గ్రహించినారు. యజు ౫-౩వ మంత్ర భాష్యమునందు యజ్ఞము యొక్క అర్థము 'అధ్యయనాధ్యాపనం కర్మ' అనగా చదువుట చదివించుట. ఇట్లే మనుస్మృతి యొక్క అధ్యాపనం బ్రహ్మ యజ్ఞః' మను ౩-౭౦ ॥ కి సంపూర్ణముగ అనుకూలమై యున్నది. కుల్లూకభట్టు తనటీక యందు స్పష్టపరచినట్లు,

**అధ్యాపనశబ్దేనాధ్యయనమపి గృహ్యతేఽతోఽధ్యాపనమధ్యయనం చ బ్రహ్మ యజ్ఞః॥**

అనగా, అధ్యాపనమనుటచే అధ్యయన మెట్లాగూ గ్రహించ బడుచునే యున్నది అనగా బ్రహ్మయజ్ఞము నందు వేదాదుల అధ్యయనము, అధ్యాపనము రెండును కలిసియే యున్నవి. యజుర్వేద ౧౧-౭ మరియు ౯-౧ వ భాష్యమునందు యజ్ఞమున కర్థము మహర్షి **'సుఖజనకో రాజధర్మః'** అనగా ఎల్లరను సుఖపరచు రాజధర్మమని యొనర్చినారు.

యజుర్వేద ౧౮-౨౬వ మంత్ర భాష్యమునందు మహర్షి **'యజ్ఞేన పశుపాలన విధినా'** అనగా పశుపాలనము కూడా యజ్ఞమని అంగీకరించినారు మరియు యజుర్వేద ౧౮-౨౯ వ మంత్ర వ్యాఖ్యయందు 'యజ్ఞమ్' అనుదాని యర్థము. **'ధర్మ్య వ్యవహారమ్'** అనగా ధర్మయుక్త వ్యవహారమని యొనర్చినారు ఇదే విధముగా యజ్ఞ శబ్దమున కనేకార్థములను గూర్చి ప్రకరణానుసారము ఈ విషయమును గూర్చిన భ్రాంతులను తొలగించుటకు కొంత విస్తార ప్రయత్న మొనర్చెదము.

మహర్షి దయానందులు వేదములు ఈశ్వరీయజ్ఞానము మరియు వివిధ జ్ఞాన విజ్ఞానముల భాండాగార మని తెలుపుచు సాయణాచార్యుడు మున్నగు వారొనర్చిన భాష్యములను అశుద్ధములని అనేక స్థలములందు సప్రమాణముగా నిరూపించినారు. కాని అనేక పౌరాణిక మరియు పాశ్చాత్య విద్వాంసులు మరియు వారి అనుయాయులు మహర్షి యత్నమును అపహాస్యమొనర్చుట గాన నగును. కాని సుప్రసిద్ధ యోగి మరియు ఆలోచనాపరులగు శ్రీ అరవిందులవారు పౌరాణికులు మున్నగు వారి సాహసమును వివేచనమొనర్చుచు వ్రాసినది స్వర్ణాక్షరములతో వ్రాయదగినదై యున్నది శ్రీ అరవిందులవారు సాయణాచార్యకృత వేద భాష్యమును సమీక్షించుచు ఇట్లు వ్రాసినారు.

If ever there was a monument of arbitrarily erudite ingenuity, of great learning divorced, as great learning too often is, from sound judgment and sane taste and a faithful critical and comparative observation, from direct seeing and often even from plainest commonsense or of a constant fitting to the text into the Procurstean bed of Pre-conceived theory, it is surely this commentary otherwise so imposing, so useful as first crude material, so erudite and laborious left to us by the Acharya Sayana.

దీని భావమేమన; ఒకవేళ ఏదైనా విద్వత్తాపూర్ణమైన కృత్రిమ చాతుర్యకోశము గలదనుకొనిన, గొప్ప ఉన్నత విద్వత్తతతో గూడిన గంభీరమగు నిర్ణాయకశక్తి, నిశ్చితమగు అభిరుచి మరియు యథార్థమగు సమాలోచనము, తులనాత్మకమగు పరిశీలన, ఋషుల యొక్క సాక్షాత్కారదృష్టి కన్నను, అత్యంత సాధారణ బుద్ధి కన్నను పతనమైనట్టి బుద్ధి యున్నదనుకొనిన అది పూర్వ వాదమునననుసరించి వేదమంత్రములను చిన్నా భిన్నములొనర్చి అర్థమొనర్చు సాహసకార్యము సాయణాచార్యుని వేద భాష్యమే. అది గొప్ప విశాలము, ఠీవి గల మొట్టమొదటి అపరిష్కృత సామగ్రి రూపములో ఎంతయో ఉపయోగకరమైనది. పరిశ్రమతో కూడినది. వైదుష్య పూర్ణమైనది, ఇట్టి భాష్యమును చదివిన పిదప పక్షపాత రహిత వేద విద్యార్థులు, మరియు విద్వాంసుల శ్రద్ధ సైతము వేదములపై యుండదనిన ఆశ్చర్యపడవలసిన యవసరము లేదు. ఈ విషయమును గూర్చిన సత్యమును ప్రకటిస్తూ సంస్కృత విద్యకు సుప్రసిద్ధ కేంద్రమైన కాశీ పండిత సభ ప్రధాని యగు శ్రీ పం.గోపాలదత్త జీ శాస్త్రి 'దర్శన కేసరి యొక్క వ్యాసము''వేదవాణి'' బనారస్ యొక్క ద్వితీయ వేదాంకము ౧౯౫౩ నవంబర్ నెలలో ప్రకాశితమై యున్నది 'వేదార్థము కేవలము యజ్ఞ పరకమే గాదు' అను శీర్షికతో అత్యంత విద్వత్తతతో గూడిన లేఖ యది. అందు తనకు తెలిసిన రెండు ఉదాహరణములతో మనకు స్పష్టమగును. వారిట్లు వ్రాసినారు.

నేడు ఈ యజ్ఞపరక అర్థమునొనర్చు ( సాయణాచార్యుడు మున్నగు) భాష్యకారుల భాష్యములను చదువువారికి వేదముల యెడ ఏ అశ్రద్ధ, అపనమ్మకము గలుగుచున్నదో దీనికి రెండు ఉదారహణములు నాముందున్నవి. ఒకటి, స్వర్గీయ బా. శివప్రసాద్‌జీ గుప్త ( కాశీ) గారికి వేదములపై గొప్ప శ్రద్ధయుండెడిది. ఆయన అధిక శ్రద్ధతో సాయణభాష్యమును ఒక విద్వాంసునిచే మొదటినుండి చివరవరకు చదివించుకొనినారు. వారు ప్రతి దినము భక్తి శ్రద్ధలతో కూర్చుండి వినుచుండెడివారు ఆకాలములోనే ఒకనాడు నేను వారి వద్దకి వెళ్ళుట జరిగినది. అప్పుడు వారు చేతులు జోడించి నవ్వుచు, శాస్త్రి గారూ! ''నేనిదివరకు వేదార్థమును దెలిసికొనక పోవుటయే బాగైనది. నేను సాయణాచార్యుని వేద భాష్యమును వినినప్పటినుండి నాకిది వరకు వేదముల యెడ గల శ్రద్ధాసక్తులు తొలిగిపోయినవి. అవి యత్యంత జుగుప్సాకరముగ నున్నవి'' అని యనినాడు.

రెండవది; మా యొక్క స్వర్గీయ గురువగు మహామహోపాధ్యాయ పూజ్యపాదులు పం. **అన్నదాచరణ, తర్క చూడామణి మహరాజా గారు**. వారొకనాడు దర్శనములను చదువుచు ప్రసంగవశమున ఇట్లనినాడు. 'వేద సంహితా భాగములం దేమున్నది? అందు ఇంద్రవరుణుల స్తుతియే నిండియున్నది గదా! నిజమునకు వేద వ్యాసులొనర్చిన ఉపనిషత్ శ్రుతుల సారమే అందుగలదు' అని యనినాడు ఇప్పుడు చూచితిరా! సాయణాచార్య, మహీధరాచార్యుల భాష్యమునకిదియేగదా ఫలము? ఇదే కారణమున నేను 'సాయణాచార్యుడు వేదార్థమునొనర్చి జగదుపకారమొనర్చినారని యనుకొనినప్పుడు, కేవలమాతడు యజ్ఞపరక అర్థమునొనర్చి మహా ఘోరమగు అపకారమే చేసినాడు.

ఇదే విధముగా శ్రీ అరవిందకృత 'సాయణభాష్యమునకు నిష్పక్ష సమాలోచన' మను దానిని సమర్థించుచు కాశీ పండిత సభ యొక్క ప్రధాని గారు వ్రాసినారు. వేదములందు గల విజ్ఞాన విషయక మంతవ్యములను నిష్పాక్షికభావముతో వివేచన మొనర్చుచు యోగి అరవిందుల వారిట్లు వ్రాసినారు.

'There is nothing fantastic in Dayananda's idea that Veda contains truth of science as well as truth of religion. I will even add my own convication that Veda contains the other truths of a science the modern world does not at all possess and in that case, Dayananda has rather understated than overstated the depth and range of the Vedic wisdom... If, as Dayanada held on strong enough grounds, the Veda reveals to us God, reveals to us the relation of the soul to God and nature, what is it but a Revelation of Divine truth? And if, as Dayananda held, it reveals them to us with a perfect turth, flawlessly he might well hold it for an infallible scripture... In the matter of Vedic interpretation, I am convinced that what ever may be the final complete interpretation, Dayananda will be honoured as the first discoverer of the right clues. Amidst the chaos and obscurity of old ignorance and agelong misunderstanding, his was the eye of direct vision that pierced in to the truth and fastened on to that which was essential. He has found the keys of the doors that time had closed and rent asunder the seals of the imprisoned fountains.

*Dayananda and Veda from the Article in the Vedic Magazine, Lahore for Nov. 1916. by Shri Aravinda.'*

అత్యంత మహత్వ పూర్ణమైన కారణమున పై సందర్భమును మూలరూపమున చూపుటయే ఉచితమనిపించినది. దీని భావమేమన వేదములందు ధర్మము, విజ్ఞానము, ఈ రెండింటి యందును హాస్యాస్పదములు, మరియు కల్పితము లేమాత్రమును లేవు, వాని యథార్థ స్వరూపములు స్పష్టముగా గాన్పించునని మహర్షి దయానందుల ధృఢ విశ్వాసమైయున్నది ఈ విషయమున నా ధృఢ విశ్వాసమును చేర్చుచున్నాను ఇప్పటి వైజ్ఞానికులు లేశమాత్రమైనను స్పృశించజాలని మరో రకపు విజ్ఞానము యొక్క సత్యములు కూడా వేదములందు సమృద్ధిగా నున్నవి వైదిక విజ్ఞాన గంభీరములను మహర్షి దయానందులు అతిశయోక్తిగా గాక, న్యూనోక్తిగానే చెప్పినా డనవచ్చును. దయానందులు ప్రబల ప్రమాణముల ఆధారముపై వేదములందు పరమేశ్వరుడు, ప్రాకృతిక నియమములు, మరియు పరమేశ్వరునికి ఆత్మ మరియు ప్రకృతితో గల సంబంధము మున్నగు విషయములందు సత్యజ్ఞానము ప్రకాశ పరచబడినచో దీనిని ఈశ్వరీయ సత్య ప్రకాశ మనుటకన్న మరే మనగలుగుదుము ఇట్టి విషయముల జ్ఞానము వేదములందు సంపూర్ణ సత్యముతో నిర్దేశ రూపమున ప్రకాశింపబడియున్న దని మహర్షి దయానందులు విశ్వాస పూర్ణముగా తెలిపినప్పుడు వేదములను నిర్భ్రాంత ధర్మ గ్రంథ రూపమున విశ్వసించుట సముచితమే గదా?. ... వైదిక వ్యాఖ్యాన విషయమున వేదముల చివరి సంపూర్ణ వ్యాఖ్యానము ఎట్లున్నను మహర్షి దయానందుని యథార్థ నిర్దేశముల ప్రథమ ఆవిష్కర్త రూపమే సదా మదియందుండ గలదని నా విశ్వాసము. పురాతన ( ప్రాత) అజ్ఞానము, మరియు మిథ్యాజ్ఞానము యొక్క అవ్యవస్థ మరియు అస్పష్టతల మధ్య సత్యమును వెలికి తీసి, వాస్తవికతతో బంధించివేయుట శ్రీదయానందుల 'ఋషిదృష్టి' యేయైయున్నది. కాలము మూసివేసిన తాళపుచెవులను వారు కనుగొని మూతపడి యున్న వేదస్రోతముద్రలను ఛేదించి వాని ద్వారములను తెరచినారు.

సుప్రసిద్ధయోగిరాజగు మహర్షిదయానందుల యెడ తనకాలమందేగాక ప్రపంచమందలి యోగులలో అతి ప్రఖ్యాతిగల యోగి అరవిందుల ద్వారా సమర్పించబడిన ఈశ్రద్ధాంజలి ఎంతో మహత్వపూర్ణమైన దనుటలో ఎట్టి సందేహములేదు.

## 1.29. వేదవిషయమున జగద్విఖ్యాతయోగి శ్రీ అరవిందుల భావములు

స్వ.శ్రీ అరవిందులు జగద్విఖ్యాతయోగులు వారు Life Divine, Synthesis of Yoga, Bases of Yoga, Lights on Yoga, The Ideal of Human Unity, The Mother మున్నగు యోగవిషయక అనేక ఉత్తమగ్రంథముల ద్వారా విశ్వమునకు ఆధ్యాత్మిక దృష్టిచే మార్గదర్శక మొనర్పు ప్రయత్నమును జేసియుండిరి. వేద విషయములందును సుశిక్షుతులగువారియందును స్థిరపడిపోయిన భ్రాంతుల నివారార్థము *The Secret of the Vedas* అను శీర్షికతో ఒకలేఖమాలను Arya బతీవి అను తన సుప్రసిద్ధ త్రైమాసిక పత్రికయందు అనేక సంవత్సరముల వరకు ప్రచురించుచుండిరి. ఈమధ్యనే అది పుస్తకరూపమున ముద్రితమైనది. రాష్ట్రభాష హిందీయందు 'వేదరహస్య' మను పేరుతో మూడు భాగములుగా ముద్రితమైనది. 'On the Vedas' by Shri Aravinda, published by Shri Aravindashram Pandicherry-1956 Rs. 10-00 ఈయనువాదమును భూతపూర్వ కాంగ్రీ గురుకులాచార్యులగు ఆచార్య అభయదేవగారు జేసినారు.

ఈపత్రికలేగాక శ్రీఅరవిందులవారు 'Vedic Magazine' అను పేరుతో ఆచార్యరాందేవ్‌గారి సంపాదకత్వ పత్రికయందు 'Dayananda and Veda' అను అత్యుత్తమ వ్యాసములను వ్రాసియుండిరి. వానిని కొన్ని ఉదాహరణములుగా ఈయధ్యాయమునందే ఇచ్చియున్నాము. పాఠకులు దీనివల్ల శ్రీఅరవిందులవారి వేదవిషయక ఉన్నతాభిప్రాయములను అవశ్యముగా పరిచయమొనర్చి కొనియుందురు. ఐనను, వారి వేదవిషయకాలోచనలను కొంతవరకు దిగ్దర్శన మొనర్చుట ఆవశ్యక మనిపించుచున్నది. ఏలన; మహర్షి దయానందుల యనంతరము వారొక జగద్విఖ్యాత దార్శనికులు, మరియు మార్గదర్శకులై యుండిరి. వారు వేదములకు, ముఖ్యముగా ఆధ్యాత్మిక, మరియు మనోవైజ్ఞానిక వ్యాఖ్యనొనర్చి వానిని లోకప్రియమైనవిగా నొనర్చుటకు ప్రశంసనీయమగు ప్రయత్నమొనర్చినారు.

అరవిందాశ్రమము యొక్క పురాతన మహా విద్వాంసుడు, సాధకుడునగు శ్రీకపాలీశాస్త్రిగారు శ్రీఅరవిందుల మార్గదర్శకత్వమున ఋగ్వేదమునకు సిద్ధాంత జనక భాష్యమొనర్చుచుండిరి. దాని రెండు భాగములు ముద్రితమైపోయినవి. వాని యందు వేదమంత్రముల ఆధ్యాత్మిక వ్యాఖ్యను ప్రశంసనీయముగా నుండుటకు ప్రయత్నమొనర్చబడినది. దుఃఖకర విషయమేమన ౧౯౫౩ ఆగష్టు ౧౭న శ్రీ కపాలీ శాస్త్రిగారు స్వర్గస్థులగుటచే ఆ మహత్వపూర్ణమగు కార్యము అసంపూర్ణముగానే ఉండిపోయినది. శ్రీ అరవిందుల వారి వేదరహస్యమును దిగువ ఉద్ధరణ (ఉదాహరణ) ములను వారియభిప్రాయములను స్పష్టముగా జూపుటకొరకు ఈయబడినవి.

౧. ఈ వేదములు కేవలము ప్రపంచమందలి కొన్ని సర్వోత్కృష్టమగు, మరియు లోతైన ధర్మములేగాక సూక్ష్మతమ పరాభౌతిక దర్శనముల (Metaphysical) ప్రఖ్యాత ఆది స్రోతస్సుల రూపమని గూడ ఎంచబడుచున్నవి.

## ప్రథమాధ్యాయము-తృతీయ ఖణ్డము

౨. మానవుని మనస్సెంతవరకు పరుగులు తీయగలదో అంతవరకు సర్వోన్నత ఆధ్యాత్మిక సత్యమునకు వేదము గౌరవనీయ నామమైయున్నది.

౩. వేదము సనాతన సత్యధర్మముల అపౌరుషేయ జ్ఞానము. ఋషులు సూక్తములకు వైయక్తికరూపమున స్వయం నిర్మాతలుగారు. వారు ద్రష్టలు మాత్రమే.

౪. వేదమొక దివ్యవాణి; అది అపార అనంతమునుండి ప్రకంపనముగా బయలుదేరి మొదటినుండియే తన్నుతాను అపౌరుషేయ జ్ఞానమునకు పాత్రుడై యున్న మనుష్యుని అంతఃశ్రవణములందు ప్రవేశించుచున్నది.

౫. మానవుని వైపునుండి ఆ దివ్యజ్యోతి, దివ్యశక్తి, దివ్యకృపాస్తుతులతో అనిత్యమునందు నిత్యకార్యములొనర్పు నదియే వేదమైయున్నది.

౬. పూర్ణత్వప్రాప్తికొరకు సంఘర్షణమొనర్పు ఆర్యుని హస్తమునందు వేదమంత్రమొక శస్త్రమువలె పనిచేయుచుండును.

౭. వేదము అజ్ఞాన గర్వాంధులు కూసినట్లు ఆటవికుల, పశుకాపరుల కృతిగాదు. అదియొక పరమకళ, మరియు సచేతనకళ యొక్క సజీవ నిఃశ్వాసమై యున్నది.

౮. వేదము తనభాష మరియు ఛందములం దున్నట్లే తన ఆలోచనా రచనలందును మహదాశ్చర్యజనకమునై యున్నది.

౯. వేదములకు సాయణ మహీధరాదుల భాష్యములు దాని ఆంతరంగిక ఆశయములపై దృఢమైన తాళమువలె నున్నవి. ఐనను అట్టి వైదికశిక్ష యొక్క ప్రారంభిక గదులను తెరచుట మిక్కిలి అనివార్యమై యున్నది. అడుగడుగున మనము దానిని వ్యతిరేకించుటకు బాధ్యులమై యున్నాము. కాని అడుగడుగునను దీనిని ప్రయోగించుటకు బాధ్యులము కూడ నైయున్నాము.

౧౦. మహర్షిదయానందులు ఋషుల భాషాసంబంధ రహస్యమూలసూత్రములను మన కందించినారు. వైదికధర్మమునకు కేంద్రభూతమగు ఆలోచనల ( అనేక దేవతలు ఒకే పరమదేవతయందుండు నను దానినే పునః బలపరచినారు.

౧౧. ఈధర్మగ్రంథమగు వేదము అత్యంత బహుమూల్య ఆలోచనా రూపమగు ఒక స్థిరమైన సువర్ణరేఖను నాయందుంచుచున్న దని ప్రతీతమగుచున్నది. మరియు ఆధ్యాత్మికానుభూతి దీని ప్రతియంశమందును ప్రకాశముతో ప్రవహించుచున్నది.

౧౨. వేదములందు దేవతలపేర్లు తమ అర్థముల ద్వారా అవి కేవల విశేషణ మాత్రమేయని తెలుపుచున్నవి అవి అర్థ సూచక నామములు, మరియు వర్ణనములు మాత్రమే, కాని యవి స్వతంత్రముగ వ్యక్తి వాచకనామములు మాత్రముగావు.

౧౩. ఈసోమరసమునునది ఆనంద, తన్మయతకు, సత్తా యొక్క దివ్యానందమునకు ప్రతినిధియైయున్నది. అది ఋతము, లేక సత్యమునకు మధ్యనుండి అతిమానస చైతన్యముతో మనస్సునందు ప్రవహించును.

౧౪. వేదము యొక్క ప్రతీకవాదమున కాధారము, మానవజీవనమొక యజ్ఞము, యాత్ర మరియు సమరక్షేత్రమని తెలుపుటయే.

౧౫. వైదికదేవతల పేర్లు విశ్వవ్యాప్తదేవతల నామములు, శక్తులు, వ్యక్తిత్వములు, మరియునవి దివ్యశక్తి యొక్క ఏదో విశేషసారభూతబలమునకు ప్రతినిధిత్వమొనర్చును. ఈదేవతలు విశ్వము నభివ్యక్తపరచుచున్నవి.

౧౬. వేదములు అస్పష్ట, గంద్రగోళ, ఆటవికపాటల గ్రంథములు గావు. అవి ఆధ్యాత్మిక దృష్టితో మానవజాతి ఉన్నతాభిలాషతో గూడిన గీతములు, పాఠములై యున్నవి. వీని సూక్తములు ఆత్మనారోహణ మొనర్పజేయుటకు గానమొనర్చబడు వీరగాథల ఆఖ్యానములు. ఇంకను వానియందు గల ప్రాచీనవిజ్ఞానము, లుప్తవిద్య, సనాతన మనోభౌతిక పరంపరాదులు పరిశోధించుటకు మిగిలియే యున్నవి.

ఈ౧౫, ౧౬వ విషయము లత్యంత మహత్వపూర్ణము లగు కారణమున శ్రీఅరవిందుల అంగ్రేజి మూలమును ఉదాహరించుట అత్యంతావశ్యకమని తోచినది. కావుననే వానిని దిగువన వ్రాయుచున్నాము.

'The Vedıc deities are names, powers, personalities of the Universal Godhead and they represent each some essential puıssance of the Divine Being. They manıfest the cosmos and are manifest in ıt; - Hymns to the Mystıc Fıre, Foreword.p.34

'So understood the RigVeda ceasces to be an obscure confused and barbarous hymnal; it becomes the high aspiring song of Humanity; its chants are episodes of the Lyrical epic of the soul in its immortal ascention, this at least; what more there may be in the Veda of ancıent science, lost knowledge, old psycho-physıcal tradition, remaıns yet to be discovered.

*Hymns to the Mysitc Fire, by Shri. Aravinda Introduction P.48 fınally, as the summit of the teaching of the Vedic mystics comes the secret of the one Reality; Ekam Sat (ఏకంసత్) or TadKkam (తదేకమ్) which became the central word of the Upanishads. The gods, the powers of Light and Truth are powers and names of the One, each god is himself all the gods or carries them in him; there is the One Truth (తత్సత్యమ్) and one bliss to which we must rise. But in the Veda this looks out still mostly from behind the veıl. There is much else, but this is the kernel of the 'doctrıne;*

- Hymns to the Mystic fire by Shri Aravinda Introductıon. P. 48.

వైదిక యజ్ఞవిషయమున శ్రీఅరవిందుల వారిట్లభిప్రాయపడినారు

'The elements of the outer sacrifice in the Veda are used as symbols of the inner sacrifice and self-offering. We give what we are and what we have in order that the riches of the Divine Truth and Light may descend into our Life and become the elements of our inner birth into the Truth-a right thinking, a right understanding, a right action must develop in us which is the thinking, impulsion and action of that higher Truth, ritasya Presha, ritsydhit. (Rig-1-68-3)and by this we must build up ourselves in that Truth. Our Sacrifice is a Journey, a pilgrimage and a battle---a travel toward the gods and we also make that Journey with Agni, the inner Flame as our path finder and Leader.

- Hymns to the Mystic Fire p.32.

అనగా బాహ్యాయజ్ఞము యొక్క తత్త్వములు వేదములందు ఆంతరంగిక యజ్ఞమున మరియు ఆత్మసమర్పణ ప్రతీకరూపములలో ప్రయుక్తపరచబడినది దివ్యసత్యము, మరయు జ్యోతియొక్క ఐశ్వర్యము మన జీవితమందు అవతరించి సత్యమునందు మన ఆంతరంగిక జన్మతత్త్వముగా నగుటకు మనస్థితియేమో, మనవద్ద ఏమిగలదో మనము దానినిచ్చి వేయుదుము. ఒకసత్యభావన, ఒకసత్యమగు జ్ఞానము, ఒకసత్యమగు క్రియ మనయందు వికసితము గావలయును. అట్టి ఉన్నతోన్నత సత్యభావన, ప్రేరణ, మరియు క్రియ మనయందు స్థిరపడిపోవలయును. **'ఋతస్యప్రేషా, ఋతస్యధీతిః'** ॥ ఋ.౧-౬౮-3 దీనిద్వారానే మనకు మనమే ఈసత్యమునందు నిర్మించుకొనవలెను. మనయజ్ఞ మొక యాత్రయైయున్నది ఇది తీర్థయాత్ర, ఇది జీవన సమరమైయున్నది. దేవతల (దివ్యశక్తుల) వైపునకు గమనమై యున్నది అగ్నిని ఆంతరంగికజ్వాలను మనకు మార్గశోధకునిగా, మరియు నాయకుని (అగ్రేసరుని) గా నియమించుకొని మనము ఈయాత్రను సఫలమొనర్చుకొందము

(వైదికరహస్యము భాగము 3. పు3౨)



# వేదముల యథార్థ స్వరూపము

## ద్వితీయాధ్యాయము

### 2.1 వేదముల మహత్త్వము, అందుకు కారణము

**వివిధమతావలంబులు, పక్షపాతరహిత విద్వాంసులు సమర్పించిన శ్రద్ధాంజలులు.**

ఈపుస్తకము యొక్క ప్రథమాధ్యాయములో మేము వేదముల విషయమున వాని ప్రాచీనత్త్వమును, సర్వశాస్త్రసమ్మతమును గూర్చిన విశ్వాసము, మహత్త్వమును గురించి కొంత వరకు ప్రకాశపరచియుంటిమి. వర్తమానయుగపు సుప్రసిద్ధ విద్వాంసులలో మహర్షి దయానందులు మరియు మహాయోగి అరవిందుల మంతవ్యములను కూడ ఉల్లేఖించి యుంటిమి. కాని ఇంతటితో ఈకాలపు వారికి సంతృప్తిగలుగదు. ప్రాచీన, మధ్యకాలీన, అర్వాచీన సుప్రసిద్ధ విద్వాంసులు వేదముల విషయములో గొప్ప ఉన్నతభావము, శ్రద్ధాసక్తులు గలిగియుండిరి ఈకాలపు తార్కికులు తర్కము ద్వారా వేదవిషయక మంతవ్యముల పుష్టిగలిగియున్నప్పుడే అవి విశ్వసించుటకు యోగ్యములు, లేకున్నకాదని యందురు. ఈదృష్టితోనే ఈశ్వరీయజ్ఞానము యొక్క ఆవశ్యకత, మరియు వేదములనే ఈశ్వరీయజ్ఞానము, మరియు అపౌరుషేయములని ఎందుకు విశ్వసించవలయునో తెలుపదలచినాము. ఏలన; వేదముల విషయమున మా సిద్ధాంతము యుక్తియుక్తము, మరియు తార్కిక సంగతమైయున్నదనియే మా దృఢవిశ్వాసము.

### 2.2 ఈశ్వరీయ జ్ఞానము యొక్క ఆవశ్యకత

ఈవిషయమున ఈశ్వరీయజ్ఞానము అవసరమేనా, కాదా? యనునది మొదటిప్రశ్న. మానవులకు క్రమముగా జ్ఞానప్రాప్తిగలుగుచుండు నని నమ్మవచ్చును గదా! వికాసవాదము ననుసరించి మనుష్యుని జ్ఞానము క్రమశః స్వయముగానే ఉన్నతియగుచునే యుండును వికాసవాదము (Evolution Theory) ద్వారా జ్ఞాన మనుదాని సమస్య పూర్తి యగునప్పుడు ఈశ్వరీయ జ్ఞానము, లేక (Revelation) ను విశ్వసించు అవసర మేమి? ఈవిషయములో మేము కొంత స్పష్టమొనర్చదలచినాము. ఈశ్వరసత్తానే అంగీకరించని నాస్తికుల విషయమువేరు. జగమునందు గాన్పించుచున్న అద్భుతక్రమము, మరియు వ్యవస్థ ద్వారా సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సృష్టికర్త, ధర్త, హర్తయొక్క శక్తిని తర్కము ద్వారా నిరూపించవచ్చును. కాని మేమిచ్చట ఆవిషయమును చర్చించుటలేదు. సృష్టికర్తయగు పరమేశ్వరుని శక్తిని విశ్వసించుచును ఈశ్వరీయజ్ఞానము యొక్క ఆవశ్యకతను నిరాకరించువారి విషయముననే చర్చించుచున్నాము వారిని గూర్చి మా కథన మేమన; నేర్పుట, లేక ఉపదేశించుట యుండనంతవరకు స్వయముగానే జ్ఞానప్రాప్తిగలుగజాలదు. ప్రపంచమునం దీ విషయమును స్పష్టముగా జూచుచునే యున్నాము. ఒకవేళ ఇట్లుగాకున్న విద్యాలయములు, మహా విద్యాలయముల నేర్పరచవలసిన యవసరమేమి? తమంతట తామే స్వయముగానే లోకులు అన్ని విధముల జ్ఞానమును ప్రాప్తించుకొందురుగదా! మాతాపితరులు, ఆచార్యులు ఇంకా నేర్పునట్టి ఇతర శిక్షకులు లేకున్న బాలబాలికలకు జ్ఞానప్రాప్తిగలుగజాలదు ఇది ప్రత్యక్షసిద్ధమే.

ఈవిషయములో సమయ సమయములందు అనేక పరీక్షలు కూడా జరుపబడినవి. వీనియందు ఆసీరియా సామ్రాట్ 'అసురవాణీపాల్' యూనాన్ దేశపు రాజు 'సేమిటికల్' సమ్రాట్ప్రేడరిక స్కాట్లెండు చతుర్థజేమ్స్, మరియు మొగల్ బాదుషా అక్బర్ మున్నగు వారీ ఈవ విషయమున జరిపిన పరీక్షణములు కొంతవరకు క్రూరత్వముతో గూడినవైనను మహత్త్వపూర్ణము, మరియు విశ్వాసజనకములునై యున్నవి. వీరు చిన్నపిల్లలను అడవులందు ఇతర ఎట్టి శబ్దములను వినకుండకట్టు దిట్టము చేసి మూగదాదుల పెంపకము నందుంచి పరీక్షించినారు. పిల్లలు పెద్దవారైనను మానవీయభాష ఏమాత్రమును లేకపోగా వారి నడవడి, వ్యవహారము లన్నియును పశువులవలెనే యుండినవి. సీగ్రోలు మున్నగు ఇతర ఆటవిక జాతుల చరిత్రయే ఇందుకు సాక్షిగానున్నది. వారు సుశిక్షితుల సంపర్కములో రానంతవరకు, చక్కని అధ్యాపకులచే శిక్షింపజేయనంతవరకు, వేలసంవత్సరములు గడచినను స్వయముగ జ్ఞానప్రాప్తినొందలేక పోయినారు. ఒక తోడేలు ద్వారా పెంచబడిన 'రామూ' అను పేరుంచబడిన బాలుడు (వానిని లక్నోలోని గాంధీ ఆసుపత్రి యందుంచియుండిరి వాడు పశువులవలెనే అరచుట, నడచుట, మనుష్యులను జూచి భయపడుట, పచ్చిమాంసమునే దినుట మున్నగు యలవాటు గలిగియుండెను) ఈవిషయమును ఉత్తరప్రదేశ్ రాష్ట్రపతి శ్రీకన్హయ్యాలాల్మున్షీగారు వార్తాపత్రికలలో ప్రకటించియుండిన విషయము పాఠకులకు దెలిసియేయుండును తండ్రి తన కుమారుని కల్యాణముకొరకు ఉపదేశించునట్లే సమస్తప్రాణులకు పితృస్థానీయుడు, మరియు ఆది గురువునగు పరమేశ్వరుడు మానవమాత్రుల కల్యాణార్థము అంతర్యామి రూపమున సహజజ్ఞానము నిచ్చును. అనగా; ధర్మాధర్మములు, పాపపుణ్యములు, శారీరక, మానసిక, ఆత్మిక, సామాజికోన్నతి కొరకు సాధనములు, మానవ జీవనోద్దేశ్యము, పరమానందము, శాశ్వత సుఖశాంతుల ప్రాప్తి మున్నగువానిని వేదముల ద్వారా సృష్ట్యారంభకాలమందే ఉపదేశించినాడు ఈవిషయము సదా తర్కానుమోదమై యున్నది స్వయముగ 'హైకల్' వంటి జడవాది (Materialist) కూడ ఈశ్వరీయ జ్ఞానముయొక్క సంభావనమును ఈవిధముగ నిమ్న శబ్దముల ద్వారా స్వీకరించినాడు

'They may or may not receive such information, but there is no scientific ground for dogmatism on the subject nor any reason for asserting the inconceivability of such a thing'

T. O. Mazina quoted in the Materialism by Dorab Dinah, Kaanga p.52.

ఈవిషయము నంగీకరించుటయం దెట్టి వైజ్ఞానిక క్లిష్టత గాని, కారణము గాని గానరాదు.

హైకల్వంటి ఒక జడవాదియును ఈవిషయము నంగీకరించుట యందెప్పుడును సంకోచించలేదు. అట్టిచో ఆస్తికులు ఈశ్వరీయజ్ఞానావశ్యకత నంగీకరించుట అతిసరళము, మరియు స్వాభావికమునైయున్నది యూరోపు దేశస్థుడు, సుప్రసిద్ధ వైజ్ఞానికుడునగు డా 'ఫ్లెమింగ్' *M.A.D.Sc.F.R.S* తన "Supreme Intelligence in and above nature' నామక వ్యాఖ్యానమునందు లండన్ నగరములో ౨౩నుండి ౨౯ నవంబర్ ౧౯౧౪ వరకు జరుపబడిన విజ్ఞాన సప్తాహము, (*Science Week*) లో ఇచ్చినట్టి ఈశ్వరీయ జ్ఞానము యొక్క ఆవశ్యకతను గురించి నిమ్నశబ్దములలో స్పష్టముగా ప్రతిపాదన మొనర్చినాడు.

'If we are to obtain more solid assurances, it can not come to the mind of man groping feebly in the dim Light of un-assisted reason, but only by a communication made directly from this Supreme Mind to the finite mind of man'

Science and Religion by Seven men of science lecture by Dr. Fleming M.A.D.Sc.F.R.S.P. 53

అనగా; ఒకవేళ మనము నిశ్చితమైన జ్ఞానము, మరియు ప్రోత్సాహమును పొందవలెనను కొనినచో నిస్సహాయులు, కేవలము తర్కము యొక్క మసక వెలుగునందు శక్తిహీనులై పెడదారిబట్టి తిరుగు మనుష్యుల మనస్సుకు అది లభింపదు. కాని సర్వజ్ఞుడగు పరమాత్మద్వారా మానవుల మనస్సుల వరకు చేర్చబడిన జ్ఞానముచేతనే లభించుట సంభవము.

ఈశ్వరీయ జ్ఞానావశ్యకతను గూర్చి ఒక ప్రసిద్ధవైజ్ఞానికుని ద్వారా సమర్థించబడిన వాక్యముకన్న మించి ఇంకేముండును?

ఏదేని సంస్థను స్థాపించుట, ప్రభుత్వకార్యమును నడుపుట, లేక కార్యాలయము మున్నగువాని నిర్వహణమునకు పూర్వము దాని నియమముల నేర్పరచుకొనుట అత్యావశ్యకము. ఇదేవిధముగ ప్రపంచరూపమగు ఈవిశాలసంస్థను నియమ పూర్వకముగ నడుపుటకై పరమేశ్వరుడు సర్వహితము కొరకు వేదముల రూపమున నియమములను నిర్దేశించినాడు దీని ననుసరించి నడచుకొనుట ద్వారానే మానవ మాత్రులెల్లరకు సుఖసౌభాగ్యములు ప్రాప్తించు కొనగలరు. కాని అన్యత్ర వీలుకాదు. ఏదేశమందైనను దొంగతనము, మద్యపానము, వ్యభిచారము మున్నగువానికి విరుద్ధముగా దొంగతనము నెట్టి నియమములును లేనిచో అట్లుజేయువారిని దండించుటయును న్యాయ యుక్తముగ జరుగజాలదు. కావుననే మరేమి లేకున్నను వ్యవహార సంహిత నియమ గ్రంథము (Code of Laws) లేక వేద శబ్దములో ఋతము మరియు సత్యము (Physical and Moral eternal laws) ను ప్రతిపాదన మొనర్చు జ్ఞానమును సృష్ట్యారంభములో శుభకారియగు పరమేశ్వరుని ద్వారా మానవుల మార్గదర్శనమునకై ప్రసాదింపబడుట యుక్తియుక్తమే. కావుననే 'అఫ్లతూన్' (గ్రీకు తత్త్వవేత్త ప్లేటో) మరియు 'కౌంట్' వంటి దార్శనిక శిరోమణులు సైతము ధార్మిక, నైతిక విషయముల మార్గదర్శనమునకు ఈశ్వరీయజ్ఞానము యొక్క ఆవశ్యకతను అనుభవరూపమున ప్రకటించినారు యూనాన్(గ్రీకు) దేశపు ప్రఖ్యాత దార్శనికుడగు ప్లేటో (Plaedo) యొక్క మున్నగు గ్రంథములందు గాన్పించు ఇట్టి విషయము ఆంగ్ల భాషయందు ఈ ప్రకారముగా నున్నవి.

We will wait for one, be he a god or an inspired man to instruct in religious duties and to take away the darkness from our eyes' (Plato's Alcibiades.)

'We must seize upon the best human views in navigating the dangerous sea of Life, if there is no safer or less perilous way, no stouter vessel or Divine Revelation for making this Voyage'. (Plato's Phaedo)

అభిప్రాయమేమన; ధార్మిక కర్తవ్యముల శిక్షణ నిచ్చుటకు పరమేశ్వరునిగాని, లేక ఆయన ద్వారా ప్రేరితుడైన వ్యక్తిని ప్రతీక్షించవలసియుండును. అట్టి వారే మన కన్నుల యెదుట వ్యాపించియున్న అంధకారమును దొలగించగలుగుదురు. ఈ సంసారమను సాగరమును సురక్షితముగా దాటవలెనన్న ఈశ్వరీయ జ్ఞానమను ప్రబల సాధనము లభించనిచో ఉత్తమోత్తమ మహాపురుషుల ఆలోచనలపైననే ఆధారపడియుండవలసినదే.

*Dialogues of Plato - translated into English by Jowett* లో నిమ్న శబ్దములు గలవు

A man should persevere until he has achieved one of two things, either he should discover, or be taught the truth about them; or if this is impossible, I would have him take the best and most irrefragable of human theories, and let this be the raft upon which he sails through life not without risk, as I admit, if he can not find some Word of God which will more surely and safely carry him;

- Dialogues of Plato translated by jowett. Phaedo P. 463.

దీని భావము దాదాపు మొదట ఇచ్చిన దానివలెనే యున్నది కాని చివరి రేఖాంకితము చేసిన భాగములందు కొంత అధికముగ స్పష్టపరచబడినది అనగా ఈశ్వరీయ జ్ఞానసహాయము లేకున్న మానవుడు నిశ్చితముగా, సురక్షాపూర్వకముగా ఈసంసారసాగరమును దాటజాలడు. ఈదృష్టితో ఈయుదాహరణ మెంతయో మహత్త్వపూర్ణమైయున్నది

ఈయాశయములనే యూనాన్ తత్త్వవేత్తలలో అధిక బుద్ధిశాలియగు 'సుకరాత్' అను నాతడును చెప్పినదాని ఆంగ్ల అనువాదము దిగువనీయబడినది.

You may resign yourself to sleep, and give yourself up to despair, unless God in His goodness, shall vouchsafe to send you instruction.

Quoted here from the Brahma Samaj and Ecclectic Systems, Madras, p.84.

అనగా; పరమేశ్వరుడు కృపతో మిమ్ము( మీకు) ఉపదేశించనంతవరకు మీరు నిద్రయందు ఆత్మ సమర్పణ మొనర్పగలుగుదురు, లేక నిరాశా ప్రవాహమునందు కొట్టుకొని పోగలుగుదురు. కాని ఈశ్వరీయ జ్ఞానములేకున్న ఇది మానవుని దుర్దశాచిత్రమే యనవచ్చును.

జర్మనీదేశపు మూర్ధన్య దార్శనికుడగు 'కాంట్' గూడ

*'We may well concede that if the Gospel had not previously taught the universal moral Laws in their full purity, reason would not yet have attained so perfect an insight of them.'*

ఈశబ్దములను వ్రాసి సదాచార సంబంధ నియమముల పూర్ణశిక్షణకొరకు ఈశ్వరీయ జ్ఞానము యొక్క ఆవశ్యకతను, మరియు మానవీయ బుద్ధియొక్క అసమర్థతను స్పష్టముగా అంగీకరించినాడు. ఈశ్వరీయ జ్ఞానావశ్యకత నంగీకరించక సదసద్వివేక బుద్ధివాదులగు వారు ''పరమేశ్వరుడు సత్యాసత్యములు, ధర్మాధర్మములు,

పాపపుణ్యములు మున్నగు వాని నాలోచించుటకు మన కిచ్చిన అంతరాత్మ మనః సాక్షి లేక "Conscience' యే సరిపడును. ఇంతకుమించి ఈశ్వరీయ జ్ఞానము యొక్క అవసర మేమియును లేదు.'' అనియందురు. దీనికి సమాధానముగా మేము ఇంతయే చెప్పదలచినాము. ఏమన; ''మేము స్వయంగా కొంతవరకు సదసద్వివేక బుద్ధియొక్క ప్రామాణికత్వమును స్వీకరించినను,

**స్వస్య చ ప్రియమాత్మనః, సతాం, హి సన్దేహపదేషు, ప్రమాణమన్తఃకరణ ప్రవృత్తయః ॥**

మున్నగు వచనముల ద్వారా మనుస్మృతికారులు, మరియు కవులు దాని మహత్త్వమును స్వీకరించియున్నారు. ఇంతేగాదు స్వయముగా వేదములందు;

**దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతిః ।**

**అశ్రద్ధామనృతేఽదధాచ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః ॥** యజు. ౧౯-౭౭॥

మున్నగు మంత్రముల ద్వారా సదసద్వివేక బుద్ధియొక్క ఉపయోగత్వమును ప్రతిపాదించబడినది. ఐనప్పటికి దానిని కేవలము ధర్మాధర్మములు, పాపపుణ్యములు, కార్యాకార్యముల నిర్ణయమువరకే సీమితము చేయుట అంగీకరించబడదు. ఏలన; దాని యాధారము చాలవరకు సామాజిక పరిస్థితి, మరియు దాని శిక్షణపైననే యుండును. వేదానుయాయియగు నొక ఆర్య వైష్ణవ, లేక జైనమతావలంబి గృహమున నుత్పన్నమైన బాలకునికి స్వాభావికముగనే మద్యమాంసాదుల సేవనమందు ఏవగింపు ఉండును. అతని అంతరాత్మ అట్టి ఘృణిత పదార్థ సేవనమును నిలిపివేయుచుండును. కాని మద్యమాంసాదులను సేవించు ఆంగ్ల, అమెరికా, లేక ఇతర స్థానముల జన్మించిన బాలుర అంతరాత్మలు అట్టివానిని సేవించుటకు సదాకోరుచునే యుండును. ఇది కేవలము పరిస్థితుల ప్రభావమనియే యనవచ్చును. ఈయాలోచనలనే జర్మనీదేశపు దార్శనికాగ్రగణ్యుడగు శ్రీ 'కాంట్' యనునాతడు Metaphysics of Morals అను పేరుగల గ్రంధమునందు

*'Feelings which naturally differ in degree cannot furnish uniform standard of good and evil, nor has any one a right to form judgment for others by his own feelings'*

అని చక్కగానే వ్రాసినాడు. అనగా; సంవేదనము, లేదా అనుభవము స్వాభావికముగా భిన్నభిన్న వ్యక్తులందు భిన్నభిన్న రూపము, మరియు పరిమాణము నందుండినచో మంచి చెడులు, పాపపుణ్యముల కొలమానము సరిగా నుండగలదని చెప్పలేము. ఇంతేగాదు మనయనుభూతి ద్వారా మనకు ఇతరుల విషయమున నిర్ధారణమొన ర్చు అధికారమునులేదు.

## 2.3 ఇలహాం, (దైవవాక్కు) ఆదేశము మరియు ఈశ్వరీయ జ్ఞానము

పరమేశ్వరుని వైపునుండి ఇలహాం మరియు ఆదేశము జ్ఞానము లేక ప్రేరణ యనబడునది సమయ సమయములందు భక్తులకు ప్రాప్తించు నని కొందరి మతము. సృష్ట్యారంభకాలమందే ఈశ్వరీయజ్ఞానము సంప్రాప్తించునని విశ్వసించు అవసరమే లేదు. ఈ విధముగా విశ్వసించుటచే విశ్వమున గొప్ప గొప్ప అనర్థములు జరుగుచుండెనని వారు మరువవలదు. అవి భవిష్యత్తు నందును జరుగగలవు. ఈవిధముగ మేము ఏవ్యక్తిపైనను

అనుచితమైన ఆక్షేపణలువేయుట ఉచితమనుకొనము. ఐనను అనేక సార్లు అనేక సాంప్రదాయవాద నాయకులు మరియు ఆధ్యాత్మిక గురువులు ఇలహాం మరియు ఆదేశముల పేర ఎంతటెంతటి ఘోరకార్యము లొనర్చియుండిరో వానిని బుద్ధిమంతులగు ధార్మికు లెవ్వరును సమర్థించరు. ఈవిషయమున ఉదాహరణార్థము రెండు దృష్టాంతముల నిచ్చిన సరిపడు ననుకొందును ఒకటి ముహమ్మదు గారి విషయము. వారు తన దత్త పుత్రుడగు 'జైద్' భార్య 'జైనబ్' ను ఈశ్వరాదేశము లేక ఇలహాం ఆధారముగా తన (స్వంత) పత్నిగాజేసికొనుట శ్రీహెచ్ జి వేల్స్ అనునాతడు;

Outline of world History, Newyork, One Volume Edition, p.608 మరియు Short History of the World, p.137 యందు డా. మార్గోలియోథ్ డి లిట్, (D.S.Margolioth D Litt) అను నాతడు Encyclopaedia of Religion and Ethics Vol.VIII P 878 లోనర్ విలియం మూర్ అను వాడు Mohammed and Islam P.196-197 యందును డా. హ్యూగోస్ (Dr.Hughoes) అనునాతడు Notes on Mohammedanism, p.2 లో, రెవరెండ్ డా. రైడ్జర్ (Rev. Dr Radger) అనునాతడు Dictionary of Islam p.396 లో, ఇంకను అనేక పాశ్చాత్యవిద్వాంసులు Studies in Mohammedanism మున్నగు గ్రంథములందు చూపియున్నారు వీనిని యెత్తిచూపుటయును మా కేమాత్రమును బాగనిపించుటలేదు పైన నిర్దిష్టపరచిన 'జేకబ్ తో నికాహ' ను అనుమతించునట్టి ఆయతు ఖురాన్ పారా౨౨. సూ. అహ్ జాబ్ ఆ ౩౭ నుండి౪౦లో విద్యమానమై యున్నది ఈవిషయమున ఉపర్యుక్త మరియు ఇతర విద్వాంసులు భయంకరముగ సమాలోచనమే యొనర్చియున్నారు. సృష్ట్యారంభము నందని యెంచక మధ్యకాలములందును 'ఇల్హాం' మరియు ఆదేశములను నమ్ముటవలన ఇట్టి భ్రమలు అధికముగా గలుగుట సంభవమేగదా! దీనిని స్పష్టపరచుటకొరకు మేము బ్రహ్మసమాజ నాయకుడగు కేశవచంద్రసేనుని జీవిత సంఘటనను వారి లేఖ సహితముగా నిచ్చుట ఆవశ్యకమని తలచెదము. బ్రహ్మసమాజ సంచాలకుడగు రాజారామమోహన రాయలు జీవితాంతము వేదములు ఈశ్వరీయ జ్ఞాన మనియే విశ్వసించుచుండిరి ౧౮౩౦ లో బ్రహ్మసమాజము స్థాపించబడినది ౧౮౪౪ వరకును వేదములు నిర్భ్రాంతము లనియే విశ్వసింపబడుచుండెడివి. కాని ౧౮౫౦ లో ఈసిద్ధాంతములు ఒక తుచ్ఛ ఆధారముపై శ్రీకేశవచంద్రసేనుని వంటి నవశిక్షితుని ప్రేరణచే పరిత్యజించబడినవి. బ్రాహ్మధర్మము యొక్క ఆధారము అంతఃప్రతిభ (Intuition) పైననే గలదని ౧౮౩౦ లో ప్రకటించబడినది ౧౮౬౬ లో శ్రీకేశవ చంద్రసేనుడు మహాపురుషులపై వ్యాఖ్యానించుచు బాహ్యజ్ఞానప్రాప్తికి మూడు సాధనములని చూపి (తెలిపి) నాడు. అవి (క) ప్రకృతి, (ఖ) మహాపురుషుల వ్యాసములు (గ) ఈశ్వరీయప్రేరణ, ఆదేశము లేక ఇల్హాం, (Inspiration) అనునవి ౧౮౮౮లో ఆయన బ్రహ్మసమాజము యొక్క నవవిధానముఖపత్రము The Liberal వ్రాసినాడు.

*'Direct inspiration of the word of god has become our guide and like the prophets of old, our apostles declare their messages with the authority of god and proclaim them as 'thus said the Lord! It can have no religious union with those that redicule the inspiration*

*of Keshub chunder Sen and stand as enemies of the New Dispensation. '*

- The Brahma Samaj and Ecclectic systems. p.82.

అనగా; ఈశ్వరీయ ఆదేశములు, మరియు శబ్దములు మాకు మార్గదర్శకములైనవి. మరియు ప్రాచీన ప్రవక్తల వలె మా నాయకులును ఈశ్వరీయ అధికారము తో 'ఈశ్వరుడీ విధముగా ఆదేశించినా'డని ప్రకటించగలరు. శ్రీ కేశవచంద్ర సేనునకు ప్రాప్తించిన ఈశ్వరీయ ఆజ్ఞలను పరిహసించుచు ఈ నవ విధానమునకు శత్రువులగు వారితో ఈ నవ విధాన బ్రహ్మసమాజ మేలాంటి ధార్మిక సంబంధము గలిగియుండదు.

శ్రీ కేశవ చంద్రసేనునకు ప్రాప్తించిన ఈ యీశ్వరీయ ఆదేశములను ఉల్లేఖించదగిన దేమనగా; స్వయముగ బ్రాహ్మ వివాహ విధాన నిర్మాతయగు శ్రీ కేశవ చంద్రుసేనుడు ( ఈతని ఆదేశానుసారము బ్రాహ్మ వివాహమునకు వధూవరుల వయస్సు కేవలము ౧౪ మరియు ౧౮ సం. లు నిర్ణయింపబడి యుండెను. ) పదునాల్గు సంవత్సరములు గల తన పుత్రిక వివాహము దాదాపు పదహారు సంవత్సరముల వయస్సు గల కూచ విహార్ మహరాజ పుత్రునితో జరుపుటకు ఈశ్వరీయ ఆదేశము ప్రాప్తించినది. ఈ విషయమున బ్రహ్మ సమాజము యొక్క సదస్యులు, మరియు ఇతర సంస్కర్త లనేకులు వ్యతిరేకించినప్పుడు 'ఇట్లొనర్చుటకు నాకీశ్వరీయ ఆదేశము ప్రాప్తించిన'దని వారందరి నోళ్ళు మూయించినాడు చూడుడు 'The Brahma Samaj and Ecclectic Systems' యొక్క 3౬వ పుటలో ఇట్లు వ్రాసియున్నది

'Keshub claimed to be guided in the matter by adesh or commandment from God' P.36.

'He declared the marriage as an effect of Divine command', P.37.

అనగా, కేశవచంద్రసేను డీ విషయమున తానీశ్వరాదేశము ద్వారా ప్రేరితుడనైనానని సమాధానపరచినాడు. 'ఈ వివాహము ఈశ్వరీయాదేశ పరిణామ స్వరూపమే' యని చాటుకొనినాడు ఐనను ఈతని వాదనను బుద్ధిశాలురగు బ్రహ్మ సమాజ సదస్యులనేకులు అంగీకరించలేదు. వారనేకులు ఈ నవ విధానము నుండి వేరై ప్రత్యేకముగా సాధారణ బ్రహ్మ సమాజమును స్థాపించికొనినారు.

ఇదే విధముగా అనేక ఉదాహరణము లీయవచ్చును. దీనివల్ల స్పష్టమగున దేమనగా; మానవు లనేక సార్లు తమ కోరికనే ఈశ్వరేచ్ఛ, ప్రేరణ, మరియు ఆదేశమని యనుకొనెదరు. మరియు నిట్టి భ్రాంతిచేతనే తమకు మరియు సమాజమునకు గొప్ప హాని గలిగింతురు శ్రీ కేశవ చంద్ర సేనుడు దిగువ వాక్యముల ద్వారా ఈ విధమగు భ్రాంతిని, మరియు ఆత్మ వంచనను స్పష్టముగా స్వీకరించినాడు.

A Delusion

I have strangely got into the habit, O my God, of crediting Thee with all my ideas and Plans. I, as thy servant, ought to follow only Thy commandment, forsaking all that pleases me, and adopting what soever is agreeble to Thee. But instead of doing this, I strive to

follow my own plans and schemes, and then I ascribe to Thee their authorship. Having come so far in the path of religion, I feel it a humiliation to believe that I am carrying out my own wishes. I would Fain believe that in all my doings, I only follow thy leading and feel glad when People give me credit for obeying Thy will and sacrificing my own. But self-sacrifice is a hard thing, and I am carried away by my own ideas, feelings and tastes. All that I can do is to make myself and others believe that every thing I do is the Lord's doing, and that all my purposes are Divive purposes. Thus errors and vices in my life become sacred in my estimation, in the course of time, with the imprimature of Thy seal. Lord deliver me from this delusion.'

The New Dispensation by Pt. Shiva Nath Shastri, P. 51.

The Brahma Samaj and Ecclectic Systems, P.38 ఈ సందర్భము యొక్క ఆశయమేమన,

**2.4 ఒక భ్రమ**

హే పరమేశ్వర! నాకు నా ఆలోచనలను మరియు పథకములను నీ పేరుతో ప్రచారమొనర్చుకొను విచిత్రమగు అలవాటు ఏర్పడిపోయినది. నేను నీ సేవకుని రూపములో కేవలము నీ యాజ్ఞలనే పాలింపవలసి యుండెను నేను నా ప్రసన్నతలను పరిత్యజించి నీకిష్టమగు దానినే అనుసరింప వలసి యుండెను కాని నేను నా స్వంత పథకములనే అనుసరించుచున్నాను. మరియు నిన్ను వానికి కర్తగాను, లేఖకునిగాను చాటుచున్నాను ధర్మ మార్గమునుండి ఇంత దూరము వచ్చి చేరినను 'నేను నా కోరికలనే అనుసరించుచున్నా'నని అంగీకరించుటకు సిగ్గు పడుచున్నాను నేను నా క్రియలన్నిటి యందును కేవలము నీ నేతృత్వమునే అనుసరించుటను విశ్వసింతును మరియు ప్రసన్నత ననుభవింతును లోకులు నన్ను, నా స్వంత కోరికలను వదలి నీ యాజ్ఞలనే అనుసరించు చున్నట్లు చెప్పుకొందురు కాని స్వార్థత్యాగ మనునది సామాన్యము గాదు నేను మాత్రము నా స్వంత ఆలోచనల, అనుభూతుల, అభిరుచుల ప్రవాహమందే పడిపోవుచున్నాను. నేను చేయుచున్న దంతయును ఈశ్వరకార్యమే, నా ఉద్దేశ్యమే ఈశ్వరీయ ఉద్దేశ్యమని నాకును, మరియు ఇతరులకును విశ్వాసము గలిగించగలుగుదును ఈ ప్రకారముగా నా జీవన దోషములు, దుర్వ్యసనములు, సమయముననుసరించి నా దృష్టి యందున్నవి పరమేశ్వరా! నీయాజ్ఞచే ఎల్లరును పవిత్రులగుదురు ప్రభూ! ఈ భ్రమ నుండి నన్ను కాపాడుము.

సృష్ట్యారంభమున ఈశ్వరీయ జ్ఞానావశ్యకత నంగీకరించక 'కల్పితమగు ఈశ్వరీయ ఆదేశములపైననే ఆధారపడియుండుటయే చాలు' నను కొనువారికి కేశవ చంద్రసేనుని ఈ వాక్యములు హెచ్చరించు చునుకొనుచున్నవి

ఇంతియేగాక సదసద్వివేక బుద్ధివాదులను గూర్చి మేము చెప్పున దేమన, కర్తవ్యా కర్తవ్యముల నిర్ణయమును అంతరాత్మ సాక్షిత్వము ద్వారా చేసికొనుటలో మన మేమాత్రము సఫలురమైనను పొందవచ్చు అనగా జీవన అంతిమోద్దేశ్యము, జీవ, బ్రహ్మ, ప్రకృతుల స్వరూపము, మోక్షప్రాప్తి దాని సాధనమునకు గల జ్ఞానము మున్నగునవి కేవలమీ బుద్ధి ద్వారా సంప్రాప్తమగునని యనుకొనుట సర్వథా అసంభవమే

''ప్రకృతిని గాంచియే మానవుడు తన కర్తవ్యములను, హితములను నిర్ణయించుకొనగలుగును. దీని కొరకు 'ఈశ్వరీయ జ్ఞాన' మను కల్పననెందుకు జేసికొనవలయును?'' అని ప్రకృతివాదుల కథనము. దీని సమాధానమున అధికముగా వ్రాయ నవసరము లేదు ఒకవేళ ప్రకృతియే మానవులకు తగిన జ్ఞానము నిచ్చుట యందు సమర్థత గలిగియున్నచో ఈ భూతలముపై ఏ జాతియును అసభ్యదశయం దుండకుండెడిది. ఏలన; ప్రకృతియను గ్రంథము అందరి కొరకు సమాన రూపముననే తెరువబడియున్నది. కాని ఈ పుస్తకమును చదువుట, మరియు తెలిసికొనుటయును అతి కఠినమే. గొప్ప గొప్ప విద్వాంసులు, వైజ్ఞానికులు మాత్రమే దీనిని చదువగలుగుదురు కాని ప్రకృతియందు చిక్కువడి దానినే సర్వస్వమని యెంచి *Survival of the fittest* మరియు బాహాటముగా, ప్రతిబంధరహితముగా సంభోగాది వ్యవహారముల ననుసరించుచునే గడుపుచున్నచో సదాచారము, మరియు నీతి *(Morality)* అనునవి ప్రపంచము నుండి పేరు లేకుండా పోగలవు కావుననే కేవలము ప్రకృతియే ధార్మికము మరియు సదాచారము మున్నగు విషయముల జ్ఞానము నిచ్చుటయందు సమర్థవంతమైన దనుకొనుట గొప్ప పొరపాటే యనవచ్చును.

## 2.5 వివిధ మతముల విద్వాంసులు వేదముల యెడ సమర్పించిన శ్రద్ధాంజలులు

ఇక నిపుడు వేదములనే ఈశ్వరీయ జ్ఞాన మని ఏల నమ్మవలెను? బాయిబిల్, కురాన్, జింద అవస్థా మున్నగు వానిని సమాన రూపమున ఈశ్వరీయ జ్ఞానమని ఎందుకు స్వీకరించరాదు? మున్నగు ప్రశ్నలకు సూటిగా సమాధాన మిచ్చుటకు పూర్వము మేము పారసీ, జైన, బౌద్ధ, ఈసాయీ, ముసల్మాను, సిక్కు మున్నగు వివిధ మతానుయాయులగు విద్వాంసుల ద్వారా వేదముల యెడ సమర్పించిన శ్రద్ధాంజలులను పాఠకుల సమక్షమున నుంచ దలచినాము.

## 2.6 పారసీ విద్వాంసులు మరియు వేదములు

ప్రప్రథమముగా మేము *Philosophy of Zoroastrianism and Comparative Study of Religions* అను పేరు గల గ్రంథ రచయిత సుప్రసిద్ధ పారసీ విద్వాంసుడగు ఫర్దూన దాదా చానజీ *B A, L L B, D Th* గారి వేదములను గూర్చిన అభిప్రాయములను పాఠకుల యెదుట నుంచుచున్నాము. వారిట్లు వ్రాయుచున్నారు

'The Veda is a Book of knowledge and Wisdom comprising the Book of Nature, the Book of Religion, the Book of Prayers, the Book of Morals and so on. The word 'Veda' means wit, wisdom, knowledge and truly the Veda is condensed wit, wisdom and knowledge'.

Philosophy of Zoroastrianism by Dadachanji, P. 100

అనగా; వేదము వివిధ జ్ఞానముల పుస్తకము. దీని యందు ప్రకృతి, ధర్మము, ప్రార్థన, సదాచారము మున్నగు విషయముల పుస్తకము సమ్మిళితమై యుండును? వేద మనగా జ్ఞానము. వాస్తవముగా వేదములందు సమస్త జ్ఞాన విజ్ఞానముల తత్త్వము గలదు.

ఋగ్వేదము యొక్క మొదటి అగ్ని విషయక సూక్తమునకు అర్థము నిచ్చుచు మహర్షి దయానందుల వలెనే అగ్ని శబ్దమునకు భౌతికాగ్ని మరియు ఈశ్వరుడు అను రెండర్థములను ఈ పారసీ విద్వాంసుడు వ్రాసి యున్నాడు.

'Thus we see that Agni' in this hymn means both fire as well as God, P. 100

అనగా, ఈ విధముగా మనమీ సూక్తమునందు అగ్నికి భౌతికాగ్ని మరియు ఈశ్వరుడు అను రెండర్థములు గాంచగలము.

దీని తరువాత *'Two-fold significance of words'* ఈ శీర్షికలో ఈ సుయోగ్యుడగు పారసీ విద్వాంసుడిట్లు వ్రాసియున్నాడు

Readers of the Vedas who do not know this wonderful characteristic feature of the Veda in determining the physical as well as the spiritual by means of the self same words, are apt to be misled by the false idea that the Veda looks upon fire, air, dawn, the sun and the other agent forces, phenomena or objects of nature as Divine beings to whom the Vedic Rishis, prayed for strength, health, wealth, longlife, brave sons, rich possessions and so on. But the Vedas teach nothing but mono-theism of the purest knid, the belief that this universe manifests, the love, might, wisdom and glory of God Who eternally evolves and dissolves alternately innumerable systems of worlds, for the benefit discipline and well-being of Jeevatmas, according to the eternal laws of nature (called Rita in the Vedas) and also according to the Law of karma (as implied in it) etc., P 10.

అనగా, వేదముల ఈ యద్భుత విశేషత్వ జ్ఞానము లేని పాఠకులకు 'ఒకే శబ్దమునకు భౌతిక, ఆధ్యాత్మికతత్త్వముల రెండింటి వర్ణనమెట్లు జరుగగల' దను భ్రమ గలుగుచుండవచ్చును. వేదము అగ్ని, వాయువు, ఉష, సూర్యుడు మున్నగు వానిని ఈశ్వరుడు, మరియు దేవతలని తెలుపుచున్నది వీని నుండియే ఋషులు శక్తి, ధనము, దీర్ఘ జీవనము, వీర పుత్రులు ( వీరసంతానము) గూర్చి ప్రార్థింతురు. కాని వాస్తవముగ అట్లుగాదు. వేదములు సర్వాధికముగ విశుద్ధము, మరియు పవిత్రము నగు ఏకేశ్వర వాదమునే ప్రతిపాదించుచున్నవి. అవి యా పరమేశ్వరుని ప్రేమ, శక్తి, బుద్ధిమత్తతయును, ఈ జగత్తు యొక్క మహత్త్వమునే ప్రకటించుచున్నవి మరియు ఆ పరమేశ్వర శక్తియే లోకలోకాంతరముల నిర్మాణము, సంవర్ధనము, చివరకు ప్రళయమును గలిగించుచున్నది వేదములందు జీవాత్మల లాభము అనుశాసనము, కల్యాణము కొరకు ఏ దృఢమైన ప్రాకృతిక నియమములు గలవో అవి 'ఋత' మను పేరుతో పిలువబడినవి. అవి కర్మ నియమము ననుసరించియున్నవి. ఒక సుప్రసిద్ధ, సుశిక్షిత పారసీ విద్వాంసుని ద్వారా వేదములు, వైదిక ఏకేశ్వర వాదము యెడ సమర్పించబడిన ఈ శ్రద్ధాంజలి అత్యంత మహత్త్వ పూర్ణమైనదనుటలో ఏ మాత్రము సందేహము లేదు

## 2.7 ప్రసిద్ధ జైన విద్వాంసుడగు ఆచార్య కుముదేందుడు మరియు వేదములు

జైన మతావలంబులు సాధారణముగా వేద విరోధులనియే ఎంచబడుచున్నది వారియందు నిష్పక్ష విద్వాంసులును గలరు వేద గౌరవమును అద్భుత రూపమున స్వీకరించినవారిలో శ్రీ ఆచార్య 'కుముదేందులు' పేర్కొనదగినవారు. వారు తన 'భూ వలయ' మను గ్రంధమున ఆశ్చర్యజనకముగ ఆ జైనవిద్వాంసుడిట్లు వ్రాసినాడు. 'ఋగ్వేదమే అనాదియైన ఆదిమ భగవద్వాణి దీని నుండియే అనేక భాషలు ఉద్భవించినవి పరమేశ్వరుని సందేశములు సమస్త భాషాభాషులకు సమానమే' 'భూవలయ' మందు మూల శబ్దములిట్లు గలవు.

| | |
|---|---|
| మహదగ్రేయణి విజయ ఋగ్వేద వలయ హే | ట్ట గుణిసలనాద్యనంత |
| సర్వజ్ఞ దేవను సర్వాంగది పేలద | సర్వస్వ భాషేయ సరణి |
| పర్వదన్దదలి హబ్బుత హోగి | లోకాగ్ర సర్వార్థ సిద్ధియ బలసి ॥ |
| ముక్తియోలిహ సిద్ధ జీవర తాగుత | వ్యక్తావ్యక్తవదాగి |
| సకలవు కర్మాటదణు రూప హోందుత | ప్రకటదే ఓందరోల్ అడగి । |
| హదినెన్టు భాషేయు మహాభాషేయాగలు | వదియ భాషేగల యేల నూరమ్। |
| హ్యాదయదోలడగిసి కర్మాట లిపియాగహుదుగిసిదంక భూవలయ సకలడ సాది అనాది ॥ | |
| వశగోందు ద్వైతాద్వైతవనేల్లవ అనేకాన్త | |
| రసదోళు ఓంకారదేకమ్। | యశవాదక్షరవోన్దిగే వేసేదిహ |
| హోసదనాదియ గ్రన్థ॥ | 'భూవలయ' అ౬ శ్లో ౨-౪॥ |

## 2.8 అరబు దేశ విద్వాంసుడగు లాబీ ద్వారా వేదముల గుణగానము

'అఖ్తాబ్' అనునాతని పుత్రుడు, 'తుర్ఫా' అనునాతని పౌత్రుడు నగు 'లాబీ' అను పేరుగల అరబి కవి యుండెను. ఆయన ముహమ్మద్ సాహెబు జన్మమునకు దాదాపు ౨౪౦౦ వత్సరముల పూర్వమునందుండెను. ఆయన వేదముల గుణగానమును సిమ్న లిఖిత అరబి భాషా కవిత్వమున జేసియుండెను ఇది మహత్త్వ పూర్ణమైనదగుట కారణమున మేము దీనిని ఆంగ్ల, ఆర్య భాషల అనువాద సహితముగ ఈ ప్రకరణమున ప్రకాశింప జేయుట ఆవశ్యకమని తలచితిమి క్రీస్తు శకమునకు దాదాపు ౧౭౦౦ సంవత్సరములకు పూర్వము సెమెటిక్ ప్రజలలో వేదముల యెడ ఎంతటి ఉత్తమ భావముండెనో దీనివల్ల మనకు స్పష్టముగ దెలియగలదు. ఈ కవిత (కావ్యము) 'హారూన్‌రశీద్' రాజాస్థాన కవి యగు 'అస్మా ఈ మలేకుస్ శరా' ద్వారా సంగ్రహించబడిన 'సీరుల్ ఉకూల్' అను పేరుగల ( ఇప్పుడిది బేరట్ పబ్లిషింగ్ కంపనీ బేరట్ పైలస్టైన్ ద్వారా ప్రకాశించబడి హాజీ హమ్జా శిరాజీ ఎండ్ కో పబ్లిషర్స్ బుక్ సెలర్స్, బందర్ రోడ్, ముంబాయి నుండి లభించగలదు ) ఈ పుస్తకము పుట ౧౧౮ యందు చూడవచ్చును అది ఇట్లున్నది

౧. అయా ముబారకల అర్జే యొశేయ్యే, నుహోమినల్ హిన్దే ఫారాదకల్లాహో
మైయ్యో నజ్జేలా జిక్రతున్।

౨. వహల తజల్లేయతున్ ఐనానే సహబీ అరబాతున్ హోజహీ యునజ్జేల
రసూలో జిక్రతాన  మినల్ హిన్దతున్।

3. యకూలునల్లాహ యా అహలల్ అర్జే ఆలమీన కుల్లహుమ్ ఫత్తబిఊ జిక్రతుల్
వేద హక్కాన్ మాలమ్ యునజ్జేలహూన్।

౪. వహోవాలమ్ ఉస్ సామ వల యుజ్ర మినల్లహే తన్జీలన్ ఫ ఐనమా యా
అఖేయో ముత్తబే అన్ యో బశరేయో నజాతున్।

౫. వ అస్నైనే హుమా ఋుక్ వ అతర నాసహీన క అఖూవతున్ వ అస్నాత అలా
ఊదన్ వహోవ మశఅరుతన్।

**English Translation :**

1. Oh blessed land of Hind (India) thou art worthy of reverence for in thee has God revealed True Knowledge of Himself.

2. What a pure light do these four revealed Books afford to our mind's eyes like the (Charming and cool) lustre of the dawn? These four, God revealed unto His Prophets (Rishis) in Hind.

3. And he thus teaches all reces of mankind that inhabit his earth.

'Observe (in your lives) the knowledge I have revealed in the Vedas' for surely God has revealed them.

4. Those treasuries are the Saama and Yajur which God has Published o my brothers ! revere these, for they tell us the good news of salvation.

5. The two next, of these four, Rik and Atharva (Atar) teach us lessons of (Universal) brotherhood. These two (Vedas) are the beacons that warn us to turn towards that goal(Universal brotherhood).

Translation of the Arabic Poem by Lavi an Arabian Poet about 1700 B.C.

**భాషానువాదము :-**

౧. హే ఆర్యావర్తపు ధన్యభూమే! నీవు ఆదరించదగినదానవు. ఏలన; నీయందే పరమేశ్వరుడు తన సత్య జ్ఞానమును ప్రకాశపరచినాడు.

౨. ఈశ్వరీయ జ్ఞాన రూపమగు ఈ నాలుగు పుస్తకములు (వేదములు) మా మానసిక నేత్రములకు ఎంతయో ఆకర్షణీయమగు శీతల ఉషాజ్యోతిని ప్రసాదించుచున్నవి పరమేశ్వరుడు హిందుస్థానము నందు తన ప్రవక్తల, అనగా ఋషుల హృదయములందు ఈ నాలుగు (వేదములను ప్రకాశ పరచినాడు.

3 మరియు భూమండలముపై నున్న సకల జాతులకు ఇట్లు ఉపదేశించినాడు 'వేదముల ద్వారా నేనెట్టి జ్ఞానమును ప్రకాశపరచితినో దానిని మీరు మీ జీవితములందు క్రియాన్వితమొనర్చుకొనుడు. దాని ననుసరించియే ఆచరణ మొనర్చుడు'. నిశ్చితముగా పరమేశ్వరుడే వేదముల జ్ఞానమును ప్రసాదించినాడు

౪ సామ, యజుర్వేదములు రెండును మహాకోశములై యున్నవి వీనిని పరమేశ్వరుడు ప్రసాదించినాడు ఓ నా సోదర, సోదరీమణులారా! వీనిని మీరు ఆదరించుడు; ఏలన అవి మనకు ముక్తిని గూర్చి శుభ సమాచార మిచ్చుచున్నవి.

౫. ఈ నాలుగు నుండి మిగతా రెండు ఋక్ మరియు అతర (అధర్వ) ములు. ఇవి మనకు విశ్వ భ్రాతృత్వపు పాఠము నిచ్చుచున్నవి ఈ రెండును జ్యోతిః స్తంభములు ఇవి మనకు అట్టి లక్ష్యము (విశ్వ భ్రాతృత్వము) వైపునకు మనముఖమును త్రిప్పుకొనుటకు హెచ్చరించుచున్నవి

అరబు దేశీయ కవియగు 'లాబీ (లాపీ) ద్వారా వేదముల యెడ సమర్పించిన ఈ శ్రద్ధాంజలి స్వర్ణాక్షరములో లిఖింపయోగ్యమై యున్నది

**2.9 దారాశికోహ వేదములను ఈశ్వరీయ జ్ఞానమనియే నమ్మినాడు.**

ముస్లిం మతాంధతకు ఖ్యాతిగాంచిన ఔరంగజేబుయొక్క అన్నయగు 'దారాశికోహ' పేరు సుప్రసిద్ధమై యున్నది అతడు సత్యము నన్వేషించు సజ్జనుడు సత్యాన్వేషణము నం దాతడు ఈశ్వరీయ పుస్తకము లని యెంచబడు పుస్తకము లనేకములను అనుశీలన మొనర్చియుండెను అతడు స్వయముగా ఇట్లు వ్రాసినాడు

**జమీకుతబ సమావీ బనజర దార ఆ ఉరదా।**

అనగా- నేను సమస్త ఆకాశీయ (ఈశ్వరీయ) పుస్తకములను చదివితిని. కాని వాని ద్వారా నా ఉద్దేశ్యములు పూర్తికాలేదు. ఈ సంబంధమున నాత డిట్లు వ్రాసినాడు

**నజర బా తౌరేతో అంజీలో జబీరో దీగర సహాఫ అన్దాఖ్త ముజమలో**

**మరమూజ బూద వ అజతరజమా హాయ సుహేలీ కి అహలే గరజ**

**కరదా బూద న మతలూబ మాలూము నగరదీద .**

అనగా, తౌరేత *(Old Testament)* ఇంజీల్ *(New Testament)* మరియు జబూర్ *(The Book of Psalms)* మరియు ఇతరేతర ధర్మ గ్రంథముల నవలోకించితిని ఈశ్వరుని ఏకత్వపు వర్ణన వాసియందును సంక్షిప్తము మరియు రహస్య పూర్ణము గనే యున్నది. స్వార్థ పరులు ఈ ధర్మ గ్రంధములకు చేసిన భాష్యముచే ఆయుద్దేశ్యము నెరవేరలేదు.

తన ఇస్లామీ ధర్మ గ్రంథమగు కురాన్ శరీఫ్ విషయములోను ఆతడిట్టి యభిప్రాయమునే ప్రకటించినాడు.

**'చూం కురాన అజీమ వఫర్కాన కరీమ అక్సరే బా రమూజస్త వై దానిస్త**

**ఆ మజహో కమ యాబ అన్ద ।**

అనగా- కురాన్ శరీఫ్, లేక ఫుర్కాన్ కరీమ్ యందును సుమారు రహస్యములే యున్నవి. రహస్యముల నెరిగినవారు చాలా కొద్ది మంది మాత్రమే యున్నారు.

పరిశోధన చేయగా చేయగా దారాశికోహకు 'హిందువులందును ఏకేశ్వర జ్ఞానము చాలినంత పరిమాణములో గల'దని నిశ్చయమైపోయినది. ఈ విషయము నందాతడిట్లు వ్రాసినాడు

**దర పై ఆంశుద కి అజ చే జహత దర హిందుస్తాన వహమద అయాం**

**గుఫ్తగుఏ తౌహీద బిసియారస్త వ ఉల్మాఏ జాహరీ వ బాతినీ తాయసా**

**కదీమ హిన్ద రా అజ వహదత ఇన్కారీ నవర్ మోహెదాన గుఫ్తాంరీనేస్త**

**బల్కి పాయాయే తబార అస్త.**

అనగా, హిందుస్తానములో ఈశ్వరుడొక్కడేయని ప్రకటించునట్టి ఏకేశ్వరవాద విషయక అనేక వార్తలు విద్యమానమైయున్నవి. మరియు ప్రాచీన భారతము యొక్క పరోక్ష మరియు అపరోక్ష విద్యల నెరుగువారెప్పుడును ఏకేశ్వర వాదమును నిరాకరించలేదు మరియు ఈ ఏకేశ్వర వాద విషయమునందెప్పుడును ఏ విధమగు శంకలను తెలుపలేదు. ఏలన, వారికి ఏకేశ్వర వాద విషయమున దృఢ విశ్వాసమే యుండెను. 'ఇందు కేమి కారణ' మను విషయమునే నే ననుసంధాన మొనర్చుట యందు లీనమై యున్నాను

ఈ విషయమునం దాత డధిక అనుసంధాన మొనర్చి ఏ పరిణామ మునకు చేరియుండెనో వాసిని పారసీ భాషలో నిమ్న శబ్దములలో ప్రకటించినాడు.

**బాద అజ తహకీక ఇన మరాతిబ మాలూమశుద కి దరమియాన ఈం కౌమే కదీమ పేశ అజ కుతబ సమావీ చాహార కుతబ ఆస్మానీ కి ఋగ్వేద యజుర్వేద, సామవేద, వ అథర్వ వేద బాశద్ బర ఇబ్నాయే ఆ వక్తే బుజుర్గేలర ఆహో ఆదమ సఫీ అల్లాహ వ అలీస్సల్లామ అస్త బరజమీ అహకామ నాజిల శుదా.**

అనగా; క్రమముగా అనుసంధాన మొనర్చిన తరువాత నాకు నిశ్చయమైన దేమన; ఈ ప్రాచీన (హిందూ) జాతియందు సమస్త 'ఈశ్వరీయ గ్రంధము'ల (అనగా; కురాన్, ఇన్జీల్, తౌరేత్, జబూర్ మున్నగువాని) కన్న పూర్వము నాలుగు ఈశ్వరీయ పుస్తకములు, వాని పేర్లు ౧. ఋగ్వేదము, ౨. యజుర్వేదము, 3. సామ వేదము

౪ అథర్వ వేదము అనునవి గలవు. ఆ కాలములోని ఋషులపై ( ఇందందరికన్న పెద్ద ఆదమ్ అనగా; 'బ్రహ్మాజీ' యై యుండెను ) సమస్త ఆజ్ఞలతో కూడా ఈశ్వరుని వైపు నుండి ప్రకటింపబడి యుండెను.

''ప్రాచీన కాలములో హిందువుల నాలుగువేదములు విద్యమానమై యుండెను. వాని యందు ఈశ్వరుని ఏకత్వము సంపూర్ణముగా ప్రతిపాదించబడినది. 'ఉపనిషత్తు' లను గ్రంథములు ఈ వేద వచనముల నుండియే సంకలిత మొనర్చి వ్రాయబడినవి. కావుననే ఉపనిషత్తులు వేదములందు ప్రతిపాదింపబడిన బ్రహ్మ విద్య యొక్క సారభూత గ్రంథములై యున్నవి. ఈ నాలుగు పుస్తకములు ( అనగా- ఋగ్యజుస్సామాథర్వ వేదముల సారము), బ్రహ్మప్రాప్తికై సమస్త సాధనములు, రహస్యములు మరియు ఈశ్వరుని ఏకత్వములను సాక్షాత్కారమొనర్చుకొను అభ్యాసముల వర్ణన మొనర్చుచున్నవి 'ఉపనిఖత్ ( ఉపనిషత్తు) లని వాని పేర్లు, ఆకాలపు విద్వాంసులు వానిని వేదముల నుండి వేరు పరచి ఆ గ్రంథములపై విస్తృత భాష్యములను వ్రాసినారు. మరియు నా యుపనిషత్తుల అధ్యయనమును వారొక సర్వోత్తమ ఉపాసనగా చేయుచుండి'' రని యువరాజగు దారాశికోహ నిశ్చయించుకొనినాడు

ఈ విషయమును దెలిసికొనిన పిదప దారాశికోహ స్వయముగా సంస్కృత భాషాధ్యయన మొనర్చినాడు. ఆయన వేదములను, మరియు ఉపనిషత్తులను స్వయముగనే ( అధ్యయనమొనర్చి) వాని తాత్పర్యముల నవగాహన మొనర్చుకొనునంతటి స్థితి వరకు సంస్కృతమును చదివినాడు. అప్పుడాయన (౧౦౬౭ హిజరీలో) ఆకాలపు వేదముల, ఉపనిషత్తుల జ్ఞాతలగు సుప్రసిద్ధ పండితులను, సంన్యాసులను సమావేశపరచి వారి సహాయముతో స్వయముగా ఉపనిషత్తులను పారసీ భాష యందనువాద మొనర్చినాడు ఈశోపనిషత్తు విషయములో ( ఇది ఇతర అన్ని ఉపనిషత్తులకు మూలము, మరియు స్వయముగా కాణ్వశాఖ యొక్క యజుర్వేద ౪౦ వ అధ్యాయమునై యున్నది ) దారాశికోహ ఇట్లు వ్రాసి యున్నాడు.

**కితాబ కదీమ కి బేశకో శుబహ అవ్వలీమ కితాబ సమావీ వ సరే**

**చశ్మాయె తహకీక వ బహరే తోహీదస్త.**

ఈ పుస్తకము అనాదియై యున్నదనుటలో ఎలాంటి సందేహము లేదు. సమస్త ఈశ్వరీయ పుస్తకములందిది ప్రాచీనతమమై యున్నది మరియు పరమ సత్యమునకు స్రోతస్సు, బ్రహ్మ జ్ఞానమునకు సముద్రమునై యున్నది.

## 2.10 కురానులో వేదముల నిర్దేశనము.

దారాశికోహ ఈ విధముగా వేదములను పరమ పవిత్ర ఈశ్వరీయ జ్ఞాన రూపమున స్వీకరించినాడు. మరియు 'కురాన్' యొక్క ఒక అరబీ వాక్యమునందు దిగువ శబ్దములో ఈ విధముగా పేర్కొనినాడు.

**'ఇన్న కురానే కరీమ – ఫీ కితాబ మంకనూ – లాయే మస్సహూ ఇల్లాఅల్**

**మతహూనతన్జీలమిన్ రబ్బుల ఆలమీన్।'**

వేదములను గురించి దారాశికోహ ఉద్దేశ్యము ననుసరించి ఈ అరబీ వాక్యము యొక్క తాత్పర్యమేమనగా,

కురాన్ శరీఫ్ అనునదొక పుస్తకము. ఆ పుస్తకము మరొక పుస్తకమునందు గుప్తమైయున్నది పవిత్ర హృదయము గలవారికే దాని జ్ఞానము లభించును. ఆ పుస్తకము సృష్టికర్తయగు ఈశ్వరుని వైపునుండియే ప్రకటితమైనది

ఉపర్యుక్త కురాన్ షరీప్ పంక్తులందు దాని సంబంధమున మూడు విషయములు ఉల్లేఖించబడినవి అవి. ౧. కురాన్ శరీఫ్ ఒకానొక ఇతర పుస్తకమునందు విద్యమానమై యున్నది. మరియు నా పుస్తకము గుప్తమై యున్నది ౨. ఆ కురాన్ విద్యమానమైయున్న పుస్తకము నెవ్వరును తెలిసికొన (అర్థమొనర్చుకొన) జాలరు. ఐనను పవిత్ర హృదయము గలవారు మాత్రమే ఆ పుస్తకము నర్థము చేసికొనగలుగుదురు 3 అట్టి మౌలిక పుస్తకము ఏ మనుష్యుని ద్వారాను రచింపబడలేదు. స్వయముగా జగత్పాలకుడగు పరమేశ్వరుని దిశనుండియే దిగి వచ్చినది

కురాను యొక్క ఈ ఉపర్యుక్త వాక్యములకు అర్థమొనర్చుట యందు మౌల్వీలను వారే గొప్ప చిక్కులలో బడి పోవుదురు. ఇది తౌరేత్, ఇంజీల్, లేక జబూర్ యొక్క నిర్దేశమని చూపుటకు ప్రయత్నింతురు. ఆంగ్లము నందు దీనిని బైబిల్ అను పేరుతో పిలుతురు కాని వర్తమాన బాయిబిల్ నందు కురాన్ యొక్క ఉనికి నిశ్చితము గాజాలదు. ఈ పంక్తులు జబూర్‌తౌరేత్, ఇంజీల్, లేక బాయిబిల్ కు సంబంధించినవి గావని దారాశికోహ నిశ్చితాభిప్రాయమై యున్నది మీదు మిక్కిలి నాజిల్ (దిగివచ్చిన) ఈ శబ్దములతో ఈ పంక్తులు **లోహెమహపూజ్** లేక సురక్షిత పీఠము విషయమునను గాదు గాని వేదముల (తదాశ్రిత ఉపనిషత్తుల) విషయమున గలదు ఆయన ఇట్లు స్పష్టముగా వ్రాసినాడు.

**'జాహిర్ మీశవత కిఈం ఆయత బైనహూ దర ఈం కీతాబ కదీమస్త । వమాలూమ మీశవత కిఈం ఆయత దర హక జబూరో తౌరేత వ ఇంజీల నేస్త బల్కి అజ లఫ్జతంజీల చునీ జాహిర మీ గరదద కి దర హక లోహె మహపూజ హమ నేస్త । చూం ఉపనిషద కి సర పోశీదనీ అస్త అస్లీ ఈం కితాబ అస్త వ ఆయత హాయ కురానమజీద బైనహూ దర ఆయాఫ్తా మీశ్వద పస.**

కురాన్ శరీఫ్ యొక్క ఈ పంక్తులు ఈ అనాది పుస్తకములైన వేదములు, లేక తదాశ్రిత ఉపనిషత్తుల విషయమే నని ప్రకటితమగుచున్నది. వారీ ప్రసంగమునం దిదియును వ్రాసినారు.

**కితాబ బ తహకీక కి కితాబ మకనూన ఈం కితాబె కదీమ బర శద వ అజీ ఫకీర రా నాదానిస్తాం వ నాఫహ మీదా ఫహమీదా శుద।**

కావుననే ఉపనిషత్తులు గుప్త రహస్యములు కాబట్టి ఈ పుస్తకము (కురాన్ శరీఫ్) నకు మూల స్రోతస్సులైనవి మరియు కురాన్ శరీఫ్ యొక్క అనేక ఆయతులు ఉన్నవియున్నట్లే వాని యందు కాన్పించుగలవు. అనగా పుస్తకము అనగా గుప్త పుస్తకము. ఇదియే ప్రాచీన పుస్తకము (వేదములు, మరియు ఉపనిషత్తులు) మరియు వీని వల్లనే ఈ సేవకునకు (దారాశికోహ నగు నాకు) అజ్ఞాత విషయములు జ్ఞాతములైనవి. అర్థము గాని విషయములు ఇప్పు డర్థమైనవి. దారాశికోహ తన ఉపనిషత్తుల ఫారసీ అనువాదము నం దీ విషయమును వ్రాసినాడు.

**'సాదత మన్దే కి గరజ నస శవమ్ గుజాశ్తా ఖాలిసత బ వజే అల్లాహ**

**ఈం తరజుమా రా కే బదసరే అకబర మౌహసూమ గశ్తా తరజుమా కలామ ఇలాహీ దానిస్తా తర్క్ తాస్సుబ నమూదా బ ఖ్వాన్ద వ బఫైహమద బేజవాల బేఖౌఫ్ వ బేఅన్దోహ వరుస్తగా మో యే ఖ్వాహద శుద ।'**

అనగా; సౌభాగ్య శీలుడగు అదృష్టశాలి తన దూషిత మనస్సు యొక్క స్వార్థమును పరిత్యజించి 'సిర్రె అక్బర్', లేక మహాన్ రహస్య మను పేర ప్రసిద్ధమైన ఈయనువాదమును ఈశ్వరీయ వాణికి అనువాద మని యెంచి కేవలము పరమాత్మ కొరకనియే తలంచి పక్షపాత రహితుడై చదివినచో నాతడు అజర, అభయ, దుఃఖ రహితుడై సదాముక్తుడై పోవును.

ఈ విధముగా దారాశికోహ ఒక సత్య ప్రియ వ్యక్తి రూపములో వేదములను ఈశ్వరీయ జ్ఞానమని నమ్మినాడు మరియు నీ విషయమును ఉపర్యుక్త స్పష్ట శబ్దములలో చాటినాడు. ఈ కారణముననే ఆతడు తన ప్రాణములను బలిదాన మొనర్చవలసి వచ్చినది. ఔరంగజేబు ఆజ్ఞననుసరించి ఆకాలపు శాహీ దర్బారు నందలి ముల్లాలు అతనిపై కుఫ్ర (నాస్తికత్వము) నారోపించి ఫత్వా (తీర్పు) యొసగి ఆ మహాపురుషుని హత్య యొనర్చిరి.

వేదములు, మరియు తదాశ్రిత ఉపనిషత్తుల మహత్త్వ విషయములో 'దారాశికోహ' వంటి సత్యాన్వేషి యొక్క పైన పేర్కొనిన మనోభావములు అత్యంత మహత్త్వ పూర్ణములైనవి. వీనిపై అధిక వ్యాఖ్యలొనర్చు అవసరమే లేదు.

## 2.11 అనేక నిష్పక్ష పాశ్చాత్య విద్వాంసులు - వేద గౌరవ గానము.

పాశ్చాత్య లేఖకు లనేకులు ఈసాయి మతము యొక్క శ్రేష్ఠత్వమును ప్రదర్శించుట కొరకు నిష్పక్షపాత బుద్ధితో వేదముల నధ్యయన మొనర్చలేదు. ఐనను యూరోపు, అమెరికా దేశముల విద్వాంసు లెందరో వేదములను నిష్పాక్షిక భావముతో అధ్యయన మొనర్చి వాని మహిమను ముక్త కంఠముతో గానమొనర్చినారు. వానిలో కొందరినైనను ఈ ప్రకరణము నందు ఉల్లేఖించకుండ యుండ జాలము.

## 2.12 డా. రసేల్ వైలేస్ యొక్క వేదమహత్వ విషయక అభిప్రాయము

మొట్ట మొదట మేము డార్విన్ తోబాటు ప్రాకృతిక జగత్తునందు వికాసవాద ఆవిష్కారకుడగు డా. రసేల్ వైలేస్ యొక్క సుప్రసిద్ధ గ్రంథమగు 'Social Environment and Moral Progress' నుండి కొన్ని విషయములను ఉదాహరించదలచినాము. ఇవి అత్యధిక మహత్త్వ పూర్ణమై యున్నవి. వారిట్లు వ్రాసినారు.

'In the earliest records which have come down to us from the past, we find ample indications that accepted standard of morality and the conduct resulting from these were in no degree inferior to those which Prevail to-day, though in some respects they differed from ours. The wonderful collection of hymns known as the Vedas is a vast system of religious teachings as pure and lofty as those of the finest portions of the Hebrew scriptures. Its authors were fully our equals in their conception of the unvierse and the Deity expressed in the finest poetic language. P. 11

'In it we find many of the essential teachings of the most advanced religious thinkers.' P. 13

We must admit that the mind which conceived and expressed in appropriate language such ideas as are every where present in those Vedic hymns could not have been inferior to those of the best of our religious teachers and poets, to our Milton, Shakespeare and Tennyson'

Social Environment and Moral progress by Dr. Alfred Russel Wallace. P. 14.

అనగా, మనకిప్పుడు లభించుచున్న పాతకాలపు లేఖలందును మనకు కావలసినన్ని శ్రేష్ఠతరమైన సదాచారము మున్నగు ఆలోచనలు, మరియు వ్యవహారములు ఇప్పటి మనకన్న ఏ రూపమందును తక్కువ శ్రేణివిగానివి గలవు ఐనను అనేకాంశములందు అవి మనకు భిన్నముగా నవశ్యముండెను వేదముల పేరుతో ప్రసిద్ధ ఆశ్చర్యజనకమగు సంహితలందు బాయిబల్‌లోని ఉత్తమోత్తమ భాగము కన్నను పవిత్ర మరియు ఉన్నతమగు ధార్మిక శిక్షల యొక్క ఒక పద్ధతిని గాంచగలము దీని లేఖకుడు ప్రపంచము, మరియు సుందరతమమైన కవితలందు ప్రకాశిత ఈశ్వర విషయమగు ఆలోచనలను సంపూర్ణముగా మన యెదుట నుంచెను వాని యందు మనము ఉన్నతమైన, మరియు ప్రగతి శీలమైన ధార్మిక ఆలోచనలను, ముఖ్యముగా శిక్ష (బోధ) లను పొందుదుము. ఏ మనస్సు ఆ ఉన్నత ఆలోచనలను గ్రహణమొనర్చెనో, మరియు తదనురూపముగా ఉత్తమ భాషయందు ప్రకటించిన వానినే వేదములందు సర్వత్ర చూడగలుగుదుము. మన ఉచ్చతమ ధార్మిక శిక్షకులు, మరియు మిల్టన్ షేక్స్‌పియర్, టైనిసన్ వంటి కవుల కన్న ఏ రూపమందును కొరతగా లేకుండెను

ఇంతకు మించిన సామాజిక వికాసవాదము *(Social Evolution Theory)* యొక్క ఖండన మింకే ముండగలదు? వేదములను దాదాపు ప్రపంచమందలి పాశ్చాత్య విద్వాంసులెల్లరును విశ్వమందలి ప్రాచీన గ్రంథములని నమ్మినారు (ప్రొ మ్యాక్స్‌మూలర్ యొక్క సుప్రసిద్ధ శబ్దములందు *'The oldest books in the Library of mankind'* వేదములందలి శిక్షలు ఎంతటి ఉన్నతములు, పవిత్రములనగా బాయిబిల్‌నందలి ఉత్తమోత్తమ భాగములు అనగా, ఋషులు నివసించిన సుసభ్య జగత్తు యొక్క ఉచ్చ కోటి ఆలోచనాపరుల, అనగా మిల్టన్, షేక్స్‌పియర్, టైనీసన్ వంటి కవుల కన్న తక్కువ లేకుండెను. ఐనచో సామాజిక వికాసము కొరకు అవకాశమిక ఎచ్చట నుండగలదు? భౌతిక జగత్తునందు వికాస వాద ప్రవర్తకులందలి ఒక వైజ్ఞానిక శిరోమణి సామాజిక వికాసవాదమునిట్లు నిరాకరించుట అత్యంతము మహత్త్వపూర్ణమే ఈ సామాజిక వికాస వాదమును ఆధారము పై ఈశ్వరీయ జ్ఞానము *(Revelation)* యొక్క ఆవశ్యకతను నిరాకరించుట అతి సాహసము వారు తమ ఆలోచనలను మార్చుకొనుటలో వివశులుగావలసి యుండును ఈ విషయమును 'డా ఆల్ఫ్రెడ్ రసెల్ వైలెస్' పైన వ్రాసిన వాక్యముల ద్వారా స్పష్టముగా గలదు.

### 2.13 వేదముల విషయములో ఈసాయీ పాదరీ బిరుఫురి మంతవ్యములు

*Rev Morris Philip* పేరు గల ఈసాయీ పాదరీ *'The Teahings of the Vedas'* అను పేరుగల తన గ్రంథములో నిమ్న శబ్దములందు వేదములను ప్రారంభిక ఈశ్వరీయ జ్ఞానమని చూపినాడు అతడిట్లు వ్రాసినాడు

'After the latest reserches into the history and chronology of Books of Old Testament, we may safely now call the RigVeda as the oldest book,not only of the Aryan humanity, but of the whole world'

'It is evidnet then (1) That the higher upto the source of the Vedic religion, we push our enquires, the purer and simpler we find the conception of God; and that (2) In proportion as we come down the stream of time, the more corrupt and compelx we find it. We conclude therefore that the 'Vedic Aryans' did not acquire their knowledge of the divine attributes and functions empirically, as in that case, we should find at the end what we now find in the beginning. Hence we must seek for a theory which will account alike for the acquisition of that knowledge, the God-like conception of Varuna, and for that gradual depravation which culminated .

The teachings of the Vedas by Rev Morris Philip P. 104

'We have pushed our enquiries as far back in time as the records world permit, and we have found that the religious and speculative thought of the people was far purer simpler and more rational at the farthest point we reached, than at the nearest and the latest in the Vedic age.

The conclusion therefore, is inevitable viz that the development of religious thought in India has been uniformly downward, and not upward, deterioration and not evolution. We are justified, therefore, in concluding that higher and purer conceptions of the Vedic aryans were the results of a Primitive Divine Revelation.

The Teachings of the Vedas by Rev. Morris Philip, P. 231.

ఈ యుదాహరణ ( ఉద్ధరణము) కొంత దీర్ఘమైనను అత్యంత మహత్త్వ పూర్ణమైనది దీని తాత్పర్యమేమన, పూర్వకాలపు శాసనముల ఇతిహాసముల మరియు పుస్తకముల నిర్మాణ కాలము మున్నగు విషయముల అనుసంధానముల పరిణామ స్వరూపముగా మేమిప్పుడు ఋగ్వేదమును కేవలము ఆర్యజగత్తునకే గాక విశ్వమంతటికిని అన్నిటికన్న ప్రాచీనమైన గ్రంథమని నిస్సంకోచముగా చెప్పగలము

౧. మనము వైదిక ధర్మము యొక్క ప్రవాహమునెట్లెట్లు పరిశోధించుచు పైకి వెళ్ళుదుమో అట్లట్లే మనకు పరమేశ్వరుని విషయక పవిత్రాలోచనలు సరళ మగునని స్పష్టపడగలదు.

౨. ఏ యనుపాతములో మనము కాల ప్రవాహమున క్రిందికి వెళ్ళుచుందుమో మనము ఈశ్వర సంబంధ విషయములను అంత అధికముగా వికృతము మరియు విషయముగా పొందుచుండెదము కావుననే మేము దిగువ పరిణామమున నున్నాము వైదికార్యులు ఈశ్వరుని గుణముల, కార్యముల జ్ఞానమును అనుభవము, లేక నిరీక్షణల ఆధారముపై ప్రాప్తించుకొనలేదు. ఏలన; ఆ పరిస్థితి యందు మనము ప్రారంభమున పొందిన శుద్ధ రూపమును అంతమునందును పొందవలసి యుండెను. కావున మనము అజ్ఞాన ప్రాప్తి వరుణుని వలె ఈశ్వర సంబంధ కల్పనలు, మరియు క్రమికక్షీణదశ వంటి రూపమును వ్యాఖ్యానించ దగిన వాదమును పరిశోధించవలసియుండును

వేదోంకి శిక్షాయేం పు. ౧౦౪

మనము మన పరిశోధన నిప్పుడు కాలము దృష్టిలో ఎంత వెనుకకు వెళ్లినావునగా, ఆకాలమున లేఖనాది (వ్రాయుటకు) సామగ్రి మనకు దొరకకుండెను లోకుల ధార్మిక, మరియు దార్శనిక ఆలోచన లప్పుడు మనము చేరదగినంత పురాతన కాలములో అధికాధిక పవిత్రము మరియు యుక్తి యుక్తముగా సరళముగా నుండెను మా దృష్టి యందు ఆ కాలము వైదిక కాలము కన్నను అతి సమీపము, అతి నవీనమునై యుండెను.

కావున ఇప్పుడు భారత దేశములో ధార్మిక భావముల వికాసము జరుగలేదు కాని చెప్పరానంతగా క్షీణించిపోయినది ఉన్నతి జరుగుట యటుంచి కోలుకొన సాధ్యముగా నంత అవనతియే యైనదను పరిణామమునకు చేరుట అనివార్యమే. కావుననే వైదికార్యుల ఈశ్వరుడు మున్నగు విషయముల ఆలోచనలు అత్యున్నతము, అతిపవిత్రములైన భావములు ఒక ప్రారంభిక ఈశ్వరీయ జ్ఞానమునకు పరిణామమేయను నిర్ణయమునకు వచ్చుట న్యాయ యుక్తమే యగును

'రెవరెండ్ మారిస్ ఫిలిప్' యొక్క వైదిక ఏకేశ్వరవాదము మున్నగు విషయములుగల యీ వ్యాసము విశేష మహత్త్వ పూర్ణమైనదనుటలో సందేహము లేదు ఐనను ఆతడు సంపూర్ణముగు ఆ విశుద్ధ రూపమున వైదిక ధర్మ సిద్ధాంతములను చక్కగా దెలిసికొనినాడా! యనునది చెప్పజాలము. ఆతని గ్రంధమునందును అనేక అశుద్ధధారలు గాన్పించగలవు. వానిని మేము అవకాశమును బట్టి నిర్దేశింపగలము

## 2.14 వేద విషయమున ఈసాయి విద్వాంసుడగు ప్రొ. హీరేన్ అనునాతని వ్యాసము.

ప్రొ హీరేన్ *(Prof Heeren)* అను పేరుగల ఒక సుప్రసిద్ధ ఐతిహాసిక అనుసంధాన విద్వాంసుడు వేదముల విషయమునం దిట్లు వ్రాసినాడు.

They (The Vedas) are without doubt the oldest works composed in Sanskrit. Even the most ancient Sanskrit writings allude to the Vedas as already existing. The Vedas stand alone in their solitary splendour standing as beacon of Divine light for the onward march of Humanity.

Historical Researcehs by Prof. Heeren Vol .II P. 127

అనగా; సంస్కృతము నందు వేదములు ప్రాచీనతమ ( అతి ప్రాచీన) గ్రంథములని యనుటలో సందేహము లేదు. ఉపలబ్ధమగు అన్నిటికన్న అధిక ప్రాచీన సంస్కృత గ్రంథములందును వేదములని యునికి స్పష్టముగా గాన్పించును. మానవుల ఉన్నతికొర కవి తమ అద్భుత రీవి యందు దివ్య ప్రకాశ స్తంభము వలె నున్నవి

## 2.15 'లే ఓం దేల్బోస్' అను పేరు గల ఫ్రాన్సు దేశ విద్వాంసుని అభిప్రాయము

౧౮౮౪ జూలై ౧౪న ప్యారిస్ నగరమున ఏర్పరచబడిన అన్తర్ రాష్ట్రియ సాహిత్య సంఘము *(International Literary Association)* నందు వ్యాసమును చదువుచు లేఓం దేల్బోస్ *(Mons Leon Delbos)* పేరు గల ఫ్రాంసు దేశస్థుడగు సుప్రసిద్ధ విద్వాంసుడిట్లు ప్రకటించినాడు.

'The RigVeda is the most sublime conception of the great high ways of humanity'.

Quoted in the Hindu Superiority by Har Bilas Sharada, P. 179.180

అనగా; ఋగ్వేదము మానవ మాత్రుల ఉన్నతి ప్రగతి మరియు ఆదర్శముల ఉన్నతోన్నత కల్పనయై యున్నది.

## 2.16 నోబుల్ బహుమతి గ్రహీత ( నోబుల్ బహుమతి విజేత)

## మైటర్లింక్ అభిప్రాయము

దాదాపు లక్షపాతిక రూ ల నోబుల్ పురస్కార విజేత, సుప్రసిద్ధ దార్శనికుడగు మైటర్లింక్ అనునాతడు స్టైనర్ నామక విద్వాంసుని శబ్దములలో వేదముల మహత్త్వమును నిమ్న లిఖిత శబ్దములలో ప్రకటించినాడు

'Only the gaze of the clairvoyant, directed upon the mysteries of the past, may reveal un-uttered wisdom which lies hidden beind these writings (The Vedas) P.9. 'Whence did our pre-historic ancestors in their supposed terrible state of ignorance and abandonment, derive these extra-ordinary intuitions... that knowledge and assurance which we ourselves are reconquering.' The Great secret by Maeterlink, P. 44

**భావార్థము :** ''వేదములందు నిండియున్న సూక్ష్మ జ్ఞానమును కేవలము సూక్ష్మదర్శి యొక్క అంతర్దృష్టి మాత్రమే ప్రకటించగలదు ఆశ్చర్యమేమన; మన ప్రాగైతిహాసిక కాలపు పూర్వజులు ఘోరమగు అజ్ఞానపు భయంకర స్థితి యందుండి రని ఊహించ బడుచుండెడిది. వారెచ్చటి నుండి ఇంతటి అసాధారణ అంతర్ జ్ఞానమును పొందినారు? దానినే మనము మరల ప్రాప్తించుకొనుటకు ప్రయత్నించుచున్నాము'' చూడుడు. సామాజిక వికాస వాదము యొక్క అసత్యతయం దింతకన్న గొప్ప ప్రమాణమే ముండును? పు. ౯౬, ౯౭లో శ్రీ మైటర్లింక్ గారు వేదముల సదాచారము మున్నగువాని శిక్షలను గూర్చి అవి ప్రప్రథమముగా సర్వోత్తమమని *(Loftiest)* చూపుచు సామాజిక వికాస వాదములపై ప్రయోగించిన కుఠారాఘాతమును మేము తగుస్థానములందు మరల చూపుదుము

**2.17 అమెరికా దేశపు సుప్రసిద్ధ ఆలోచకుడగు 'థోరియో' అభిప్రాయము.**

థోరియో నామక అమెరికా దేశపు సుప్రసిద్ధ విద్వాంసుడు వేదముల విషయములో నిమ్న మనోభావములను ప్రకటించినాడు.

'What extracts from the Vedas I have read fall on me like the light of a higher and purer luminary which describes a loftier course through a purer stratum - free from particulars, simple, universal, the Vedas contain a sensible account of God.'

- Quoted from 'Mother America', by Swami Omkar, p 9

**భావార్థము :** నేను వేదముల యొక్క ఉద్ధరణముల (ఉదాహరణముల) ను చదివినప్పుడు నాపైనొక ఉన్నత, మరియు పవిత్ర జ్యోతి పుంజము యొక్క ప్రకాశము వంటిది పడుచుండును. అది యొక ఉత్కృష్టమార్గమును వర్ణించుచుండును.

వేదముల ఉపదేశము సరళమైనది. దేశము మరియు జాతి విశేషముల బంధనము లేనిది మరియు నది సార్వభౌమికమైనది. దాని యందు ఈశ్వర విషయకములు, యుక్తి యుక్త ఆలోచనము కీయబడియున్నవి

**2.18 ఆయర్ దేశపు డా. జేమ్స్ కజిన్స్ యొక్క శ్రద్ధాంజలి.**

డా. జేమ్స్ కజిన్స్ అను పేరు గల ఆయర్ దేశపు సుప్రసిద్ధ కవి, మరియు దార్శనికుడు, *'Path to Peace'* 'శాంతి మార్గము' అను పేరు గల పుస్తకమునందు వైదికాదర్శము యొక్క ఔన్నత్యమును కొంత విస్తారముగా వర్ణించుచు చివరకిట్లు వ్రాసినాడు

'To love, to think, to do are in the Vedic conception, no transitory futilities touched with melancholy,but simulations of the cosmic activity charged with the Joy of the Eternal, shadows they are, cast dancing shadows by the light of lights, but they are cast by the light, not by Darkness and in that light, that vision of the Eternal, Shining through the temporal, humanity can find an ideal which would replace a periodical sanctim onicusness by a perpetual sense of the sanctity of all life. On that (Vedic) ideal alone, with its inclusiveness which absorbs and annihilates the causes of antogonisms, its sympathy which wins hatred away from itself, it is possible to rear a new earth in the image and likeness of the eternal heavens'

- Path to peace by Dr. James Cousins. P. 60

అనగా- ప్రేమించుట, మనన మొనర్చుట, కార్య మొనర్చుట ఇవి వైదిక ఆలోచనానుసారము క్షణిక నిరాశాపూర్ణమగు వ్యర్థ క్రియలు గావు. కాని ఇవి విశ్వ వ్యాప్త క్రియలు; అవి ఏ నిత్య పరమేశ్వరుని ఆనందముతో పరిపూర్ణమైయున్నవియో వాని యనుకరణ మాత్రములై యున్నవి. అవి యొక విధముగా ఛాయలై యున్నవి

ప్రకాశములకు ప్రకాశకుడగు పరమేశ్వరుని ద్వారా ప్రేషితమగు ఛాయలై యున్నవి. దానిని అంధకారము ద్వారా పొందలేము. భౌతిక జగత్తు ద్వారా ప్రకాశమగుచున్న నిత్యుడగు పరమేశ్వరుని ప్రకాశము ద్వారనే పొందగలము. మానవ మాత్రు లోక ఆదర్శమును ప్రాప్తించుకొనగలరు ఆ స్థాయిని ప్రవంచన రహిత పవిత్రత్వముగల ఆ స్థానమును సంపూర్ణ జీవులు పవిత్రత యొక్క శాశ్వతానుభూతి ద్వారా పొందగలుగుదురు.

ఆ వైదికాదర్శములు సార్వభౌమమగు కారణమున విరోధత్వ కారణములను వినాశపరచగలవు. సహానుభూతి ద్వారా ఘృణాత్వమును దూరమొనర్చి వశపరచుకొనును. కావున వాటిననుసరించుట వలననే పృథివిని పునః స్వర్గము వలె సుఖదాయ మొనర్పగలుగుదురు. డా కజిన్స్ ద్వారా వైదికాదర్శకముల యెడ సమర్పించిన యీ శ్రద్ధాంజలి అత్యంత మహత్త్వ పూర్ణమై యున్నది ఆయన స్వయముగ తన ధర్మపత్నితో గూడ వైదికాదర్శములతో ఎంతయో ప్రభావితుడైనాడు. ఆయన తనపేరును 'కులపతి జయరాం'గా స్థిరపరచుకొని వైదికాదర్శముల ననుసరించుచు చివర వరకు తన జీవితమును సంస్కరించుకొనుట యందు నిరంతరము ప్రయత్నించుచునే యుండెను ఫిబ్రవరి నెల ౧౯౫౬లో వారిదేహావసానము జరిగినది. వారికీ ప్రేరణ మహర్షి దయానందుల లేఖల ద్వారానే ప్రాప్తించినది ఈ విషయమును వారు మహర్షికి శ్రద్ధాంజలిని సమర్పించుచు ఈ దిగువ వాక్యములలో స్వీకరించియున్నారు

'I have observed during my travels in India, the effects of Swami Dayananda Saraswati's influece in earnest efforts to vitalise life in India with the Vedic ideal, which for thirty years has been a fundamental influence in my own life and in that of Mrs. Cousins, and for this much needed service to India and the world, I offer our joint homage to his memory.

- Dayananda Commemoration Volume. Ajmer, P.56

అనగా- భారతదేశములో నేను యాత్ర నొనర్చుచు స్వామి దయానంద సరస్వతి యొక్క వైదికాదర్శము ద్వారా భారతీయులందు నవజీవన సంచారమొనర్చు విషయమును సత్యనిష్ఠతాపూర్ణ ప్రయత్నము యొక్క ప్రభావమును అనుభూతినొందినాను ఈ వైదికాదర్శమే నాయొక్క, నా ధర్మపత్ని యొక్క (మా దంపతుల) జీవితమందు వాస్తవిక రూపేణ ప్రభావజనకమై యుండినది. కావుననే ఒక భారతదేశమే గాక విశ్వమంతటికిని స్వామి దయానందులొనర్చిన అత్యావశ్యక సేవలకే దంపతులమగు మేము సంయుక్తముగా శ్రద్ధాంజలిని సమర్పించుకొనుచున్నాము.

## 2.19 వేదముల యెడ రష్యా విద్వాంసుడగు 'బౌలంగార్' శ్రద్ధ.

*Sacred Books of the East Series* యొక్క *Russian Edition* యొక్క సంపాదకుడగు మ. బౌలంగర్ *(Mr Boulanger)* అనువాతడు ప్రసిద్ధ జర్మన్ విద్వాంసుడగు ప్రొ మైక్స్ మూలర్ వేదముల కపోలకల్పానువాదము స్వయముగా మైక్స్ మూలర్ *The Vedic Hymns* లో ఊహామాత్రానువాదమని అంగీకరించినాడు. *'My*

*Translation of the Vedas is conjectural)* అనగా ; వేదముల నా యీ అనువాదము కపోల కల్పితము మరియు అనుమానముపై ఆశ్రితమైయున్నది. గట్టి సమాలోచన మొనర్చుచు భూమికయందిట్లు వ్రాసినాడు.

'What Struck me in Max mullar's translation was a lot of absurdities, obscoen passages and a lot of what is not lucid,

'As far as I can grasp the teachings of the Vedas, it is so sublime that I would look upon it as a crime on my part, if the Russian Public become acquainted with it through the medium of a confused and distorted translation, thus not deriving for its soul that benefit which this teaching should give to the people'

- Quoted here from sadhu T.L. Vaswani's Torch - bearer P. 143

అనగా- ప్రొ. మైక్స్ మూలర్ అనువాదమునందు నాకు కనిపించిన అత్యంతాశ్చర్యకర విషయమేమన అందనేక అసభ్యకరమైన, అశ్లీలకరమైన, అస్పష్ట విషయములు కలవు. నేనెరిగినంత వరకు వేదవిద్య మహో ఉన్నతోన్నతమైనది అది నేను వర్ణింపజాలనంతటి ఉజ్జ్వలమైనది, ఉన్నతతరమైనది రష్యా ప్రజల యొక్క ఒక గంద్రగోళపు, మరియు మోటురకపు అనువాదము ద్వారా వేదముల పరిచయ మొనర్చుటలో నేను చేయుచున్నది ఘోరమగు అపరాధమనియే తలచుచున్నాను ఏలన అది ప్రజల కీయదగిన వైదిక శిక్షణ మరియు ఆత్మిక లాభము నుండి వంచితమేయగునేమో ?

## 2.20 వేదము ఆత్మకు హిమాలయము వంటిది.

జె మాస్కారో, ఎమ్.ఏ *(J Mascaro M A,Reader of English, Unviversity of Borcelora)* అనునాతడు *'Himalayas of the Soul'* అనునొక సంగ్రహాత్మక పుస్తకమును సంపాదనమొనర్చినాడు. వాని భూమిక యందాతడు వేదములు, ఉపనిషత్తులు, మరియు గీతను ఆత్మకు హిమాలయముతో ఉపమానమిచ్చుచు ఈ విధముగా వ్రాసియున్నాడు.

'If a Bible of India were compiled, if Sanskrit could find a group of translations with the same feeling for beauty of Language and the same love for the sacred texts in the original as the Bible has found in England,eternal treasures of old wisdom and poetry would enrich the times of today.

Among those compositions, some of them living words before writing was introduced, the Vedas, the Upanishads and the BhagavadGita would rise above the rest like Himalyas of the spirit of man'

- The Himalayas of the Soel by J. Mascaro, M.A., P.151

అనగా; ఒకవేళ ఏదేని భారతదేశపు బైబిల్ వంటిది సంకలితమైనచో, ఒకవేళ సంస్కృత భాష కొరకు సంపూర్ణ శ్రద్ధ గల యోగ్యులగు అనువాదకుల వర్గము అనగా భాషా సౌందర్యముపై ధ్యానము మరియు వేదముల మూలమంత్రములపై ప్రేమ గలవారు లభించినచో ఇంగ్లాండు నందు బైబిల్ కు లభించిన అదృష్టము వేదములకు లభించియుండెడిది. అందు వల్ల ప్రాచీన బుద్ధిమత్తత జ్ఞానము, మరియు కవిత్వముల నిత్యకోశములతో వర్తమాన యుగము సుసంపన్నమై యుండెడిది.

ఈ రచనా ప్రక్రియ ప్రారంభమగుటకు పూర్వమే అనేకములు జీవిత జాగృత శబ్దములుగా స్థిరపడియుండెను. అందులోను వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత మానవీయ ఆత్మలకు హిమాలయముల వలె మిగతా అన్నిటికన్న మహా ఉన్నతమైన గ్రంథములై యున్నవి.

**2.21 'మి. బ్రాఉన్' అను పేరు గల ఆంగ్ల రచయిత శ్రద్ధాంజలి.**

మి. డబ్ల్యూ. డి. బ్రాఉన్ *(W.D. Brown)* అను పేరు గల ఒక ఆంగ్ల విద్వాంసుడు తన *Superiority of the Vedic Religion* (వైదిక ధర్మము యొక్క శ్రేష్ఠత) అను పేరు గల గ్రంథమునందు వైదిక ధర్మ విషయమున వ్రాసినది స్వర్ణాక్షరములో లిఖింపదగినదై యున్నది. వారిట్లు వ్రాసినారు

'It (Vedic Religion) recognises but one God. It is a thoroughly scientific religion where religion and science meet hand in hand. Here theology is based upon Science and Philosophy.'

- The superiority of the Vedic Religion by W.D. Brown.

అనగా; వైదిక ధర్మము కేవలము ఏకేశ్వర ప్రతిపాదన మొనర్చును. ఇదొక సంపూర్ణ వైజ్ఞానిక ధర్మమైయున్నది. ఇందు ధర్మము, మరియు విజ్ఞానము చేతులు కలుపుకొని నడుచుచున్నట్లున్నది. ఇచ్చట ధార్మిక సిద్ధాంతము, విజ్ఞానము మరియు తత్త్వ జ్ఞానము (ఫిలాసఫీ) పై ఆధారపడియున్నది.

వైదిక ధర్మము యొక్క విశేషతను ఈ కొన్ని శబ్దముల ద్వారా ఇతర మత మతాంతరములకన్న ఉత్తమమైనదని చూపబడినది

**2.22 'శౌపన్‌హార్' యొక్క వేద మూలక ఉపనిషద్విషయ వచనములు.**

జర్మనీ దేశపు సుప్రసిద్ధ దార్శనికుడు 'శౌపన్‌హార్' ఈశోపనిషత్తు విషయములో (ఈశోపనిషత్తు యజుర్వేద కాణ్వశాఖ యొక్క చివరి అధ్యాయము) దిగువ విధముగా ప్రకటించియున్నాడు. శౌపన్‌హార్ వంటి నిరాశావాది మరియు *Pessimist* దార్శనికుని లేఖ నుండి ప్రకటితమైన ఈ శబ్దములు వాస్తవముగా అత్యంత మహత్త్వపూర్ణమైయున్నవి. వారిట్లు వ్రాసినారు.

'In the whole world, there is no study so beneficial and elevating as the Upanishad. It has been the solace of my life. It will be the solace at my death.'

అనగా; ప్రపంచమునందు ఉపనిషత్తులవంటి లాభదాయకమును, ఉత్థానమొనర్చు గ్రంథములు వేరేవియును లేవు. ఇవి నా జీవితమునకు శాంతిని ప్రసాదించు గ్రంథములు. మృత్యువు సమయమందును ఇవి నాకు శాంతిని గలిగించునవియై యున్నవి.

### 2.2 3 వైదిక కర్తవ్య శాస్త్రములపై 'రాగోజిన్' అను విద్వాంసుని అభిప్రాయము.

రాగోజిన్ అను విద్వాంసుడు *Vedic India* అను పేరుతో ఒక గ్రంథమును వ్రాసినాడు ఆతడు యజ్ఞములు మున్నగు వాని విషయమున అనేక అశుద్ధాభిప్రాయములను ప్రకటించినాడు వానిని ముందు ప్రకరణానుసారము ప్రకటించెదము. ఐనను వైదిక శిక్షణల ఔన్నత్యములను గూర్చి నిమ్న శబ్దముల ద్వారా స్వీకరించినాడు

'Vedic hymns greately confirm us in the impression that the Aryan Moral code, as mirrored in the Rigveda, bore on the whole, a singularly pure and elevated character So nothing can be more nobly beautiful in feeling and wording than the following on alms - giving or rather on the duty of giving, or helping generally.'

- Vedic India by Ragozin, P. 374.

అనగా; వైదిక సూక్తములు నాయీ అభిప్రాయములను ప్రబలముగా సమర్థించుచున్నవి. వైదికాచరశాస్త్రము సంపూర్ణముగా అత్యధిక పవిత్రము మరియు ఉత్కృష్టమైనది ఇతరులకు దానమొనర్చు విషయమున ( ఋగ్వేదము ౧౦-౧౧౭న వర్ణించినట్లు) శిక్షణ, భావన, భాషా దృష్టితో ఇంతకన్న చక్కని విషయమేదియును ఉండజాలదు

ప్రసంగవశమున ఇచ్చట నొక విషయమును నిర్దేశించుట అసమంజసము గాదనుకొందుము. ఋగ్వేదము ౧౦-౧౧౭ విషయములో మి. రాగోజిన్ శ్రేష్ఠమగు ఉత్తమ ఆలోచనలను ప్రకటించగా *Vedic Age* గ్రంథ రచయిత దీనిపై దిగువ వ్యాఖ్య ద్వారా దీని గౌరవమును తగ్గించుటకు నిందనీయమగు ప్రయత్నమొనర్చినాడు దీని వల్ల అతని కుళ్ళు మనోవృత్తియే ప్రకటితమగుచున్నది

'The hymn (Rig10-117' is packed with noble sentiments, and its every word is charged with vigour, yet it should not be forgotten that the hectoring eloquence' of this energetic Priest was probably directed mainly to the purpose of frightening the wealthy into ceding a part of their wealth to the Brahmans especially, and not to the Poor of every class, for of genuine sympathy for the poor, there is not much in the Rigveda'

- Vedic Age P. 342

అనగా; ఈ సూక్తమునందు ఉత్తమ భావనలు నిండియున్నవి మరియు దీని ప్రతి శబ్దము ఓజస్సు గలదై యున్నది. ఇందు శక్తి శాలి పురోహితుని మార్మిక వక్తృత్వ శక్తి యొక్క ఉద్దేశ్యము వేరుగా నున్నదని మరువరాదు ముఖ్యముగా ధనికులను భయపెట్టి అనుమానములకు గురిచేసి వారి యందొక భాగము, విశేషముగా బ్రాహ్మణుల కొరకు ధనమును పొందజేయుటయే గాని దరిద్రుల యెడ వాస్తవిక సహానుభూతి భావము ఋగ్వేదమునందు ఎక్కువగా గానరాదు.

ఈ టిప్పణి యందాతడు 'రాగోజిన్' వంటి విదేశీ ఈసాయి లేఖకునికన్న అనేక అడుగులు ముందుకు వెళ్ళినాడు. ఈ కల్పనలకు ఈ సూక్తమునందు గాని, ఇంకా ఇతర దాన సూక్తములందు గాని ఎట్టి యాధారములు లేవు. ఈ సూక్తములం దెచ్చటను బ్రాహ్మణుల, లేక ఇతర వర్గ విశేషములను సూచించు ఎట్టిశబ్దము లేదు 'ఆధ్రాయ, చకమానాయ, రఫితాయ, ఉపజగ్నుషే, అన్నకామాయ, చరతే కృషేయ మున్నగు' విశేషణములు వచ్చిన చోట నవియన్నియు దీనులు, దుర్బలురు, అన్నావసరము మరియు కోరిక గలవారికి వర్తించునే గాని బ్రాహ్మణులు, కాని లేక ఏదో ఒక విశేష వర్గమునకు గాని ప్రత్యేకము లేదు. ఇట్టి పరిస్థితి యందు *Vedic Age* లేఖకులు అనుచితము, మరియు నిరాధారముగు కల్పనను ప్రవేశపెట్టి దానము మున్నగు వైదిక శిక్షణల మహత్త్వమును కించపరచుటకు జేసిన ప్రయత్నము విచిత్ర మనోవృత్తికి సూచకమై యున్నది దీనిపై అధికముగా వ్రాయకుండుటయే ఉచితమనిపించును. *Probably* లేక 'సంభవమే' అను శబ్దమును లేఖకులు ప్రయోగించినారు. ఇతరులు వారిపై ఆక్షేపణలను గురిపించు అవకాశము గలుగకుండుటకు కాబోలు కాని ఇట్టి *Probably* లేక సంభవమే అను శబ్దములు వారి పుస్తకమునందు చాలా యున్నవి. వేరు అధ్యాయమునందు వారి యీ *Probably* ని సంగ్రహపరచి చూపుటకు ప్రయత్నించెదము. ఈ పుస్తకమునే *A Book of Probabilities* అనగా సంభావనముల పుస్తక మనిన అనుచితముగా నుండదు విచారకరమైన విషయ మేమన, వారి కే విషయమైనను నిశ్చయమని తెలియనప్పుడు, సంభవమే (కావచ్చును) అను పదములు ప్రతి విషయమునందును స్వాభావికముగనే వచ్చి స్థిరపడిన వనినను సత్యదూరము గాదు వ్యర్థముగా ఇట్టి పుస్తకమును వ్రాసి విద్యార్థులను, ఇతర పాఠకులను భ్రమలోను సంశయమునను పడవేయు అవసరమేమి కలిగినది? ఇప్పుడును అనేక సంవత్సరముల వరకు అట్టి వివాదగ్రస్త విషయములను గంభీరముగా నిష్పక్షిక బుద్ధితో అనుశీలన (గాఢాధ్యయన) మొనర్చి నిశ్చిత పరిణామమునకై విచారశీలురగు విద్యార్థుల మరియు విద్వాంసుల సమక్షమున నుంచు సాహసమొనర్చవలెను ఈ విషయము నిచ్చట ఇంతటితోనే నిలిపివేయుదము.

## 2.24 ఫ్రాన్స్ దేశపు 'జైకోలియట్' యొక్క మహత్త్వ పూర్ణ వచనము

శ్రీ జైకోలియట్ ఫ్రాన్స్ దేశపు ఒకగొప్ప ప్రసిద్ధ విద్వాంసుడు ఆయన చంద్ర నగరమునందనేక సంవత్సరములు 'చీఫ్ జస్టిస్' (ప్రధాన న్యాయాధీశుడు) గా నుండెను ఆయన అనేక మతమతాంతరముల గ్రంథముల ననుశీలనమొనర్చుచు ఒక పుస్తకమును వ్రాసి యుండెను. దాని ఆంగ్ల అనువాదము. *The Bible in India* అను పేరుతో ప్రకాశితమైనది. ఈపుస్తకమునందు 'ఈశ్వరీయ జ్ఞాన' మని యెంచబడుచున్న వివిధ మతమతాంతరముల గ్రంథములను వేదములందలి 'సృష్ట్యుత్పత్తి విషయములో అధ్యయనమొనర్చుచు జైకోలియట్ గారు అత్యంతాశ్చర్యముతో ఇట్లు వ్రాసినారు

'Astonishing fact! The Hindu Revelation (Veda) is of all revelations the only one whose ideas are in perfect harmony with modern science, as it proclaims the slow and gradual formation of the world.

- The Bible in India by Jacolliot, Vol.11. Chapter.1

అనగా, ఎంతటి అశ్చర్యజనక సత్యమో చూడుడు! హిందువుల ఈశ్వరీయజ్ఞానము (వేదము) మాత్రమే లోకముల మందగతితో కూడిన క్రమిక రచనను గూర్చి చెప్పుచున్నది సమస్త ఈశ్వరీయ జ్ఞానములందు వేదమొకటి మాత్రమే ఆధునిక విజ్ఞానముతో సంపూర్ణరూపమున సామ్యత గలిగియున్నది

'భారత(దేశ) మున బాయిబిల్' *The Bible in India* యొక్క హిందీ యనువాదము శ్రీసంతరాంజీ కృత రెండవ భాగము అ ౧. పు ౨౮౬

ఇచ్చట శ్రీజైకోలియట్ వ్రాసిన విషయము అత్యంత మహత్త్వపూర్ణమైనది మేమిచ్చట దాని యథార్థతపై తులనాత్మకదృష్టితో కొంత వివేచన మొనర్చెదము కాని ఇచ్చటనొకపుడు పూర్వము ఇదేవిధముగా అమెరికా దేశపు విదుషీమహిళారత్నమగు 'మిసెజ్ హ్వీలర్ విల్లాక్స్' *(Mrs Wheeler Willox)* వ్రాసిన 'వేదములందు విజ్ఞానవిషయము' లోని వాక్యములను ఉదాహరించుటయును మాకు ఉచితమే యనిపించుచున్నది ఆ విదుషీమణి ఇట్లు వ్రాసినది

'We have all heard and read about the ancient religion of India. It is the land of the great Vedas-the most remarkable works containing not only religious ideas for a perfect life, but also facts which all the science has since proved true. Electricity, Radium, Electrons, Airships all seem to be known to the seers who found the Vedas.'

అనగా, మేము ప్రాచీన భారతము యొక్క ధర్మము విషయమున వినియుంటిమి చదివియుంటిమి ఇది యా మహాన్ వేదములభూమి. వేదములు అత్యంత అద్భుత గ్రంథములు వీనియందు కేవలము ఇహలోకపు పూర్ణజీవనమునకు ఉపయుక్తమగు ధార్మిక తత్త్వములేగాక సమస్త విజ్ఞానము సత్యము మరియు వైజ్ఞానికులు నిరూపించిన సత్యములను కూడా ప్రతిపాదింపబడినది. విద్యుత్తు, రేడియం, ఎలెక్ట్రాన్స్, విమానములు, లేక ఆకాశయానములు మున్నగు సమస్త విషయములు వేదద్రష్టలగు ఋషు లెరిగియే యుండిరని ప్రతీతమగుచున్నది

శ్రీ జైకోలియట్ రచిత *The Bible in India* యందిట్లు వ్రాయబడియున్నది ఈశ్వరీయజ్ఞానమని విశ్వసించు గ్రంథములందు కేవలము హిందువుల ధర్మగ్రంథమగు (వేద) విద్య మాత్రమే వర్తమాన విజ్ఞానముతో సరిపడుచున్నది ఇది సత్యమైన విషయమే. ముఖ్యముగా సృష్ట్యుత్పత్తి విషయములో మతమతాంతరముల గ్రంథములపై నాలోచించుచు శ్రీజైకోలియట్ మహదాశ్చర్యముతో ఇట్లు వ్రాసినాడు బాయిబిల్ యొక్క *'Genesis'* పేరుగల పుస్తకములో సృష్ట్యుత్పత్తి వర్ణన గలదు అది విజ్ఞానము, మరియు తత్త్వజ్ఞానము నకు విరుద్ధము నున్నదని, నిష్పక్షపాత భావముతో నాలోచించు ఆలోచనాపరులెల్లరును ఈ విషయమును నంగీకరించి యున్నారు *Genesis* యొక్క మొదటి యధ్యాయము ననుసరించి ఈశ్వరుడు 'ప్రకాశము గాక' యనగానే ప్రకాశమైపోయినది

'God said, let there be light and there was light.' -Genesis 1.3

ఈ అధ్యాయము ననుసరించి ఆరుదినములలో పరమేశ్వరుడు సృష్టిని ఉత్పన్న మొనర్చినాడు మరియు రెండవ అధ్యాయము ననుసరించి ఆయన ఏడవదినము విశ్రాంతిగొనినాడు బైబిలు నందిట్లు వ్రాయబడియున్నది

And on the seventh day god ended his work which he had made; and he rested on the seventh day from all his work which he had made. -Genesis. 2.2.

అనగా; ఏడవదినము పరమేశ్వరుడు తనకార్యమును సమాప్తమొనర్చి ఆదినమున అన్నికార్యములనుండి విశ్రాంతి పొందినాడు. అతరువాత కూడ సృష్టికర్తయగు ఈశ్వరుని విషయమున గల వర్ణన అంతయును ఒక సామాన్య మానవుని కార్యమువలెనే యున్నది. దానిని ఆంగ్లమునయందు *Anthropomorphic conception of God* అని అందురు.

*Genesis* యొక్క మూడవఅధ్యాయమందు;

'Adam and Eve heard the voice of the Lord God walking in the garden in the cool of the day and they hid themselves from the presence of the Lord God amongst the trees of the garden.' Genesis 3-8

అనగా; ఆదమ్ మరియు హవ్వా పగలు తోటయందు దిరుగుచు ఈశ్వరుని ధ్వనిని వినినారు. మరియు వారు ఆ యీశ్వరుని ఉనికిగల తోటయందలి వృక్షముల వెనుక దాగినారు '*Genesis*' యొక్క ఆరవ అధ్యాయములో పరమేశ్వరుని మానవసృష్టిపై పశ్చాత్తాపము యొక్క వర్ణనగలదు.

And it repented the Lord that he had made man on the earth and it grieved him at his heart. And the Lord said, I will destroy man whom I have created from the face of the earth for it repented me that I have made him ! - Genesis 6.6-7

అనగా, మానవులను భూమిపై నిర్మించినందులకు ఈశ్వరునకు పశ్చాత్తాపము గలిగినది ఆయన హృదయము దుఃఖపూరితమైనది అప్పుడీశ్వరుడు 'నేను మనుష్యులను నష్టపరచెదను. ఎందుకనగా, నేను వారిని జేసినందుకు నాకు పశ్చాత్తాపము కలిగిన' దని యనినాడు

*Genesis* యొక్క ౧౧వ పరిచ్ఛేదమున పరమేశ్వరుని విషయమున నిట్లు వర్ణింపబడి యున్నది.

Lord came down to see the city and the tower, and the Lord-said 'behold' the people is one and they have all one language and this they have begun to do and now, nothing will be restrained from them, which they have imagined to do.

Go to let us go down and there confound their language that they may not understand one another's speech.

So the Lord scattered them abroad and they left off to build the

- city. Genesis chapter 11.5.8.

అనగా, లోకులు కలిసి అచ్చటివరకు చేరుటకు నిర్మించుచున్న పట్టణము, మరియు గోపురములను చూచుటకు ఈశ్వరుడు వచ్చినాడు. అప్పుడీశ్వరు డిట్లనినాడు. చూడుము. లోకులెల్లరును ఇప్పుడొకే భావముతో

కలిసియున్నారు. మరియు వారి భాష ఒక్కటియేయున్నది. వారిప్పుడీ గోపురమును నిర్మించుట ప్రారంభించినారు. వారి నిప్పు డెవ్వరును ఈకార్యము నుండి ఆపజాలరు. ఇక ఇప్పుడు మేము వెళ్ళి వారి భాషయందు గంద్రగోళము (తారుమారు) ను (ఒకరిభాషను మరొకరెరుగకుండునట్లు) జేసివేయ వలెను అప్పుడాయన అట్లే చేసివేసినాడు. మరియు వారిని చెల్లాచెదరు చేసినాడు. ఇందువల్ల వారా నగరమును, గోపురములను నిర్మించుట వదలి వేసినారు.

ఇదేవిధముగా ఈశ్వరుడు జేకబ్ తో కుష్తీ (మల్లయుద్ధము) ఒనర్చుట, అబ్రాహామ్ గృహమందు దూడ మాంసమును దినుట మున్నగు వర్ణనలు బైబిలునందు వచ్చినవి. వానిని గ్రంథ విస్తరణ భయముతో ఇచ్చుటపేర్కొనుట అనావశ్యకమనిపించినది.

ఈ యీశ్వరుని మనుష్యులవంటి కల్పనలు, *Anthropomorphism* తో విజ్ఞానవేత్తలు, మరియు ఆలోచనాపరు లెప్పుడును సదభిప్రాయమును దెలుపజాలరు. కావుననే *D C.SMiddle man FR.S.I E* గారీ విషయమునందిట్లు వ్రాసినారు

'Such anthropomorphism is childish'

అనగా, ఈవిధమగు ఈశ్వరుని మనుష్యుని వంటి కల్పనలు పిల్లల (బాలుర) వంటి మూర్ఖత్వముతో నిండియున్నవి ఈ ప్రశ్నకు సమాధానమున

ఇచ్చుట చెప్పనే *See "Religin of Scientists editred by Drawbridge M.A. published by Christian Evidence Society, London Do you think that science negatives the idea of a personal God?*

ప్రొ *J B Kohn F R S. D Sc, LL D., F C S* అను పేరుగల సుప్రసిద్ధ వైజ్ఞానికుడిట్లు వ్రాసినాను.

*'I hink it does, assuming the personal God to have human attributes'*

అనగా, ఈ యీశ్వర సంబంధ మగు ఆలోచనలు ఆయన మానవీయ ఆకృతి, మరియు అట్టి గుణములే గలవాడు మానవీయ వైజ్ఞానికాలోచనలు లేనివాడని నేనెంచుచున్నాను.

ఈవిషయమునే ప్రొ *C.C For F R S., D Sc., Professor of Physics, Canter bury college, University of Newzealand* ఈశబ్దములందే పై ప్రశ్నలకు సమాధానముగ ఇట్లు వ్రాసినారు

'The idea of a personal God as taught by Jesus Christ would seem to be very different from the conception of scientific men. I see no realisation of the stupendous magnificence which must be ascribed to the power behind the universe in Jesus's teaching and the teaching of the Church to-day.'

- The Religion of Scientists, edited by Drawbridge, M.A p.85.

ఈశ్వర స్వరూపముగా చూపబడుచున్న ఈసామసీహ వైజ్ఞానికుల ఆలోచనా దృష్టియందు చాల భిన్నముగానే యుండును. ఈసా మసీహ మరియు ఈకాలపు గిర్జా (చర్చి) గృహముల బోధనలందు నాకు ఆ జగత్సంచాలకుని, సర్వశక్తిమంతుని అద్భుతమహత్త్వమునకు సాక్షి లభించదు. ఇత్యాదులు.

సృష్ట్యుత్పత్తి సంబంధములో వైజ్ఞానికులకు, మరియు ఇతర ఆలోచనాపరులగు సజ్జనులకు అన్నిటికన్న ఆపత్కార విషయమేమనగా; బైబిలుననుసరించి అభావము, లేక అసత్యము నుండి భావము ఏర్పడిన దను విషయము. కాని వైదికధర్మానుసారము సృష్టి అభావముచే నేర్పడదు దాని ఉపాదాన కారణము (*Material cause*) నిత్య ప్రకృతి (*Matter*) యైయున్నది. పరమేశ్వరుడు కుమ్మరి, లోహకారుడు (కమ్మరి) లేక కమసాలి మున్నగు వారి వలె నిమిత్తకారాణ (*Efficient cause*) మై యున్నాడు దీనిగురించి విజ్ఞానము (*Science*) లేక తత్త్వజ్ఞానము (*Philosophy*) దృష్టియందు వాస్తవముగా ఏబాధయును లేదు. కాని ఈప్రకరణమునందు అత్యధిక ఆక్షేపణ విషయమేమనగా *Genesis* యొక్క మొదటి అధ్యాయమునందు స్పష్టముగా వ్రాసియున్నట్లు కేవలము ఆరుదినములందే సృష్ట్యుత్పత్తి విశ్వసించబడినది. మరియు మొదటి దినమందే పగలు రాత్రుల విభాగము చూపబడి యున్నది. ఇది అసంబద్ధముగానే తోచుచున్నది గదా!

4. God saw the light, that it was good and god divided the light from the darkness.

5. And called the light day and darkness He called night. And the evening and the morning were the first day.

*Genesis* నందు ఈ మొదటి అధ్యాయమునందే సూర్యచంద్రుల ఉత్పత్తి నాలుగవదిన మని చూపబడినది.

6. And God made two great lights; the greater light to rule the day and the lesser light to rule the night; he made the stars also.

7. And God set them in the firmament of the heaven to give light upon the earth.

8. And to rule over the day and over the night and to divide the light from the darkness, and God saw that it was good.

9. And the evening and the morning were the fourth day.

ప్రకాశము మరియు అంధకారము, లేక దివా రాత్రముల విభాగము ముందుగానే ఏర్పడి సూర్యచంద్రులు తరువాత ఏర్పరచబడినారను విషయము సామాన్యబుద్ధికే విరుద్ధముగా నున్నదని ప్రత్యేకముగా వ్రాయ నవసరము లేదనుకొందును.

ఇంతేగాక, బైబిలు నందు భూమి గుండ్రముగా నుండక బల్లపరుపుగా నుండుట, కుమారి (అవివాహిత) యగు మరియమ్మ నుండి ఈసామసీహ జన్మించుట, ఈసా జలములను సారాయిగా మార్చివేయుట, నాలుగురొట్టెలతో నాల్గువేలమనుష్యుల పొట్టలు నింపివేయుట, ఈసామసీహ లైజరస్ ను నాలుగు దినముల వరకు సమాధియందు పడియుండిన పిదప లేపుట. ఈసా మూడవదినము సమాధి (గోరి) నుండి లేచివచ్చుట (*Resurrection*) మున్నగు విషయము లనేకములు బుద్ధి మరియు సృష్టినియమ విరుద్ధమగునవెన్నియో నిండియున్నవి గైలీలియో అను స్పేన్ దేశపు వైజ్ఞానికుడు పృథివి గుండ్రముగా నున్నది, మరియు నిది సూర్యునికి నలుదిశల దిరుగుచుండును అని ప్రచారమొనర్చి నందున ఆయనను *Inquisition court* న్యాయస్థానమునకు దీసికొని రాబడినది. ఆయన నిర్ణయమిది-

*The first proposition that the sun is the centre and does not revolve about the earth is foolish, absurd, false in theology and heretical because expressly contrary to the Holy scriptures.*

And the second proposition that the earth is not the centre but revolves about the sun is absurd, false in philosophy and from a theologieal point of view at least opposed to the true faith.

అనగా; సూర్యగోళము కేంద్రముగా నున్నది. అది పృథివికి నలువైపుల దిరుగ నను కథనము ప్రకారమది మూర్ఖత్వపూర్ణము, ధార్మిక సిద్ధాంత విద్యాదృష్టితో అసత్యము, అసంగతము, ధర్మ విరుద్ధమై యున్నది ఏలన, ఇది స్పష్టముగా మన ధర్మగ్రంథములకు విరుద్ధమైయున్నది

రెండవ ఆలోచన మేమన; పృథివి కేంద్రముగాదు. ఐనను అది సూర్యునకు నలు వైపుల ప్రదక్షిణ మొనర్చుచుండును. ఇది అసంగతము, ఫిలాసఫీ (వేదాంత) దృష్టికోణముతో అసత్యము కనీసము ధర్మసిద్ధాంతదృష్టితో సత్యధర్మమునకు విరుద్ధమైయున్నది.

ఈకారణముననే వైజ్ఞానిక సిద్ధాంతము ననుసరించి పృథివి గుండ్రముగా నున్నదని చెప్పునట్టి గైలీలియో పై గొప్ప గొప్ప అత్యాచారము లొనర్చబడినవి. ఆతనికి పది సంవత్సరములు కఠిన శిక్ష ఈయబడినది దీని పరిణామస్వరూపముగ కారాగారమునందే యాతని మృత్యువుజరిగినది 'బ్రూనో' అనుపేరుగల మరొక వైజ్ఞానికునకు విరుద్ధముగ నిట్టి అభియోగమే మోపబడినది. ఏలన ఆయన పృథివి గుండ్రముగా నున్నదని చూపుట, మరియు అనేక లోకలోకాంతరములు గలవని నిరూపించుచుండెను ఆయన ౧౬౦౦ ఫిబ్రవరి ౧౬ న జీవించియుండగానే మరగుచున్న తైలమును చిమ్ముచు కాల్చివేయబడెను. దీనిపై నాతడు చిరునగవుతో ఇట్లనియుండెను.

*It is with greater fear that you pass sentence upon me rather than I receive it.*

See History of the conflict between Religion and Science P.160.

By William Draper, M.A., LL.D.

అనగా; నాకు మృత్యుదండన మిచ్చునప్పుడు నాకంటెను మీకే అధికముగ భయ ముండియుండును (ఏమన; ఒకనిరపరాధికి ఇంతటి కఠోరదండన మిచ్చునపుడు భావిసంతతి యొక్క ఆలోచనాపరులు మిమ్మేమందురో యని.) ఇట్టివే ఇతరవైజ్ఞానికులపై మరియు హిపేశియా, నేస్టర్, ఏరియస్, మున్నగు దార్శనికులపై ఈసాయి సిద్ధాంతములకు కొద్దిపాటి విభేదము గల ప్రకటనపై జరుపబడిన అత్యాచారముల వర్ణనను పాఠకులు *History of the conflict between Religion and Science* అను పేరుగల పుస్తకమునుండి చదువుకొని వచ్చును. ఈసాయి విజ్ఞానమునకు విరుద్ధమగు ముఖ్యముఖ్య విషయములపై బర్మింఘుం యొక్క బిషప్ డా బార్న్స్ (*Dr Barnes, Bishop of Birmingham*) అనునాతడు '*Religion of science* విషయమును నొసగిన *Broadcast address, The Religion and Science' a symposium* యొక్క ౫౭ పుటలపై ముద్రింపబడి

యున్నది. దాని యుదాహరణమిచ్చి మేము ముందుకు సాగుదుము. ఈయుద్ధరణ మెంతటి మహత్వపూర్ణము, ఆలోచనోత్తేజక మైనదో దీనిని పాఠకులే స్వయముగ దెలిసికొనగలరు. బిషప్ మహోదయులిట్లు వ్రాసినారు.

*Now before I speak of such possibility of conflict, I wish to make it quite clear that many beliefs associated with religious faith in the past must be abandoned. They have had to meet the direct challenge of Science and I believe it is true to say that in every such direct battle since the Renaissance, science has been the victor. Let me give definite instances.-*

1. First, the earth is not the fixed centre of the universe; it is merely the moving satellite of a sun which resembles innumerable other suns.

2. Secondly, man was not specially created.

3. Thirdly, no priest by ritual or formula can attain spiritual properties to inanimate matter.

4. Fourthly, if by miracles, we mean large scale breaches in the uniformity of nature, such miracles do not occur in human experience. Here are four typical results of scientific investigation which at length all must aceept.'

The Religion and science, a symposium, London, p.57.

ధర్మము మరియు విజ్ఞానములందు సంఘర్షణము సంభవమే యని చెప్పుటకు పూర్వము భూతకాలము నందలి ధార్మిక విశ్వాసముల సంబంధమునందలి అనేక మంతవ్యములను అవశ్యముగా వదలివేయవలసియే యుండు నని స్పష్టపరచవలసి యుండును విజ్ఞాన మనునది వానిపై బాహాటముగా సవాలు (*challenge*) విసిరినది ఇట్టి ప్రతి సంఘర్షణ మందును విజ్ఞానమే విజయవంతమైనదని నావిశ్వాసమేగాదు సత్యముకూడ. ఈవిషయమున నాలుగు **ఉదాహరణములను చూడుడు.**

౧. పృథివి విశ్వమునకు ధ్రువకేంద్రముగాదు అనేక సూర్యులలో ఒక సూర్యునకు నలువైపుల భ్రమణమొనర్చు ఒక గోళము

౨. విశేషరూపమున మనుష్యుని రచనయేయైన ఈ కథనము యథార్థముగాదు.

3. ఏపురోహితుడును ఎట్టి విధులు, క్రియాకలాపములు, లేక సూత్రముల ద్వారా నైనను ప్రకృతియందు ఆధ్యాత్మిక గుణములను ప్రవేశపెట్టజాలడు

౪. ప్రకృతియొక్క ఏకరూపత్వమునందు అధికమాత్రలో విభేదము గలుగును, లేక ప్రాకృతిక నియమములందు ఉల్లంఘనము జరుగగలదనుట చమత్కారము (అద్భుతము)ల తాత్పర్య మగుచో అట్టి చమత్కారములు మానవీయ అనుభవములందు జరుగవు. వైజ్ఞానిక అనుసంధానములకు ఈనాలుగు స్పష్టపరిణామములు. చివరకు వీనిని ప్రతివారును అవశ్యముగా అంగీకరించవలసియే యుండును.

వీనియందు సెంట్‌పాల్ యొక్క, ఆర్చిబిషప్ డా.మైన్సల్ మరియు డా మైజ్లె మున్నగు వారు నిమ్న శబ్దములద్వారా అనివార్యమని యెంచిన, అనగా; వీనిప్రకాశము నందు ఈసాయీ మత సంబంధ అనేక మంతవ్యములను మరియు బాయిబిల్ నందు వర్ణించబడిన చమత్కారములందలి విశ్వాసములను పరిత్యజించవలసియేయుండును.

డా మైన్సీల్ *(Dr Mansel)* అనునాతడు చమత్కారములకు ఈసాయీమతముతో గల సంబంధమును గూర్చి ఇట్లువ్రాసినాడు.

'If miracles are denied, all Christianity, so far as it has any title to that name, so far as it has any special relation to Christ is over -thrown.' -Aids to Faith, p.3.

అనగా; ఈసామసీహతో విశేషసంబంధ మున్నంతవరకు చమత్కారములతో నిరాకరణము అవలంభించినచో మొత్తము క్రైస్తవమతమే సమాప్తమైపోవును కావున వాని జోలికి పోరాదు. - డా.మైజ్లే *(Dr Mazley)* ఈసంబంధమున ఇట్లు వ్రాసినాడు.

'Miracles and the supernatural contents of Christianity must stand and fall together.... Christianity cannot be maintained as a revelation undiscoverable by reason a revelation of a supernatural scheme for man's salvation without the evidence of miracles.'

- Bampton Lectures, P.180

అనగా; చమత్కారిత, ఈసాయిత్వమునకు అభౌతిక విశ్వాసమైయున్నది. ఈరెండును కలిసి యుండగలవు, లేక పతనము చెందగలవు. ఈసాయిత్వమును బుద్ధిద్వారా అగమ్య ఈశ్వరీయ జ్ఞానరూపమున, లేక మానవుని ముక్తికొరకు ఒక అభౌతిక ఈశ్వరీయ జ్ఞానరూపమున చమత్కారముల సాక్షిత్వము లేకుండా విశ్వసింపబడజాలదు. వేదములందు ప్రకృతినియమములు, లేక విజ్ఞానమునకు విరుద్ధమగు విషయములు లేవు పరమేశ్వరుని అనేక స్థానములందు 'సత్యధర్మా' అనుపేర స్మరణమొనర్చబడి యున్నది. వాని ధర్మము, మరియు నియమము సత్యము, మరియు అచలమైనదనియే దాని యర్థము.

కవిమగ్నిముపస్తుహి సత్యధర్మాణమధ్వరే దేవమమీవచాతనమ్ ॥ ఋ.౧-౧౨-౭॥

మా నో హింసీజ్జనితా యః పృథివ్యా, యో వా దివం సత్యధర్మా జజాన ॥ ఋ౧౦-౧౨౧-౧౦ ॥

అదబ్ధాని వరుణస్య వ్రతాని ॥ ఋ. ౧-౨౪-౧౦ ॥

అస్తభ్నాద్ ద్యాం వృషభో అన్తరిక్షమ్ అమిమీత వరిమాణం పృథివ్యాః।

ఆసీదద్విశ్వా భువనాని సమ్రాడ్ నివేత్ తాని వరుణస్య వ్రతాని ॥ యజు ౪. ౩౦॥

మున్నగు మంత్రములందు 'ఆ సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు నగు పరమేశ్వరుని స్తుతియొనర్చుడు; ఆయనయే తన అనంత శక్తిచే లోకలోకాంతరములను ప్రకృతిద్వారా నిర్మించినాడు. ఆతని

వ్రతములు, లేక నియమములు దృఢము, మరియు అచంచలమైనవి.' అని స్పష్టముగా చూపబడినది. వేదములందీ నియములనే 'ఋత' ముల పేరుతో పిలువబడినది. దాని యర్థము *Eternal laws* అని. విజ్ఞానము, వైదికధర్మము రెండు కలిసియేయున్నవి. మేము అనేక నిష్పక్షపాత పాశ్చాత్య విద్వాంసుల లేఖలను ఉదాహరించి సంక్షేపముగా దెలిపియుంటిమి. ధర్మమునకు వలెనే, విజ్ఞానమునకును వేదమే మూలము. 'వేద' మనగా 'జ్ఞాన' మనియే అర్థము. వానియందు మానవ మాత్రుల సర్వవిధ కల్యాణార్థము ఆవశ్యకమగు భౌతిక, మరియు ఆధ్యాత్మిక సంబంధమగు సకల విధమగు జ్ఞానము సంపూర్ణముగా నున్నది. విమానవిద్య, జ్యోతిష్యము, కళాశాస్త్రము, చికిత్సాశాస్త్రము, విద్యుచ్ఛాస్త్రము మున్నగు విద్యలన్నియును మూలతత్త్వములతో గూడ వేదములందు విద్యమానమై యున్నవి. వేలాది ఉదాహరణములద్వారా ఈవిషయమును నిరూపించవచ్చును

## 2.25 వేదములందు వివిధ విద్యల మూలనిర్దేశము.

విమానవిద్య:-

వేదములు మహత్త్వదృష్టితో అత్యావశ్యకమగు కారణమున ఈవిషయముపై సంక్షేపముగా కొంత ప్రకాశపరచుట ఉచిత మనిపించుచున్నది ప్రప్రథమముగా మేము విమాన విద్యను దీసికొనుచున్నాము. విమానవిద్యపై ప్రాచీన గ్రంథములు లభించినంతవరకు మహర్షి భరద్వాజకృత **'యన్త్రసర్వస్వ'** మనుపేరుగల గ్రంథము విశేషరూపమున వర్ణించదగినదై యున్నది. దీని వైమానిక ప్రకరణము యొక్క కొంత భాగము 'బోధానందవృత్తి' సహితముగా ప్రాప్తించినది దానియందు ౧౦నుండి౧౩వ శ్లోకములలో స్పష్టముగా చెప్పబడియున్నది.

**నిర్మథ్య తద్వేదామ్బుధిం, భారద్వాజో మహామునిః ।**
**నవనీతం సముద్ధృత్య స యన్త్రసర్వస్వరూపకమ్ ॥ ౧౦ ॥**
**ప్రాయచ్ఛత్ సర్వలోకానామ్, ఈప్సితార్థ ఫలప్రదమ్ ।**
**తస్మిన్ చత్వారింశతికాధికారే. సమ్ప్రదర్శితమ్ ॥౧౧॥**
**నానావిమానవైచిత్ర్యరచనాక్రమబోధకమ్।**
**అష్టాధ్యాయైర్విభాజితం, శతాధికరణైర్యుతమ్ ॥౧౨॥**
**సూత్రైః పఞ్చశతైర్యుక్తం, వ్యోమయానప్రధానకమ్ ।**
**వైమానికాధికరణమ్, ఉక్తం భగవతా స్ఫుటమ్ ॥౧౩॥**

అనగా, మహర్షి భరద్వాజులు వేదరూప సముద్రమును మంథనమొనర్చి సర్వమానవుల అభీష్టదాయకమగు 'యన్త్రసర్వస్వ' మను గ్రంథరూప నవనీతమును దీసియిచ్చినాడు ౪౦అధికారములతో గూడిన యా 'యన్త్రసర్వస్వ' మను గ్రంథరాజము వేర్వేరు విమానముల విచిత్రత, మరియు రచనా క్రమమును బోధించున ట్టి ఎనిమిది అధ్యాయములలో విభాజితమై యున్నది. ౧౦౦ అధికరణములతో, ౫౦౦ సూత్రములతో ఆకాశయానము విమాన ప్రధానరూపముగ అందువర్ణింపబడినది. ఇట్టి వైమానిక అధికరణమును భరద్వాజమహర్షి ప్రదర్శితమొనర్చినాడు. మరియు మానవుల కొరకు వేదములందు స్పష్టముగా ఇల్లాదేశించబడినది.

**సముద్రం గచ్ఛ స్వాహాఽన్తరిక్షం గచ్ఛ స్వాహా ॥ య. ౬౨౧ ॥**

అనగా, నీవు యానముల ద్వారా సుఖపూర్వకముగా సముద్రయాత్ర నొనర్పుము మరియు అంతరిక్షయాత్ర నొనర్పుము. అంతరిక్షయాత్రకొరకు మనోవేగము గల విమాన రథమును గూర్చి అనేక మంత్రములందు స్పష్టముగా వర్ణనగలదు. ఉదాహరణార్థము ఋగ్వేదములో

**ఆ వాం రథం పురుమాయం మనోజవం జీరాశ్వం యజ్ఞియం జీవసే హువే।**

**సహస్రకేతుం వనినం శతద్వసుం శ్రుష్టీవానం వరివోధామభిప్రయః॥ ఋ ౧-౧౧౯-౧॥**

ఇచ్చట రథము యొక్క విశేషణములందు పుర-మాయమ్, మనోజవమ్, శ్రుష్టీవానమ్, వరివోధామ్ ఇవివిశేషరూపములో చూడదగినవి. వీనితాత్పర్యమేమన; పురుమాయమ్, -గొప్పబుద్ధితో సంపాదిత, మాయేతిప్రజ్ఞానామనిధం. 3-౯ పుర్వ్యామాయయా - ప్రజ్ఞాయా సంపాదితం ( మనోజవమ్) మనోవత్ వేగవత్ - మనస్సువలె వేగవంతముగు ( వరివోధామ్) సుఖసేవన మొనర్పజేయునదగు. నీ విశేషణములు సాధారణ యానములపై చరితార్థము గాజాలవు కాని విమానాదులపైననే చక్కగా వర్తించుచున్నవి కావుననే మహర్షి దయానందులు ఇచ్చట రథమునకర్థము 'విమానాదియానమ్' అని చేసియున్నారు. ఇది విశేషణ మరియు ప్రకరణాదుల ననుసరించి సంపూర్ణ ఉచితముగనే యున్నది. ఋగ్వేదము యొక్క 3-౫౮-౮-

**రథో హవ్యమృతజా అద్రిజాతః పరిద్యావాపృథివీ యాతి సద్యః॥**

ఈమంత్రమునందు గల శిల్ప సంపాదిత రథము యొక్క వర్ణన విషయమునం దిట్లు ఉపదేశించబడినది అది అత్యంత వేగముగ ఆకాశము, మరియు పృథివి యాత్రనొనర్చగలదు. దానిలో అశ్వినౌ అనగా, సభాధీశుడు రాష్ట్రపతి, మరియు సేనాపతులు యాత్ర నొనర్చగలరు. దీనిభావార్థములో ఋషి దయానందులు చక్కగా వ్రాసినారు

**యే విమానాది యానానాస్యన్యాదిభిర్నిర్మిమతే తేఽభీష్టాని సుఖాని ప్రాప్య**

**యత్రేచ్ఛా తత్ర సద్యో గన్తుం శక్నువన్తి।**

అనగా, అగ్ని, విద్యుత్తు మున్నగువానిని ఉచిత ప్రయోగముచే విమానము మున్నగు యానములను నిర్మాణమొనర్చువారు కోరిన సుఖములతో గూడ కోరిన స్థలములకు అతిశీఘ్రముగా చేరగలుగుదురు దీనినే ఋగ్వేద ౨-౪--3 వ మంత్రమునందు

**సోమా పూషణా రజసో విమానం సప్తచక్రం రథమవిశ్వమిన్వమ్।**

**విషూవృతం మనసా యుజ్యమానం తం జిన్వథో వృషణా పఞ్చరశ్మిమ్ ।॥౨-౪౦-3॥**

ఈమంత్రమునందును విమానమును గురించి స్పష్టముగనే వర్ణించబడియున్నది మనసా యుజ్యమానమ్,సప్తచక్రమ్, విషూవృతమ్, మున్నగు విశేషణముల ద్వారా వర్ణించబడినది. వీని యర్థము క్రమముగా మనసా- అంతఃకరణేన విచారేణ మనస్సు లేక మనన- విచారపూర్వక నిర్మిత సప్తచక్ర యుక్తముగా

దూరదూరముల వరకు వ్యాపక గమనము గల వీ(ప్రకారముగ నుండెను. విమాన శబ్దమునకర్థము 'వియతిగమకమ్' ఆకాశమున గొనిపోవునవి అనియగును. కావుననే మహర్షి దయానందు లీమంత్రము యొక్క భావర్థము చక్కగా నిచ్చియున్నారు.

**మనుష్యైరన్తరిక్షే గమయితారం సప్తకలా యన్త్రభ్రామణనిమిత్తం సద్యోగభయితారం రథం కృత్వా సుఖమాప్తవ్యమ్॥**

అనగా; మానవులు అంతరిక్షమునకు గొనిపోవు, ఏడుకళాయంత్రములను (త్రిప్పునట్టి, శీఘ్రముగా పయనించు రథమును నిర్మించికొని సుఖప్రాప్తినొందవలెను.

ఇట్టివర్ణనలే ఇతర అనేక మంత్రములందును గలవు, వీనివల్ల వేదములందు విమానవిద్య యొక్క మూలము గలదని సందేహము లేకుండ సిద్ధియగుచున్నది. మహర్షి భరద్వాజులు 'యన్త్రసర్వస్వము' యొక్క వైమానిక ప్రకరణమును, మరియు భోజమహారాజు 'సమరాంగణసూత్రధార' యను గ్రంథమును ఈవేదమంత్రముల ఆధారముననే వ్రాసియున్నారు. వీనియందనేకములను అర్థసహితముగా మహర్షిదయానందులు 'ఋగ్వేదాదిభాష్యభూమిక' యందలి 'నౌ విమానాది విద్యావిషయ' ము నందు చేసి యున్నారు. జిజ్ఞాసువులు అవశ్యముగా చూడవలెను. యూరోపునందు విమానావిష్కారమునకు అనేక సంవత్సరములకు పూర్వమే మహర్షి దయానందులు 'ఋగ్వేదాది భాష్యభూమిక', మరియు వేద భాష్యమునందు విమానాదుల వర్ణనము వేదముల యాధారముపైననే యొనర్చియున్నారు. అథర్వ 3-15-2 యొక్క

**యే పన్థానో బహవో దేవయానా అన్తరా ద్యావాపృథివీ సంచరన్తి ।**

**తే మా జుషన్తాం పయసా ఘృతేన యథా క్రీత్వా ధనమాహరాణి ॥**

ఈమంత్రమునందు పృథివీ ఆకాశముల మధ్య దేవతలు అనగా విద్వాంసులు పయనించదగిన మార్గము యొక్క నిర్దేశము గలదు. ఆవిషయమునందు వైశ్యముఖముగా నిట్లు వ్రాయబడియున్నది. పృథివీ ఆకాశములందు మధ్యవర్తి మార్గముల ద్వారా యాత్రయొనర్చి నేను అధికధనమును సంపాదింతును. ఇది విమానము ద్వారా ఆకాశయాత్ర నిర్దేశపరకమైయున్నది. ఇం దణుమాత్రమైనను సందేహకారణము గానరాదు.

అనేక విధములగు అనశ్వ, విద్యుత్తు మున్నగు వానిచే నడచునట్టి రథములను గూర్చియును స్పష్టముగా వర్ణనగలదు.

**అనశ్వో జాతో అనభీశురుక్థ్యో రథస్త్రిచక్రః పరివర్తతే రజః ॥** ఋ. 4-36-1॥

ఋభువుల అనగా వైజ్ఞానిక శిల్పుల ద్వారా నిర్మించబడిన ఈరథమునందు ( తక్షన్న సత్యాభ్యాం సుఖం, రథం- ఋ-1-20-3) అనశ్వః=అశ్వములు లేవు. అనభీశుః =కళ్లెములు, జీనులు లేవు. ఐనను ఇది జలము, స్థలము, ఆకాశము మూడింటియందును తిరుగగలదు. మరియు క్షేత్రపరివర్తన మొనర్చగలదు. కోరుకొనునట్లు ఆకాశము, జలము, భూమిపైనను సంచరించగలదు. మాకు దెలిసినంత వరకు ఇంతటి అద్భుతముగు యానము ఇంతవరకును ఆవిష్కరింపబడలేదు. అనగా, నిర్మింపబడలేదు.

ఋగ్వేదము యొక్క 3-54-13 వ మంత్రమునందు మరుత్తుల విశేషణము 'విద్యుద్ రథాః' అని ఈయబడినది. దీని యర్థము విద్యుత్తుచే నడచునట్టి రథములతో గూడిన సైనికాదు లగును.

**సముద్రపు అలలపై కారును నడుపుట**

పరి ప్రాసిష్యదత్ కవిః సిన్ధోరూర్మావధి శ్రితః। కారం బిభ్రత్ పురుస్పృహమ్ ॥ ఋ. ౯౧౪-౧ ॥

సముద్రపు అలలపై నుండునట్టి క్రాన్తదర్శీ, జ్ఞానీ, శీలివి అత్యంత రమణీయమగు 'కారు' ను సముద్రపు అలలపై అన్ని దిశలకును నడుపును ఆంగ్లమున గల కారు '*car*' అను శబ్దము వైదికమై యున్నది.

## 2.26 వేదములందు జ్యోతిషశాస్త్రము యొక్కమూలము:-

వేదములందు సమస్త విద్యలతోబాటు జ్యోతిష్యమునకును మూలము గలదు. దీనికొరకు అధిక ప్రమాణముల అవసరములేదు, ఏలన, జ్యోతిష్యము వేదములకొక అంగమే య్యై యున్నది. దీనినెల్లరును నమ్మెదురు. సూర్యసిద్ధాన్త-౧-౩ములో ఇట్లుగలదు

వేదాఙ్గమగ్ర్యమఖిలం జ్యోతిషాం గతికారణమ్

ఇచ్చట జ్యోతిష్యమన ఒకశ్రేష్ఠమగు వేదాంగమని చూపబడినది దీని ద్వారా నక్షత్రముల, సూర్యాదుల గతులను గూర్చిన జ్ఞానము గలుగును అథర్వవేదపు ౧౯-౭,౨,౨౫ నిమ్న మంత్రముల ద్వారా ౨౮ నక్షత్రముల పేర్లు దెలియుచున్నది.

సుహవమగ్నే కృత్తికా రోహిణీ చాస్తు భద్రం మృగశిరః శమార్ద్రా।
పునర్వసు సూనృతా చారు పుష్యో భానురాశ్లేషా అయనం మఘా మే।
పుణ్యం పూర్వా ఫల్గున్యౌ చాత్ర హస్తశ్చిత్రా శివాతే స్వాతి సుఖో మే అస్తు।
రాధే విశాఖ సుహవానురాధా జ్యేష్ఠా సునో క్షత్రమరిష్టమూలమ్।
అన్నం పూర్వా రాసతే మే అషాఢా ఊర్జం దేవ్యుత్తరా ఆవహన్తు।
అభిజిన్మే రాసతాం పుణ్యమేవ, శ్రవణః శ్రవిష్ఠాః కుర్వతాం సుపుష్టిమ్।
ఆ మే మహచ్ఛతభిషగ్ వరీయ ఆ మే దయా ప్రోష్ఠపదా సుశర్మ।
ఆ రేవతీ చాశ్వయుజౌ భగం మ ఆమే రయిం భరణ్య ఆవహన్తు ॥

ఈ౨౮ నక్షత్రముల స్వరూపము వేదము లందిట్లు చూపబడియున్నది.

చిత్రాణి సాకే దివి రోచనాని సరీసృపాణి భువనే జవాని ॥ అథర్వ. ౧౯-౭-౧॥

అనుగా: ద్యులోకమందు ప్రకాశించునట్టి చిత్రవిచిత్రములు మరియు పలువర్ణముల నక్షత్రములు పరిధి మండలమునందు సర్పణశీలమై ( పరుగు లాడుచు) యుండును. పరస్పరాకర్షణ బలముచే నవి కలిసియుండును

ద్వాదశ ప్రధయశ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత।
తస్మిన్త్సాకం త్రిశతా శఙ్కవో ఽర్పితాః షష్టిర్నచలాచలాసః ॥ ఋ. ౧-౧౬౪-౪॥

సుషుమ్ణః సూర్యరశ్మిశ్చన్ద్రమా గన్ధర్వాః ॥ య ౧౮-౪౦॥

**తథా అత్రాహ గోరమన్వత నామ త్వష్టురపీచ్యమ్ । ఇత్థా చన్ద్రమసో గృహే** ॥ ఋ ౧-౮౪-౧౫ ॥

మున్నగు మంత్రములందు సూర్యునిరశ్మి చేతనే చంద్రుడు ప్రకాశించునని తెలుపబడినది

**'యా గౌర్వర్తనిం పర్యేతి నిష్కృతం** ॥ ( ఋగ్ ౧౦-౬౫-౬ ) మున్నగు వానియందు భూమి గుండ్రముగా నుండుట, మరియు సూర్యునికి నలువైపుల భ్రమణము చేయుచుండుటను గూర్చి చక్కని నిర్దేశము గలదు ఈవిషయమును విస్తారముగ నెరుగదలచినవారు శ్రీ.పం. ప్రియరత్న జీ ఆర్ష కృత **'వైదిక జ్యోతిష శాస్త్ర'** మను గ్రంథమును అవశ్యముగా చదువవలయును ఇది లభ్యమగు చిరునామా, స్వా బ్రహ్మమునిజీ పరివ్రాజక్ వేదానుసంధాన సదనము జ్వాలాపుర, ఉత్తర్‌ప్రదేశ్ అని ఆ పుస్తకముపై నున్నది

## 2.27 వేదములం దాయుర్వేద మూలము

చికిత్సావిద్యయందు ముఖ్యగ్రంథమగు 'చరక' మునందు **'వేదో హ్యాథర్వణః చికిత్సాం'** ప్రాహ॥ చరక సూత్ర స్థానము అ.౩౦-౨౧ ॥ అనగా, అథర్వవేదమునందు ముఖ్యముగా చికిత్సయొక్క ప్రతిపాదన మొనర్చబడియున్నది సుశ్రుత సూత్రస్థానము అ ౧లో కూడా **'ఇహ ఖల్వాయుర్వేదో నామ యదుపాంగమథర్వ వేదస్య'** అనగా, ఆయుర్వేదము అథర్వవేదమున కుపాంగమైయున్నది అథర్వవేదమే గాక ఋగ్వేదమునందు ౧౦-౯౭, ౧౦-౧౬౧, ౧౦-౧౬౩, ౧౦-౧౮౬ ఇంకా ఇతర అనేక సూక్తములందును ఓషధుల ద్వారా చికిత్స, మనోశక్తుల ప్రయోగము ద్వారా చికిత్స, మరియు శుద్ధ వాయుసేవనము ద్వారా చికిత్సల ప్రతిపాదనము గలదు ఋగ్వేద౧-౨౩ యొక్క

**అప్సు మే సోమో అబ్రవీదన్తర్విశ్వాని భేషజా । అగ్నిం చ విశ్వశంభువమాపశ్చ విశ్వభేషజీః** ॥ మం ౨౦ మరియు ఋ.౧౦-౯ యొక్క

**ఆపో హిష్ఠా మయోభువ స్తా న ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే** ॥ మున్నగు వాని యందు జలము, మరియు అగ్ని ద్వారా అనేక వ్యాధుల యొక్క చికిత్సల ప్రతిపాదన మొనర్చబడియున్నది

అథర్వవేదము ౨-౨౫-౨లో **పృశ్నిపర్ణీ**, ౪-౧౭-౧౯, ౭-౬౫ లో **అపామార్గ**, ౧౯-౪౪లో **అఞ్జన** ౬-౫౯లో **అరున్ధతీ**, ౫-౪-౯, మరియు ౧౯-౩౯-౪లో **కుష్ఠ**, ౬-౨౧-౩,౬-౧౩౭-౧ మున్నగు వానియందు **కేశదృంహణీ**, లేక **కేశవర్ధనీ**, ౨-౨౭లో **పాటా**, ౬-౧౦౯లో **పిప్పలీ**, ౪-౧౨లో **రోహణీ**, ౫-౫లో **లాక్షా**, **౬** -౧౩౯లో **సహస్రపర్ణీ**, మరియు ఋగ్వేదము యొక్క తొమ్మిదవ మండలము యొక్క అనేక సూక్తములందు, మరియు సామవేదము, అథర్వవేదములందలి అనేకసూక్తములందును **సోమమూలిక**యను ఓషధిని గూర్చిన వర్ణన గలదు. ఈ యోషధుల సేవనము వల్ల జ్వరము, క్షయరోగము, నపుంసకత్వము, క్రిముల ద్వారా సంక్రమించు ఉపద్రవములు, మూత్రరోగములు, నేత్రరోగములు, కేశములు రాలిపోవుట మున్నగువానిని తొలగించవచ్చునని ఇట్లని మంత్రములందు స్పష్టముగా చెప్పబడియున్నది పాండువు ( భ్రమ) వల్ల అథర్వవేదమును వశీకరణము,

మంత్రతంత్రము, గారడీల వేదమని ఎంచబడుచున్నది కాని వాస్తవముగా అందు అద్భుతమగు ఓషధుల సేవనము, లేపనములు, మరియు ప్రాకృతిక ఉపాయముల ద్వారా చికిత్స సూచింపబడియున్నది. ఈవిషయమును ఈగ్రంథమునందు పదవ అధ్యాయములో అథర్వవేద విషయపు భ్రమను దొలగించుచు వలసినంత విస్తారముగ చూపబడినది. విస్తారమగు నను భయముచే ఇచ్చట నిర్దేశమాత్ర మొనర్చబడినది. దీనిని విస్తారముగా దెలిసికొనదలచినవారు శ్రీ పం. ప్రియరత్నజీ ఆర్ష (వర్తమాన స్వామీ బ్రహ్మమునీజీ పరివ్రాజక) కృత 'అథర్వవేదీయ చికిత్సాశాస్త్రము, సార్వదేశిక సభ ఢిల్లీ ద్వారా ప్రచురింపబడినది, మరియు వేదోంమే ఆయుర్వేద వైద్య పం. రామగోపాల్‌జీ శాస్త్రికృతము, శ్రీమదన్‌లాల్ ఆయుర్వేదిక్ అనుసంధాన ట్రస్ట్ ఢిల్లీ ద్వారా ప్రకాశితము.

ఈరెండు గ్రంథముల నవశ్యముగ చదువవలెను మొట్టమొదట కవిరాజ నివారణచంద్రజీ భట్టాచార్యగారు, కాంగ్డీ గురుకుల సాహిత్యపరిషత్తునందు 'వేదములందు ఆయుర్వేదము యొక్క క్రమ వికాస' విషయమున చిన్న వ్యాసమును ప్రకటించియుండిరి. కాని అదియిప్పుడు లభించుటలేదు.

## 2.28 వేదములందు భూగర్భ (Geology) విద్యామూలము

ఇతరవిద్యలవలె భూగర్భవిద్య యొక్క మూలము కూడ వేదములందు గలదు. ఈవిషయమును మహారాష్ట్ర సుప్రసిద్ధ విద్వాంసుడగు శ్రీభవానీరావు పాగవీ తన *The Vedic Fathers of Geology* యందు **'యః పృథివీం వ్యథమానామదృంహద్ యః పర్వతాన్ ప్రకుపితాం అరమ్ణాత్'** ॥ఋ.౨-౧౨-౨॥ **'స ప్రాచీనాపర్వతాన్ అదృంహదోజసాఽధరాచీనమకృణోదపామపః'** ॥ఋ౨-౧౭-౫॥ **'యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా'** ॥ ఋ. ౧౦-౧౨౧-౫॥ **'యా ఓషధీః పూర్వా జాతా దేవేభ్యస్త్రియుగం పురా'**॥ ఋ౧౦-౯౭-౧॥ మున్నగు మంత్రముల ఆధారముపై ప్రమాణయుక్తముగా జూపుచు ఇట్లు వ్రాసినారు.

I may take this opportunity to remind the reader, without fear of contradiction, that the Vedas contain many things not yet known to any body,as they form a mine of inexhaustible literary wealth, that has still remained un-explored. (the Vedic Fathers of Geology, by N.B. Pavgee Introduction, p.VI.)

అనగా; నే నేమాత్రము విరోధము, మరియు జంకులేకుండా పాఠకులకు జ్ఞాపకమొనర్చదలచిన దేమన, వేదములలో ఇంతవరకెవ్వరును దెలిసికొనలేకపోయిన విషయము లెన్నియో గలవు. ఏలన, అవి యా,సాహిత్య ధనమునకు అక్షయ మగు ఖని, అనగా నిధియై యున్నవి. దానినుండి ఇంతవరకు కొద్దిపాటి అంశము మాత్రమే ప్రకటిత (వెల్లడి) మైనది. విశేషాంశము ఇప్పటివరకును అజ్ఞాతముగానే యుండిపోయినది తన *Vedic India-Mother of Parliaments* అనుపేరుగల రెండవగ్రంథమునందును శ్రీనారాయణ భవానీరావు పాగవీగారు వేదములవిషయములో బాగుగానే వ్రాసియున్నారు

The Veda is the fountain-head of knowledge, the 'prime source of inspiration, nay the grand repository of divine wisdom and even eternal truths.'(Vedic India Mother of Parliaments, p.136.)

అనగా; వేదములు సంపూర్ణజ్ఞానమునకు ఆదిస్రోతము, ఈశ్వరీయ జ్ఞానమునకు ప్రధానాధారమై యున్నవి. ఇంతయేగాక అవి దివ్యమగు బుద్ధి, నిత్యసత్యమయ వాక్యములకు మహానిధులై యున్నవి.

## 2.19 వేదములందు జీవవిజ్ఞాన మూలము

జల వాయు గమన విమానవిద్య, జ్యోతిషశాస్త్రము, చికిత్సాశాస్త్రము, యంత్రశాస్త్రము, భూగర్భవిద్య, మున్నగు వానివలె జీవవిజ్ఞానము(*Biology*) యొక్క మూలముకూడా వేదములందు గాంచనగును ఈవిషయమును బొంబాయి నగర సుప్రసిద్ధ విద్వాంసుడగు డా వి జి రేలే *L M F S, F C P S* అనువాతడు *'The Vedic Gods-as figures of Biology'* అను సుప్రసిద్ధ గ్రంథమునందు చాల చక్కగా నిరూపించినాడు. ఆయన అత్యాశ్చర్యముతో ఈవిషయము నిట్లువ్రాసినాడు.

*'Our present anatomical knowledge of the nervous system tallies so accurately with the literal description of the world given in the RigVeda that a question arises in the mind whether the Vedas are really religious books or whether they are books on anatomy and physiology of the nervous system, without the thorough knowledge of which psychological deductions and philosophical speculations can not be correctly made'.*

*-The Vedic Gods by Dr.Rele, p.30*

అనగా; మనవర్తమానకాలపు నాడీమండల రచనకు సంబంధించిన జ్ఞానము ఋగ్వేదము నందలి జగద్విషయక వర్ణనమునకు, సంపూర్ణముగా సరిపోవుచున్నది. మనస్సునం దనేక సార్లు వాస్తవముగా వేదములు ధర్మగ్రంథములా? లేక అవి శారీరక విజ్ఞానము, మరియు నాడీ మండలము యొక్క రచనా విషయక గ్రంథములా? అను ప్రశ్న ఉదయించుచుండును. వీనియొక్క సంపూర్ణజ్ఞానము పొందనిదే మనోవైజ్ఞానిక, మరియు దార్శనిక ఆలోచనలు తగిన విధము( ఉన్నదిఉన్నట్లు) గా అర్థముగాజాలవు.

వాస్తవముగా ఇట్టి సందేహముల కెట్టి కారణము లేదు. వేదములు సమస్త సత్యవిద్యలకు నిధులు. బైబిలు మున్నగు వానివలె నవి సంకుచితార్థము *Religious Books,* లేక మతప్రతిపాదక గ్రంథములు గావు. అవి ధర్మప్రతిపాదకములేగాక ఆదిప్రవాహకములు కూడా. వేదములందు 'ఋతంచ సత్యంచ' ఋతము, సత్యములను పేర్లతో నున్నట్లు వానియందు ( ఆ ధర్మమునందు ) భౌతిక, మరియు నైతిక జగత్తునందు కార్య మొనర్చునట్టి అచల నియమములును గలవు. ఆనియమములతో గూడ ఆత్మ, పరమాత్మల సంబంధము. కర్మనియమములు, పునర్జన్మ మున్నగు విషయకసిద్ధాంతములతో వేదములందు ప్రతిపాదించబడినది. ఈవిశేషత్వము ఇతర ఏ గ్రంథము నందును గానరాదు.

**గ్రీవాభ్యస్త ఉష్ణిహాభ్యః కీకసాభ్యో అనూక్యాత్** ॥ ఋ. ౧-౧౬౩-౨॥

**అన్త్రేభ్యస్తే గుదాభ్యో వనిష్ఠోర్ హృదయాదధి ।**

**యక్ష్మం మతస్నాభ్యాం యక్నః ప్లాశిభ్యో వివృహామి తే** ॥ ఋ. ౧-౧౬౩-౩॥

మున్నగు మంత్రములందు శరీర విజ్ఞానము యొక్క మూలము గలదు. దీనిని కవిరాజ శ్రీగణనాథసేన్ **M.A.**. గారు 'ప్రత్యక్షశరీరకమ్, అను తన సుప్రసిద్ధ గ్రంథముయొక్క భూమికయందు మరియు శ్రీవ్రజేంద్రనాథసేన్ యందు *Positive sciences of the Hindus* యందు, మరి అతిచక్కగా నిర్దేశించినాడు. జిజ్ఞాసువు లీమూడు గ్రంథముల నవశ్యముగా చదువవలయును.

## 2.30 వేదములందు భౌతిక - రసాయనశాస్త్రముల మూలము

వేదములందు భౌతిక విజ్ఞానము మరియు రసాయన శాస్త్రముల అనేక సిద్ధాంతములు స్పష్టరూపములో చూడబడుచున్నవి

**'మిత్రం హువే పూతదక్షం వరుణం చ రిశాదసమ్, ధియం ఘృతాచీం సాధన్తా'** ॥ (ఋ.౧-౨-౭) ॥

ఈమంత్రమునందు 'మిత్ర' పదముచే *Hydrogen* (ఉదజని) మరియు 'వరుణ' శబ్దముచే స్వీకరించదగిన ఓషజనము (*Oxygen*) గ్రహించబడును. వీని కలయికవల్ల జలనిర్మాణము జరుగును.

'గూటీ' యను పట్టణపు శ్రీసన్యంనారాయణగౌడు *M A B S C* (ఎడిమ్బరా) గారు ౧౯౨౦ లో ప్రచురించిన *Introduction to the Message of the 20th Century* అనుపేరు గల పుస్తకము అత్యంత మహత్త్వపూర్ణమైనది. ౨౪౦పుటలుగల ఈపుస్తకమునందు 'వేదములందు భౌతికవిజ్ఞానము మరియు రసాయనశాస్త్రము యొక్క తత్త్వము స్పష్టముగా చూడనగు' నని అతిచక్కగా, సప్రమాణముగా నిరూపించినాడు. పుస్తకము యొక్క ముఖపత్రముపై తన పుస్తకమునకు పై దెలిపినట్టి విచిత్రనామము తో బాటు, విషయమును స్పష్టపరచుచు ఇట్లు వ్రాసినారు.

Containing a new method for the systematic interpretation of the Vedas and experimental data proving that the Vedas are treaties on the Exact Sciences.

అనగా, ఈపుస్తకమునందు వేదముల క్రమబద్ధ వ్యాఖ్యనుగూర్చి క్రొత్త ప్రణాళి చూపబడినది. మరియు వేదములు శుద్ధమగు వైజ్ఞానిక గ్రంథములను విషయమును నిరూపించబడినది. వైజ్ఞానిక దృష్టితో ఋగ్వేద, యజుర్వేదముల విషయములును నిరూపణమొనర్చుచు ఈయుత్తమయోగ్య లేఖకుడిట్లు వ్రాసినాడు.

The RigVeda deals with theorems and experiments, while the process of preparing the reagents and apparatus is recorded in the Yajur which is in effect, a laboratory guide.

అనగా, ఋగ్వేదము వైజ్ఞానిక, సిద్ధాంతములను, మరియు పరీక్షణములను నిరూపణ మొనర్చును. వీని సాధనముల మరియు ఉపకరణముల సిద్ధపరచు ప్రక్రియ యజుర్వేదమున జూడనగును. పరిణామ స్వరూపముగ అది యొక పరీక్షణశాలకు మార్గదర్శకమై యున్నది. ఈవిషయమున విస్తార పరిచయము కొరకు ఈ బహుమూల్య పుస్తకమును అవశ్యముగా చదువవలసి యుండును. ఇదియేగాక శ్రీ. పం. ప్రియరత్న ఆర్షగారు రచించిన 'వేదోఁమే దో బడీ వైజ్ఞానిక్ శక్తి యాఁ' (వేదములందు రెండు మహావైజ్ఞానిక శక్తులు) అను పుస్తకము సార్వదేశిక్ సభ డిల్లీ ద్వారా ప్రచురింపబడినది. శ్రీహంసరాజకృత '*The science in the Vedas*' దీని ప్రకాశకులు శ్రీమున్షీరాం

మనోహర్లాల్, పుస్తకవిక్రేతలు, నయీసడక్, ఢిల్లీ, మున్నగు వానియందును, వేదములందు విద్యుచ్ఛాస్త్రము మున్నగువాని మూలము ఉత్తమోత్తముగా వివేచన మొనర్చబడినది. రాజనీతివిద్య, కర్తవ్యశాస్త్రము (మేము మా'వైదిక కర్తవ్యశాస్త్రము' కాంగ్రీగురుకులము ద్వారా ప్రకాశింపజేసిన దానియందు చూపినట్లు) సమాజశాస్త్రము, మనోవిజ్ఞానశాస్త్రము, మరియు మహాయోగి అరవిందుల వారి *On the Vedas* మున్నగు పుస్తకములందు చూపినట్టి ఆధ్యాత్మికవిద్య, మున్నగువాని మూలములు వేదములందుగలవు. ఇంకను ఈవిషయమున శ్రీబలరామశర్మగారి 'విద్యాఓంకాఆదిస్రోత్' అను పుస్తకము కూడా ఈవిషయమునందు పఠనీయమే. ఇట్టి సర్వవిద్యానిధానమగు వేదములను ఈశ్వరీయజ్ఞాన మని విశ్వసించుట సర్వవిధముల యుక్తియుక్తము, మరియు ఉచితమునై యున్నది.

వేదములందు పక్షపాతము, మరియు అన్యాయముతో గూడిన ఉపదేశములు మచ్చుకైనను లేవు. వేదముల ననుసరించి 'జ్ఞానకర్మోపాసన' లను నీ మూడింటి సముచ్చయమే మోక్షసాధనము కేవల విశ్వాసముకన్న శుభకర్మల మహత్త్వము ఎంతో గొప్పది. 'పరమేశ్వరున కతిప్రియమైన వారెవ్వరు?' అను ప్రశ్నకు ఋగ్వేద ౪.౨౫.౫ వ మంత్రమునందెంతో మహత్త్వపూర్ణమునగు సమాధానము గలదు. చూడుడు.

**''ప్రియః సుకృత్ ప్రియ ఇన్ద్రే మనాయుః ప్రియః సుప్రావీః ప్రియో అస్య సోమీ''**

అనగా; పరమేశ్వరున కత్యంత ప్రియమైనవాడెవ్వ డనగా; (సుకృత్) సదా సత్కార్మల నాచరించువాడు (మనాయుః) మనన, లేక ఆలోచనాశీలుడు (ప్రియః) ఆతడే పరమేశ్వరునకు ప్రియమైన వాడగును ఎవడు (సుప్రావీః) సమస్త ప్రాణులను ఉత్తమరీతిలో రక్షించువాడో, మరియు (సోమ) స్వయముగా శాంతస్వభావియై శాంతిని ప్రసారమొనర్చునో, అట్టి మానవశ్రేష్ఠుడే పరమేశ్వరునకు ప్రియతము డగును వా డే దేశము, ఏ ప్రాంతము, మరియు ఏ స్థానమువాడైనను ఈశ్వర ప్రియుడగును.

ఇట్టి సార్వభౌమిక, మానవ సర్వాంగీణ ఉన్నతికి సాధకము, మరియు పక్షపాత రహితములగు ఉపదేశముల కారణముననే వేదములను ఈశ్వరీయ జ్ఞాన మని విశ్వసించుట సర్వథా యుక్తియుక్తము మరియు సముచితమునై యున్నది. ఇందు సందేహించదగిన కారణ మేదియును లేదు. ఇతర గ్రంథములందును వాని యుపదేశములు యుక్తియుక్తములు, పక్షపాతరహితములు, లోకహితకారకము లైనంతవరకే మాననీయములు, కాని అట్లుగాకున్న మాననీయములు గావు. ధర్మమునకు మూలములు వేదములగుట చేతనే **'పశ్య దేవస్య కావ్యం న మమార న జీర్యతి'** ॥అథర్వ౧౦-౮-౨౪॥ మున్నగువాని ద్వారా వానిని 'ఈశ్వరకావ్యము' లనియనిరి. ఆలోచనాశీలు రగు ఈసాయీ, ముస్లిం విద్వాంసు లనేకులు సంకుచితమైన, పక్షపాతముతో నిండిన విషయములను తొలగించి తమ మత గ్రంథములను ఉదారసూచకముగు వ్యాఖ్యలనొనర్చు ప్రయత్నములను ప్రారంభించుటను చూచి మాకెంతయో ప్రసన్నత గలుగుచున్నది. ఇదివారి ప్రాచీనమత సిద్ధాంత పరంపరలకు విరుద్ధమైనను వానిని మేము మనస్ఫూర్తిగా అభినందించుచున్నాము, విజ్ఞానవిరుద్ధము, పక్షపాతపూర్ణము మరియు బుద్ధివిరుద్ధము నగు విషయములను త్రోసివేసి ఉత్తమ విషయములనే స్పష్టముగ ప్రచారమొనర్చుటయే సర్వోత్తమమైనది.



# వేదముల యథార్థ స్వరూపము

## తృతీయాధ్యాయము

### 3.1 ఋషులు మంత్రకర్తలు గారు, మంత్రద్రష్టలు

మేము గడచిన అధ్యాయములందు వేదములు అపౌరుషేయములు, మరియు ఈశ్వరీయ జ్ఞానమని నిరూపించు ప్రయత్నమొనర్చి యుంటిమి. వివిధ దృష్టికోణములతో వాని మహత్త్వమును గూర్చియును దెలిపితిమి. ఐనను దీనిపై *Vedic Age. Rigvedic India: Rigvedic culture, Orion, Aarctic Home in the Vedas* మున్నగు గ్రంథముల విద్వాంసులు భారతీయ లేఖకులు, మరియు ప్రొ. మైక్స్‌మూలర్, వీబర్, మైక్డోనల్ మున్నగు పాశ్చాత్య విద్వాంసుల ఉపర్యుక్త కథనములు సంపూర్ణముగా అసత్యములు, ''ఋషులు మంత్రకర్తలైయుండిరి. వారు భిన్నభిన్న కాలములందు సమయానుకూలముగా మంత్రములను రచించుచుండిరి వేదములు అట్టిఋషుల రచనలే యైనప్పుడు వానిని అపౌరుషేయములు, నిత్య ఈశ్వరీయ జ్ఞానమని ఎట్లు విశ్వసించనగును?'' అని యభిప్రాయపడినారు. ఈవిషయములో కొందరు వేదమంత్రములు, శ్రౌతసూత్రములు మున్నగు వానియందుగల 'మన్త్రకృతః, లేక మన్త్రకారాః' మున్నగు శబ్దముల ప్రమాణములను గూడ నిచ్చుచుందురు. కావున మే మీ యధ్యాయమునందు 'ఋషులు వేదమంత్రముల రచయితలా, లేక ద్రష్టలా? అను విషయముపై ఆలోచించదలచినాము. ఈవేదములందే వసిష్ఠ, విశ్వామిత్ర, జమదగ్ని, అఙ్గిరాః, కణ్వ, భరద్వాజ, గౌతమ, అత్రి, మున్నగు నామములు వచ్చియుండ వానిని నిత్య ఈశ్వరీయజ్ఞానమని ఎట్లు నమ్మదగును? వానియందు అనేక రాజుల, మరియు దేశముల నామములు కూడా వచ్చియున్నవి. వాని విస్తృత మగు సూచీపత్ర మొకటి ప్రొ.మైక్డోనల్, మరియు డా.ఏ వి.కీథ్ అనువారు *Vedic Index of names and subjects* అనుపేరుతో సిద్ధపరచినారు. ఇట్టిపరిస్థితియందు వేర్వేరు కాలములం దుత్పన్నమైన అనేక ఋషుల రచనలే వేదములని విశ్వసించుటయే ఉచిత మగుచున్నదని అభిప్రాయమును స్పష్టపరచినారు. అందుకు సమాధానముగా నిమ్న ఉదాహరణము లిచ్చుచున్నాము.

నిరుక్తమునందు యాస్కాచార్యులు 'ఋషి' యను పదమునకిట్లు అర్థము వ్రాసినారు

**'ఋషయో మన్త్రద్రష్టారః । ఋషిర్దర్శనాత్ స్తోమాన్ దదర్శేత్యౌపమన్యవః ।**

**తద్ యదేనాంస్తపస్యమానాన్ బ్రహ్మ స్వయమ్భ్వ భ్యానర్షత్ తదృషీణామ్**

**ఋషిత్వమితి విజ్ఞాయతే'** ॥ నిరుక్తే.౨.౧౧॥

అనగా; ఋషులు వేదమంత్రార్థ ద్రష్ట లైయుండురు. ఔపమన్యవ ఆచార్యులు కూడా వేదములందు ప్రయుక్తమైయున్న 'స్తుతి' మున్నగు విషయసంబంధ మంత్రముల వాస్తవిక అర్థములను సాక్షాత్కారమొనర్చుకొను వారిని మాత్రమే 'ఋషి' యను పేరుతో పిలువదగు నని యన్నారు తపస్సు, మరియు ధ్యానము మున్నగువాని నొనర్చుచు వాని స్వయంభువ నిత్యవేదముల అర్థప్రకాశము పొందినవా రగుటచేతనే వారు 'ఋషు' లనబడినారు. ఈ వేదమంత్రముల రహస్యముతో గూడిన అర్థమును దర్శించుకొనుటయే ఋషిత్వము

౨. ఔపమన్యవ ఆచార్యుల మరొక వాక్యము కూడ పై వాక్యముల పోలికతో తైత్తిరీయ ఆరణ్యకము ౨-౯-౧ లో చూడనగును.

**'అజాన్ హ వై పృశ్నీంస్తపస్యమానాన్ బ్రహ్మ స్వయమ్భ్వ భ్యానర్షత్ త**

**ఋషయోఽభవన్ తదృషీణామృషిత్వమ్॥**

శతపథ బ్రాహ్మణము నందలి ౬౧-౧-౧ యొక్క దిగువ వాక్యము కూడ ఈయర్థమునే ప్రతిపాదించుచున్నది.

**'తే యత్ పురాస్మాత్ సర్వస్మాదిదమిచ్ఛన్తః శ్రమేణ తపసారిషంస్తస్మాదృషయః'॥**

దీనితాత్పర్యము గూడ పైన వ్రాసిన వాక్యము వలెనే యున్నది ఏయే తాపసులకు తపస్సు, లేక ధ్యానావస్థలో నున్నప్పుడు స్వయంభువ నిత్యవేదముల అర్థ జ్ఞానము గలిగినదో అట్టివారే ఆయామంత్రముల 'ఋషు'లని యనబడినారు.

ఈకారణముననే తైత్తిరీయ సంహిత, ఐతరేయబ్రాహ్మణము, కాణ్వసంహిత, శతపథ బ్రాహ్మణము, మరియు సర్వానుక్రమణి యున్నగు వానియందు మంత్రద్రష్టలను మాత్రమే 'ఋషి'యనుపేరుతో సంబోధించబడినది. వారు ఆయా మంత్రముల, సూక్తముల, లేక మండలములను చూచియుండి రని వారి విషయములో వ్రాయబడి యున్నది ఈవిషయములో ఉదాహరణార్థము దిగువ ప్రమాణముల నుల్లేఖించిన సరిపడునను కొందుము.

**౧. స ఏతం (భూమిర్భూమ్నా....) కసర్ణీరః కాద్రవేయో మన్త్రమపశ్యత్** ॥తైత్తిరీయసంహిత ౧-౫-౪॥

**౨. స పూషా ఏతం మన్త్రమపశ్యత్। సూర్యస్య త్వా చక్షుషా ప్రతిపశ్యామీతి** ॥ తైత్తిరీయ సం. ౨-౬-౮॥

**3. శునః శేపమాజీగర్తిం వరుణోఽగృహ్ణాత్ స ఏతాం వారుణీమపశ్యత్.......**

**ఉదుత్తమం వరుణ పాశమస్మత్ ఇతి** ॥ తై.సం.౫-౨-౧॥

**౪. స వామదేవః ఏతం సూక్తమపశ్యత్ 'కృణుష్వ పాజః ప్రసితిం న పృథివీమ్' ఇతి** ॥

కాణ్వ సంహిత ౧౦-౫

**౫. యా సేనా అభీత్వరీరితి....తే దేవా ఏతా ఋచో ఽపశ్యన్** ॥ కా.సం.౧౯-౧౦॥

**౬. తే దేవా ఏతద్ యజురపశ్యన్ అజోఽసి మహోఽసి** ॥ కా.సం.౧౭-౭॥

**౭. మహీం గామితి కాణ్వో హైనాం దదర్శ** ॥ శత.బ్రా.౯-౨-౨-3౮॥

**౮. ఏతద్ కవషః సూక్తమపశ్యత్ పంచదశర్చమ్ 'ప్రదేవత్రా బ్రహ్మణే గాతురేతు' ఇతి॥**

కౌషీతకిబ్రా-౧౨-౧।

**౯. ఇన్ద్ర క్రతుం న ఆభర ఇతి----వశిష్ఠో వా ఏతం హతపుత్రోఽపశ్యత్।** తాణ్డ్యబ్రాహ్మణే.౪-౭-3॥

౧౦. గృత్సమదో ద్వితీయం మణ్డలమపశ్యత్ ॥ సర్వానుక్రమణీ.౨-౧॥

౧౧. ----గాథినో విశ్వామిత్రః స తృతీయం మణ్డలమపశ్యత్ సర్వా ను ౩.౧ ॥

౧౨. వామదేవో గౌతమశ్చతుర్థం మణ్డలమపశ్యత్ ॥ సర్వాను. ౬-౧॥

౧౩. బార్హస్పత్యో భరద్వాజః షష్ఠం మణ్డలమపశ్యత్ ॥ సర్వా. ౭-౧ ॥

౧౪. సప్తమం మణ్డలమం వసిష్ఠో౭పశ్యత్ ॥ సర్వా. ౭-౧ ॥

అనగా; వసిష్ఠ ఋషి సప్తమ మండలమును జూచినాడు.

౧౫. ఆద్యం ద్వ్యచం ప్రగాథో౭పశ్యత్ ॥ సర్వాణుక్రమణీ.౮-౧ ॥

అనగా; మొదటి రెండు ఋచ ( ఋక్కు )లను ప్రగాథుడు జూచియున్నాడు. వాని యర్థములను రహస్య సహితముగా సాక్షాత్కారమొనర్చికొనినాడు. ఇంకా ఇట్టివే వందలకొలది ఉద్ధరణ( ఉదాహరణ) ముల నీయవచ్చును.

ఈవిధముగనే వేదమంత్రముల అర్థద్రష్టలు, సాక్షాత్కారమొనర్చికొని వానిని ప్రచార మొనర్చిన వారిని 'ఋషి' యందురు. ఈఋషులు వైదికమంత్రముల రచయితలు గారు. కాని పైదెలిపిన అన్నివాక్యములందును 'అపశ్యత్' ( అనగా దర్శనక్రియా) స్థానమున 'అరచయత్' అనగా రచన చేయ లేదు' అను ప్రయోగముండవలసినది.

వేదములలో విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ,అత్రి, అఙ్గిరా, ప్రియమేధ మున్నగు శబ్దములను జూచి 'ఇవి ఋషుల నామములు, అయా ఋషుల పేర్లను వారివారి శిష్యులు ఈకాలపు కవులు తమ రచనలందు కబీరు, సూరదాసు, తులసీదాసు, నానకు మున్నగు తమగురువుల పేర్లను చొనిపినట్లు మంత్రము లందు ప్రయోగించవచ్చునను భ్రమ గలుగుచుండవచ్చును. కాని అట్లనుకొనుట భ్రమయే యగును. వేదములం దీశబ్దముల ప్రయోగము వ్యక్తివిశేషవాచకము గాదు అయ్యది సామాన్య గుణ సూచకమైయున్నది. ఉదాహరణముగా; విశ్వామిత్ర శబ్ద మొకవేళ వేదములందు వచ్చిన దాని యర్థము గాథికుమారు డగు విశ్వామిత్రుడు గాక అందరను మిత్రులనుగా నెంచువాడెవ్వడైనను ఋషియే యని తలచవలెను.

ఈశబ్దము ప్రాణము మున్నగు వానికి వాచకము కూడ య్యై యున్నది. దీనిని మేము మొదటనే నిర్దేశమొనర్చి యుంటిమి ఐనను ప్రసంగవశమున దానిని స్పష్టీకరణ మొనర్చుటయును అవసరమే యనిపించుచున్నది. ఇక బ్రాహ్మణగ్రంథములు వేదముల వ్యాఖ్యాన రూపములై యున్నవి. ఎట్లన;

**బ్రహ్మభిః-చతుర్వేదవిద్భిర్బ్రాహ్మణైర్మహర్షిభిః ప్రోక్తాని యాని వేద**

**వ్యాఖ్యానాని తాని బ్రాహ్మణాని** ॥ మహాభాష్యము ౫-౧-౧॥

ఈమహాభాష్యకారసమ్మత నిరుక్తముచే నిది స్పష్టముగ జ్ఞాతమగును. ఐతరేయ బ్రాహ్మణ, ఐతరేయారణ్యక, శతపథబ్రాహ్మణ, ఛాన్దగ్యోపనిషత్తు మున్నగు ప్రాచీన గ్రంథములందు ఈశబ్దమల యొక్క ప్రాణాదిపరకమగు వ్యాఖ్యలు స్పష్టముగా లభించుచున్నవి. ఐతరేయ బ్రాహ్మణమున వ్రాసియున్న దెట్లన;

ప్రాణో వై గృత్సః, అపానో మదః స యత్ప్రాణో గృత్సోఽపానో మదః
తస్మాద్ గృత్సమద ఇత్యాచక్షతే । ఏతమేవ సన్తం తస్యేదం విశ్వం మిత్రమ్
ఆసీద్ యదీదం కించ । తద్ యస్యేదం విశ్వం మిత్రమాసీద్ యదిదం కించ
తస్మాద్ విశ్వామిత్రః ఇత్యాచక్షతే । ఏతమేవ సన్తం తం దేవా అబ్రువన్
అయం నః సర్వేషాం వామ ఇతి । తం యద్ దేవా అబ్రువన్ అయం వై
నః సర్వేషాం వామ ఇతి తస్మాద్ వామదేవః । తస్మాద్ వామదేవ ఇత్యా-
చక్షతే । ఏతమే వసన్తం స ఇదం సర్వం పాప్మనోఽత్రాయత యదిదం కించ ।
స యదిదం సర్వం పాప్మనోఽత్రాయత తదిదం కించ తస్మాదత్రాయ
ఇత్యాచక్షతే । ఏతమేవ సన్తం స ఉ ఏవ బిభ్రద్వాజః ప్రజా వాజః
ఏష బిభర్తి యద్ బిభర్తి తస్మాద్ భరద్వాజ ఇత్యాచక్షతే ।'
ఏతం సన్తం దేవా అబ్రువన్ అయం వై నః సర్వేషాం వసిష్ఠ :
తస్మాద్ వసిష్ఠః స ఇదం సర్వమభి ప్రాగాత్ – తస్మాత్ ప్రగాథః ॥ ఐతరేయారణ్యకము. ౨-౨-౧ ॥

గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజ, వసిష్ఠ, ప్రగాథ, మున్నగు పదములు ముఖ్యముగా ప్రాణవాచకములని ఇచ్చట చూపబడియున్నది. ఈశబ్దముల యౌగికార్థములు పైన ఉదాహరణ సందర్భమున చూపబడియున్నవి. ఈయౌగిక వ్యుత్పత్తులను బట్టి ఈశబ్దములు సామాన్య గుణసూచకములై నందున ఈయా గుణములు గల వ్యక్తుల కొరకు, వస్తువుల కొరకు ప్రయోగము జరుగవచ్చును. ఉదాహరణమునకు , ఒకానొకవ్యక్తి ఎల్లరను తమ మిత్రులుగా నెంచును. కావుననే నాత డందరకును మిత్రు డనబడును. ఆతడే 'విశ్వామిత్రు' డనబడును. పాపమునుండి గాపాడువాడు 'అత్రి' యనబడును. వాజ ప్రజా, జ్ఞాన, బలములను ధారణమొనర్చువాడు భరద్వాజుడని పిలువబడును. సర్వశ్రేష్ఠుడు ప్రాణవిద్యలను చక్కగా నెరుగువాడు ( ప్రాణో వై వసిష్ఠ ఋషిః) మరియు తనయందు పరమేశ్వరు నత్యధికముగా వసింప జేయువాడు, సదా ఆయననే స్మరించుచుండు జ్ఞానియును వసిష్ఠుడని యనబడును. మరియు మనస్సును, ఇంద్రియములు మున్నగు వానిని ముఖ్యముగా తనవశమందుంచు కొనువాడు కూడా వసిష్ఠ'డనియనిపించుకొనును. సమస్త శ్రేష్ఠగుణములను ధారణ మొనర్చునాతడు, లేక వామ- శ్రేష్ఠగుణయుక్తుడగు భగవానునిలో రమణ మొనర్చువాడు, వానిచే ప్రకాశింపబడువాడు ( వామేన దీవ్యతీతి) వామదేవు డనబడును. ఇదేవిధముగా ఇతర శబ్దముల విషయమునను తలచవలయును. ఐతరేయ బ్రాహ్మణము. ౧-౨౮లో 'అగ్నిర్వై వసిష్ఠః' అనగా అగ్ని 'వసిష్ఠు' డనియును గలదు.

### 3.2 శతపథ బ్రాహ్మణమునందు వసిష్ఠాది శబ్దముల అర్థములు

యజుర్వేద వ్యాఖ్యానమైన శతపథ బ్రాహ్మణమునందు యజుర్వేద, ౧౩వ అధ్యాయ మంత్రముల వ్యాఖ్య నొనర్చుచు అష్టమకాండమునందు స్పష్టపరచబడినది.

**ప్రాణో వై వసిష్ఠ ఋషిః** । శత.౮-౧-౧-౬॥

**మనో వై భరద్వాజఋషిః** । శ. ౮-౧-౧-౯ ॥

**శ్రోత్రం వై విశ్వామిత్ర ఋషిః** ।౮-౧-౨-౬॥

**ప్రజాపతిర్వై జమదగ్నిః** ।౧౩-౨-౨-౪॥

**చక్షుర్వై జమదగ్నిః** ॥౮-౧-౨-౩ ॥

**ప్రాణో వా అఙ్గిరాః** ॥౬-౧-౨-౨౮ ॥

**వాగ్వై విశ్వకర్మా ఋషిః** ॥౮-౧-౨-౯ ॥

వసిష్ఠ అనగా ప్రాణమని అర్థ మగును. భరద్వాజ అనగా మనస్సు, విశ్వామిత్ర అనగా శ్రోత్రము (చెవి), అఙ్గిరా యన ప్రాణము, విశ్వకర్మ యన వాణి యను అర్థములు గూడ నగును. శతపథ బ్రాహ్మణాంతర్గత బృహదారణ్యకోపనిషత్తునందును గోతవు, భరద్వాజాది శబ్దవములకు ఇంద్రియాది పరక అర్థవములు చూపబడియున్నవి ఎట్లనగా;

**ఇమావేవ గోతమ భరద్వాజౌ । అయం గోతమః అయం భరద్వాజః ।**

**ఇమావేవ విశ్వామిత్ర జమదగ్నీ । అయమేవ విశ్వామిత్రః అయం జమ-**

**దగ్నిః ఇమావేవ వసిష్ఠ కశ్యపౌ । అయమేవ వసిష్ఠ అయం కశ్యపః ।**

**వాగేవాత్రిర్వాచా అన్నమద్యతే । అత్తిర్హవై నామైతద్ యదత్రిరితి ॥** బృహదారణ్యకోప ౨-౨॥

ఇచ్చట రెండు చెవులు, రెండు కన్నులు, రెండు నాసికా రంధ్రములు మరియు వాణి యనునవి క్రమముగా గోతమ, భరద్వాజ, జమదగ్ని, వసిష్ఠ మున్నగు నామములతో పిలువబడినది.

పూర్వ మీమాంసా శాస్త్రమునందు "**వేదాంశ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః ।**" (౧-౧-౨౭॥)

**అనిత్యదర్శనాచ్చ । ఆఖ్యా ప్రవచనాత్ । పరన్తు శ్రుతిసామాన్యమాత్రమ్ ॥ సూ.౩౩ ॥**

మున్నగు సూత్రముల ద్వారా 'వేదములందు ప్రయోగించబడిన వసిష్ఠ, విశ్వామిత్ర, జమదగ్ని, మున్నగు శబ్దములు కొన్ని విశేషగుణములను సూచించు సామాన్య శబ్దములే గాని, అవి వ్యక్తి విశేష వాచక సంజ్ఞాశబ్దములు **(proper nouns)** కావు. కాఠక, కాలాపక, పైప్పలాద మున్నగు శబ్దములు ప్రవచనమూలకములు. ఈవిధముగా వేదములందు అనిత్య వ్యక్తుల పేర్లు గాని, ఇతిహాసము గాని లేదు. ఉదా:-

**'భోజాయాశ్వం సం మృజన్త్యాశుం భోజాయాస్తే కన్యా శుమ్భమానా ।**

**భోజస్యేదం పుష్కరిణీవ వేశ్మ పరిష్కృతం దేవమానేవ చిత్రమ్** ॥ ఋ ౧౦-౧౦౭-౧ ॥

మున్నగు మంత్రములందు ప్రయోగమైయున్న 'భోజ' శబ్దముచే సంస్కృతము వల్ల అత్యధిక ప్రేమగలవాడు, నిపుణుడగు భోజరాజు గ్రహింపబడడు. ఆ భోజరాజు పది, లేక పదునొకండవ శతాబ్దమునందుండినవాడు కాని '**భుజ్‌పాలనాభ్యవహారయోః**' ఈధాతువుతో సిద్ధింపబడి దానము ద్వారా ప్రజాపాలనమొనర్చురాజు, లేక ఇతర దానశీల వ్యక్తి ఈశబ్దముచే గ్రహించబడును

**వయము త్వా తదిదర్థా ఇన్ద్ర త్వాయన్తః సఖాయః । కణ్వా ఉక్థేభిర్జరన్తే** ॥ ఋ. ౮-౨-౧౬ ॥

మున్నగు మంత్రములందు ప్రయుక్తమైయున్న 'కణ్వ' శబ్దము కణ్వ నామక ఋషి విశేషముగాని, మరియు వారివంశజుల వాచకముగాదు. కాని

**'కణ్వ ఇతి మేధావి నామ'** ॥ నిఘంటు. 3-౧౫ ॥

ఈనిఘంటు వచనము ననుసరించి కణ్వ శబ్దము మేధాబుద్ధి సంపన్నులగు సమస్తవ్యక్తులకు సంబంధించి యున్నది. ఎట్లన, 'హే పరమేశ్వరా! నీ మిత్రులమగు మేము నిన్నే కోరువారము. మేధానామక శుద్ధబుద్ధితో సంపన్నులమై యుండి మేము నీస్తుతియే యొనర్చుచుందుము. కావుననే;

**'విశ్వామిత్ర! జమదగ్నే! వసిష్ఠ, భరద్వాజ, గోతమ, వామదేవ । శర్దిః నో అత్రిః**

**అగ్రభీన్నమోభిః సుశంసాసః పితరో మృడతా నః** ॥ అథర్వ. ౧౮-3-౧౬ ॥

ఈమంత్రమునందు ప్రయోగమైయున్న విశ్వామిత్ర, జమదగ్ని, వసిష్ఠ, భరద్వాజ, గోతమ, వామదేవ, అత్రి మున్నగు శబ్దముల అర్థము గాధి పుత్రుడగు విశ్వామిత్ర ఋషి, పరశురాముని తండ్రి జమదగ్ని, సూర్యవంశరాజుల పురోహితుడగు వసిష్ఠుడు మున్నగు వ్యక్తి విశేషములను గ్రహించక 'ఎల్లరను మిత్రదృష్టితో జూచువాడు విశ్వామిత్రుడు, సకల పదార్థములను యథార్థస్వరూపమున బుద్ధినేత్రములతో జూచువాడు, లేక పవిత్రదృష్టితో సర్వప్రాణులను జూచువాడు జమదగ్ని ( చక్షుర్వై జమదగ్ని ఋృషిః) ప్రాణవిద్యానిపుణుడు, లేక అత్యధిక ఉత్తమగుణములను తనయందుంచు కొనువాడు- - - అతిశయేన వాసయితాశ్రేష్ఠ ( ప్రాణో వై వసిష్ఠ ఋషిః) వాజమును, లేక జ్ఞానమును తనయందు ధారణమొనర్చుకొను, మరియు శుద్ధమగు మనస్సు గలిగిన ( మనో వై భరద్వాజ ఋషిః) అత్యంత గతిశీలుడు (గోతమ) అత్యంత సేవనీయుడగు పరమేశ్వరుని సదాస్తుతి యొనర్చుచుండువాడు ( వామదేవ) ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములచే విముక్తుడైనవాడు ( అత్రి) ఈప్రకారముగల ఉత్తమగుణములు గల అనుభవజ్ఞులగు జ్ఞానులు మమ్ము సుఖవంతుల నొనర్చెదరుగాక.

అత్యంతాశ్చర్యకరము, మరియు దుఃఖకరమగు విషయమేమనగా; శ్రీసాయణాచార్యుని వంటి విద్వాంసుడగు భాష్యకారుడు తనవేద భాష్యము యొక్క భూమికయందు మహత్వపూర్ణమగు ఈమీమాంసా శాస్త్రసూత్రములను నిర్దేశించి భాష్యమొనర్చునప్పుడు మనవేదముల అపౌరుషేయత్వము మరియు

నిత్యత్వపుప్రతిజ్ఞనలను మరచివేసి అనిత్యములగు రాజుల ఋషుల వృత్తాంతములను తన భాష్యమునందు నింపివేసినాడు. అందనేక ఆఖ్యానములు అత్యంతఅశ్లీలములు, మరియు ఘృణితములునై యున్నవి. వానినొక సభ్యసమాజము యెదుట కథనమొనర్ప జాలనంతటి జుగుప్సాకరములునైయున్నవి. ఋగ్వేదభాష్యము యొక్క భూమిక యందు శ్రీసాయణుడు వ్రాసినది ఉదాహరణముగా నీయబడుచున్నది.

**'యదప్యుక్తం ప్రమగన్దాద్యనిత్యసంయోగాన్మన్త్రస్యానాదిత్వం న స్యాదితి**

**తత్రోత్తరం సూత్రయతి ఉక్తశ్చానిత్యసంయోగ ఇతి। తత్ర పూర్వపక్షే**

**వేదానాం పౌరుషేయత్వం వక్తుం యుక్తం కాఠకం కాలాపకమిత్యాది పురుష సంబంధాభిధానం హేతుకృత్యానిత్యదర్శనాచ్చేతి హేత్వన్తరం సూత్రితం తస్యా యమర్థః- బబరః ప్రావాహణిరకామయత ఇత్యనిత్యానాం బబరాద్యర్థానాం దర్శనాత్ తతః పూర్వమసత్వాత్ పౌరుషేయో వేద ఇతి।**

**తస్యోత్తరమేవం సూత్రితమ్ - 'పరన్తు శ్రుతిసామాన్యమాత్రమ్' ఇతి**

**తస్యాయమర్థో యత్ కాఠకాది సమాఖ్యానం తత్ ప్రవచననిమిత్తం,**

**యత్ తు పరం బబరాద్యనిత్యదర్శనం తచ్ఛబ్దసామాన్యమాత్రం న తు**

**తత్రానిత్యో బబరాఖ్యః కశ్చిత్ పురుషో వివక్షితః కిన్తు బబర ఇతి**

**శబ్దానుకృతిః తథా సతి బబర ఇతి శబ్దం కుర్వన్ వాయురభిధీయతే**

**స చ ప్రావాహణిః - ప్రకర్షేణ వహనశీలః, ఏవమన్యత్రాప్యూహనీయమ్।'**

దీని భావార్థమేమన, పూర్వపక్షము ననుసరించి వేదములు పురుషకృతములు, కావుననే అవి అనిత్యములు. కఠకమ్, కాలాపకమ్ మున్నగు నామములు వేదశాఖలందు ప్రచలితములై యున్నవి వానినుండి కూడ కఠ, కలాప, పిప్పలాద మున్నగు ఇతరఋషులు వానిని చేసి యున్నారని సూచితమగుచున్నది. ఇదేవిధముగా వేదములని ఎంచబడు బ్రాహ్మణ గ్రంథములందును గాన్పించు **'బబరః ప్రావాహణిర కామయత'** మున్నగు వాక్యముల వల్ల కూడా ప్రావాహణుని పుత్రుడు బబరుడనువాడును ఇట్లేకోరియున్నాడని స్పష్టమగుచున్నది. దీనితాత్పర్యమేమన, బబరుడనువాడు వెలసిన పిదపనే వేద భాగములైనవని ఈ పూర్వ పక్షమునకు సమాధానము **''పరన్తు శ్రుతి సామాన్య మాత్రమ్''** వేదములందు వ్యక్తివిశేష వాచక నామములు లేవు. కాని గుణసూచకములగు సామాన్య శబ్దములు గలవని ఈసూత్రముద్వారా తెలుపబడినది. కావుననే **'బబరః ప్రావాహణిరకామయత'** మున్నగు వాని తాత్పర్యము ప్రావాహణుని పుత్రుడు బబరుడను పేరుగల ఏవ్యక్తివిశేషముతో కాదు. కాని ప్రసారమగుచున్న వాయువుతో నగు నని ఈయౌగికార్థముచే స్పష్టముకాగలదు.

శ్రీ సాయణాచార్యు ననుసరించి కేవలము వేదములందేగాదు; బ్రాహ్మణ గ్రంథములందును అనిత్యములగు ఇతిహాసములు లేవని ఈసందర్భముతో స్పష్టమగు చున్నది. ఐనను మనము వానిని చక్కగా తెలిసికొనలేదు. బ్రాహ్మణగ్రంథములనగా, బ్రహ్మ అనగా వేదములకు ఋషికృత వ్యాఖ్యాన గ్రంథములు వానియందు.

**'తత్ర బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా**

**నారాశంసీరితి'** ॥ తైత్తిరీయారణ్యకము. ౨-౯ ॥

మున్నగు వానిననుసరించి ఇతిహాసాదులున్నవి. కాని సాయణాచార్యుడు బ్రాహ్మణ గ్రంథములందును అనిత్యములగు ఇతిహాసములను నమ్ముచున్నాడు. అతడు ఇట్టి దూషితములు, ఘృణితములు, అశ్లీలములగు ఐతిహాసిక పరక అర్థములు అనేక స్థానములందు వేదమంత్రముల కొనర్చినాడు. ఇంతకన్న మించిన ఆశ్చర్య మేముండును? వానిని చదివినప్పుడెంతయో సిగ్గుపడవలసివచ్చును. ఉదాహరణార్థము;

**అగధితా పరిగధితా యా కశీకేవ జంగహే।**

**దదాతి మహ్యం యాదురీ యాశూనాం భోజ్యా శతా** ॥ ఋ ౧-౧౨౬-౬॥

సాయణుడు తన భాష్యమునందు దీనియర్థ మిట్లొనర్చినాడు.

**సమ్భోగాయ ప్రార్థితో భావయవ్యః స్వభార్యాం రోమశామ్ అప్రౌఢేతి**
**బుద్ధ్వా పరిహసన్నాహ: -(భోజ్యా) భోగయోగ్యైషా (అ గధితా) ఆ-స**
**మన్తాత్ స్వీకృతా తథా (పరి గధితా) పరిగృహీతా యద్వా) (అ గధితా)**
**ఆ-సమన్తాన్మిశ్రయన్తీ ఆన్తరం ప్రజననేన బాహ్యం భుజాదిభిః।**
**కీదృశీ సా యా (జంగహే) అత్యన్తం గృహ్ణాతి కదాపి న విముఞ్చతి।**
**అత్యాగే దృష్టాన్తః (కశీకేవ) కశీకా నామ సూతవత్సా నకులీ సా**
**యథా పత్యా సహ చిరకాలం క్రీడతి న కదాచిదపి విముఞ్చతి తథై-**
**వైషాపి। కించ భోజ్యైషా యాదురిత్యుదకనామ రేతోలక్షణమ్**
**ఉదకం ప్రభూతం రాతి-దదాతీతి యాదురీ బహురేతోయుక్తేత్యర్థః।**
**తాదృశీ సతీ (యాశూనామ్) సంభోగానాం యశ ఇతి ప్రజనననామ**
**తత్ప్రవృత్తీని కర్మాణి యాశూని భోగాః తేషాం (శతమ్) అసంఖ్యా-**
**తాని మహ్యం దదాతి।**

అత్యంత అశ్లీలము, మరియు జుగుప్సాజనకమునగు కారణమున దీనిభాషానువాదము నిచ్చుట మాకతి లజ్జాకరముగ నున్నది. ఐనను సంక్షేపముగా దెలుపుటయే చాలుననుకొందుము. సాయణాచార్య ననుసరించి భావయవ్య దనుపేరుగల ఒక ఋషి తనపత్ని యగు రోమశను అప్రౌఢగా నెంచి ఆమె సంభోగమునకై ప్రార్థించగా ఆమె నపహాస్యపరచుచు ఈమంత్రము ద్వారా ఇట్లనుచున్నాడు. ఈమె అధిక భోగయోగ్యమైయున్నది. ఈమె బయటనుండి లోపలనుండి నన్నాలింగన మొనర్చుకొనుచున్నది. మరియు ఆడనకులము (ముంగిస) వలె నన్నెప్పుడును పరిత్యజించి యుండలేదు. ఈమె యందు అధిక వీర్యము గలదు. కావున ఈమెనాకు అనేక విధముల సంభోగ సుఖమునిచ్చును. మున్నగునవి.

వాస్తవముగా ఈవేదమంత్రమునందు సంభోగార్థము రోమశ యొక్క ప్రార్థనగాని, అప్రౌఢయని యెంచి హావభావముల ద్వారా పరిహాసాది సూచనలేవియును లేవు. కావుననే మహర్షి దయానందులు ఈమంత్రమునకు

ఉత్తమనీతిపరమైన వ్యాఖ్య యొనర్చినారు. యాదురీ యనునర్థము ప్రయత్నశీల, మరియు (యాశూనామ్) కు 'ప్రయతమానానామ్' అను అర్థము నొనర్చుచు మంత్రముయొక్క భావార్థ మీ శబ్దములందిచ్చి యున్నారు.

**యయా నీత్యాఽసంఖ్యాతాని సుఖాని స్యుః సా సర్వైః సమ్పాదనీయా ।**

అనగా అసంఖ్యాక సుఖముల నిచ్చునీతినే ఎల్లరును అనుష్ఠానమొనర్చవలెను. ఆలోచనాశీలురగు పాఠకులే ఈరెండువిధములగు అర్థములను నిష్పక్షపాత భావముతో తులనాత్మకముగా చూచి ఇందేది సర్వసమ్మతముగానున్నదో, ఏది అసంగతముగ నున్నదో నిర్ణయించుకొనవలయును. మరియు ఏయర్థమునందు కపోలకల్పనము, పెనుగులాటవంటి దధికముగ నున్నదో ఆలోచించవలెను. ఈసూక్తములోనిదే తరువాయి మంత్రమిట్లు గలదు.

**ఉపోపమే పరామృశ మా మే దభ్రాణి మన్యథాః ।**
**సర్వాహమస్మి రోమశా గన్ధారీణామివావికా ॥ ఋ.౧-౧౨౬-౭ ॥**

దీనికి సాయణుని భాష్యమిట్లు గలదు.

**'రోమశా నామ బృహస్పతేః పుత్రీ బ్రహ్మవాదినీ పరిహసన్తం స్వపతిం**
**ప్రాహ భోః పతే! (మే) మాం ద్వితీయార్థే చతుర్థీ (ఉపోప) ఉపేత్య**
**(పరామృశ) సమ్యక్ స్పృశ భోగయోగ్యామ్ అవగచ్ఛేదిత్యర్థః। యద్వా**
**(మే) మమ గోపనీయమఙ్గమ్ (ఉపోప మృశ) అత్యన్తమాన్తరం స్పృశ।**
**పరామర్శాభావశఙ్కాం నివారయతి (మే) మదఙ్గాని రోమాణి(దభ్రాణి)**
**అల్పాని మా బుధ్యస్వ। (అహమ్) (రోమశా) బహురోమయుక్తా అస్మి**
**యతోఽహమీదృశీ అతః (సర్వా) సంపూర్ణావయవాస్మి రోమశత్వే**
**దృష్టాన్తః - గన్ధారదేశీయ మేషా ఇవ యద్వా (గన్ధారీణామ్) గర్భ-**
**ధారిణీనాం స్త్రీణామ్ (అవికా) అత్యర్థం తర్పయన్తీ యోనిరివాస్మి**
**యతోఽహమీదృశీ అతో మామ్ అప్రౌఢాం మావబుధ్యస్వేతి।'**

అత్యంత అశ్లీలమగు కారణమున దీని సంక్షిప్తతాత్పర్యమునిచ్చుటయే సరిపడునను కొందుము ఎందుకనగా, ఆయశుద్ధార్థమునే సత్యమనియెంచి Vedic Age రచయితల టిప్పణిని దెలిసికొనుటయందు సౌకర్యముండగలదు. సాయణభాష్యము ననుసరించి బృహస్పతి పుత్రికయగు బ్రహ్మవాదిని రోమశ పరిహాసమొనర్చుచు తన పతితో, హేపతే! నీవు నన్ను స్పర్శించుము మరియు సంభోగయోగ్యమని దెలిసికొనుము. మరియు నాగుప్తాంగమును నీవు చక్కగా లోపలినుండి స్పర్శించుము. నీవు నాయంగములను, రోమములను చిన్నవిగా నెంచకుము. నేను అధిక రోమములతో గూడియున్నదాన నగుటచే సంపూర్ణావయవసంపన్నురాలను గంధారదేశపు గొఱ్ఱెవలె, లేదా గర్భవతి స్త్రీల. అతితృప్తిగలిగించు యోని వలె సర్వాంగసంపూర్ణవతిని.

సాయణుడొకవైపు భూమికయందు వేదములందేగాక బ్రాహ్మణభాగము లందును అన్ని విధములైన అనిత్య ఇతిహాసములను నిరాకరించును. మరియు బ్రాహ్మణము లందీయబడిన కథలకు, యౌగికార్థమును జూపుటకు ప్రయత్నించును. మరొకవైపు అదే వేదములందు భావయవ్య రోమశ, అగస్త్య లోపాముద్ర, పురూరవ ఊర్వశి, ఇన్ద్ర ఇన్ద్రాణ్యాదుల అశ్లీల సంవాదపరకమగు అర్థములనంటగట్టుచు వేదములను కళంకితమొనర్చుజూచును. ఇది ఎంత సిగ్గులేనితనము?

*Vedic Age* రచయితలు 3౮౫ వ పుటయందు ఈ ఋగ్వేద ౧-౧౩౬ సూక్తముపై ఈవిధముగ టిప్పణి నిచ్చియున్నారు

'This dismal hymn ends with two more verses notable only for their extreme obscenity. It is in these Danastutis that Brahmanical greed appears in its worst aspects in the Rigveda.'

అనగా; ఈనిరాశాజనకము లేదా నికృష్ట సూక్తము రెండు మంత్రములతో పూర్తియగుచున్నది ఇందు అశ్లీలత పరాకాష్ఠ *climax* నందిన కారణమున అపఖ్యాతి గాంచినది ఈదానస్తుతులయందు బ్రాహ్మణుల లోభము ఋగ్వేదమునందు అన్నిటికన్న నికృష్టరూపములో ప్రకటమగుచున్నది ఈ రెండు మంత్రములలో ఒకదాని అనగా( ఆగధితా పరిగధితా) భావార్థము మహర్షిదయానందుల భాష్యానుసారముపైన పేర్కొనియుంటిమి పదార్థములతో సహా రెండవ మంత్రము యొక్క వాస్తవికార్థమును ఇచ్చుట నిచ్చుచున్నాము ఇందువల్ల దానియందశ్లీలత గలదను భ్రమ తొలగిపోగలదు.

మంత్రముయొక్క శబ్దార్థ మీ విధముగ గలదు.

**యా (ఆగధితా) సమన్తాద్ గృహీతా (పరిగధితా) పరితః సర్వతో గధితా**
**శుభైర్గుణైః యుక్తా నీతిః (గధ్యతిర్మిశ్రీభావకర్మా ని.౫-౧౫) (జఙ్గహే)**
**అత్యన్తం గ్రహీతవ్యా (కశీకేవ) యథా తాడనార్థా కశీకా**
**(యాశూనామ్) ప్రయతమానానామ్ అత్ర యసు ప్రయత్నే ధాతో**
**ర్బాహులకాదుణ్ ప్రత్యయః నస్య శశ్చ (యాదురీ) ప్రయత్నశీలా**
**(శతా) శతానీ అసంఖ్యాతాని వస్తూని (భోజ్యా) భోక్తుం**
**యోగ్యాని (దదాతి) సా సర్వైః స్వీకార్యా।**
**భావార్థః - యయా నీత్యాఽసంఖ్యాతాని సుఖాని స్యుః సా సర్వైః సమ్పాదనీయా॥**

అనగా; ఏ యుత్తమ నీతి వ్యవహారములను గ్రహించుటచే అసంఖ్యాక సుఖముల ప్రాప్తిగలుగునో, ఏది సర్వశుభగుణ సంయుక్తమై యున్నదియో దానినే యెల్లరును అనుష్ఠింపవలయును. ఇది దాని వాస్తవిక భావము ఇందుఅశ్లీలవిషయ మేమున్నది? పాఠకులే దానిని నిశ్చయించుకొనవలయును సాయణుని అశుద్ధభాష్యమును జూచి, మరియు 'గ్రిఫిత్' అనువాతని టిప్పణి ననుకరించుచు *Vedic Age* యొక్క రచయితలు కూడా నిష్ప్రక్షికముగ

నాలోచించక పైన దెలిపిన టిప్పణి నిచ్చి పాఠకులను భ్రమయందు పడవేయుట యనునది అత్యంత నిందనీయ విషయము.

మహర్షి దయానందులవారు ఈవేదమంత్రములకు చేసిన భాష్యమును దిగువ నిచ్చుచున్నాము.

**పునా రాజ్ఞీ కిం కుర్యాదిత్యాహ-**

**హే పతే రాజన్! యాఽహం (గన్ధారీణామ్ ఇవ అవికా) పృథివీరాజ్య-**

**ధర్త్రీణాం మధ్యే రక్షిచారయ (మే) (దభ్రాణి) అల్పాని కర్మాణి**

**(మా) (ఉపోప) అతి సమీపత్వే (మన్యథాః) జానీయాః।**

**భావార్థః- రాజ్ఞీ రాజానం ప్రతి బ్రూయాత్ అహం భవతో న్యూనా నాస్మి। యథా భవాన్ పురుషాణాం న్యాయధీశోఽస్తి తథాహం స్త్రీణాం న్యాయకారిణీ భవామి। యథా పూర్వా రాజపత్న్యః ప్రజాస్థానాం స్త్రీణాం న్యాయకారిణ్యోఽభూవన్ తథాహమపి స్యామ్॥**

అనగా; రాణి రాజుతో నిట్లనెను; 'మీరుకూడా నాగుణముల నాలోచించుడు. మీరు నన్నెప్పుడును తుచ్ఛముగా నెంచవలదు. మరియు నాకార్యములను తిరస్కార దృష్టితో జూడవలదు. నేను నీకన్న తక్కువేమీ కాదు. పురుషులకు నీవు న్యాయాధీశుడవై యున్నట్లే నేనుకూడా స్త్రీలకు న్యాయధీశురాలనై యుండగలను. ఇట్లుండి స్త్రీలకు సదా న్యాయము గలిగించుట యందు తత్పరురాలనై యుండగలను.

ఇందు అశ్లీల విషయ మేమున్నది? ఇచ్చట స్త్రీలస్థానము పురుషులకు సమానముగ జూపబడియున్నది. వారి నెప్పుడును అవమానపరచ రాదని ఆదేశించబడియున్నది. సభ్యతగల జగమున కిది యొక వరమైయున్నది. రాణికార్యము స్త్రీలకు న్యాయము గలిగించుటయై యున్నది. అనగా; న్యాయాధీశ పదవిని, కూడా స్త్రీలకు ఈయవచ్చును. మరియు వారి నెప్పుడును అల్పులనుగా నెంచరాదు. చూడుడు. ఎంతటి ఉన్నత వ్యావహారిక శిక్షణ ఈ మంత్రము ద్వారా పతీపత్నుల సంవాదరూపమున నీయబడియున్నదియో? దీనిని చదువునప్పుడు ప్రసిద్ధాలోచనా పరుడగు రస్కిన్ శబ్దములు జ్ఞప్తికి రాకమానవు. ఏమన;

'We are foolish and without excuse foolish, in speaking of the superiority of the one sex to the other. Each completes the other and is completed by the other. The happiness and perfection of both depends on each asking and receiving from the other what the other only can give.' - Sesame and Lilies by John Ruskin p.73

అనగా; మనము స్త్రీపురుషులందెవరినో యొకరిని ఉన్నతులని నిరూపించ ప్రయత్నమొనర్చుట క్షమించరాని మూర్ఖత్వమే యగుచున్నది. ఏలన ఇరువురును ఒకరు మరియొకరిని (పరస్పరము) పూరించు కొనువారై యున్నారు. ఇరువురిప్రసన్నత్వము, మరియు పూర్ణత్వమును శక్త్యనుసారము ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకొనుటయందే గలదు.

ఇంతటి ఉన్నతభావద్యోతక మగు మంత్రములను ఆలోచించక, తెలిసికొనలేక అశ్లీలము యొక్క పరాకాష్ఠ (*Extreme obscenity*) సూచకము అని యెంచుట ఎంతగొప్ప దుస్సాహసమో చూడుడు.

**3.3 ఋషులను మన్త్రకర్తలుగా నెంచుటపై ప్రబలఆక్షేపణము.**

ఋషులను మంత్రకర్తలుగా నెంచువారిని సమాధానపరచుట అసంభవమే వారు ప్రబల ఆక్షేపణల నెదుర్కొనవలసి వచ్చును. ఒక్కొక్కమంత్రమునకు నూరుగురు వరకు ఋషులు గల అనేక మంత్రములు నున్నవి. ఉదా:-

**అగ్న ఆయూంషి పవస ఆసువోర్జమిషం చ నః ॥ ఆరే బాధస్వ దుచ్ఛునామ్** ॥ ఋ.౯.౬౬.౧౯ ॥

ఇది సామవేదమునందును, సం.౬౨౭, ౧౫౧౮, ౧౫౧౦ లలో గల ఈ యొక్క మంత్రమునకే **'శతం వైఖానసా ఋషయః'**

అనగా; నూర్గురు వానప్రస్థ ఋషులు గలరు అని. ఇరువది నాల్గక్షరముల గాయత్రీ ఛందము గల ఈ మంత్రమును నూర్గురు ఋషులు గలిసి నిర్మించిరా? ఇట్టి అసంగతము, మరియు హెడసరమునగు కల్పనను నిష్పక్ష బుద్ధిగల విద్వాంసు లెవ్వరును అంగీకరించజాలరు. కాని నూర్గురు, లేక అంతకన్న నధికులగు వానప్రస్థ ఋషులు ఈమంత్రము యొక్క రహస్యమును దెలిసికొని ప్రచారమొనర్చినారని విశ్వసించినచో ఇందేమాత్రము అసంగత విషయమనిపించదు. ఇదేవిధముగా;

**'స నః పవస్వ శం గవే శం జనాయ శమర్వతే । శం రాజన్నోషధీభ్యః** ॥ ఋ. ౯ ౧౧-౫౩ ॥

ఈసామవేద మంత్ర సం. ౬౫౩నకు **'శతం వైఖానసా ఋషయః'** అనగా నూర్గురు వానప్రస్థ ఋషులు చూపబడినారు ఋషులు మంత్ర కర్తలని తలచువారు ఈఇరువది నాల్గక్షరముల మంత్రమును నూర్గురు ఋషులు కలిసి చేసినారనియే చెప్పగలరా? ఇది సర్వధా అసంగతము, అపహాస్యాస్పదకల్పన గాదా? నూర్గురు లేక అంతకన్న నధిక ఋషుల ద్వారా మంత్రప్రోక్తభావన లేక ప్రార్థనల ప్రచారముగావించబడెనని తలచుటయందు ఆక్షేపించదగిన విషయ మేమియు నుండజాలదని స్పష్టమగును.

సర్వానుక్రమణి౯.౬౬ మరియు ఆర్షానుక్రమణి౯-౧౬ ననుసరించి ఈమంత్రములకు నూర్గురు వైఖానసా ఋషులని స్పష్టముగా ఉల్లేఖించబడినది.

**పవస్వ శతం వైఖానసా అష్టాదశ్యనుష్టుప్ పరాస్త్రిస్ర ఆగ్నేయ్యః** ॥ సర్వానుక్రమణీ ౯-౬౬॥

**అసిద్ధగోత్రాస్తు పవస్వ సూక్తం, వైఖానసా నామ శతం విదుస్తే** ॥ ఆర్షానుక్ర. ౯-౧౬ ॥

**'వైఖానసా నామ శతం విదుస్తే'** ఈశబ్దముల వల్లను నూర్గురు వైఖానస, (వానప్రస్థఋషులు) ఈమంత్రములను సంపూర్ణముగా నెరిగియుండి వానిని విశేషముగా ప్రచారమొనర్చిన కారణమున 'ఋషు' లని యెంచబడినా రని స్పష్టమగుచున్నది. ఇక ఇద్దరిద్దరు, నల్వురునల్వురు, అంతకన్న ఎక్కువఋషులు గల మంత్రము లెన్నియో యున్నవి. కావున మేము వానినిచ్చట చూపనవసరము, లేదు.

ఋగ్వేద. ౯.౧౦౭ లో 'సప్తర్షయః' ఏడ్గురుఋషు లని చూపబడినది. ఈచిన్ని సూక్తమును ఏడ్గురు ఋషులు కలిసి వ్రాసినారా?

ఋగ్వేద౧౦-౫౧-౧। ౩-౫-౭-౯ మరియు౧౦-౫౩ ''౧-౩, ౬-౧౧లందు దేవా ఋషయః'' అనగా అనేక విద్వాంసులైన గలరు, ఋషులు. ౧౦-౧౩౬నందు ఏడు మంత్రములున్నవి. అందు '**మునయో వాతరశ నాః**' అనేక ఋషిమునులు గలరు

ఋగ్వేదము ఎనిమిదవ మండలమునందలి ౩౪ వ సూక్తము యొక్క '**ఏన్ద్ర యాహి హరిభిః**' మున్నగు మూడుమంత్రముల '**వసురోచిషోఉఙ్గిరసః సహస్ర సంఖ్యాకా ఋషయః**' అనగా; యజ్ఞము ద్వారా ప్రకాశమానమగు ప్రాణవిద్య నెరుగునట్టి వేలాది ఋషులుండిరి. ఋషులను మంత్రకర్తలని యెంచువారి ననుసరించి వేలాది ఋషులుండిరి. ఋషులను మంత్రకర్తలని యెంచు వారి ననుసరించి వేలాది ఋషులు అనుష్టుప్ ఛందము యొక్క ఈ మూడు మంత్రములను కలిసి రచించినారనియే నమ్మవచ్చునా? ఈకల్పన ఎంతటి అసంగతము మరియు హాస్యాస్పదమైయున్నది? వేలాది ఋషులను మంత్రరహస్యములనెరిగిన వారని నమ్ముటయం దేలాంటి ఆక్షేపణము నుండజాలదు.

ఈవిధముగనే అనేక ఉదాహరణములు నీయవచ్చును. ఈయుదాహరణములచే ఋషులను మంత్రకర్తలుగా నమ్మువారి వాదము సంపూర్ణముగ ఖండమగుచున్నది. ఇంతేగాక వీరు మంత్రద్రష్టలనియు సిద్ధించుచున్నది.

అత్యంత ప్రబలమగు మరొక ఆక్షేపణ మేమన; ఒకేమంత్రము యొక్క ఋషి వేర్వేరు వేదములందు, మరియు నదే వేదములోను వేర్వేరు స్థలములందు వేర్వేరుగా నున్నారు. ఉదాహరణార్థము.

౧. ఋ. ౪-౫౮-౩లో '**చత్వారి శృఙ్గాస్త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య**'॥

ఈమంత్రఋషి వామదేవుడు ఈమంత్రమే యజుర్వేదము ౧౭-౯౧నందును వచ్చియున్నది. కాని దాని ఋషి 'సాధ్యాః' అనేక సాధనలొనర్చువా డని యున్నది.

**౨. శాస ఇత్థా మహాంఅస్యమిత్రఖాదో అద్భుతః।**

**న యస్య హన్యతే సఖా న జీయతే కదాచన** ॥ ఋ.౧౦-౧౫౨-౧ ॥

దీనిఋషి '**శాసః భరద్వాజః**' ఐయున్నాడు. ఈమంత్రమే అథర్వ ౧-౨౦-౪ నందును వచ్చియున్నది. అచ్చట ఈమంత్రఋషి 'అథర్వా' అని కలదు.

**౩. ముంచామి త్వా హవిషా జీవనాయ కమ్।**

**అజ్ఞాతయక్ష్మాదుత రాజయక్ష్మాత్** ॥ ఋ.౧౦-౧౬౧-౧ ॥

ఈ మంత్రఋషి '**యక్ష్మానాశనః ప్రాజాపత్యః**', అని యున్నది. ఈమంత్రమే అథర్వవేద ౩-౧౧-౧మున గలదు. అచ్చట ఆమంత్రఋషి 'బ్రహ్మ' అనిగలదు.

**౪. 'అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్॥**

ఈసుప్రసిద్ధమగు మంత్రము ఋ.౧-౧౮౯-౧ యందు వచ్చినది. దీనిఋషి అగస్త్యుడు. ఈమంత్రమే యజుర్వేద ౪౦-౧౬లో వచ్చినప్పుడచ్చట ఈమంత్రఋషి 'దధ్యఙ్‌జాథర్వణ' యని యున్నది

**౫. 'చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః॥**

**ఆ ప్రా ద్యావాపృథివీ అన్తరిక్ష౨ం సూర్య ఆత్మాజగతస్తస్థు షశ్చ స్వాహా** ॥ ఋ. ౧-౧౧౫-౧ ॥

దీనిఋషి 'కుత్స ఆఙ్గిరసః' యైయున్నాడు. యజు.౧౩-౪౬ నందు దీని ఋషి 'సాధ్యాః, మరియు ప్రజాపతిః యని గలదు అథర్వ ౧౩-౨-౩౫ యందు దీని ఋషి బ్రహ్మ, మరియు ప్రజాపతిఃయని గలదు అథర్వ ౩౧౩-౨-౩౫ లో దీని ఋషి బ్రహ్మలు మరియు అథర్వ. ౨౦-౧౦౭-౧౪ లో సూర్యః, దేవీ, కుత్సః। అనియును కలదు.

**౬. వేనస్తత్పశ్యన్నిహితం గుహా సద్ యత్ర విశ్వం భవత్యేకనీడమ్।**

**తస్మిన్నిదం సం చ వి చైతి సర్వం స ఓతః ప్రోతశ్చ విభూః ప్రజాసు ॥**

ఈ యజుర్వేదము ౩౫-౮నందు **'స్వయంభూ బ్రహ్మ'** ఋషియైయుండ, అథర్వ ౨-౧-౨ లో **'వేనః'** ఋషియైయున్నాడు

**౭. హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్।**

**స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ** ॥ ఋ.౧౦-౧౨౧-౫ ॥

దీని ఋషి 'హిరణ్యగర్భః ప్రాజాపత్యః' అనియు, యజు. ౩౨-౬ నందు

దీనిఋషి 'స్వయంభు బ్రహ్మ' యైయున్నాడు.

**౮. సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్। ఆస్మిన్ హవ్యా జుహోతన ॥**

దీనిఋషి ఋగ్వేదమునందు ౮-౪౪-౧ లో **'విరూపఆదిత్య'** అనియుండగా యజుర్వేద ౩-౧ యందు **'అగ్ని'** యని యున్నది.

**ఒకేవేదమునందు భిన్నస్థానములందు ఒకేమంత్రమునకు భిన్న భిన్న ఋషులు: -**

ఒకేవేదమునందు అనేకస్థలములందు ఒకేమంత్రమునకు అనేకఋషుల పేర్లుగలవు. ఈ యుదాహరణములను చూడుడు.

**ఆపః పృణీత భేషజం వరూథం తన్వే మమ। జ్యోక్ చ సూర్యం దృశే॥**

**ఇదమాపః ప్రవహత యత్కిం చ దురితం మయి॥**

**యద్వాహమభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్ ॥**

**ఆపో అద్యాన్వచారిషం రసేన సమగన్మహి।**

**పయస్వానగ్న ఆగహి తం మా సంసృజ వర్చసా ॥**

ఈమూడు మంత్రములు ఋగ్వేద ౧-౨౩-౨౧ నుండి ౨౩ వరకు గలవు. అచ్చట వీని ఋషి మేధాతిథి కాణ్వుడు. కాని దశమమండల ౯ వ సూక్తమునందును ఈమంత్రములు ౭నుండి ౯ వరకు గలవు. అచ్చట వీనిఋషి

'త్రిశిరాస్త్వాష్ట్రః సిన్ధుద్వీపో వావ్బరీషః' అని యున్నది. ఈభేదము గల మంత్రములు ఋషికృతములని విశ్వసించువారు ఎట్టి వ్యాఖ్య నొనర్పగలరు? వారేమి సమాధాన మీయగలరు? ఈమంత్రములను మొదట మేధాతిథి కాణ్వుడు చేసి యుండెను, తరువాత త్రిశిరా మరియు సిన్ధుద్వీపులను వారు దొంగిలించి తమనామములపై ప్రసిద్ధి జేసికొనినా రని చెప్పగలరా? ఇట్టి కల్పనలు నిరంతర మన్యాయ సూచకములు, మరియు ఋషులపై అసత్యమగు ఆరోపణలు గలిగించునట్లు గాదా? **''ఋషయోమన్త్రద్రష్టారః- ఋషిర్దర్శనాత్ స్తోమాన్ దదర్శేతి''** అను నాధారములను మొదటనే చూపియుంటిమి. ఇందువల్ల ఋషులను మంత్రకర్తలు గాక మంత్రద్రష్టలని నమ్మటవల్లనే విషయము స్పష్టమగును. ఒకే మంత్రరహస్యమును, మరియు భావమును ప్రచారమొనర్చువా రనేక ఋషులైనారు. అట్లుకాగలరుకూడా.

**౨. 'ఇడా సరస్వతీ మహీ తిస్రో దేవీర్మయోభువః। బర్హిః సీదన్త్వస్రిధః॥'**

ఈమంత్రము ఋగ్వేదము. ౧-౧౩-౯లోగలదు. అచ్చట ఈమంత్రఋషి 'మేధాతిథి' అనికలదు. ఈమంత్రమే ౫-౫-౮ లోను వచ్చియున్నది. అచ్చట దీని ఋషి '**వసుశ్రుత ఆత్రేయః**' అని యున్నది. వేదమంత్రములు ఋషికృతములని నమ్మువారిప్పుడేమనెదరు? ఈమంత్రమును మొదట '**మేధాతిథికాణ్వుడు**' చేసియుండెను, తరువాత వసుశ్రుతిఆత్రేయుడు దానిని దొంగిలించి తన పేర ప్రసిద్ధ పరచుకొనినాడని చెప్పెదరుకదా? ఔనా! 'సాక్షాత్కృతధర్మలైన' ఋషుల విషయములో ఇట్టి కల్పనలనొనర్చుట ఉచితమగునా? స్వయముగ పాఠకులే నిర్ణయించుకొనవలయును.

**౩. 'విశ్వాహేన్ద్రో అధివక్తా నో అస్త్వపరిహ్వృతాః సనుయామ వాజమ్।**

**తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥**

ఈమంత్రము ఋగ్వేదము యొక్క మొదటిమండలమందు రెండు సార్లు వచ్చియున్నది. ౧-౧౦౦-౧౯ లో దీనికి 'వృషాగిరో మహారాజస్య వార్షాగిరా ఋజ్రాశ్వామ్బరీషసహదేవభయమానసురాధసః' అను ఐదుగురు ఋషులు చూపబడినారు. ఈమంత్రమే౧-౧౦౨-౧౧ లో వచ్చినప్పుడు మొదటి ఐదుగురు ఋషుల స్థానములో 'కుత్స ఆఙ్గిరస' ఋషులు గలరు. ఈమంత్రమును మొదటి ఋషులు చేయగా రెండవవారు తమపేర ప్రచారమొనర్చుకొనినారని తోచును గదా! కావున ఋషులను మంత్రకర్తలుగా కాక మంత్రద్రష్టలని, ఒకేమంత్రమును అనేకులు ప్రచారమొనర్చియుండి రనుటలో ఎట్టిఆక్షేపణ ముండదు.

**౪. 'ఇడామగ్నే పురుదంససనిం గోః శశ్వత్తమం హవమానాయ సాధ।**

**స్యాన్నః సూనుస్తనయో విజావాగ్నే సా తే సుమతిర్భూత్వస్మే** ॥ ఋ.౩-౧-౨౩ ॥

ఇప్పుడు ఋషులను మంత్రకర్తలని నమ్మువారి తమాశాను చూడవచ్చును. ఋగ్వేదము మూడవ మండలము నందీమంత్రము అనేకతడవలు వచ్చియున్నది. ౩-౧-౨౩ లో ఈమంత్రఋషి 'గాథిన విశ్వామిత్ర' అనియుండగా, ౩-౧౫-౩లో దీని ఋషిగాథిన విశ్వామిత్రకు మారుగ 'ఉత్కీల కావ్య' అనిగలదు. ౩-౨౨-౫ లో దీని ఋషి గాథి, మరియు ౩-౨౩-౫లో దీనికి భరతకులోత్పన్న దేవశ్రవా, మరియు దేవరాత యను ఇరువురు ఋషులు

గలరు. (దేవశ్రవా దేవవాతశ్చ భారతావృషీ) మిగతా నాల్గుస్థానములు ఋ.3-౫-౧౧, 3-౬-౧౧, 3-౧౦-౧౧, మరియు సామవేదము ౫-౧-౧-౮-౪ లో విశ్వామిత్ర ఋషిగలడు.

మంత్రములను ఋషికృతము లనువారిప్పుడేమనెదరు? విశ్వామిత్రుడీ మంత్రమును రచించినాడు. నాలుగు స్థానము లందాయన పేరే వచ్చియున్నది. కాని ఒకసారి ఆతనితండ్రియగు గాథి పుత్రుని మంత్రమును దొంగలించి తనపేర ప్రసిద్ధి చేసికొనినాడు, తరువాత ఉత్కీల, వాత్య, దేవశ్రవా, దేవవాత నామములుగల ఋషులు ఎట్లోదానిని దొంగిలించుకొని తమపేర ప్రసిద్ధ పరచుకొని నారనియే యందురా? ఋషుల నీవిధముగా చోరులు, కపటులు, దురాశాపరులు, లోకేషణము గలవారని తలచుటఉచితమగునా?

**౫. 'విశ్వేదేవాస ఆగత శృణుతా మ ఇమం హవమ్। ఏదం బర్హిర్నిషీదత॥**

ఈ ఋగ్వేద ౨-౪-౧-౧ మంత్రఋషి 'గృత్సమద' యైయున్నాడు మరియిదే మంత్రము ఋ ౭-౫౨-౭ లో వచ్చినప్పుడు 'గృత్సమద' ఋషికి మారుగ 'ఋజిష్వ' యైయున్నాడు. ఋషులను మంత్రకర్తలని నమ్మువారీయంతరమును గాంచి ఋషులు దొంగలు మోసగాండ్రనియనుకొందురో?

**౬. 'రాజ్ఞో నుతే వరుణస్య వ్రతాని బృహద్గభీరం తవ సోమ ధామ।**

**శుచిష్ట్వమసి ప్రియో న మిత్రో దక్షాయ్యో అర్యమేవాసి సోమ'॥** ఋ. ౧-౯౧-3 ॥

ఈఋగ్వేదమంత్రఋషి '**గోతమో రాహూగణః**' కాగా ఈవేదమునన్ ౯-౮౮-౮ నందు పైదానికి మారుగా '**ఉషనాః కావనిః**' అని వ్రాయబడియున్నది.

**౭. 'యచ్చిద్ధి శశ్వతామసీన్ద్ర సాధారణస్త్వమ్। తం త్వా వయం హవామహే ॥'**

ఈ ఋగ్వేద ౮-౬౫-౭ వ మంత్రఋషి '**ప్రగాథః కాణ్వః**' కాగా ఇదే వేదమంత్రము ౪-3౨-౧3 లో దీని ఋషి వామదేవుడైయున్నాడు.

**౮. 'పురోడాశం చ నో ఘసో జోషయాసే గిరశ్చ నః। వధూయురివ యోషణామ్॥**

ఈమంత్రము ఋ.3-౫3-3 లో వచ్చి యున్నది. ఇచ్చట దీనిఋషి 'విశ్వామిత్రుడు' ఈమంత్రమే ఋ.౪.3౨-౬ యందు వచ్చినప్పుడు దీని ఋషిఇచ్చట 'వామదేవు' డైనాడు. ఈభేదము ఋషుల మంత్రకర్తృత్వ వాదమునందు అనుకరణ, చోరత్వఆరోపణముగాక మరే వ్యాఖ్యయును గాజాలదు.

**౯. 'యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।**

**తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః ॥**

ఈఋగ్వేద ౧-౧౬౪-౫౦ మంత్రఋషి ఇచ్చట దీర్ఘతమా ఔచథ్య యైయుండగా ఈమంత్రమే ౧౦-౯౦-౧౬ న వచ్చినప్పుడు ఋషి 'నారాయణు' డైయున్నాడు.

**౧౦. 'అపశ్యం గోపామనిపద్యమానమా చ పరా చ పథిభిశ్చరన్తమ్।**

**స సధ్రీచీః స విషూచీర్వసాన ఆవరీవర్తి భువనేష్వన్తః'** ॥ ఋ.౧-౧౧౬-3౧ ॥

ఈమంత్రము ఋ.౧-౧౬౩-౩౧లో దీనిఋషి 'దీర్ఘతమా ఔచథ్య' యైయుండగా ఋ.౧౦-౧౭౭-౩ యందు ఇదేమంత్రమునకు 'పతఙ్గ ప్రాజాపతి' ఋషియైయున్నాడు.

**౧౧. 'తవాగ్నే హోత్రం తవ పోత్రమృత్వియం తవ నేష్ట్రం త్వగ్నిదృతాయతః ।**

**తవ ప్రశాస్త్రం త్వమధ్వరీయసి బ్రహ్మా చాసి గృహపతిశ్చ నో దమే'॥**

ఈమంత్రము ఋ.౨-౧-౨లో దీనికి ఋషి '**అఙ్గిరసః శౌనహోత్రో భార్గవో గత్సమదః**' కాగా ఇదేమంత్రము ఋ.౧౦-౯౧-౧౦ లో వచ్చినప్పుడు దీని ఋషి '**అరుణవైతహవ్యః**' అనివ్రాయబడియున్నది.

**౧౨. పురుత్రా హి సదృఙ్ఙసి విశో విశ్వా అను ప్రభుః । సమత్సు త్వా హవామహే ॥**

ఋ.౮-౧౧-౮ ఋషి 'వత్సః కణ్వః' అనియుండ, ఋ. ౮-౪౩-౧౧లో ఇదే మంత్రమునకుప ఋషి 'విరూపః ఆఙ్గిరసః' అని కలదు.

**౧౩. మరుత్వన్తం వృషభం వావృధానమకవారిం దివ్యం శాసమిన్ద్రమ్ ।**

**విశ్వాసాహమవసే నూతనాయోగ్రం సహోదామిహం తం హువేమ ॥ ఋ.౩-౪౭-౫॥**

ఈమంత్రమునకు ఋగ్వే.౩-౪౭-౫ లో 'విశ్వామిత్ర' ఋషి కాగా, ఇదే మంత్రము ఋ. ౨-౧౯-౧౧ నకు దీనిఋషి 'భరద్వాజు' డైనాడు

**౧౪. 'అవస్య మదిన్తమ పవిత్రం ధారయా కవే । అర్కస్య యోనిమాసదమ్ ॥ ఋ.౯-౨౫-౬ ॥**

ఋగ్వేదము. ౯-౨౫-౬ మంత్రఋషి '**దృఢచ్యుత అగస్త్య**' అనికలదు. ఇదే ఋ. ౯-౫౦-౪ మంత్రమునకు ఋషి '**ఉచథ్య ఆఙ్గిరస**' యని యున్నది. ఋషుల మంత్రకర్తృత్వవాదము ననుసరించి దీనికి సంతోషకరమగు వ్యాఖ్య గాజాలదు.

**౧౫ 'ఇహ త్యా సధమాద్యా హరీ హిరణ్యకేశ్యా । వోళ్హామభి ప్రయో హితమ్'॥**

ఈ ఋ.౮-౩౨-౨౯ యందు దీనిఋషి '**మేధాతిథికణ్వ**' అనిగలదు. ఈమంత్రమే ఇదే ఋ-౮-౯౩-౨౪ లో ఋషి '**సుకక్ష ఆఙ్గిరస**' యైయున్నది ఋషి భేదముల ఈ వ్యాఖ్య ఋషుల మంత్రకర్తృత్వము ననుసరించి వారికై చౌర్యము, కపటత్వము నారోపించుట జరుగదు

**౧౬ ఇన్ద్రః సుత్రామా స్వవాం అవోభిః సుమృడీకో భవతు విశ్వవేదాః ।**

**బాధతాం ద్వేషో అభయం కృణోతు సువీర్యస్య పతయః స్యామ ॥ ఋ.౪-౪౭-౧౨ ॥**

ఈ మంత్రము ఋగ్వే ౪-౪౭-౧౨లో వచ్చినది అచ్చట దీని ఋషి గర్గ అనియున్నది. ఇదే ఋ. ౧౦-౧౩౧-౬లో దీని ఋషి '**సుకీర్తి కాక్షీవత**' అని గలదు. ఈ మంత్రమే అథర్వ ౭-౯-౧-౧ లో వచ్చినప్పుడు దీని ఋషి 'అథర్వా' యైనది. ఐతే ఈ మంత్ర రచన మొదట గర్గుడు చేయగా తరువాత అథర్వుడు దొంగలించి తన పేర ప్రసిద్ధపరచుకొనినాడనియే తలచవలెనా? ఇట్టి కల్పన ఋషులపై ఘోరమగు ఆరోపణమొనర్చుటయే యగును. మంత్రకర్తలని ఎంచక మంత్రద్రష్టలని యెంచినచో ఒకే మంత్రమునకు ముగ్గురు నల్వురు పది

పదునైదేయేమి 'అఙ్గిరసః సహస్ర సంఖ్యాకా ఋషయః' ననుసరించి వేయిమంది ఋషుల వరకు నమ్మినను ఎలాంటి ఆపత్తియు గలుగజాలదు.

**౧౭. ఆ భారతీ భారతీభిః సజోషా ఇడా దేవైర్మనుష్యేభిరగ్నిః ।**

**సరస్వతీ సారస్వతేభిరర్వాక్ త్రిస్రో దేవీర్బర్హిరేదం సదన్తు॥'**

ఈమంత్రము, మరియు దీనితరువాయి 'తన్నస్తురీమఘ పోషయిత్ను;, వనస్పతేఽవ సృజోపదేవాన్; ఆయాహ్యగ్నే సమిధానో అర్వాఙ్' ఈమూడు మంత్రములు ఋగ్వే. 3-4-8 నుండి 11లో వచ్చియున్నవి. వీని ఋషి విశ్వామిత్రుడు ఒకే మంత్రము ఋషి 7-3-11 లో గలవు. అచట ఋషి విశ్వామిత్రునికి మారుగా వసిష్ఠుడైనాడు. ఋషులను మంత్రకర్తలని నమ్మువారి ననుసరించి ఏమని తలచవలయును? ఈమంత్రములను విశ్వామిత్రుడు రచించియుండెను. వసిష్ఠునకు విశ్వామిత్రుడు విరోధియగు కారణమున ఎట్లోయా మంత్రములను తస్కరించి తనపేర ప్రసిద్ధపరచుకొని నాడనియే తలచవలయునా? **'ఋషిర్దర్శనాత్ స్తోమాన్ దదర్శ'** ననుసరించి విశ్వామిత్ర వసిష్ఠ లిరువురును ఈమంత్రముల ఋషులనినమ్ముటలో ఏయాపత్తియు నుండ జాలదు ఇట్టివే అనేక ఉదాహరణము లీయవచ్చును. ఒకే వేదము, ఒకే మండలమునందలి ఒకే మంత్రమునకు ఋషులు వేర్వేరుగానున్నారు. దీనివ్యాఖ్య ఋషులు మంత్రకర్తలని నమ్మునప్పుడు సాధ్యముకాదు ఋషులు మంత్రద్రష్టలు మాత్రమే అని విశ్వసించినప్పుడు సరళముగా జేయవచ్చును.

### 3.4 ఋషులనగా నెవరు?

ఇప్పుడిచ్చట ఋషులనగా నెవ్వరు? అను విషయముపై ధ్యానమునుంచుట యోగ్యమనిపించుచున్నది. యజుర్వేద 34-49వ మంత్రములో ఋషుల లక్షణము అత్యుత్తమ రూపమున గాన్పించును. అది ఈదిగువరూపమున గలదు.

**సహస్తోమాః సహచ్ఛన్దస ఆవృతః సహ ప్రమా ఋషయః సప్త దైవ్యాః ।**

**పూర్వేషాం పన్థామనుదృశ్య ధీరా అన్వాలేభిరే రథ్యో న రశ్మీన్॥** యు34-49॥

ఈమంత్రము నందు ఋషుల గుణములను గూర్చి ఇట్లుసూచింపబడినది.

**(సహస్తోమాః)** ఎవరి ప్రవర్తనము శాస్త్రసమ్మతముగా ప్రశంసనీయమైయుండునో,

**(సహచ్ఛన్దసః)** వేదాదుల యధ్యయనము నిరంతర మెవరియందుండునో,

**(ఆవృతః)** బ్రహ్మచర్యముతో సమస్త విద్యలను చదివి గురుకులమునుండి సమావర్తనమై వచ్చియుందురో,

**(సహప్రమాః)** ప్రమాణాదుల యథార్థజ్ఞానమెవరియందుండునో.

**(సప్తదైవ్యాః)** పంచజ్ఞానేంద్రియములు, అంతఃకరణము, మరియు ఆత్మ ఎవరియందు అత్యంత దివ్యమైనదిగా. పవిత్రముగా నుండునో మరియు ఉత్తమగుణకర్మ స్వభావము లందు ప్రవీణత గల ధ్యాన మెవరియం దుండునో,

**(ఋషయః)** కేవలము వేదజ్ఞాతలై యుండుటయే గాక వేదముల యథార్థద్రష్టలై, వాని రహస్యములను సాక్షాత్కారమొనర్చుకొని వాని యుపదేశమొనర్చు ఋషుల విషయములో మంత్రము నందిట్లు వ్రాయబడియున్నది. అనగా సారథి అశ్వముల కళ్లెములను గ్రహించి నడుపునట్లు పూర్వజులగు విద్వాంసుల మార్గమును **(అనుదృశ్య)** వివేకపూర్వకముగా అనుకూలముతో జూచి **(అన్వాలేభిరే)** అట్టి సత్యమార్గమునే అవలంబించుచుందురు. అదేవిధముగా ఎల్లరును ఆయాప్త విద్వాంసులు మార్గములందు నడువవలయును.

ఈమంత్రము యొక్క భావార్థము వైదికధర్మోద్ధారక శిరోమణి యగు మహర్షి దయానందుల శబ్దములలో నీ విధముగ నున్నది. రాగద్వేషాది దోషములను వదలి పరస్పరము ప్రీతిగలిగియుండువారు, బ్రహ్మచర్యపూర్వకముగా ధర్మము ననుష్ఠించుచు అర్థ భావయుక్తముగా వేదజ్ఞానము నెరిగినవారు, సత్యాసత్యముల నిశ్చయమొనర్చి సత్యమునే గ్రహించి అసత్యమును వదలి ఆప్తులభావము ననుసరించి ప్రవర్తించువారు. సుశిక్షితసారథులవలె అభీష్టధర్మయుక్త మార్గమునందు సమర్థవంతముగా ప్రయాణ మొనర్చువారు అట్టి వారే ఋషులనిపించుకొనెదరని వ్రాసినారు.

ఇందువల్ల ఋషులు మంత్రకర్తలుగారు. కాని వేదాధ్యయన, మననము లొనర్చుచు వాని ద్రష్టలు, లేక రహస్యవేత్తలగుదురు. వారి కంటె పూర్వమే ఛన్దము మరియు వేదములు విద్యమానములై యుండును. ఆమంత్రములను వారు సాక్షాత్కారమొనర్చు కొనుచుండిరి.

ముణ్డకోపనిషత్తు ౫-౩ లో ఋషుల లక్షణమిట్లు తెలుపబడియున్నది.

**సమ్ప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః ।**

**తే సర్వగం సర్వతః ప్రాప్య ధరా యుక్తాత్మానః సర్వమేవావిశన్తి॥**

అనగా; సర్వవ్యాపక పరమాత్మ అనుభూతిని సర్వత్ర పొందుచు జ్ఞానముతో తృప్తులు, రాగహితులు, సదాఆనందితులు, అత్యంత శాంత స్వభావములు గలవారలైయుండువారు ఋషులని యనబడుదురు.

దీని ననుసరించియే నిరుక్తమునందు యాస్కాచార్యులిట్లు చెప్పియున్నాడు.

**సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుః** ॥ నిరుక్త ౧-౧౯॥

ధర్మముయొక్క ముఖ్యలక్షణమును మీమాంసాశాస్త్రానుసారము,

**'చోదనా లక్షణో ఽర్థో ధర్మః'** అనగా వేదవిహిత మైనదే ధర్మము. అట్టి ధర్మమును సాక్షాత్కారమొనర్చుకొనువారే ఋషులగుదురు.

భ్రాంతి వశమున ఇట్టిఋషులను మంత్రకర్తలని నమ్మి, మరియు నామంత్రములకైనను అత్యంత అశుద్ధార్థమును విశ్వసించి శ్రీ కృష్ణయ్యాలాల్ మున్షీ గారు భారతీయ సంస్కృతిని ప్రేమించువాడు, *Vedic Age* అను పుస్తకమునకు భూమికను వ్రాసినవాడు, మరియు దాని ప్రేరకుడు ఋషుల సంబంధములో 'లోపాముద్ర' యనుపేరుగల తన పుస్తకమునందు యథార్థరహితము, భ్రాంతి పూర్ణమునగు విషయములను వ్రాసినాడు.

ఇదిగాంచిన మాకు అత్యంత ఆశ్చర్యము మరియు బాధగలిగినది. ఆయన తన 'లోపాముద్ర' యొక్క భూమికయందిట్లు వ్రాసినాడు. 'ఋషులు చప్పిటి ముక్కుగల వారు, కారునలుపు వారు, దాసీదాస జనమును భిక్షనడుగువారు, దానములనుగొనువారు, సోమరసమును ద్రావి మత్తులో పడియుండువారు, లోభ, క్రోధములను ప్రదర్శించువారు, గోవుల దానమునిచ్చువారిని ప్రశంసించువారై యుండిరి. వారప్పుడప్పుడు ద్వేషముతో రెచ్చిపోయి నిప్పుల గ్రక్కుచుండిరి. ఒకరిపై నొకరు దేవతాక్రోధమును ప్రయోగించు ప్రయత్న మొనర్చు చుండిరి.

యువతీయువకులు తమ హావభావములతో పరస్పరము ఆకర్షించుకొనుచుండిరి. ఋషులు రూపవతులగు స్త్రీలను ఆకర్షించుకొనుటకై మంత్రములను రచించుచుండిరి ఇత్యాదులు. (లోపాముద్ర భూమిక. ౯.౧౦ వ పుటలు)

ఆర్యుల ఘృణిత (అసహ్యించుకొనదగిన) రూపము సీపుస్తకము నందు చిత్రించినారు. వాని నుదాహరించుటకు మాకు కడు లజ్జగానున్నది. ఐనను ప్రకరణాను సారముగా ప్రమాణయుక్తముగా వాని నిస్సారతను, యథార్థరహితమును చూపుటకు ప్రయత్నించెదము. ప్రసంగవశమున నిచ్చట మేము ఋషుల విషయములో గలిగించబడిన భ్రాంతిని గూర్చి దిగ్దర్శనమొనర్చెదము. పాఠకజనుల విషయములో పైన సీయబడిన (వేదముల, ఉపనిషత్తుల నిరుక్తము మున్నగు ప్రమాణ గ్రంథములు ఋషి విషయ లక్షణములను నిష్పక్ష భావముతో పోల్చినచో) ఋషుల విషయములో వారి కల్పన ఎంతహేయమైనదో స్పష్టపడగలదు. వేదవేత్తలు, మరియు బ్రహ్మవేత్తలునగు ఋషుల విషయములో '**జ్ఞానతృప్తాః, కృతాత్మానః, వీతరాగాః, ప్రశాన్తాః, సాక్షాత్కృతధర్మాణః**' మున్నగు విశేషణములు వేదములు, ఉపనిషత్తులు, మరియు నిరుక్తము మున్నగు నామములు ఆర్షగ్రంథము లందీయబడిన లోపాముద్ర యను పుస్తకమున చూపబడినట్లు వారు లోభులు, క్రోధాత్ములు, కామికులే యగుదురా? ఆర్యావర్త్ కీ మహాగాథ అను ఒక పుస్తకము ప్రకటితమైనది. దాని ప్రకాశకులు భూమికయందిట్లు వ్రాసియున్నారు. 'ఆర్యావర్త్‌కీమహాగాథ' యనుపేర మున్షీగారు మూడుఖండములందు వైదికకాలీన ఆర్యసంస్కృతి యొక్క అస్పష్ట ఇతిహాసమును సుస్పష్టపరచినారు. దీనియందు వైదికసభ్యత, మరియు సంస్కృతులను చాలచక్కనిరూపములో చిత్రణ మొనర్చినారు------మున్షీగారి ఇతర సమస్తకృతుల వలె ఈపుస్తకముకూడా అత్యద్భుతము, మరియు అతిరసమయమునై యున్నది. అని ఏమేమో వ్రాసినారు.

ఋషుల చరిత్రనిట్లు దూషితముగా నిరాధారముగా చిత్రణమొనర్చుట అత్యంత నిందనీయము. 'ఋషులు రూపవతులగు స్త్రీల నాకర్షించుటకై మంత్రరచన నొనర్చు చుండి' రనుట ఋషుల యెడ ఘోరమగు అవమానజనకమగు అపవాదము. దీనిని నిరూపించుట కొక్క ప్రమాణముకూడ ఈయిలేదు. ఇట్టినిరాధార రచనలు వారి బలహీనతను స్పష్టపరచుచున్నవి గదా!

### 3.5 'సోమ' శబ్దమునకు అనేకార్థములు.

'ఋషులు సోమ రసమును ద్రావి కైపులో మత్తెక్కియుండెదరను, లేఖకుని ఈకథనము సైతము సంపూర్ణముగా అసత్యమైయున్నది'. ఒకవేళ 'సోమ' యను దానియర్థమును లేఖకులు మాదక పేయ విశేష

మనియు, ఋషులు దాని మత్తులో నిమగ్నులైయుందురనుట ఎంతటి అవివేకమో చూడుడు. వాస్తవముగా వేదములందు సోమశబ్దమును.

**త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వం గాః ।**

**త్వమాతతన్థోర్వన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ** ॥ఋగ్.౯౧.౨౨. సామ.పూర్వార్చిక.అ.౬.ఖ.3.మం.3॥

**'సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః ।**

**జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేన్ద్రస్య జనితోత విష్ణోః** ॥ ఋ.౯-౯౬-౫,సామ.పూ.౫-౯-౫ ॥

**'అయం పూషా రయిర్భగః సోమః పునానో అర్షతి ।**

**పతిర్విశ్వస్య భూమనో వ్యఖ్యద్ రోదసీ ఉభే** ॥ ఋ.౯-౧౦౧-౭, సా.పూ.౫-౮-౨॥

**పవస్వ సోమ మహాన్ సముద్రః పితా దేవానాం విశ్వాభిధామ** ॥ ఋ.౯-౧౦౯-౪,సామ,పూ,౪-౯-౩॥

**విశ్వా ధామాని విశ్వచక్షఋభ్వసః ప్రభోస్తే సతః పరియన్తి కేతవః ।**

**వ్యానశీ పవసే సోమ ధర్మణా పతిర్విశ్వస్య భువనస్య రాజసి** ॥ ఋ.౯-౮౬-౫ సామ.ఉత్తరార్చిక ౫-౧-౩ ॥

ఋగ్వేద. ౯-౧౦౧-౭, సామవేద, పూర్వార్చిక ౫-౮-౨ మున్నగు మంత్రములందు పరమేశ్వర వాచకము స్పష్టముగా నున్నది. దీనిని ఓషధి, జలము, అంతరిక్షము, పృథివి, ఆకాశము, అగ్ని, సూర్యుడు, వాయువు మున్నగు వాని ఉత్పాదకుడు, ప్రకాశకుడు, మరియు ఈవిశాలవిశ్వమునకు స్వామి, మరియు సర్వవ్యాపకుడని చూపబడియున్నది. ఈవిషయములో 'హేసోమ!' నీవు సకల ప్రపంచమునకు స్వామివై (రాజవై) యున్నావు. (పతిర్విశ్వస్య భువనస్య రాజసి) నీవు సర్వజ్ఞుడవు, సర్వద్రష్టవు, సర్వవ్యాపకుడవు. మహాప్రభువువు, మరియు గుణములందు మహాసముద్రమువై, సకల దేవతలకు తండ్రి వియునైయున్నావు మమ్ము పవిత్ర పరచుము. అని చెప్పబడియున్నది'

ఎంతటి మూర్ఖాతి మూర్ఖుడైనను, ఆటవికుడైనను 'సోమ' మను పేరుగల వనస్పతి, లేక ఓషధి విషయమున ఇట్టిమాట లనుటకు సాహసించగలడా? వేదముల ననుసరించి 'సోమ' శబ్దము పరమాత్మ వాచకమైయున్నది. ఇందణుమాత్రమును సందేహము లేదు. ఈసోమశబ్దము పరమాత్మ వాచకముగుటవలన పరమేశ్వరుని యెడ జ్ఞానమయ భక్తికిని వాచకమైయున్నది. ఇది నిష్పాక్షికబుద్ధితో వేదముల నధ్యయన మొనర్చునప్పుడే స్పష్టముగా జ్ఞాతమగును.

**పవస్వ మధుమత్తమ ఇన్ద్రాయ సోమ క్రతువిత్తమో మదః ।**

**మహి ద్యుక్షతమో మదః** ॥ ఋ. ౯-౧౦౮-౧ ॥

ఇందు సోమము 'మధుమత్తమ' అనగా; అత్యంత మధురయుక్తమగు మైమరపు (తన్మయత్వము) నుత్పన్నమొనర్చునదై యున్నదని చెప్పబడినది. కాని యది సారాయివలె ప్రాకృతిక మత్తు కాదు. కాని దానిని ఆత్మకొరకు (ఇన్ద్రాయ) 'క్రతువిత్తమ' అనగా; ఉత్తమ జ్ఞానమును ప్రాప్తింపజేయువానియందు శ్రేష్ఠము, లేక

శ్రేష్ఠ సంకల్పమును గలిగించువానిలో శ్రేష్ఠమైనది. అత్యధిక యశోవంతమొనర్చునట్టి ఆధ్యాత్మికమత్తు (తన్మయత్వము) 'మహిద్యుక్షతమో మదః' ఈరూపమున వర్ణించబడియున్నది. దానిని సారాయి మున్నగు వానివలె ఏదో ఒకవస్తువని నమ్ముట గొప్పపొరపాటు. 'సోమ' అనుదాని వర్ణన మీవిధముగా నున్నది.

**'శుచిః పావక ఉచ్యతే సోమః సుతః స మధుమాన్। దేవా వీరఘశంసహా**

॥ ఋ. ౯-౨౪-౭, సామ, ఉత్త ౬-౨-౭ ॥

అనగా; ఈసోమము స్వయముగ పవిత్రమైనదేగాక ఇతరులను సైతము పవిత్రపరచునట్టి (పావకః) మరియు (మధువాన్) మాధుర్యముచే నిండియున్న (దేవావీః) దివ్య గుణములను పెంపొందించు, మరియు (అఘంశంసహా) పాప భూయిష్ఠమగు భావనలను నశింప జేయునదైయున్నది.

ఈవర్ణనము సారాయివంటి మాదకద్రవ్యముల సంబంధము గాదు. కానియది విజ్ఞానమయ భక్తికి సంబంధించిన పవిత్ర, మరియు పావన ఆధ్యాత్మిక వర్ణనమై యున్నదని స్పష్టమగుచున్నది.

ఇదేవిధముగా ఋ.౯-౯౩-౩౬, సామ,ఉత్తరార్చిక ౪-౪-౬యొక్క 'సోమ' విషయిక దిగువవర్ణనయును ఈవిషయమున అత్యధిక స్పష్టముగా నుండు కారణమున ఉల్లేఖించదగినదై యున్నది. దీనియందు,

**ఏవా నః సోమ పరిషిచ్యమాన ఆ పవస్వ పూయమానః స్వస్తి।**

**ఇన్ద్రమా విశ బృహతా మదేన వర్ధయా వాచం జనయా పురన్ధిమ్** ॥ ఋ౯-౯౭-౩౬, సామ. ఉత్త,౪-౩-౬॥

ఇందు 'సోము' ని సంబోధించుచు హేపరమాత్మ! నీవు మమ్ము అన్నివైపులనుండి పవిత్ర పరచుము. నీయొక్క మహోన్నత మత్తుతో ఇన్ద్రుని (జీవాత్మ) యందు ప్రవేశించుము. మావాణి శక్తిని వృద్ధిపరచుము, మరియు మాయందు ఉత్తమబుద్ధి నుత్పన్నమొనర్చుము.

బుద్ధినాశకమగు సారాయి విషయము నందిట్టివర్ణనము సదా అసంగతమే యగును. ఇందు స్పష్టముగా జ్ఞానమయ భక్తిభావము యొక్క ఆధ్యాత్మిక 'మత్తు' ను గూర్చిన వర్ణనయే యున్నది. అదియే ఉత్తమబుద్ధి నుత్పన్నమొనర్చి వాణి మున్నగువాని శక్తులను వృద్ధిపరచి మానవులను పవిత్రపరచును.

**త్వం హ్యాఙ్గ దైవ్యం పవమాన జనిమాని ద్యుమత్తమః।**

**అమృతత్వాయ ఘోషయన్** ॥ ఋ ౯-౧౦౮-౩, సా.పూ.౫-౧౧-౬ ॥

ఈ సోమ విషయక వర్ణనము కూడా ఈ ప్రసంగము అత్యధిక స్పష్టమైయుండు కారణమున నిచ్చట ఉల్లేఖించబడుచున్నది. హే సోమ! నీవు! (పవమాన) సర్వమును పవిత్ర పరచువాడవు. (ద్యుమత్తమ) అత్యంత ప్రకాశమానుడవు. మానవ జన్మమును దివ్యపరచుచు దానికొరకు అమృతత్వ ఘోషణ మొనర్తువు ఈ సోమము జ్ఞానమయ భక్తి భావమై యున్నది. ఇందేమాత్రమును సందేహము లేదు. ఇదే విధముగ;

**౧. శుక్రః పవస్వ దేవేభ్యః సోమ దివే పృథివ్యై శం చ ప్రజాభ్యః** ॥ ఋ. ౯-౧౦౯-౫ ॥ మున్నగు

**౨. దివో ధర్తాసి శుక్రః పీయూషః సత్యే విధర్మన్ వాజీ పవస్వ** ॥ ఋ. ౯.౧౦౯-౬ ॥

**3. ఋతేన య ఋతజాతో వివావృధే రాజా దేవ ఋతం బృహత్‌। ఋ.౯-౧౦౮-౮॥**

ఇంకా ఇతర వందలాది మంత్రములను ఉదాహరించవచ్చును. వేదములందు **'సోమము'** పరమేశ్వర పరముగనేగాక జ్ఞానమయ పరమేశ్వర భక్తి సంబంధ ఆధ్యాత్మిక మత్తుకు సూచకమై యున్నది. దీనిని దెలిసికొనజాలక శ్రీ కన్హయ్యాలాల్ మున్షీ, మరియు ఇతర విద్వాంసులు, ఋషులు (భౌతిక) సోమరసమును త్రావి మత్తులో మునిగి పోయియుందు'రని వ్రాయుట సంపూర్ణముగా అసత్యమనుటలో సందేహ మేమియును లేదు. ఈ మంత్రములో సోమము ఋతము, సత్యము మరియు వేదము నుండి యుత్పన్నము, సత్యముగు కారణముననే ప్రసిద్ధమైయున్నది. అది జ్ఞానమును ధారణమొనర్చునది, దివ్యామృతము, పృథివి, ఆకాశము, మరియు సమస్త జనులకు శాంతికి మరియు పవిత్రతకు కారణమైనదని తెలుపబడినది. ఎంతటి పిచ్చివాడైనను సారాయి వంటి నికృష్ట మాదక పదార్థము నింతగా వర్ణించి వ్రాయజాలడు.

**3.6 ఋషి వాచక పదము బహుశ ఉపనామమై యుండును.**

వేదమంత్రములందు గల ఋషుల నామములను జూచి అనేకులకు సందేహము గలుగును. అనగా; వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని, అత్రికణ్వుడు, కశ్యపుడు, మున్నగు ఋషుల నామములు తరువాత ప్రసిద్ధమైన రామాయణము, మహాభారతము మున్నగువానియందు గలవు. వేదములు అపౌరుషేయములయినప్పుడు ఈ పేర్లు వేదములందేల వచ్చిన వను విషయముపై మే మిదివరకే ప్రమాణయుక్తముగా దెలిపి యుంటిమి. ఐనను మరికొన్ని ఆవశ్యక విషయములను దెలుపుట అవసరమని తోచుచున్నది. ఇందువల్ల ఈ విషయములోగల భ్రమ నివృత్తిగాగలదు ప్రథమమున మనము ధ్యానమున నుంచవలసిన విషయమేమన; వేదములందు గల వసిష్ఠ, విశ్వామిత్ర, అత్రి, కణ్వ, కశ్యపాది శబ్దములు యౌగికములే, గాని వ్యక్తి విశేష వాచకములు గావు. వీనికి ప్రాణము, శ్రోత్రము, వివిధతాపరహితము, బుద్ధిమత్తత్వము, సర్వశ్రేష్ఠత్వము, మరియు పరమేశ్వరార్థము కూడా యగును. మేమిదివరకే ఈ విషయములో అనేక ఆర్ష వచనములను ప్రమాణ స్వరూపముగ నిచ్చి యుంటిమి. వేదములందు గల అట్టి శబ్దముల యౌగికార్థము లను జూచి, వాని యుపయోగమును దెలిసికొని ఋషులు తమ కొర కా నామములను ఎన్నుకొనినారు. ఇప్పుడును ఈసాయీ, ముస్లిము, జైన, బౌద్ధ, సిక్కు, శైవ, వైష్ణవ, శాక్తేయులు మున్నగు అనేక మతములవారు తమ తమ మాననీయ గ్రంథములనుండి తాము గౌరవించు మహానుభావుల పేర్లను గ్రహించుచుందురు గదా! ఇంతేగాక ఈ విషయములో వందలాది ప్రమాణములు లభించగలవు. ప్రసిద్ధమైన యా ఋషుల నామములు కల్పితములు లేక వారియుపనామములై యున్నవి. వర్తమాన కాలమునందును ఏ విషయమును విశేషరూపమున ప్రతిపాదన మొనర్చువా రగుదురో ఆ విషయనామమే బహుశః వారికి వర్తించుచుండుటను, ప్రసిద్ధమగుచుండుటను మనము జూచుచున్నాము. ఉదాహరణమునకు మహాత్మా మున్షీరాం గారు 'గురుకుల' విషయములో ప్రచార మొనర్చునప్పుడు ఆయనను సర్వ సాధారణముగా 'గురుకుల' మనియే పిలుచుచుండిరి. వారేదేని ఒక స్థలమునకు వెళ్లినప్పుడు 'గురుకుల్' వచ్చియున్నా డనియును అనుచుండిరి. కాంగ్డీ గురుకులమునందు స్వర్ణ జయంత్యుత్సవములు జరుగుకాలములో ఒక వ్యక్తిని అట్టి విషయ సంబంధ కార్యము కొరకు నియమించి యుండిరి. ఇప్పటికిని అచ్చటి బ్రహ్మచారులు, కర్మచారులు ఆయనను శ్రీ జయన్తీ

ప్రసాదనియే పిలుచుచుందురు. ఇట్టివే ఇంకను అనేక ఉదాహరణముల నీయవచ్చును. బహుశః ఋషుల నామములు కూడా ఇదే విధముగా ప్రసిద్ధమైనవి. ఈ విధముగ జూపుటకు అత్యంత ప్రసిద్ధమగు వందలకొలది ప్రమాణములు గలవు. వానినుండి కొన్ని ప్రఖ్యాత ఉదాహరణముల నిచ్చుటయే చాలు ననుకొందుము. వీనిలో సందేహించుట కే మాత్రము కారణము గాన్పించదు. అనగా;

౧. ఋగ్వేద ౧౦-౯౦ని పురుష సూక్తమను పేరుతో బిలుతురు. దాని ప్రారంభము, **'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్'**

మంత్రములతో నగుచున్నది. దీనియందు విరాట్ పురుషుని లేక పరమేశ్వరుని, మరియు అతనిచే నిర్మిత జగత్తును గూర్చిన వర్ణన గలదు. దీని ఋషి నారాయణుడు. ఇది పరమేశ్వర వాచక శబ్దమై యున్నది. మరియు దీని వ్యుత్పత్తి మనుస్మృతి ౧-౧౦ లో

**ఆపో నారా ఇతి ప్రోక్తాః, నారా వై నరసూనవః ।**

**తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః** ॥ మను. ౧-౧౦ ॥ అని చూపబడియున్నది.

౨. ఋగ్వేద. ౧౦-౯౭ యొక్క దేవత 'ఓషధీస్తుతిః' దీని యందు ఓషధుల గుణములు చాలా చక్కగా ప్రతిపాదన మొనర్చబడియున్నవి. దీని ఋషి 'భిషక్' అనగా వైద్యుడు లేక చికిత్సకుడై యున్నాడు.

3. ఋగ్వేద. ౧౦-౧౦౧ యొక్క దేవత 'విశ్వేదేవా ఋత్విజో వా' అని వ్రాయబడియున్నది. మరియు దీని ఋషి 'బుధః సౌమ్యః' అనగా; సౌమ్య గుణ యుక్తుడగు బుద్ధిశాలి యగును. ఇది సర్వథా ఉపయుక్తమే.

౪. ఋగ్వేద ౧౦-౧౦౭ యొక్క దేవత 'దక్షిణా తద్దాతారోవా' దీనియందు దానము నొనర్చు మహత్త్వము ఎంతయో ఉత్తమముగా జూపబడినది. దీని ఋషి 'దివ్యో దక్షిణా వా' అని వ్రాయబడినది.

౫. ఋగ్వేద ౧౦-౧౧౭ యొక్క దేవత, లేక ప్రతి పాద్య విషయము 'ధనాన్న దాన ప్రశంస' యనిగలదు. మరియు దాని ఋషి 'భిక్షుః' అని కలదు. ఇది తదనురూపముగనే యున్నది.

౬. ఋగ్వేద ౧౦-౧౨౧ యొక్క దేవత, లేక ప్రతిపాద్య విషయము 'కః' అనగా సుఖ స్వరూప పరమేశ్వరుడు ఏలన; ఇది సుప్రసిద్ధ సూక్తము, ఈ సూక్తమంతటను ఈశ్వరుని శ్రేష్ఠరూప ప్రతిపాదన గలదు. దాని ఋషి 'హిరణ్యగర్భః'

౭. ఋగ్వేద. ౧౦-౧౨3 యొక్క దేవత 'వేనః' దీని యర్థము ఉత్తమ కోరికలు గల ప్రేమీ భక్తుడు. దాని ఋషియును, 'వేనః' యే.

౮. ఋగ్వేద. ౧౦-౧౨౪ యొక్క ౨-౪ మంత్రముల దేవత 'అగ్నిః' మరియు దాని ఋషియు 'అగ్నిః 'యే.

౯. ఋగ్వేద. ౧౦-౧౨౫ యొక్క దేవతా 'వాగామ్భృణీ' యని యున్నది. దాని ఋషియును వాగామ్భృణీ, అనగా, గొప్పవాక్కు. విషయానురూపముననే ఋషియొక్క ఉపనామ ముంచబడిన దనియే స్పష్టమగు చున్నది.

౧౦. ఋగ్వేద. ౧౦-౧౨౦ యొక్క దేవత లేక ప్రతిపాద్య విషయము 'రాత్రి స్తవః' మరియు దాని ఋషియును 'రాత్రిః' అని యే చూపబడినది.

ఋగ్వేద. (౧౧)౧౦-౧౨౯ సుప్రసిద్ధ దేవత లేక ప్రతి పాద్య విషయము :-

**'నాసదాసీన్నో సదాసీత్ తదానీం నాసీద్ రజో నో వ్యోమాపరో యత్ ॥'**

మున్నగు మంత్రములందు 'భావవృత్తమ్' కలదు. అనగా దీనియందు సృష్టికి పూర్వ వృత్తము, మరియు తరువాత సృష్ట్యుత్పత్తిని గూర్చిన వర్ణనగలదు. దీనిపై ప్రొ.మైక్స్ మూలర్ వంటి పాశ్చాత్య విద్వాంసులు కూడా ఎంతో ముగ్ధులైనారు. దిగువ జూపిన విధముగా శబ్దములను ప్రయోగించుచు తన భావములను ఈశ్వరీయ జ్ఞాన స్వరూపముననే స్వీకరించుటకు మాక్సుమూలర్ వివశులైనారనియే యనవచ్చును.

'These startling outbursts of philosophic thought seem indeed to require the admission of a long continued effort of meditation and speculation before so complete a rupture with the old conception of physical gods could have become possible... nor must we forget that there always have been privileged individuals whose mind was un-trammelled by the thoughts of the great mass of the people and who saw and proclaimed, as if inspired by a power not themselves, truths, far beyond the reach of their fellow men.

The Six Systems of Indian philosophy Vol. I by Prof Maxmuller.

ఈ సూక్తము యొక్క ఋషి లేక మంత్ర ద్రష్టయును 'ప్రజాపతిః పరమేష్ఠి ' అను నామముతోనే ప్రసిద్ధమైయున్నాడు

౧౨. ఋగ్వేద ౧౦-౧౮౦ యొక్క 'దేవత-అగ్నిః' దాని ఋషి 'అగ్నిః పావకః' అను పేరుతో ప్రసిద్ధమైనాడు ఏలన నాతడు అగ్ని విద్య నధిక ప్రచారమొనర్చినాడు.

౧౩. ఋగ్వేద. ౧౦-౧౫౧ యొక్క దేవత

**శ్రద్ధయాగ్నిః సమిధ్యతే శ్రద్ధయా హూయతే హవిః ।**

**శ్రద్ధాం భగస్య మూర్ధని వచసా వేదయామసి ॥ ఋ. ౧౦-౧౫౧॥**

మున్నగు మంత్రములందు ప్రతిపాదింపబడిన విషయము శ్రద్ధ . దీని ఋషి శ్రద్ధను గూర్చి విశేష ప్రచారమొనర్చిన కారణమున 'శ్రద్ధ' యని ప్రసిద్ధమైనాడు.

౧౪. ఋగ్వేద: ౧౦-౧౫౨ యొక్క దేవత. దీని ప్రారంభము

**శాస ఇత్థా మహాన్ అస్యమిత్రఖాదో అద్భుతః । న యస్య హన్యతే సఖా న జీయతే కదాచన ॥**

**స్వస్తిదా విశస్పతిర్వృత్రహా విమృధో వశీ । వృషేన్ద్రః పుర ఏతు నః సోమపా అభయఙ్కరః ॥**

మున్నగు మంత్రములందు 'ఇంద్రః' అనగా పరమైశ్వర్య సంపన్న శాసకుడు. దాని ఋషి యును 'శాసః' అను పేరుతో ప్రసిద్ధమైనాడు.

౧౫. ఋగ్వేద ౧౦-౧౫౮ యొక్క 'సూర్యో నో దివస్పాతు'॥

అనేక మంత్రములతో ప్రారంభమగు సూక్తము యొక్క దేవత, లేక ప్రతిపాద్య విషయము, 'సూర్యుడు' మరియు దాని ఋషియును 'చక్షుః సౌర్యః' అని వ్రాయబడియున్నది.

౧౬. ఋ.౧౦-౧౬౧ 'ముఞ్చామి త్వా హవిషా జీవనాయకమ్ అజ్ఞాతయక్ష్మాదుత రాజయక్ష్మాత్'।

సుప్రసిద్ధ మంత్రముతో ప్రారంభమగు హవనము ద్వారా రాజయక్ష్మ మున్నగు వ్యాధుల చికిత్సను ప్రతిపాదించు సూక్తము యొక్క దేవత 'రాజయక్ష్మఘ్నమ్' అని గలదు మరియు దీని ఋషియును 'యక్ష్మనాశనః' అను పేర ప్రసిద్ధమైనాడు.

౧౭. అక్షీభ్యాం తే నాసికాభ్యాం కర్ణాభ్యాం ఛుబుకాదధి।

యక్ష్మం శీర్షణ్యం మస్తిష్కా-జ్జిహ్వాయా వివృహామి తే॥ ఋ ౧౦-౧౬౩॥

ఈ మంత్రముతో ప్రారంభమగు సూక్తమునందు సర్వాంగముల నుండి రోగక్రిములను దొలగించుకొను వర్ణన గలదు. కావున దీని దేవత 'వివృహా కాశ్యపః' సర్వద్రష్టా పరమేశ్వరుడు మరియు జ్ఞానిపుత్రుడు రోగములను దొలిగించువాడు కావున ఈ పేరుతోనే ప్రసిద్ధమైనాడు.

౧౮. ఋగ్వేద ౧౦-౧౬౪ యొక్క,దేవతా 'దుఃస్వప్నఘ్నమ్' ఏలన; దీనియందు

అపేహి మనసస్పతే ఽప క్రామ పరశ్చర।

మున్నగు మంత్రములందు మనస్సు యొక్క దురాలోచనలను, వాని ద్వారా జనించిన దుఃస్వప్నములను దొలగించుకొను ప్రతిపాదనము గలదు కావున దాని ఋషియును 'ప్రచేతాః, లేక ఉత్తమ జ్ఞాని' యని యెంచబడినది

౧౯. ఋగ్వేద ౧౦-౧౭౩ యొక్క దేవత 'రాజ్ఞః స్తుతిః'. దీనియందు అభిషేక సమయమున రాజును సంబోధించుచు

ఆ త్వాహార్షమన్తరేధి ధ్రువస్తిష్ఠావిచాచలిః।

విశస్త్వా సర్వా వాఞ్ఛన్తు మా త్వద్ రాష్ట్రమధి భ్రశత్ ॥

మున్నగు మంత్రములందు రాజు ప్రజల కోరికల కనుకూలముగా కార్యము లొనర్చుచు ధ్రువ లేక కర్తవ్యపాలనయందు దృఢముగ నుండుటకై ఉపదేశించబడినది. కావున దీని ఋషియును 'ధ్రువః' అను పేర ప్రసిద్ధమైనాడు.

౨౦. ఋగ్వేద ౧౦-౧౮౩ లో కేవలము మూడు మంత్రములు గలవు. వీనిలో మొదటి మంత్రమున వివాహమును గోరుకన్య తాను కోరిన వరుని గూర్చి;

అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతమ్।

ఇహ ప్రజామిహ రయిం రరాణః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామ॥

ఈ వాక్యము గలదు. రెండవదాని యందు వరుని ఉక్తి ఈ విధముగా నున్నది.

**అపశ్యం త్వా మనసా దీధ్యానాం స్వాయాం తనూ ఋత్వ్యే నాధమానామ్ ।**

**ఉప మాముచ్చా యువతిర్బభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే ॥**

ఈ మంత్రములందు వారిరువురును ఉత్తమ సంతానోత్పత్తికై వివాహ సంబంధ మొనర్చుకొను ప్రస్తావము గలదు. కావున దేవత **'యజమానపత్నీ, హోత్రాశిషః'** మరియు **'ఋషి ప్రజావాన్ ప్రాజాపత్యః'** యున్నందున ఉపయుక్తమేయైయున్నది.

**౨౧. విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ।**

**ఆ సిఞ్చతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే** ॥ ఋ. ౧౦-౧౮౪-౧ ॥

మున్నగు మంత్రములందు **'గర్భార్థాశీః'** దేవత, మరియు **'త్వష్టా గర్భకర్తా విష్ణుర్వా ప్రాజాపత్యః'** ఋషియని యున్నది. అది దాని ప్రతి పాద్య విషయమున కనుకూలముగ నున్నది.

**౨౨. వాత ఆ వాతు భేషజం శమ్భు మయోభు నో హృదే ।**

**ప్ర ణ ఆయూంషి తారిషత్** ॥ ఋ. ౧౦-౧౮౬-౧ ॥

మున్నగు మూడే మంత్రములున్నవి. అందు శుద్ధ వాయు సేవనమును గూర్చి చక్కని వర్ణనమున్నది. కావుననే దీనికి **'వాయుర్దేవతా'. 'ఉలోవాతాయనః'** ఋషి దేవతకనుగుణమని ఎంచబడినది. దాని యర్థము 'గతిశీల వాయు సేవీ'.

**౨౩. ప్రాగ్నయే వాచమీరయ వృషభాయ క్షితీనామ్। స నః పర్షదతి ద్విషః ॥'** ॥ ఋ.౧౦-౧౮౭-౧ ॥

ఈ మంత్రమునకు దేవత, లేక ప్రతిపాద్య విషయము **'అగ్నిః'.** మరియు ''ఋషివత్స ఆగ్నేయః'' అనగా; అగ్ని విద్య నెరుగు వారి సంతానమని గలదు.

**౨౪. ఋతం చ సత్యం చాభీద్ధాత్ తపసో ఽధ్యజాయత** ॥ ఋగ్వేద; ౧౦-౧౯౦-౧॥

మున్నగు మంత్రములలో సృష్ట్యుత్పత్తి క్రమము అత్యుత్తమముగా జూపుచు ఇట్లుపదేశించబడినది. పరమాత్మను సర్వవ్యాపకుడని యెంచుచు సకల పాపములకు దూరముగ నుండవలయును. కావున ఇది **'అఘమర్షణ'** మను పేరుతో కూడా పిలువబడినది. దీని దేవత **'భావవృత్తమ్'** మరియు ఋషి ''అఘమర్షణుడు'' ఈశ్వర చింతనము పాపముల నుండి దప్పించుకొనుటకుపాయమని ఇందు గలదు.

**౨౫.** ఋ. ౧౦-౧౯౧ యొక్క సుప్రసిద్ధ సూక్తము నందు **'సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్'** మున్నగు ఐక్య మరియు ప్రీతివర్ధకముగు మంత్రములు గలవు. వీని దేవత **'సంజ్ఞానమ్, ఋషి 'సంవననః'** అనగా ఉత్తమముగా గలసి ప్రేమతో వ్యవహరించుట అను విషయము ఇందుకను రూపముగ నున్నది.

ఈ విధముగు అనేక ఉదాహరణములు మిగతా వేదముల నుండియు నీయవచ్చును. వీని వల్ల వసిష్ఠ, విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ మున్నగు పదములు గుణ విశేష సూచకముగు ఋషుల ఉపనామములై యున్నవి. కాని ఏదో యొక వ్యక్తివిశేషములు గావు. కావుననే మహర్షి దయానందుల ఈ లేఖ.

**యో మన్త్రసూక్తానామృషిర్లిఖితస్తేనైవ తద్ రచితమితి కుతో న స్యాత్? మైవం వాది।**

**బ్రహ్మాదిభిరపి వేదానామధ్యయనశ్రవణయోః కృతత్వాత్।**

**... యదర్షీణాముత్పత్తిరపి నాసీత్ తదా బ్రహ్మాదీనాం సమీపే వేదానాం వర్తమానత్వాత్।**

॥ ఋగ్వేదాది భాష్యభూమిక - వేదోత్పత్తి విషయము ॥

అనగా; మంత్రముల లేక సూక్తములపై వ్రాయబడిన పేర్లను బట్టి ఆ ఋషులే అట్టి మంత్రముల రచన యొనర్చినారని ఏల నమ్మగూడదు?

**సమాధానము :-** ఈ కథనము సరిగా లేదు. బ్రహ్మ మున్నగు వారును వేదముల అధ్యయన శ్రవణ మననముల నొనర్చినారు ఋషులు జన్మించుటకు పూర్వమే బ్రహ్మ మున్నగు వారి వద్ద వేదములు విద్యమానమై యుండెనను విషయము సర్వథా మాననీయమే.

**యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై।**

**తం హ దేవమాత్మబుద్ధిప్రకాశం, ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే।** (శ్వేతాశ్వతరోపనిషత్తు ౬-౧౮)

ఈ వచనమును మొదటనే ఉద్ధృతపరచి యుంటిమి. దీనివల్ల మహర్షి దయానందుల కథనము యొక్క సత్యత సిద్ధియగుచున్నది.

ఇంకా లోతునకు వెళ్లిన ఏ ఋషుల పేర్లు వేద మంత్రములలో సూక్తములందు వ్రాయబడిననో వారికంటె పూర్వమే మంత్రములు, సూక్తములుండియే యుండెననుట స్పష్టము. ఇచ్చట కేవలము ప్రసిద్ధమగు మూడు ఉదాహరణము లిచ్చిన చాలునను కొందుము. ఋ.౧-౨౪ సూక్త. ఋషి.-

**'శునః శేప ఆజీగర్తిః కృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః।** అని కలదు.

వేదములను పురుష కృతములని యెంచువారు దిగువ సూక్తమున వచ్చిన.

**శునఃశేపో యమహ్వద్ గృభీతస్త్రి ష్వాదిత్యం ద్రుపదేషు బద్ధః** ॥ఋ.౧-౨౪-౧౩॥

శునఃశేప శబ్దమును గాంచి ఈశునశ్శేపుడే ఈమంత్ర రచన యొనర్చినాడను నిర్ణయమునకు వత్తురు కాని వాస్తవముగా అట్లు నిర్ణయించుకొనుట సరిగాదు. **'కస్యనూనం కతమస్యామృతానాం'** సూక్తము యొక్క ఈ మొదటి మంత్రవ్యాఖ్య నొనర్చుచు 'నిరుక్తసముచ్చయ' మను గ్రంథలేఖకుడగు వరరుచి ( ఋగ్వేద ప్రసిద్ధ భాష్యకారుడగు స్కందస్వామి తన భాష్యము నందనేక స్థలములందు 'వరరుచి' పేరును పేర్కొనినాడు) యనునాతడిట్లు వ్రాసినాడు.

**'అస్యాః ప్రథమం తావదాఖ్యానం ప్రస్తూయతే అజీగర్తో నామ**

**బ్రహ్మర్షిః సువచస్య సూనుః పుత్రదారాది సహితో దుర్భిక్షే క్షుధయా**

**పీడ్యమానో నిరతిశయతపోమహాభాగ్యయుక్తః ప్రాధాన్యాత్ ప్రజా-**

**పతిమేవ దేవానాం మధ్యే ప్రథమం ప్రార్థయతే; 'కస్యనూనమ్' ఇతి** ॥ నిరుక్తసముచ్చయము ౭౭ వ పుట ॥

అనగా; ఈమంత్రము యొక్క మొదటి ఆఖ్యానము వ్రాయబడుచున్నది. సువచుని పుత్రుడగు అజీగర్తు డనుపేరుగల బ్రహ్మర్షి భార్యాబిడ్డలతో గూడ దుర్భిక్షము నందు ఆకలిచే పీడితుడై తపస్సను మహాధనముతో గూడినవాడై **'కస్యనూనమ్'** మున్నగు మంత్రముతో దేవతలలో ప్రథముడగు బ్రహ్మను ప్రార్థించినాడు. మున్నగునవి.

ఈలేఖయం దణుమాత్రమును సందేహ ముండకూడదు. **'కస్యనూనం ప్రథమస్యామృతానామ్'** మున్నగు మంత్రములనిర్మాణము శునః శేపుడు చేయలేదు. ఆయన తండ్రియగు అజీగర్తుని కాలమందును ఈమంత్రము లవశ్యముగా విద్యమానములై యుండెను. లేకున్న నాతడా మంత్రములతోనే ఎట్లు ప్రార్థించినాడు?

**'శునః శేప'** ఇదియును యౌగిక గుణవాచక శబ్దమైయున్నది. కాని ఇది వ్యక్తివిశేష వాచకము గాదు. **'శునమితి సుఖనామ శేపః స్పృశతేః'** అనగా; 'సుఖమును స్పర్శించునది శునఃశేప అనుదానికిట్లర్థమొనర్చినచో అట్టియౌగికార్థము మంత్రార్థమునకు సంగతమై పోవును.'

### 3.7 స్పష్టమగు రెండవ ఉదాహరణము

ఋగ్వేద తృతీయమండలాంతర్గత ౨౨వ సూక్తము **'అయం సో అగ్నిః.....** అనుదానితో ప్రారంభమగుచున్నది. ఈసూక్తమును గురించి తైత్తిరీయ సంహిత, మరియు కాఠకసంహిత యందు

**'అయం సోఽగ్నిః ఇత్యేతద్ విశ్వామిత్రస్య సూక్తమ్'** అని

వ్రాయబడియున్నది. అనగా; **'అయం సో అగ్నిః'** ఇది విశ్వామిత్ర సూక్తమైయున్నది. కాని సర్వానుక్రమణి వల్ల దెలియునదేమన; ఈసూక్తము కేవలము విశ్వామిత్రుని తండ్రి యగు 'గాథి' కాలమునందేయుండెనని ఆతడే దాని ద్రష్టయైయుండెనని స్పష్టమగుచున్నది. ఆర్షానుక్రమణి 3,౪ లో వ్రాయబడియున్న ఉదాహరణముతో ఈవిషయము స్పష్టమగుచున్నది.

**'అగ్నిం హోతారమారభ్య, గాధనామ స కౌశికః।**

**సూక్తాన్యపశ్యచ్చత్వారి, సూక్తం నిర్మిమతే పరే।**

**'సూక్తాన్యపశ్యచ్చత్వారి'** పాఠముపై శ్రద్ధనుంచదగినదై యున్నది. దీనివల్ల ఇంతకు పూర్వపు సూక్తాలున్న విషయము నిశ్చయమగుచున్నది.

స్పష్టమైన మూడవ ఉదాహరణము మను పుత్రుడగు **'నాభానేదిష్ఠునిది.'** ఆయన ఋగ్వేద మ. ౧౦ సూక్తము ౬౧,౬౨ లకు ఋషియని సర్వానుక్రమణికాకారుడు స్పష్టముగా వ్రాసియున్నాడు. ఐతరేయ బ్రాహ్మణము ౫-౧౪లో వచ్చిన నాభానేదిష్ఠుని విషయక కథ ఈవిధముగా గలదు.

**'నాభానేదిష్ఠం శంసతి। నాభానేదిష్ఠం వై మానవం బ్రహ్మచర్యం వసన్తం భ్రాత-**

**రో నిరభిజన్ సోఽబ్రవీదేత్య కిం మహ్యమభాక్తేతి।**

**స పితరమేత్యాబ్రవీత్ త్వాం హి వావ మహ్యం తతాభాక్షురితి।**

**తం పితాబ్రవీద్ మా పుత్రక తదాదృథాః।**

**అఙ్గిరసో వా ఇమే స్వర్గాయ లోకాయ సత్రమాసతే తే షష్ఠం**

**షష్ఠమేవాహరాగత్య ముహ్యన్తి తానేతే సూక్తే షష్ఠేఽహని శంసయ తేషాం**
**యత్ సహస్ర సత్రపరివేషణం తత్ తే స్వర్యన్తో దాస్యన్తీతి ।''**

అనగా; మను పుత్రుడగు నాభానేదిష్ఠుడు గురుకులములో అధ్యయనమొనర్చు కాలమున ఆతని సహోదరులు తమ సంపదలు మున్నగువానిని విభాజనమొనర్చికొనినారు. ఆతడు గురుకులమునుండి తిరిగివచ్చి తనతండ్రితో 'సోదరులు సంపదల నీవిధముగ విభజించి కొనినారు. నాగతి యేమి? అని యడిగినాడు. అందుకు తండ్రియిట్లు చెప్పినాడు. 'నీవు చింతించవలదు. ఆఙ్గీరుని పుత్రుడొక యజ్ఞ మొనర్చుచున్నాడు. ఆరవ దినమందాతడు మోహవశమున ఒక విషయమును మరచిపోవుట జరుగును అప్పుడాతనికి నీవీరెండు సూక్తములను తెలియజెప్పుము. అందుకాయన నీకు పుష్కలముగ దక్షిణలీయగలడు' అనిచెప్పి ఆతని కీ ఋ.౧౦-౬౧, ౬౨ సూక్తముల నుపదేశించినాడు.

**'ఇదమిత్థా రౌద్రం గూర్తవచా బ్రహ్మ క్రత్వా శచ్యామన్తరాజౌ ।**
**క్రాణా యదస్య పితరా మంహనేష్ఠాః పర్షత్పక్థే అహన్నా సప్త హోతౄన్ ॥** మరియు
**యే యజ్ఞేన దక్షిణయా సమక్తా ఇన్ద్రస్య సఖ్యమమృతత్వమానశ ।**
**తేభ్యో భద్రమఙ్గిరసో వో అస్తు ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః ॥**

ఈమంత్రములతో ప్రారంభమగు నీ రెండు సూక్తములను దాయభాగమున నిచ్చినాడు. కాని వీని ఋషి **'నాభానేదిష్ఠ'** యనియున్నది. ఇదే ౧౦-౬౨ సూక్తమందలి పదవమంత్రములో **'యదుస్తుర్వశ్చ మామహే'** అనుమంత్రాంశము కూడాయున్నది. ఐతిహాసిక పక్షమును నమ్మువారి ననుసరించి వీనియందు యదు, మరియు తుర్వశుల పేర్లుకలవు. ఇవి మహాభారతము ౯౫ వఅధ్యాయము ననుసరించి మనువు యొక్క ఆరవ తరము నందుత్పన్నమై యుండెను. అప్పుడీవిషయ మెట్లు సంభవము కాగలదు? నిజమునకు యదు, తుర్వశులను ఈరెండుశబ్దములు ఒకవ్యక్తి విశేషనామములు గావు. కాని నిఘంటువు ౨.౩ ననుసరించి మనుష్యుల నామములే.

**ప్రీతాః, తుర్వశాః, ద్రుహ్యవః. యదవః, అనవః పూరవః** ఇత్యాదులు.

**పంచవింశతిః (౨౫)** మనుష్యనామాని యతి- ప్రయత్నే నుండి యదు శబ్దము.

**ప్రయత్నశీల, మరియు 'తుర్వశాః' – చతుర్వశః– వశ– కాన్తౌ**

దీని ననుసరించి ధర్మ అర్థ కామ మోక్షముల నాకాంక్షించు మనుష్యులు అని వీనికి అర్థమగును. కావున సాయణాచార్యుని **'యదుశ్చతుర్వశశ్చ- ఏతన్నామకౌ రాజర్షీ'** అని వ్రాయుట సంపూర్ణముగా అశుద్ధమైయున్నది

### 3.8 కణ్వతమ, అఙ్గిరస్తమ మున్నగువాని ప్రయోగము

వేదములందు కణ్వ, అఙ్గిరాః, ఇన్ద్ర మున్నగు పదములు వ్యక్తివిశేష వాచకములు గావు, కాని యౌగికమగు కారణమున విశేషగుణ సూచకములైయున్నవి. కావున ఈవిషయము గూడ ప్రసంగవశమున విశేషరూపమున ఉల్లేఖించదగినదైయున్నది. అనేక స్థానములందు కణ్వతమ, అఙ్గిరస్తమ, ఇన్ద్రతమ మున్నగు ప్రయోగములు

గాన్పించుచుండును. వ్యక్తి సంజ్ఞా వాచక పదములందు ఎప్పుడును ఈవిధమగు తమప్, లేక అంగ్రేజి పరిభాషానుసారము *Superlative degree* యొక్క ప్రయోగము గాజాలదు. ఈవిషయము నందరును ఒప్పుకొందురు. ఉదాహరణార్థము ఋ.౧-౪౮-౪ నందీ మంత్రము వచ్చియున్నది.

**ఉషో యేతే ప్ర యామేషు యుఞ్జతే మనో దానాయ సూరయః ।**

**అత్రాహ తత్ కణ్వ ఏషాం కణ్వతమో నామ గృణాతి నృణామ్** ॥ ఋ.౧-౪౮-౪ ॥

ఇచ్చట ఉషఃకాలముననే నిద్రనుండి మేల్కొని యోగభ్యాసము ద్వారా తమమనస్సును పరమేశ్వరుని యందు సంయుక్తపరచి ఆత్మసమర్పణ మొనర్చు విద్వాంసులు కణ్వతము లగుదురని చూపబడినది. వారు సదా పరమేశ్వరుని నామస్మరణ మొనర్చుచు ప్రశంసనీయులగుదురు. ఇచ్చట కణ్వతమ యనుదాని యర్థము స్పష్టముగా కణ్వ ఇతి మేధావీ నామ ( నిఘంటువు ౩-౧౫). ఈనిఘంటువు వచనానుసారము మేధావులందు శ్రేష్ఠుడనియే కాని మరేమియును గాజాలదు. ఋ.౧౦-౧౧౫-౫ యందును.

**స ఇదమగ్నిః కణ్వతమః కణ్వసఖార్యః ।**

ఈమంత్రమునందును అగ్ని అనగా, జ్ఞాని, అగ్రణీ, నేత యనునాని విశేషణరూపమున 'కణ్వతమః' యొక్క ప్రయోగము గలదు. దీనియర్థము మేధావు లందు శ్రేష్ఠుడు అనునది అత్యంత స్పష్టము, మరియు సంగతమునై యున్నది. దానికి కణ్వ అనగా మేధావి యనునవియే మిత్రములగును. అట్టి వారు తమ ఇంద్రియములకు అధికారులగుదురు అని ఇచ్చట చెప్పబడియున్నది.

**అఙ్గిరస్తమ యొక్క ప్రయోగము:**

అంగిరస్తమ యొక్క ప్రయోగము ఋ. ౧-౩౧-౨ న **'త్వమగ్నే ప్రథమో అంగిరస్తమః'** ఋ.౧-౧౦౦-౪ **'సో అఙ్గిరోభిరఙ్గిరస్తమో ఽభూత్**। ఋ.౯-౧౦౭-౬ త్వం విప్రో అభవో ఽఙ్గిరస్తమః మరియు ఋ. ౮-౨౩-౧౦, ౮-౪౩-౨౭, ౮-౪౪-౮, ౧౦-౬౨ మున్నగు అనేక మంత్రములందును గలదు. అఙ్గిరా అన ఒక ఋషి యని నమ్మినప్పుడు అఙ్గిరస్తమ యొక్క ప్రయోగము వ్యాకరణాదుల దృష్టియందు సంపూర్ణముగ అసంగతమే.

**అఙ్గిరా ఉ హ్యగ్నిః** ॥ శతపథ బ్రా. ౧-౪-౧-౨౫ ॥

**ప్రాణో వా అఙ్గిరాః** ॥ శతపథ బ్రా.౬-౧-౨-౨౮ ॥

మున్నగు ఆర్షవచనముల ననుసరించి అఙ్గిరా యొక్క అర్థము అగ్ని అనగా అగ్రణీ, నేత, లేక ప్రాణవిద్యావేత్త,లేక ఎల్లరను తన ప్రాణముగా జూచువా' డని చేసిన సంపూర్ణముగా సరిపోవును అప్పుడు నాయకులలో, లేక ప్రాణవిద్య నెరుగువారియందు శ్రేష్ఠుడు అగును. ఇదేవిధముగా ఋగ్వేదములోని

**అభూదుషా ఇన్ద్రతమా మఘోన్యజీజనత్ సువితాయ శ్రవాంసి ।**

**వి దివో దేవీదుహితా దధాత్యఙ్గిరస్తమా సుకృతే వసూని** ॥ ఋ.౭-౭౯-౩ ॥

ఈమంత్రములో ఉషా అనగా దోషములను దగ్ధమొనర్చునట్టి విదుషీ, దేవి, కొరకు ఇన్ద్రతమా మరియు అఙ్గిరస్తమా అనుశబ్దములు విశేషరూపమున ప్రయోగమైనవి. ఏలన వారు జ్ఞానము మున్నగు పరమైశ్వర్యధారికలందు

శ్రేష్ఠులు, మరియు నాయికలందును శ్రేష్ఠులేయైయుందురు. 'ఉషా' అనుదాని యర్థము ఆధ్యాత్మపరముగ జ్యోతిష్మతీ, విశోకా, ప్రజ్ఞా కూడ యగును. ఇది యోగదర్శన ప్రథమపాదమునందు **'విశోకా వా జ్యోతిష్మతీ'** అను నీ సూత్రము ద్వారా ప్రతిపాదించబడినది. దీనిపై కూడా ఈ విశేషణము నుంచవచ్చును.

ఇదే విధముగ వేదములందును ప్రయుక్తమైయున్న కణ్వతమ, అంగిరస్తమ, ఇద్ధ్రతమ మున్నగు శబ్దములు యౌగికవాదమును సమర్థించుచు వ్యక్తిగత విశేషవాచక సంజ్ఞాపద మగుటను నిరాకరించును.

## ३.९ 'మంత్రకృత్' శబ్దము గూర్చి ఆలోచన

ఋషుల కొరకు మంత్రకృత్ శబ్దప్రయోగమును గాంచి అనేకమహానుభావులకు ఈవిషయ మేమియని? సందేహము గలుగుచుండును. ఒకవేళ వాస్తవముగా వేదము ఈశ్వరీయ మగుచో ఋషులను మంత్రకృతః ఏల యనెదరు? అని.

**నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యో మన్త్రపతిభ్యః** ॥ శాఙ్ఖాయనారణ్యకము ౭-౧ ॥

**నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యో మన్త్రపతిభ్యో మా మామృషయో మన్త్రకృతో**

**మన్త్రపతయః పరాదుః మహామృషీన్ మన్త్రకృతో మన్త్రపతీన్ హరాదామ్** ॥ తైత్తి. ఆ. ४-౧౧ ॥

**యావన్తో వా మన్త్రకృతః** ॥ కాత్యాయన శ్రౌతసూత్రములు. ३-౨-६ ॥

**దక్షిణత ఉదఙ్ముఖో మంత్రకారః** ॥ మానవగృహ్య సూత్రములు ౧-౮-౧ ॥

**శ్రద్ధయా దుహితా తపసో ఽధి జాతా స్వసర్షీణాం మన్త్రకృతాంబభూవ** ॥ కాఠక గృహ్యసూత్రములు. ४౧-౧३॥

మున్నగు వానియందు మంత్రకార మరియు మన్త్రకృత్ శబ్దముల ప్రయోగమున్నది

ఈవిషయములో నివేదించునదేమన; మంత్రశబ్దము, మరియు కృఞ్ రెండును అనేకార్థములు గలవి. మన్త్రము యొక్క అర్థము అభిప్రాయము (సలహా) అని ప్రసిద్ధమై యున్నది. వాల్మీకి రామాయణ, యుద్ధకాండ ४వ సర్గలో ౧౦౧,౧౦౨ శ్లోకమున

**తదిహైవ నివేశో ఽస్తు, మన్త్రః ప్రస్తూయతామితి ।**

**సంప్రాప్తో మన్త్రకాలో నః, సాగరస్యేవ లంఘనే** ॥ వా. రా. యు ४-౧౦౧, ౧౦౨॥

ఇచ్చట స్పష్టముగా మన్త్ర శబ్దమున కర్థము సలహా (అభిప్రాయము) అనికలదు. కావుననే అభిప్రాయముల నిచ్చువారికి మన్త్రశబ్ద ప్రయోగము అనేకసందర్భములందు గాననగును. ఇదేవిధముగా కృఞ్ ధాతువునకును కేవలము అసాధారణ ప్రాదుర్భావము, లేక చేయుట అను ఒకే అర్థముగాదు. దర్శనార్థమునందును దాని ప్రయోగము వచ్చును ఉదా:- ॥ తైత్తిరీయారణ్యక. ४-౧౧ ॥

**నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యః**

దీని వ్యాఖ్యయందు భట్ట భాస్కర మిశ్ర ఇట్లువ్రాసినాడు.

**అథ నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యః - మన్త్రాణాం ద్రష్టృభ్యః**
**దర్శనమేవ కర్తృత్వమ్** ॥మైసూర సంస్కరణ భా. ౩పు. ౧॥
ఐతరేయ బ్రాహ్మణము **'సర్వ ఋషిర్మన్త్రకృత్'** భాష్యమునందు సాయణుడు;
**ఋషిరతీన్ద్రియార్థః ద్రష్టా మన్త్రకృత్ కరోతి ధాతుస్తత్ర దర్శనార్థః ॥**
అనగా; ఇచ్చట కరోతి అనుధాతు ప్రయోగము దర్శనార్థమునందుగలదు.
**యావన్తో వా మన్త్రకృతః ।**
దీనికి శ్రౌతసూత్ర ౨-౧-౧౩ యొక్క భాష్యమునందు కాత్యాయన గర్గుడు చక్కగానే వ్రాసినారు.
**మన్త్రకృతో మన్త్రదృశ ఉచ్యన్తే । న హి మన్త్రాణాం కరణం భవతి। అనిత్యత్వ ప్రసఙ్గాత్ తేన దర్శనార్థః కృఞ్ ఇత్యధ్యవసీయతే । దృశ్యతే చానేకా ర్థతా ధాతూనాం గన్ధనావక్షేపణసేధనసాహసిక్యప్రతియత్నప్రకథనోప యోగేషు కృఞః ।** ( అష్టా.౭-౩-౭౭)
**ఇత్యాత్మనేపదప్రతిపాదనే గన్ధా దీనర్థాన్ కృఞో దర్శయతి ॥**
'మన్త్రకృతః' అనునది ఇచ్చట మన్త్రద్రష్ట యొక్క అర్థమునందు ప్రయుక్తమైనది. మంత్రములు రచింపబడవు. అట్లగుచో వానిని అనిత్యమనియే తలచవలసి వచ్చును. కృఞ్ అను ధాతువున కనేకార్థములు గలవు.
**'కుత్స ఋషిర్భవతి కర్తా స్తోమానామ్ ఇత్యౌపమన్యవః'** ॥
ఈ నిరుక్తపాఠము నందును కర్తకు అర్థము ద్రష్టయని నమ్ముటయే ఉచితము. ఏలన స్వయముగ నిరుక్తకారుడగు యాస్కాచార్యుడే **'ఋషిర్దర్శనాత్.'** ౨-౧౧. దీని తరువాత ఔపమన్యవాచార్యుల **'స్తోమాన్ దదర్శేత్యౌపమన్యవః** ॥
అను రూపములో వాక్యము నుద్ధృతమొనర్చినాడు. దీనివల్ల స్పష్టమగునదేమన; ఔపమన్యవాచార్యుల దృష్టియందు కర్త, మరియు ద్రష్టలకు ఒకేఅర్థము గలదు.
మన్త్రకృత, లేక మంత్రకార శబ్దప్రయోగము మంత్రవినియోజకుల అర్థములో చేయబడును. అట్టిస్థితిలో దానియర్థ మిట్లగుచున్నది.
**యజ్ఞాదౌ కర్మణ్యనేన మన్త్రేణేదం కర్మ కర్తవ్యమిత్యేవం రూపేణ**
**యో మన్త్రాన్ కరోతి వ్యవస్థాపయతి స 'మన్త్రకృత్।**
యజ్ఞప్రారంభములో ఏవిధమగు కార్యమొనర్చవలెనో అట్టిరూపములో యజ్ఞాదుల వ్యవస్థ నొనర్చువాడు 'మన్త్రకృత్' అనబడును.
**ఇత ఊర్ధ్వాన్ మన్త్రకృతో ఉధ్వర్యుర్వృణీతే।**
సత్యాషాఢ సూత్రము.౨-౧-౧౩౦ యందును మన్త్రకృతః శబ్దము పైదెలిపిన మంత్ర వినియోగమును చక్కగా దెలిసికొనువారికే ప్రయోగింపబడినది.

తాణ్డ్యమహాబ్రాహ్మణమునందలి దిగువ వచనములందును ఋషుల కొరకు మంత్రకృత్ శబ్దప్రయోగము గలదు. దీనివల్ల అనేకులకు భ్రాంతి గలుగుట నిజమే. ఐనను ధ్యానపూర్వకముగా ప్రకరణమునంతయును చదివినచో వారికి 'మన్త్రకృత్' యొక్క అర్థము మంత్రనిర్మాత గాదని మంత్రాధ్యాపకుడని స్పష్టమగును. ఆ పాఠ మీ విధముగా నున్నది.

**శిశుర్వా అఙ్గిరసో మన్త్రకృదాసీత్ స పితౄన్ పుత్రకా ఇత్యామన్త్రయత్।**

**తం పితరో ఽబ్రువన్ అధర్మ కరోషీతి యో నః పితౄన్ సతః పుత్రకా**

**ఇత్యామన్త్రయస్వ ఇతి। సో ఽబ్రవీదహం వావ వః పితా ఽస్మి యో**

**మంత్రకృదస్మీతి తం దేవేష్వ పృచ్ఛంత। తే దేవా అబ్రువన్ ఏష వావ**

**పితా యో మన్త్రకృదితి ॥** తాణ్డ్యమహాబ్రాహ్మణము ॥

అనగా; అంగిరా యనుపేరుగల విద్వాంసుని పుత్రుడు బాల్యావస్థయందే మంత్రకృత్ ఐయుండెను. ఆయన తనకంటె పెద్ద వయస్సుగల మహానుభావులకు పాఠములను చెప్పునప్పుడు 'ఓపుత్రులారా!' అని సంబోధించినాడు. అందుకు యాపితరులు 'నీవధర్మ మొనర్చుచున్నావు. పితరులమగు మమ్ము 'హేపుత్రులారా! అని ఎట్లు సంబోధించితి' వనిరి. అప్పుడా బాలవిద్వాంసుడు 'నేను మన్త్రకృత్' (మంత్రాధ్యాపకుడ) నగు కారణమున మీకు నేను పితురుడ నని యనినాడు. అప్పు డాపితరులు దేవతల(మహాజ్ఞానుల) సీవిషయమును గూర్చి ప్రస్తావించినారు. వారును 'మన్త్రకృత్' (మంత్రార్థములను దెలుపువారు) యథార్థముగా పితరులే యనబడుదురనినారు.

'మంత్రకృత' మునకు పైన జూపిన 'మన్త్రార్థాధ్యాపకార్థమే' ఇచ్చట స్పష్టముగా అభిప్రేతమైయున్నది. ఈనిమ్న మనుస్మృతి శ్లోకము వల్ల కూడ ఈవిషయము స్పష్టముగా దెలియగలదు. దీనియందు 'మన్త్రకృత్' స్థానమున 'మన్త్రదః' అనగా మంత్రజ్ఞానమును అర్థయుక్తముగా నిచ్చువాడని ఈశబ్దమునకు ప్రయోగము గలదు. ఆశ్లోకములివి

**అధ్యాపయామాస పితౄన్ శిశురాఙ్గిరసః కవిః।**

**పుత్రకా ఇతి హోవాచ, జ్ఞానేన పరిగృహ్య తాన్॥** మను. ౨-౧౫౧ ॥

**తే తమర్థమపృచ్ఛన్త, దేవానాగతమన్యవః।**

**దేవాశ్చైతాన్ సమేత్యోచుః, న్యాయ్యం వః శిశురుక్తవాన్॥** మ. ౨-౧౫౨॥

**అజ్ఞో భవతి వై బాలః, పితా భవతి మన్త్రదః।**

**అజ్ఞం హి బాలమిత్యాహుః, పితేత్యేవ తు మన్త్రదమ్॥** మ. ౨-౧౫౩ ॥

ఈకథ సంపూర్ణముగా తాండ్యమహాబ్రాహ్మణమువలెనే యున్నది. కావున దీనియర్థము మరల వ్రాయు నవసరము లేదు. కేవలము 'మన్త్రకృత్' 'మన్త్రద' యను శబ్దభేదము మాత్రమే గలదు. తాణ్డ్యమహాబ్రాహ్మణము కన్న మనుస్మృతి అతి ప్రాచీనమైనది. తాణ్డ్యమహాబ్రాహ్మణకారుడు మనుస్మృతి, యందుగల 'మన్త్రద' స్థానమున 'మన్త్రకృత్' శబ్దమును ప్రయోగించినా డని మాయభిప్రాయము తాణ్డ్యబ్రాహ్మణము మనుస్మృతి ప్రస్తుత ఛందోబద్ధ

రూపము కన్న ప్రాచీనమైదని ఎవరైన తలచినచో 'మన్త్రకృత్' నే పర్యాయరూపములో 'మన్త్రద' శబ్దము ప్రయోగించబడినదని అనవలసియుండునా? ఎట్టిరూపమునందును ఈరెంటికిని సమానార్థమనియే ఇచ్చట స్పష్టమగును. 'కృఞ్' ధాతువున కనేకార్థములు వచ్చును. మహాభాష్యకారుడగు పతంజలి **'భూవాదయో ధాతవః'** (అష్టాధ్యాయి ౧-3-౧) యొక్క వ్యాఖ్య యందు స్పష్టముగా వ్రాసినాడు.

**యథాకరోతిరయమభూతప్రాదుర్భావే దృష్టః। నిర్మలీకరణే చాపి**

**దృశ్యతే 'పృష్ఠం కురు, పాదౌ కురు । ఉన్మృదాన ఇత్యవగమ్యతే। నిక్షేపణే**

**చాపి వర్తతే – కటం కురు, ఘటం కురు, స్థాపయేతి గమ్యతే।**

ఇచ్చట కృఞ్ అనగా స్థాపించుట అని అర్థము చూపబడినది. దీనిభావమును గొని మంత్రమును ఏ విశేషస్థానమందైనను వ్యవస్థాపితమొనర్చుట. ఈయర్థమునే గొని 'మంత్రవినియోగకృత్' మున్నగువానికొరకు మంత్రకృత్ శబ్దము ప్రయోగము, మరియు ప్రచలితము నగునని తెలియుచున్నది. ఈవిషయమే జైమినీమునికృత 'మీమాంసా శాస్త్రము యొక్క 'ఆదానే కరోతి శబ్దః' (౪-౨-3) వలన గూడా దెలియుచున్నది. దీని భాష్యమునందు శబరస్వామి ఇట్లు వ్రాసినాడు.

**ఆదానే కరోతి శబ్దో భవిష్యతి। స్వరుం కరోతి స్వరుమ్ ఆదత్తే। యథా**

**కాష్ఠాని కరోతి, గోమయాని కరోతి, ఓదనం కరోతి, శబ్దో భవతి।**

'కృత్' అనునది గ్రహణమొనర్చు అర్థమునందు మీమాంసాశాస్త్రములోని ఈసూత్రము ప్రయోగమైనది. దీనివలన స్పష్టమగునదేమన 'మన్త్రకృత్' అనుదాని యర్థము మంత్రములను విశేషరూపములో గ్రహణమొనర్చుట, లేక వినియోగము యథాస్థానమున నుంచుట అని అనుటలో ఏ యాపదయు నుండజాలదు. ఇందుకొరకే సుప్రసిద్ధ మీమాంసక విద్వాంసుడగు కుమారిలభట్టు 'తన్త్రవార్తికము' నందు తాణ్డ్యమహా బ్రాహ్మణమున పూర్వోద్ధృత ఆంగిరసుని కథ నుల్లేఖించుచు ఇట్లువ్రాసినాడు.

**శిశుర్వా ఆఙ్గిరసో మన్త్రకృతాం మన్త్రకృదాసీదిత్యత్ర మన్త్రకృచ్ఛబ్దః**

**ప్రయోక్తరి ప్రయుక్తః॥** తన్త్రవార్తిక పూనా. మం. పు. ౨3౧ ॥

అనగా; అంగిరసుని కొరకు ప్రయోగమైన మన్త్రకృత్ శబ్దము మంత్రమును చేయు వాడను అర్థమున గాక మంత్రమును సరియైన స్థానమున ప్రయోగమొనర్చువాడను అర్థమున గలదు. ఈమంత్రకృత్ శబ్దమువలెనే ఖాదిరగృహ్యసూత్రము ౨-౪-౧౦ లో **'మంత్రవాన్'** శబ్దము బ్రాహ్మణము నకు విశేషరూపమున ప్రయోగింపబడుట చూడబడుచున్నది. దీనియర్థము మంత్రజ్ఞాన యుక్తుడై దానిని యథాస్థాన ప్రయోగమొనర్చు వాడని అర్థము నొనర్చుకొనుట సంపూర్ణముగా ఉచితమైయున్నది. మహాభారత వన (అరణ్య) పర్వము౧3౪-3 యొక్క

**'అస్మిన్ యుగే బ్రహ్మకృతాం వరిష్ఠావాస్తాం మునీ మాతులభాగినేయౌ।'**

ఈశ్లోకము నందు 'బ్రహ్మకృత్' శబ్దము ప్రయోగము కూడ ఇదే 'మన్త్రద్రష్టా' అనగా; మంత్రములను యథోచితముగ ప్రయోగము, లేక వినియోగపరచు వాడనునర్థము నందున్నది. పైదెలిపిన ప్రమాణములచే నిది

స్పష్టమగుచున్నది. 'రఘువంశ' మనునది కావ్యమగు కారణమున ధార్మికదృష్టితో గొప్పమహత్త్వము గలది గాకున్నను దాని యందు ప్రయోగమైన శబ్దములు మనకొరకును ఏమహత్త్వము గలవి గావు. ఐనను ఈప్రసంగములో దానిపంచమ సర్గమున గల **'అప్యగ్రణీర్మన్త్రకృతా మృషీణాం, కుశాగ్రబుద్ధే కుశలీ గురుస్తే'** వరతన్తు ఋషిని గురించిన అడిగిన ఈ ప్రశ్నలో మంత్రకృతార అనగా వినియోగపరచువాడు మరియు 'మన్త్రార్థాధ్యాపకుడే' యగును దాని టిప్పణి (వ్యాఖ్య) యందు గోవిందశాస్త్రి యను విద్వాంసుడీవిధముగ వ్రాసినాడు.

**'అత్ర న మన్త్రాన్ కుర్వన్తీతి మన్త్రకృత ఇతి వ్యుత్పత్తిర్గరీయసీ వేదా పౌరుషేయత్వభఙ్గాత్।**

**కిన్తు మన్త్రాన్ కుర్వన్తి ప్రయోగవిధినా ఇష్ట లాభాయ ప్రయుఞ్జత ఇతి మన్త్రకృతః।'**

(రఘువంశః సంపా-గోవిందరామశాస్త్రి, మరో వెంకటేశ్వర ప్రెస్. ముంబయి ౧౯౬౯)

ఈవిధముగ 'మన్త్రకృత్' మన్త్రకార, బ్రహ్మకృత్, లేక మన్త్రవాన్ మున్నగు శబ్దముల ప్రయోగమువల్ల ఋషులు 'మంత్రకర్త' లను భ్రమలో పడకూడదు. వారిని మంత్రద్రష్టలని యంగీకరించుటయే అత్యుచితము. తైత్తిరీయారణ్యక ౪-౧-౧ యందు **'నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యః'** అను పాఠమునకు మహావిద్వాంసుడగు భట్టభాస్కరుడు పైదెలిపిన, మరియు ఇతర ప్రమాణములను దృష్టియందుంచుకొని చక్కనియర్థము నొసర్చినాడు ఎట్లన-

**అథ నమః ఋషిభ్యః ద్రష్టృభ్యః। మన్త్రకృద్భ్యో మన్త్రాణాం ద్రష్టృభ్యః।**

**దర్శనమేవ కర్తృత్వమ్।**

అనగా; 'మన్త్రకృతః' అర్థము మంత్రద్రష్ట. కృఞ్ ధాతువు దర్శనమను అర్థమునందును ప్రయోగమగును ఇట్టి మంత్రద్రష్టలగు ఋషులకు నమస్కార మగుగాక.

### ౩.౧౦ వేదజ్ఞానప్రదాత పరమేశ్వరుడు.

'మూర్' మరియు ఇతర అనేక పాశ్చాత్య విద్వాంసుల అనుయాయులగు భారతీయ విద్వాంసులును తమ గ్రంథములందు 'స్వయముగా వేదములందే వానిని ఈశ్వరకృతమని అంగీకరించలేదు' అని వ్రాసినారు. వేదములను ఈశ్వరకృతములని నమ్ము సిద్ధాంతము వెనుకనుండి చొప్పింపబడిన దనియును వ్రాసినారు. కాని ఈమాట సంపూర్ణముగా అశుద్ధము. ఈవిషయములో వేదము లందు వేలాది ప్రమాణములు గలవు. వానియందు వేదములు ఈశ్వరీయ మని చూపబడియున్నది. వానినుండి కొన్ని అతిస్పష్టమగు ప్రమాణములను ఉదాహరణముగా ప్రవేశపెట్టుచు మేమీ యధ్యాయమును ముగించుచున్నాము.

౧. ఋగ్వేద. ౧౦-౯౦ పురుష సూక్తమంత్ర మీ విషయమున ప్రసిద్ధము.

**తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే।**

**ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత ॥** ఋ ౧౦-౯౦-౯ ॥

అనగా; ఆ పూజనీయ పరమేశ్వరునిచే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము మరియు 'ఛన్దాంసి' అనగా అథర్వవేదము లుత్పన్నమైనవి.

అనేక పాశ్చాత్య విద్వాంసులు, మరియు వారి అనుయాయులు, పురుష సూక్తమును ప్రక్షిప్త మని యెంచుదురు. (ఐనను ఈఅభిప్రాయముయొక్క సారహీనత్వమును ముందుముందు ప్రమాణయుక్తముగా ప్రకటింతుము) మే మితర యనేక ప్రమాణము లిచ్చుట నొసగుదుము. వాని విషయమం దెవ్వరికిని ఎట్టిసందేహము గలుగకుండును. ఋ.౨-౨౩-౨లో

**౨. దేవాశ్చిత్ తే అసుర్య ప్రచేతసో బృహస్పతే యజ్ఞియం భాగమానశుః।**

**ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా మహో విశ్వేషామిజ్జనితా బ్రహ్మణామసి ॥ ఋ.౨-౨౩-౨ ॥**

**పదార్థము:–** (అసుర్య) ప్రాణాధారుడు (బృహస్పతే) జ్ఞానపతి యగు పరమాత్మ! (దేవాః చిత్) సత్యనిష్ఠగల విద్వాంసులు మాత్రమే (ప్రచేతసః) సర్వజ్ఞుడవగు (తే) నీయొక్క (యజ్ఞియమ్) యజ్ఞమునయోగ్యమగు పవిత్ర (భాగమ్) భాగమును (ఆనశుః) ప్రాప్తించుకొందురు. (ఇవ) ఏవిధముగా (సూర్యః) సూర్యుడు (జ్యోతిషా) తనజ్యోతిచే (మహః ఉస్రాః) గొప్పకిరణముల నుత్పన్నమొనర్చునో అదేవిధముగ నీవు (విశ్వేషామ్) సకల (బ్రహ్మణా మ్) వేదములను (జనితాఅసి) ఉత్పన్నమొనర్చువాడవు.

పరమాత్మ నేవిధముగా సూర్యసమానుడని సకలవేదముల ఉత్పాదకుడని చూపబడినదో ఆ విషయ మతి స్పష్టము. దీనివ్యాఖ్య అనావశ్యకము.

**౩. ఇన్ద్రాయ సామ గాయత విప్రాయ బృహతే బృహత్।**

**బ్రహ్మకృతే విపశ్చితే పనస్యవే ॥ సామవేద. మం ౩౮౮, ౧౦౨౫ ॥**

ఈమంత్రమునందు పరమేశ్వరుని ఇంద్రనామముతో స్మరించుచు ఆయనను (బృహద్ విప్ర) అందరికన్న గొప్పజ్ఞాని, (పనస్యవే విపశ్చితే) అత్యంతముగ స్తుతించదగిన యోగ్య విద్వాంసుడు, మరియు (బ్రహ్మకృతే) బ్రహ్మ లేక వేదములను చేసిన వాడని పేర్కొనుచు ఆతని గుణగాన మొనర్చుట కుపదేశించబడినది. 'బ్రహ్మకృతా' ఈ విశేషణముచే వేదములను రచించినవాడు ఆ పరమేశ్వరుడే యను భావము సంపూర్ణముగా స్పష్టమే. ఇందణుమాత్రమును సంశయించవలసిన యవసరములేదు.

౪. ఋగ్వేద, సామవేదముల ఈదిగువ మంత్రము కూడా పరమేశ్వరుని వేదరూప జ్ఞాన ప్రదాతయని తెలుపుచున్నది.

**హోతా దేవో అమర్త్యః పురస్తాదేతి మాయయా। విదథాని ప్రచోదయన్॥ ఋ. ౩-౨౭-౭॥**

అనగా: (హోతా) శాంతి, మరియు ఆనందముల నిచ్చువాడు (అమర్త్య దేవః) అమరుడగు పరమేశ్వరుడు (మాయయా) తన బుద్ధితో (విదథాని) జ్ఞానములను (ప్రచోదయన్) విశేషరూపమున ప్రేరణమొనర్చు (పురస్తాత్ ఏతి) యోగి సమ్ముఖమున ప్రకటమగును వేదజ్ఞానమీశ్వరీయమని ఇచ్చటను స్పష్టముగ నున్నది.

౫. ఈదిగువ ఋగ్వేద ౩-౫౭-౬ మంత్రములో వేదములు పరమేశ్వరుని ద్వారా ప్రదత్తమైనవి. అవి సర్వజనహితకరజ్ఞానప్రపూర్ణములని తెలుపబడినది

**యా తే అగ్నే పర్వతస్యేవ ధారాసశ్చన్తీ పీపయద్ దేవ చిత్రా।**

**తామస్మభ్యం ప్రమతిం జాతవేదో వసో రాస్వ సుమతిం విశ్వజన్యామ్ ॥'**

పదార్థము:- (అగ్నే) హే జ్ఞానస్వరూపుడవగు పరమేశ్వరా! (దేవా) సుఖశాంత్యానంద ప్రదాతా! (యా తే పర్వతస్య అసశ్చన్తీ ధారా ఇవ) పర్వతధారవలె మధ్య ఎచ్చటను ఆగిపోని నీయొక్క (చిత్రా) అద్భుతమైన (ధారా) వేదమయీ జ్ఞానధార, లేక వేదవాణి ('ధారేతి వాఙ్నామసు' నిఘంటు ౧-౧౨) (పీపయత్) నిరంతరము జ్ఞానమును ప్రసాదించుచు తృప్తిపరచుచున్నది. (జాతవేదః) ఎల్లరను వసింపజేయు, సర్వవ్యాపక, సర్వజ్ఞుడవునగు హే పరమేశ్వరా! జాతే జాతే విద్యత ఇతి వా జాతాని వేద ఇతి వా నిరుక్తే (అస్మభ్యమ్) మాకల్యాణము కొరకు (తామ్) ఆ (ప్రమతిమ్) అత్యంత ఉత్తమ జ్ఞానమును ప్రసాదింమనట్టి, (విశ్వజన్యామ్) సకల మానవులకు కల్యాణ ప్రదమగు (సుమతిమ్) వేదరూపిణి ఉత్తమబుద్ధిని (రాస్వ) ప్రసాదించుము. ఈమంత్రము నందు వేదవాణి స్పష్టముగ ఈశ్వరీయము, మరియు నిష్పక్షపాతము నగు కారణమున మానవమాత్రు లెల్లరకును కల్యాణ ప్రదమని చెప్పబడినది

**౬. యో అదధాజ్జ్యోతిషి జ్యోతిరన్తర్యో అసృజన్మధునా సం మధూని ।**

**అధ ప్రియం శూషమిన్ద్రాయ మన్మ బ్రహ్మకృతో బృహదుక్థాదవాచి** ॥ ఋ.౧౦-౫౪-౬ ॥

ఈఋగ్వేదమంత్రమందు స్పష్టముగా వేద మీశ్వరీయ జ్ఞానమని తెలుపబడినది. ఏ పరమేశ్వరుడు (జ్యోతిషి) జీవరూపజ్యోతియందు (జ్యోతిః అదధాత్) వేదరూప జ్యోతిని సృష్ట్యారంభములో ధారణమొనర్పజేయునో ఆపరమేశ్వరుడే మధుర ఉత్తమపదార్థములతో గూడ తగిన రీతిలో ఇతర ఉత్తమ ఉపయోగకర పదార్థములను సంయోగ పరచును. ఇట్టి (ఇన్ద్రాయ) పరమైశ్వర్య సంపన్నుడగు పరమాత్మ కొరకు (ప్రియమ్) ప్రేమను, మరియు (శూషమ్) బలమును, ఉత్సాహమును అభివృద్ధి పరచునట్టి (బృహత్) మహాగొప్ప (మన్మ) మననాత్మక జ్ఞానమును (బ్రహ్మకృతః ఉక్థాత్) ఈశ్వరరచితములగు వేదములచేతనే (అవాచి) పలుకవలెను. అనగా; పరమేశ్వరస్తుతి ఈశ్వరీయ వేదవాణి ద్వారా చక్కగా, శ్రద్ధాపూర్వకముగా చేయబడవలెను యథార్థముగా వేదవాణి పరమేశ్వర ప్రదత్తమగు కారణమున అది పరమేశ్వరుని గుణములను యథార్థముగా ప్రతిపాదించుచున్నది. ఈమంత్రముద్వారా ఈభావము స్పష్టముగా దెలియుచున్నది.

**౭. ప్రవః శర్ధాయ ఘృష్వయే త్వేషద్యుమ్నాయ శుష్మిణే ।**

**దేవత్తం బ్రహ్మ గాయత** ॥ ఋ.౧-౩౭-౪ ॥

ఈ మంత్రములో బ్రహ్మ, లేక వేదమునకు 'దేవత్తమ్' అను విశేషణము గలదు. దీనియర్థమేమన; వేదములు సర్వప్రకాశకుడగు పరమేశ్వరుని ద్వారా ప్రదత్తము, లేక ప్రేరితములైయున్నవి, కాన ఆ పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు, తేజోవంతుడు ఆతనిని ఈశ్వరీయ వాణి యగు వేదముద్వారా గానమొనర్పవలెను.

౮. ఋగ్వేద. ౧-౪-౫, మరియు యజుర్వేద.౩౪-౫౭ లో ఈమంత్రము గలదు

**'ప్రనూనం బ్రహ్మణస్పతిర్మన్త్రం వదత్యుక్థ్యమ్ ।**

**యస్మిన్నిన్ద్రో వరుణో మిత్రో అర్యమా దేవా ఓకాంసి చక్రిరే ॥**

ఇది అతిస్పష్టమగు శబ్దములలో వేదమంత్రములను ఈశ్వరప్రదత్తమని చూపినది. దీనిదేవత ఋగ్వేదములో **'బృహస్పతిః'**, మరియు యజుర్వేదములో బ్రహ్మణస్పతిః అనగా **'వాగ్విబృహతీ తస్యా ఏష పతిః'** వేదవాణి, లేక జ్ఞానమునకు స్వామి పరమేశ్వరుడు. మంత్రములో ఇట్లుచెప్పబడినది. (యస్మిన్) ఏ పరమేశ్వరుని యందు(ఇన్ద్రః) సూర్యుడు, లేక విద్యుత్తు(వరుణః) చంద్రుడు, లేక జలము (మిత్రః) ప్రాణములు (అర్యమా) వాయువు, మరియు సమస్త (దేవాః) దివ్య గుణములు (ఓకాంసి చక్రిరే) నివాసమొనర్చునో (బ్రహ్మణః పతిః) అట్టి జ్ఞానము, లేక వేదవిద్యల స్వామి యగు పరమాత్మ (ఉక్థ్యమ్) ప్రశంసనీయమగు (మన్త్రమ్) వేదమును పేరుగల మంత్రసహింతలను (నూనమ్) నిశ్చయముగా (ప్రవదతి) అత్యుత్తమముగా చెప్పును, లేక వేదములద్వారా ఉపదేశించును. ఈవిషయమును మీరెల్లరును చక్కగా తెలిసికొనుడు. వేదముల ఈశ్వరీయత్వమునందు ఏవిధముగు సందేహముండవలదు. కావుననే మంత్రములో 'బ్రహ్మణస్పతిః నూనం ప్రవదతి ఉక్థ్యం మన్త్రమ్' అని అతి స్పష్టశబ్దములలో తెలుపబడినది. మహర్షి దయానందులు చాలచక్కగా వ్రాసినారు.

**హే మనుష్యా! యేనేశ్వరేణ వేదా ఉపదిష్టాః, యః**

**సర్వజగదభివ్యాప్య స్థితోఽస్తి.....స ఏవ సర్వైర్మనుష్యైరుపాస్యోఽస్తి।**

అనగా; ఏపరమేశ్వరుడు వేదోపదేశమొనర్చినాడో, ఎవడు విశ్వమంతటను వ్యాపకుడైయున్నాడో ఆతనినే మనుష్య లుపాసించవలెను. తరువాత మంత్రమందును వేదముల ఈశ్వరీయత్వముతో గూడ సర్వహితకారకత్వమును గూర్చి మరల ఉపదేశమొనర్చబడియున్నది.

**౬. తమిద్ వోచేమా విదథేషు శమ్భువం మన్త్రం దేవా అనేహసమ్।**

**ఇమాం చ వాచం ప్రతి హర్యథా నరో విశ్వేద్ వామా వో అశ్నవత్** ॥ ఋగ్. ౧-౪౦-౬ ॥

ఈమంత్రమునందు (దేవాః) విద్వాంసులారా! మేము (తమ్) అట్టి(శంభువమ్) శాంతి, మరియు కల్యాణకారియగు (అనేహసమ్) సర్వదోషరహితుడు, సదా రక్షించువాడు (మన్త్రమ్) మాననీయ మంత్రసమూహమును (విదథేషు) పఠన-పాఠన, విజ్ఞానాది కర్తవ్యముల అవసరములందు (వోచేమ) ఉపదేశింతుము. మీరు దానినెరుగుడు. (నరః) నాయకులారా! మీరు (ఇమాం వాచమ్) ఈశంభు - శాంతికి మూలమైన పరమేశ్వరుని ద్వారా ప్రదత్తమైన వేదరూపవాణిని మీరు (ప్రతిహర్యథ) మాటిమాటికి అతిశ్రద్ధతో దెలిసికొనినచో ఈవాణి మీకు (విశ్వా వామా) ప్రశంసనీయమగు సకల సద్గుణములను 'వామఇతి ప్రశస్య నామసు ॥ నిఘం. ౩-౮' ప్రాప్తింపజేయును. దీని భావార్థమునందు మహర్షి దయానందులు యథార్థరూపమున ఇట్లు వ్రాసినాడు.

**''విద్వద్భిర్విద్యాప్రచారాయ సర్వేభ్యో మనుష్యేభ్యో నిత్యం సార్థాః సాఙ్గాః।**

**సరహస్యస్స్వరహస్తక్రియా వేదా ఉపదేష్టవ్యాః।**

**యది కశ్చిత్ సుఖమిచ్ఛేత్ స విద్వత్సంగేన వేదవిద్యాం ప్రాప్నుయాత్।**

**నైతయా వినా కస్యచిత్ సత్యం సుఖం భవతి।**

**తస్మాదధ్యాపకైరధ్యేతృభిశ్చ ప్రయత్నేన సకలా వేదా గ్రాహయితవ్యా గృహీతవ్యాశ్చ।''**

వేదమంత్రముల ఆధారమున వేదముల ఈశ్వరీయత్వము, మరియు ఉపయోగత్వమును గూర్చి ఇంతకన్న ఉత్తమ వర్ణన మేముండగలదు?

దిగువ నీయబడిన రెండు మంత్రములందొనర్చబడిన వేదముల ఈశ్వరీయత్వ జ్ఞానము, మరియు వేదవాణి ఈశ్వరీయవాణి యగు కారణమున అత్యధిక లాభదాయకమని చూపబడినది ఈప్రసంగము నందిది ఆవశ్యకమే యగును.

**ఏవా హ్యస్య సూనృతా విరప్శీ గోమతీ మహీ । పక్వా శాఖా న దాశుషే ॥** ఋ ౧-౮-౮ ॥

ఈమంత్రము నందు ' మహీ' శబ్దముచే **'మహీతి వాజ్ నామసు పఠితమ్'**॥ నిఘంటు. ౧-౧౧ ననుసరించి మహతీ సర్వపూజ్యా వేద వాణీ యొక్క గ్రహణము కలదు. దీనికి నిమ్నవిశేషముగలడు. (సూనృతా) ప్రియ సత్యప్రకాశిక, లేక ప్రియ మరియు సత్యవచనములను ప్రకాశపరచునది (విరప్శీ)

**'మహావిద్యాయుక్తా విరప్శీతి మహన్నామసు పఠితమ్ ॥'** నిఘం. 3-3॥

గొప్పవైన మహావిద్యలచే పరిపూర్ణమైన (గోమతీ) ఉత్తమస్తుతులతో గూడిన-

**'గౌరితి స్తోతృనామసు॥'** నిఘం. 3-౧౬ ॥

అనగా దీనిని ప్రశంసించువారు ఉత్తమజ్ఞానులు. ఈవిశేషణములతో గూడిన వేదవాణి విషయములో ఇచ్చట ఇట్లు చెప్పబడినది. ఈవేదవాణి (హి) నిశ్చయముగా (అస్య) పరమేశ్వరుడు ప్రసాదించిన దీనిని (దాశుషే పక్వా శాఖా న) అధ్యయమునందు ధ్యానపూర్వకముగా ఆత్మసమర్పణ మొనర్చుమానవులకు **అధ్యయనార్థం ధ్యానం దత్తవతే మనుష్యాయ**--- ఫలములచే నిండియున్న వృక్షములవలె వివిధ సుఖముల, మరియు విద్యలయొక్క ఆనందమును ప్రసాదించును. ఈమంత్రమునకు స్వామి ఆనందతీర్థ (శ్రీమధ్వాచార్య) మంత్రార్థ మంజరి యొక్క ప్రణేత (రచయిత) యగు రాఘవేంద్రయతి, మరియు మహర్షి దయానందులు మున్నగు వేదభాష్యకారులెల్లరును ఈయాశయమునే తమ తమ భాష్యములలో వెలిబుచ్చినారు. ఉదాహరణమునకు స్వామి ఆనందతీర్థ ఋగ్ భాష్యమునందిట్లు వ్రాసినారు

**ఏవమేవాస్య వాణీ చ, వేదేతా మహతీ తథా । పక్వా శాఖేవ దదతే వరదాత్రీ విరప్శినః ॥**

మహర్షి దయానందులు దీనికి పైన తెలిపిన అర్థమునొనర్చుచు, దీని భావార్థము ఈమహత్త్వపూర్ణములగు వాక్యములలో నిచ్చియున్నారు.

**'అత్రోపమాలఙ్కారః - యథా వివిధపుష్పఫలవన్త ఆమ్రపనసాదయో వృక్షా వివిధ ఫల ప్రదాః**

**సన్తి తథైవేశ్వరేణ వివిధ విద్యాన్నప్రదా వేదా అనేకసుఖభోగప్రదాః పృథివ్యాదయశ్చ ప్రసిద్ధీకృతాః సన్తి ।'**

**ఏతేషాం ప్రకాశో రాజ్యం చ విద్వద్భిరేవ కర్తుం శక్యతే ।**

దీని సారాంశము పైన నీయబడినది. ఇక నిచట మరల వ్రాయు ఆవశ్యకత యుండదు. దీనివల్ల వేదముల ఈశ్వరీయత్వము స్పష్టముగా సిద్ధించుచున్నది. సందేహములేదు. ఋగ్వేద.౧-౭౨-౧. నిమ్నమంత్రమును గనుడు.

**ని కావ్యా వేధసః శశ్వతస్కర్హస్తే దధానో నర్యా పురూణి ।**

**అగ్నిర్భువద్ రయిపతీ రయీణాం సత్రా చక్రాణో అమృతాని విశ్వా ॥**

విస్తారమగుననను భయముతో పూర్తిమంత్రమునకు విస్తృత వ్యాఖ్య నొనర్చక ఇచ్చట వేదములు 'నిత్యపరమేశ్వరునిచే ప్రాప్తించినవి, మరియు సర్వహితముల నిచ్చునవి' యని ఈ మంత్ర సారాంశమును చెప్పుటయే చాలుననుకొందుము.

శ్రీసాయణాచార్యుడు కూడా దీనియర్థము (శశ్వతః) **శాశ్వతస్య నిత్యస్య**(వేధసః) **విధాతు ర్బ్రహ్మణః సమ్బన్ధీని** (కావ్యా) **కావ్యాని మన్త్రరూపాణి** అనగా; నిత్యపరమేశ్వరుని మంత్రరూపకావ్యమిదియే యని యొనర్చినాడు. మహర్షి దయానందులు (వేధసః) **సకల విద్యాధాతుర్విధాతుః** (శశ్వతః) **అనాదిస్వరూపస్య పరమేశ్వరస్య సమ్బన్ధాత్ ప్రకాశితాని** (పురూణి) **బహూని** (సత్రా) **నిత్యాని సత్యార్థప్రతిపాదకాని** (అమృతాని) **మోక్షపర్యన్తార్థప్రాపకాని** (నర్యా) **నృభ్యోహితాని।**

ఈరూపములో దీని శబ్దముల సరళముగ మరియు స్పష్టముగ వ్యాఖ్యనొనర్చుచు దీని భావార్థములో నిట్లు వ్రాసినారు.

**హే మనుష్యాః! । అనన్త సత్యవిద్యేన అనాదినా సర్వజ్ఞేన పరమేశ్వరేణ యుష్మద్ధితాయ**

**స్వవిద్యామయా అనాదయో వేదాః ప్రకాశితాః, తాన్ అధీత్య అధ్యాప్య చ ధార్మికా**

**విద్వాంసో భూత్వా ధర్మార్థకామమోక్షాన్ నిర్వర్తయత** ॥ పు ౧౨౬౨ ॥

**భావము:–** ఓ మానవులారా! అనాది, సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు మీహితముకొరకు సత్యార్థ ప్రకాశకములు, జ్ఞానమయములు, అనాదులు నగు వేదములను ప్రకాశపరచినాడు. వానిని మీరు చదివి, చదివించి, ధర్మాత్ములగు విద్వాంసులై ధర్మార్థకామమోక్షములను సంప్రాప్తించుకొనుడు.

**యస్మాదృచో అపాతక్షన్ యజుర్యస్మాదపాకశన్ । సామాని యస్య లోమాన్యథ**

**ర్వాఙ్గిరసో ముఖమ్ స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః** ॥ అథర్వ.౧౦-౭-౨౦॥

ఇచ్చట పరమేశ్వరుని 'స్కమ్భ' అనగా, సర్వాధారు డను పేరుతో స్మరణమొనర్చుచు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదములను రచనజేయువాడు ఆపరమేశ్వరుడొక్కడే యని స్పష్టముగా తెలుపబడినది. ఇదేవిషయము;

**''యత్ర ఋషయః ప్రథమజా ఋచః సామ యజుర్మహీ ।''**

**ఏకర్షిర్యస్మిన్నార్పితః స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః** ॥ అథ . ౧౦-౭-౧౪ ॥

**స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్ ।**

**కవిర్మనీషీ పరిభూః స్వయంభూ ర్యాథా తథ్యతోఽర్థాన్ వ్యదధా**

**చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః** ॥ యజుర్వేద. ౪౦-౮ ॥

ఇంకా ఇతర వందలాది మంత్రములందును వేదములు ఋషికృతములని నమ్మె వారి ఆలోచన సంపూర్ణముగా నిరాకరింపబడినది.

### 3.11 వైదిక భాషయు ఈశ్వరప్రదత్తమేనా?

అనేకవిద్వాంసులు వైదికజ్ఞానము ఈశ్వరీయమని నమ్ముచును మంత్రరచనను ఋషికృత మనియెంచెదరు విశేషమగు సాధనల మరియు తపస్సుల ద్వారా ఋషులకు సంప్రాప్తించిన దివ్య ఈశ్వరీయ జ్ఞానమునే వారు మంత్రరూపమున మన కిచ్చియున్నారు. ఆ సంగ్రహములే ఇప్పుడు 'వేదసంహిత' అను పేరుతో పిలువబడుచున్నవనియును వారి విశ్వాసము. కాని మనము లోతుగా నాలోచించి చూడ వారియీాకల్పనలయందు అనేక దోషాలు స్పష్టముగా గాన్పించుచుండును.

౧. ఏశిక్షకుడైనను బోధించకుండనే లోకులకు ధ్యానము మున్నగువాని సరియైన మార్గమెట్లు తెలియగలదు?

౨. ఋషులకు ప్రాప్తించిన యా దివ్య ఈశ్వరీయజ్ఞానము ఏరూపములో నుండెను? ఏవిధమగు శబ్దములు లేకుండనే జ్ఞానమును పొందుట సాధ్యమేనా?

౩. ఋషులకు ప్రాప్తించిన యాజ్ఞానమును ఎట్టి పొరపాటు కల్పనలు లేకుండా యథార్థ శుద్ధరూపమున మన కిచ్చినా రనుటకేమి ప్రమాణము గలదు?

౪. భాషా ఉత్పత్తి, విశేషించి సమస్త భాషలకు జననియైనట్టి వైదికభాషవంటి పూర్ణభాష యొక్క ఉత్పత్తి కేవలము మానవ ప్రయత్నముచే సాధ్యమగునా? ఇంతేగాక మనము భాషా విజ్ఞానము యొక్క ఈప్రసిద్ధ సిద్ధాంతమును, ఆలోచనలను, మనకు భాషతో గల నిత్యసంబంధమును దృష్టియందుంచు కొనినప్పుడు నిమ్నలిఖిత ప్రసిద్ధవిద్వాంసుల లేఖలతో గూడ జ్ఞాతమగున దేమన, భాషకు కూడ మూలము ఈశ్వరీయమే యని నమ్మవలసివచ్చుచున్నది. అట్లు విశ్వసించకున్న మన మనుగడయే సాగజాలదని కూడ స్పష్టమగుచున్నది.

క. హర్డర్ *(Herder)* అనుపేరుగల భాషావిజ్ఞాని అభిప్రాయమిట్లు గలదు.

'Without language, man could never have come to his reason and we might add, to his senses.' (Schelling)

అనగా భాషలేనిదే మానవుడెన్నడును చక్కని తర్కమును ప్రాప్తించుకొనజాలడు.

ఖ. శెలింగ్ అనుపేరు గల భాషాశాస్త్రవిశారదు డిట్లనినాడు.

'Without language, it is impossible to cnoceive philosophical, nay, even any human consciousness.'

అనగా; భాషలేనిచో దార్శనికమేగాదు. ఏవిధమగు మానవీయ జ్ఞానము కూడా సంభవము గాజాలదు

గ. హీగల్ *Hegal* అనుపేరుగల సుప్రసిద్ధ దార్శనికు డిట్లువ్రాసినాడు.

*'We think in names'* మనము పేర్లలో, శబ్దములలో నాలోచింతుము.

ఘ. సర్ విలియం హైమిల్టన్ *(Sir William Hamilton)* ఇట్లు వ్రాసినాడు.

*'Words are the fortress of thoughts, unless thought be accompanied at each point of its evolution by a corresponding evolution of language, its further development is arrested.' - Sir William Hamiltan*

అనగా శబ్దములు ఆలోచనలకు దుర్గముల వంటివి. ఆలోచనలు మనవికాస సంబంధమగు ప్రతిబింధువుపైనను భాషావికాసముతో అనుగతము గానప్పుడు దాని భావిప్రగతి నిలిచిపోవును.

జ. 'వాన్ హుంబోల్టు' అనుపేరుగల జర్మనివిద్వాంసుడు చక్కగా వ్రాసినాడు.

'If we separate intellect and language , such a separation does not exist in reality.'

అనగా; మనమొకవేళ బుద్ధిని ( లేక తజ్జన్య ఆలోచనలను) భాషనుండి వేరుచేసిన యెడల ఇట్టి భిన్నత్వమునకెట్టి అస్తిత్వముండదు.

చ. శ్లీర్ మైకర్ *Schlier macher* అనువిద్వాంసు డిట్లువ్రాసినాడు.

'Thinking and speaking are so entirely one that one can only distinguish them as internal and external,any as internal, every thought is already a word.'

అనగా; ఆలోచించుట, మరియు చెప్పుట ( ఆలోచన, మరియు భాష) ఈరెండును సంపూర్ణముగా ఒక్కటే. వీని భేదము కేవలము లోపల, బయట అనురూపముననే చేయ వచ్చును. ఇంతేగాక, లోపలిరూపములో ప్రతియాలోచన ఒకశబ్దరూపమేయై యున్నది.

ఛ. సుప్రసిద్ధ విద్వాంసుడగు ప్రొ. మైక్స్‌మూలర్ ఈసిద్ధాంతమును ప్రబలయుక్తులచే నిరూపించుచు దీనినే మొత్తము భాషా విజ్ఞానము, మరియు దర్శనశాస్త్రములకాధారమని ఎంతవరకు వ్రాసినాడన,

'We think in words' must become the charter of all exact philosophy in future.'

The Science of language by Prof. Max muller. P.99.

అనగా; మనము శబ్దములలో ఆలోచింతుము. ఇది సంపూర్ణముగా తత్త్వజ్ఞానమునకు భవిష్యత్తులో ఆధారభూత తత్త్వమని యెంచవలసి యుండును. ఈ విషయమందే ఉపర్యుక్త విద్వాంసుల ఉద్ధరణమునిచ్చుచు ఇట్లువ్రాసినాడు

'We never meet with articulate sounds except as wedded to determinate ideas nor do we ever I believe, meet with determinate ideas except as embodied forth in articulate sounds. Therefore, declare my conviction as explicitly as possible, without language.'

(The Science of language by Prof. Maxmuller. p.99.)

అనగా; మనకు మిక్కిలి స్పష్టమగు శబ్దముల ప్రాప్తి వానితో గలిసియుండు ఆలోచనలు లేకుండ ఎప్పుడును కలుగజాలదు స్పష్టమగు మంత్రాలోచన ఉపలబ్ధి స్పష్టమగు శబ్దములు లేకుండా కలుగగలదను విశ్వాసము నాకులేదు. తర్కము, లేక యుక్తి మున్నగు వాని అర్థము నాలోచించుట భాషలేకుండా ఎప్పుడును సంభవముగాదను నావిశ్వాసమును స్పష్టముగా ప్రకటించుచున్నాను.

మన భారతీయార్యుల సిద్ధాంతము విషయములో మిక్కిలి స్పష్టము. విశేషముగా ప్రకటించు అవసరము లేకున్నను ఈమంత్రమును నిర్దేశించిన చాలుననుకొందుము.

**'సిద్ధే శబ్దార్థ సంబన్ధే'। ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సమ్బన్ధః** ॥ మీమాం. సూ.౧-౧-౫ ॥

**'నిత్యస్తుస్యాద్దర్శనస్యపరార్థత్వాత్'** ॥ మీమాంసా సూత్రము ౧-౧-౧౮ ॥

మున్నగు మీమాంసా సూత్రములందు పైన దెలిపిన శబ్దముల, మరియు అర్థముల నిత్యత్వము యొక్క సిద్ధాంతము అతిస్పష్టముగ ప్రతిపాదించబడినది. దీనిని కవికుల సార్వభౌముడగు కాళిదాసు తన రఘువంశము నందు,

**'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే'** ॥ రఘువం. సర్గ ౧-౧ ॥

ఈయుపమా ద్వార నిర్దేశమొనర్చినాడు. మహర్షి వ్యాసులు యోగసూత్ర. ౧౧-౨౭లో,

**సంప్రతిపత్తినిత్యతయా నిత్యః శబ్దార్థ సంబన్ధ ఇత్యాగమినః ప్రతిజానతే** ॥౧-౨౭॥

ఈయోగ సూత్రభాష్యములో వ్రాయబడిన శబ్దముల ద్వారా ఈసిద్ధాంతమే విశదముగ ప్రతిపాదించబడినది కావున ఆర్యుల పరంపరానుగతమగు విశ్వాసము ననుసరించి వేదముల శబ్దార్థ సంబంధములు నిత్యము. వీనిని యుక్తివిరుద్ధము, నిరాధారము అని తలచరాదు. భాషల తులనాత్మక, అను శీలనము వలన దెలియునదేమన! వైదికభాష కేవలము భారతదేశమునకుసంబంధించినదే గాదు; ప్రపంచమందలి సమస్త దేశములందు ప్రచలితమైయున్న సమస్తభాషలకును సాక్షాత్తుగనో పరంపరానుగతముగనో జననియే యనిస్పష్టముగా నిరూపించవచ్చును. ప్రకరణానుసారము మేమింకను ఈవిషయములో ప్రకటించుచుండగలము.

### 3.12 వైదికభాష సకల భాషలకు జనని

మేమిప్పుడు భాషాశాస్త్రవిశారదులగు ముగ్గురు పాశ్చాత్య విద్వాంసుల గ్రంథముల నుండి నిమ్నలిఖిత ఉదాహరణముల నిచ్చుటయే సరిపడుననుకొందుము.

బైరన్ కువీర్ *Baron Cuvier* పేరుగల విద్వాంసుడు సంస్కృతము నందు ప్రకృతివిజ్ఞాన విషయకమగు తన వ్యాఖ్యానములందిట్లు నుడివెను -

'It (Sanskrit) is the most regular language known and is especially remarkable, as containing the roots of the various languages of Europe and the Greek, Latin, German of Sclavonic.' - Baron Curvier-Lectures on the Natural Sciences.

సర్వజనులకు తెలిసిన భాషలన్నింటిలోను సంస్కృతవాణియే అన్నిటికన్న నియమబద్ధమైయున్నది. విశేషించి ఉల్లేఖించదగిన విషయమేమనగా! యూరోపునందలి వివిధభాషలలో అనగా; గ్రీకు, లైటిన్, జర్మన్, స్క్లావొనిక్ మున్నగు సమ్మిళిత భాషలందు సంస్కృతధాతువులేగాన్పించును. అనగా; వాని భాషల మూలము సంస్కృతమే.

'ఐడ్లింగ్' అను విద్వాంసుడు సంస్కృత సాహిత్యవిషయసంబంధమగు తన గ్రంథములో ఈవిషయముపై విస్తృత ప్రకాశము వేయుచు ఇట్లు స్పష్టపరచియున్నాడు.

'The great number of languages which are said to owe their origin or bear a close affinity to the Sanskrit, is truly astonishing and is another proof of its high antiquity.' A German writer - Rudinger - has asserted it to be the parent of upwards of a hundred languages and dialects among which he enumerates twelve Indian, seven Median Persic, two Arnautic Albanian, seven Greek, eighteen Latin, fourteen Sclavonian and six Celtic-Gallic. The various vocabularies which we now posses, and the result of laborious and learned investigations render it pretty evident that the Sanskrit has not only furnished words for all the languages of Europe, but forms a main feature in almost all those of the East. A host of writers have made it the immediate parent of the Greek and Latin and German families of Languages.'

అనగా; సంస్కృతమునుండి ఉత్పన్నమగు, లేక సంస్కృతముతో అత్యధిక సమానత్వము గల భాషల సంఖ్య అత్యంత ఆశ్చర్యజనకముగ నున్నది. మరియు నివి ఈభాషయొక్క అత్యంత ప్రాచీనత్వమునకు ప్రమాణములు 'రూడిగర్' అనునొకజర్మన్ విద్వాంసుడు, లేఖకుడు దీనిని యూరోపు, మరియు ఆశియాకు సంబంధించిన వందకన్న నధిక భాషలకు జననియని చూపినాడు. ఇప్పుడు మావద్ద భిన్న భిన్న భాషలకు సంబంధించిన శబ్దకోశము గలదు. అత్యంత పరిశ్రమ నొనర్చి విద్వాంసులు దీనిని అను, సంధానమొనర్చినారు దాని పరిణామ స్వరూపముగ సంస్కృతము కేవలము యూరోపుకు చెందిన సమస్తభాషలకు శబ్దావళిని ప్రదానమొనర్చుటయే గాదు. ఆశియాయందలి సర్వభాషలకును ఇది పరమావశ్యకమగు ఒకముఖ్యాంగమే. అనేక విద్వాంసులు దీనిని గ్రీకు, లైటిన్, జర్మన్ కుటుంబ (పరివార) భాషలకు జనని రూపములో నమ్ముదురు.

పక్షపాత రహిత విద్వాంసులు పై దెలిపిన అభిప్రాయములను ఉదాహరణముగానిచ్చి దీనిని నిరూపించుటకు జేసిన ప్రయత్నమెంతయో మహత్త్వపూర్ణమైయున్నది.

'బాప్' *Bopp* మున్నగు పాశ్చాత్య ప్రసిద్ధ భాషావిజ్ఞులుకూడా:

'At one time, Sanskrit was the one language spoken all over the world.' (Bopp in Edinburgh Review vol. 33. p.43.)

మున్నగు వాక్యముల ద్వారా దీని స్థిరత్వమును సమర్థించినారు. పూర్వకాలమున సంస్కృతభాష ప్రపంచమంతటను వ్యవహరించబడుచుండెడిది. ఈకారణముననే వైదికభాష ఏదోయొక దేశవిశేషమునకు సంబంధించిన భాషయని ఆక్షేపణము నొనర్చుటకన్న హీనత్వమింకేమి యుండును?

మంత్రరచన యొక్క అద్భుతత్త్వము కూడ దాని ఈశ్వరీయత్వమునకు స్పష్టమగు సాక్షినొనర్చుచున్నది. 'మను' మున్నగు ప్రాచీన మహామునులు, మరియు శ్రీమధ్వాచార్య (స్వామీఆనందతీర్థ), మహర్షి దయానందుల సిద్ధాంతము ననుసరించి వేదము యొక్క ప్రతిమంత్రము నందును దాదాపు ఆధ్యాత్మికము, ఆధిదైవికము, అధిభౌతికమను మూడర్థములును సంభవమైయున్నవి. ఒక్కొకచోట స్పష్టము, మరొకచోట అస్పష్టముగా

నైనను వీనిజ్ఞానము గలుగుచుండును.

**అధియజ్ఞం బ్రహ్మ జపేత్ ఆధిదైవికమేవ చ ।**

**ఆధ్యాత్మికం చ సతతం, వేదాన్తాభిహితం చ యత్** ॥ మనుస్మృతి. ౬-౮౩ ॥

మున్నగు మనుస్మృతి శ్లోకములు, మరియు

**'త్రయో ఽర్థాః సర్వవేదేషు,'**

(స్వామిఆనందతీర్థకృత 'ఋగ్భాష్య' మున్నగువానిచే ఈవిషయము స్పష్టమగును.)

నిరుక్తకారుడగు యాస్కముని కూడా అనేకమంత్రములకు ఈవిధముగనే రెండు, రెండు, మూడు మూడర్థముల నొనర్చినారు అగ్నిసూక్తము, ఇన్ద్రసూక్తము, రుద్రసూక్తము మున్నగు వాని మంత్రములందు వారొనర్చిన భౌతికార్థములతో బాటు ఆత్మ,పరమాత్మ మున్నగు వాని ప్రతిపాదనలను జూచి గొప్ప గొప్ప బుద్ధియును చకితమైపోయినది. కావున సుప్రసిద్ధ వైశేషిక విద్వాంసులగు కణాదముని ఇట్లనినాడు.

**'బుద్ధి పూర్వా వాక్యకృతిర్వేదే'** ॥ వైశే. ౬-౧-౧ ॥

అనగా, వేదములందు వాక్యరచన బుద్ధిపూర్వకమై యున్నదిగాని, అసంగతముగాదు. ఇప్పుడీవిషయము నందింతయే చాలునను కొందుము.

ఈవిధముగా మేమీ యధ్యాయమునందు *Vedic Age* మరియు తత్సదృశ ఇతర గ్రంథములందు పేర్కొనబడిన ఋషులు వేదమంత్రకర్తలను కల్పనలను నిరాకరించి వారు మంత్రద్రష్టలను విషయమును సప్రమాణముగ నిరూపించుటకు ప్రయత్నించితిమి. మరియు అనేక ఋషుల పేర్లు విశేష మంత్రములలోను, మరియు సూక్తములందును ప్రతిపాదించబడిన విషయములకు విశేషప్రచారకులగు కారణమున ఉపనామముల రూపమున మాత్రమే ప్రసిద్ధమైన వనియును చూపియున్నాము. ఇంతమాత్రముచే వేదములం దెచ్చటనైనను ఈసిద్ధాంతములను విశ్వసించిన సందేహనివృత్తిగలుగకుండినచో అనేక ఋషులపేర్లను కవినిబద్ధ ప్రవక్తలరూపమున గైకొనవలెనని మరువకూడదు. విశేషించి ఋషి మత్స్య, కపోత, నది, దేవశుని మున్నగు రూపమున చూపబడినచో నతని మంత్రద్రష్టృత్వము సంభవముగాదు. పంచతంత్రము మున్నగు గ్రంథములందు సరళముగా సామాన్యబుద్ధిగలవారికి సైతము నీతితత్త్వములను బోధించుటకై విష్ణుశర్మాదులు కరటక, దమనక, సంజీవక, వజ్రదంత, దీర్ఘజీవి మొదలగు సింహము, నక్క, కాకి మున్నగు పాత్రలను కథనానుసారము చేసికొనినారు వానిద్వారా నీతితత్త్వముల ఉపదేశమొనర్పజేసి యుండిన విషయమనేకులకు తెలిసియుండును. నక్క, కాకి, సింహము మున్నగు జంతువులు సంభాషించుకొనుట, నీతితత్త్వములను దెలిసికొనుట, తెలియజేయుట మున్నగునవి చేయజాలవు. ఐనను గ్రంథకారులు వానిని ప్రవక్తల రూపమున విషయప్రతిపాదనమున సరళత్వమున్నకై ఉపనిబద్ధమొనర్చినారు. ఇదేవిధముగ

**'పశ్య దేవస్య కావ్యం న మమార న జీర్యతి'** ॥ అథర్వ.౧౦-౮-౩౨ ॥

దీనిననుసరించి వేదరూప మహాకావ్యమునందు విషయప్రతిపాదనకై అనేక స్థలములందు కపోత, మత్స్య, నది మున్నగు వానిని ప్రవక్తల రూపములో దీసికొనబడినది. ఇదేవిధముగ అనేక మంత్రములలో వచ్చిన అనేక ఋషుల నామములు అసంగతమనిపించును. ఒకవేళ మరొకవిధముగా యౌగికార్థము దీసికొనినను దాని యందును ఏదోయొక ఇబ్బంది యనిపించుచుండును. ఈవిధముగా ఈ వైదిక విషయములో ప్రకటించిన తరువాత మేమిప్పుడు వైదిక ఏకేశ్వరవాదము, మరియు అనేక దేవతావాదమును గూర్చి రాబోవు అధ్యాయములో విస్తరించి తెలుపుటకు ప్రయత్నించెదము.

మామిత్రులు, మరియు కాంగ్డీగురుకులము యొక్క ప్రముఖ స్నాతకులునగు శ్రీ పం. హరిశరణ సిద్ధాంతాలంకారగారు 'ఋగ్వేదఋషులు' అను దాదాపు 200 పుటలుగల పుస్తకమును వ్రాసినారు. దానిని పం. మనోహర్ విద్యాలంకార్ గారు సంజయ్‌ప్రెస్, చూనామండి క్రొత్తఢిల్లీ గారు ప్రచురించినారు. ఋగ్వేదము యొక్క మొత్తము ౩౭౮ ఋషులు యౌగికార్థములను దెలుపుచు మంత్రముల ప్రతిపాద్యవిషయములతో బాటు వారి సంబంధము దెలిపినారు. దీనివల్ల ఈవిషయము నందలి శంకలకు దాదాపు సంపూర్ణ సమాధానము లభించగలదు.

ఇట్టి మహత్త్వపూర్ణ పుస్తమేగాక శ్రీ. పం. శివశంకరకావ్యతీర్థగారి 'వైదికఇతిహాసార్థ నిర్ణయము', శ్రీ. పం. ప్రియరత్నాఆర్షగారి 'వేదోఁమే ఇతిహాస్ నహీఁ', మరియు శ్రీ. పం. జయదేవ విద్యామార్తాండకృత,'క్యా వేదోఁమే ఇతిహాస్ హై?' (ఆర్షసాహిత్యమండల్ అజ్మీరు ద్వారా ప్రచురింపబడినది.) ఈపుస్తకములను విద్వాంసులగు మా పాఠకులెల్లరును చదువవలె నని కోరుచున్నాము. ఇందువల్ల ఋషులు మంత్రకర్తలు గారు, మంత్రద్రష్టలై యుండిరని ఈమంతవ్యములకు పూర్ణ బలము సమకూరగలదు. ఋషులు మంత్రకర్తలను అశుద్ధధారణల కారణముననే శ్రీసాయణాచార్యులు, శ్రీస్వామీ ఆనందతీర్థ, శ్రీస్కందస్వామి మున్నగు వారు తమవేద భాష్యముల భూమికలందు వర్ణించియున్నారు. అందువల్ల వేదముల నిత్యత్వము, మరియు అపౌరుషేయత్వము మున్నగు వేదాది సత్యశాస్త్రసమ్మత సిద్ధాంతములకు సర్వథావిరుద్ధముగుట వల్ల వేదముల యెడ గొప్పఅనర్థమే యైనది. ఈవిషయవములను గూర్చి కొన్ని నిర్దేశములను మేమిదివరకే ఇచ్చియుంటిమి. మరికొన్ని నిర్దేశములను ప్రకరణానుకూలముగ ముందు ముందు తెలుపుదుము. ఈభ్రమను దొలగించుట అత్యావశ్యకమేగదా!



# వేదముల యథార్థ స్వరూపము.

## చతుర్థాధ్యాయము.

### 4.1 వైదిక ఏకేశ్వర వాదము మరియు అనేక దేవతలు.

ఈ యధ్యాయమునందు మేము 'వైదిక దేవతలు, మరియు వేదోక్త ఏకేశ్వరపూజ' అను విషయముపై ఆలోచించ దలచినాము. ఏలన; వైదిక ధర్మవిషయములో పాశ్చాత్యులేగాక భారతీయ లేఖకులెందరో ఈవిషయమును గూర్చి అనేకభ్రమలను వ్యాపింపజేసినారు.

*Vedic Age* అను గ్రంథ రచయితలు ఈవిషయములో నిమ్నలిఖిత నిర్ణయము నొనర్చినారు. దీనియందు మౌలికత్వము, మరియు నవీనత్వము లవలేశమైనను గానరాదు. ఐనను ఈవిషయములో కొందరు పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయములను కేవలము కొన్ని అనుకరణముల నిచ్చుట ఇచ్చుచున్నాము.

*History of Sanskrit Literature* మరియు *India -What it can teach us by Prof Maxmullar, History of ancient Sanskrit Liturature Vol I by Winterneitze, History of Sanskrit Literature by Prof Weber, Religion and Philosophy of the Veda by A.B Keith, The Religion of the RigVeda by Griswold, The Religion of the Veda by Bloomfield, Rig Veda and Vedic Religion by Clayton* మున్నగు పుస్తకములందు వైదిక దేవతలు, వైదిక ఏకేశ్వరవాద విషయమున వెలిబుచ్చిన భావములనే *Vedic Age* అను పుస్తకరచయితలు నిష్పక్షపాతముగా నిస్సంకోచముగా, వివేచింపకయే అనుసరించినారు. దాని సారాంశమును మేము వారి శబ్దములందే ఇచ్చుచున్నాము. *Vedic Age* లేఖకులిట్లు వ్రాయుచున్నారు.

'It has been generally held that the Rigvedic Religion is essentially Poly-theistic one, taking on a pantheistic colouring only in a few of its latest hymns. Yet a deeply abstract philosophising crops up unexpectedly in some hymns as a reminder of the long Journey made from primitive poly-theism to systematic philosophy, through the stages of Naturalistic poly-theism, monotheism and monism' Vedic Age p.378.

'The appearance of what Maxmullar calls henotheism is due to this unconscious urge towards monotheism imperfectly moulding poly-theistic tendencies and thus presenting an inconsistent picture.'

'When individual gods are alternately regarded as 'highest' a large number of attributes, personal charcteristics and functions become common to all the gods, the merging of all these qualities into one divine figure becomes easy, and thus poly-theistic anthropomorphism evolves into a kind of spiritual mono-theism.' Vedic Age. p. 379.

**Summary:-**

Some of the significant aspects of Rigvedic mythology may now be summed up thus-

1. The Principal phenomena of nature conceived as alive and represented in anthropomorphic shape, were the objects of worship.

2. The so-called simple primitive side of nature-worship may be supposed to be reflected in the adoration of plants, trees and mountains.

3. Whether fetishism is to be read into a reference to an image of Indra and whether the worship of idols or images of gods was known to the Rigveda, are points on which no certain conclusions can be reached.' - Vedic Age. p. 376.

ఇంతపెద్ద ఉదాహరణము యొక్క భావమేమన- ఋగ్వేదము యొక్క ధర్మప్రాధాన్యత మూలరూపములో బహుదేవతావాదము, లేక అనేకేశ్వరవాదముగ గాన్పించినను, చివరికొన్ని సూక్తములందు అద్వైతవాదము యొక్క ఛాయలు గాన్పించినట్లు అనిపించినను, అనేక సూక్తములందు గంభీరమైన దార్శనిక చర్చలు గలవు. ఇవి మన దీర్ఘయాత్రను స్మరణమునకు దెచ్చును మరియు మనకు గల్గిన ప్రారంభిక అసభ్యమైన అనేకేశ్వరవాదమునుండి క్రమబద్ధముగా తత్త్వజ్ఞానమువైపునకు, మరియు ప్రాకృతిక బహుదేవతా వాదమునుండి ఏకేశ్వరవాదము, మరియు అద్వైత వాదము యొక్క గమ్యస్థానమునకు జేర్చును.

ప్రొ. మైక్స్‌మూలర్ దీనికి ''హీనోథీఇజమ్'' నామము నిచ్చియున్నాడు. అది యాతని ఏకేశ్వరవాదమును కూలంకషముగ దెలిసికొనజాలని ప్రవృత్తి యొక్క ఫలస్వరూపమై యున్నది. అది బహు దేవతాత్మక ప్రవృత్తులను కొంతవరకు పరివర్తితమొనర్చివేయును. మరియు నీవిధముగు నొక అసంబద్ధచిత్రమును చూపించును.

దేవతలు వేర్వేరుగా పర్యాయరూపమున (వంతులవారిగా) సర్వోన్నతముగ నెంచబడుచున్నవి. అప్పుడనేక గుణములు, వైయ్యక్తిక విశేషములు, మరియు వాని కార్యములు దేవతలన్నింటికిని సమానమే యగుచున్నవి. ఈవిధముగ ఈసకల గుణములను ఒకే పరమాత్మయందు సమావిష్ట పరచుకొనుట యందు సుగమమైపోవును. ఈవిధముగ బహుదేవతాత్మక పురుషునివలె ఈశ్వరవాదము కూడ ఒకవిధమైన ఆధ్యాత్మిక ఏకేశ్వరవాద రూపములో వికసితమైపోవును. (వైదిక్ ఏజ్. పు. ౩౭౬)

**సారాంశము:-**

ఋగ్వేదీయ దేవతాసమూహము యొక్క ముఖ్య రూపములీవిధముగనుండును.

౧. ప్రకృతి యొక్క ముఖ్యస్వరూపమును, మరియు కార్యమును చైతన్యరూపమున కల్పననొనర్చి దేవుని ప్రతినిధిత్వముగ నొక మానవ రూపము నేర్పరచి అది పూజనీయమని ఎంచబడుచుండెడిది.

౨. వనస్పతుల, వృక్షముల, పర్వతముల స్తుతి పూజలందు ప్రకృతి పూజయొక్క సులభమైన ప్రారంభికాంశమే ప్రతిబింబిత మనిపించును.

3. ఇంద్రుని మూర్తి నిర్దేశమొనర్చుటలో, మరియు ఇతరరూపములలో దేవతల ప్రతిమల, లేక మూర్తుల పూజలు ఋగ్వేదకాలమున తెలిసియుండెనా, లేదా? యను విషయములో ఒకనిశ్చిత పరిణామమునకు చేరజాలము

భాషానువాద సహితముగా 'వైదిక్ ఏజ్' నుండి ఈదీర్ఘమగు ఉద్ధరణముల నిచ్చిన తరువాత మేమిప్పుడా విషయములపై వివేచన మొనర్చుచున్నాము.

## 4.2 వేదములలో విశుద్ధమగు ఏకేశ్వరవాదము

నిష్పాక్షికభావముతో వేదములను చదివినప్పుడు అనేకస్థానములందు అనేక దేవతల నిర్దేశమున్నప్పటికిని (వీనిస్వరూప, తాత్పర్యమును మేము ముందుముందు కొంత విస్తరించెదము) దేవాధిదేవుడు, సకలదేవతల అధిష్ఠాతరూపములో ఒకే ఈశ్వరుని పూజావిధానమే మనకు గాన్పించును. ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని, యమ, మాతరిశ్వా, వాయు, సూర్య, సవిత మున్నగునవి ముఖ్యముగా ఆ ఒకే పరమేశ్వరుని భిన్న భిన్న గుణములను సూచించు నామములే యైయున్నవి. ఇందుకు ఈదిగువ నిచ్చిన అతిస్పష్ట మంత్రముల నిర్దశమే సరిపడు ననుకొందుము.

ఋగ్వేద. ౧-౧౬౪-౪౬ మంత్రమునం దిట్లు చెప్పబడియున్నది.

**ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్।**

**ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥**

ఈమంత్రములో స్పష్టముగా చెప్పబడినది, ఏమన: (ఏకం సత్) ఒకే సత్స్వరూపుడు, సదా అభిన్నరూపములోనుండు, లేక నిర్వికారుడగు పరమేశ్వరుని (విప్రాః) బుద్ధిశాలురగు జ్ఞానులు (బహుధా వదన్తి) అనేక విధములుగ, అనేకనామములతో బిలిచెదరు. వా రాతనిని అగ్ని, యమ, మాతరిశ్వా, ఇన్ద్ర, మిత్ర, వరుణ, దివ్య, సుపర్ణ, గరుత్మాన్ మొదలగు నామములతో స్మరించుచుందురు.

ఈనామములు పరమేశ్వరుని అనేక గుణములను స్మరణకు దెచ్చుచుండును. ఉదాహరణమునకు, **'ఇన్ద్ర'** నామము పరమాత్మ పరమైశ్వర్య సంపన్నుడగుటను, **'మిత్ర'** ఆయన ఎల్లరస్నేహితుడు, మిత్రుడగుటను, **'వరుణ'** అనుపేరు సర్వోత్తముడు, మరియు అజ్ఞానాంధకారమును దొలగించువాడగుటను, అగ్ని నామము జ్ఞానస్వరూపుడు, అందరికన్న ముందుండువాడు, మరియు నాయకుడగుటను, **'యమ'** సర్వనియామకుడగుటను, **'మాతరిశ్వా'** ఆకాశము, మరియు జీవాత్మలందు అంతర్యామిరూపములో వ్యాపకుడైయుండుటను, **సూర్య,** సర్వప్రకాశకుడగుటను, **సుపర్ణ,** అత్యుత్తమ కర్మలొనర్చువాడగుటను, **గరుత్మాన్,** మహాన్ సర్వవ్యాప్యాత్మ యైయుండుటను, **దివ్య,** అత్యంతాద్భుత దివ్యగుణ కర్మ స్వభావ సంపన్నుడగుటను స్మరణమునకు దెచ్చుచుండును.

**'ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమాహుః'** అను మంత్రము యొక్క అంగ్రేజి అనువాదము,

They call him Indra- God of supreme power, 'Mitra' - the Friend of all, 'Varuna' - the most Desirable being, 'Agni' the all knowing, 'Divya' - the shining one and 'Garutman' the mighty soul. The sages describe the one being in various ways, calling Him Agni -self refulgent one. Yama- the Ordainer of the world and Matarishwan - the life energy of the universe. - (RigVeda 1-164-46)

యూరోపునకు చెందిన సుప్రసిద్ధుడగు 'అర్నేస్టు వుడ్' *Ernest wood* అను ఆంగ్రేజి సజ్జనుడు *'An Englishman defends Mother India'* అను పేరుగల పుస్తకములో ఈమంత్రము యొక్క అనువాద మిట్లువ్రాసినాడు.

"In the eyes of the Hindus, there is but One Supreme God. This was stated long ago in the RigVeda in the following words:-

'Ekam Sad Vipra Bahudha Vadanti" which may be translated-

"The Sages name the One Being variously".

An Englishman defends MotherIndia by Ernest wood, p. 128

యూరోపునందలి సంస్కృతజ్ఞుల కాలమునందలి అధిక ప్రసిద్ధిగల ప్రొ. మైక్స్‌మూలర్ తన మొదటి గ్రంథములందు వేదములను "హినోథీఇజమ్. *Henotheism or Kathenotheism* యొక్క ప్రతిపాదకములని తెలుపుటకు ప్రయత్నించినాడు. (దీని విషయము ముందు ప్రస్తావించగలము) ఈవిషయమును తన చివరి గ్రంథమగు *The six Systems of Philosophy* యందు మహర్షి దయానందుల ఋగ్వేదాది భాష్యభూమికను చదివిన తరువాత వ్రాసియుండెను. వేదములలో ఇన్ద్ర, మిత్ర, అగ్ని, వరుణ, మాతరిశ్వా, ప్రజాపతి, మున్నగు శబ్దముల ద్వారా వాస్తవముగా ఒకే పరమేశ్వరుని ప్రతిపాదించబడినది, ఆతను అనంతుడు, మరియు నిర్వికారుడనియును స్వీకరించవలసియే వచ్చినది. ప్రొ. మైక్స్ మూలర్‌స్వంత శబ్దములనే ఇచ్చుటవ్రాయుచున్నాము.

"Whatever may be the age when the collection of our RigVeda Samhita was finished, it was before that age, that the conception had been formed that there is but One Being neither male nor female a Being raised high above all the conditions and limitations of personality and of human nature and never the less the Being that was really meant by all - such names as Indra, Agni, Matarishvan, and by the name of Prajapati-Lord of creatures".

ఋగ్వేద ౫-౫౧-౧౬ లో ఏకేశ్వరవాదమును గూర్చి ఎంతస్పష్టమగు శబ్దముల ద్వారా ప్రతిపాదించబడినదో చూడుడు.

**య ఏక ఇత్ తముష్టుహి కృష్టీనాం విచర్షణిః । పతిర్జజ్ఞే వృషక్రతుః ॥ ఋ.౫-౫౪-౧౬॥**

అనగా; ఏపరమేశ్వరుడు (ఏకః ఇత్) ఒకే ఒకడో, హేమానవులారా! (తమ్ ఉ స్తుహి) మీరు ఆతనినే స్తుతించుడు. ఆపరమేశ్వరుడు (కృష్టీనామ్) సకల మానవులను (విచర్షణిః) సర్వమును చాల చక్కగా

చూచుకొనువాడు, సర్వజ్ఞుడునై యున్నాడు. ఆయనయే (వృష(క్రతుః) సుఖములను వర్షింపజేయు జ్ఞానము, మరియు కర్మలకు (పతిః జజ్ఞే) విశ్వమంతటికిని స్వామియైయున్నాడు.

ఇచ్చట పరమేశ్వరుని 'ఏక ఇత్' అనగా 'ఆతడొక్కడేయైయున్నాడు' అను శబ్దమునెంత స్పష్టముగా తెలుపబడినదో చూడుడు. ఇట్లున్నను వైదిక ధర్మమును అనేకేశ్వరవాదము, మరియు ప్రకృతి పూజకమని యనుట ఎంతటి పక్షపాతము, మరియు అజ్ఞానసూచకమైయున్నదో ఆలోచించుడు.

O man! Praise him who is One and One only,being the Almighty and Omniscient Lord of all beings. (Rig.6-51-16)

ఋగ్వేద ౬-౨౨-౧లో ఏకేశ్వరవాదము స్పష్ట శబ్దములలో తెలుపబడినది.

**య ఏక ఇద్ హవ్యశ్చర్షణీనామిన్ద్రం తం గీర్భిరభ్యర్చ ఆభిః।**

**యః పత్యతే వృషభో వృష్ణ్యావాన్ సత్యః సత్వా పురుమాయః సహస్వాన్** ॥ ఋ.౬-౨౨-౧॥

అనగా; (యః) ఏ (ఇన్ద్ర) పరమేశ్వరుడు (చర్షణీనామ్) సకల మానవులకు (ఏకః ఇత్) ఒకడే (హవ్యః) పూజనీయుడై యున్నాడో (తమ్) ఆయననే (అభిః గీర్భిః) ఈ వాణుల ద్వార (అభిఅర్చ) నక్షిశల నుండి ప్రేమ పూర్వకముగా పూజించుము. (యః) ఎవడు (వృషభః) సుఖవర్షకుడు (వృష్ణ్యావాన్) సర్వ శక్తిమంతుడు (సత్యః) సత్య స్వరూపుడు (సత్వా పురుమాయః సహస్వాన్ పత్యతే) అత్యధిక బుద్ధిశాలి, సర్వజ్ఞుడు, మరియు సర్వశక్తి సంపన్నుడగు కారణమున సమస్త దుష్ట శక్తులను పరాజితమొనర్చువాడు, విశ్వమంతటికిని స్వామియైయున్నాడో అట్టి పరమేశ్వరుడొక్కడు మాత్రమే పూజనీయుడై యున్నాడు.

ఈ విధముగా మంత్రములో పరమేశ్వరుని సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి శాలి, విశ్వమంతటికిని స్వామియని తెలుపుచు ఆతని పూజావిధానమే చూపబడినది.

O man! glorify that God by your words who is the only One object of worship. He is the Almighty True Lord of the universe, showerer of joy and bliss. (Rig Veda 6-22-1)

ఋ. ౮-౧-౧ లో ఏకమాత్రుడగు పరమేశ్వరుని పూజా విధానమునే యొనర్చుచు అన్యుల పూజ స్పష్టముగా నిషేధించబడియున్నది. దీనిని పాటించక ఇతర దేవీ దేవతల స్తుతినొనర్చిన నవి దుఃఖ కారణములనియే తెలుపబడినది.

**మా చిదన్యద్ విశంసత సఖాయో మా రిషణ్యత ।**

**ఇన్ద్రమిత్ స్తోతా వృషణం సచాసుతే ముహురుక్థా చ శంసత** ॥ ఋ.౮-౧-౧॥

అనగా; (సఖాయః) ఓ మిత్రులారా! (అన్యత్ మా చిత్ విశంసత) విశేషించి ఇతరులెవ్వరి స్తుతులను గాని, పూజలను గాని ఒనర్చకుడు (మా రిషణ్యత) ఈ విధముగ ఇతరుల పూజలొనర్చి దుఃఖముల పాలు గాకుడు. (సచాసుతే) కలిసియుండి యజ్ఞాదులందును (వృషణమ్) సుఖముల వర్షింపజేయు (ఇన్ద్రమ్ ఇత్) ఒకే పరమేశ్వరుని (స్తోత) స్తుతించుడు. (ముహుః) మాటిమాటికిని (ఉక్థాచ శం సత) ఆతని గుణములనే వేద మంత్రముల ద్వారా గానమొనర్చుచుండుడు.

'ఇన్ద్రమ్ ఇత్ స్తోత' కేవలము పరమేశ్వర స్తుతినే యొనర్చుడు. ఏకేశ్వర వాదమునందింత కన్న గొప్ప ప్రతిపాదన మేముండగలదు? ఇంత ప్రబల యాధారముండి యును ఋగ్వేదోక్త ధర్మమును అనేకేశ్వరవాది, లేక *Polytheistic* యనుట ఎంతటి యజ్ఞానమో, పక్షపాత సూచకమో!

ఋగ్వేద. ౧౦-౮౨లో ఏకేశ్వర వాద ప్రతిపాదనము అన్ని మంత్రములందును 'విశ్వకర్మ లేక జగత్కర్త' యను పేర స్మరణమొనర్చుచు చేయబడినది. ౭ మంత్రములు గల ఈ చిన్న సూక్తములో 3 సార్లు 'ఏక' అను శబ్దము పరమేశ్వరుని పరముగా ప్రయోగించబడినది. (౨,3,౬వ మంత్రములందు) .

రెండవ మంత్రములో 'విశ్వకర్మ' అనగా 'జగత్కర్త' పరమేశ్వరుని గుణములను దిగువ విధముగా వర్ణించుచు ఆతడొక్కడేయైయుండుట ప్రతిపాదించబడినది.

**విశ్వకర్మా విమనా ఆద్ విహాయ ధాతా విధాతా పరమోత సన్దృక్।**

**తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్త ఋషీన్ పర ఏకమాహుః** ॥ ఋ.౧౦-౮౨-౨ ॥

ఈ మంత్ర తాత్పర్యమేమన ఆ (విశ్వకర్మ) జగత్కర్తయగు పరమేశ్వరుడు (విమనాః ఆత్ విహాయా) వివిధ మనస్సులకు స్వామి, ఆకాశము వలె వ్యాపకుడు, (ధాతా) విశ్వమును ధారణమొనర్చువాడు (విధాతా) విశేషించి సూర్యచంద్రులను, మరియు లోకలోకాంతరములను ధారణము, మరియు పోషణము నొనర్చువాడు (పరమా) అత్యంత శ్రేష్ఠుడు (ఉత) మరియు (సన్దృక్) సర్వజ్ఞుడై యున్నాడు. (యత్రా) విద్వాంసులా పరమేశ్వరుని విషయములో (ఆహుః) ఇట్లు చెప్పుచున్నారు. (సప్తఋషీన్ పరే) సప్తేంద్రియముల కావల (ఏకమ్) ఒక్కడేయైయున్నాడు. మరియు ఆ పరమేశ్వరాశ్రయమున (తేషామ్) అట్టి ఇంద్రియముల నభిలషించి యున్న సమస్త భోగ్య పదార్థములు (ఇషా) ఆ ప్రభువు యొక్క ప్రేరక శక్తి చే (సంమదన్తి) అత్యంతానంద కారణములగు చుండును.

ఇచ్చట పరమేశ్వరుని జగత్కర్త, ధర్త, మరియు సర్వజ్ఞుడగుటను నిరూపించుచు ఆయన ఇంద్రియాతీతుడు, మరియు ఒక్కడేయని తెలుపబడినది. ఇది అతిస్పష్టము, మరియు దీనియందు సందేహించుట కెట్టి కారణము లేదు.

ఈ సూక్తములో మూడవ మంత్రము ఈ ప్రకరణమునందు అత్యధిక ఆవశ్యకము, మరియు మహత్త్వ పూర్ణమైయున్నది. దీనియందు పరమేశ్వరుడొక్కడేయని, మరియు దేవతల సమస్త నామములను ధారణమొనర్చు వాడనియు చూపబడినది

**యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।**

**యో దేవానాం నామధా ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా ॥**

॥ ఋ. ౧౦-౮౨-3, యజు ౧౭-౨౭, అథర్వ ౨-౧-3 ॥

అనగా; (యః నః పితా) ఏ పరమేశ్వరుడు మనకు పాలకుడో, (జనితా) ఉత్పాదకుడో (యః) ఎవడు (విధాతా) విశేషరూపమున మనను ధరించువాడో మరియు (విశ్వా ధామాని) సకల స్థానములను, లోకములను, మరియు (భువనాని) ఉత్పన్న పదార్థములను (వేద) ఎరిగియున్నాడో (యః దేవానాం నామధా ఏకః ఏవ)

ఎవడు సమస్త దేవతల (ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని, యమాది) నామములను ముఖ్యముగా ధారణమొనర్చు దేవుడొక్కడే ఐయున్నాడో (తమ్) అట్టి (సంప్రశ్నమ్) చక్కగా దెలిసికొనదగిన పరమేశ్వరుని దిశకే (అన్యా భువనా) ఇతర సర్వలోకములు, మరియు ప్రాణులు (యన్తి) గతి (ప్రయాణ) మొనర్చుచున్నవి.

ఇచ్చట పరమేశ్వరుని, ఉత్పాదకుడు, పాలకుడు, పోషకుడు, ధారకుడు, సర్వజ్ఞుడని దెలుపుచు ఆతడొక్కడేయని స్పష్టముగ దెలుపబడినది. ఆతనికే అనేకదేవతల నామములు గలవు. అనగా; వాయు, అగ్ని, ఇన్ద్ర, మిత్ర, వరుణ, రుద్ర, మున్నగు పేర్లన్నియును ప్రధానముగా గుణసముద్రుడగు నా పరమేశ్వరుని గౌణరూపములో నితరులవి. ఇంతకన్న అధికముగా ఏకేశ్వరవాద నిరూపణము, అనేకేశ్వరవాద నిరాకరణ మేమి యుండగలదు?

ఇదే సూక్తము నందలి ఆరవమంత్రములో మరల ఏకేశ్వరవాద ప్రతిపాదనము దిగువ శబ్దములలో జేయబడినది. ఇదిఅత్యధిక మహత్త్వపూర్ణమైయున్నది

**తమిద్ గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।**

**అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః॥** ఋ౧౦-౮౨-౬॥

ఈమంత్రము యొక్క పూర్వార్ధము నందు ప్రకృతి, మరియు దాని పరమాణువు లను మొట్టమొదట ధారణమొనర్చువాడా యొకేపరమేశ్వరుడని తెలుపుచు ఉత్తారార్ధము నందు 'ఈ అజ-ప్రకృతి-సత్త్వము లేక ప్రధానముయొక్క (నాభౌ) నాభియందు (ఏకమ్) ఒక బ్రహ్మతత్త్వము మాత్రమే (అధి అర్పితమ్) పైన అధిష్ఠాతరూపములో విరాజమానుడై యున్నాడు (యస్మిన్) ఆతని యాధారముపైననే (విశ్వాని భువనాని తస్థుః) సమస్తలోకలోకాంతరములు విద్యమానమై యున్నవి. ఆయననే విశ్వమంతటకిని సంచాలకుడు, మరియు అధ్యక్షుడునై యున్నాడు' అని తెలుపబడినది.

ఋగ్వేద ౧౦-౧౨౧ యొక్క హిరణ్యగర్భ సూక్తములో 'క' అనగా సుఖ స్వరూపుడగు ప్రజాపతి పేరుతో భగవంతుని స్మరణమొనర్చుచు ఆతనినే శ్రద్ధాభక్తి పూర్వకముగ ఉపాసించు విధానమొనర్చబడి యున్నది ఈపది మంత్రములు గల చిన్నసూక్తము నందు నాలుగు మార్లు పరమేశ్వరునకు 'ఏకః' శబ్ద ప్రయోగము జరిగినది మరియు నాతనినే దేవాధిదేవుడు, పూజనీయుడని చూపబడినది. ఉదాహరణార్థము ఈసూక్తము యొక్క మొదటిమంత్రములో

**హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్।**

**స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥** ఋ.౧౦-౧౨౧-౧॥

ఎవని గర్భమునందు సూర్యాది ప్రకాశకములు గలవో 'తేజోవైహిరణ్యమ్' అట్టి పరమేశ్వరుడు (అగ్రే) సృష్ట్యుత్పత్తికి పూర్వము నుండియే (సమ్అవర్తత) చక్కగా విద్యమానమై యున్నాడో, (భూతస్య) సర్వప్రాణులకు (ఏకః ఏవ పతిః ఆసీత్) ఒక్కడే స్వామియైయుండెనో మరియు ఉన్నాడో (స పృథివీమ్ ఉతఇమామ్ ద్యామ్ దాధార) ఆతడే పృథివి, మరియు ఆకాశాది గోళములన్నింటిని ధారణమొనర్చువాడు. అట్టి (కస్మై)

సుఖస్వరూపుడు (దేవాయ) సుఖ శక్తిదాయకుడగు పరమేశ్వరుని (హవిషే) శ్రద్ధాభక్తులతో (విధేమ) మేము పూజయొనర్తుము.

సకలదేవతలు ఆపరమేశ్వరు నొక్కనిమాత్రమే ఉపాసించుచు ఆతనియాజ్ఞలనే పాలించుచుండునని రెండవ మంత్రములో చెప్పబడినది.

**య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః,** ॥౧౦-౧౨౧-౨॥

మూడవమంత్రములో ఆపరమేశ్వరుని మాత్రమే సృష్టియంతటికిని 'రాజు' అని తెలుపుచు ఆతని నుపాసించు విధానమే యొనర్చబడినది.

**యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్ రాజా జగతో బభూవ ।**

**య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మైదేవాయ హవిషా విధేమ** ॥ ఋ.౧౦-౧౨౧-౩॥

ఏపరమేశ్వరుడు స్థావరజంగమములతో గూడిన విశ్వమంతటికిని (మహిత్వా) తనమహిమతో (ఏకః ఇత్ రాజా బభూవ) ఒక్కడు మాత్రమే రాజైయున్నాడో (అస్య ద్విపదః చతుష్పదః యః ఈశే) ఈద్విపాద, మరియు చతుష్పాద ప్రాణులన్నింటికిని ఎవడు స్వామియో అట్టిసుఖస్వరూపుడగు పరమేశ్వరునకు మేమెల్లరము శ్రద్ధాభక్తులచే పూజలొనర్తుము.

ఏడవ మంత్రములో ఆపరమేశ్వరుడే ప్రకృతిఆధారకుడు, సకల దేవతలకు ఏకమాత్ర ప్రాణస్వరూపుడని దెలుపుచు ఆతనిగూర్చిన యుపాసనవిధానమే ఇట్లుతెలుపబడినది.

**ఆపో హ యద్బృహతీర్విశ్వమాయన్ గర్భం దధానా జనయన్తీరగ్నిమ్ ।**

**తతో దేవానాం సమవర్తతాసురేకః కస్మై దేవాయ హవిషా విధేమ** ॥౧౦-౧౨౧-౭॥

ఇచ్చట మేమే భాగమునైపు ధ్యానమును విశేషరూపములో ఆకృష్ట మొనర్చదలచితిమో, మరియు దేనివల్ల అనేకేశ్వరవాదుల విశ్వాసము సంపూర్ణముగా ఖండితమగునో అదియేమంత్రము యొక్క రెండవచరణము. దీనియందు (దేవానామ్) సమస్త సూర్యచంద్రాదుల, ప్రకాశపదార్థముల, జ్ఞానప్రకాశవిద్వాంసుల సమస్త అగ్నులు. (ఏకః అసుః సమ్ అవర్తత) ఆ ఒకే ప్రాణ స్వరూపుని యందు విద్యమానమై యుండెనో! సదా యుండగలవో ఆ సుఖస్వరూపుడగు పరమేశ్వరునే మనము శ్రద్ధా భక్తి పూర్వకముగా విశుద్ధమగు మనస్సుతో ఉపాసించుచుండవలయును

వేదములు ప్రకృతిపూజా ప్రతిపాదకమని వాదించువారికొరకు ఇదేసూక్తము నందలి ఎనిమిదవ మంత్రము అత్యధికముగ గౌరవించదగినదైయున్నది. దీనియందు పరమేశ్వరుని ప్రకృతి యొక్క అధిష్ఠాత, నిరీక్షకుడు, నియామకు డని తెలుపుచు ఆదేవాధిదేవుడు మాత్రమే ఏక మాత్ర పూజనీయుడని ఇట్లుచెప్పబడినది.

**యశ్చిదాపో మహినా పర్యపశ్యద్ దక్షం దధానా జనయన్తీర్యజ్ఞమ్ ।**

**యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్ కస్మై దేవాయ హవిషా విధేమ** ॥ ఋ౧౦-౧౨౧-౮॥

అనగా; (యః చిత్) ఎవడు (మహినా) తనమహా సామర్థ్యముచే (దక్షం దధానాః) బలమును ధారణ మొనర్చుచు (యజ్ఞం జనయన్తీః) ప్రపంచరూప మహాన్ యజ్ఞము నుత్పన్నమొనర్చుచు (ఆపః) ప్రకృతిని (పరి అపశ్యత్) సాక్షిగానుండి అధిష్ఠాతరూపమున అతిచక్కగా జూచుచుండునో (యః) ఎవడు (దేవేషు అధి ఏకః దేవః) సమస్త ప్రకాశక పదార్థముల, మరియు జ్ఞానులందు ఒకే ప్రకాశకుడు, సర్వోత్తముడు మరియు ఆనందశాంతిదాయకుడైయున్నాడో (కస్మై దేవాయ హవిషా విధేమ) అట్టి సుఖస్వరూపుడగు పరమేశ్వరుని మాత్రమే మేము శ్రద్ధాభక్తిపూర్వకముగా సేవించుచుండెదము ఈసూక్తమందలి చివరి మంత్రమందు 'ప్రజాపతి' యనుపేరుతో పరమేశ్వరుని స్మరణమొనర్చుచు ఇట్లు స్పష్టపరచబడి యున్నది

**ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వాజాతాని పరి తా బభూవ।**

**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥**

హేసర్వప్రాణుల స్వామీ! (త్వత్ అన్యః ఏతాని తా విశ్వా జాతాని పరితాబభూవ) ఈసమస్త పదార్థములందు వ్యాపకుడవై సర్వమునకు స్వామివైయున్న నీకన్న గొప్ప ఏమియును లేదు కావునమేము ఏ శుభకామితములను గోరి నీస్మరణమొనర్చెదమో, ఆశుభకామితము లన్నియును నీకృపచే ఫలించి మేము జ్ఞానము మున్నగు ఐశ్వర్యములకు అధికారుల మగుదుము గాక.

*English translation of the Mantras of the Hiranya Garbha Hymn 10-121.*

1. God who possesses all the luminous worlds within Himself and exists from the very eternity, is the only One manifest Lord of the created objects. He is supporting this earth and the heaven. To that All-blissful Divinity, we offer our humble worship.

2. య ఆత్మదా బలదా------------------హవిషా విధేమ.

He who is the giver of physical vigour and spiritual force, He Whose order is carried out by all the luminous objects and by the enlightened persons, Whose shelter is immortality and turning away from Whom is death, to that All-bilssful Divinity, we offer our humble worship. Rig.10-121-2.

3. యః ప్రాణతో నిమిషతః------------------హవిషా విధేమ.

He Who by the greatness of His power is the sole Ruler of living and lifeless objects existing in this world; He Who is the Lord of these bipeds and quadrupeds; to that All-blissful Divinity, we offer our humble worship. Rig 10-121-3

4. ఆపోహ యద్ బృహతీర్విశ్వమాయన్---------------హవిషావిధేమ.

When water in its subtle form, possessing mighty force with in it self, became manifest; therein was held the Universal germ which produced the heat energy, thence the one

Universal life force of all the luminous objects became manifest, to that All - blissful Divinity we offer our humble worship. Rig. 10-121-7

5. యశ్చిదాపో మహినా పర్యపశ్యత్--------------------హవిషా విధేమ.

He Who, with His might, surveys the water in its subtle stage at the time of the creation of the world which posseses production force and generates all the universal processes. Who is God of all the luminous objects and there is none beside him; to that All blissful Divinity, we offer our humble worship. Rig. 10-121-8.

ఈ సూక్తము నందతి స్పష్ట శబ్దములలో ఏకేశ్వరవాదమును ప్రతిపాదించబడినది. ఈవిషయమును ప్రొ. మైక్స్‌మూలర్, మరియు ఇతర పాశ్చాత్య విద్వాంసులనేకులును అంగీకరించియున్నారు. ఉదా:- మైక్స్‌మూలర్ *History of Ancient Sanskrit Literature* నందిట్లు వ్రాసియున్నారు.

'I add only one more Hymn (Rig 10-121) in which the idea of One God is expressed with such power and decision, that it will make us hesitate before we deny to the Aryans an instinctive Monotheism.' p. 578

అనగా; నేను ఋగ్వేదమందలి మరొక సూక్తము ౧౦-౧౨౧ ను ఉదాహరించ దలచినాను. దీనియందు ఏకేశ్వరుని గూర్చిన ఆలోచనలు అత్యధికప్రబలత, మరియు నిశ్చయముతో ప్రకటించబడియున్నవి. దీనివల్ల మనము ఆర్యుల నైసర్గిక ఏకేశ్వరవాదులనుటను త్రోసివేయుటకు ఎంతయో సంకోచించవలసి యున్నది.

ప్రొ. మైక్స్‌మూలర్ యొక్క ఈశబ్దములచే ఆత డీ సూక్తమును నిస్సందేహముగా ఏకేశ్వరవాదమునకు ప్రతిపాదకమని నమ్ముచుండెనని స్పష్టమగుచున్నది. మరియు నిట్టి సూక్తముల ఆధారముపైన ఆర్యులు స్వాభావిక ఏకేశ్వరవాదులగుటను త్రోసిపుచ్చ లేకుండెను. కాని క్రైస్తవపక్షపాతి యగుకారణమున ఆత డీ సూక్తసంబంధమున ఈ క్రింది వ్యాఖ్యను వ్రాయకుండా యుండలేకపోయినాడు.

*'This is one of the hymns which has always been suspected as modern by European interpreters.' - Vedic Hymns, Edited by Prof. Maxmuller p.3.*

అనగా; ఈసూక్తమును గూర్చి యూరోపియన్ భాష్యకారులు ఎప్పుడును ఇది నవీనమను సందేహమునే వెలిబుచ్చుచుండిరి.

**'ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ।'**

ఈ ౧౦-౧౨౧-౧౦ మంత్రముపై ప్రొ. మైక్స్‌మూలర్ మరల

*This last verse is to my mind the most suspicious of all, (P.4)*

'పరమేశ్వరుని ప్రజాపతియను పేర సంబోధించుచు నీవు తప్ప ఇతరు లెవ్వరును విశ్వమంతటను వ్యాప్తమైయుండి దీనికి స్వామియైన వారు లేరను ఈ చివరి మంత్రము నాయుద్దేశ్యములో అధిక సందేహాస్పదముగ నున్న'దని చెప్పణే వ్రాసినాడు.

క్రైస్తవ పక్షపాతియగు కారణమున ఇట్టి సందేహమును వెలిబుచ్చినాడు. ఈ విషయములో స్పష్టమైన అనేక ప్రమాణములను ఇదివరకు మే మిచ్చియున్నాము. వేదములందు ఏకేశ్వరవాదమునకు సంబంధించిన ఉన్నత విద్యగల దను విషయమును వీరు అంగీకరించుటకు సిద్ధముగా లేరు. కావుననే ఈ హిరణ్యగర్భ సూక్తముతో పాశ్చాత్య విద్వాంసు లనేకులు గొప్పగా క్రీడించినారు. **'హిరణ్య గర్భ'** అను దానిని అనేకులు *Golden Egg* అనగా స్వర్ణమయ గ్రుడ్డును చేసివేసినారు.

కస్మై దేవాయ హవిషా విధేమ ॥ దీని యర్థము 'ఏ దేవుని కొరకు?' అను ప్రశ్నాత్మకము నొనర్చి *To which God shall we offer our worship?* అని చూపుటకు ప్రయత్నించినారు. వారికీ పూజనీయ దేవుడెవ డను జాడ ( రహస్యము) సైతము దెలియదు. కేవలము ఈ సూక్తమునందు ఆ విషయ సంబంధ జిజ్ఞాస మాత్రమే గల దని భ్రమపడినారు. కాని వాస్తవముగా వారి యీ కల్పన సర్వధా అశుద్ధమే.

**య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః।**

**యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్ రాజా జగతో బభూవ।**

మున్నగు మంత్రములలో ఆ పరమేశ్వరుని గుణవర్ణనమే నిశ్చయముగు భాష యందు వర్ణింపబడినదే కాని అందు సందేహము ఎంతమాత్రమును లేదు. కావున ''కస్మై దేవాయ'' అర్థము సుఖ స్వరూపుడు, పరమేశ్వరు డని యొనర్చుటయే ఉచితము.

**ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ।**

''కస్మై దేవాయ'' అను దాని తాత్పర్యము ప్రజాపతి పరమేశ్వరునికనియే స్పష్టముగుచున్నది. కావుననే ప్రొ.మైక్స్‌మూలర్, మరియు నాతని అనుయాయులకు ఈ మంత్రమన్నిటికన్న అధిక సంశయాత్మకము *(Most-Suspicious)* గానే యనిపించినది. నిజముగా దీనిని సందిగ్ధముగా నెంచు కారణ మే మాత్రమును లేదు. ఏలన 'క' యొక్క అర్థము ప్రజాపతి పరమేశ్వరుడే యని స్పష్టపరచబడియున్నది. కావుననే శతపథకారుడు తదితరులు

**'కో హి ప్రజాపతిః అథవా ప్రజాపతిర్వై కః** ॥ శ.౬-౨౨-౫-౨౧, గో.ఉ. ౬-3॥

నిమ్న ఋగ్వేద మంత్రమునందును పరమేశ్వరుని సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడని తెలుపుచు ఆతడొక్కడే యని స్పష్టమగు శబ్దములందు ప్రతిపాదించబడినది.

**విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్।**

**సంబాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః ॥**

( ఋగ్వేద ౧౦-౮౧-3, యజుర్వేద ౧౭-౧౯, అథర్వ ౧3-౨-౨౬)

ఈ మంత్రమందు పరమేశ్వరుని 'దేవః ఏకః' అనగా ఒక్కడే దేవుడు సర్వప్రకాశకుడు, సర్వానంద ప్రదాత యని చెప్పుచు 'విశ్వతః చక్షుః' ఆతని కన్నులు నలువైపుల అంతటను గాంచగలవని, ఆయన ముఖము నల్దిశలందుగల దని, ఆయన రక్షా సాధనములు ( బాహువులు) అన్ని వైపుల గల వని, మరియు నాతని గతిసాధనము లన్ని దిశలను గల వని చెప్పబడినది. ఈ విధముగా ఆ పరమేశ్వరుడు జ్ఞానకర్మ రూప బాహువుల ( జ్ఞానకర్మణీ హి

లోకవహనాద్ బాహు) మరియు (పతత్రైః) పరమాణువులతో (ద్యావా భూమీ జనయన్) పృథివీ ఆకాశములను జేయును.

అథర్వ వేదమందు పరమేశ్వరుడే ఏకమాత్ర పూజనీయుడను విషయమును అనేక స్థానములందు స్పష్టముగా వర్ణించబడియున్నది. ఎట్లన; అథ: ౨-౨-౧ లో

**దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతిః ఏక ఏవ నమస్యో విక్ష్వీడ్యః ।**

**తం త్వా యౌమి బ్రహ్మణా దివ్య దేవ నమస్తే అస్తు దివి తే సధస్థమ్ ॥** అథ.౨-౨-౧॥

అనగా; (యః) ఎవడు (దివ్యః గన్ధర్వః) దివ్య గుణయుక్తుడు, పృథివ్యాది లోక లోకాంతరములను ధారణమొనర్చియున్నాడో (భువనస్య పతిః) విశ్వమంతటిని పాలించువాడో ఆతడు (ఏకః ఏవ) ఒక్కడే (విక్షు) సమస్త ప్రాణులందును (నమస్యః) నమస్కరింపదగినవాడు (దివ్య దేవ) హే దివ్య గుణ స్వరూపుడవగు పరమేశ్వరా! (త్వమ్ త్వా యౌమి) ధ్యానము ద్వారా నేను నీలో గలిసి పోవుదును. (తే నమః అస్తు) నీకు నా నమస్కారము (తే) నీయొక్క (సధస్థమ్) స్థానము (దివి) ప్రకాశమయమగు నీ మహిమ యందే గలదు. ఇచ్చట

**'ఏక ఏవ నమస్యః విక్ష్వీడ్యః'**

ఈ శబ్దము స్వర్ణాక్షరములందు వ్రాయదగియున్నది. దీని ద్వారా వైదిక ఏకేశ్వర వాదమునం దణుమాత్రము సందేహము లేదు.

**మృడాద్ గన్ధర్వో భువనస్య యస్పతిరేక ఏవ నమస్యః సుశేవాః** ॥ అథ ౨-౨-౨ ॥

పూర్వము వలెనే ఈ మంత్రమందును పరమేశ్వరుడు ఒక్కడు, పూజనీయుడు, మరియు ఉత్తమ సుఖదాయకుడని అతి స్పష్టముగా ఉపదేశించబడినది. ఎట్లనగా; (గన్ధర్వః) వేదవాణిని ధరించువాడు (యః) ఎవడు (భువనస్య ఏకః ఏవ నమస్యః పతిః) విశ్వ మంతటికిని ఒక్కడే స్వామి, మరియు నమస్కారములను స్వీకరించదగినవాడో, మరియు నెవడు (సుశేవాః) ఉత్తమ సుఖదాయకుడో ఆతడే మమ్ము (మృడాత్) సుఖవంతుల నొనర్చుగాక. వైదిక ఏకేశ్వరవాదమిచ్చట నెంతయో స్పష్టముగా నిరూపించబడినది.

ఇంతయే గాదు. పరమేశ్వరుడొకే ఒక్కడు ౨,౩,౪,౫,౬,౭,౮,౯,౧౦ మంది పరమేశ్వరులు లేరు. ఈ విషయము అథర్వవేదపు దిగువ మంత్రములందు అత్యంత స్పష్టమగు శబ్దములలో ఎవ్వరికిని అణుమాత్రమైనను సందేహము లేకుండా చక్కగా నిరూపించబడినది. ఆ మంత్రములిట్లు గలవు.

**న ద్వితీయో న తృతీయశ్చతుర్థో నాప్యుచ్యతే** ॥ ౧౩-౪-౧౬॥

**న పఞ్చమో న షష్ఠః సప్తమో నాప్యుచ్యతే** ॥ ౧౩-౪-౧౭॥

**నాష్టమో న నవమో దశమో నాప్యుచ్యతే** ॥ ౧౩-౪-౧౮॥

**తమిదం నిగతం సహః స ఏష ఏక ఏక వృద్ ఏక ఏవ** ॥ అథ ౧౩-౪-౨౧॥

అనగా; (సః) ఆతడు (ఏషః) ఈ పరమాత్మ (ఏకః) ఒక్కడే (ఏకవృత్) ఒక్కడేయై యుండి సర్వవ్యాపకుడై సర్వమును వ్యాప్తపరచువాడై యున్నాడు. (ఏకః ఏవ) ఆతడొక్కడే (న ద్వితీయః న తృతీయః చతుర్థః న అపి

ఉచ్యతే న పంచమః న షష్ఠః సప్తమః న అపి ఉచ్యతే న అష్టమః న నవమః దశమః న అపి ఉచ్యతే) ఆయనను రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ, ఆరవ, ఏడవ, ఎనమిదవ, తొమ్మిదవ, మరియు పదవ వాడని యనలేము ఆతడొక్కడే మరియు ఒక్కడేయైయున్నాడు. ఒక్కడే యై యుండి ఆయన సర్వవ్యాపకుడై ప్రాణుల నెల్లరను విశేష రూపములో సర్వథా సంపూర్ణముగా జూచునాడై యున్నాడు

ఏకేశ్వరవాదమున కింతటి ప్రబల మరియు స్పష్ట ప్రమాణము లుండగా వైదిక ధర్మమును అనేకేశ్వరవాదమును ప్రతిపాదించునని యనుట ఎంతటి అజ్ఞానము మరియు పక్షపాత వైఖరియో గాంచుడు

ఐనను పాశ్చాత్య విద్వాంసు లనేకులు వాస్తవముగా అథర్వ వేద మొక వేదమే గాదని యనుచు ఈ ప్రమాణములను ఎగరగొట్ట ప్రయత్నమొనర్చెదరు. అది వెనుక నుండి చేయబడి వేదముల శ్రేణియందు బలత్కారముగా జొప్పించబడినదని యందురు. కాని వారి యీ యభిప్రాయము సంపూర్ణముగా అజ్ఞానజనితమే. వారి నిస్సారమగు అభిప్రాయములను మేము ముందు ముందు సప్రమాణముగా చూపెదము. మేమిప్పుడు పునః ఋగ్వేదము యొక్క మరికొన్ని స్పష్ట ప్రమాణములను ప్రవేశపెట్టుచు 'హీనోథీయిజమ్' అను పేర ప్రచలిత వాదమును సమాలోచనమొనర్తుము.

**ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥** ఋ.౧-౧౬౪-౪౬ ॥

ఈ మంత్రముయొక్క ఏకేశ్వర ప్రతిపాదక వాక్యములను మొదటనే ఉదాహరించియుంటిమి. అట్టివేయగు మరొక ఋ.౧౦-౧౧౪-౫లోనూ

**సుపర్ణం విప్రాః కవయో వచోభిః ఏకం సన్తం బహుధా కల్పయన్తి ॥** ఋ ౧౦-౧౧౪-౫ ॥

అన్వా; (కవయః) క్రాంతదర్శులగు తత్త్వజ్ఞానులు (సుపర్ణమ్) శ్రేష్ఠకర్మలొనర్చు పరమేశ్వరుని (ఏకం సన్తమ్) ఒక్కడు మాత్రమే యైయున్నను (వచోభిః) తమ వచనముల ద్వారా (బహుధా కల్పయన్తి) అనేక రూపములలో, గుణసూచకములగు అనేక నామముల ద్వారా వర్ణించుచుందురు. అనగా,

ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని మున్నగు అనేక పేర్లతో జ్ఞానులా యొకే పరమేశ్వరుని వర్ణించుచుందురు. కావ్యమయ భాష ద్వారాను సర్వసామాన్య మానవులకును అర్థమగుటకై ఆయొకే పరమేశ్వరుని అనేక కల్పనల ద్వారా వర్ణించుచుందురు.

ఇంతటి స్పష్టమగు మంత్రముల విషయములను నిరాకరించుటకు పాశ్చాత్య విద్వాంసు లొకమార్గము ననుసరించినారు. ఈ మంత్రము ఋగ్వేదము యొక్క దశమ మండలములోనిది. ఇది వెనుక నుండి జేయబడినది' అని చాటుచుందురు. వాస్తముగా ఇదియును వారి యజ్ఞాన కల్పనయే. మేము వారి యీ కల్పనను ముందు సప్రమాణముగా నిరాకరించు ప్రయత్నమొనర్చెదము. ఐనను ఇతర మండలముల నుండియును కొన్ని స్పష్ట ప్రమాణముల నిచ్చుటలో నెట్టి హానిలేదు గదా!

**అయం ఏక ఇత్థా పురూరు విచష్టే విశ్పతిః । తస్య వ్రతాన్యనువశ్చరామసి ॥** ఋ.౮-౨౫-౧౬ ॥

అన్వా; (అయమ్) ఈ (విశ్పతిః) ప్రజల స్వామి (ఏకః) ఒక్కడే (ఇత్థా) ఈ విధముగ నిశ్చయముగ ఆతడొక్కడే విశ్వమునకు స్వామి (పురూరు విచష్టే) సకల ప్రాణులను ఉత్తమముగా నిరీక్షించుచుండును మరియు

సర్వము నెరుగును. మేము (వః) మీరు సకల ప్రాణుల కల్యాణమునకై (తస్య వ్రతాని అనుచరామసి) ఆయన వ్రతముల ననుసరించుచుందుము - ఆయన యాజ్ఞలను పాలించుచుందుము. ఇచ్చటను స్పష్టముగా పరమేశ్వరుడొక్కడే యని, మరియు సర్వ ప్రాణులకు స్వామియని తెలిపి ఆయన యాజ్ఞలనే పాలించుడని ఉపదేశించబడినది.

ఋగ్వేద. ౮-౧-౨౭ నందును పరమేశ్వరు డొక్కడేయని తెలుపుచు ఆతని గుణము లిట్లు వర్ణించబడియున్నవి.

**య ఏకో అస్తి దంసనా మహాఁ ఉగ్రో అభివ్రతైః** ॥ ఋ.౮-౧-౧౭ ॥

అనగా; పరమేశ్వరుడొక్కడు, అత్యంతాశ్చర్య జనకుడు, మహనీయుడు, తన వ్రతముల కారణమున అతితేజోవంతుడు మరియు దుష్టుల పట్ల అతిభయంకరుడు. ఎల్లరును ఆతనినే ధ్యానించ వలయును.

**స విశ్వస్య కరుణస్యేశ ఏకః** ॥ ఋ. ౧-౧౦౦-౭ ॥

ఇట్లు చెప్పి పరమేశ్వరుడు సమస్త కరుణాభరిత శుభకార్యములకు ఏకమాత్ర స్వామియని తెలుపబడినది.

సామవేదము 372వ మంత్రములో అత్యుత్తమముగా పరమేశ్వరుడు ఏకమాత్రస్వామియని, పూజనీయుడని ప్రతిపాదించబడినది. ఈ మంత్రము అథర్వ వేదము ౭-౨౧-౧ నందును గలదు.

**సమేత విశ్వా ఓజసా పతిం దివో య ఏక ఇద్ భూరతిథిర్జనానామ్ ।**

**స పూర్వ్యో నూతనం ఆజిగీషన్తం వర్తనీరను వావృత ఏక ఇత్** ॥ అథ ౭-౨౧-౧॥

అనగా; ఓ మానవులారా! మీరెల్లరును సరళ భావము, మరియు ఆత్మిక బలముతో గూడ పరమేశ్వరుని భజనమునకు ఆతని దిశకు రండు (ఏకః ఇత్) ఆతడొక్కడే (జనానామ్ అతిథిః) మానవులలో అతిథి వలె పూజనీయుడు, సనాతనుడు, సర్వాంతర్యామి, సర్వశక్తి మంతుడు. ఆయన ప్రాతక్రొత్తల యందంతటను వ్యాపకమైయున్నాడు. జ్ఞానకర్మ భక్తి మున్నగు మార్గములన్నియును ఆయన దిశకే గొనిపోవును. నిశ్చయముగా నాతడొక్కడేయై యున్నాడు.

'సమేత విశ్వా ఓజసా' మంత్ర ఆంగ్రేజియనువాదము

Come together, ye all with power of spirit to the Lord of light, who is only one, the Guest of the people. He the Ancient, desires to come to the new. to Him all path ways turn verily he is one.

The call of the Vedas by

Principal Abinash Chandra Bose.

ఏకేశ్వరవాద ప్రతిపాదనను గురించి ఇంతకన్న గొప్ప విశుద్ధ ఉదాహరణమింకేమియుండ గలదు? ఆ పరమేశ్వరుడు డొక్కడేయొక్కడు. అతిథి వలె ఆతడందరచే పూజనీయుడై యున్నాడు.

ఋగ్వేద ౧-౭-౯ వ మంత్రము కూడా పరమేశ్వరుని విశ్వమంతటికిని, మానవులెల్లరకును సామ్రాట్టు ఒక్కడేయని ఘోషితమొనర్చుచు ఏకేశ్వరవాదమును గట్టిగా సమర్థించినది.

**య ఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి । ఇన్ద్రః పఞ్చ క్షితీనామ్** ॥ ఋ.౧-౭-౯ ॥

అనగా; (యః) ఎవడు (ఇన్ద్రః) పరమైశ్వర్య సంపన్నుడగు పరమాత్మయో (చర్షణీనామ్ పఞ్చ క్షితీనామ్) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అతిశూద్రులను విభాగములందు మానవులెల్లరును విభజింపబడియున్నారో, మరియు (వసూనామ్ ఇరజ్యతి) ఎవడు సమస్తైశ్వర్యములకు స్వామియో అతనినే యుపాసించుడు.

ఋగ్వేద ౧-౫౪-౧౪ వ మంత్రము పరమేశ్వరుడొక్కడు మరియు అనుపముడని తెలుపుచు ఎంత స్పష్టముగ ఏకేశ్వరవాదమును విశుద్ధరూపమున నిరూపించినదియో ఈ దిగువ మంత్రమును జూడుడు.

**న యస్య ద్యావాపృథివీ అనువ్యచో న సిన్ధవో రజసో అన్తమానశుః ।**

**నోత స్వవృష్టిం మదే అస్య యుధ్యత ఏకో అన్యచ్చకృషే విశ్వమానుషక్** ॥ ఋ.౧-౫౪-౧౪ ॥

అనగా; (యస్య) ఏ పరమేశ్వరుని (ద్యావాపృథివీ) ఆకాశము మరియు పృథివి (సిన్ధవః) సముద్రములు మరియు (రజసః) ఇతర లోకలోకాంతరములు (అన్తమ్ న ఆశుః) అన్తమును తెలిసికొనజాలవో (అనువ్యచః) ఆయన సర్వము నందును ఓతప్రోతమై యున్నాడు. మేఘములు, విద్యుత్తు మున్నగునవియును గర్జించుచు మరియు వర్షించుచు అతని మహిమను సూచించునే కాని అతని అంతము (చివర)ను దెలిసికొనుట యందసమర్థములే. అట్టియా పరమేశ్వరుడు (ఏకః) ఒక్కడే య్యైయున్నాడు. ఆయనయే (ఆనుషక్) సర్వమున వ్యాప్తుడైయుండి (అన్యత్) తనకన్న భిన్నమై యున్న ఈ (విశ్వమ్) ప్రపంచమును (చకృషే) చేసియున్నాడు.

దీని ద్వారా కేవలము ఏకేశ్వర వాదము స్పష్టముగా నిరూపణమగుటయే గాక అద్వైత వాదము *Pantheism* కూడా విస్పష్టముగ నిషేధమగుచున్నది. దీనిపై ముందరి అధ్యాయమందు ప్రకాశము వేయుదుము. ఇదే విధముగా వందలాది (అనేక) మంత్రములు నాల్గు వేదములనుండి వైదిక ఏకేశ్వర వాదమును సమర్థించుట యందు ఉద్ధృత మొనర్చవచ్చును. కాని విస్తారమగునను భయముచే నిలిపెదము.

**వైదిక ఏకేశ్వర వాదము, కొందరు పాశ్చాత్య విద్వాంసుల స్పష్ట ప్రతిపాదనము.**

ఇట్టి వచనములను గాంచిన పిదప అనేక నిష్పక్ష పాశ్చాత్య విద్వాంసులు స్పష్టముగ తమ గ్రంథములందు 'వేదములందు' ఏకేశ్వరవాదమే ప్రతిపాదించబడియున్నదని స్వీకరించియున్నారు. ఇదే విధముగ అనేక పారశీ, మరియు ముసల్మాను విద్వాంసులు కూడా అంగీకరించినారు. వారి కొన్ని ఉదాహరణము లిచ్చుట ఈ ప్రసంగమున ఆవశ్యకమనియే తోచుచున్నది.

**చార్ల్సుకోల్మెన్** *Charles Coleman*

చార్ల్సు కోల్మెన్ అను ఆంగ్లేయ విద్వాంసుడు *Mythology of the Hindus* అను తన గ్రంథమునందిట్లు వ్రాసినారు.

**The Almighty; Infinite, Eternal, Incomprehensible, Self-existent Being, He who sees every thing, though never seen is Brahma - the One Un-known True Being, the Creator,**

Preserver and Destroyer of the universe. Under such and innumerable other definitions is the Deity acknowledged in the Vedas.

-Charles Coleman in the Mythology of the Hindus.

అనగా; వేదములందు పరమేశ్వరుని సర్వశక్తిమంతుడు, అనంతుడు, నిత్యుడు, అవిజ్ఞేయుడు, స్వయంభువు, సర్వజ్ఞుడు, సర్వద్రష్ట, జగత్కర్త, ధర్త, హర్తయని బ్రహ్మ రూపమున విశ్వసించబడినది.

### 4.3 'కౌన్ట్ బియౌర్న్సటీర్నా' Conut Biornstierna వైదిక ఈశ్వరవాద విషయకలేఖ

కౌన్టు బయౌర్న్సటీర్నా యను సుప్రసిద్ధ పాశ్చాత్య విద్వాంసుడు *Theogony of the Hindus* అను పుస్తకమునందు వేద మంత్రముల నుదహరించి ఇట్లు వ్రాసినాడు

These turly sublime ideas cannot fail to convince us that the Vedas recognise only One God who is Almighty, Infinite, Eternal, Self-existent, the Light and Lord of the Universe.

(Count Biornstiyerna in the Theogon of the Hindus. P.53)

అనగా; ఈ యుద్ధరణమునందు ప్రకటించబడిన ఉన్నత భావములచే వేదములు ఏకేశ్వర వాదమునే ప్రతిపాదించును నిశ్చయమునకు మనము రాకుండ యుండలేము ఇవి ఈశ్వరుడు సర్వశక్తిశాలి, అనంతుడు, నిత్యుడు, స్వయంభువు, మరియు జగత్ప్రకాశకుడు, జగన్నాధుడనియే ఉపదేశించును.

### 4.4 'శ్లీగల్' Schlegel గారి రచన

సుప్రసిద్ధ జర్మన్ విద్వాంసుడు శ్లీగల్ *Schlegel* తన *'Wisdom of the Ancient Indians'* అను గ్రంధమునందిట్లు వ్రాసియున్నారు

It cannot be denied that the early Indians possessed a knowledge of the true God. All their writings are replased with sentiments and expressions noble, clear, lovely, grand, as deeply conceived as in any human language in which men have spoken of their God.

- Schlegel in the Wisdom of the Ancient Indians.

ప్రాచీన భారతీయులకు సత్యమగు ఈశ్వరజ్ఞానము ప్రాప్తించి యుండె నను విషయమును కాదనలేము ఈశ్వర విషయమున వారి రచనలన్నియును అత్యుత్కృష్టముగ, స్పష్టముగా, ప్రేమమయముగా, ఉత్తమముగా, గంభీరతాపూర్ణముగు ఆలోచనలతో, భావనలతో పరిపూర్ణమైయున్నవి అవి మానవీయ భాషలో జనులు ప్రకటింపగలిగినా యవి ఉత్కృష్ట భావనలతో నిండియున్నవి.

*W D Brown* బ్రాఉన్ అను ఆంగ్లేయ విద్వాంసుని లేఖల నుండి మేమిదివరకు కొన్ని ఉదాహరణల నిచ్చియుంటిమి వాని యందు వారు వైదిక ధర్మ విషయములో ఏకేశ్వర వాదమునే అవి బలపరచుచున్నట్లు వారు ధ్రువపరచినారు.

'It (Vedic Religion) recognises but one God'

- W.D.Brown in the superiority of the Vedic Religion.

### 4.5 వైదిక ఏకేశ్వరవాద విషయములో సుప్రసిద్ధ ఫార్సీ (పారసీక) విద్వాంసుని రచన.

ఫుర్దున్ దాదాచాన్ పేరు గల ఫార్సీ విద్వాంసుని *Philosophy of Zoroastrianism and Comparative Study of Religions* అను ఉత్తమ పుస్తకమునుండి వేదముల మహత్వ విషయక ఉదాహరణముల కొన్నింటిని ఇదివరకే రెండవ అధ్యాయము నందిచ్చియుంటిమి. వైదిక ఏకేశ్వరవాద విషయమును గూర్చిన వారి లేఖ అత్యంత స్పష్టము మరియు మహత్వ పూర్ణమగు కారణమున ఇచ్చుట ఉల్లేఖించదగినదై యున్నది. వారిట్లు వ్రాసినారు.

The Vedas teach nothing but Monotheism of the purest kind, the belief that this universe manifests the love, might, wisdom and glory of God Who eternally evolves and dissolves alternately innumerable systems of worlds, for the benefit, discipline and well-being of Jeevatmas according to the eternal laws of nature (called Rita in the Vedas) and also according to the Law of Karma (as implied in it).

Philosophy of Zoroastrianism and comparative study of Religions by Furdun Dadachanji B.A., L.L.B., D.Th., The Times of India Press Bombay 1941.,

ఏకేశ్వర వాదమును సర్వాధికారముగా వేదములే విశుద్ధరూపములో నిరూపణ మొనర్చుచున్నవి. ఈ జగత్తు పరమేశ్వరుని ప్రేమ, శక్తి, బుద్ధి, మహత్త్వములను ప్రకటించుచున్నవి. పరమేశ్వరుడే జీవాత్మల కల్యాణము, మరియు లాభము కొరకు శాశ్వత ప్రాకృతిక నియమముల ననుసరించి (వీనిని వేదములలో 'ఋత' యని పిలువబడినది.) దీనియంతర్గతమైన కర్మనియమముల ననుసరించి అనేక లోకలోకాంతరముల నిర్మాణము, ధారణము, మరియు చివరకు సంహారమొనర్చును. ఇంతకు మించి వైదిక ఏకేశ్వర వాదమును ఉత్తమముగా ఎవరైనను సమర్థించగలుగుదురా?

### 4.6 ఒక ముస్లీం విద్వాంసుని ఏకేశ్వరవాద విషయక మహత్త్వపూర్ణ రచన

సర్ ముహమ్మద్ యామిన్ ఖాన్ అను పేరు గల ముస్లిం సజ్జనుడు *'God, Soul and Universe in Science and Islam'* అను పేరుతో ఒక గ్రంథమును వ్రాసినాడు. దీనిని ౧౯౪౨లో శేఖ్ ముహమ్మద్ అశ్రఫ్ కశ్మీరీ అనునాతడు లాహోరు నుండి ప్రకాశిత మొనర్చినాడు. దాని మొదటి అధ్యాయమందు వైదిక ఏకేశ్వర వాదము పై ప్రకాశము వేయుచు పౌరాణిక త్రిమూర్తుల, మరియు అవతార వాదమునకు దాని భిన్నత్వమును చాలా చక్కగా నిరూపణమొనర్చినాడు. సర్ యామిన్ ఖాన్ ఇట్లు వ్రాసినాడు.

Originally the conception of God among the Hindus was right when they believed Him to be Unit and Omnipresent, but when they started dividing Him in to different shapes according to different functions which they considered he performed, they strayed far

from their original conception. The result was that many who were heroes in their life time, were gradually turned into incarnations of God and idolatry increased.

'Many Hindus believe that all their sins are washed away by having a dip in the holy water of the Ganges. Thus it is seen that the great philosophical religion which had conceived Unity of God in the beginning brought in corruption and degradation of high ideas, when His attributes as the Creator, the Preserver and the Destroyer were divided and allotted to different deities possessing separate entities in different forms.

Swami Dayananda Saraswati a man of great learning, started preaching the old religion of the Vedas which conceived unity of God.

(God Soul and Universe in Science and Islam by Sir Yamin Khan Kt, C.I.E.)

దీని భావార్థమేమన; ప్రారంభములో హిందువుల ఈశ్వర విషయమైన ఆలోచనలు చాలా ఉత్తమముగా నుండెను అప్పుడు వా రాతనిని సర్వ వ్యాపకుడుగా విశ్వసించుచుండిరి వారు భిన్న భిన్న కార్యముల కొరకు ఈశ్వరుని నమ్మినపుడు భిన్న భిన్న ఆకారములందు ఆతనిని విభాగమొనర్పసాగిరి. అనేక కులములు, మతములు, మతాచార్యులు తమ తమ ప్రత్యేక ఈశ్వర ప్రతిమల నిర్మించుకొనుచు ఈశ్వరుని ప్రారంభిక మూల భావముల నుండి బహుదూరము వెళ్లి పోయిరి దీని పరిణామముగా జీవిత కాలములో వీరులైన వ్యక్తులు అవతార రూపములో పరిణిత మొనర్పబడిరి. ఈ విధముగా మూర్తి పూజ వృద్ధిగాసాగినది.

హిందువు లనేకులు గంగలో మునక వేసినంత మాత్రమున వారి సమస్త పాపములు కడిగివేయబడునని విశ్వసింతురు. ఈ విధముగు ఆచరణను మన మిప్పుడును జూచుచున్నాము. ఏకేశ్వరవాద భావములను ప్రారంభ కాలములో విశ్వమంతటికిని ప్రసాదించిన ఆ ఉచ్చతర భావములు క్రమముగా వికృతమై నష్టమైనవి. అప్పటినుండియే జగత్కర్త, సంహర్తయగు పరమేశ్వరుని గుణములను భిన్న భిన్న రూపములు, మరియు ఆకృతులు గల భిన్న భిన్న దేవీదేవతల రూపములో విభక్త మొనర్పబడినవి.

వైదిక ఏకేశ్వర వాదము సర్ యామీన్‌ఖాన్ యొక్క ఈ లేఖ యందు అత్యుత్తమముగా ప్రతిపాదించబడినది. ఇది చాలా ప్రశంసనీయము.

### 4.7 వేదములందు 'హీనోథీఇజమ్' కలదా?

వేదములలో ఏకేశ్వర వాదమును గూర్చి ఇంత గొప్ప స్పష్ట ప్రమాణము లున్నను మరియు నిష్పక్షికులగు పాశ్చాత్య, పారసీ, ముస్లిం విద్వాంసుల ద్వారా ఉపర్యుక్త రీతిలో దాని సమర్థన గలిగి యున్నను యూరోపీయ విద్వాంసు లనేకులు ఈసాయీ మత పక్షపాతములో (క్రైస్తవమత) గొప్పతనమును సిద్ధింపజేయుటకు క్రొత్తవాదమును *Henotheism or Kathenotheism* అను పేరుతో కల్పించినారు. ఈ *Henotheism* అనున దేమి వ్యాధి? వాస్తవముగా వేదములం దీ ప్రతిపాదన మున్నదా? మేమిదివరకు చూపినట్లు *Vedic Age* లేఖకులు

కూడా ఈ వాదమునకు ప్రముఖ ప్రవర్తకుడగు ప్రొ. మైక్స్ మ్యూలర్ అభిప్రాయమునే నిర్దేశమొనర్చుచు బలపరచుచున్నారు. మేమీ విషయమును నిష్పక్షపాత భావముతో వివేచనమొనర్చు టావశ్యకమని తలచుచున్నాము ఈ ప్రసంగమునందేమే మీ ఏకేశ్వరవాదముతో ఘనిష్ఠ సంబంధము గల వైదిక దేవతల గూర్చియు వివరించెదము

### 4.8 'హీనోథీయిజం' లేక ఉపాస్యశ్రేష్ఠతావాద మనగానేమి?

ఈ శబ్దమును అంగ్రేజి యందు కల్పించునాతడు ప్రొ. మైక్స్ మ్యూలర్ అతడు *Ancient Sanskrit Literature P.333, 334* నందు వ్రాసిన ఈ విషయమును, దీని కొన్ని ముఖ్యాంశములను దీని సమాలోచనమునకు పూర్వమే ఉదాహరించుట ఆవశ్యకమని తలచుచున్నాము ప్రొ.మైక్స్ మ్యూల రిట్లు వ్రాసినారు.

"Each Vedic poet seems to exalt the particular god whom he happens to be singing to a position of supremacy. It would be easy to find, in the numerous hymns of the Veda, passages in which almost every single god is represented as supreme and absolute. In the first hymn of th second Book of the Rigveda, Agni is called the ruler of the universe, the lord of men, the wise King, the father the brother, the son, the friend of men, nay all the power, and names of the others are distinctly ascribed to Agni. Indra is celebrated as the strongest in the hymns as well as in the Brahmanas, and the burden of one of the songs of the tenth Book is–

Vishvasmad Indra uttarah : "Indra is greater than all Of Soma it is said that he was born great, and that he conquers every one. He is called the kind of the world, he as the power to prolong the life of men and is the maker of heaven and earth, of Agni or Surya, of Indra and Vishnu. In the very next hymn, addressed to Varuna it is the Varuna who is, to the mind of the poet Supreme and Almighty.

Prof. Maxmuller's Ancient Sanskrit literature P.353,355.

In his writings Max muller constantly referred to this and coined the word Henotheism or Kathenotheism to express what he regarded As a "peculiar character" of the Ancient Vedic religion. It denotes that each of several divinities is regareded as supreme and worshipped without reference to the rest or that the seers held at the belief in individual gods alternately or for the time being regarded as highest the one that was worshipped and that they therefore treated him as if he were absolutely being independent and supreme, alone present to the mind of the worshipper.

*The RigVeda and Vedic Religion by A.C. Clayton P.59,60*

సారాంశమున ప్రతి వైదిక కవి, లేక ఋషి ఏ దేవతనో స్తుతి యొనర్చునప్పుడు దానినే సర్వోత్కృష్టమని చూపుటకు మరియు దాని యందు సర్వోత్కృష్టతకు సంబంధించిన సర్వలక్షణములను సమావేశపరచుటకు

ప్రయత్నించును వేదములందలి అనేక సూక్తములందు తరచుగా ప్రతి దేవతను సర్వోన్నతనుగా, సంపూర్ణత్వముగా చూపుటను మనము సులభముగా గ్రహించవచ్చును ఋగ్వేదములోని ద్వితీయ మండలము యొక్క ప్రథమ సూక్తమందు సమస్త మానవులకై అగ్నిని బుద్ధిశాలియగు రాజుగా, విశ్వమునకు నాథునిగా, శాసకునిగ, సకల మానవుల తల్లి, తండ్రి, సోదరుడు, పుత్రుడు, మిత్రుడుగా చెప్పబడినది. మరియు ఇతర దేవతల సర్వశక్తులు మరియు నామములు స్పష్టముగా అతని ( అగ్ని)వే యని ఎంచబడినది. ఇంద్రుడు అందరికన్న అధికశక్తిశాలి యని వేదములందు, బ్రాహ్మణములందు స్వీకరించబడినది. మరియు ఋగ్వేదములోని ఒక సూక్తమునందు 'విశ్వస్మాదిన్ద్ర ఉత్తరః' అని ఆలాపన గలదు

సోముని విషయములో అతడు చాలా గొప్పవాడు, సర్వ విజేత, విశ్వ స్వామి యని చెప్పబడినది. ఆయన లోకుల ఆయువును దీర్ఘమొనర్చుటకు సమర్థుడు, పృథివీ ఆకాశముల ఉత్పాదకుడు, అతడే అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు మున్నగువారి నుత్పన్నమొనర్చె ననియును వర్ణింపబడియున్నది దానికన్న పూర్వమున్న వరుణదేవతా సూక్తము నందు మంత్ర ఋషి దృష్టిలో వరుణుడే సర్వశక్తిశాలి, సర్వోన్నతుడైయున్నాడు.

వైదిక ధర్మము యొక్క విశేషత్వమునకు ప్రో. మైక్స్‌ముల్లర్ 'హీనోథీఇజమ్' అను పేరును కల్పన యొనర్చినదాని తాత్పర్యమేమన, అనేక దేవతల నుండి తాను ప్రత్యేకముగా స్తుతి యొనర్చు దేవుని కవి,సర్వోన్నతుడు,స్వతంత్రుడు, సర్వశక్తి మంతుడని యెంచును. ఆ స్తుతి కాలములో ఆతడొక్కడే ఏకమాత్ర స్తోత్రగా భక్తుని మనస్సునందు విద్యమానమై యుండును

## 4.9 'హీనోథీఇజమ్' (ఉపాస్యశ్రేష్ఠత్వవాదము) వేదములందు గలదా?

ఇప్పుడు మేము నిష్పాక్షిక భావముతో ఈ వాదమును వివేచించదలచినాము. మే మిదివరకే వైదిక ఏకేశ్వరవాదముయొక్క సమర్థనమందు ఇతర భావార్థములు సంభవములు గాజాలని అతిస్పష్ట మంత్రముల నుల్లేఖించియుంటిమి. వాని విషయములో ఎంతయో స్పష్టముగా ఉపదేశించబడియున్నది.

**ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥ ఋగ్వే.౧-౬౪-౪౬ ॥**

**సుపర్ణం వి ప్రాః కవయో వచోభిరేకం సన్తం బహుధా కల్పయన్తి ॥ ఋ.౧౦-౧౧౪-౫ ॥**

**యో దేవానాం నామధ ఏక ఏవ ॥ ఋ. ౧౦-౦౨-౩, యజు ౧౭-౨౭, అథర్వ ౨-౧-౩॥'**

**న ద్వితీయో న తృతీయశ్చతుర్థో నాప్యుచ్యతే**

**స ఏషః ఏక ఏకవృదేక ఏవ ।**

**ఏక ఏవ నమస్యో విక్ష్వీడ్యః ॥ అథర్వ ౨-౨-౧॥**

**ఏక ఏవ నమస్యః సుశేవః ॥ అథర్వ .౨-౨-౨॥**

అనగా; ఆ పరమాత్మ ఒక్కడే ౨,౩,౪,౫,౬,౭,౮,౯,౧౦ మంది ఈశ్వరులు కారు. ఆత డొక్కడే. ఆ ఏకైక పరమాత్మ యొక్కడు మాత్రమే మానవులెల్లరకును పూజనీయుడై యున్నాడు. ఆ యొక్కనినే జ్ఞానులు ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని, మాతరి శ్వా, యమ మున్నగు అనేక నామములతో బిలుచుచుందురు. ప్రధానముగా నా దేవతల నామములను ధారణమొనర్చువా డా పరమేశ్వరు డొక్కడే.

ఇట్టి స్థితియందు వేదములను విశుద్ధము మరియు స్వాభావిక రూపమున ఏకేశ్వర వాదమునకు ప్రతిపాదకములని విశ్వసింపక 'హీనోథీఇజమ్' యొక్క కల్పన నొనర్పుట కేవలము పక్షపాత సూచకమే గదా! ఋషులను కల్లలాడువారు, పరుల ముఖ స్తుతి యొనర్చి బ్రతుకువారని తలచుట ఎంతటి అజ్ఞానమో చూడుడు (ప్రొ. మాక్స్ మూలర్ మరియు ఇతర మత పక్షపాతులు అభిప్రాయపడినట్లు గాక వేదమంత్రములందు అగ్నిని సంబోధించుచు ఋగ్వేద ద్వితీయ మండలమందలి ప్రథమ సూక్తములో స్పష్టముగా ఇట్లు గలదు

త్వమగ్న ఇన్ద్రో వృషభః సతామసి త్వం విష్ణురురుగాయో నమస్యః ।
త్వం బ్రహ్మా రయివిద్ బ్రహ్మణస్పతే త్వం విధర్తః సచసే పురన్ధ్యా ॥ ఋ ౨-౧-౩॥
త్వమగ్నే రాజా వరుణో ధృతవ్రతస్త్వం మిత్రో భవసి దస్మ ఈడ్యః ।
త్వమర్యమా భవసి యస్య సంభుజం త్వమంశో విదథే దేవభాజయుః ॥ ఋ ౨-౧-౪॥
త్వమగ్నే రుద్రో అసురో మహో దివస్త్వం శర్ధో మారుతం పృక్ష ఈశిషే ।
త్వం వాతైరరుణైర్యాసి శంగయస్త్వం పూషా విధతః పాసి ను త్మనా ॥ ఋ ౨-౧-౬॥
త్వమగ్నే ద్రవిణోదా అరంకృతే త్వం దేవః సవితా రత్నధా అసి ।
త్వం భగో నృపతే వస్వ ఈశిషే త్వం పాయుర్దమే యస్తేఽవిధత్' ॥ ఋ.౨-౧-౭॥

అనగా; నీవు మాత్రమే ఇంద్ర, విష్ణు, బ్రహ్మ, బ్రహ్మణస్పతి, వరుణ, మిత్ర, అర్యమా, రుద్ర, పూషా, ద్రవిణోదా, సవితాదేవ మరియు భగ మున్నగు నామములు గలవాడవు అనప్పుడు ఈ నామములన్నియు ప్రధానముగా ఒకే అగ్ని పదవాచ్యుడు, సర్వజ్ఞుడు నగు పరమేశ్వరునికే చెంది యున్నవనియు మరియు నివన్నియును అతని యనేక గుణములను సూచించుచున్నవనియు విశ్వసించుటలో ప్రమాద మేమియును లేదు గదా! ఒక పరివార మందలి ఒకే వ్యక్తికి అనేక సంబంధములు గల కారణమున వేర్వేరు వ్యక్తులు నాయనా, బాబాయా, తాతగారూ, అన్నయ్యా, మామగారూ మున్నగు నామములతో పిలుచుచుందురు గదా! ఇదే విధముగా ఒకే పరమేశ్వరుని అనంతగుణములను సూచించుటకై ఈయనేక నామములు ప్రయుక్తమొనర్పబడును. జ్ఞానస్వరూపుని రూపమునందాతని స్మరింపబడునప్పుడు అగ్నియని పిలువబడును. ఆయన పరమైశ్వర్య సంపన్నత్వమును ప్రదర్శించుటకు 'ఇంద్రుడు', సర్వవ్యాపకత్వమును జూపుటకు విష్ణువు, అతని మహోన్నతత్వమును సూచించుటకు బ్రహ్మ, జ్ఞానాధిపత్యమును ప్రదర్శించునప్పుడు బ్రహ్మణస్పతి, సర్వోత్తమత్వమును జూపుటకు వరుణుడు, సకల ప్రాణుల యెడ ప్రేమను ద్యోతపరచుటకు మిత్రుడు, న్యాయకారిత్వమును సూచించుటకు అర్యమా, దుష్టుల నేడ్పించు, మరియు ప్రాణదాయక గుణములను ప్రకటించుటకు అసుర, రుద్ర, సమస్త జ్ఞానము మున్నగు ధనములను ప్రసాదించువాడగుటచే యాతని పరమైశ్వర్యత్వమును జూపుటకు ద్రవిణోదా అనియు సర్వోత్పాదకుడు, సర్వప్రేరకుడును ప్రకాశస్వరూపుడును ఆ పరమేశ్వరుడే యని సూచించుట కొరకే సవితా దేవ మరియు నాతని భజనీయత్వమును ప్రకటించుట కొరకే 'భగ' శబ్దము ఆ పరమేశ్వరునికే ప్రయోగించబడుచున్నది. వేదమంత్రములందు 'సోమ' అను విషయమున చెప్పినప్పుడు ( స్వయముగా ప్రొ మాక్స్ మూలరు చూపినట్లు)

**త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వం గాః।**

**త్వమాతతన్థోర్వన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ** ॥ ఋ.౧-౯౧-౨౨-౬౦౪, సామ. మం. ౬౦౪॥

**సోమః పవతే జనితా మతీనాం, జనితా దివో జనితా పృథివ్యాః।**

**జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేన్ద్రస్య జనితోత విష్ణోః** ॥ ఋ.౯-౯౬-౫ మరియు సామ.పూ.౫-౬-౫ ॥

**అయం పూషా రయిర్భగః సోమః పునానో అర్షతి।**

**పతిర్విశ్వస్య భూమనో వ్యఖ్యద్ రోదసీ ఉభే** ॥ ఋ.౯-౧౦౧-౭ మరియు సామ. పూ. ౫-౧-౨ ॥

అనగా ; హే సోమ! నీవే ఈ యోషధులను, వనస్పతులను, ఈ జలములను, గోవులను ఉత్పన్నమొనర్చినావు. నీవు సమస్త అంతరిక్షమునందు వ్యాపకమై యుండి స్వయముగ ఈ జ్యోతి ద్వారానే సంపూర్ణ అంధకారమును పటాపంచలొనర్చుచున్నావు. సోముడు నీ జ్యోతి ద్వారానే సంపూర్ణ అంధకారమును పటాపంచలొనర్చును. సోముడు ఉత్తమ బుద్ధుల నుత్పన్నమొనర్చువాడు, మరియు నాతడే పృథివి, ఆకాశము, అగ్ని, సూర్యుడు, వాయువు మున్నగు వాని నుత్పన్నము చేయువాడై యున్నాడు.

ఈ సోముడే పుష్టిదాయకుడగుటచే 'పూషా', మరియు సేవనీయుడగుటచే 'భగ' యనబడును. ఈయన విశ్వమంతటికినీ స్వామి, ఈయన సర్వలోక లోకాంతరము లందును వ్యాపకుడై యున్నాడు.

ఇప్పు డాలోచించుడు. 'సోమ' అను ఓషధి ''సూర్య చంద్రులను, పృథివీ ఆకాశాదుల నుత్పన్నపరచునది'' యని ఎంతటి మూర్ఖాతిమూర్ఖుడు, అటవిక అనాగరికుడైనను నమ్మగలడా? సోమ యను శబ్దమిచ్చట శాంతి స్రోతమగు పరమేశ్వరవాచకమేయని స్పష్టముగా స్వీకరించవచ్చును గదా! ఈవర్ణన లన్నియును ఈశ్వరుని గుణ సంబంధములే గదా! అగ్ని, ఆదిత్య, వాయు, చంద్ర, శుక్ర, బ్రహ్మ, ఆపః, ప్రజాపతి మున్నగు పదవాచ్యములు ముఖ్యముగా ఆ పరమేశ్వరునకే చెందును. పైన దెలిపిన ఋగ్వేద మంత్రములే గాక ఇతర వేదములందలి అనేక మంత్రములందును ఈ ప్రతిపాదన గలదు. ఉదాహరణార్థము యజుర్వేద. ౩౨-౧వ మంత్రమును జూడుడు.

**తదేవాగ్నిస్తదాదిత్యస్తద్ వాయుస్తదు చన్ద్రమాః।**

**తదేవ శుక్రం తద్‌బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః** ॥ య ౩౨-౧॥

ఆ పరమేశ్వరుడొక్కడే. జ్ఞాన స్వరూపుడగుటచే **అగ్ని,** అవినాశి యగుటచే **ఆదిత్యుడు.** విశ్వమునకు గతిని గలిగించువాడు కావున **వాయువు,** 'వా-గతి గన్ధనయోః' ఆహ్లాదకుడు, ఆనందదాయకుడగుటచే **చంద్రుడు** (చది-ఆహ్లాదే) శుద్ధ స్వరూపుడగుటచే **శుక్రుడు** (శుచిర్-పూతీభావే) సర్వోన్నతుడు గావున **బ్రహ్మ,** (బృహ-వృద్ధౌ) సర్వ వ్యాపకుడగుట **ఆపః** మరియు సకల ప్రజల పాలకుడగుటచే **ప్రజాపతి** యను నామములచే ఆతడే పిలువబడుచుండును.

''భిన్న భిన్న దేవతలను భిన్నభిన్నులుగా నెరిగియును వారి ముఖ స్తుతి యొనర్చుటకొరకే ఋషులు వారి విషయములో గొప్పలు చెప్పుదురు'' అని దీని భావార్థము కాదు. కాని అగ్ని, ఆదిత్య, వాయు, చంద్ర మున్నగు నామములు ముఖ్యముగా ఆ ఒకే పరమేశ్వరుని అనేక గుణములను సూచించునవి యని వారెరుగుదురు. అట్టి ఆ

పరమేశ్వరుడొక్కడే పూజనీయుడు. దిగువ అథర్వవేదము ౧౩-౪-౪,౫ మంత్రములు స్పష్టముగా ఈ భావమునే సూచించుచున్నవి. అనగా, ఆ ఒకే పరమేశ్వరుడు **అర్యమా, వరుణ, రుద్ర, మహాదేవ, అగ్ని, సూర్య, మహాయమ** అను అనేక గుణ సూచక నామములచే పిలువబడును.

**సోఽర్యమా స వరుణః స రుద్రః స మహాదేవః** ॥ అధర్వ ౧౩-౪-౪॥

**సో అగ్నిః స ఉ సూర్యః స ఉ మహాయమః** ॥ అథర్వ ౧౩-౪-౫ ॥

He is the administrator of justice, He is the only object of our choice, He is the chastiser of evildoers and he is the Supreme Divinity. He is Agni (the Self-refulgent God), He is verily Surya (The Impeller of all) verily He is the Mahayama (the greatest Administrator of justice.)

అగ్ని యను పేరుతో ప్రొ.మైక్స్ మూలర్ ద్వారా చూపబడిన ఋగ్వేద ౨-౧ యొక్క మంత్రములలో జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరుడే వాస్తవముగా గ్రహించబడినాడు. కావుననే పరమాత్మ బ్రహ్మ ( చతుర్వేదవేత్తా, మరియు అందరికంటె పెద్ద, 'బ్రహ్మే చాసి గృహపతిశ్చ నో దమే' ఋ.౨-౧-౨) బ్రహ్మాణస్పతిః అనగా జ్ఞాని, లేక లోకలోకాంతరముల స్వామి - **బృహత్యా వేదవాణ్యా,** లేక **బృహతాం లోకానాం** పతిః । నమస్కరణీయ **విష్ణుః** - సర్వ వ్యాపకుడు (**త్వం విష్ణు రురుగాయో నమస్యః** ॥ఋ.౨-౧-౩॥) అర్యమా అనగా న్యాయకారి మున్నగు నామములచే పిలువబడినాడు. ఎంతటి మూర్ఖాతి మూర్ఖుడగు ఆటవికుడు సైతము ఈ భౌతికాగ్నిని చదుర్వేద వేత్త, మరియు జ్ఞానదాత, న్యాయకారి మున్నగు నామములతో పిలువజాలడు. ఈ విధముగ మంత్రముల యొక్క వాస్తవికార్థమును తెలిసికొనజాలక పక్షపాత బుద్ధితో ప్రొ. మైక్స్ మూలర్, మరియు వాని అనుయాయులు వేదముల విశుద్ధ ఏకేశ్వరవాదము నంగీకరింపక 'హీనోథీఇజమ్' మున్నగు కపోలకల్పిత వాదములను ప్రచారమొనర్చుట సర్వదా అనుచితమే గాక అజ్ఞానము మరియు పక్షపాత సూచకమేయగును.

ప్రొ. మైక్స్మూలర్ యొక్క ఈ నవీన వాదమును యూరోపు నందలి అనేక విద్వాంసులుకూడా అంగీకరించక తమ అసమ్మతిని ప్రకటించుచు వేదములందలి విశుద్ధమగు ఏకేశ్వరవాదమునే స్వీకరించినారు. ఈ విషయము ఇదివరకే ఉదాహరణములతో గూడ చూపబడినది. *The RigVeda and Vedic Religion* లేఖకుడగు *(Clayton)* అను విద్వాంసుడు వైదిక ఏకేశ్వరవాదమును స్పష్టముగా అంగీకరించక వైదిక దేవతల విషయములో అనేక అశుద్ధ కల్పనలనొనర్చినాడు. ( ఈ విషయములో మేమీ యధ్యాయమునందే విశేష సమాలోచనలతో చూపగలము ) ఐనను. ( ప్రొ. మైక్స్ మూలర్ ) యొక్క ఈ నవీన వాదము *(Henotheism)* ను ఈ దిగువ శబ్దముల ద్వారా సమాలోచన మొనర్చినాడు.

"More modern scholars do not however, consider this practice so remarkable as Max Muller did. They regard it more as a species of Poetic license by which a singer magnified the god whom he was invoking, rather than an evidence that the poet actually claimed that the god whom he was then reverencing was the superior of all others."

(The RigVeda and Vedic Religion by A.C. Clayton Published by the Christian Literature Society for India London & Madras 1913)

అనగా; ఆధునిక విద్వాంసులీ యలవాటును (ప్రొ. మైక్స్ మూలర్ తలచినంత ఉల్లేఖనీయమని యెంచరు. దీనిని వీరు కవుల అతిశయోక్తులం దిది యొక ప్రకారమని యెంచుదురు. గాయకు డొక దేవతను ఆవాహన మొనర్చుచు దానినే అనేక అతిశయోక్తులచే వర్ణించు విధమే యని దలచెదరు. ఐతే ఇది( ప్రొ.మైక్స్ మూలర్ చూపినట్లు) కవి ఏ దేవతను గూర్చిన వర్ణనలను జేయుచుండునో సకల దేవతల కన్న తాను వర్ణించు దేవతయే సర్వోన్నతు డనుటకు కాదు గదా!

'కవుల అతిశయోక్తుల కారణముననే ఈ విధమగు వర్ణనలను గాంచనగు'నను 'క్లేటన్' మరియు ఇతర విద్వాంసుల వాదన మరియు ఆలోచనల విషయముతో కూడా మేము ఏకీభవించము. ఏలన; ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని, యమ, సోమ మున్నగునవన్నియు ఒకే పరమేశ్వరుని నామము లని విశ్వసించుటలో వేదములం దుపదేశించబడిన 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' - **'ఏకం సుపర్ణ కవయో వచోభిరేకం సన్తం బహుధా కల్పయన్తి' - 'యో దేవానాం నామధా ఏక ఏవ'** మున్నగు మంత్రముల ద్వారా పదేపదే తెలుపబడియుండగా 'కవి సులభ అతిశయోక్తి' అను ప్రశ్నయే యుండదు గదా!

భారతీయ సుప్రసిద్ధ యోగి మరియు ఆలోచన, పరిశీలనాపరుడగు శ్రీ అరవిందులు మరియు *RigVeda Unveiled* లేఖకుడగు శ్రీ ద్విజదాసదత్త *M A A R.A.C* భూతపూర్వ ప్రిన్సిపాల్ చిటగాంగ్ కాలేజి, బెంగాల్, ప్రొ. మైక్స్ మూలర్ మున్నగువారిద్వారా అంగీకరించబడిన ఈ 'హినోథీజమ్' ను చక్కని యుక్తియుక్తుల ద్వారా ప్రబలముగా సమాలోచన మొనర్చినారు. మేము వాని ముఖ్యాంశములను ఉదాహరించకుండా యుండలేము

### 4.10 శ్రీ అరవిందుల ద్వారా 'హినోథీజమ్' యొక్క సమాలోచనము

*'Dayananda and the Veda'* ను గూర్చి ౧౯౧౬ డిసెంబర్ నెల వైదిక మైగజీన్ *Vedic Magazine* నందు వ్యాసము వ్రాయుచు ( తరువాత అది *"Dayananda, Bankima, Tilak"* అను పేరుగల పుస్తకమునందు పుస్తకాకారముగ ప్రకాశితమైనది ) శ్రీ అరవిందులిట్లు వ్రాసినారు.

"What is the main positive issue in this matter? An interpretation of Veda must stand or fall by its central conception of the Vedic religion and the amount of support given to it by the intrinsic evidence of the Veda itself. Here Dayananda's view is quite clear, its foundation inexpugnable. The Vedic hymns are chanted to the one Deity under many names, names which are used and even designed to express his qualities and powers. Was this conception of Dayananda's arbitrary concept fetched out of his own too ingenuous imagination?

Not at all; it is the explicit statement of the Veda it self.

One existent 'sages' not the ignorant, mind you, but the seers, the men of knowledge- speak of in many ways, as Indra as Yama as Matarishwan as Agni.

The Vedic Rishis ought surely to have known something about their own religion, more, let us hope than Roth or Maxmuller and this is what they knew.

We are aware how modern scholars twist away form the evidence. This hymn, they say was a late production. This loftier idea which it expresses with so clear a force, rose up some how in the later Aryan mind or was borrowed by those ignorant fire-worshippers, sun-worshippers, sky-worshippers from their cultured and philosophic- Dravidian enemies. But through out the Veda we have confirmatory hymns and expressions. Agni or Indra or another is expressly hymned as one with all the other gods. Agni contains all other divine powers within himself, the Maruts are described as all the gods. One deity is addressed by the names of others as well as his own, or most commonly, he is given as Lord and King of the universe, attributes only appropriate to the supreme Deity. Ah, but that cannot ought not to mean, must not mean the worship of one; let us invent a new word, call it henotheism, and Suppose that the Rishis did not really believe Indra or Agni to be the supreme Deity, but treated any god or every god as such for the nonce, perhaps that he might feel the more flattered and lend a more gracious ear for so hyperbolic a compliment! but why should not the foundation of Vedic thought be natural monotheism rather than this new fangled monstrosity of henotheism? Well, because primitive barbarians could not possibly have risen to such high conceptions and if you allow them to have so risen you imperil our theory of the evolutionary stages of the human development and you destroy our whole idea about the sense of the Vedic hymns and their place in the history of mankind. Truth must hide herself, common sense disappear From filed so that a theory may flourish! I ask on this point and it is the fundamental point, who deals most straight forwardly with the text, - Dayananda or the Western scholars?
Dayananda and the Veda by Shri Aravinda P. 17-18.

ఈ మహత్వ పూర్ణమగు ఉద్ధరణము యొక్క తాత్పర్యమేమన; ఈ విషయమునందు ముఖ్యముగా ఆలోచించదగిన వస్తువేమి? వేదముల ఏ వ్యాఖ్యానము యొక్క సఫలత, లేక అసఫలత వేదప్రతిపాదిత ధర్మము యొక్క కేంద్రీయ భావన మేమి? లేదా వేదముల ద్వారా ప్రతిపాదిత ప్రమాణములు ఆ భావన నెంతవరకు సమర్థించుచున్నవను విషయముపై ఆధారపడియుండును, ఇచ్చట దయానందమహర్షి ఆలోచనలు ఏ మాత్రమును నిరాకరించదగినవి కావు. వాని యాధారములు దృఢము మరియు స్థిరములైయున్నవి. వేదమంత్రము లందు

ఒకే పరమేశ్వరుని అనేక నామముల ద్వారా గానమొనర్చబడినది. అని యన్నియును ఆ పరమ దేవుని అనేక గుణములను, మరియు శక్తులను ప్రదర్శించు అభిప్రాయముతో ప్రయుక్తమైయున్నవి. ఐతే మహర్షి దయానందులు తన పాండిత్య పూర్ణ స్వచ్ఛంద కల్పనల ద్వారా వీని ప్రయోగ మొనర్చినారా? అట్లెన్నడును జరుగలేదు. ఇవి స్వయముగా వేదముల స్పష్టవచనము (ఉపదేశము)లైయున్నవి.

**ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥ ఋ.౧-౧౬౪-౪౬॥**

అనగా; ఆ ఒకే పరమేశ్వరుని జ్ఞానులు, తత్త్వదర్శులగు ఋషులు ఇన్ద్ర, అగ్ని, యమ, మాతరిశ్వా ఇత్యాది అనేక నామములతో బిలుచుచుందురు. కావున మనము మన ఋషులు ధార్మిక విషయములందు రౌథ్, లేక మైక్స్ మూలర్ మున్నగు వారి కన్నను అత్యధికముగా దెలిసికొనియుండిరనియు ఇది సత్యమైనది కావుననే వారు చక్కగానే యెరిగి యుండిరనియు ఆవశ్యకముగా ఆశించవలసి యుండును.

ఆధునిక (పాశ్చాత్య) విద్వాంసు లీ సత్యమైన ప్రమాణములను ఎట్లు తలక్రిందులొనర్చి తప్పుకొందురో మాకు దెలియును. ''ఇంతటి మహోన్నతాలోచనలు, భావములు గల మంత్రములు ఆ కాలపు ఆర్యుల తలపుల కెప్పుడును రాజాలవు. ఇంతటి దృఢత్వముతో గూడిన భావములు ఆ కాలపు అనాగరికార్యులం దెట్లు సాధ్యమగు''నని వారనుచుందురు. ''ఇవి యన్నియును తరువాత కాలపు రచనలు, ఈయాలోచనలు ఆనాటి అజ్ఞానులు, అగ్ని పూజకులు, సూర్యారాధకులు, ఆకాశపూజకులగు ఆర్యుల మనస్సులలో ఎప్పుడును ఉత్పన్నము గాజాలవు. వారీయాలోచనలను సభ్యతగల, దార్శనిక శత్రువులగు ద్రావిడుల దర్శనముల నుండి స్వంతపరచికొనినా రందురు. కాని ఈ యుత్తమాలోచనల పరిపోషక ప్రమాణములు వేదములందంతటను మనకు లభ్యమగుచుండును. మంత్రము లందిట్టి వర్ణనలెన్నియో గలవు అగ్ని, లేక ఇన్ద్ర, లేక అన్య దేవతా నామము లన్నియును ఆ ఏకైక దేవదేవునికే ప్రతీకలై యున్నవి. అగ్ని ఇతర సకల దేవతల శక్తులను తనయందుంచుకొనగలదు. మరుత్తు యొక్క సర్వ దేవమయ వర్ణనలు మన కనేక స్థానములం దుపలబ్ధమగుచుండును ఒక దేవత తన నామముతో సంభోదితమగు స్థలములందు సమయానుకూలముగా అనేక నామములతో గూడ ఆతనియాహ్వాన మగుచుండును. ఒక్కొక్క దేవతను విశ్వనాథునిగా లేక రాజుగా నెంచుకొని ఆతని స్తుత్యాదుల నొనర్చుటను తరచుగా జూచుచునే యుందుము. ఈ సకల దేవతా గుణ విశేషణము లన్నియును ఆ పరమ దేవత పరమేశ్వరుని కొరకు ప్రయోగించబడుచుండును కాని అట్లు గాకూడదు. అట్టి అర్థమును దీసికొనవలదు. ఒకే యీశ్వరుని పూజచేయవలె నని దీనియర్థము గారాదు. పరమాత్మను ఆయన గుణకర్మ స్వభావములను దృష్టియందుంచుకొని ఆవశ్యకతానుసారము మన అతిశయోక్తస్తుతులని ధ్యాన పూర్వకముగా వినవలయుననియే దీనియుద్దేశ్యము. ఐనను వైదికాలోచనలను స్వాభావిక ఏకేశ్వర వాదమని ఏలనమ్మవలదు? ఈ నవకల్పిత 'హీనోథీఇజమ్' అను భూతము యొక్క అవసరమేమి? పాశ్చాత్య విద్వాంసులు తమ నాగరికతను ప్రపంచముపై రుద్దుటకు సత్యమును గప్పిపుచ్చి తమ సిద్ధాంతములను అతి నేర్పుగా ప్రచారమొనర్చుటలో సఫలమగుటకే వారి యీ ప్రయత్నము. మూల వేదము యొక్క ఏ చిక్కులు లేని సరళ మార్గమునందు పయనించుచున్నవారు దయానందులా, లేక పాశ్చాత్య విద్వాంసులా? యనున దిచ్చట నా మూల

సుప్రసిద్ధ పరిశీలకుడు, మార్గదర్శకుడు, యోగి శ్రీ అరవిందుల ఈ యుక్తి యుక్త విమర్శ ఎంతో ప్రభావ పూరితమైనదనుటలో ఏ మాత్రము సందేహము లేదు.

### 4.11 శ్రీ ద్విజదాస దత్త ద్వారా సమీక్ష

మే మిప్పుడు *RigVeda Unveiled* అను గ్రంథకర్తయగు శ్రీ ద్విజదాసదత్త *MAARAC* భూత పూర్వ ప్రిన్సిపాల్ చిటగాంగ్ కాలేజి, బెంగాల్ గారి ద్వారా రచింపబడిన సమాలోచనము నుదాహరింపదలచినాము. ఇదియును శ్రీ అరవిందుల వారివలెనే ప్రబలమైనది.

*As to Maxmuller's charge of Henotheism or worship of many 'single gods' or a number of independent deities, it represents the Rishis as flattering sycophants or cowardly liars, who could call each single god, as the one Supreme Being, only to avert the wrath of that god, knowing at the same time, that he was not telling the truth. We ask the reader himself to judge whether when the rishi addresses Indra. -Rig 1-57-8*

'న హి త్వదన్యో గిర్వణో గిరః- సఘత్'

*Thou who art the sole object of my praise, none but Thee shall receive my praise! or whether when the Rishe address Indra - Rig 7-32-22*

'న త్వావాం అన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే'

i.e. neither in heaven nor in the earth, has appeared or shall appear any one like Thee; the Rishi is a henotheist, a base lying flatterer of Indra, or a true Monotheist declaring like Muhammad 'La elaha Ill Allaha, or L sharika lahu'

- RigVeda Unveiled by Dwij Das Datt M.A.A.R.A.C. P. 140-141

అనగా; ప్రొ. మైక్స్ మూలర్ యొక్క హినోథీఇజమ్‌లో అనేక స్వతంత్ర దేవతలు, అనగా వేర్వేరు బ్రహ్మల వంటి దేవతలని ఆరోపణము గలదు. అందు ఋషులు పరుల ముఖస్తుతి యొనర్చి పొట్ట పోసికొనువారు, దాసులు, పిరికివారు, అసత్యవాదులుగా జూపబడినారు. దేవతల క్రోధము నుండి తప్పుకొనుటకై వారిలో ప్రతి దేవతను సర్వోత్కృష్ట పరమేశ్వరునిగా నెంచుచుండిరనియు ఆరోపణ ఒనర్చబడినది. ఇదియథార్థము గాదని వారెరుగుచును ఇట్లువ్రాసినారు. పాఠకులే ఈ నిర్ణయమును దీసికొనవలయునని మేము కోరుచు సంబోధించునదేమన; ''న హి త్వదన్యో గిర్వణో గిరః సఘత్ ౹౧-౫౭-౮॥'' అనగా; నీకన్న వేరెవ్వరును నాకు స్తుతి పాత్రులు లేరు అనుచు ఋషి ఇంకా యిట్లనుచున్నాడు. ''న త్వావాం అన్యోదివ్యో న పార్థివో న జాతోన జనిష్యతే॥'' అనగా, నీ సాటియైన వాడు పృథివి ఆకాశములందెవ్వడును లేడు, ఉండబోడు. ఋషులు 'హీనోథీఇజమ్'ను నమ్మువారా? లేక సూటిగా ఇంద్రుని యొక్క నీచమైన తప్పుడు ముఖస్తుతి ఒనర్చువారా? లేక నిజమైన ఏకేశ్వరవాదులా? దీని తరువాత ఈ కపోల కల్పిత వాదమును విస్తృతముగా ప్రబలముగా సమాలోచన మొనర్చుచు శ్రీయుత ద్విజదాస దత్తగారు వందలాది మంత్రముల ద్వారా స్పష్టముగా ఏకేశ్వర వాదమును ప్రతిపాదించినాడు.

We would ask the reader also to see the following passages scattered broadcast through out all the Mandalas of the Rigveda

(1-21-3,4,5,6,7,8,9) (2-3-8) (2-12-5,8,9) (2-13-6) (2-16-1) (2-17-5) (2-35-2) (2-38-9) (2-44-16,17) (3-46-2) (3-51-4) (3-53-8) (4-17-5) (4-32-7) (5-32-9) (5-40-5) (5-85-6) (6-18-2) (6-22-1) (6-30-1) (6-36-4) (6-45-2) (6-47-18) (7-23-5) (7-98-6) (8-2-4) (8-13-9) (8-15-3) (8-24-19) (8-30-10) (8-58-2) (8-70-5) (10-5-1) (10-31-7,8) (10-82-3) (8-90-2,3-4) (8-114-4) (10-121-1,2-3,8). Etc (RigVeda Unveiled P.184)

ఇది ఋగ్వేదమందలి ఏకేశ్వర ప్రతిపాదక మంత్రముల వేర్వేరు మండలముల నుండి ఏకత్రిత మొనర్చిన పట్టిక. పరిశ్రమించు పాఠకులు స్వయముగా దీనిని జూచి లాభము నొందగలరు. ఏ పాశ్చాత్య, లేక ఇతర విద్వాంసులైనను ''కేవలము ఋగ్వేదమునందు ప్రథమ మండలములో ౧౬౪వ సూక్తము నందు ఏవో ఒకటి రెండు మంత్రములందు, మరియు పదవ మండలము యొక్క ౧౨౧ వ సూక్తములో కొన్ని మంత్రములందు మాత్రమే ఏకేశ్వర వాదమును గూర్చి కొంత ప్రకాశము గలదు, కాని అన్యత్ర ఎచ్చటను లేదను సాహసమొనర్చకుండుటకై ఈ పట్టిక ఈయబడినది. ఈ దృష్టికోణముతోనే ఈ విస్తృత పట్టిక మహత్త్వ పూర్ణమై యున్నది.

హీనోథీఇజం (సర్వోత్కృష్ట దేవతావాదము) యొక్క ఈ సమాలోచనమును సమాప్త మొనర్చుటకు పూర్వము మరొక విషయమును సూచించుట అవసరమనిపించుచున్నది. ఇందువల్ల హీనోథీఇజం యొక్క సారహీనత చక్కగా బోధ పడగలదు. అదేమన; *The Rigveda and Vedic Religion* లేఖకుడగు *A C Clayton*, *"The nature of Vedic gods"* విషయక తృతీయాధ్యాయములో వైదిక దేవతల విషయములో ఇట్లు వ్రాసినాడు.

Inspite of the many allusions to the gods, there is a great lack of clear description of the separate deities. The Vedic gods are not defined. Attributes of one are ascribed to another. Speaking generally, the personifications being but slightly developed, lack definiteness of outline and individuality of character.... The character of each god is made up of only a few essential qualities combined with many others which are common to all the gods; such as brilliance, power, 'beneficene, wisdom. These common attributes tend to obscure those which are distinctive.

(Quoted from Macdonell's Sanskrit Literature, Page 69.)

సారాంశమేమన; దేవతలను గూర్చి పదే పదే చెప్పబడినను ఆ వేర్వేరు దేవతల యొక్క స్పష్టమగు వర్ణనలోపించియే యున్నది. ఇందు వైదిక దేవతల యొక్క స్పష్టమగు చిత్రణము గాన్పించుట లేదు. ఒకరి గుణములు మరొకరియందు చూపబడియున్నవి. సాధారణముగా వైదిక దేవతల యొక్క చరిత్ర అందరి యందును

గాన్పించునట్టి కొన్ని విశేష గుణములతో గూడినదని యనవచ్చును. ఉదాహరణార్థము, ప్రకాశము, శక్తి, కరుణ, దయాళుత్వము, బుద్ధిమత్తత మున్నగునవి. ఈ సామాన్య గుణములు వారి విశేషతలను గప్పి పుచ్చుచున్నవి. వాస్తవిక విషయమేమన; వీనిని వేర్వేరు స్వతంత్ర దేవతలని యనుకొనబడుచున్నది. కాని నిజమున కవి స్వతంత్రముగా వేర్వేరు దేవతలు గానేకావు. అవి ఒకే పరమేశ్వరుని అనేక గుణములను శక్తులను సూచించు నామములై యున్నవి. కావుననే వీనియందు విభేదకమగు విశేష చిహ్నములు గాన్పించుట లేదు. ఈ విషయము వైదిక ఏకేశ్వర వాదము యొక్క సమర్థనము, మరియు హీనోథీఇజం యొక్క నిరాకరణము నొనర్చునవియై యున్నది.

**4.12 వైదిక దేవతలు :-**

ఇంతవరకీ యధ్యాయమునందు వ్రాయబడిన దానితో వైదిక దేవతల యొక్క సంబంధము చాలా వరకున్నది. కావుననే వానిని గూర్చి నిష్పక్షిక భావముతో నాలోచించుట అత్యంతావశ్యకమైయున్నది. వీని అర్థ స్వరూపములను దెలిసికొనలేకపోవుటచే వేదములు, మరియు వైదిక ధర్మ విషయమునం దనేక భ్రాంతు లుత్పన్నమైనవి.

**4.13 దేవ శబ్దమునకు నిరుక్తవచనము**

'దేవ' శబ్దము 'దా, ద్యుత్, దీప్, దివు' అను ధాతువులతో యాస్కాచార్యకృత నిరుక్తము నందు నిర్మించబడియున్నది.

**''దేవో దానాద్ వా, దీపనాద్ వా, ద్యోతనాద్ వా, ద్యుస్థానో భవతీతి వా''**

**యో దేవః సా దేవతా** (నిరుక్త ౭-౧౫)

దీనిననుసరించి జ్ఞానము, ప్రకాశము, శాంతి, ఆనందము, మరియు సుఖము నిచ్చునట్టి సకల వస్తువులును దేవతలను నామముచే చెప్పబడుచుండును. కావుననే యజుర్వేద. ౧౪-౨౦వ మంత్రము నందిట్లు చెప్పబడినది.

**అగ్ని ర్దేవతా వాతో దేవతా సూర్యో దేవతా చన్ద్రమా దేవతా వసవో**

**దేవతా రుద్రా దేవతాఽఽదిత్యా దేవతా మరుతో దేవతా విశ్వే దేవా**

**దేవతా బృహస్పతిర్దేవతేన్ద్రో దేవతా వరుణో దేవతా** ॥ య.౧౪-౨౦ ॥

ఇచ్చట అగ్ని, వాయు, సూర్య, చంద్ర, వసు, రుద్ర, ఆదిత్య, ఇన్ద్ర, (విద్యుత్తు) మున్నగునవి దేవతలుగా సంబోధించబడినవి. ఐనను ఈయన్నియును పూజించదగినవని దీని యర్థముగాదు. సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడగు ఆ పరమేశ్వరు డొక్కడే పూజనీయు డని తెలిసికొనవలయును.

**య ఏక ఇత్ తముష్టుహి కృష్టీనాం విచర్షణిః । పతిర్జజ్ఞే వృషక్రతుః'** ॥ ఋ.౬-౪౫-౧౬॥

**య ఏక ఇద్ధవ్యశ్చర్షణీనామిన్ద్రం తం గీర్భిరభ్యర్చ ఆభిః** ॥ ఋ.౬-౨౨-౧॥

**మా చిదన్యద్ విశంసత సఖాయో మా రిషణ్యత ।**

**ఇన్ద్రమిత్ స్తోతా వృషణం సచా సుతే ముహురుక్థా చ శంసత** ॥ ఋ. ౮-౧-౧॥

**దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతిరేక ఏవ నమస్యో విక్ష్వీడ్యః** ॥ అథ. ౨-౨-౧ ॥

**ఏక ఏవ నమస్య సుశేవాః** ॥ అథర్వ. ౨-౨-౨ ॥

ఇత్యాది మంత్రముల ప్రమాణములచే వైదిక ఏకేశ్వరవాదముపై ఆలోచించుచుచూపబడినది. దేవ శబ్ద ప్రయోగము సత్య విద్యలను ప్రకాశపరచు సత్యనిష్ఠగల విద్వాంసులకు వాడబడును. ఏలన; వారు జ్ఞానదానమొనర్చెదరు. మరియు వస్తువుల యొక్క యథార్థ స్వరూపమును ప్రదీప్తమొనర్తురు. **'దివు- క్రీడా విజిగీషా వ్యవహారద్యుతిస్తుతిమోదమదస్వప్నకాంతిగతిషు'** ఈ ధాతువుచే దేవశబ్దము జేయబడినప్పుడు దాని ప్రయోగము విజయమును సాధించు నభిలాష గల వ్యక్తుల, విశేషించి వీర క్షత్రియుల, పరమేశ్వర స్తుతి యొనర్చు, మరియు పదార్థములను యథార్థ రూపమున వర్ణనమొనర్చు విద్వాంసుల ( విశేషించి ఋత్విజుల) జ్ఞానమునిచ్చి మనుష్యుల నానందపరచునట్టి వాస్తవిక బ్రాహ్మణుల, ప్రకాశించు సూర్య చంద్ర అగ్ని విద్యుత్తు మున్నగు వస్తువుల, మరియు అచ్చటచ్చట సత్యవ్యవహారముల నొనర్చు వైశ్యుల కొరకును అగుచుండును. వీని స్పష్టమగు ప్రమాణములు వేదములే గాక బ్రాహ్మణ గ్రంథము లందును గాన్పించుచుండును. దిగువ బ్రాహ్మణ వచనముల నుదాహరించుట ఈ విషయము స్పష్టీకరణార్థము ఆవశ్యకమని తోచుచున్నది.

౧. **విద్వాంసో హి దేవాః** ॥ శత. ౩-౭-౩-౧౦ ॥

౨. **ద్వయా వై దేవాః । అహైవ దేవాః అథ యే బ్రాహ్మణాః** ॥ శత. ౨-౨-౨-౬
**శుశ్రువాంసో ఽనూచానాస్తే మనుష్యదేవాః** ॥ శత. ౪-౩-౪౪-౪ ॥

౩. **అథ హై తే మనుష్యదేవా యే బ్రాహ్మణా శుశ్రువాంసోఽనూచానాస్తే మనుష్యదేవాః** ॥ షడ్వింశబ్రాహ్మణే.౧-౧ ॥

౪. **ఏతే వై దేవా అహుంతాదో యద్ బ్రాహ్మణాః** ॥ గోపథ. ఉ.౧-౬॥

౫. **అపహతపాప్మానో దేవాః** ॥ శత.౨-౧-౩-౪ ॥

౬. **సత్యసంహితా వై దేవాః** ॥ ఐతరేయ ౧-౬ ॥

౭. **సత్యమయా ఉ దేవాః** ॥ కౌషీతకీ బ్రా. ౨-౮॥

౮. **యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః** యజు. ౧౧-౪॥ ఈ మంత్రమునకు వ్యాఖ్యానొనర్చుచు ''శతపథ బ్రాహ్మణము (౬-౩-౧-౧) న **''ప్రజాపతిర్వై విప్రో దేవాః విప్రాః ।''** పరమాత్మ విప్రుడు, అనగా, అందరికన్న మహాజ్ఞానియై యున్నాడు. జ్ఞానులగు బ్రాహ్మణులు దేవత లనబడుదురు. 'దేవ' శబ్దమునకు బ్రాహ్మణోక్త ఇతర అర్థములు.

| | | |
|---|---|---|
| ౯. | ప్రాణా దేవాః | ॥ శత. ౬-౩-౧-౧౫ ॥ |
| ౧౦. | తస్మాత్ ప్రాణా దేవాః | ॥ శత. ౭-౫-౧-౨౧ ॥ |
| ౧౧. | చక్షుర్దేవః | ॥ గో. పూ.౨-౧౦ ॥ |
| | మనోదేవః | ॥ గో. పూ.౨-౧౦ ॥ |
| ౧౨. | ఋతవో వై దేవాః | ॥ శత. ౭-౨-౪-౨౬ ॥ |
| ౧౩. | వాయుర్వై దేవః | ॥ జైమినీ ౩-౪-౭ ॥ |

ఇట్టి అనేక వచనములచే దెలియునదేమున సత్యనిష్ఠ గల విద్వాంసులు ముఖ్యముగా దేవ నామముచే సంబోధించబడినారు. సూర్యచంద్రులు, వాయువు, ఋతువులు మున్నగునవియును ప్రకాశకములు, లాభదాయకములు నగుటచే దేవతలని యనబడును.

## 4.14 ముప్పది ముగ్గురు దేవతలు

వేదములందు, అదే విధముగా బ్రాహ్మణములందు అనేక స్థానములందును (33) ముప్పది ముప్పురు దేవతల వర్ణన గలదు. ఈ విషయములో ఈ ముప్పది ముప్పురు దేవతల పూజను గురించి వేదములు, మరియు బ్రాహ్మణ గ్రంథములందును విధాన మొనర్చబడియున్నది. కావుననే ''వైదిక్ ఏజ్ *Vedic Age*'' మున్నగు గ్రంథములందును వైదిక ధర్మమును అనేకేశ్వరవాది *Polytheistic* అని చూపబడుచున్నది. కావున ఈ విషయమును గూర్చి వివేచన మొనర్చుటకు పూర్వము ముప్పది ముప్పురు దేవతలను గూర్చి బ్రాహ్మణ గ్రంథాదుల ఆధారముపై నిర్దేశమొనర్చుట ఆవశ్యకమని తోచుచున్నది. ఆ తరువాత మేము ఈ ముప్పది ముగ్గురు దేవతలకు ప్రాణము, మరియు అమరత్వమును ప్రదానమొనర్చు ఏకమాత్రుడు, పూజనీయుడు, దేవాధిదేవుడు, పరమ దేవుడు నగు ఆ పరమాత్మకు గల సంబంధమును గూర్చి సప్రమాణముగ తెలుపుటకు ప్రయత్నింతుము. ఈ ముప్పది ముప్పురు దేవతలు స్కంభమునకు అంగములవంటివి.

**యస్య త్రయస్త్రింశద్ దేవా అఙ్గే సర్వే సమాహితాః ।**

**స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥** అథ. ౧౦-౭-౧౩ ॥

**యస్య త్రయస్త్రింశద్దేవా నిధిం రక్షన్తి సర్వదా ।**

**నిధిం తమద్య కో వేద యం దేవా అభిరక్షథ ॥** మ.౨౩॥

**యస్య త్రయస్త్రింశద్ దేవా అంగే గాత్రా విభేజిరే**

**తాన్ వై త్రయస్త్రింశద్ దేవాన్ ఏకే బ్రహ్మవిదో విదుః ॥** అథ ౧౦-౭-౨౭ ॥

మున్నగు మంత్రములందు ముప్పది ముప్పురు దేవతల నిర్దేశమొనర్చుచు ఇట్లు చెప్పబడియున్నది. ఈ ముప్పది మూడు దేవత లెవని అంగమునందు కలవో (సమావేశమైయున్నవియో) ఆయననే స్కంభ (సర్వాధారుడగు పరమేశ్వరుడు) అని యెంచుము. ఆయనయే అందరికన్నను అధిక సుఖదాయకుడు. ఈ ముప్పది ముప్పురు దేవత లెవని నిధిని రక్షించుచుండెదరో ఆ నిధి నెరుగు వారెవ్వరు? ఈ దేవతలెవని విరాట్ శరీరమందు అంగముల వలెనున్నవియో అట్టి ముప్పది మూడు దేవతలను బ్రహ్మజ్ఞానులు మాత్రమే ఉత్తమోత్తమముగా నెరుగ జాలుదురు. ఇతరులకు సాధ్యముగాదు. ఇదే విధముగా ముప్పది ముగ్గురు దేవతల నిర్దేశము ఋగ్వే. ౧-౪౫-౨౭, ౮-౨౮-౧, మరియు౮-౩౦-౨, యజు ౨౦-౩౬ మున్నగు వానియందును చూడగలుగుదుము.

## 4.15 బ్రాహ్మణ గ్రంథములందు ముప్పది ముప్పురు దేవతలు

బ్రాహ్మణ గ్రంథము లందనేక స్థలములలో ముప్పది ముప్పురు దేవతల నిర్ణయము గలదు. వీని నుండి దిగువ వ్రాసినవి విశేష రూపములో ఉల్లేఖించదగినవై యున్నవి.

**౧. త్రయస్త్రింశద్ దేవతాః** ॥ తాండ్య. ౪-౪-౧౧ ॥

**౨. త్రయస్త్రింశద్ వై దేవతాః** ॥ కౌ. ౮-౬ ॥

**3. త్రయస్త్రింశద్ వై దేవాః ప్రజాపతిశ్చతుస్త్రింశః** ॥ శత. ౧౨-౬-౧-3౭ ॥

**౪. త్రయస్త్రింశద్ దేవాః ప్రజాపతిశ్చతుస్త్రింశః** ॥ తాణ్డ్య. ౧౦-౧-౧౬ ॥

ఈ విధమగు వచనములందు ముప్పది మువ్వురు దేవతలు, మరియు ముప్పది నాలుగవ దేవత వాని నియామకుడు, స్వామి యగు ప్రజాపతి పరమేశ్వరుడు స్పష్టముగ పేర్కొనబడినాడు. ఇప్పుడీ ముప్పది ముగ్గురు దేవతల గణనమును సూచించునట్టి కొన్ని వాక్యములు ప్రవేశపెట్టబడుచున్నవి.

**౧. అష్టౌ వసవః ఏకాదశ రుద్రాః ద్వాదశాదిత్యాః ఇమే ఏవ ద్యావాపృథివీ**

**త్రయస్త్రింశౌ త్రయస్త్రింశద్ వై దేవాః ప్రజాపతిశ్చతుస్త్రింశః** ॥ శత. ౪-౫-౭-౨ ॥

అనగా ౮ అష్టవసువులు, ౧౧ ఏకాదశ రుద్రులు, ౧౨ ద్వాదశాదిత్యులు మరియు ద్యావాపృథివి యను నీ రెండును గలిసి మొత్తము ముప్పదిమూడు, ముప్పది నాల్గవ వాడు ప్రజాపతి పరమేశ్వరుడు. ఈ విషయమే ఇతర బ్రాహ్మణ గ్రంథములందును కొంత భేదముతో నుండుటను జూపుచున్నాము. ఉదా -

౨. తాణ్డ్య మహాబ్రాహ్మణము ౬-౨-౫లో ఇట్లు చెప్పబడియున్నది.

**దేవతా వావ త్రయస్త్రింశోఽష్టౌ వసవః ఏకాదశ రుద్రా ద్వాదశాదిత్యాః**

**ప్రజాపతిశ్చ వషట్కారశ్చ** ॥ తా. బ్రా. ౬-౨-౫ ॥

3. ఐతరేయ బ్రాహ్మణము ౨-౧౮-3౭ మరియు 3-౨౨ నందును తాండ్య మహా బ్రాహ్మణము వంటి వచనములే గాంచనగును.

**అష్టౌ వసవః ఏకాదశ రుద్రా ద్వాదశాదిత్యా ప్రజాపతిర్వషట్కారశ్చ** ॥

ఈ రెండింటి యందును ప్రజాపతి గణన కూడా ముప్పదిమూడు దేవతల యందీయబడియున్నది. ఐనప్పటికిని పైన చూపబడిన ఈ రెండింటియందును ప్రజాపతి గణన కూడ ముప్పది ముగ్గురు దేవతలందు వేరుగా నెంచబడియున్నది. ఆ పద్ధతియే వేదానుకూలముగ నుండుటచే అధికముగా మాననీయమైయున్నది. కాని యిచ్చట వ్రాయబడిన ప్రజాపతి శబ్దము యొక్క అర్థము శతపథము యొక్క నిమ్న వచనము లందలి ముప్పది ముగ్గురు దేవతల నామములతో గూడా యజ్ఞమును చూపినట్లైనను అది ఏలాంటి ఆక్షేపణీయ విషయము గాదు. శతపథ బ్రాహ్మణము ౧౪-౫లో ఈ వసువుల, రుద్రుల, ఆదిత్యుల గణన దిగువ విధముగా జూపబడియున్నది.

**త్రయస్త్రింశత్ త్వేవ దేవా ఇతి కతమే తే త్రయస్త్రింశత్ ఇత్యష్టౌ వసవః ఏకాదశ రుద్రాః ద్వాదశాదిత్యాః త ఏకత్రింశత్ ఇన్ద్రశ్చైవ ప్రజాపతిశ్చ త్రయస్త్రింశావితి । కతమే వసవ ఇతి ।**

**అగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాన్తరిక్షం చ ఆదిత్యశ్చ చన్ద్రమాశ్చ నక్షత్రాణి చైతే వసవః ఏతేషు హీదం సర్వం వసు హితం, ఏతే హీదం సర్వం వాసయన్తే తద్ యదిదం సర్వ వాసయన్తే తస్మాద్ వసవ ఇతి ।**

**కతమే రుద్రా ఇతి । దశేమే పురుషే ప్రాణాః ఆత్మైకాదశస్తే । యదస్మాన్మర్త్యాచ్ఛరీరాదుత్క్రామన్తి అథ రోదయన్తి తద్ యద్ రోదయన్తి తస్మాద్ రుద్రాఇతి॥**

**కతమ ఆదిత్యా ఇతి । ద్వాదశమాసాః సంవత్సరస్య ఏత ఆదిత్యాః, ఏతే హీదం సర్వం ఆదదానా యన్తి తద్ యదిదం సర్వమాదదానా యన్తి తస్మాదాదిత్యా ఇతి ।**

**కతమ ఇన్ద్రః । కతమః ప్రజాపతిరితి స్తనయిత్నురే వేన్ద్రః యజ్ఞః ప్రజాపతిరితి ॥**

దీనిననుసరించి ఎనిమిది వసువులీ దిగువ విధముగా నున్నవి. అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు. ఇవి జగత్తును వసింపజేయు కారణమున వీనిని వసువులనెదరు. ఏకాదశ రుద్రుల తాత్పర్యము , పది ప్రాణములు, పదకొండవది ఆత్మ యై యున్నది. ఆత్మ శరీరము నుండి వెడలిపోవునప్పుడు ప్రాణులను రోదింప ( ఏడ్పింప) జేయును. ద్వాదశాదిత్యుల తాత్పర్యము; సంవత్సరమునందలి పండ్రెండు మాసములు. ఇవి మన ఆయుష్యమును ప్రతి దినము తీసికొనిపోవుచుండును. ఈ ప్రకారముగా ఈ ౮+౧౧+౧౨ = 3౧ యైనవి. 3౨వది విద్యుత్తు, 33వది ప్రజాపతి, లేక యజ్ఞము. ఇవియే 33 దేవతలు. మేము పైన దెలిపినట్లు ముప్పది మూడు దేవతలను గౌరవించు తాత్పర్యము వీనిని పూజించు మనుట గాదు. ఈ యధ్యాయము నందే మేము మొదట వేదమంత్రముల ఆధారమున దెలిపినట్లు మనకు పూజనీయుడు ఆ పరమేశ్వరుడొక్కడే యని మరువరాదు. ఈ విధముగా అగ్ని, సూర్య, చంద్రాదులను దేవీ దేవతల నామములతో పిలుచుటచే వైదిక ధర్మము అనేకేశ్వరవాది, లేక *Polytheistic* అని యనిపించుకొనదు. *Polytheistic* యొక్క అర్థము సుప్రసిద్ధ *Pears' Encyclopedia* మున్నగు వాని ననుసరించి *Polytheism The Doctrine of more than One God* అనగా; ఒకటికన్న అధిక ఈశ్వరులపై విశ్వాసముంచుటయై యున్నది. ఇది వైదిక ధర్మమునకు సంపూర్ణముగా విరుద్ధము, దేవాధిదేవుడు మరియు ప్రాణ స్వరూపు డగు ఆ పరమేశ్వరు డొక్కడే. ఈ విషయమున నిమ్న లిఖిత మంత్రముల నుల్లేఖించుట సరిపడగలదు. ఋగ్వేదమునందు;

**౧. స ఇజ్జనేన స విశా స జన్మనా స పుత్రైర్వాజం భరతే ధనా నృభిః । దేవానాం యః**

**పితరమావివాసతి శ్రద్ధామనా హవిషా బ్రహ్మణస్పతిమ్ ॥ ఋ.౨-౨౬-3 ॥**

అనగా; దేవతలకు తండ్రి, పాలకుడు, జ్ఞానమునకు స్వామి యగు పరమేశ్వరుని శ్రద్ధతో ఉపాసించువారి జన్మ సఫలమగును. వారికి ఉత్తమ సంతానము, ధనైశ్వర్యములు మున్నగునవి ప్రాప్తించగలవు.

**౨. ఋ.౧-3౧-౧ లో** పరమేశ్వరుడిట్లు సంబోధించబడినాడు

**''దేవో దేవానామభవః శివః సఖా ॥ ఋ.౧-3౧-౧॥''**

అనగా; నీవు సర్వానంద ప్రదాతవు, సర్వ ప్రకాశకుడవు, పరమేశ్వరుడవు. సత్య నిష్ఠగల విద్వాంసులకు కల్యాణకారి మిత్రుడవు. దీని అంగ్రేజి అనువాద మిట్లు గలదు.

O God! thou art the giver of peace and bliss to the wise and their benevolent frind.

**3. దేవో దేవానామసి మిత్రో అద్భుతో వసుర్వసూనామసి చారురధ్వరే** ॥ ఋ ౧-౯౪-౧3 ॥

అనగా; హే పరమేశ్వర! నీవే సత్య నిష్ఠ గల విద్వాంసులకు అద్భుత మిత్రుడవు. మరియు నీవే పృథివి, అగ్ని, సూర్య, చంద్రాది వసువుల కాధారభూతుడవు.

*O God! thou art wonderful friend of wise men and thou art giver of shelter to all, shining in sacrifices.*

అనునది ఆంగ్లానువాదము.

౪. ఋ.౪-౩-౭లో పరమేశ్వరుని దేవతల ఆత్మ, మరియు సర్వ ప్రజలకు, ప్రాణులకు జనితా, అనగా ఉత్పాదకుడని చెప్పబడినది.

**''ఆత్మా దేవానాం జనితా ప్రజానామ్''** ॥ ఋ.౪-౩-౭॥

ఇచ్చట **'ఆత్మా దేవానామ్'** ఈ విశేషణము మహత్త్వపూర్ణమై యున్నది. దీనివల్ల దేవతలకు శక్తి ప్రదానమొనర్చువాడు పరమేశ్వరుడే యని తెలియుచున్నది.

O God! thou art the spirit pervading the enlightened persons and Father of all beings.

అని దీని ఆంగ్లానువాదము.

౫. ఈ విషయమే అథర్వ. ౭-౧౧-౧ లోను దిగువ శబ్దముల ద్వారా తెలుపబడినది.

**ఆత్మా దేవానాముత మానుషానామ్** ॥ అథ. ౭-౧౧-౧॥

ఆ పరమేశ్వరుడు సూర్యచంద్రాది సకల దేవతలకు మరియు మానవులకు అంతర్యామి ఆత్మయై యున్నాడు.

౬. పై విషయమే ఋ. ౧౦-౧౬౮-౪ ఎంతో స్పష్టముగా నుపదేశించబడినది.

**ఆత్మా దేవానాం భువనస్య గర్భో యథావశం చరతి దేవ ఏషః** ॥ ఋ.౧౦-౧౬౮-౪॥

అనగా; ఎవడు (దేవానామ్) సకల దేవతల అంతర్యామి ఆత్మ, మరియు (భువనస్య గర్భః) విశ్వమంతటిని ధారణమొనర్చువాడో (ఏషః దేవః) ఆ సర్వ ప్రకాశకుడగు పరమేశ్వరుడు (యథావశం చరతి) స్వేచ్ఛగా సర్వత్ర విచరించునని ఎరుగుడు.

౭. సత్యనిష్ఠ గల విద్వాంసులు ప్రాప్తించుకొను అమరత్వము ఆ పరమేశ్వరుని కృప, మరియు ఆతనిచే ప్రసాదించబడిన జ్ఞానము వల్లనే సంభవమగును. ఈ విషయము ఋగ్వేద. ౬-౭-౪లో అత్యుత్తమముగా తెలుపబడియున్నది.

**''త్వాం విశ్వే అమృత జాయమానం శిశుం న దేవా అభి సం నవన్తే ।**

**తవ క్రతుభిరమృతత్వమాయన్ వైశ్వానర యత్ పిత్రోరదీదేః** ॥ ఋ.౬-౭-౪ ॥''

ఇచ్చట విశేష మహత్త్వ పూర్ణమైన విషయము గలదు. అదేమన; సర్వ మానవుల కల్యాణకారియగు హే పరమేశ్వరా! నీవు హృదయములో ప్రకటమైనప్పుడు సమస్త దేవతలు నీ స్తుతియొనర్తురు. నీవు ప్రసాదించిన జ్ఞాన భండారము వల్లనే వారు అమరత్వమును ప్రాప్తించుకొనెదరు.

**౮. ''త్వాం దేవాసో అమృతాయ కం పపుః''** ॥ ఋ.౯-౧౦౬-౮ ॥

పరమేశ్వరుని సంబోధించుచు హే పరమేశ్వరా! (దేవాసః) సత్యనిష్ఠగల జ్ఞానులు (అమృతాయ) అమరత్వ ప్రాప్తి కొరకు నీ యొక్క (కమ్) సుఖమును (పపుః) పానమొనర్చుచుందురు. లేక సుఖ స్వరూపుడవగు నిన్నే ధ్యానించుచుందురు.

౯. ఋగ్వేద. ౭-౧౩-౨ నందు వైశ్వానర, జాతవేదాః సర్వభూత హితకారీ, సర్వవ్యాపక, సర్వజ్ఞ ఇత్యాదిరూపములలో పరమేశ్వర స్మరణమొనర్చుచు ఆతడే ''దేవతలను సమస్త కష్టముల నుండి గాపాడువాడు'' అని చెప్పబడినది.

**త్వం దేవాం అభిశస్తేరముఞ్చో వైశ్వానరో జాతవేదా మహిత్వా** ॥ ఋ.౭-౧౩-౨॥

(వైశ్వానర) సకల మానవ హితకారి (జాతవేదాః) సర్వవ్యాపక సర్వజ్ఞుడవగు హే పరమాత్మా! (త్వమ్) నీవు (మహిత్వా) నీ మహిమచే (దేవాన్) సత్యనిష్ఠ గల విద్వాంసులను (అభిశస్తేః అముఞ్చః) కష్టముల నుండి రక్షింతువు.

౧౦. దిగువ ఋగ్వేదమంత్రము నందు పరమేశ్వరుని 'క' లేక సుఖ స్వరూపుడవగు 'పరమేశ్వరా' యను నామముతో స్మరించబడినది.

**ఆపో హ యద్ బృహతీర్విశ్వమాయన్ గర్భం దధానా జనయన్తీరగ్నిమ్ ।**

**తతో దేవానాం సమవర్తతాసురేకః కస్మై దేవాయ హవిషా విధేమ** ॥ ఋ ౧౦-౧౨౧-౭ ॥

ఈ మంత్రము ఏకేశ్వర వాద ప్రకరణములో అర్థసహితముగా ఉద్ధృత పరచబడినది. ఇచ్చట నా 'క' సుఖ స్వరూప ప్రజాపతి (కో హి ప్రజాపతిః శత.౬-౨-౨-౫ కో వై ప్రజాపతిః ; గోపథ ౬-౩) ని 'దేవానాం అసుః' సకల దేవతల ప్రాణ స్వరూపుడని చెప్పబడినది.

౧౧. ఏకేశ్వరవాద ప్రకరణమునందు అర్థసహితముగా ఉదాహరించబడిన ఇదే సూక్తమందలి ఏడవ మంత్రములో ఈ సుఖస్వరూపుడగు ప్రజాపతి పరమేశ్వరుని విషయములో ఇట్లు చెప్పబడినది.

**యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్ కస్మై దేవాయ హవిషా విధేమ** ॥ ఋ.౧౦-౧౨౧-౭॥

ఎవడు సూర్య చంద్రాగ్ని విద్యుదాది సకల దేవతలకు, ప్రకాశమాన పదార్థములకు, విద్వాంసులకును అధిష్ఠాన దేవుడో మేమాతనినే శ్రద్ధాపూర్వకముగ స్మరణమొనర్తుము.

౧౨. ఋ.౧-౫౦-౯ లో పరమేశ్వరుని సర్వ ప్రకాశక ఉత్తమ జ్యోతి స్వరూపునిగా జూపుచు **''దేవత్రాదేవమ్''** సకల దేవతలందు మహాదేవుడు సమస్త ప్రకాశములకు ప్రకాశకుడని తెలుపబడినది. చూడుడు

**ఉద్ వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్ ।**

**దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్** ॥ ఋ.౧-౫౦-౧౦॥

ఇచ్చట మూడు నిత్య పదార్థములు ఉత్, ఉత్తర, ఉత్తమ' మని స్పష్టముగా నిర్దేశించబడినవి అవి ప్రకృతి ఆత్మ, పరమాత్మలు, ప్రకృతి జడమగు కారణమున తమస్ అని ఆత్మను ప్రకాశమని, పరమాత్మను జ్యోతిర్జ్యోతి, దేవతలలో ఉత్తమ దేవుడని చెప్పబడినది. ఇది అత్యంత మహత్త్వ పూర్ణమగు విషయము; ఇట్టి మంత్రముల భావమునే తీసికొని శ్వేతాశ్వతరోపనిషత్తు నందు; ఇట్లు వర్ణించబడినది.

**తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమం చ దైవతమ్ ।**

**పతిం పతీనాం పరమం పురస్తాద్ విదామ దేవం భువనేశమీడ్యమ్** ॥ శ్వేతా. ౬-౭ ॥

ఇదే విధముగా దేవాధిదేవుని వైదిక భావమునే ఉపనిషత్తులు సమర్థించినవి.

౧౩. ఇక రెండు మంత్రముల ద్వారా దేవతల స్థితిని, పరమేశ్వరునితో సంబంధమును గురించి ఆవశ్యకమని మొదట ఋగ్వేద మంత్రము నిచ్చుచున్నాము.

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః ।**

**యస్తం న వేద కిమృచా కరిష్యతి య ఇత్ తద్ విదుస్త ఇమే సమాసతే॥** ఋ.౧-౧౬౪-౩౯॥

ఈ ప్రసంగమునందు ధ్యానము నుంచదగిన ముఖ్య విషయమేమన; (విశ్వేదేవాః) సకల సూర్య, చంద్ర, అగ్ని, విద్యుదాది ప్రకాశక పదార్థములు, మరియు సత్యనిష్ఠగల విద్వాంసులు (యస్మిన్ అక్షరే పరమే వి+ ఓమన్ అధి నిషేదుః) అవినాశి పరమ రక్షకుడగు పరమాత్మయందు స్థితులై యుందురు. దీనిని దెలిసికొనలేనివారు వేదములను చదివియు ఏమి చేయగలరు? ఆ పరమేశ్వరుని దెలిసికొనిన వారే శాంత చిత్తులై కూర్చుండియుండెదరు. ఇచ్చట సకల దేవతలును ఆ యొకే పరమాత్మ నాశ్రయించి యున్నారని చూపబడినది. వైదిక ఏకేశ్వర దృష్టితో ఇది అత్యంత మహత్త్వ పూర్ణమైనది.

౧౪. రెండవ మంత్రము అథర్వ వేదమందలి స్కంభసూక్తములోనిది. దీనియందు సర్వ దేవతలు ఆ స్కంభ (సర్వాధార పరమేశ్వర) ఆశ్రితులని చూపబడినది.

**మహద్ యక్షం భువనస్య మధ్యే తపసి క్రాన్తం సలిలస్య పృష్ఠే।**

**తస్మిన్ శ్రయన్తే య ఉ కే చ దేవా వృక్షస్య స్కన్ధః పరిత ఇవ శాఖాః** ॥ అథర్వ ౧౦-౭-౩౮ ॥

ఇచ్చట విశ్వము మధ్య వ్యాప్తమై యుండి తపము, లేక జ్ఞానమున (యస్య జ్ఞానమయం తపః) సర్వోన్నతుడై సలిల లేక ప్రకృతి వీపుపై అధిష్ఠాత మరియు నియామకుని రూపమున విద్యమానమై యున్న పరబ్రహ్మను 'మహద్యక్ష' లేక మహోన్నతుడు పూజనీయుడని తెలుపుచు **'య ఉ కే చ దేవాః'** దేవతలై యున్నవారెల్లరును (తస్మిన్ శ్రయన్తే) ఆ ఒకే పరమ పూజనీయ పరమాత్మనే ఆశ్రయించియున్నారు. వారెల్లరును వృక్షస్కంధమునకు శాఖలు నలువైపుల నున్నట్లుందురు. ఈ సుందర ఉపమా (అర్థా) లంకారము నందు సకల దేవతలకు ఆశ్రయుడు ఆ పరమేశ్వరుడొక్కడేయని ఎంతో చక్కగా దెలుపబడినది.

ఈ విధముగా ఈయనేక దేవతలకు ఆశ్రయ, ఆధారభూతు డా యొకే పరమేశ్వరుడని స్పష్టముగ నుండగా వైదిక ధర్మమును *Polytheism* లేక అనేకేశ్వర ప్రతిపాదకమని యనుట సర్వథా అశుద్ధము, మూర్ఖత్వమే యగును. వేదములందు దెలిపినట్లు ఆ యొకే పరమ దేవుడు పూజింప యోగ్యుడని

**ఏక ఏవ నమస్యో విక్ష్వీడ్యః ఏక ఏవ నమస్యః సుశేవాః**

మున్నగువాని ద్వారా తెలుపబడియున్నది. దీని యాధారముపైనే శతపథ బ్రాహ్మణమునందు ఏమి చెప్పబడియున్నదో చూడుడు.

**సయో ఒన్యాం దేవతాముపాస్తే యథా పశురేవం స దేవానామ్**

''ఆ పరమేశ్వరుని వదలి ఇతరయే దేవతనైనను ఉపాసించువారు విద్వాంసుల మధ్య పశువుల వలె నుందురు '' అనేకేశ్వరవాద నిరాకరణమును గూర్చి ఇంతకన్న అధిక మేమి చెప్పవలసియుండును?

దేవాధిదేవుడు, దేవతల యధిష్ఠాత, సకల దేవతల ప్రాణ స్వరూపుడగు పరమేశ్వరుని, విషయక ఆలోచనలు ఇంత స్పష్టముగ నుండగా పాశ్చాత్య విద్వాంసులగు *A C.Clayton* ఎ.సి. క్లైటన్ అనునాతడు ఇట్లు వ్రాసియున్నాడు.

"Speaking generally, the hymns appear to be the utterances of simple men, who, under the influence of the most impressive phenomena of nature, saw every where the presence and agency of divine powers. They imagined that each of the great provinces of the universe was ruled and pervaded by its own separate deity, and **they had not yet risen to a clear idea of one supreme creator and governor of all things."** The RigVeda and Vedic Religion by A.C.Clayton P.51

అనగా; సాధారణముగా చెప్పవలయునన్న ఇట్లు చెప్పవచ్చును. ఈ వైదిక సూక్తులు ప్రభావ జనకములగు ప్రాకృతిక దృశ్యముల ప్రభావమునందు సర్వత్ర (అంతట) దివ్యశక్తుల సత్తాను, మరియు వాని కర్తృత్వములను జూచుచుండు సామాన్య ప్రజల మాటలేయైయున్నవి. వారు ప్రపంచమున ప్రతి క్షేత్రమునకు శాసనము వేర్వేరు దేవతల ద్వారా యగుచుండుననుకొని, ఈ సమస్త వస్తు సముదాయము నుత్పన్న మొనర్చువాడు, మరియు శాసకుడైనవాడొకే పరమేశ్వరుడను యాలోచనము వారి మనస్సులందప్పుడే స్పష్టముగా రాకుండెను. వారంతవరకు ఎదిగియుండలేదు. అని పై దాని భావము.

ఇది యెంతటి అజ్ఞానము లేక పక్షపాత సూచకమైయున్నదో చూడుడు. 'క్లైటన్' యొక్క ఈ శబ్దములు అనేక పాశ్చాత్యుల (దౌర్భాగ్య వశమున *Vedic Age* లేఖకుల వంటి అనేక భారతీయ విద్వాంసులు కూడా, చాల వరకు ఈ విషయములో ప్రతి శబ్దమును 'మైక్డోనల్ *Macdonell* యొక్క *Hymns from the RigVeda* ను దాని పేరైనను ఎత్తకుండా అనుకరణ మొనర్చినారు. ఈ రెండింటిని ధ్యాన పూర్వకముగా జూచిన పిదప మాకు తెలిసి ఎంతో ఆశ్చర్యము కలిగినది.') ఆలోచనల ప్రతినిధిత్వమొనర్చునను భావముతో మేమిచ్చట దీనినుద్ధృత పరచవలసి వచ్చినది. ఈ పై ప్రమాణములను వివేచన మొనర్చుట వల్ల ఈయాలోచనల యొక్క నిస్సారతను, యథార్థరహితమును పక్షపాతరహితులగు మా పాఠక సోదరులు గ్రహించియే యుందురు. దేవతలను అమరులనియనుట వారియమరత్వము వారికి ఆ పరమేశ్వరుని కృపవల్లనే ప్రాప్తించును. ఈ విషయము అనేక మంత్రములే గాక బ్రాహ్మణ గ్రంథములందు ఉపనిషత్తులందును అనేక స్థానములందు స్పష్టముగా నిర్దేశింపబడియున్నది. ఉదాహరణమునకు

**౧. 'దేవేభ్యోహి ప్రథమం యజ్ఞియేభ్యోఽమృతత్వం సువసి భాగముత్తమమ్ ॥'**

అనగా; ఈ ఋగ్వేద. ౪-౫౪-౨ మంత్రములో హే పరమేశ్వరా! నీవు మాత్రమే (యజ్ఞియేభ్యః దేవేభ్యః) పూజనీయులు ధర్మనిష్ఠగల జ్ఞానుల కొరకు (ప్రథమమ్) అన్నిటి కన్న పూర్వపుడగు ఉత్కృష్టమైన (అమృతత్వమ్)

అమరత్వమును (సువసి) ప్రదానమొనర్చుదువు. దేవతలను అమరుల నొనర్చు మరియు వారికి ముక్తి నిచ్చు వాడు ఆ పరమేశ్వరుడొక్కడే అని ఉపదేశించబడినది.

**౨. స నో బన్ధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా।**

**యత్ర దేవా అమృత మానశానాస్తృతీయే ధామన్నధ్యైరయన్త** ॥ య. ౩౨-౧౦ ॥

(సః) ఆ పరమేశ్వరుడు (నః బన్ధుః) మా బన్ధువు (జనితా) ఉత్పాదకుడు, తండ్రి (స విధాతా) విశేష రూపములో విశ్వమును ధారణ మొనర్చువాడు, మరియు న్యాయకారియు నాతడేయైయున్నాడు (విశ్వా) సర్వ (ధామాని) జన్మ, నామ, స్థానములను, మరియు (భువనాని) లోకములను (వేద) ఎరిగియున్నాడు. (అమృతమ్ ఆనశానాః దేవాః) అమరత్వము, మరియు ముక్తి ఆనందమును అనుభవించు జ్ఞానులు (యత్ర) అట్టి (తృతీయ ధామన్) ప్రకృతి మరియు జీవుల కన్న భిన్నముగునట్టి మూడవవాడు, నిత్యుడు, సర్వాధారుడగు పరమాత్మలో (అధి ఐరయన్త) స్వతంత్రముగా విచరణ మొనర్చుచుందురు. ఈ మంత్రములో ముక్తావస్థ యందును జీవులు పరమాత్మకు వేరుగానే యుందురని నిర్దేశించిన చోట ముక్త జీవులు సైతము ఆ పరమ దేవుడగు పరమాత్మ ఆశ్రయముననే యుందురని స్పష్టపరచబడియున్నది.

**౩. పరి విశ్వా భువనాన్యాయమృతస్య తన్తుం వితతం దృశే కమ్।**

**యత్ర దేవా అమృతమానశానా : సమానే యోనావధ్యైరయన్త** ॥ అథ. ౨-౧-౫॥

ఈ అథర్వ వేద మంత్రమున మహా ఉత్తమముగా ఇట్లు చెప్పబడినది. నేను (ఋతస్య) సత్యము యొక్క (వితతమ్) విస్తృతమగు (కం తన్తుమ్) సుఖమయ తంతువులను (దృశే) చూచుట కొరకు (విశ్వా భువనాని పరి ఆయమ్) సకల భువనములను వెదకిచూచితిని. (యత్ర సమానే యోనౌ) సమాన మూలస్థాన రూపుడగు పరమేశ్వరుని యందు (అమృతమ్ ఆనశానాః దేవాః) ముక్తి సుఖమునునుభూతి నొందుచు జ్ఞానులు (అధ్యైరయన్త) చేరుచుండెదరో ఆతడొక్కడు మాత్రమే ఉపాసనీయుడగు పరమేశ్వరుడు.

**౪. యేన దేవా స్వరారురుహుర్హిత్వా శరీరమమృతస్య నాభిమ్** ॥ అథ. ౪-౧౧-౬ ॥

ఈ పైతత్త్వమే ఇందు 'సత్య నిష్ఠ గల విద్వాంసులు ఏ పరమేశ్వరుని కృపచే శరీర త్యాగమొనర్చిన పిదప అమృత కేంద్రమును పొందుచుందురో అట్టి పరమ ధామముగు పరమేశ్వరుడొక్కడే ఉపాసనీయుడై యున్నాడు' అని చెప్పబడినది.

**౫. చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః।**

**ఆ ప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ** ॥ ఋ.౧-౧౧౫-౧॥

ఇందు పరమేశ్వరుని సకల దేవతలకు బలము మరియు సూర్య చంద్రాగ్ని విద్యుత్తులకు ప్రకాశకుడని తెలుపుచు (దేవానాం అనీకమ్) సమస్త దేవతల శక్తియగు పరమేశ్వరుడు నా హృదయములో ప్రకాశితుడైయున్నాడు. ఆతడే పృథివి, అంతరిక్షము, ఆకాశములన్నింటియందును పరిపూర్ణుడైయుండి పాలించుచున్నాడు. ఆయనయే స్థావర జంగమాదులకు, చరాచర జగత్తంతటికిని అంతరాత్మ సర్వ ప్రకాశకుడు, పరమేశ్వరుడు. ఇచ్చట వర్ణించినది

భౌతిక సూర్యుని గాదని స్పష్టమగుచున్నది. 'ప్రొ. మైక్డోనల్ యనునాతడు *Hymns from the Rig Veda* యందు దీనియనువాదమును మిక్కిలి అశుద్ధమగు దిగువ శబ్దములలో ఇచ్చియున్నాడు.

The god's refulgent countenance has risen, The eye of Mitra, Varuna and Agni, He has pervaded air, the earth and heaven. The soul of all that moves and stands is Surya.

(Hymns from the Rigveda, by Macdonell, P.29)

'మిత్ర' యను దాని యర్థము సూర్యుడని ప్రసిద్ధమైయున్నది. డా.మైక్డోనల్ స్వయముగ ఉపర్యుక్త పుస్తకమునందు 'మిత్ర' అనుదాని విషయమునందీటిప్పణినిచ్చియున్నాడు

The Vedic evidence thus indicates that Mitra is a solar deity P.23

వైదిక సాక్ష్యముచే 'మిత్ర' సూర్య లోకమునకు సంబద్ధ దేవతయని సూచితమగుచున్నది. ఈ మంత్రమునందు సూర్యుడాతని ప్రకాశకుడని చెప్పబడి యున్నది. కావున నిచ్చట దీనితాత్పర్యము భౌతిక సూర్యునితో గాదని స్పష్టమగుచున్నది. సూర్యులకు సూర్యుడు, ఉత్తమ జ్యోతి యగు పరమేశ్వరు డని తాత్పర్యము. దేవతలు మొదట మర్త్యులు అనగా మరణశీలురై యుండిరి. మరియు బ్రహ్మ ప్రాప్తివల్లనే వారికి అమరత్వ ప్రాప్తి గలిగినది దీని వర్ణనము వేదముల వలెనే బ్రాహ్మణ గ్రంథములందును అనేక స్థానములందు జూడబడుచున్నది. ఉదాహరణార్థము.

**మర్త్యా హ వా అగ్రే దేవా ఆసుః ।**

**యదైవ తే బ్రహ్మణాపురథామృతా ఆసుః** ॥ శత. బ్రా. ౧౧-౨-౩-౬ ॥

దేవతలు మొదట మర్త్యులు అనగా మరణశీలురై యుండిరి. వారికి బ్రహ్మప్రాప్తి గలిగినప్పుడు వారు అమరులైనా రని స్పష్టముగా శతపథ బ్రాహ్మణమునందు గలదు. తైత్తిరీయ సంహితయందును ఈ విషయము గలదు.

**'దేవా వై మృత్యోరబిభయుస్తే ప్రజాపతి ముపాధావన్** ॥ తై ౨-౩-౨-౧॥

అనగా; దేవతలు మొదట మృత్యువుతో భయభీతులగుచుండిరి. కాని వారు ప్రజాపతి పరమేశ్వరుని శరణమునకు చేరినప్పుడు అమరులైనారు.

### 4.16 'దేవతా' వాచక శబ్దముల కనేకార్థములు

దేవ శబ్దము **'దా దానే'** మరియు 'దివు- క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతిస్తుతి మోదమద స్వప్నకాంతిగతిషు', ఈ రెండు ధాతువులచే సిద్ధించుచున్నది. వీనియర్థములపై మేమిదివరకే కావలసినంత వివరణ నిచ్చి యుంటిమి దేవ అను దాని ధాత్వర్థమును ధ్యానమునం దుంచుకొని దానికనేకార్థములు గలవను పరిణామమునకు చేరకుండా యుండజాలము. ఈ విషయములో ప్రొ.మైక్స్ మూలర్ తన ప్రసిద్ధ పుస్తకమునం దిట్లు వ్రాసినాడు

Deva meant originally bright and nothing else, meaning bright, it was constantly used of the sky, the stars, the sun, the dawn, the day, the spring, the rivers, the earth. And when a poet wished to speak to all these by one and the same world-by what we should call a general term-he called them all Devas. When that had been done, Deva did

no longer mean the Bright only, but the name, comprehended all the qualities which the sky and the sun and the dawn shared in common excluding only those that were peculiar to each. Here you see how, by the simplest process, the Devas, the bright ones, might become and did become the Devas, the heavenly, the kind, the powerful, the invisible, the immortal. - India, what can it Teach us., - by Prof. Maxmuller, P.218-219. Oxford.

'దేవ' అను దాని ప్రారంభికార్థము ప్రకాశమానము. కాని మరొకటి గాదు. ఈ యర్థమునే దీసికొని దీని ప్రయోగము ఆకాశము, తారాగణము, సూర్యుడు, ఉష దినము, వసంత ఋతువు నది, భూమి మున్నగు వాని కొరకు ప్రయోగమొనర్చబడు చుండెడిది. ఏ కవియైనను ఈయన్నిటికొరకు ఏ విషయమైనను సామాన్య రూపమున చెప్పవలసి వచ్చునపుడు ఆతడు 'దేవ' శబ్దమును ప్రయోగించుచుండెను. ఇప్పుడు దీనియర్థము కేవలము ప్రకాశమానమనియే మిగిలిపోయినది. ఈయన్నింటి యందుగల సామాన్య గుణము ( విశేష గుణములను వదలివేసి)లు 'దేవ' శబ్దముచే గ్రహణ మొనర్చబడుచుండెడివి. ఇదే విధముగా క్రమముగా దేవతలు, దివ్య, దయాళువు, శక్తిశాలి, అదృశ్య, అమరులు మున్నగు నర్థములతో విశ్వసించబడుచుండెడిది. ఇత్యాదులు.

ప్రొ. మైక్స్‌మూలర్ యొక్క 'దేవ' శబ్దమూలార్థ విషయమైన కల్పనలు కూడా సంపూర్ణములు గావు. దేవ శబ్దము 'దా' మరియు 'దివు' అను రెండు ధాతువులచే సిద్ధమగును. 'దివు' ధాతువునకు 'క్రీడ, విజిగీష( విజయేచ్ఛ) వ్యవహారము, ఇచ్ఛగించుట, స్తుతి యొనర్చుట, ప్రసన్నమగుట, నిద్రించుట, ప్రకాశించుట, గతి' ( జ్ఞాన, గమన, ప్రాప్తి) మున్నగు అర్థములగును. వీనితో గూడియున్న ఏ పదార్థమైనను 'దేవ' యను నామము ద్వారా పిలువబడ వచ్చును. కావుననే ఇది యింత వ్యాపక మగు శబ్దము. దీని కనేకార్థములు గలవు.

మహర్షి దయానంద సరస్వతి తన వేద భాష్యమునందు 'దేవ' శబ్దమునకు ప్రకరణానుసారముగ వేర్వేరు అర్థములను ప్రయోగించినాడు. వానిని ఈ దిగువ పట్టికలో చూపబడుచున్నది. ( శ్రీ దయానందుల వారు యజుర్వేద, ఋగ్వేద భాష్యములనే యొనర్చి యుండిరి. కావున ఆ రెండు వేద భాష్యములందలి ప్రయోగ శబ్ద పట్టికనే ఈయబడుచున్నది. )

**4.17 'దేవ' శబ్ద ప్రయోగ వేద మంత్రములు**

**దేవః-**

౧. స్వప్రకాశః ప్రకాశకరో వా ప్రకాశమానః పరమేశ్వరః. ఋగ్వేదః ౧-౧-౫

౨. దివ్యగుణ సంపన్నో విద్వాన్ । ౧-౬౮-౧

దివ్య సుఖదాతా । ౧-౭౩-౩

3. దివ్య ప్రకాశః । ౧-౧౨౪-౧

౪. దేదీప్యమానః సూర్యః । ౫-౧-౨

| | | | |
|---|---|---|---|
| | సర్వ వ్యవహార - సాధకః | । | ౧-౩౫-౧౦ |
| | సత్యన్యాయం కామయమానః | । | ౧-౧౨౯-౧౧ |
| | జిగీషుః | । | ౧-౧౮౮-౧ |
| | విజయ ప్రదాతా | । | ౪-౩౦-౨౪ |
| ౬. | జీవః | యజుర్వేదః | ౨౮-౧౯ |
| ౭. | సభ్యః | । | ౨౮-౪౩ |
| ౮. | రక్షకః | । | ౩౭-౧౮ |
| ౯. | కమనీయః | ఋగ్వేదః | ౧-౧౨౭-౧ |
| ౧౦ | సంగమనీయః | । | ౧౭-౯౧ |

**దేవౌ :-**

| | | | |
|---|---|---|---|
| ౧. | దేవౌ - శుభగుణాన్ కామయమానౌ మాతాపితరౌ | . యజుః | ౩౪-౫౫ |
| ౨. | దేవౌ - దివ్య స్వరూపౌ ప్రాణాపానౌ | । | । । |

**దేవాః**

| | | | |
|---|---|---|---|
| ౧. | అధ్యాపకోపదేశకా విద్వాంసః | యజుః | ౨౦-౧౪ |
| ౨. | దివ్యాత్మానో యోగినః | । | ౧౭-౭౩ |
| ౩. | వ్యవహారమాణాః | । | ౮-౧౮ |
| ౪. | వేదశాస్త్రవిదః సేనాపతయః | । | ౧౦-౧౮ |
| ౫. | దివ్యా గుణాః - పృథివ్యాదయో లోకాః | ఋగ్. | ౧-౧౦౫-౫ |
| ౬. | అగ్న్యాదయః | । | ౧-౨౨-౧౬ |
| ౭. | చన్ద్రాదయో దివ్యాః పదార్థా ఇవ విద్వాంసః | । | ౪-౯-౮ |
| ౮. | ధనుర్వేదవిదో విద్వాంసః | యజుః | ౭-౨౪ |
| ౯. | దివ్య గుణా ఋత్విజః | । | ౧౭-౫౨ |
| ౧౦. | దివ్యాః ప్రాణాః | । | ౧౨-౨ |
| ౧౧. | దివ్యాః విద్యాః | ఋగ్. | ౩-౪-౧౧ |
| ౧౨. | విద్యాది శుభగుణానాం దాతారః | । | ౭-౩౫-౧౨ |
| ౧౩. | చక్షురాదీనీన్ద్రియాణి | యజుః | ౪౦-౪ |

౧౪. విద్వాంసః సభాసదః మోదకాః । ౨౯-౨౦

౧౫ న్యాయాధీశాః సర్వ విద్యావిదః,

సర్వేభ్యః సుఖప్రదాతారః, ఆయుర్వేద విదః య. ౧౦-౧

దేవ శబ్దమునకు సందర్భానుసారముగా నిరుక్తపరముగా మరెన్నో అర్థములలో ప్రయోగముగలదు.

**4.18 సాయణాచార్య, ఉవ్వట, మహీధరాదు లొనర్చిన 'దేవ' శబ్దార్థములు**

మధ్యకాలీన వేదభాష్యకారులగు శ్రీ సాయణాచార్యుడు, ఉవ్వటుడు, మహీధరుడు మున్నగు వారు దేవతలను స్వర్గలోకమునందుండువారని విశ్వసించుచు దాదాపు అందుకు తగినట్లుగానే వ్యాఖ్యానొనర్చుచుండిరి. వారు మహర్షి దయానందుల వలె ఈ శబ్దము యొక్క వ్యాపకత్వము నెరుగ జాలకుండిరి. ఐనప్పటికిని అనేక స్థానములందు వారును ఈ దేవ శబ్దమునకు స్తోత (స్తవనీయుడు) యజమాని మున్నగు అర్థములనిచ్చినారు.

ఉదా :-

**౧ తం పత్నీభిరనుగచ్ఛేమ దేవాః పుత్రైర్భ్రాతృభిరుత వా హిరణ్యైః ।**

**నాకం గృభ్ణానాః సుకృతస్య లోకే తృతీయే పృష్ఠే అధిరోచనే దివః ॥** య.౧౫-౫౦॥

ఈ మంత్రమునకు కాణ్వ - సంహితా భాష్యము (పుట. ౧౦౪, వేంకటేశ్వర ప్రెస్సు బొంబాయి ముద్రితము)నందు సాయణాచార్యుడిట్లు వ్రాసినాడు.

**హే 'దేవాః' 'ఋత్విజః' సర్వే వయం పత్న్యాదిభిః సర్వైర్మనుష్యైః**

**ఉత వా సర్వసాధన ద్రవ్యైః సహితాః తమ్ అగ్నిమ్ అనుగతాః సన్తః ఫలం ప్రాప్స్యామ ఇత్యాశయః ।**

ఇచ్చట 'దేవాః' అను దాని యర్థము 'ఋత్విజః' అనియే యొనర్చియున్నాడు. ఉవ్వట, మహీధరులు కూడా శుక్లయజుర్వేద భాష్యమునందు దీనియర్థ మిట్లే యొనర్చినారు.

**౨. దైవ్యాయ ధర్త్రే జోష్ట్రే దేవశ్రీః శ్రీమనాః శతపయాః ।**

**పరిగృహ్య దేవా యజ్ఞమాయన్ దేవా దేవేభ్యో అధ్వర్యన్తో అస్థుః ॥** య. ౧౭-౫౬ ॥

సాయణాచార్య డీ మంత్రమునకు కాణ్వసంహితా- భాష్యమున అర్థము నొనర్చుచు

**'దేవాః'** యను దాని కర్థము రెండు స్థానములందు **'ఋత్విక్, యజమానాః'** అనగా ఋత్విజుడు, జయమాని అని యొనర్చియున్నాడు. (కాణ్వ సంహితాభాష్యమ్. పు.౧౫3)

**3. ఏదమగన్మ దేవయజనం పృథివ్యా యత్ర దేవాసో అజుషన్త విశ్వే ।**

**ఋక్సామాభ్యాం సన్తరన్తో యజుర్భీ రాయస్పోషేణ సమిషా మదేమ ॥** యజు ౪-౧॥

దీనికి సాయణాచార్యుడు కాణ్వ - సంహితా భాష్యము పు౭౯ నందిట్లు వ్రాసినాడు.

**అస్మిన్ మన్త్రే దేవశబ్దేన షోడశ ఋత్విజో బ్రాహ్మణా వివక్షితా ఇత్యేతదపి**

**తిత్తిరిరేవ దర్శయతి విశ్వే హ్యేతద్ దేవా జోషయన్తే బ్రాహ్మణా ఇతి ॥**

ఇచ్చట దేవతలనగా ౧౬ గురు ఋత్విజులైన బ్రాహ్మణులని తాత్పర్యము.

**౪. యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్** ॥౧-౧౬౪-౫౦॥

ఈ మంత్రమునకు భట్ట భాస్కరుడు (దేవాః) 'ఋత్విజః' అనగా ఇచ్చట దేవతల యర్థము 'ఋత్విజా' అని వ్రాసినాడు.

౫. 'స్కన్దస్వామి' పై మంత్రమునకు అర్థమునొనర్చుచు తన నిరుక్తము నందిట్లు వ్రాసినాడు.

**(దేవాః) దాతారో హవిషాం యజమానా ఇతి.**

అనగా; హవిస్సుల నర్పించువారు యజమానులు. ఇదే విధముగా మధ్యకాలీన ఆచార్యులు అచ్చటచ్చట 'దేవ' శబ్దమునకు ఇతర అర్థములనొనర్చియున్నారు. కాని వైదిక శబ్దములకు మహర్షి దయానందుల వంటి గంభీరత్వము, వ్యాపకత్వము గల అర్థములను ఇతర ఏ యాచార్యులును వ్రాసియుండలేదు.

### 4.19 'దేవతా' పదమునకర్థము - ప్రతిపాద్య విషయము

దేవతా అను పదమున కర్థము మంత్రము యొక్క ప్రతిపాద్య విషయమనియు ఇచ్చట పేర్కొనదగియున్నది.

**యత్కామ ఋషిర్యస్యాం దేవతా యామార్థపత్యమ్।**

**ఇచ్ఛన్ స్తుతిం ప్రయుంక్తే తద్దైవతః స మన్త్రో భవతి** ॥ నిరుక్తము ౭-౧॥

అనగా; నే నేదేని ఒక విషయమును గోరి యుపదేశించెదనో, పరమ ఋషి, సర్వద్రష్టయగు పరమేశ్వరుడు ఏయే వస్తువుల గుణవర్ణనమొనర్చునో దానిని ఉత్తమముగా లోకులు ప్రయోగము ద్వారా దానిపై అధికారమును మరియు బుద్ధి ద్వారా స్వామిత్వమును పొందవలయుననియే దీని భావము. దానినే యా మంత్రమునకు 'దేవత' యందురు. ఈ విషయమే **'యా తేనోచ్యతే సా దేవతా'** ఈ శబ్దముల ద్వారా 'సర్వానుక్రమణి' మున్నగు వానియందు చెప్పబడియున్నది. మంత్రమునందలి ప్రతిపాద్య విషయమును దేవత యందురని మనకు దీనితాత్పర్యము స్పష్టమగుచున్నది. **'దేవత'** యొక్క ఈ యర్థము, మరియు **'అచేతనాన్యపి చేతనవత్ స్తూయన్తే'** అనగా అచేతన వస్తువులగు నదులు, పర్వతములు, పాషాణములు మున్నగువానిని గూడ కావ్యదృష్టితో చైతన్యము వంటి వర్ణనము వేదములందు గాన్పించును. దీనిని దెలిసికొనలేక ప్రొ. మైక్స్ మూలర్ మరియు దాదాపు పాశ్చాత్య విద్వాంసులెల్లరును, వారియనుయాయులే యగు భారతీయ విద్వాంసులు సైతము వ్రాసిన విషయము. అనగా; శ్రద్ధ, అనుమతి, అరమతి, సూనృత, అసునీతి, నిఋృతి, గ్రావా, ఆపః, ఘృత, బర్హిః (కుశా) యూప (స్తంభ) దక్షిణా, లాఙ్గలము (నాగలి) ఉర్వరా (వ్యవసాయ క్షేత్రము), సీతా (నాగటిచాలు), ధనస్సు, బాణము మున్నగు వానినన్నింటిని దేవతల నొనర్చివేసినారు. ఇదే విధముగా 'గ్రిసవోల్డు' అనునాతడు *Religion of the Rigveda* అను పేరుతో ఋగ్వేద ధర్మ విషయక పుస్తకమునందు చూపుటకు ప్రయత్నించినాడు. ఇది మహా అజ్ఞాన విషయమేగదా! **ఉదాహరణార్థము; 'గ్రిసవోల్డు' అనునాతడిట్లు వ్రాసినాడు.**

**The abstract goddess Shradda (faith), Arumati (favour), Aramati (devotion), Sunrita (Bounty), Asuniti (Spirit life), and Nirriti (Disease), Deified objects connected with the ritual, as Gravanah (Press stone for crushing the soma Plant), Apas (Sacrificial waters mixed with Soma) Ghrita (Sacrificial oil) Barhis 'the sacrificial litter' Yupa the sacrifical**

post to which the victim was bound (1-13-11) and Dakshina (largess) the deified fee of the priest (1-18-5) etc. The deified implements and objects of agriculture such as Langala (Plough) Sunasira (Plough share), Urvara (Plough land), sita (furrow) etc. and the deified weapons of war, Bow, Arrow, Quiver, Car, etc. (VI-75).

-The Religion of the RigVeda by Griswold P. 84-85.

ఇదే విషయము *Vedic Age* నందును గాంచబడుచున్నది. దేవత పదమునకు తాత్పర్యము పూజనీయ వ్యక్తియో పదార్థమో మాత్రమే గాదనియు, మంత్రమునందు ప్రతిపాదించబడిన విషయము గూడ దేవత యనబడుననియు, ఈ పదార్థముల వర్ణనము వేదములందు వచ్చుటచే ఒకవేళ 'దేవత' యను పేరుతో వ్రాయబడియున్నచో దాని తాత్పర్యము వేదములందు ఈ దేవతల పూజా విధానము గాదనియు ఈ విద్వాంసులు తెలిసికొనినచో దీని తాత్పర్యము ఇట్లు అనర్థముగా వ్రాయకుండెడివారు. దివ్య గుణములు గల జడ చేతన పదార్థములకు కూడా దేవత యను ప్రయోగ ముండును.

### 4.20 అగ్ని, ఇన్ద్ర మున్నగు వాని కనేకార్థములు

పైన నిర్దేశమొనర్చబడినట్లు దేవీ దేవత శబ్దముల కనేకార్థములు గలవు. అదే విధముగా అగ్ని, ఇన్ద్ర, వరుణ, మిత్ర, యమ, వాయు మున్నగు శబ్దములకు గూడ అధ్యాత్మిక, అధిభౌతిక, అధి దైవిక దృష్టితో అనేకార్థములగుచుండును. వీనిని దెలిసికొననిచో గొప్ప భ్రాంతి (అపోహ) గలుగ గలదు. ఉదాః- అగ్నియను శబ్దము వేదములందు ప్రధానముగా ఈశ్వరవాచకమైయున్నది. ఇందులో సందేహము లేదు.

**అగ్ని శబ్దము ఈశ్వర వాచకము :-**

నిమ్న మంత్రములందు గల అగ్ని శబ్దము పరమేశ్వర వాచకమనుటలో సందేహము లేదు.

**౧. మర్తా అమర్త్యస్య తే భూరి నామ మనామహే। విప్రాసో జాతవేదసః ॥** ఋగ్వే. ౮-౧౧-౫ ॥

అమర్త్యస్య - అమరులు, జాతవేదసః - సర్వ వ్యాపక, సర్వజ్ఞ అను నీ విశేషణములు భౌతికాగ్నిపై చరితార్థము గాజాలవు. కాని పరమేశ్వరునికి చక్కగా వర్తించగలవు.

**౨. విప్రం విప్రాసోఽవసే దేవం మర్తాస ఊతయే। అగ్నిం గీర్భిర్హవామహే ॥** ఋ.౮-౧౧-౬ ॥

ఇచ్చట కూడా 'విప్రమ్' మరియు 'దేవమ్' అను నీ విశేషణములు 'అగ్నిమ్' అను దానితో కలిసియున్నవి. ఇవి ఈశ్వరపరకములే యై యున్నవి.

**3. పురుత్రా హి సదృఙ్ఙసి విశో విశ్వా అను ప్రభుః। సమత్సు త్వా హవామహే ॥**

ఇచ్చట కూడా అగ్నిని 'విశ్వా విశః ప్రభుః' అనగా సమస్త ప్రజలకు స్వామియని, మరియు 'సదృఙ్' సర్వద్రష్ట లేక సమస్తమును సమానదృష్టితో గాంచువాడు అను విశేషణములు పరమేశ్వర సూచకములని స్పష్టమగు చున్నది. ఈ దిగువ మంత్రమందును అగ్నిచే పరమేశ్వరుని గ్రహించు సూచన స్పష్టముగా గలదు.

**౪. అన్తర్హ్యగ్న ఈయసే విద్వాన్ జన్మోభయా కవే। దూతో జన్యేవ మిత్ర్యః ॥** ఋ. ౨-౬-౭ ॥

అనగా; హే అగ్నే (కవే) క్రాంతదర్శి సర్వజ్ఞుడవగు పరమేశ్వరా! నీవు (ఉభయాజన్మ విద్వాన్) మానవుల యొక్క భూత భవిష్య ద్వర్త మాన జన్మములన్నింటిని ఎరుగువాడవై యున్నావు. (మిత్ర్యః) సర్వమునకు మిత్రుడవు (జన్యేవ దూతః) మానవ హిత కారకమగు సత్యసందేశమును వేదముల ద్వారా సమస్త ప్రదేశములకు చేర్చువాడవు. మరియు (అన్తః ఈయతే) సర్వమునందును విద్యమానమై యున్నావు. ఇచ్చట అగ్ని శబ్దము ద్వారా పరమేశ్వరుని గ్రహించుటకు ప్రమాణములు ఆతనికి 'విద్వాన్ కవి, జన్య మున్నగు విశేషణములున్నవి. సాయణాచార్యుడును. 'కవే'' అను పదమునకు అర్థము. 'మేధావిన్' మరియు 'విద్వాన్' అను దాని అర్థము 'జానన్' అని యొనర్చినాడు. కాని భౌతికాగ్నితో దీని సంబంధము గలియుటలేదు.

**౫. అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్।**

**యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ** ॥ య.౪౦-౧౬॥

ఈ మంత్రములో అగ్నిని గూర్చి '**విశ్వాని వయునాని విద్వాన్**' అనగా సకల కర్మల నెరుగువాడు అను విశేషణము గలదు. ఇది భౌతికాగ్నికి వర్తించదు. కాని పరమేశ్వరునికి స్పష్టముగా వర్తించుచున్నది. ఈ విషయము సులభ గ్రాహ్యమగుటచే విస్తరించి వ్రాయనవసరము లేదు.

## 4.2 । అగ్నికి బ్రాహ్మణాది అధిభౌతికార్థములు

అగ్ని శబ్దమునకు ముఖ్యార్థము ఆధ్యాత్మికముగా పరమేశ్వరుడు మరియు రెండవ అర్థము '**అగ్నినాగ్నిః సమిధ్యతే కవిర్గృహపతిర్యువా**' ॥ ఋ.౧-౧౨-౬, సామ. ౮౪౪ ॥ మున్నగు వాని యందు జీవాత్మ యై యున్నది. అధి భౌతిక, లేక సామాజిక దృష్టితో 'అగ్ని' అను శబ్ద ప్రయోగము వేదముల అనేక మంత్రములందు జ్ఞాని, బ్రాహ్మణుడు, నేత (నాయకుడు) అని గలదు. వీని కనేక ప్రమాణములును గలవు. కాని వీనియందు 3,౪ ప్రమాణములే పర్యాప్తము కాగలవని యెంచెదము.

**౧. అగ్నిఋషిః పవమానః పాఞ్చజన్యః పురోహితః। తమీమహే మహాగయమ్** ॥ ఋగ్వేద. ౯-౬౬-౨౦ ॥

ఈ మంత్రమునందు ఋషి, పవమాన, పాంచజన్య, పురోహిత, మహాగయి ఈ విశేషణములచే ఇచ్చట అగ్ని శబ్దము భౌతికాగ్ని, ముఖ్యముగా పరమేశ్వర వాచకము గాదని స్పష్టమగుచున్నది. కాని జ్ఞాని, బ్రాహ్మణ, అగ్రణీ లేక అధినేత వాచకమైయున్నది. (అగ్నిః) అగ్నివలె అజ్ఞానాంధకారమును దూరమొనర్చు బ్రాహ్మణుడు, (ఋషిః) తత్త్వదర్శి (పవమానః) సర్వజనులను పవిత్రమొనర్చువాడు, (పాఞ్చజన్యః) పంచజనులనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదులు (**చత్వారో వర్ణా నిషాదపంచమాః** - ఇతి నిరుక్తే 3-౮).

ఈ సకల విధములగు మానవులకు హితమొనర్చువాడు (పురోహితః) సత్యోపదేశకుడు, శ్రేష్ఠుడు, మరియు నాయకుడునగు (మహాగయమ్) ఎప్పుడును తగ్గిపోనట్టి విద్యాది ఐశ్వర్య సంపన్నుడగు బ్రాహ్మణుని మేమెల్లరము (ఈ మహే) కోరుచున్నాము, లేక ఆయనను సత్యోపదేశ మొనర్చుటకు ప్రార్థించుచున్నాము.

౨. ఈ మంత్రము అత్యంత స్పష్టముగా నుండు కారణమున ఈ ప్రకరణమున ఉల్లేఖించదగియున్నది. ఇది ఋగ్వేద 3-౧-౧౭ యొక్క పూర్వార్థము. దీనియందగ్నిని సంబోధించుచు.

**ఆ దేవానామభవః కేతురగ్నే మన్ద్రో విశ్వాని కావ్యాని విద్వాన్ ॥ 3-1-18 ॥**

హే (అగ్నే) జ్ఞానివగు బ్రాహ్మణా! నీవు (మనుః) ఆనందదాయక స్వభావముగలవాడవు. మరియు (విశ్వాని) సమస్త (కావ్యాని) వేదములు మున్నగు కావ్యములను (విద్వాన్) ఎరిగినవాడవై యుండి (దేవానామ్) ఇతర విద్వాంసులకు (కేతుః) జండావంటి నాయకుడవు (అభవః) ఐయున్నావు. ఇచ్చట భౌతికాగ్ని ప్రయోగమొనర్చినచో 'విశ్వాని, కావ్యాని, విద్వాన్ శబ్దముల ప్రయోగము అత్యంత మూర్ఖత్వమే యగును. ఇచ్చట పరమాత్మ సంబంధము కూడా సరిపడదు. కాని బ్రాహ్మణ, నాయక అర్థముల గ్రహించుటే సంగతమగును.

3. ఈ ఋగ్వేద మంత్రమున కూడా అగ్నికి జ్ఞాని, నేత అనుయర్థమే స్పష్టమగుచున్నది.

**వ్రతా తే అగ్నే మహతో మహాని తవ క్రత్వా రోదసీ ఆతతన్థ ।**

**త్వం దూతో అభవో జాయమానః త్వం నేతా వృషభ చర్షణీనామ్** ॥ ఋ. 3-6-5॥

దీనియర్థము స్పష్టమే. హే (అగ్నే) జ్ఞానివగు బ్రాహ్మణా! (మహతః తే) గొప్ప జ్ఞానము మున్నగు గుణయుక్తుడవగు నీ యొక్క (మహాని వ్రతా) మహోన్నత కార్యములు గలవు. నీవు (తవ క్రత్వా) నీ కర్మల ద్వారా (రోదసీ ఆతతన్థ) ఉభయలోకములందును విస్తృతమగుచున్నావు. నీయశస్సు సర్వత్ర విస్తరింపబడుచున్నది. (జాయమానః) ప్రసిద్ధమగుచు నీవు (దూతః అభవః) దూతవలె ఉత్తమ జ్ఞాన సందేశమును గొనిపోవు వాడవగుచున్నావు. హే (వృషభ) సుఖవర్షమును గురియించు శ్రేష్ఠ బ్రాహ్మణా! నీవు (చర్షణీనామ్) మానవులకు (నేతా) నాయకుడవు.

ఇచ్చట వర్ణింపబడియున్న అగ్ని విషయము జ్ఞాని బ్రాహ్మణుడు, నాయకుడు అను పదములపై చక్కగా సంగతమగుచున్నది. ఇందు భౌతికాగ్నికి సంబంధమే లేదు.

4. ఈ దిగువ ఋగ్వేద 3-11-1వ మంత్రము నందు విషయము స్పష్టముగా నున్నందున పేర్కొనదగియున్నది.

**అగ్నిర్హోతా పురోహితోఽధ్వరస్య విచర్షణిః । స వేద యజ్ఞమానుషక్** ॥ ఋ. 3-11-1 ॥

ఇందగ్ని విషయమున జెప్పుచు, అది (1) (హోతా) హవనము మున్నగువాని నొనర్చు (2) పురోహిత్ అనగా హితాహితములనుపదేశించు (3) అహింసాత్మక శుభకార్యములకు విశేష రూపమున ద్రష్ట లేక ప్రకాశము (అధ్వరస్య విచర్షణిః) ఐ యున్నది. అది (యజ్ఞమ్ అనుషక్ వేద) యజ్ఞమును ఉత్తమోత్తమముగా నెరుగును. ఈ విశేషణము లెప్పుడును భౌతికాగ్నిపై చరితార్థము గాజాలవు. పరమేశ్వరునిపైనను ఇవి చక్కగా వర్తించజాలవు. కాని జ్ఞాని, బ్రాహ్మణ, నేత (నాయక) అర్థములు దీసికొనినచో వాని పూర్ణత్వము అన్వయించబడగలదనుటలో సందేహము లేదు.

**5. అగ్నిః శుచివ్రతతమః శుచిర్విప్రః శుచిః కవిః । అగ్నీ రోచత ఆ హుతః** ॥ ఋ.8-44-21 ॥

**ఇచ్చట అగ్ని యొక్క విశేషణ రూపములుగా శుచి వ్రతతమః, విప్రః కవిః అను శబ్దముల ప్రయోగము గలదు. వీని అర్థములు క్రమముగా 1 పవిత్ర వ్రత ధారణ మొనర్చువారలలో శ్రేష్ఠుడు. 2 జ్ఞానము ద్వారా ఎల్లరను విశేషరూపములో పరిపూర్ణపరచువాడు, మరియు పాలనమొనర్చు బ్రాహ్మణుడు 3. కవిః - క్రాంతదర్శి, తత్త్వదర్శి,**

ఉపదేశకుడని గలదు. ఇట్టి మంత్రములందు ఈ విశేషణముల ద్వారా అగ్ని శబ్దము నిస్సందేహముగా సత్యమైన బ్రాహ్మణ నాయకులకే ప్రయుక్తమగును. కాని భౌతికాగ్ని, మరియు పరమాత్మ కొరకు గాదని ఏ మాత్రమును సందేహము లేకుండా చెప్పవచ్చును.

**అయం స హోతా యో ద్విజన్మా విశ్వా దధే వార్యాణి శ్రవస్యా ।**

**మర్తో యో అస్మై సుతుకో దదాశ ॥** ఋ. ౧-౧౪౯-౫ ॥

**౬.** ఈ మంత్రము కూడా అగ్ని శబ్దము జ్ఞాని బ్రాహ్మణ పరకమగుటను అతిస్పష్టముగా సూచించుచున్నది. హోతా, మరియు ద్విజన్మా శబ్ద ప్రయోగముల ద్వారా ఇది స్పష్టమగుచున్నది. మంత్రములో ఎవ్వడు ( వర్తః) మనుష్యుడు ( సుతుకః) ఉత్తమ సంతానము గలవాడై ( అస్మై దదాశ) దీనియెడ ఆత్మ సమర్పణ మొనర్చుకొనునో, వాడు దాని కొరకు ( విశ్వా శ్రవస్యా వార్యాణి దధే) సమస్త కీర్తి, వరణీయ, శ్రేష్ఠ జ్ఞాన భక్తి సదాచారాది గుణములను ధారణమొనర్చుకొనును. మరియు పరిపుష్టమొనర్చుకొనును అని కలదు. ఇదే విధముగా 'అగ్ని' శబ్దమున కనేకార్థములు గలవు. విస్తరణ భయముచే వ్రాయబడలేదు.

### 4.22 ఇన్ద్ర శబ్దమునకు అనేకార్థములు

అగ్ని వలెనే ఇన్ద్ర శబ్దమునకును అనేకార్థములు గలవనుటలో సందేహములేదు. **'ఇది పరమైశ్వర్యే'** అనుధాతువుచే ఈ శబ్దము సిద్ధమగుచున్నది. కావుననే దీని ముఖ్యార్థము పరమేశ్వరుడే.

క. **య ఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి। ఇన్ద్రః పంచక్షితీనామ్** ॥ ఋ.౧-౭-౯॥

ఖ. **య ఏకఇద్ విదయతే వసు మర్తాయ దాశుషే ॥**

**ఈశానో అప్రతిష్కృత ఇన్ద్రో అఙ్గః** ॥ ఋ.౧-౮౪-౭॥

గ. **మా చిదన్యద్ విశంసత సఖాయో మా రిషణ్యత ।**

**ఇన్ద్రమిత్ స్తోతా వృషణం సచా సుతే ముహురుక్థా చ శంసత** ॥ ఋ.౮-౧-౧॥

ఘ. **ఇన్ద్రో దివ ఇన్ద్ర ఈశే పృథివ్యా ఇన్ద్రో అపామిన్ద్ర ఇత్ పర్వతానామ్।**

**ఇన్ద్రో వృధామిన్ద్ర ఇన్మేధిరాణామిన్ద్రః క్షేమే యోగే హవ్య ఇన్ద్రః** ॥ ఋ.౧౦-౮౯-౧౦॥

మున్నగు మంత్రములందు ఇంద్ర శబ్దము నిస్సందేహముగా స్పష్టముగా పరమేశ్వర వాచకమైయున్నది.

**ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్।**

**ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః** ॥ ఋ.౧-౧౬౪-౪౬॥

**క.** మున్నగు పూర్వోక్త మంత్రములందు ఇన్ద్ర శబ్దము ఈశ్వరపరకముగానే చెప్పబడినది. ఈ పై మంత్రములందు ఆ ఇన్ద్ర ( పరమేశ్వరు) డే సకల మానవులకు సకలైశ్వర్య ప్రదాత, సమస్తైశ్వర్యముల స్వామియని చెప్పబడినది.

**ఖ.** ఆత్మ సమర్పణ మొనర్చు భక్తునకు ఆతడొక్కడే సకలైశ్వర్యములనిచ్చును. ఆయన యే సర్వమునకు స్వామి. ఆతని గతి నెవ్వరును ఆపజాలరు.

గ. మిత్రులారా! ఇతరుల స్తుతుల నొనర్చుచు దుఃఖముల పాలుగాకుడు, యజ్ఞములం దెల్లరును గలిసి సుఖశాంతులను వర్ధింపజేయు నా పరమేశ్వరునే పదే పదే స్తుతించుడు.

ఘ. ఇన్ద్ర పరమేశ్వరు డొక్కడే ఆకాశము, పృథివి, జలము, పర్వతములు మరియు వృద్ధిశీలురు, బుద్ధిశాలురగు మానవులెల్లరకును స్వామి. యోగక్షేమములకై ఇన్ద్ర-పరమేశ్వరుడొక్కడే సదా సంస్మరించయోగ్యుడు. ఇత్యాదులు.

ఈ మంత్రములందు ఇన్ద్ర శబ్దము పరమేశ్వర వాచకమనుటలో ఏ మాత్రమును సందేహములేదు. సకల జగత్కర్త, సుఖవర్ధకుడు, సర్వమునకు స్వామి, పూజనీయుడునగు పరమేశ్వరుడొక్కడు మాత్రమే ఉపాసనీయుడని ఈ మంత్రములందు జూపబడినది.

**ఇన్ద్ర క్రతుం న ఆభర పితా పుత్రేభ్యో యథా ।**
**శిక్షాణో అస్మిన్ పురుహూత యామని జీవా జ్యోతిరశీమహి॥**

(ఋ.౭-౩౨-౨౬, సామ. పూ.౩-౨-౭, అథర్వ ౨౦-౭౯-౧॥)

ఈ మంత్రమునందు ఇన్ద్ర నామముతో పరమేశ్వరుని స్మరించుచు ఇట్లు ప్రార్థించబడినది. హే పరమేశ్వరా! నీవు (నః క్రతుమ్ ఆభర) మాకు జ్ఞానమును ప్రసాదించుము. (పితా పుత్రేభ్యః యథా) ఒక తండ్రి తన పుత్రునకిచ్చునట్లు. హే (పురుహూతః) అనేక భక్తుల ద్వారా పిలువబడుచున్న ఓ ప్రభూ! (అస్మిన్ యామని) ఈ మనస్సును వశమునందుంచుకొను విషయమున (నః శిక్ష) నీవు మాకు శిక్షణ నిమ్ము. మేము (జీవాః) జీవన (జ్యోతిః అశీమహి) జ్ఞాన జ్యోతిని ప్రాప్తించుకొనెదముగాక (ఇచ్చట పౌరాణిక భాష్యకారుడగు శ్రీ సాయణాచార్యుడు కూడ 'ఇంద్ర' పదమునకు పరమాత్మ యనియే అర్థము నొనర్చినాడు. ప్రకరణానుకూలముగా నుండుటచే నది పూర్తిగా ఉచితమే యైయున్నది. సామ. పూ.౩-౨-౭ యొక్క సాయణ భాష్యము (ఇన్ద్ర) పరమాత్మన్! 'త్వం కర్మ స్వ విషయం వా జ్ఞానమ్ అస్మభ్యం ప్రయచ్ఛ').

## 4.23 'ఇన్ద్ర' శబ్దమునకు జీవాత్మ పరక అర్థములు

ఈ విధముగా 'ఇన్ద్ర' శబ్దము యొక్క ప్రయోగము వేదముల అనేక మంత్రముల యందు పరమేశ్వరార్థమున వచ్చినను ఇతర అనేక మంత్రములందు జీవుని అర్థమందును 'ఇన్ద్ర' శబ్ద ప్రయోగము గలదు.

ఉదాహరణార్థము ఈ మంత్రమును జూడుడు.

**అహమిన్ద్రో న పరా జిగ్య ఇద్ధనం న మృత్యవే౽వతస్థే కదాచన ।**
**సోమమిన్మా సున్వన్తో యాచతా వసు న మే పూరవః సఖ్యే రిషాథన ॥** ఋ.౧౦-౪౮-౫ ॥

ఈ మంత్రములో ఆత్మ తన స్వ విషయమున చెప్పిన ఉక్తి గలదు. (ఇన్ద్రః) ఆత్మనగు నేను (ధనమ్ న ఇత్ పరాజ్యే) నా యొక్క జ్ఞానము, మరియు శక్తిరూప ధనమును ఎప్పుడును పరిత్యజించను. నేను (మృత్యవే కదాచన న అవతస్థే) ఎప్పుడును మృత్యువు అధీనమున బడిపోవకుందును. ఎప్పుడును మరణించను. (సోమం సున్వన్తః ఇత్ వసు యాచత) మీరు జ్ఞానమయ భక్తి భావమును సంపాదన మొనర్చుచునే నా నుండి ఐశ్వర్యముల నర్థించుడు. (పూరవః) ఓ మానవులారా! (మే సఖ్యే న రిషాథన) నా మిత్రత్వములో మీరెప్పుడును దుఃఖములను పొందకుందురు గాక.

ఆత్మ యొక్క అద్భుతశక్తి మరియు అమరత్వము ఈ మంత్రమున ప్రతిపాదించబడినది. కావున నిచ్చట ఇన్ద్ర శబ్దము జీవాత్మవాచకము సరిగానే యున్నది.

**అభీదమేక ఏకో అస్మి నిష్షాడభి ద్వా కిము త్రయః కరన్తి ।**

**ఖలే న పర్షాన్ ప్రతి హన్మి భూరి కిం మా నిన్దన్తి శత్రవో౽నిన్ద్రాః** ॥ ఋ.౧౦-౪౮-౭ ॥

ఈ మంత్రమునందును ఆత్మ ముఖతయే చెప్పించబడినది. అనగా; నేనొకనిని (కామవాసనా - రూప శత్రువును) ఎదిరించగలుగుదును. (అభి ద్వా) కామ క్రోధములను ఈ రెండింటిని కూడా ఎదుర్కొనగలుగుదును. (కిమ్ ఉ త్రయః కరన్తి) కామక్రోధ లోభములను ఈ మూడును నన్నెదిరించలేవు. కల్లమునందలి పొల్లువలె శత్రువు లెల్లరను నేను తరిమివేయుదును. శక్తి రూప ఐశ్వర్య హీనుడగు శత్రువు నన్నెట్లు జయించగలుగును? నేనిట్టి బెదిరింపులకు భయపడి లొంగిపోను.

ఇచ్చట కూడా ఇన్ద్రుడు జీవాత్మ వాచకమగుట యందు ఎట్టి సందేహమును గలుగజాలదు. జీవాత్మ ఇన్ద్ర వాచకమగు కారణముననే ముక్కు, చెవి, కన్నులు మున్నగు అవయవములు ఇంద్రియములనిపించుకొనుచున్నవి. అనేక ఇతర మంత్రములందును 'ఇన్ద్ర' శబ్దము జీవాత్మ వాచకముగ నున్నది. గ్రంథ విస్తరణ భీతిచే అతి స్పష్టమగు మరొక మంత్రము మాత్రమే ఉల్లేఖించుట సంతృప్తిగనుండును.

**ప్రేహ్యభీహి ధృష్ణుహి న తే వజ్రో నియంసతే । ఇన్ద్ర నృమ్ణం హి తే**

**శవో హనో వృత్రం జయా అపో౽ర్చన్ను స్వరాజ్యమ్** ॥ ఋ.౧-౮౦-౩॥

ఇచ్చట ఆత్మను సంబోధించుచు ఇట్లు చెప్పబడినది. హే (ఇన్ద్ర) జ్ఞానాద్యైశ్వర్యయుక్తుడవగు ఓ జీవా! నీవు ముందుకు సాగుము. నీ శక్తిని కార్యరంగమున ప్రవేశపరచుము. నీ వజ్రము నెవ్వరును ఆపజాలరు. నీ శక్తి యెల్లరను వంచివేయ గలదు. నీవు నీ వజ్రమును పాపనాశనమునకై ప్రయోగించుము. మరియు సత్య పరంపరలందు విజయప్రాప్తి నొందుము. నీవు నీ స్వరాజ్యమును అత్యుత్తమముగా సంరక్షించుకొనుము. (ఇన్ద్ర శబ్ద మిచ్చట ఒక వైపు జీవాత్మ కొరకై యున్నను అది శక్తి శాలియగు రాజు పక్షమునను ప్రయోగింపబడినది.)

### 4.24 రాజ వాచకమగు ఇన్ద్ర శబ్దము

ఇన్ద్ర శబ్దము వేదములందలి అనేక సూక్తములందు రాజు, మరియు రాష్ట్రపతి కొరకు వచ్చియున్నది. ఉదా:- ఈ దిగువ మన్త్రములను జూడుడు.

**స్వస్తిదా విశస్పతిర్వృత్రహా వి మృధో వశీ ।**

**వృషేన్ద్రః పుర ఏతు నః సోమపా అభయంకరః** ॥ ఋ.౧౦-౧౫౨-౨ ॥

**వి న ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।**

**యో అస్మాఁ అభిదాసత్యధరం గమయా తమః** ॥ ఋ.౧౦-౧౫౨-౪ ॥

ఈ మంత్రములేగాక ఇతర అనేక సూక్తములందు ఈ 'ఇన్ద్ర' శబ్దము రాజు మరియు రాష్ట్రపతి యర్థమున అతిస్పష్టముగా ప్రయోగము గలదు. ఇందుకొరకు ప్రమాణము లిచ్చుట అవసరమనిపించుట లేదు.

మంత్రములందు ఇంద్రునికొరకు ఇట్లు చెప్పబడియున్నది. ఆతడు (స్వస్తిదా) కల్యాణ మొనర్చు (విశస్పతిః) ప్రజల రక్షణ జేయు (వృత్రహా) పాపములను పాపులను నాశమొనర్చు (వశీ) సర్వమును తన వశమున నుంచుకొను (వృషా) సుఖములను వర్షింపజేయు (అభయంకరః) నిర్భయత్వమును సంచార మొనర్పజేయు నాతడు (నః పుర ఏతు) మా యెదుటికి వచ్చి యున్నాడు. హే (ఇన్ద్ర) రాష్ట్రపతే! హింసకులగు మా శత్రువులను నాశమొనర్చుము. సైన్యమును దీసికొని మాపై ఆక్రమణ మొనర్చు దుష్టులను పతనమొనర్చుము. మమ్ము దాసులనుగా జేయ దలచి వారిని అంధకారము (కారాగారము) నందు బడవేయుము.

**త్రాతారమిన్ద్రమవితారమిన్ద్రం హవే హవే సుహవం శూరమిన్ద్రమ్ ।**

**హ్వాయామి శక్రం పురుహూతమిన్ద్రం స్వస్తి నో మఘవా ధాత్విన్ద్రః ॥** య.౨౦-౫౦॥

ఈ మంత్రమందలి 'ఇన్ద్ర' శబ్దము పరమేశ్వర వాచక మగుటయే గాక రాష్ట్రపతి మరియు వీరుడగు రాజుపై గూడ సంపూర్ణముగా చరితార్థమగుచున్నది.

భావమేమన; ప్రేమతో రక్షణ మొనర్చువాడు, సులభముగా పిలువదగిన శక్తి శాలియగు ఇన్ద్ర రాష్ట్రపతిని నేను పిలుచుచున్నాను. ఆ పరమైశ్వర్య సంపన్నుడు మమ్మెల్లరను కల్యాణ పరచు గాక - ఇదే విధముగా;

**మహో మహాని పనయన్త్యస్యేన్ద్రస్య కర్మ సుకృతా పురూణి ।**

**వృజనేన వృజినాన్ సం పిపేష మాయాభిర్దస్యూంరభి భూత్యోజాః ॥** అథ. ౨౦-౧౧-౬ ॥

మున్నగు మంత్రములందు స్తుతించబడిన ఇంద్రుడు తన శక్తిచే పాపులను నలిపివేయును. మరియు తన బుద్ధి ద్వారా దుష్టులను నాశమొందించును. ముఖ్యముగా నాతడు రాష్ట్రపతి పదమున నుండుట యందే కారణమున నైనను సందేహించ నవసరము లేదు.

## 4.25 రుద్ర శబ్దమున కనేకార్థములు

ఇదే విధముగా సోమ, రుద్ర మున్నగు దేవతల విషయమందును ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక దృష్టితో అనేకార్థములు గల వని ప్రమాణ పూర్వకముగా జూపవచ్చును. సోమ, శబ్ద ప్రయోగము వేదములందు పరమేశ్వరుడు, జ్ఞానమయ, భక్తి భావము, మరియు సౌమ్య, స్వభావ శాంత భక్తుల పరకముగా నొనర్చబడినదని ఇది వరకే చూపబడినది. రుద్ర శబ్దమున కనేకార్థములను గూర్చి ఇచ్చుట అతి సంక్షిప్తముగా దెలుపబడుచున్నది. మహర్షి దయానందులు తమ వేదభాష్యము నందు 'రుద్ర' శబ్దమునకు '౭' ఏడర్థముల నిచ్చియున్నారు. ఏమన;

**౧. రోదయతి దుష్టాన్ దణ్డ ప్రదానేనేతి న్యాయకారీ పరమేశ్వరః ।** దుష్టులను దండించి ఏడ్పించువాడు. న్యాయకారి యగు పరమేశ్వరుడు.

**౨. రోదయతి శత్రూన్ ఇతి రుద్రో మహావీరః ।** శత్రువులనేడ్పించు మహావీరుడు.

**3. రోదయతి దుష్టాన్ ఇతి రుద్రో న్యాయాధీశః ।** దుష్టులను దండించి ఏడ్పించునట్టి న్యాయాధీశుడు.

**౪. రోదయతి ధనికాన్ ఇతి రుద్రశ్చోరః ।** ధనికులనేడ్పించునట్టి చోరుడు.

**౫. రుత్-జ్ఞానం రాతి-దదాతీతి రుద్రః - ఉపదేశకః ।** జ్ఞానమునుపదేశించు ఉపదేశకుడు.

౬. రుద్ - దుఃఖం ద్రావయతీతి రుద్రో వైద్యః। దుఃఖములను దొలగించు వైద్యుడు.

౭. రుద్- రోగం రాతి దదాతీతి రుద్రో రోగోత్పాదకః కృమిః । అనగా; రోగోత్పాదక కృములు ( క్రిములు)

ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక దృష్టితో వైదిక దేవతల కనేక నామము లగును. వేద విద్యార్థు లెల్లరును ఈ విషయమును దెలిసికొనుట అత్యంతావశ్యకమ్మైయున్నది. మహర్షి దయానందులవారి ఈ విషయమును దెలిసికొనలేక *The Religion of the RigVeda* లేఖకుడు డా.గ్రిస్ వోల్డు *(Dr. Griswold)* మరియు ఇతర విద్వాంసులు కొందరు మహర్షి దయానందుల వేద భాష్యము మరియు వారి ద్వారా ప్రతిపాదించబడిన 'వేదములలో ఏకేశ్వర వాదము'ను విమర్శించినారు. డా.గ్రిస్వోల్డు ఇట్లు వ్రాసినాడు.

*"Taking his clue from the late passages in RigVeda 1-164-46 and 10-114-5, priests and poets with words make into many, the bird (The Sun) that is but one, the founder of the Arya Samaj held that all the gods mentioned in the RigVeda are simply variant names for one god. This process of reduction from multiplicity to unity would have been easier if there had been no dual gods or group gods mentioned in the Rigveda. It has already been remarked that the tendency of Rigvedic Polytheism was towards unity of some sort, either monotheistic or pantheistic. Swami Dayananda was not a pantheist. In reading into the RigVeda a monotheistic doctrine as opposed to pantheism, he virtually declared that instead of issuing in Pantheism or at most in an in-stable monotheism, Vedism ought to have issed in a clear-cut and definite monotheism. The monotheistic interpretation of the RigVeda involved on the part of Swamy Dayanand much wild and un-scientific analysis. In this, however, we may be thankful that as between theism and Pantheism, Swami Dayanand took side of theism.". -The Religion of the Rigveda, by Griswold P. 109-110.*

అనగా; ఋగ్వేదమందలి ౧-౧౬౪-౪౬ ( ఏకం సద్విప్రా బహుధా వదన్తి) మరియు ౧౦-౧౧౪-౫ ( ఏకం సుపర్ణం కవయో వచోభిరేకం సన్తం బహుధా కల్పయన్తి) నుండి సంకేతమును పొంది ఆర్యసమాజ ప్రవర్తకుడగు స్వామి దయానందుడు ఋగ్వేదమునందు ప్రతిపాదించబడిన సకల దేవతలు ఒకే దేవుని అనేక నామములై యున్నవని తన నిర్ణయమును ప్రకటించినాడు. ఒక వేళ ఋగ్వేదమునందు రెండు, లేక అనేక దేవతల వర్ణనము లేకున్నచో ఈ అనేకత్వము నుండి ఏకత్వము వైపునకు పరివర్తన ప్రక్రియ సుగమమై యుండెడిది. 'ఋగ్వేదీయ' అనేకేశ్వర వాద ప్రవృత్తి అది అద్వైత వాద రూపమున నుండని, లేక ఏకేశ్వర వాద రూపములో నుండని ఏదో యొక విధముగా 'ఏకత్వము వైపున నుండె' నని మొదటనే చెప్పబడియుండెను.

స్వామి దయానందులు అద్వైతవాదులుగాకుండిరి. వైదిక వాదము అద్వైత వాదములో పరిణతమగు స్థానమున సంపూర్ణముగ, స్పష్టముగా, నిశ్చయముగ ఏకేశ్వర వాద రూపమున పరిణతమ్మైనదని స్వామి దయానందులు క్రియాత్మక రూపమున తెలుపుటకు ప్రయత్నించినారు. వేదముల ఏకేశ్వర వాదపరకముగు వ్యాఖ్యయొనర్చుట కొరకు స్వామి దయానందునకు గొప్ప అవైజ్ఞానిక, నిరర్థక కల్పనల నొనర్చవలసి వచ్చినది. ఐనను స్వామి

దయానందులు అద్వైత వాదము మరియు ఏకేశ్వర వాదముల నుండి ఏకేశ్వర వాదమునే ఎంచుకొనినందున వారికి మనము కృతజ్ఞులమై యుండవలెను.''

ఈ యధ్యాయమునందే మేమిచ్చిన స్పష్ట ప్రమాణముల ద్వారా వేదములందు విశుద్ధమగు ఏకేశ్వర వాదమే ప్రతిపాదించబడినదని నిస్సందేహముగా స్పష్టమగుచుండగా స్వామి దయానందులు ఇట్లొనర్చుట యందణుమాత్రమును నిరర్థక లేక అవైజ్ఞానిక కల్పనల నొనర్చలేదు. కల్పనల నొనర్చవలసి వచ్చిన దనుట అతి మూర్ఖత్వముగాక మరేమగును? ద్వంద్వ, లేక సామూహిక దేవతల విషయములో డా. గ్రిస్‌వోల్డు స్వామి దయానందుల భాష్యమును గురించి అనుచితమగు విమర్శనమొనర్చుచు వ్రాసినాడు. దాని సమాధానము కూడా సుగమముగా నొనర్చవచ్చును. ఉదాహరణమునకు అగ్నీషోమౌ, ఇన్ద్రాగ్నీ, అశ్వినౌ వీనియనేకార్థములను మేమిచ్చుట సంక్షేపముగా నిర్దిష్టమొనర్చెదము. 'అగ్నీషోమౌ' కు దిగువ అనేకార్థములు గలవు.

| | | |
|---|---|---|
| ౧. అధ్యాపక సుపరీక్షకౌ | ఋ. | ౧-౯౩-౨ |
| ౨. అగ్ని జలవిద్యే | ॥ | ౧-౧౦ |
| ౩. తేజః శాన్తి గుణౌ | ॥ | ౬-౯ |
| ౪. అగ్ని చన్ద్ర లోకౌ | ॥ | ౨-౧౦౫ |
| ౫. శీతోష్ణకారకౌ జలాగ్నీ | ॥ | ౧-౨౫-౫ |
| ౬. వాయు విద్యుతౌ | ॥ | ౧-౯౨-౪ |

౭. ప్రసిద్ధౌ వాయ్వగ్నీ

౮. తేజశ్చన్ద్రావివ విజ్ఞాన సౌమ్యగుణావధ్యాపకపరీక్షకౌ

'అగ్నీషోమౌ' శబ్దమునకిట్లెన్నో అర్థములుండగా ద్వివచన ప్రయోగము వచ్చినందున ఏకేశ్వర వాదమునందు బాధక మనుకొనుట లేఖకుల అల్పజ్ఞత్వమునే సూచించును గాని ఇందు వారి విద్వత్త అల్పమాత్రమును లెక్కించదగినది గాదు.

'అగ్నీషోమౌ' నకిట్టి యర్థములే ఐతరేయ, శతపథ మున్నగు బ్రాహ్మణ గ్రంథములందును చూడగలము.

| | | | |
|---|---|---|---|
| ప్రాణాపానౌ - | అగ్నీషోమౌ | ఐత. బ్రా. | ౧-౮ |
| చక్షుషీ - | అగ్నీషోమౌ | '' | |

యచ్ఛుష్కం తదాగ్నేయం యదార్ద్రం తత్ సౌమ్యమ్ శత. బ్రా. ౧-౬-౩-౨౩.

సూర్య ఏవాగ్నేయః, చన్ద్రమాః సౌమ్యః, అహరవాగ్నేయం, రాత్రిః సౌమ్యా.

(శతపథ బ్రాహ్మణము. ౧-౬-౨౪) మున్నగునవి.

ఇప్పుడు మేము 'ఇన్ద్రాగ్నీ' అను శబ్దమున కనేకార్థములలో దిగువ నీయబడిన అర్థములే చాలుననుకొందుము.

౧. విద్యుదగ్నీ - విద్యుత్తు మరియు అగ్ని యజు. ౩౩-౪౯.

౨. సూర్యాగ్నీ ఇవ ప్రకాశమానౌ సభాపతి-సభాసదౌ యజు. ౭-౩౧
౩. మాతా పితరౌ । ౧౨-౫౪
౪. వాయు-వహ్నీ ఇవ వర్తమానౌ రాజ-ప్రజాజనౌ ఋ. ౬-౫౯-౨
౫. ఉపదేశ్యోపదేష్టారౌ । ౧-౧౦౯-౮
౬. అధ్యాపకోపదేశకౌ । ౧-౧౦౯-౮

బ్రాహ్మణ గ్రంథాదుల యందును ఈ యనేకార్థముల నిర్ణయము చూడనగును. ఉదాహరణార్థము దిగువ వాక్యములను జూడుడు.

ప్రాణోదానౌ వా ఇన్ద్రాగ్నీ శ.బ్రా.౨-౫-౨-౮
బ్రహ్మక్షత్రే వా ఇన్ద్రాగ్నీ కాశీతకీ ౧౨-౮
ప్రాణాపానౌ వా ఏతౌ దేవానాం యదిన్ద్రాగ్నీ తైత్తి ౧-౬-౪-౩

## 4.26 'అశ్వినౌ' శబ్దమునకు అనేకార్థములు

'అశ్వినౌ' శబ్దమునకు ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధిదైవిక దృష్టితో అనేకార్థము లగును. వాని నుండి ఈ దిగువ నిర్దేశించినవే చాలునను కొందుము.

| | | |
|---|---|---|
| ౧. ద్యావాపృథివీ | యజు. | ౨౧-౩౨ |
| ౨. ప్రాణాపానౌ | ॥ | ౨౧-౬౦ |
| ౩. వాయువిద్యుతౌ | ॥ | ౨౧-౫౮ |
| ౪. వాయుజలే | ఋగ్వే. | ౧-౪౪-౮ |
| ౫. వాయుసూర్యావివ వర్తమానౌ ధర్మన్యాయ ప్రకాశకౌ | | । |
| ౬. సూర్యచన్ద్రవత్ ప్రకాశమానౌ | యజు | ౭-౧౧ |
| ౭. సూర్యవాయుసదృక్ కర్మకారిణౌ సభాసేనేశౌ | ఋగ్వే. | ౧-౪౭-౩ |
| ౮. విద్యాదాతా గ్రహీతారావధ్వర్యూ | ॥ | ౧-౩౪-౪ |
| ౯. సుశిక్షితౌ స్త్రీపురుషౌ | యజు | ౩౮-౧౨ |
| ౧౦. అధ్యాపకోపదేశకౌ | ఋ. | ౫-౭౮-౩ |
| ౧౧. ప్రకాశగుణావధ్వర్యూ | ఋగ్. | ౧-౨౨-౩ |
| ౧౨. యజమానర్త్విజౌ | ॥ | ౫-౭౮-౨ |

వీని యర్థములకై బ్రాహ్మణ గ్రంథములో;

**ఇమే హ వై ద్యావాపృథివీ ప్రత్యక్షమశ్వినావిమే హీదꣳ సర్వమశ్నువాతామ్** ॥ శత.౪-౧-౫-౧౬ ॥

**అశ్వినావధ్వర్యూ** ఐత. బ్రా.౧-౧౮

**శ్రోత్రే అశ్వినా** శతపథబ్రా.౧౨-౯-౧-౧౨

**నాసికే అశ్వినా** ॥ ౧౨-౯-౧-౧౪

**తత్ కావశ్వినా, ద్యావాపృథివ్యా ఇత్యేకే అహోరాత్రా ఇత్యేకే**

**సూర్యా చన్ద్రమసౌ ఇత్యేకే** ॥ నిరుక్త ౧౨-౧-౧॥

మున్నగు ప్రమాణము లెన్నియో గలవు. 'అశ్వినా' శబ్దమునకు 'అధ్యాపకోపదేశకా' అను అర్థమును మహర్షి దయానందు లనేక స్థానములందు జేసియున్నారు. దీని ననేకులు మహర్షియొక్క కపోల కల్పితమని తలతురు. కాని యది వాస్తవము గాదు. వేదములు, మరియు బ్రాహ్మణ గ్రంథములందు ఈయర్థమునకు స్పష్టమగు ప్రమాణములు, మరియు నిర్ణయము లెన్నియో గలవు. ఉదా:- య.3-౧౪లో 'అశ్వినా' శబ్దమునకు అధ్వర్యూ శబ్దము విశేషణ రూపమున ప్రయోగము గలదు.

**'అశ్వినావధ్వర్యూ సాదయతామిహ త్వా'** ఐత. బ్రా. ౧-౧౮, శ-బ్రా. ౧-౧-౨-౧౭, గోపథ బ్రా.౨-౬ , తైత్తి 3-౨-౨-౧, లో 'అశ్వినావధ్వర్యూ' అను నీ వాక్యము గలదు. 'అధ్వర్యూ' శబ్దము నిరుక్తి శ్రీయాస్కాచార్యులు నిరుక్త నైగమకాండము ౧-౧3 నందు **'అధ్వరంయునక్తి'** అధ్వరస్యనేతా, **అధ్వరం కామయత ఇతి వా,** మరియు 'అధ్వర' **అధ్వర ఇతి యజ్ఞ నామ కధ్వరతిర్హింసాకర్మా తత్ప్రతిషేధః** అని యొనర్చినారు.

ఈ యుత్పత్తుల ననుసరించి హింసారహితమగు శుభకార్యములను 'అధ్వర' యందురు. ఇట్టి అధ్వర్యుల వ్యవస్థ నొనర్చునట్టి, వారి నాయకులు, లేక వారిని గోరు వారిని 'అధ్వర్యూ' అని యందురు. బ్రహ్మ యజ్ఞము, దేవ యజ్ఞము మున్నగు పంచ మహా యజ్ఞముల అధ్వరములందు పరిగణించుట సర్వ సమ్మతమైయున్నది. బ్రహ్మ యజ్ఞమనగా సంధ్య, మరియు అధ్యయనాధ్యాపనములు, 'అధ్యాపనం బ్రహ్మయజ్ఞః' (మను.3-౭౦) స్వాధ్యాయో వై బ్రహ్మయజ్ఞః (శ.బ్రా.౧౧-౫-౬-౨) ఇట్టి యజ్ఞ సంయోజకులు, మరియు నాయకులు అధ్యాపకులు, ఉపదేశకులు గాక మరెవ్వరు గాగలరు? కావుననే మహర్షి దయానందులు 'అశ్వినా' శబ్దమునకు 'అధ్యాపకోపదేశకా' అను యర్థము నొనర్చుట ఎంతయు తగియున్నది. ఋగ్వేద, ౧-౧౨౦ యొక్క రెండవ, మూడవ మంత్రములందు 'అశ్వినా' పదమునకు 'విద్వాంసా' అను విశేషణము గలదు. మరియు వారిని జ్ఞానోపదేశమునకై ప్రార్థించబడినది. ఇది 'అశ్వినా' శబ్దమునకు 'అధ్యాపకోపదేశకా' అను అర్థమును బలపరచుచున్నది.

**విద్వాంసావిద్ దురః పృచ్ఛేదవిద్వాన్ ఇత్థాఉపరో విచేతాః।**

**తా విద్వాంసా హవామహే తా నో విద్వాంసా మన్మవోచేతమద్య ॥**

ఇచ్చట 'విచేతాః అవిద్వాన్' అనగా జ్ఞానరహిత విద్వాంసుడు విద్వాంసులగు అశ్వినులతో జిజ్ఞాసు సత్యభావముతో ఇట్లు ప్రశ్నించుచున్నాడు. విద్వాంసులగు ఓఅశ్వినులారా! విద్వాంసులగు మిమ్ము మే మాహ్వానించుచున్నాము. మీరు మాకు (అద్య) నేడు (మన్మ) జ్ఞానమును గూర్చి (వోచేతమ్) ఉపదేశము

మరియు ప్రవచనముల నొనర్చుడు. ఈ విధముగా అశ్వి అధ్యాపక, ఉపదేశక పరకమగును అర్థము చేయుట యందే మాత్రమును సందేహములేదని చెప్పబడినది.

'అశ్వినౌ' యను శబ్దమునకు శ్రీ యాస్కాచార్యులు నిరుక్తమునందు **'యద్' వ్యశ్నువాతే సర్వమ్ '** అను వ్యుత్పత్తినిచ్చి **ద్యావా పృథివ్యౌ, సూర్యాచన్ద్రమ సౌ, అహోరాత్రౌ,** అను అర్థముల నిచ్చియున్నారు. వివాహ సంస్కారములందు వరుని ముఖమున వధువును సంబోధించుచు **'ద్యౌరహం పృథివీ త్వం తావేవ వివహావహై సహరేతో దధావహై।'** నేను ద్యులోకము అనగా; ఆకాశము వంటి వాడను మరియు నీవు పృథివి వంటిదానవు. మనమిరువురము వివాహమాడి ఉత్తమ సంతానమును బడయుదము గాక. పురుషుడు సూర్యుడు, స్త్రీ చంద్రుని వంటి వారలుగ, పురుషుడు పగలు, స్త్రీ రాత్రి **'సుఖం దదాతీతి రాత్రిః'** ఈ అర్థములగొని స్త్రీ పురుషులు దివారాత్రులుగ శాస్త్రములందు చెప్పబడియున్నది. ఈ విధముగ 'అశ్వినౌ' తో మహర్షి దయానందకృత 'విద్వాంసౌ స్త్రీ పురుషౌ' ఈ అర్థము స్పష్టముగ బలపడుచున్నది.

### 4.27 'మరుతః' శబ్దమునకు అనేకార్థములు

దేవతలకు బహువచనాంత సంబంధమున్నంతవరకు వానియందు 'మరుతః' అను శబ్దమునకు అధిక ప్రాధాన్యత గలదు. కావున దాని విషయము నందిచ్చుట కొంత ఆలోచించవలసిన ఆవశ్యకత గాన్పించుచున్నది. **'మరుతః'** ఇది ఈశ్వర వాచక శబ్దము గాదు. దీనికి **'మరుతో మితరావిణో వా మితరోచినో వామహద్ ద్రవన్తీతి వా'** నిరుక్త. అధ్యాయము ౧౧-౨ నందీ విధముగు అనేక వ్యుత్పత్తు లొనర్చబడియున్నవి. మరియు నిఘంటువు ౨-౧౮ నందు **'మరుత' ఇతి ఋత్విక్‌నామసు** మరియు నిఘంటువు. ౧-౨ నందు 'హిరణ్య' వా 'సువర్ణం' అను నామములందు 'మరుతః' పాఠము గలదు.

తాణ్డ్య మహా బ్రాహ్మణము. ౧౪-౧౨-౯లో 'మరుతో రశ్మయః' అనగా కిరణములను 'మరుతః' అని యందురని చెప్పబడినది. ఐత. ౬-౩౦లో **'అపో వా మరుతః'** అను శబ్దము ననుసరించి జలమును కూడా 'మరుతః' యందురు.

నిఘంటువు ౫-౫లో 'మరుతః' పాఠము **'పదనామసు'** అని కలదు. కావున గమనాగమన క్రియను గలిగింపజేయు వాయువులు ( వీనిని అంగ్రేజి భాషలో *Monsoons* అను పేరుతో చెప్పబడును. ) 'మరుతః' తో గ్రహించబడును. మహర్షి దయానందులు తన వేదభాష్యమునందు అనేక స్థలములలో 'మరుతః' శబ్దమున కీ దిగువ యర్థముల నొనర్చియున్నారు.

| | | | |
|---|---|---|---|
| ౧. | **వాయవః – మరుత ఇతి పద నామసు** | నిఘం. | ౫-౫ |
| | **అనేన గమనాగమన – క్రియాప్రాపకా వాయవో గృహ్యన్తే** | ఋ. | ౧-౧౫-౩ |
| | **వాయవ ఇవ జ్ఞానయోగేన శీఘ్రం గన్తారో మనుష్యాః** | ॥ | ౧-౮౫-౬ |
| ౨. | **సేనాధ్యక్షాదయః** | ॥ | ౧-౩౭-౧౨ |
| | **వాయువచ్ఛీఘ్రగమనకారిణో జనాః** | ॥ | ౧-౩౮-౩ |

| | | | |
|---|---|---|---|
| | వాయువద్ బలిష్ఠాః | । | ౧-౧౭౨-౨ |
| ౩. | సభాధ్యక్షాదయః | । | ౧-౮౬-౭ |
| ౪. | ఉత్తమా మనుష్యాః | । | ౬-౬౬-౮ |
| | సభ్య మనుష్యాః | అథర్వ. | ౧-౪౧-౫౪ |
| | ధర్మప్రాప్తా మనుష్యాః | ఋగ్వే. | ౧-౩౧-౧ |
| | పురుషార్థినో మనుష్యాః | । | ౫-౫౪-౧౪ |
| | యోగాభ్యాసినో వ్యవహారసాధకా వా జనాః | । | ౧-౩౮-౧౧ |
| | వాయువిద్యావేత్తారః | । | ౧-౧౬౯-౫ |
| | శిల్పినో మనుష్యాః | । | ౫-౬౩-౫ |
| | పరీక్షకా విపశ్చితః | । | ౧-౮౬-౨ |
| ౫. | ఋత్విజః | । | ౩-౪౬ |
| | విద్యావన్త ఋత్విజోఽధ్యాపకాః | । | ౧-౧౦౧-౧ |
| ౬. | ప్రాణాదయః | । | ౧-౫౨-౯ |
| | ప్రాణ ఇవ ప్రియాచరణాః | । | ౫-౫౫-౪ |
| | ప్రాణా ఇవ ప్రియా విద్వాంసః | । | ౧-౮౬-౧ |
| | ప్రాణా ఇవ నేతారః | । | ౭-౫౯-౧ |
| ౭. | హిరణ్యాని రూపాణి వా | యజుః | ౮-౩౧ |
| ౮. | విద్వాంసోఽతిథయః | । | ౩-౪౪ |

అనేక విద్వాంసులు ఈ 'మరుతః' శబ్దమును మనుష్య వాచక మని యంగీకరించరు. మరియు దీనిని మహర్షి దయానందుల కల్పన యని తలతురు. కాని స్వతః వేదములందే **'మరుత్తు'** లను నరః, మర్త్యాః, మానుషాసః' మున్నగు ప్రయోగములు అనేక స్థానములందు మనకు స్పష్టముగా గాన్పించును. ఉదా:- ఋగ్వేద. ౧-౩౯-౩, ౮-౨౦-౧౧, ౧-౬౪) ౧౦, ౧౦-౮౬-౮, ౫-౫౨-౫ అందు నరః శబ్దము యొక్క ప్రయోగము మరుత్తుల కొరకు కలదు.

**తే మా ఆహుర్య ఆయయురుపద్యుభిర్విభిర్మదే।**

**నరః మర్త్యా అరేపసః ఇమాన్ పశ్యన్నితి స్తుహి॥**

'మరుతో దేవతాః' గల ఈ మంత్రమునందు మరుత్తులకై మనుష్యవాచకమగు 'నరః' మరియు మర్త్యాః అను శబ్దముల ప్రయోగము గలదు.

ఋగ్వేద. ౭-౫౯-౧౦ మంత్రమందు మరుత్తులను **'గృహమేధాసః'** అనగా గృహస్థులని చెప్పబడినది.

**గృహమేధాస ఆగత మరుతో మాపభూతన ।**

**యుష్మాకమూతీ సుదానవః** ॥ ఋ.౫౯-౧౦॥

అథర్వ. ౭-౭౭-౩ వ మంత్రమందును మరుత్తుల కొరకు **'మనుషాసః'** శబ్ద ప్రయోగము గాన్పించుచున్నది. ఎట్లన;

**సంవత్సరీణా మరుతః స్వర్కా ఉరుక్షయాః సగణా మానుషాసః ।**

**తే అస్మత్ పాశాన్ ప్ర ముఞ్చన్త్వేనసః సాన్తపనా మత్సరా మాదయిష్ణవః** ॥ అ.౭-౭౭-౩॥

ఋ. ౫-౫౩-౩, ౫-౫౯-౬, ౫-౬౧-౪, ౭-౫౬-౧, ౧౦-౭౭-౨ మున్నగు మన్త్రములందు మరుత్తులకు 'మర్యాః' అను ప్రయోగము గలదు. దీని యర్థము మరణశీలురగు మనుష్యులని ప్రసిద్ధము. ఈ విధముగా మరుత్తులు శ్రేష్ఠమనుష్య వాచకముగుట స్పష్టమగుచున్నది. సాయణాచార్యులు కూడా తన ఋగ్వేద భాష్యమునందు కొన్ని స్థలములందు **'మనుష్యరూపా వా మరుతః'** అని వ్రాసినాడు. కనఖల్ సురతగిరిబంగలామఠవాసులగు మహామండలేశ్వర శ్రీ స్వామి మహేశ్వరానందగిరిగారు 'అథర్వవేద సంహితోపనిషచ్ఛతకమ్' పు. ౨౯౮లో.

**తే అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఉద్భిదోఽమధ్యమాసో మహసా వి వావృధుః ।**

**సుజాతాసో జనుషా పృశ్నిమాతరో దివో మర్యా ఆ నో అచ్ఛాంజిగాతన** ॥ ఋ.౫-౫౯-౬ ॥

ఈ మంత్ర వ్యాఖ్యయందు మరుత్తులకు శ్రేష్ఠ మానవుల పరక అర్థమొనర్చుచు

**పృశ్నిమాతరః – భారతమాతృభక్తాః అజ్యేష్ఠాసః – అకనిష్ఠాసః – పరస్పరం**

**జ్యేష్ఠకనిష్ఠభావ– ఉత్తమాధమభావరహితాః – సర్వప్రకారైః సమాః సమానవైదిక ధర్మాః సమానసద్భావాః మర్త్యాః – మనుష్యాః సన్తి** ॥ పు.౨౯౮ ॥ అని వ్రాసినాడు.

ఈ ప్రకారముగా మరుత్తుల యొక్క శ్రేష్ఠమనుష్య వాచకత్వము స్వయముగా వేద మంత్రముల ప్రమాణములచే స్పష్టమగుచున్నది. కావున దీనివల్ల ఏకేశ్వరవాదము నందు ఆటంకమేర్పడునని తలచుట సరియైనది కాదు.

చతుర్వేద భాష్యకారుడగు సాయణాచార్యుడు కూడా అనేక స్థానములందు 'మరుతః' శబ్దమునకు ఉత్తమ పురుష సంబంధమగు వ్యాఖ్యనే చేసియున్నాడు. ఉదాహరణార్థము ఋగ్వేద. ౮-౮౯ నందలి రెండు మంత్రములను జూడుడు.

**బృహదిన్ద్రాయ గాయత మరుతో వృత్రహన్తమమ్ ।**

**యేన జ్యోతి రజయన్ ఋతావృధో దేవం దేవాయ జాగృవి** ॥ ఋ.౮-౮౯-౧॥

**ప్ర వ ఇన్ద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత ।**

**వృత్రం హనతి వృత్రహా శతక్రతుర్వజ్రేణ శతపర్వణా** ॥ ఋ.౮-౮౯-౩॥

ఈ మంత్ర వ్యాఖ్యయందు శ్రీ సాయణాచార్యుడు 'మరుతః' అర్థమును;

**హే మరుతః రు శబ్దే మితం రువన్తీ మరుతః హే మితభాషిణః స్తోతారః । మ.౧॥**

**హే (మరుతః) మితరావిణః స్తోతారః (బృహతే మహతే (వః) స్తుత్యస్తోతృత్వ లక్షణేన సంబంధేన యుష్మదీయాయ ఇన్ద్రాయ (బ్రహ్మ) సామలక్షణం స్తోత్రం (ప్రార్చత) ప్రోచ్చారయత।** మం.౨ ( తిలక్ సంస్థాన సం.పృ. ౧౮౯ )

ఈ తీరున యొనర్చినాడు. మిత భాషణ మొనర్చు స్తోత లేక భక్తుడు. ఆతనిని సంబోధించుచు మంత్రములందు 'మీ కొరకు స్తుతి యొనర్చదగినవాడు మహాన్ పరమేశ్వరుడే. కావున ఆయననే మీరు మంత్రముల ద్వార స్తుతించుడు' అని చెప్పబడినది. ఈ రెండు మంత్రములే సామ వేదమందలి ఐన్ద్ర పర్వ మంత్రము 3-3 నందును వచ్చి యున్నవి. **ప్ర వ ఇన్ద్రాయ బృహతే** యొక్క మంత్ర సంఖ్య ౨౫౮ మరియు, **బృహదిన్ద్రాయ గాయత** అను మంత్ర సంఖ్య ౨౫౭. ఈ రెండు స్థానములందును సాయణాచార్యుడు ఋగ్వేద భాష్యమువలెనే **'మితభాషిణః స్తోతారః'** మరియు **'మితరావిణః స్తోతారః'** అనగా; మితభాషియగు స్తోత లేక భక్తుడు అను అర్థము నొనర్చినాడు. దీనియాధారము స్పష్టముగా నిరుక్తము యొక్క 'మితరావిణః' అను వ్యుత్పత్తి పైన యున్నది.

(సాయణాచార్య కృత సామవేద భాష్యము శ్రీ జీవనానంద విద్యా సాగర్ ద్వారా సంపాదితము క్రీ.శ. ౧౮౯౨, కలకత్తా. పు.౧౩౫)

సాయణాచార్యుని కన్న ఎంతో పూర్వపు సామవేద భాష్యకారుడగు నారాయణపుత్ర మాధవుడు కూడా (ఈతడు ఆరవ శతాబ్దము వాడని యెంచబడుచున్నది) ఈ రెండు మంత్రముల భాష్యమునందు 'మరుతః' పదమునకు మనుష్యపరమగు వ్యాఖ్య నొనర్చినాడు. ఉదాహరణకు **'ప్ర వ ఇన్ద్రాయ బృహతే'** భాష్యమునందు **'హే (మరుతః) మదీయ ఋత్విజః'**

**'బృహదిన్ద్రాయ గాయత మరుతో వృత్రహన్తమమ్'**, యొక్క భాష్యమునందు భరత స్వామి 'మరుతః' అను దాని యర్థము. **'మరుతః – స్తోతారః మహత్ రువన్తీతి మరుతః'** అనువ్యుత్పత్తినిచ్చి యొనర్చియున్నాడు.

(''సామవేద సంహిత - మాధవ భరత స్వామి భాష్య సంహిత'' డా. కున్హన్ రాజ సంపాదిత ఐడ్యార్ ౧౯౪౧ పు. ౧౮౯, ౧౯౦ అను చూడుడు.)

యజుర్వేదము ౨౦-30 నందును **'బృహదిన్ద్రాయ గాయత మరుతో వృత్ర హన్తమమ్'** అను మంత్రము వచ్చియున్నది. దీని భాష్యము నందును ఉవ్వటుడు, మహీధరుడను నిరువురు భాష్యకారులును 'మరుతః' అను దాని యర్థము ఋత్విక్ పరముగనే యొనర్చియున్నారు. ఎట్లనగా:-

ఉవ్వటుడు 'హే మరుతః' ఋత్విజులారా! లేక మరుతః అనియు

మహీధరుడు 'హే మరుతః' ఋత్విజః అని యొనర్చినారు. శుక్ల యజుర్వేద సంహిత ఉవ్వట, మహీధర భాష్య సంవలితా నిర్ణయ సాగర పు. 3౯0,3౯౧ ని చూడుడు.

### 4.28 ప్రొ. మైక్స్ మూలర్ మరియు 'మరుతః'

ప్రొ. మైక్స్ మూలర్ *Vedic Hymns* నందు 'మరుతః' విషయక సూక్తముల అనువాద మొనర్చుచు వాని యర్థము *Storm Gods* అని యొనర్చినాడు. ఐనను అతడు వాని కొరకు ఉపయోగించిన 'నరః' మున్నగు

శబ్దములను జూచిన తరువాత అనేక స్థానములందు మనుష్య పరమగు అర్థము నొనర్చుటకు వివశుడైనట్లు తెలియుచున్నది. ఉదాహరణార్థము:-

**'పరా హ యత్ స్థిరం హ థ నరో వర్తయథా గురుః ।'**

ప్రొ. మైక్స్ మూలర్ ఋ. ౧-౩౯-౩ నకు అర్థము నిట్లొనర్చియున్నాడు.

When ye overthrow what is firm, 'O ye men'. (Vedic Hymns P.97)

అనగా; హే మానవులారా! మీరు దృఢమును కూడా కదల్చివేయునప్పుడు ( ఇత్యాది)

**శూరా ఇవేద్ యుయుధయో న జగ్మయః శ్రవస్యవో న పృతనాసు యేతిరే ।**

**భయన్తే విశ్వా భువనా మరుద్భ్యో రాజాన ఇవ త్వేష సన్దృశో నరః** ॥ ఋ.౧-౮౫-౮॥

ప్రొ. మైక్స్ మూలర్ దీని యర్థము నిట్లొనర్చినాడు.

All beings are afraid of the Maruts. They are men terrible to behold like kings.

(Vedic Hymns. P. 127)

అనగా; ప్రాణులన్నియును మరుత్తులకు భయపడుచుండును. రాజుల వలెనవి చూచుటకు భయంకర తేజోవంతమై యుండును. ఇచ్చట మరుత్తులకు మనుష్య పరకమగు అర్థము స్పష్టముగా గలదు. మూలమునందు మరుత్తులకు 'నరః' అను ప్రయోగము గలదు. దీనికి ప్రొ. మైక్స్ మూలర్ *'Men'* అను అర్థమునొనర్చుట అన్ని విధముల యుచితమేయైయున్నది.

**యస్య వా యూయం ప్రతి వాజినో నర ఆహవ్యా వీతయే గథ।**

**అభి షు ద్యుమ్నైరుత వాజసాతిభిః సుమ్నా వో ధూతయో నశత్** ॥ఋ ౮-౨౦-౧౬॥

ప్రొ. మైక్స్ మూలర్ దీని యర్థమొనర్చుచు;

He oh men, whose libations ye went to enjoy, that mighty one, o shakers, will obtain your favours with brilliant riches. etc. Vedic Hymns P. 40.

ఇచ్చట కూడా మరత్తుల్కై మంత్రమునందు 'నరః' అను ప్రయోగము గలదు. కావున ప్రొ. మైక్స్ మూలర్ తన పక్షపాత పూర్ణమగు ఉద్దేశ్యానుసారము శీర్షిక రూపమునందు 'మరుతః' *To the Maruts (Storm Gods)* వ్రాయుచు కూడా దిగువ 'నర' శబ్దమునకు *'Oh men'* అర్థము నొనర్చుటలో గత్యంతరము లేనివాడైనాడు. ఇట్టివెన్నో ఉదాహరణములు గలవు. కాని గ్రంథ విస్తరణ భయమున ఉల్లేఖించలేదు.

వేదములందు అనేక దేవతల వర్ణన మున్నను ఆధి భౌతిక, ఆధ్యాత్మిక, ఆధి దైవిక దృష్టితో వాని కనేకార్థములు గలవు. ఐనను వేదముల ననుసరించి ఉపాస్య దైవము, సర్వవ్యాపక, సర్వజ్ఞ, సర్వశక్తిమంతు డగు పరమేశ్వరు డొక్కడే ఐనను, అనేక దేవతల ప్రతిపాదనము విశుద్ధమగు ఏకేశ్వరవాదమునందు ( మనము భ్రాంతియందు మునిగి యున్నట్లు) ఏ మాత్రము బాధకము గాజాలదు.

**4.29 వేదములు అద్వైత ప్రతిపాదకములు గావు.**

వేదములందు ఏకేశ్వరవాదమే ప్రతిపాదించబడినది, కాని అద్వైత వాదము లేదు. ఈ ప్రసంగమున ఈ విషయమును స్పష్ట పరచుట అత్యావసరమైయున్నది. ఈ దిగువ మంత్ర మెంతయో స్పష్టపరచుచున్నది.

**౧ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**

**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభి చాకశీతి ॥ ఋ.౧-౧౬౪-౨౦॥**

ఈ మంత్రమునం దిట్లుపదేశించబడియున్నది. జీవాత్మ మరియు పరమాత్మ రూపమున రెండు పక్షులున్నవి. ఇవి రెండును చేతనము అగుటచే పరస్పరము (సఖా) మిత్రులైయున్నవి. మరియు (సయుజా) స్నేహితులై యున్నవి. అవి రెండును అనాది నిత్యము లగుటచే సమానముగా ప్రకృతి రూప వృక్షముపై స్థిరముగ నున్నవి. ఆ రెంటియందొకటి కర్మఫల భోగము లనుభవించుచుండగా (అన్యః) రెండవది పరమేశ్వరుడు (అనశ్నన్) కర్మఫల భోగము లనుభవించకుండా (అభిచాకశీతి) సర్వజ్ఞమగుటచే ద్రష్టయై చూచుచుండును.

ఇచ్చట జీవేశ్వర భేదము ఎంతయో స్పష్టముగా వర్ణింపబడియున్నది. ఎంత ప్రయత్న మొనర్చినను దీనిని వక్ర పరచి చూపుట సాధ్యముగాదు.

ఉపనిషత్తులం దనేక స్థానములలో వేద మంత్రముల వ్యాఖ్యగలదు. అనగా వైదిక భావములు ఇతర స్పష్టమగు శబ్దములలో ప్రకటించబడియున్నవి. ఈ మంత్ర వ్యాఖ్య దిగువ వ్రాయబడిన ముణ్డకోపనిషత్తు వచనమున వివరించబడియున్నది.

**సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః ।**

**జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః ॥ ఉ. ౩-౧-౨ ॥**

అనగా; (పురుష) జీవాత్మ నిత్యము అనాదియగుటచే సమానమగు ప్రకృతి రూప వృక్షమందు (నిమగ్నమై) చిక్కుకొని తనయధికారమును జారవిడుచుకొని శోకమోహము లకు గురియైపోయినది. కాని ఎప్పుడైతే అది (జుష్టమ్) ప్రేమతో సేవించదగిన (అన్యమ్) తనకన్న వేరై యున్న (ఈశమ్) స్వామి పరమేశ్వరుని (పశ్యతి) చూచునో, మరియు (అస్యమహిమానమ్) ఇట్టి తనస్వామి మహిమలను అంతటను దర్శించునో అప్పుడది (ఇతి) ఇట్లది వీతశోక అనగా, శోకరహితముగ నైపోవును.

ఈయుపనిషద్వచనము, మరియు పైన దెలిపిన మంత్ర ప్రకరణమును ధ్యాన పూర్వకముగా శ్రద్ధాయుక్తముగా నాలోచించునపుడు ఈ 'ద్వాసుపర్ణా' యొక్క భావము బుద్ధి, మరియు జీవులని గాక 'జీవాత్మ పరమాత్మ' లని నిస్సందేహముగ చెప్పవచ్చును.

౨. ఈ దిగువ వ్రాయబడిన మంత్రము ఋ.౧౦-౮౨-౭ మరియు యజుర్వేద ౧౭-౩౧కి చెందియున్నది. ఇచ్చట దీని నిర్దేశము అత్యావశ్యకమై యున్నది.

**న తం విదాథ య ఇమా జజానాన్యద్ యుష్మాకమన్తరం బభూవ।**

**నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరన్తి ॥**

ఇందు మానవుల నుద్దేశించి ఓ మానవులారా! మీరు (తమ్) ఆ పరమేశ్వరుని (న విదాథ) తెలిసికొనకున్నారు. (యః) ఆయన (ఇమా జజాన) ఈ సకల వస్తువులను, లోకలోకాంతరములను నిర్మించువాడైయున్నాడు. (అన్యత్) ఆ పరబ్రహ్మ మీకు భిన్నమైయుండియును (యుష్మాకమ్ అన్తరం బభూవ) మీ లోపలను విద్యమానమై యున్నాడు. అజ్ఞానమను పొగమంచుచే మీరు కప్పబడియున్నారు. వ్యర్థమగు వార్తాలాపములలో, వ్యర్థ ప్రసంగములందు సమయమును నష్టపరచుచున్నారు, కేవలము మీ ప్రాణములనే తృప్తి పరచువారలు, స్వార్థపరులు, వేదముల, మరియు పరమేశ్వరుని కేవలము నామోచ్చారణ మొనర్చువారు, ఆడంబరములపై మోజు గలిగినవారై యున్నారు. కాని యీ పరమేశ్వరుని పొందుట కనుకూలమగు ప్రయత్నము నొనర్చుట లేదు. కావుననే మీరా పరమాత్మనెరుగ జాలకున్నారు. ఇచ్చట కూడా జీవేశ్వరుల భిన్నత్వము స్పష్టముగా తెలుపబడియున్నది. పరమాత్మ సమస్త జీవులం దున్నను ఆ జీవునికి (అన్యత్) భిన్నమైయున్నాడు. ఈ విషయమునే శతపథ బ్రాహ్మణమునందు అంతర్యామి ప్రకరణములో ఇట్లు స్పష్టపరచబడినది.

**య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరమ్।**

**య ఆత్మని తిష్ఠన్నన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥**

(శతపథ బ్రా. ౧౪-౬-౭. అచ్యుతాశ్రమ సంస్కరణము ద్వితీయ ఖండము. పు.౧౪)

అనగా; ఆత్మయందు స్థిరమైయుండియును ఆత్మకు వేరైయున్నవాడెవడో, అజ్ఞానియగు ఆత్మ ఎవని నెరుగజాలదో, ఈ శరీరమే ఎవనికి ఆత్మయని తోచునో, ఆత్మయందే స్థిరమై యుండియును ఆత్మ నెవడు శాసించుచుండునో అట్టి యాత్మకు అంతరాత్మయై యున్నవాడే పరమేశ్వరుడు. జీవేశ్వరుల భేదము, మరియు ద్వైత వాద ప్రతిపాదన మింతకన్న అధిక మింకేమి యుండగలదు?

3. ఈ మూడవ మంత్రము కూడా ఈ ప్రసంగమునం దెంతయో స్పష్టముగ నున్నది.

**యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః।**

**విహోత్రా దధే వయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః॥ య. ౧౧-౪॥**

(విపశ్చితః విప్రాః) జ్ఞానులు, సుఖపూర్వకముగా ఎల్లరను విశేషరూపమున ఆనందముతో పరిపూర్ణపరచు విద్వాంసులు తమ మనోబుద్ధులను (బృహతః విపశ్చితః) అందరికన్న మహాజ్ఞానియగు పరమేశ్వరునియందు (యుఞ్జతే) లీనమొనర్చుదురు. వారు (కః ఇత్) ఒక్కరు మాత్రమే (వయునావిత్) సకల కర్మలనెరుగునట్టి జ్ఞానులై (హోత్రా విదధే) విశేష రూపమున సకల పదార్థములను ధారణమొనర్తురు. (సవితుః దేవస్య) సర్వోత్పాదకుడగు పరమేశ్వరునివి (మహీ పరిష్టుతిః) మహా గొప్ప స్తుతులు, లేక మహా మహిమలు గలవు.

ఇచ్చట కూడా జీవేశ్వరుల భేదము స్పష్టముగా ప్రతిపాదించబడియున్నది. ఆ పరమేశ్వరుడొక్కడే గొప్ప విపశ్చితుడు (పండితుడు), సర్వజ్ఞుడైయున్నాడు. ఆతనికి భిన్నులైయున్న జ్ఞానులు ఆతని యందు తమ మనోబుద్ధులను సంయోగపరచి జ్ఞాన ప్రాప్తి నొందుటకు ప్రయత్నింతురు. అట్టి సర్వజ్ఞుడగు పరమేశ్వరుడొక్కడే, కాని అల్పజ్ఞులగు జీవు లనేకము లని స్పష్టమగుచున్నది గదా!

౪. ఈ దిగువ మంత్రము కూడా ప్రార్థనారూపములో జీవేశ్వరుల భేదమును స్పష్టపరచినది.

**ఇన్ద్ర క్రతుం న ఆభర పితా పుత్రేభ్యో యథా ।**

**శిక్షా ణో అస్మిన్ పురుహూత యామని జీవా జ్యోతిరశీమహి॥**

ఋ.౭-౩౨-౨౬, సామ పూ.౩-౨-౭, అథర్వ ౨౦-౭౯-౧॥

హే (ఇన్ద్ర) పరమేశ్వరా! (నః క్రతుం ఆభర) మాకు జ్ఞానము నిమ్ము. (యథా పితా పుత్రేభ్యః) ఏ విధముగా తండ్రి తన కుమారునకు జ్ఞానము నిచ్చునో, హే (పురుహూత) అనేక భక్తుల ద్వార పిలువబడినట్టి పరమేశ్వరా! (అస్మిన్) ఈ మనస్సును నిలుపునట్టి కార్యము, లేక మార్గమమునందు (నః శిక్షా) మాకు శిక్షణనిమ్ము. (జీవాః) జీవులమగు మేము (జ్యోతిః అశీమహి) జ్యోతిని ప్రాప్తించు కొనెదము గాక.

ఇచ్చట ఆ పరమేశ్వరుడొక్కడే మన జనకుడు. మనమెల్లరమాతని సంతానమని స్పష్టపరచబడినది. ఆయన సర్వజ్ఞుడు, మనమందరము అల్పజ్ఞులము. కావుననే మన మెల్లరము జ్ఞానముకొరకు ఆయననే ప్రార్థింతుము. జీవులమగు మన మనేకులము మనకు జ్యోతి అత్యావశ్యకము కావుననే ఆ జ్యోతిర్మయునితో మనము జ్యోతికొరకు ప్రార్థించుచుందుము. ఇంత స్పష్టముగా జీవేశ్వరుల భేదమును గూర్చి చెప్పబడియుండగా వేదము అద్వైతవాదమును ధృవపరచుచున్నదని యనుట ఎంతటి యశుద్ధము, మరియు మూర్ఖత్వమో ఆలోచించవలయును.

౫. ఈదిగువ నుదాహరించిన ఐదవ మంత్రము ఈ ప్రసంగము నత్యంత స్పష్టపరచునది. కావున నిచ్చట యుల్లేఖించుట ఆవశ్యకమైయున్నది.

**ఇమే త ఇన్ద్ర తే వయం పురుష్టుత యే త్వారభ్య చరామసి ప్రభూవసో।**

**నహి త్వదన్యో గిర్వణో గిరః సఘత్ క్షోణీరివ ప్రతి నో హర్య తద్ వచః॥**

ఋ.౧-౫౭-౪ , సామ.౩౭౩, అథర్వ ౨౦-౧౫-౪

(పురుష్టుత) అనేక భక్తులచే స్తుతించబడిన (ఇన్ద్ర) హే పరమేశ్వరా! (ఇమే వయమ్) ఈ మేము (తే) నీవారము (తే) నీవారమేయై యున్నాము. (యే) ఎవరు (త్వారభ్య చరామసి) నీ నామమునే స్మరించుచు ప్రపంచమున సంచరించుచుందురో, (ప్రభూవసో) అనంతైశ్వర్య సంపన్నుడవగు హే పరమేశ్వరా! (త్వత్ అన్యః) నీవు గాక ఇతరులెవ్వరును (నః గిరః) మా వాణులను (న సఘత్) వినజాలరు. నీవు పృథివి వలె మా వాణులను నీవైపునకు ఆకృష్టమొనర్చుకొనుము.

జీవేశ్వరుల భేద మిచ్చటను స్పష్టముగా గలదు. ఆ సర్వజ్ఞుడు, సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుడు ఉపాసనీయుడు, మరియు ఎల్లరకు ఆశ్రయుడైయున్నాడు. సదా మన మాతనినే స్మరించవలసియుండును. ఆయన గాక మన ప్రార్థనల నాలకించువా రితరు లెవ్వరును గారు.

౬. ఈ యారవ మంత్రము సైతము ఈ విషయము నందెంతయో విస్పష్టపరచునదియై యున్నందున ఇచ్చట నీయబడుచున్నది.

**ఓం సదసస్పతిమద్భుతం ప్రియమిన్ద్రస్య కామ్యమ్ ।**

**సనిం మేధామయాసిషమ్** ॥ యజు. ౩౨-౧౩ ॥

దీనియర్థమేమన; మనము ( అద్భుతమ్) ఆశ్చర్యకరమగు గుణకర్మ స్వభావములు గల ( సదసః పతిమ్) విశ్వరూప గృహమునకు లేక సభకు స్వామి ( ప్రియమ్) అత్యంత ప్రియమైనవాడు. ( ఇన్ద్రస్య కామ్యమ్) జీవాత్మలు కామించదగిన పరమేశ్వరునితో మనము (సనిం మేధామ్) సత్యాసత్యముల, ధర్మాధర్మముల, పాప పుణ్యముల విభేదము నొనర్చు బుద్ధిని ( అయాసిషమ్) యాచన లేక ప్రార్థన యొనర్చుచుందుము.

ఈ మంత్రము నందును జీవేశ్వరుల భేదము గురించి స్పష్టముగా ప్రతిపాదించబడి యున్నది. ఇంద్రుడగు పరమేశ్వరుడు జీవాత్మలకు కామించ ( కోర) దగినవాడై యున్నాడు. ఈ విశ్వమున కాతడే అద్భుత స్వామి, శుద్ధ బుద్ధిని ప్రదానమొనర్చువాడు. కావుననే అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడగు జీవుడు ఆ యనంతశక్తిమంతు డగు పరమేశ్వరునితో శుద్ధమగు బుద్ధిని యాచించును.

౭. ఈ ఋగ్యజుర్వేదములలోగల మంత్రము ఈ ప్రసంగమునందెంతయో అవసరమైయున్నందున ఇచ్చట ఉల్లేఖించబడుచున్నది.

**విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే।**

**ఇన్ద్రస్య యుజ్యః సఖా** ॥ ఋ.౧-౨-౭, యజు.॥౬-౪.॥

మానవులారా! మీరు ఆ ( విష్ణోః) సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుని ( కర్మాణి పశ్యత) కార్యములను జూడుడు. ( యతః) ఇందువల్ల మనుష్యులు ( వ్రతాని పస్పశే) శుభసంకల్పముల, మరియు కర్మలను స్పర్శించగలరు. - వానిని ఆదర్శరూపములో ప్రాప్తించుకొనగలరు. ఆ పరమేశ్వరుడు ( ఇన్ద్రస్య) జీవాత్మకు ( యుజ్యః సఖా) తగిన మిత్రుడై యున్నాడు.

ఇచ్చట కూడా జీవాత్మ కన్న పరమాత్ముడు భిన్నముగ మిత్రునిగా నున్నట్లు స్పష్టమగు ప్రతిపాదన గలదు. పరమాత్మకు 'విష్ణు' శబ్ద ప్రయోగము జీవునకు పరమేశ్వరునికి భేదము తెలుపుట కొరకే యొనర్చబడినది. ఎట్లన, పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు. కాని జీవుడు ఒక నిర్ణీత పరిమాణము గల అల్పజ్ఞుడు. పరమేశ్వరుని అద్భుత కార్యములను గాంచి సాధ్యమైనంతవరకు మనుష్యులు అహింస, సత్యవ్రతము, పరోపకారము మున్నగు శుభవ్రతములను గ్రహణమొనర్చగలరు.

౮. ఋగ్వేద. ౮-౧౩-౨౦వ మంత్రమునందును

**తదిద్ రుద్రస్య చేతతి యహ్వం ప్రత్నేషు ధామసు।**

**మనో యత్రా వి తద్ దధుర్విచేత సః** ॥ ఋ.౮-౧౩-౨౦॥

ఇచ్చట పరమాత్మను 'రుద్ర' నామముచే స్మరణమొనర్చుచు 'దుష్టులను దండించి ఏడ్పించువాడు, మరియు జ్ఞానప్రదాత **( రుత-ఉపదేశం రాతి-దదాతీతి జ్ఞానప్రదః పరమేశ్వరః)** ఆ ( రుద్రస్య) జ్ఞాన ప్రదాత, న్యాయకారి, పరమేశ్వరుని ( యహ్వమ్) మహాన్ సచ్చిదానంద స్వరూపము ( ప్రత్నేషు ధామసు) పురాతన - నిత్య శరీర ధారకులగు జీవాత్మలందు (చేతతి) ఉత్తమ చైతన్యము, మరియు జ్ఞానము నుత్పన్న మొనర్చును. ( యత్ర) జ్ఞాన ప్రదాతయగు ఈ పరమేశ్వరుని యందు ( విచేతసః) విశేష జ్ఞానము గల యోగులు ( తత్ మనః) అట్టి మనస్సును ( విదధుః) విశేష రూపమున ధారణమొనర్చుకొందురు. ఏకాగ్రమొనర్చుకొందురు.

ఇచ్చట కూడ అట్టి యహ్వా మహాన్ ( ఇదే 'మహాన్' ) వాచక యహ్వా శబ్దము నుండి యహూదీ మతమందును పరమేశ్వర వాచక *(Jehova)* జెహోవా మున్నగు శబ్దములు వచ్చినవి) పరమేశ్వర అను శబ్దమునుండి 'ప్రత్నధామ' శబ్దము ద్వారా సూచితమగు నిత్య శరీర ధారకుడగు జీవాత్మ భిన్న సత్తాను ప్రతిపాదనమొనర్చుచు 'విశేష జ్ఞాన సంపన్నుడగు జీవుడు ఆ మహాన్ పరమేశ్వరుని యందే తన మనస్సును లగ్న మొనర్చగల' డని తెలుపబడినది.

**౯. ఉతో పతిర్య ఉచ్యతే కృష్టీనామేక ఇద్ వశీ** ॥ ఋ.౮-౧౩-౯॥

ఈ తొమ్మిదవ మంత్రమందును పరమేశ్వరుని విషయమున ( కృష్టీనామ్) సకల మానవులకు ( ఏకః ఇత్) ఒకే ఒక ( పతిః) రక్షకుడు, స్వామి, మరియు ( వశీ) వశమున నుంచుకొనగల నియంత ( ఉచ్యతే) అని చెప్పబడినది.

ఇచ్చట పరమేశ్వరుని మానవులు మున్నగు సమస్త ప్రాణులకు ఏకమాత్ర రక్షకుడు, మరియు వాటిని వశమున నుంచుకొనువాడని చెప్పబడినది. ఇందువల్ల నాతడు జీవులకు భిన్న మగుట సిద్ధించుచున్నది.

౧౦. యజుర్వేదము నందలి ఈ పదునెనిమిదవ మంత్రము కూడా ఇందతి ప్రముఖమైయున్నది.

**వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్।**

**తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ।** ॥ య.౩౧-౧౮॥

జ్ఞాన సంపన్న వ్యక్తినగు నేను ( ఏతమ్) ఈ ( ఆదిత్యవర్ణమ్) సూర్యాదులను కూడా ప్రకాశమొనర్చు జ్యోతిర్మయుడు ( మహాన్తం పురుషమ్) మహాన్ సర్వవ్యాపకుడు నగు పరమేశ్వరు నెరుగుదును. ఆతడు ( తమసఃపరస్తాత్) అజ్ఞానాంధకారమునకు వేరైయున్నాడు. ( తమ్) ఆ పరమేశ్వరుని ( విదిత్వా ఏవ) మానవుడు తెలిసికొనియే ( మృత్యుమ్ అతి ఏతి) మృత్యువు నధిగమించి అమరుడైపోవును. ( అయనాయ) మోక్షప్రాప్తి కొరకు ( అన్యః పన్థా న విద్య తే) ఇంతకన్న వేరు ఏ మార్గమును లేదు.

ఈ మంత్రములో రెండు రకముల పురుషుల గూర్చి చెప్పబడినది. ఒకడు జ్యోతిర్మయ సర్వవ్యాపక మహాన్ పురుషుడు ( సంసార రూపాయాం పురి శేతే ఇతి పురుషః) పరమేశ్వరుడు, రెండవవాడు అల్పశక్తిమంతుడు, అల్పజ్ఞుడు, శరీర రూపనగరమున నివసించునట్టి జీవాత్మ. ఈ యిరువురకొరకును పై దెలిపిన వ్యుత్పత్తి ననుసరించి పురుష శబ్ద ప్రయోగ మొనర్చబడును. ఆ పరమ పురుషుడైన పరమేశ్వరుని జ్ఞానము తరువాతనే మోక్షప్రాప్తి గలుగును. కాని ఇతరత్రా సాధ్యము గాదు. ఇదే విధముగ ఇతర వేలాది మంత్రములందును జీవేశ్వరుల భేదమును గూర్చి స్పష్టముగ ప్రతిపాదించ బడియున్నది. గ్రంథ విస్తరణ భీతిచే ఆయన్నిటిని ప్రవేశపెట్టుట సాధ్యము గాదు. ఇక మూడు నాలుగు మంత్రముల నిచ్చిననే సరిపడు ననుకొందుము.

**౧౧. యో భూతానామధిపతిర్యస్మిన్ ల్లోకా అధి శ్రితాః।**

**య ఈశే మహతో మహాన్ తేన గృహ్ణామి త్వామహం మయి గృహ్ణామి త్వామహమ్** ॥ య. ౨౦-౩౨॥

ఈ మంత్రమునందు జీవేశ్వర లోకముల భేదములను ( భిన్నత్వమును) గూర్చి అతి స్పష్టముగా వివరణ గల దనుటలో అణుమాత్రమును సందేహము లేదు. మంత్ర సరళ శబ్దార్థ మిట్లున్నది.

( యః) ఎవడు ( భూతానామ్) సకల ప్రాణి మాత్రుల ( అధిపతిః) స్వామియో ( లోకాః) ఈ సమస్త

లోకలోకాంతరములు ( యస్మిన్ అధి(శితాః) ఎవని నా(శయించి ఉన్నవియో, ( యః) ఎవడు ( మహతః మహాన్) ఉన్నతోన్నతుడు మరియు ( ఈశే) సర్వమునకు ఈశ్వరుడో, (తేన) ఆ కారణము వల్లనే ( అహమ్) నేను హే పరమేశ్వరా! ( త్వామ్) నిన్ను ( గృహ్ణామి) గ్రహణమొనర్చు చున్నాను. ( మయి) నేను నాలోపల ( త్వామ్) నిన్ను గ్రహణమొనర్తును. ఎల్లప్పుడును నాలో నీ ధ్యాన చింతనముల నొనర్చుచుండెదను.

సకల ప్రాణులకు పరమేశ్వరుడే స్వామియని ఇచ్చట స్పష్టముగా చూపబడినది. లోకలోకాంతరము లన్నియును ఆతనినా(శయించియే యున్నవి. ఆయనయే గొప్ప .వారి కన్నను మహా గొప్పవాడు. కావుననే అల్పజ్ఞుడు, అల్పశక్తి మంతు డగు జీవునకు సదా ఆతని శరణమునే ఆశ్రయించవలసి యుండును.

ఈ మంత్ర భాష్యమునందు ఉవ్వటునికి, మహీధరునికి భాష్యకారులిరువురకును ఆత్మ పరమాత్మల భేద పరమగు వ్యాఖ్య యొనర్చుటకన్న గత్యంతరము లేక పోయినది.

### 4.30 ఉవ్వటుని భాష్యము

**'యో భూతానాం చతుః ప్రకారాణామ్ అధిపతిః । యస్మిన్స్త్రిలోకా అధి ఉపరి శ్రితాః స్థితాః। యశ్చఈశే మహతః వికారజాతస్య స్వయం చ మహాన్ తేన గృహ్ణామి త్వామ్ అహమ్** ॥పుట.౩౯౧॥

మహీధరుడీ మంత్రమునకు భాష్యమునిట్లు వ్రాసినాడు.

**యః పరమాత్మా భూతానాం జరాయ్వాదిభూతానాం చతుర్విధానాం అధిపతిః - అధికం పాలకః । యస్మిన్ ఆత్మని లోకాః - భూరాదయః అధి(శితాః - ఆ(శితాః। లోకా యదాధారా ఇత్యర్థః । మహాన్ సర్వోత్కృష్టో యః (మహతః) మహత్తత్త్వప్రముఖస్య తత్త్వగణస్య (ఈశే) ఈష్టే నియన్తా వర్తతే, ఇత్యాది.।**

ఇచ్చట భాష్యకారులిరువురును పరమేశ్వరుని సమస్త ప్రాణులకు, లోక లోకాంతరములకు ఆధారభూతుడు, నియామకుడు, మరియు సకల ప్రాణులకును భిన్నముగా నున్నాడని స్పష్టముగా నంగీకరించినారు.

౧౨. ఋగ్వేదపు.౮-౯౬-౬ వ మంత్రమున కూడా జీవేశ్వరుల మరియు జగత్తుల విభేదములను గూర్చి స్పష్టముగా ప్రతిపాదనము గలదు.

**తము ష్టవామ య ఇమా జజాన విశ్వా జాతాన్యవరాణ్యస్మాత్ ।**

**ఇన్ద్రేణ మిత్రం దిధిషేమ గీర్భిరుపో నమోభిర్వృషభం విశేమ** ॥ ఋ.౮-౯౬-౬॥

**దీని శబ్దార్థము :-** మేము ( తమ్ ఉ స్తవామ) ఆ పరమేశ్వరునే స్తుతింతుము. ( యః ఇమా జజాన) ఈ సూర్యుడు మున్నగు పదార్థముల నెవడు చేసియున్నాడో, ( విశ్వా జాతాని) ఉత్పన్నమైన ఈ సమస్త పదార్థములు ( అస్మాత్) జడములగు కారణమున పరమేశ్వరునికన్న అతి హీనములై యున్నవి. ( ఇన్ద్రేణ) ఆత్మ ద్వారా మనము ( మిత్రం దిధిషేమ) సర్వమునకు సత్యమగు మిత్రుడగు ఆ పరమేశ్వరుని స్తుతించవలెను. మరియు ( నమోభిః గీర్భిః) నమస్కారవాణులతో అట్టి ( వృషభమ్) సుఖముల వర్షింపజేయు పరమాత్మకు ( ఉపవిశేమ) సమీపమున గూర్చుండి ఆయనను గూర్చి యథార్థమగు ఉపాసన నొనర్చవలెను.

ఇట్లే వేద మంత్రములు ఆత్మ పరమాత్మ ప్రకృతుల విభేదములను గురించి స్పష్టమగు శబ్దములలో ప్రతిపాదించు చున్నవి. వీని ద్వారా

**బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నా పరః॥**

అనగా; బ్రహ్మయే సత్యము జగత్తు మిథ్య, లేక అసత్యమైయున్నది. జీవుడే బ్రహ్మ. జీవ బ్రహ్మలు వేర్వేరుగాదు. అద్వైతవాదమూలమే ఎగిరిపోవుచున్నది. ఈ సిద్ధాంతము పైన దెలిపిన, మరియు ఇతర అనేక వేద మంత్రముల శిక్షణకు సంపూర్ణముగా విరుద్ధమే యని వేరుగా చెప్పుటవసరమే లేదు. వాస్తవమునకు మహర్షి వేదవ్యాసులు రచించిన వేదాంతదర్శనమునందలి '**నేతరోఽనుపపత్తేః** ౧-౧-౧౬, **భేదవ్యపదేశాచ్చ** ౧-౧-౧౭, **భేదవ్యపదేశాచ్చాన్యః** ౧-౧-౨౧, **అధికం తు భేదవ్యపదేశాత్** ౨-౧-౨౨, **శారీరశ్చోభయేఽపి భేదేనైన మధీయతే** ౧-౨-౨౦, మున్నగు సూత్రములు జీవబ్రహ్మలు వేర్వేరని స్పష్టముగా నిరూపించుచున్నవి.

'ఈ జగత్పదార్థములు వాస్తవముగా మనకు కాన్పించుచున్నవి గదాయని చెప్పబడుచున్నను, ఇదియంతయు, మాయ, మరియు అవిద్యకారణమేగాని యథార్థముగా ఇవి సత్యములుగావు' అని వాదించినను ఈ వాదము కూడా వేద శిక్షణకు సంపూర్ణముగా విరుద్ధమే. ఉదాహరణమునకీ దిగువ ఋగ్వేద మంత్రములను జూడుడు. ఇచ్చట పరమాత్మయే సత్యమని చూపుచు ఆయన కార్యములు కూడా సత్యమైనవే యని చెప్పబడినవి.

**ప్ర ఘా న్వస్య మహతో మహాని సత్యా సత్యస్య కరణాని వోచమ్** ॥ ఋ.౨-౧౫-౧॥

అనగా; (అస్య మహతః సత్యస్య) ఈ మహా సత్య స్వరూపుడగు పరమేశ్వరుని (కరణాని) కార్యములు కూడా (మహాని ఘ సత్యా) అతి గొప్ప సత్యములు. వీనిని నేను (ప్ర అనువోచమ్) అతి గంభీరముగా, స్పష్టముగా వేదములననుసరించి చెప్పగలను.

**సత్రా సోమా అభవన్నస్య విశ్వే సత్రా మదాసో బృహతో మదిష్ఠాః** ॥ ఋ.౪-౧౭-౬॥

(అస్య) ఈ పరమేశ్వరుని (విశ్వే సోమాః) సర్వ ఉత్పాదిత పదార్థములు (సత్రా అభవన్) సత్యములు, వాస్తవికములు (సత్రా ఇతి సత్యనామ నిఘం.౩-౧౦) (అస్య బృహతః) ఈ మహాన్ జగదీశ్వరుని (మదాసః) ఆనందము (మదిష్ఠాః) అత్యంతానందము, అధికమత్తును గలిగించునదియై యున్నది.

**'యచ్చికేత సత్యమిత్ తన్న మోఘం వసు స్పార్హముత జేతోత దాతా** ॥ ఋ.౧౦-౫౫-౬॥

ఆ పరమేశ్వరుడు (యత్) ఏ పదార్థ సమూహమును, లేక జగత్తును (చికేత) సంపూర్ణముగా యెరుగునో అది (సత్యమ్ ఇత్) సత్యమైన విషయమే. (న మోఘమ్) వ్యర్థము, లేక అసత్యము గాదు. ఆ పరమాత్మ (స్పార్హమ్ వసు) వాంఛనీయమగు ఉత్తమైశ్వర్యములను (జేతా ఉత దాతా) జయించువాడు, మరియు ఈయ గలవాడు. ఈ విధముగ నిచ్చట స్పష్టమగున దేమన, జగత్తును మిథ్య, మరియు అసత్యమని నమ్ము సిద్ధాంతము సంపూర్ణముగా వేద విరుద్ధమై యున్నది. యజుర్వేదమున;

**కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూర్యాథాతథ్యతోఽర్థాన్**

**వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః** ॥ యజు. ౪౦-౮॥

అట్టి సర్వజ్ఞుడు, మనస్సాక్షి, సర్వవ్యాపకుడు, స్వయంసిద్ధుడునగు పరమేశ్వరుడు (శాశ్వతీభ్యః) నిత్యములైన జీవరూప ప్రజలకొరకు (యాథాతథ్యతః) యథార్థ సత్యరూపమున (అర్థాన్ వ్యదధాత్) పదార్థముల నిర్మాణమొనర్చి వేదముల ద్వారా వాని యథార్థ రూపము నుపదేశించినాడు.

ఈ జగత్తు కేవలము సత్యమేగాక పరమేశ్వరునకు భిన్నమై యున్నది. ఈ విషయమును అనేక వేద మంత్రములు ధృవపరచుచున్నవి. ఈ ఋగ్వేద. ౧-౪-౧౪వ మంత్రమున;

**న యస్య ద్యావాపృథివీ అనువ్యచో న సిన్ధవో రజసో అన్తమానషుః।**

**నోత స్వవృష్టిం మదే అస్య యుధ్యత ఏకో అన్యచ్చకృషే విశ్వమానుషక్** ॥ ఋగ్వే.౧-౪-౧౪॥

ఈ మంత్రమందు 'పరమేశ్వరుని మహిమల హద్దుల నెవ్వరును పొందజాలరు. పృథివి, ఆకాశము, సముద్రములు, మరియు లోకలోకాంతరములన్నియును ఆయన మహిమల యొక్క ఒక్క అంశమును మాత్రమే మన యెదుట ప్రకటించగల' వని కలదు. చివరి చరణమందు 'ఆ పరమేశ్వరుడు (ఏకః) ఒక్కడే, ఆయన తన కన్న (అన్యత్) భిన్నమగు నీ (విశ్వమ్) జగమును (చక్రషే) నిర్మించును. ఐనను (ఆనుషక్) సర్వవ్యాపకుడగుటచే ఈ జగత్తు నందు సదా విద్యమానమై యుండును. ఆతడు లేని పదార్థమే లేదు. ఈ విధముగా ప్రపంచము పరమాత్మకన్న భిన్న సత్తాయని మంత్రమున ప్రతిపాదించబడియున్నది. ఇదే విధముగా నిమ్న మంత్రము గూడ జగత్తు బ్రహ్మకన్న భిన్నమేయని పరమేశ్వరుని జగత్కర్తయని బలపరచుచున్నది.

**ప్రాసావీద్ దేవః సవితా జగత్ పృథక్** ॥ ఋ.౧-౧౫౧-౧, సా.ఉ.౧౯-౫-౪॥

ఆ సవితా సర్వోత్పాదకుడగు పరమాత్మ (పృథక్ జగత్) ఆతనికి భిన్నముగా నున్న ఈ విశ్వమును (ప్రాసావీత్) సృష్టించినాడు. అని మంత్ర భావము.

'బ్రహ్మసత్యమ్ జగన్మిథ్యా' అను ఈ నవీన వేదాంతుల సిద్ధాంతము వేదానుకూలమైనది గాదని స్పష్టముగా చెప్పవచ్చును.

౧౩. యజు.౪౦-౧౫. మంత్రము యొక్క ఉత్తరార్థము కూడా జీవేశ్వరుల భిన్నత్వమును స్పష్టపరచినది.

**ఓ౩మ్ క్రతో స్మర క్లిబే స్మర కృత స్మర** ॥ య.౪౦-౧౫ ॥

హే (క్రతో) కర్మశీలుడవగు జీవా! నీవు (ఓ౩మ్ స్మర) ఓ౩మ్ పదవాచ్యుడు సర్వరక్షకుడగు పరమేశ్వరుని సదా స్మరించుచుండుము. (క్లిబేస్మర) నీ యొక్క దుర్బలత్వమును దూరమొనర్చుకొని బలప్రాప్తికై ఆ సర్వ శక్తిమంతుని స్మరించుము. మరియును (కృతం స్మర) నీవిదివరకు చేసిన కర్మలను తలచుకొనుము. దీనిచే ఆత్మ నిరీక్షణ మొనర్చుకొనుము నీవు ఉన్నతినందుచు పొమ్ము. అని ఆత్మ, పరమాత్మల సంబంధము ఉపాస్య ఉపాసకులుగా చూపబడినది.

౧౪. దిగువ మంత్రము లో జీవేశ్వర భేదము స్పష్టముగా గలదు.

**'వయం ఘా తే అపి ష్మసి స్తోతార ఇన్ద్ర గిర్వణః।**

**త్వం నో జిన్వ సోమపాః** ॥ ఋ. ౮-౩౨-౭, సామ. పూర్వార్చిక ౨-౧౨-౮॥

(గిర్వణ ఇన్ద్ర) వాణి ద్వారా సేవించదగిన హే పరమేశ్వరా (వయమ్) మేము (స్తోతారః) స్తుతియొనర్చు భక్తులము (అపి) కూడా (తే స్మసి) నీవారమే (సోమపాః) మా భక్తి రసమును ప్రేమతో పానమొనర్చు (త్వమ్) నీవు (నః) మమ్ము (జిన్వ) తృప్తి పరచుము. ఇచ్చట పరమాత్మను స్వామి, ఆధారభూతుడని, జీవు లాతని సేవకులు, తదాశ్రితులని విశదపరచబడినది.

ఇదే విధముగా వందలకొలది మంత్రములను జీవేశ్వర ప్రకృతి భేద సూచకములను ఉద్ధృతమొనర్చవచ్చును. కాని గ్రంథ విస్తరణ భీతిచే సాహసింపకున్నాము.

౧౫. ఈ దిగువ అథర్వ వేద మంత్రము బ్రహ్మ, జీవుడు, ప్రకృతి యొక్క భిన్న భిన్న సత్తాలను గురించి కావ్యమయ భాషయందు ప్రతిపాదించుచున్నది.

**బాలాదేకమణీయస్కం ఉతైకం నేవ దృశ్యతే।**

**తతః పరిష్వజీయసీ దేవతా సా మమ ప్రియా ॥** అథర్వ. ౧౦-౮-౨౫॥

మూడనాది పదార్థములు గలవు. వానిలో ( ఏకమ్) ఒకటి జీవుడు ( బాలాత్ అణీయస్కమ్) వెంట్రుకకన్నను సూక్ష్మమైయున్నది. ( ఉత) మరియు ( ఏకమ్) ఒకటి ప్రకృతి రూపనిత్య పదార్థము ( న ఇవ దృశ్యతే) అవ్యక్తము, మరియు సూక్ష్మమగుటచే మన కన్నులకు గాన్పించదు. ఈ రెండింటిని కూడ అంతర్యామి రూపమున ( పరిష్వజీయసీ) ఆలింగనమొనర్చు కొనియున్న ( దేవతా) ఏ దేవత గలదో ( సా మమ ప్రియా) అదే పరమేశ్వర రూప దేవత నాకు అన్నిటికన్న ప్రియమైయున్నది. ఈ విధముగా బ్రహ్మ, జీవుడు, ప్రకృతుల భిన్నత్వనిర్దేశము స్పష్టముగా ఈ మంత్రమున గలదు.

### 4.3 । నాసదీయ సూక్తము అద్వైతవాదమును సమర్థించుచున్నదా?

ఋగ్వేద చివరి మండల సూక్తములందు విశేషించి నాసదీయ సూక్తము. ఋ.౧౦-౧౨౯ లో అద్వైతవాద ప్రతిపాదన గలదని ఈ యద్వైతవాదమును సమర్థించు కొందరు విద్వాంసు లందురు. ప్రొ. మైక్స్‌ముాలర్ *Six Systems of Philosophy* యందు ఈ సూక్తమును నిర్దేశ మొనర్చుచు ఇట్లు వ్రాసినాడు.

Monotheism and Monism - All these tendencies worked together in one direction and made some of the Vedic poets see more or less distinctly that the idea of God if once clearly perceived, included the ideas of being One and without an equal. They thus arrived at the conviction that above the great multitude of gods, there must be one Supreme Personality and after a time they declared that there was behind all the gods that One (Tad Ekam) of which the gods were but various names.

- Indian Philosophy by Prof. Max Muller Vol.-I p.39.

దీని సారాంశమేమన; ఈ ప్రవృత్తులన్నియును గలిసి ఒక దిశ యందు కార్యమునొనర్చినవి. అనేక వైదిక ఋషులకు 'ఈశ్వర విషయక ఆలోచనలు స్పష్టపడినచో దానియందు ఈశ్వరుడొకడు అనుపముడు అను భావము సమావిష్టమగు' నను విషయము స్పష్టముగా అనుభూతిని గలిగించినవి. కావుననే వారొక పరిణామమును స్థిరపరచికొనినారు. అదియే అనేక దేవతలపై మరొక దేవాధిదేవుడుండు ననునది. కొంత కాలము తరువాత సకల దేవతల వెనుక ఒక సత్ ( సత్యము) గలదని వారు ప్రకటించిరి. అదియే 'తదేకమ్' అనియనబడినది. సకల దేవతలు ఆ యొకే బ్రహ్మకు వేర్వేరు నామములై యున్నవన్నారు. ఇందుకు

ప్రొ. మైక్స్ మూలర్ ఋ.౧-౧౬౪-౪౬ మంత్రమగు '**ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః**' ను ఉదాహరించుచు దాని యనువాదమునిట్లు ఒనర్చినాడు.

The sages call that one in many ways; they call it Agni, Yama, Matarishva.

అనగా; జ్ఞానులు ఆయననొక్కనినే అనేక విధములుగా బిలుచుచుందురు. ఆతనినే వారు అగ్ని, యమ, మాతరిశ్వా మున్నగు నామములచే ధ్యానించెదరు. దీని తరువాత నాసదీయ సూక్తము, ౨వ మంత్రము యొక్క '**ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరఃకించనాస**' ఈ భాగము నుదాహరించి దాని యర్థము.

*That One breathed breathlessly by itself* మ్యాక్స్ మూలర్ చెప్పుటే ఇట్లు గలదు. *other than it, there nothing since has been* ÍxÔMy|*The former thought led by itself to a monotheistic religion, the letter as we shall see, to a monistic philosophy.*

*(Indian Philosophy Vol.I. P.40)*

పూర్వము స్థిరపరచిన ఆలోచనల ద్వారా ఏకేశ్వరవాద మారంభమైనది మరియు నాసదీయ సూక్తము నందీయబడిన ఆలోచనల ద్వారా అద్వైతవాదము ప్రారంభమైనదని మనము చూడగలము. *Vedic Age* నందును *Religion and Philosophy* శీర్షికయందలి ౧౮వ అధ్యాయములో ఈయాలోచనలే ప్రకటించబడియున్నవి. అనగా;

It has been generally held that the Rigvedic religion is essentially a polytheistic one, taking on a pantheistic colouring only in a few of its latest hymns. - Vedic Age. P.378

అనగా; బహుశః ఋగ్వేదీయ ధర్మము అనేకేశ్వరవాదముతో గూడియున్నదనీ, ఇది వెనుకటి కొన్ని సూక్తములందు అద్వైతవాద వర్ణము (రంగు)ను పులుముకొన్నదని యెంచబడుచున్నది. అనేక విద్వాంసుల అభిప్రాయము కూడ ఇదే విధముగ నున్నది. కావున దీనిపై సంక్షేపముగా కొంత తెలియపరచుట ఆవశ్యకమనిపించుచున్నది. ఋగ్వేదము. (౧౦-౧౨౯) నాసదీయ సూక్తము నందలి మంత్రముల నన్నింటిని ధ్యానపూర్వకముగా అనేక సార్లు చదివిన తరువాత దీనియందు అద్వైతవాద ప్రతిపాదనము లేదను నిర్ణయమునకు వచ్చినాము. మీదు మిక్కిలి కర్మ ఫలదాతయగు బ్రహ్మ, అనేక కర్మఫల భోక్తయగు జీవుడు, 'స్వధా' యను పేరుతో ప్రకృతి వీటి యొక్క సత్తాలు స్పష్టముగా నిర్దేశించబడియున్నవి. ఉదాహరణకు రెండవమంత్రమందు బ్రహ్మ నిర్దేశము '**ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించనాస**' అని ఈ మంత్రము, మరియు ఇతర అనేక మంత్రములందును చేయబడినది. ఆ ఒక్కడేయగు పరబ్రహ్మ ప్రళయావస్థయందు సృష్టికి పూర్వమునందు కూడా స్వధాతో గూడ విద్యమానమై యుండెను. ఇంతకన్న ఉత్కృష్టమేదియు లేకుండెను. ఇచ్చట స్వధా మరియు '**తస్మాత్ హ అన్యత్ న పరః కించన ఆస**' అను నీ శబ్దములపై ధ్యానము నీయవలసియున్నది. ఈ 'స్వధా' యను శబ్దమే ఈ సూక్తములోని ఐదవ మంత్రమందును వచ్చినది.

**తిరశ్చీనో వితతో రశ్మిరేషామ్ అధః స్విదాసీ౩దుపరి స్విదాసీ౩త్।**

**రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్ ॥**

ఆ బ్రహ్మయొక్కడే స్వధాతో గూడ విద్యమానమై యుండెనని రెండవ మంత్రమందు చెప్పబడినది. గట్టిపట్టుదల గల అద్వైతవాది, సుప్రసిద్ధ, భాష్యకారుడగు సాయణాచార్యుడు ఈ 'స్వధా' శబ్దమునకు తన వేద భాష్యమునందు అర్థము నిట్లు వ్రాసియున్నాడు.

**స్వస్మిన్ ధీయతే ధ్రియతే – ఆశ్రిత్య వర్తత ఇతి స్వధా మాయా తయా తద్**

**బ్రహ్మ ఏకమ్ అవిభాగాపన్నమాసీత్ సహయుక్తే ప్రధాన ఇతి తృతీయా**

**సహశబ్దయోగాభావేఽపి సహార్థయోగే భవతి అత్ర ప్రకృతి ప్రత్యయాభ్యాం**

**తస్యాః స్వాతన్త్ర్యం నివార్యతే॥ (సాయణాచార్యకృతే ౧౦-౧౨౯-౨ భాష్యే)**

అనగా; 'స్వధా' యను శబ్దమున కిచ్చుట స్వస్మిన్ ధీయతే - ధ్రియతే - ఆశ్రిత్య వర్తతే అను వ్యుత్పత్తుల ద్వారా 'మాయ' కలదు. బ్రహ్మ ఆ మాయతో అవిభక్తమైనట్లుండెను.

'మాయ' శబ్దము యొక్క అర్థము **'మాయాం తు ప్రకృతిం విద్యాత్'** (శ్వేతాశ్వతరోపనిషత్తు ౪-౧౦)ననుసరించి ప్రకృతి యగును. కావున బ్రహ్మతో గూడా ప్రకృతి సత్తా కూడా ఇచ్చుట స్పష్టముగా నున్నది. ఆ చేతన బ్రహ్మ లేకుండా స్వయముగా ప్రకృతి కార్యముల నొనర్చుటయం దసమర్థత గలది. కావున దాని స్వతంత్రతను నిషేధ రూపమున నెంచుటయం దే మాత్రమును హానియుండదు. అది అచేతనము, కావుననే బ్రహ్మనాశ్రయించి యుండును. ఐనను ఈ నాసదీయ సూక్తము ద్వారా కూడా దాని సత్తాను నిరాకరించుట అసంభవము. 'ఋగ్వేద సంహితోపనిషచ్ఛతకము యొక్క లేఖకుడు శ్రీ స్వామీ మహేశ్వరానంద మండలేశ్వరులు (గిరీశానందాశ్రమసురతగిరి బంగలాకనఖల) గారు గట్టి పట్టుదల గల అద్వైతవాది. వేదములందద్వైతవాదమును సమర్థించుట కొరకే ఆతడు యీ **'శుక్ల యజుర్వేద సంహితోపనిషచ్ఛతకమ్,** మరియు అథర్వ వేద **సంహితోపనిషచ్ఛతకమ్'** అను గ్రంథములను వ్రాసినాడు. ఈ మంత్ర వ్యాఖ్యనొనర్చుచు పైన సూచించిన సాయణ భాష్యము నుదహరించుచు ఆయన టిప్పణినిట్లు వ్రాసినాడు.

**అత్ర స్వధేత్యనేన సహార్థతృతీయయా చ మాయయా ఈశ్వరానాశ్రితత్వమ్**

**ఈశ్వరేక్షణానపేక్షత్వం చ సాంఖ్యోక్తం స్వాతన్త్ర్యం వార్యతే॥**

(ఋగ్వేద సంహితోపనిషచ్ఛతకం, స్వామి మహేశ్వరానందకృత వివృతి సమలంకృతం పు.౨౪౪)

అనగా; స్వధా, మరియు దానితో తృతీయ ప్రయోగముచే మాయా (ప్రకృతి) ఈశ్వరు నాశ్రయమున లేకుండుట, మరియు ఈశ్వరుని ద్వారా 'ఈక్షణము' యొక్క అవసరము లేకుండుటయను వాని చేత ఈ సాంఖ్యోక్త స్వతంత్రత నిషేధించబడినది.

పై దృష్టితో ప్రకృతి యొక్క స్వాతంత్ర్య నిషేధము అంగీకరించుటచే మాకే విధమగు అభ్యంతరము లేదు. కాని దాని సత్తాను నిషేధమొనర్చజాలము. జీవాత్మల సత్తా కూడా ఐదవ మంత్రమున జూపిన 'రేతోధాః' శబ్దముచే స్పష్టముగా ధృవపడుచున్నది. ఈ శబ్దమునకు సాయణాచార్యుడీ దిగువ రీతిలో అర్థము చేసియున్నాడు.

**రేతోధాః – రేతసో బీజభూతస్య కర్మణో విధాతారః కర్తారో భోక్తారశ్చ జీవాః॥**

అనగా బీజభూత కర్మల (సృష్టియందు వీని ద్వారా పునః జన్మనెత్తుట ఆవశ్యకమైపోవుచున్నది) నొనర్చువారు, మరియు కర్మ ఫల భోగముల ననుభవించు జీవులు, ఇట్టి అనేక జీవుల సత్తాను **'రేతోధా ఆసన్'** అనగా సృష్టి నిర్మాణమునకు పూర్వావస్థ యందును బీజ భూత కర్మలనొనర్చు, మరియు కర్మ ఫలభోగముల ననుభవించు జీవులు విద్యమానమై యుండిరని ఈ యైదవ మంత్రమున చెప్పబడినది. కావున వానిని నిరాకరించుటయు అసంభవమే. ప్రయత్నశీలుడగు కారణమున జీవుని మాత్రమే 'ప్రయతిః' అను పేరుతో చెప్పబడినది. అనగా ప్రకృతి (దీనిని మాయయను పేరుతో కూడా చెప్పబడినది) చేతనుడగు కారణమున ప్రయత్నశీలుడగు జీవుడు శ్రేష్ఠుడై యున్నాడు. ఈ భావము **'స్వధా' అవస్తాత్ ప్రయతిః పరస్తాత్।** (మం.౫) అను శబ్దముల ద్వారా ప్రకటించబడినది. దీనియర్థమును సాయణాచార్యుడు **''తత్ర చ భోక్తృభోగ్యయోర్మధ్యే (స్వధా) అన్ననామైతత్ భోగ్యప్రపంచః (అవస్తాత్) అవరః నికృష్టః ఆసీత్ (ప్రయతిః) ప్రయతీతా భోక్తా (పరస్తాత్) పరః ఉత్కృష్టః ఆసీత్।''** ఈ శబ్దములలో చేసియున్నాడు. 'స్వధా' శబ్దమునకు అన్నమను అర్థమును దీసికొని దాని తాత్పర్యము భోగ్యప్రపంచమని జేసియున్నాడు. మరియునది క్రిందయున్నదనియు, ప్రయత్నమొనర్చు, మరియు కర్మఫలమనుభవించు జీవుడు దాని (ప్రకృతి) కన్న ఉత్కృష్టుడని అభిప్రాయము వ్యక్త పరచినాడు.

ఈ విధముగా ఈ సూక్తమునందు అనేక మంత్రములలో బ్రహ్మయే గాక 'స్వధా' పేరుతో ప్రకృతి, మరియు 'రేతోధాః' యను నామమున అనేక జీవాత్మల సత్తా స్పష్టముగా ప్రమాణిత మగుచున్నది. స్వ. మహేశ్వరానంద మండలేశ్వరులును 'ఋగ్వేద సంహితోపనిషచ్ఛతకమ్' యొక్క వివరణమున శ్రీ సాయణాచార్యుల భాష్యమునే ఉదాహరించుచు **'రేతోధాః - జీవభూతస్య కర్మణో - విధాతారః- కర్తారో భోక్తారశ్చ జీవాః ఆసన్'** అని పు.౨౫౭ లో వ్రాసినాడు. **'స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్'** అనుదానికి సాయణాచార్యుని భాష్యము యొక్క అర్థమునే చేసినాడు. రెండవ అర్థము పు. ౨౬౦లో దిగువ శబ్దములలో పరమేశ్వర పరముగా జేసియున్నాడు.

**ఏవం స్వధాశబ్ద వాచ్య మాయాఽవిద్యాది శబ్దేనాభిధీయమానా పరమేశ్వరీ శక్తిః, అవస్తాత్ - అధమం నికృష్టం కల్పితత్వాత్ పరిణామ్యుపాదానకారణమ్। (ప్రయతిః) సా శక్తిః ప్రయతతే యస్మిన్ పరమాత్మని - యమాశ్రిత్య సోఽయంశక్తి ప్రయత్నాధారః పరమాత్మా ప్రయతిరిత్యర్థః।**

**(పరస్తాత్) సర్వోత్తమః సర్వాధిష్ఠానః పరమార్థ సత్య ఆసీదిత్యర్థః** ॥ పు.౨౬౦॥

భావమేమన స్వధా శబ్దవాచ్యమైనదే అవిద్య మున్నగు నామములతో గూడా పిలువబడుచున్నది. అది పరమేశ్వరీయశక్తి, మరియు జగత్తున కుపాదాన కారణము. అది దిగువ స్థాయికి చెందినది. దానియాశ్రయమున నేయా(స్వధా) ప్రకృతి ప్రయత్నమొనర్చుచుండును. అట్టి శక్తిమరియు ప్రయత్నమునకు ఆధారభూతుడునగు పరమాత్మయే సర్వోత్కృష్టుడు. ఆయన సదా నిర్వికారుడగు కారణమున పరమార్థసత్యమైయున్నాడు.

ఈ విధముగా బ్రహ్మ, జీవుడు, మరియు ప్రకృతుల సత్తాను గూర్చి ఈనాసదీయ సూక్తమునందు స్పష్టముగా వర్ణనయుండుటచే దీనిని 'అద్వైతవాద ప్రతిపాదక' మని తలచుట పొరపాటు. ఈ పొరపాటున కొక ముఖ్య కారణము - **'తస్మాద్ధాన్యన్న పరః కించనాస'** (రెండవ మండలము) యొక్క అర్థమును చక్కగా దెలిసికొనకుండుటయే. ఇచ్చటవచ్చిన 'పరః' శబ్దము యొక్క అర్థముపై తప్పుగా 'ఆ బ్రహ్మకన్న వేరేమియు

లేకుండెను' అని అర్థము చేయబడినది. (ప్రొ.మైక్స్ మూలర్ కూడా *'Other than it, there nothing since has been'* అను అర్థమునే జేసినాడు. 'ఆ (బ్రహ్మ కన్న వేరేమియును లేకుండెను, లేదు కూడాను' అనునది అశుద్ధమే. ఇచ్చట పరశబ్దము లేదు కాని 'పరస్'సకారాంత శబ్దము గలదు. అది పరస్తాత్ లేక ఉత్కృష్టత వాచకమగును.కావుననే దీనియర్థము (తస్మాత్) ఆ (బ్రహ్మకన్న (పరః) ఉత్కృష్టమైనది (అన్యత్ హ) నిశ్చయముగా (కించన న ఆస) ఏమియును లేకుండెను. సాయణాచార్యుడు ఇచ్చట **'తస్మాత్ ఖలు పూర్వోక్తాన్మాయసహితాద్ (బ్రహ్మణః (అన్యత్ కించన) కిమపి వస్తు భూతభౌతికాత్మక జగత్ (న ఆస) న బభూవ (పరః) పరస్తాత్ సృష్టేః ఊర్ధ్వం వర్తమానమ్ ఇదం జగత్ తదానీం న బభూవేత్యర్థః॥**

అనగా; సృష్టి నిర్మాణమైన పిదపనేర్పైన ఈ జగత్తు అప్పుడు లేకుండెను. అను అర్థమును స్వ. మహేశ్వరానంద మండలేశ్వరుడొనర్చినాడు. తరువాత (పరః) ఉత్కృష్టమ్, (నాస)నైవాసీత్' అనగా దానికన్న ఉత్కృష్టమైన దేదియు లేకుండెనని కూడా అర్థము (వ్రాసినాడు.

పరమాత్మ కన్న మిన్న ఏదియును లేకుండెను. ఇప్పుడును లేదు అనునది యే వాస్తవికార్థమైయున్నది. దీనిచే 'స్వధాపదవాచ్య (ప్రకృతి, మరియు 'రేతోధాః' పదవాచ్య జీవాత్మల సత్తా నిషేధింపబడదు. దీనిపై కూడా (శ్రీ మహేశ్వరానందులు అద్వైతవాద పట్టుదలతో **'తస్మాదుత్కృష్టం నికృష్టం చ కిమపి (బ్రహ్మవ్యతిరిక్తం తదా నాసీదితి'** ॥పు.౨౪౫॥ అను అర్థమునొనర్చినాడు. అనగా అప్పుడు (బ్రహ్మకన్న అతిరిక్తముగాని, ఉత్కృష్టముగాని, నికృష్టముగాని ఏదియును లేకుండెను అని. కాని యిదిమాన్యత గలది గాజాలదు. ఏలన; సూక్తమునందలి మంత్రములలో (బ్రహ్మయేగాక (ప్రకృతి, మరియు జీవాత్మల సత్తాను గూర్చి అతిస్పష్టమగు నిర్దేశము మహేశ్వరానందుల వ్యాఖ్యానానుసారము గూడా నున్నది. ఐనను నాతడు; **'ఆనీదవాతం స్వధయా తదేకమ్'** యొక్క వ్యాఖ్యయందు (స్వధా) (ప్రకృతి సహితమగు (బ్రహ్మను చూపియు **'ఏవం స్వధాసాహిత్యోక్తిరపి వ్యవహారతో న పరమార్థతః॥'** అని ముందర (వ్రాసికొనినాడు.

అనగా; స్వధా, లేక (ప్రకృతి (బ్రహ్మ సత్తాను గూర్చిన మంత్రమందు గల (ప్రతిపాదన వ్యావహారికమే గాని వాస్తవికముగాదు. వారి యీ నిరాధారమగు కల్పనను మన మంగీకరించజాలము. ఏలన; ఇది మంత్రోక్త తాత్పర్యమునకు సంపూర్ణముగా విరుద్ధమైయున్నది. పరమాత్మ వంటిది లేక ఉత్కృష్టమనునదే నిషేధించదగిన విషయము. ఈ దిగువ మంత్రములందుపదేశించిన విధముగా;

**న కిరిన్ద్ర త్వదుత్తరో న జ్యాయో అస్తి వృత్రహన్। న కిరేవం యథా త్వమ్'** ॥ఋ.౪-30-౧॥

**నత్వావాం అన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే** ॥ఋ.౭-3౨-౨3॥

**న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమన్తమాప।**

**ఉదస్తభ్నా నాకమృష్వం బృహన్తం దాధర్థ పృథివీమభితో మయూఖైః** ॥ఋ.౭-౯౯-౨॥

మున్నగు మంత్రములందు (౧) హే పరమేశ్వరా! నీకన్న గొప్పవాడు గాని, ఉత్కృష్టమైనవాడు గాని, నీకు సాటియైనవాడుగాని ఇతరు లెవ్వరును లేరు. (౨) హే పరమేశ్వర! (త్వావాన్) నీవంటివాడు (అన్యః) ఏ యితరమైన (న దివ్యః న పార్థివః) దివ్య మరియు పార్థివ (ప్రాణులు లేవు, ఉండబోవు' అని చూపబడియున్నది.

ఈ విధమగు నిషేధము వల్ల బ్రహ్మ కన్న అతిరిక్తమైన దేదియును లేదు. ఇంతేగాక ఆయనకు సాటియైనది లేక ఆతనికన్న ఉత్కృష్టమైన దేదియును లేదు. అను నదియును సిద్ధించదు. ఇందువల్ల బ్రహ్మ యొక్క అనుపమానత్వ ప్రతిపాదన మగును గాని అద్వైత వాదము మాత్రము గాజాలదు. ఆతని కన్నను జ్ఞానము, శక్తి, పరిమాణములందు అల్పముగా నెంచికొని ఆత్మల పక్షమునుండి చేసిన ప్రార్థనలు వేదములం దనేకము గాంచనగును. ఉదా:- ఋగ్వేద సామవేదమందలి ఈ మంత్రములు

**తం త్వా గృణామి తవసమతవ్యాన్ క్షయన్తమస్య రజసః పరాకే॥**

(ఋగ్వేద ౭-౧౦౦-౫, సామ. మంత్ర సం.౧౬౨౬)

అనూ; (అతవ్యాన్) అల్పము (తవసం త్వా గృణామి) మహా గొప్పవాడవును అగు నీ స్తుతి యొనర్తుము. (అస్య రజసః పరాకే క్షయన్తమ్) ఆయన ఈ విశ్వమున కావలను సంపూర్ణముగా స్థితమైయున్నాడు.

**అభీ షతస్తదాభరేన్ద్ర జ్యాయః కనీయసః।**

**పురూవసుర్హి మఘవన్సనాదసి భరే భరే చ హవ్యః॥'** (ఋగ్వేద. ౭-౩౨-౨౪, సామ. మంత్ర సంఖ్య ౩౦౯)

అనూ; (ఇన్ద్ర) హే పరమేశ్వరా! (జ్యాయః) గొప్పవాడవగు నీవు (కనీయసః అభీషతః ఆభర) అల్పులమగు మేము నీ శరణమునకు వచ్చియున్న మాకు అన్నివైపుల నుండి జ్ఞానము మరియు శాంతిని ప్రాప్తింపజేయుము. (మఘవన్) జ్ఞానధన సంపన్నుడ వగు నీవు (పురూవసుః) అపరిమితైశ్వర్యవంతుడవు (హి) నిశ్చయముగా (సనాత్ అసి) సనాతనుడవు, నిత్యుడవునైయున్నావు. (భరే భరే చ) ప్రతి యజ్ఞములందును, సంగ్రామములందును నీవు మాత్రమే (హవ్యః) పూజనీయుడవు, మరియు ఆహ్వానించుకొనదగినవాడవు.

ఈ మంత్రములందీ విధముగా పరమేశ్వరుని గొప్పగా (తవస ఇతి మహన్నామ నిఘంటువు 3-3) తనను (అతవ్యాన్) అల్పునిగా, పరమేశ్వరుని (జ్యాయః) మహనీయునిగా, మరియు జీవాత్మలను (కనీయసః) అల్పజ్ఞులుగా జూపుచు జీవేశ్వర భేదము స్పష్టముగా ప్రతిపాదితమొనర్చబడినది. దీనిని నిరాకరించుట వేదములనుండి సంపూర్ణముగా అనభిజ్ఞత్వమే సూచితమగును. ఈ విధమగు వివేచనము వల్ల నాసదీయ సూక్తము (ఋ.౧౦-౧౨౯) మరియు ఇతర వేదమంత్రములచే అద్వైతవాదము సిద్ధి గాజాలదు. కాని బ్రహ్మ, జీవాత్మ, ప్రకృతులను నీ మూడనాది పదార్థముల సత్తా మాత్రమే సిద్ధియగును. గ్రంథవిస్తరణ భీతిచే ఈ ప్రకరణాధ్యాయము లిచ్చటనే పరిసమాప్తమొనర్చబడును. ఈ యధ్యాయమందు వైదిక దేవతల స్వరూపమును ప్రకాశపరచుచు మధ్యకాలీన, పౌరాణిక భాష్యకారుల, పాశ్చాత్య విద్వాంసుల మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసుల భ్రాంతులను ప్రమాణ సహితముగా త్రోసిపుచ్చుచు వైదిక ఏకేశ్వర వాదము ప్రతిపాదింపబడినది.



# వేదముల యథార్థ స్వరూపము

## పంచమాధ్యాయము

### 5.1 వైదిక యజ్ఞ విషయక భ్రాంతి నివారణము

యజ్ఞము వైదిక ధర్మమునం దొక అత్యావశ్యక తత్త్వమనుటయం దేమాత్రము సందేహము లేదు. యజ్ఞ మహత్త్వమును గూర్చి వేదములం దనేక స్థలములలో స్పష్టముగా చెప్పబడియున్నది. యజ్ఞముల ద్వారానే ఈశ్వరపూజ, మరియు మోక్ష ప్రాప్తి విధాన మేర్పరచబడియున్నది.

**యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్।**

**తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః** ॥ ఋ.౧౦-౯౦-౧౬ ॥

సత్యనిష్ఠగల విద్వాంసులు యజ్ఞముల ద్వారానే పూజనీయుడగు పరమేశ్వరుని పూజయొనర్తురు. యజ్ఞములందు సమస్త శ్రేష్ఠ ధర్మములు సమకూడును. అట్టి యజ్ఞముల ద్వారా ఈశ్వర పూజ యొనర్చు మహాపురుషులు దుఃఖరహితమగు మోక్షమును పొందుదురు. యజ్ఞములందు అనేక జ్ఞానులు, విద్వాంసులు సమావేశ మగుదురు. అనేక వేదమంత్రముల చర్చలు విను నవకాశము లభ్యమగును. యజ్ఞ శబ్దము 'యజ్' అను ధాతువుచే నేర్పడును. దానికి దేవపూజ, సంగతీకరణము, దానము అను నీ మూడర్థములు ధాతు పాఠమునందు వర్ణించబడియున్నవి. మన సకల కర్తవ్యములు దీనియందే కూడియున్నవి. కావుననే పైనుదాహరించిన మంత్రమందలి మొదటి చరణమునందు 'యజ్ఞేన' అను ఏకవచన ప్రయోగ మొనర్చియును **'తాని ధర్మాణి ప్రథమాన్యాసన్'** అను బహు వచన రూప ప్రయోగమొనర్చబడి యున్నది. ఇందు ముఖ్యముగా మానవుల మూడు కర్తవ్యములు గలవు. (౧) తనకన్న పెద్దవారి యెడ (౨) దాదాపు సమానవయస్కుల యెడ (3) తనకన్న చిన్నవారి యెడ దేవపూజ, సంగతీకరణము, దానముల ద్వారా ఈ మూడు కర్తవ్యముల నిర్దేశము స్పష్టముగా గలదు. కావుననే **'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ'** (శత.బ్రా. ౧-౭-3-౫) **'యజ్ఞో హి శ్రేష్ఠతమం కర్మ'** (తైత్తిరీయ సంహిత 3-౨-౧-౪) మున్నగు వాక్యములు పురాతన సాహిత్యమందు చూడనగును. వీనియందు యజ్ఞములు శ్రేష్ఠతమకర్మలని యుపదేశించబడి యున్నది. యజ్ఞము నొనర్చనివారి కెంతటి దుర్గతి గలుగునో, ఏ విధముగా వారు పతనమగుదురో ఋగ్వేద. ౧౦-౪౪-౬, అథర్వ. ౨౦-౯౪-౬ మంత్రముల ద్వారా చూపబడియున్నది.

**న యే శేకుర్యజ్ఞియాం నావమారుహం ఈర్మైవ తే న్యవిశన్త కేపయః॥**

అనగా; (యే) ఎవరు (యజ్ఞియాం నావమ్ ఆరుహమ్ న శేకుః) యజ్ఞమను నౌకపై నారోహించు సమర్థులుగారో (తే) వారు (కేపయః) కుత్సిత, అపవిత్రాచరణ గలవారై (ఈర్మా ఏవ) ఇచ్చటనే, ఈ లోకమందే (న్యవిశన్త) అధః పతనమైపోవుదురు.

మహాదుఃఖకర విషయమేమనగా; వేదములందే యజ్ఞముల మహిమ ఇంతగా వర్ణించబడియున్నదో, ఏ

యజ్ఞములు పరమేశ్వర పూజ మరియు నాతని ప్రాప్తికి సాధనము అని చూపబడినవో అట్టి యజ్ఞముల విషయములో మధ్యకాలీన ఆచార్యులు, పాశ్చాత్య విద్వాంసులు మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసులు కడు అశుద్ధము, ఏహ్యమగు భావమును ప్రకటించియున్నారు. దానిని చదివిన ఆలోచనాపరు లెల్లరును లజ్జితులుగాకుండ నుండజాలరు. ఇంతటితో ఊరుకొనక ఈ పైశాచికతత్త్వము గల విద్వాంసులు వైదిక యజ్ఞములందు గొఱ్ఱెలను, మేకలను, ఎద్దులను, గోవులను, గుఱ్ఱములను బలియొనర్చు విధానము గలదని తమ గ్రంథములందనేక స్థానములందు వ్రాసియున్నారు. గత అధ్యాయమునందు మేము ఏ ***Vedic Age*** నామక పుస్తక వివేచన మొనర్చియుంటిమో అందులో కూడా ఈ విషయమున గొప్ప భ్రాంతితో గూడిన ధారణలు అనేకములు గలవు. 'ఆప్రీ' సూక్తముల విషయమున లేఖకు డిట్లు వ్రాసినాడు.

***Scarcely less debased than the Danastutis are the Apri hymns, manufactured artificially for employment in animal sacrifices..... There is no reason to doubt that these hymns were actually used at the animal sacrifices as tradition maintains.***

*The Vedic Age. P. 348*

అనగా; 'ఆప్రీ సూక్తము గూడా దానస్తుతులవలెనే అత్యన్త నిక్పష్టమైయున్నది. ఇది కృత్రిమ రూపములో పశుయజ్ఞములందు ఉపయోగము కొరకే వ్రాయబడినది... ఈ సూక్తముల ప్రయోగము పరంపరానుగత విశ్వాసముతో పశుహింసాత్మక యజ్ఞములందు ఒనర్చుటకొరకే యనుటలో ఏ మాత్రము సందేహము లేదు.'

ఈ లేఖకుడు మరొక చోట యజ్ఞముల విషయమున ఇట్లు వ్రాసియున్నాడు.

We need not discuss here at length the problem of the original theory of the sacrifice - whether the magic art of perpetuating the life of the herbs and of vegetation, and even of man, was the essence of the sacrifice, and whether the gift theory was original or secondary. We may only note that when the Kaushik Sutra (XIII, 1-6) Prescribes a magic rite in which portions of the bodies of some animals and human beings such as a lion, a tiger, a Kshatriya and a Brahmacharin are to be eaten to acquire certain qualities, not totemism but the conception of sacramental communion is hinted at (Vedic Age. P. 501).

ఈ విషయమునందు అధిక విస్తృత వివేచన మొనర్చవలెనన్న మరొక పెద్ద గ్రంథమే కావలసియుండును. కాని ఈ దిగువ నిర్ణయమే ఇట్టి భ్రాంతులను దొలగించుటలో సహాయపడగల దనుకొనుచున్నాము.

౧. వేదములన్నింటి యందును యజ్ఞములం దవసరమైనపుడు లేక అక్కడక్కడ విశేషణ రూపములో 'అధ్వర' శబ్ద ప్రయోగము అనేక స్థానములందు చూడగలము. దీని వ్యుత్పత్త్యర్థము నొనర్చుచు నిరుక్తకారులగు శ్రీ యాస్కాచార్యులిట్లు వ్రాసినారు.

**అధ్వర ఇతి యజ్ఞనామ - ధ్వరతిర్హింసా కర్మా తత్ప్రతిషేధః** ॥ నిరుక్తే ౨-౭ ॥

అధ్వర మనగా యజ్ఞము. అనగా హింసారహిత కర్మ. ఈ యధ్వర ప్రయోగములు చతుర్వేదములందనేకములున్నవి. ఈ దిగువ నిర్దేశములు చాలు ననుకొందుము.

ఋగ్వేదమునందలి కొన్ని మంత్రములు దిగువ నీయబడుచున్నవి. చూడుడు.

**౧. అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరి భూరసి। స ఇద్ దేవేషు గచ్ఛతి ॥** ఋ.౧-౧-౪॥

హే జ్ఞాన స్వరూపుడవగు పరమేశ్వరా! నీవు హింసారహిత యజ్ఞములందు మాత్రమే వ్యాప్తమగుదువు. ఇట్టి యజ్ఞములనే సత్య నిష్ఠ గల విద్వాంసులు సదా స్వీకరించుచుందురు అని దీని భావము స్పష్టముగా నున్నది.

**౨. రాజన్తమధ్వరాణాం గోపామృతస్య దీదివిమ్। వర్ధమానం స్వేదమే ॥** ఋ.౧-౧-౮॥

భావము :- ఇచ్చటయును పరమేశ్వరుని అధ్వరముల, అనగా సమస్త హింసారహిత కర్మలందు రాజమానుడు, లేక విరాజమానుడని చూపబడినది. ఇందువల్ల పశుహింసాత్మక కర్మల నిషేధము స్పష్టమేగదా!

**3. త్వం హోతా మనుర్హితోఽగ్నే యజ్ఞేషు సీదసి।**

**సేమం నో అధ్వరం యజ ॥** ఋ.౧-౧౪-౨౧॥

ఇచ్చట కూడా యజ్ఞము కొరకే అధ్వర శబ్ద ప్రయోగమున్నది. మరియు 'నీవు మాయీహింసారహిత యజ్ఞముల నిర్వర్తింపజేయు' మని 'హోతా' ద్వారా ప్రార్థించబడినది.

**౪. స సుక్రతుః పురోహితో దమే దమేఽగ్నిర్యజ్ఞస్యాధ్వరస్య చేతతి,**

**క్రత్వా యజ్ఞస్య చేతతి ॥** ఋ.౧-౧౨౮-౪॥

ఇచ్చట కూడా పరమేశ్వరుడు మరియు వేదవిదులైన పురోహితులు హింసారహిత యజ్ఞములనే మానవుల కుపదేశించినారని చూపబడినది.

**౫. ప్రతిత్యం చారుమధ్వరం గోపీథాయ ప్రహూయసే। మరుద్భిరగ్న ఆగహిః ॥** ఋ.౧-౧౯-౧॥

జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరుని, మరియు పురోహితుని 'అగ్ని' అను పేరుతో సంబోధించుచు 'చారు-సుందరము, హింసారహితము నగు ఈ యజ్ఞాది శుభకర్మలందు పాపములనుండి రక్షణకొరకు మేము మిమ్ము పిలుచుచున్నాము. విద్వాంసులగు, ఋత్విజులతో ప్రాణశక్తులతో గూడ మీరు ఇచ్చటికి దయచేయుడు' (అని పరమేశ్వర పరముగ హృదయ ప్రదేశమున)

**మరుత ఇతి ఋత్విజ్ నామసు ॥** నిఘ 3-౧౮ ॥

**ప్రాణావై మరుతః ॥** ఐత. 3-౧౬॥

ఇట్లే దిగువ ఋగ్వేద మంత్రములలో అధ్వర నామమున స్పష్టముగ యజ్ఞ ప్రతిపాదన గలదు. ఇది యజ్ఞమున హింసను నిషేధించును.

ఋ. ౩-౨౦-౧ లో అధ్వర అనగా హింసారహిత యజ్ఞమునే కోరుట గమనింపదగినది. మంత్రము యొక్క ఉత్తరార్థమును గాంచుడు-

**౬. సుజ్యోతిషో నః శృణ్వన్తు దేవాః సజోషసో అధ్వరం వావశానాః॥** ఋ.౫-౨౦-౧॥

అనగా; ఉత్తమ జ్ఞాన జ్యోతిచే సంపన్నమైన ప్రేమయుక్తము, అహింసాత్మక యజ్ఞములనే సదా కాంక్షించు దేవ సత్య నిష్ఠ గల విద్వాంసులు మా ప్రార్థనలను విందురుగాక.

**౭. అగ్న ఇలా సమిధ్యసే వీతిహోత్రో అమర్త్యః।**

**జుషస్వ సూ నో అధ్వరమ్** ॥ ఋ. ౩-౨౪-౨ ॥

ఇచ్చట అధ్వర శబ్దము హింసారహితకర్మయగు యజ్ఞము కొరకు ప్రయోగించుచు జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరుని ప్రేమతో స్వీకరించుమని కోరబడినది.

**౮. యస్య త్వమగ్నే అధ్వరం జుజోషో దేవో మర్తస్య సుధితం రరాణః।**

**ప్రీతేద సద్హోత్రా సా యవిష్ఠాసామ యస్య విధతో వృధాసః** ॥ ఋ.౪-౨-౧౦॥

అనగా జ్ఞాన స్వరూపుడవగు నో పరమేశ్వరా! ఎవని హింసారహిత యజ్ఞమును నీవు ప్రేమ పూర్వకముగా స్వీకరించెదవో, ఆతని వాణి గొప్ప ప్రేమ మరియు శక్తితో గూడిన దగును. ఇదే విధముగా సత్యమగు ఉపాసకుల సాంగత్యముననుండి మేము వృద్ధిని ప్రాప్తించుకొందుము గాక.

ఇదే విధముగా; ఋగ్వేదమందలి దిగువ మంత్రములందు, ఇంకా అనేక స్థలములందు 'అధ్వర' శబ్దప్రయోగము గలదు.

### 5.2 అధ్వర శబ్ద ప్రయోగము గల కొన్ని ఋగ్వేద మంత్రముల సంఖ్య

''౧-౨౬-౧; ౧-౪౪-౧౩; ౧-౭౪-౧; ౪; ౧-౬౩-౧౨; ౧-౧౦౧-౮; ౧-౧౩౫-౩; ౧-౧౫౧-౩-౭; ౨-౨-౫; ౩-౧౭-౫; ౩-౨౦-౧; ౩-౨౦-౫; ౩; ౫౪-౧౨; ౪-౯-౬; ౪-౧౫-౨; ౪-౩౭ ;౧; ౫-౪-౮; ౫-౨౬-౩; ౫-౨౮;౬; ౫-౪౪-౫; ౬-౨-౩; ౧౦-౬-౧౫; ౭; ౬-౧౬-౨; ౭-౩-౧; ౭ -౪-౧౬; ౮-౩-౫; ౭; ౮-౨-౧; ౮-౩౫-౨౩; ౮-౪౬-౧౮; ౮-౫౦-౫; ౧౦; ౮-౬౦-౨; ౮-౬౬-౧; ౮-౭౧-౧౨; ౮-౯౩; ౨౩;౯-౬౭-౧; ౮-౭౨-౫; ౮-౮౨-౩; ౮-౯౮-౩; ౮-౧౦౨-౬; ౮; ౧౦-౮-౩; ౮-౧౧-౪; ౮-౧౭-౭; ౮-౨౧-౬; ౮-౩౦-౧౫; ౪౦; ౨౦-౭౭-౮; ౧౦-౨౨-౭ మున్నగునవి.

### 5.3 యజుర్వేదమునందు యజ్ఞార్థము అధ్వరాది శబ్దములు

యజుర్వేదము నందును దిగువ సూచిత మరియు ఇతర అనేక మంత్రములందు యజ్ఞము కొరకు 'అధ్వర' శబ్దమేగాక దిగువ విధమగు ఉపదేశములు వచ్చియున్నవి. అవి పశువులు మున్నగు వాని హింసను గట్టిగా నిషేధించుచున్నవి.

**దృతే దృ్ంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని**

**సమీక్షన్తాం మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే**

**మిత్రస్య చక్షుషా సమీక్షామహే** ॥ యజుర్వేద. ౩౬-౧౮॥

అజ్ఞానాంధకార నాశకుడవునగు ఓ ప్రభువరా! సకల ప్రాణులు నన్ను మిత్ర దృష్టితో జూచును గాక. సర్వ ప్రాణులను (కేవలము మానవులనేగాదు) నేను మిత్రుని వలె ప్రేమమయ దృష్టితో జూతును గాక. మేమెల్లరమును పరస్పరము సదా మిత్ర దృష్టితోనే చూచుకొనెదము గాక.

యజు. ౧-౧ యందు యజ్ఞమును శ్రేష్ఠతమ కర్మయను పేరుతో సంబోధించుచు 'పశూన్ పాహి' పశువుల రక్షించుడని ఉపదేశించబడియున్నది. యజు.౬-౧౧లో పతీపత్నులకు (పశూన్త్రాయేథామ్) పశువులను రక్షించుమని ఉపదేశమైనది. య. ౧౪-౮, యందును ఇట్టి యుపదేశమే గలదు. **'ద్విపాదవ చతుష్పాత్ పాహి'** అనగా; ఓ మానవా! నీవు రెండు పాదములు గల మనుష్యాదులను, నాల్గు పాదములు గల పశ్వాదులను, పక్ష్యాదులను సదా ప్రేమతో రక్షించుచుండుము.

ఇదే విధముగా పశురక్షా ప్రతిపాదక, పశు హింసా నిషేధక మంత్రము లెన్నియో గలవు.

**''గాం మా హింసీరదితిం విరాజమ్''** ॥ య. ౧౩-౪౩ ॥

**''ఇమం మా హింసీర్ద్విపాదం పశుమ్''** ॥ య. ౧౩-౪౭॥

**''ఇమం మా హింసీరేక శఫం పశుం కనిక్రదం వాజినం వాజినేషు''** ॥ య.౧౩-౪౮॥

**''ఇమమూర్ణాయుం వరుణస్య నాభిం త్వచం పశూనాం ద్విపదాం చతుష్పదామ్ ।**

**త్వష్టుః ప్రజానాం పరమం జనిత్రమగ్నే మా హింసీః పరమే వ్యోమన్''** ॥ య.౧౩-౫౦॥

మున్నగు వందల కొలది మంత్రములు గొఱ్ఱెలు మేకలు, గోవులు అశ్వములు మున్నగు వాని హింసా నిషేధమును గూర్చి యున్నవి. అధ్వర శబ్దము యజ్ఞమునకు పర్యాయము, లేక విశేషణ రూపములో ప్రయోగించబడిన మంత్రములెన్నియో వేదములందు గలవు. వాని నుండి కొన్ని మాత్రమే ఇచట ఉదాహరించబడుచున్నది.

౧. **''భద్రో నో అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో అధ్వరః''** ॥

**భద్రా ఉత ప్రశస్తయః''** ॥ యజు.౧౫-౩౮॥

౨. **''వీతిహోత్రం త్వా కవే ద్యుమన్తం సమిధీమహి । అగ్నే బృహన్త మధ్వరే ''** ॥ య.౨-౪॥

3. **ఉప ప్రయన్తో అధ్వరం మన్త్రం వోచేమాగ్నయే ।**

**ఆరే అస్మే చ శృణ్వతే** ॥ యజు. 3-౧౧॥

౪. హవిష్మతీరిమా ఆపో హవిష్మాం ౨ఽ ఆ వివాసతి ।

హవిష్మాన్ దేవో అధ్వరో హవిష్మాం ౨ అస్తు సూర్యః ॥ య.౬-౨౩॥

౫. హృదే త్వా మనసే త్వా దివే త్వా సూర్యాయ త్వా ।

ఊర్ధ్వ మిమమధ్వరం దివి దేవేషు హోత్రా యచ్ఛ ॥ య.౬-౨౫॥

౬. మన్మాని ధీభిరుత యజ్ఞ మృన్ధన్ దేవత్రా చ కృణుహ్యాధ్వరం నః ॥ య.౨౯-౨౬॥

## 5.4 సామ వేదమున అధ్వర శబ్దము

సామ వేదమందును యజ్ఞమునకై అధ్వర శబ్ద ప్రయోగము దిగువ, మరియు ఇతర వందలాది మంత్రము లందును చూడబడుచున్నవి.

మం.౧౬. ''ప్రతిత్యం చారుమధ్వరం గోపీథాయ ప్రహూయసే । మరుద్భిరగ్న ఆగహి''॥

ఇచ్చట యజ్ఞమును అధ్వరము, మరియు హింసారహిత శుభకర్మల పేరని అదియే 'చారు' అనగా ఉత్తమమైన సుందర కర్మయని చెప్పబడినది. దాని కొరకే విద్వాంసులు నిమంత్రణ మొనర్చబడినారు.

మం.౨౧. ''అగ్నిం వో వృధన్తమధ్వరాణాం పురూతమమ్ । అచ్ఛా నప్త్రే సహస్వతే ॥''

ఇచ్చట అగ్ని పరమేశ్వరుని, జ్ఞానియగు విద్వాంసుని, అగ్రేసరుడగు నాయకుని పరముగా చెప్పబడినది. అధ్వరముల అనగా హింసారహిత యజ్ఞములను మాత్రమే అభివృద్ధి పరచుటకు, వానిని ప్రోత్సహించుటకుపదేశించబడినది. మరియు పైన జెప్పబడిన శ్రేష్ఠ జనులు మాత్రమే అట్టి యజ్ఞములను ప్రోత్సహింతురనియును చెప్పబడినది.

మం.౩౨.''కవిమగ్నిముపస్తుహి సత్యధర్మాణమధ్వరే । దేవమమీవచాతనమ్''॥

ఇచ్చట కూడా యజ్ఞమును అధ్వరము అనగా హింసారహిత శుభకర్మల పేర బిలుచుచు, దీనియందు సత్యధర్మము ( శాశ్వత నిత్య నియమములు) గల, సర్వ సంకటముల నివారకుడు, జ్ఞాన స్వరూపుడునగు పరమేశ్వర స్తుతిని గూర్చి ఉపదేశించబడినది.

''న కి దేవా ఇనీమసి న క్యాయోపయామసి । మన్త్రశ్రుత్యం చరామసి''॥ సా.పూ.౨-౪-౨॥

ఈ మంత్రములో పశుహింసాదులు స్పష్టముగా నిషేధింపబడినవి. సాయణాచార్యుడీ మంత్ర భాష్యము నిట్లు వ్రాసినాడు. '**హే దేవాః । యుష్మద్ విషయే కిమపి న హింస్మః శ్రుతా విధివాక్య ప్రతిపాద్యం యద్ యుష్మద్ విషయే కర్మ తత్ ఆచరామః ।** (సామసంహితా భాష్యమ్ కలకత్తా సం. పు. ౬౫) వివరణకారుడు, సుప్రసిద్ధ విద్వాంసుడు నైన సత్యవ్రత సామశ్రమీ గారు తన వివరణమందు చాల చక్కగా వ్రాసినాడు. ఏమన 'ప్రాణివధం కర్మ పశ్వాదియాగం న కుర్మః' । అనగా, మేము ప్రాణి హింసాత్మకమగు పశ్వాదియాగము నొనర్చము.

'మీఙ్ హింసాయామ్' అను ప్రయోగము గలదు. అనగా; మేము హింసాత్మక కార్యముల నొనర్చము. ప్రోత్సహించము. వేదోపదేశములననుసరించియే మా యాచరణముండును. అధ్వర శబ్ద ప్రయోగము దిగువ మంత్రములలోను ఇతర అనేక మంత్రములందును గలదు. ఇందువల్ల నిస్సందేహముగా యజ్ఞాది కర్మలందు పశుహింసా నిషేధము గలదని స్పష్టమగు చున్నది. దీని యందే.

౧. భద్రో నో అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో అధ్వరః।

భద్రా ఉత ప్రశస్తయః ॥ సా.పూ.౨-౨-౫॥

౨. త్వమగ్నే గృహపతిస్త్వం హోతా నో అధ్వరే।

త్వం పోతా విశ్వవార ప్రచేతా యక్షి యాసి చ వార్యమ్ ॥ సా.పూ.౨-౨-౬॥

౩. తం హోతారమధ్వరస్య ప్రచేతసంవహ్నిం దేవా అకృణ్వత।

దధాతి రత్నం విధతే సువీర్యం అగ్నిర్జనాయ దాశుషే ॥ సా.ఉ.౭-౩-౨॥

౪. స నో మన్ద్రాభిరధ్వరే జిహ్వాభిర్యజా మహః।

ఆ దేవాన్ వక్షి యక్షి చ ॥ సా.ఉ.౬-౩-౪-౨॥

౫. వాజీ వాజేషు ధీయతేఽధ్వరేషు ప్రణీయతే।

విప్రో యజ్ఞస్య సాధనః ॥ సా.ఉ.౬-౩-౫-౨ ॥

శ్రీ సత్యవ్రత సామశ్రమీ గారి పై వివరణ, శ్రీ నారాయణ పుత్ర మాధవుని భాష్యముననుసరించియును ఈ భాష్యము చక్కగా నున్నది.

"న కి దేవా ఇనీమసి। నేతి ప్రతిషేధః। ఇనీమసి। మినాతేర్హింసార్థకస్య మకారలోపః। తేనైతదుక్తం భవతి। హే దేవాః న ఇనీమసి। ప్రాణిబన్ధనకర్మ।

పశ్వాదియాగం న కుర్మ ఇత్యర్థః। న క్యాయోపయామసి యోపయతి ర్వి

మోహనకర్మా। స ఇహ నిఖననార్థే ద్రష్టవ్యః మన్త్రశ్రుత్యం మన్త్రశ్రవణీయం

జపాఖ్యం చరామసి। జపం కుర్వన్తశ్చరామః। ప్రాణివధం నకుర్మః। జపమేవ కుర్మ ఇతత్యార్థః॥"

(సామవేద సంహితా డా. కున్నన్ రాజ సంపాదితా మాధవ భరత స్వామి భాష్యసహితా అడయార్ మద్రాస. పు.౧౩౭, ౧౩౮ ॥ పం. సత్యవ్రత సామశ్రమీగారు బహుశః ఈ భాష్య శబ్దములనే తన వివరణమందు ప్రయోగింపవచ్చును. కావున మరల సంపూర్ణ శబ్దార్థమునిచ్చుట అవసరములేదు. ఇచ్చట పశుహింసాత్మక యజ్ఞముల నిషేధము స్పష్టముగానే గలదు.

## 5.5 అథర్వ వేదములో అధ్వర శబ్దము

ఇదే విధముగా అథర్వ వేదమందు యజ్ఞమునకు అధ్వర శబ్దము దిగువ మంత్రములందును, ఇతర వందలాది మంత్రములందును గలదు. ఇది పశుహింసా నిషేధ సూచకమని స్పష్టమగుచున్నది.

౧. 'యశ్చర్షణిప్రో వృషభః స్వర్విద్ యస్మై గ్రావాణః ప్రవదన్తి నృణామ్ ।
యస్యాధ్వరః సప్తహోతా మదిష్ఠః స నో ముఞ్చత్వంహసః ॥ అ.౪-౨౪-౩॥

౨. యమః పరోఽవరో వివస్వాన్ తతః పరం నాతిపశ్యామి కించన ।
యమే అధ్వరో అధి మే నివిష్టో భవో వివస్వానన్వాతతాన ॥ అ.౧౮-౨-౩౨॥

౩. అమూర్యా ఉపసూర్యే యాభిర్వా సూర్యః సహ । తా నో హిన్వన్త్వధ్వరమ్ ॥ అ.౧-౪-౨॥

౪. తనూనపాత్ పథ ఋతస్య యానాన్ మధ్వా సమంజన్ స్వదయా సుజిహ్వ।
మన్మాని ధీభిరుత యజ్ఞమృన్ధన్ దేవత్రా చ కృణుహ్యధ్వరం నః॥ అథ ౫-౧౨-౨॥

౫. అంహోముచం వృషభం యజ్ఞియానాం విరాజన్తం ప్రథమ మధ్వరాణామ్ । అథ
అపాం నపాతమశ్వినా హువే ధియ ఇన్ద్రియేణ త ఇన్ద్రియం దత్తమోజః ॥ అథ ౧౯-౪౨-౪॥

౬. సమధ్వరాయోష నమన్త దధీక్రావేవ శుచయే పదాయ ॥ అథ. ౩-౧౬-౬॥

ముఖ్యముగా యజ్ఞము యొక్క పర్యాయ వాచకముగు 'మేధ' శబ్దమునకు అజమేధ, గోమేధ, పురుషమేధ, అశ్వమేధము మున్నగు శబ్దములను జూచి ( వాస్తవమునకు వేదములందెచ్చటను ఒక్క అశ్వమేధ శబ్దమును వదలి అన్య శబ్దముల ప్రయోగము గాన్పించదు) వైదిక యజ్ఞములందు పశుహింసా విధానము గలదనుకొనుట భ్రమయే యనవచ్చును. 'మేధృ' ధాతువునకు 'మేధా' సంగమనయోర్హింసాయాం చ అనునీ ధాతు పాఠముననుసరించి 'మేధా' అను శబ్దమునకు 'శుద్ధ బుద్ధిని వృద్ధి పరచుట, ప్రజల యందైక్యత, మరియు ప్రేమను పెంపొందించుట, మరియు హింస అను నీ మూడర్థములగును. హింసయనునదే ఏక మాత్ర అర్థము గాదు. విశాల భావము గల పవిత్ర అర్థములను వదలి కేవలము హింసకే ప్రాముఖ్యతనిచ్చుట సంపూర్ణముగ అసంగతమే.'

పురుషమేధము, పురుష యజ్ఞము, నృయజ్ఞమను నీ మూడు శబ్దములును పర్యాయ వాచకములై యున్నవి. మనుస్మృతి యందు నృయజ్ఞవ్యాఖ్య 'నృయజ్ఞోఽతిథి పూజనమ్' ( మను. ౩-౭౦) అని కలదు. దీనియర్థము నృయజ్ఞము. నృమేధమనగా యజ్ఞములందు బలిఇచ్చుట కాదు. కాని, ఉత్తమ విద్వాంసులు విశేషించి అతిథులను పూజించి గౌరవించుట యనియే దీని భావము. మేధృ ధాతువు యొక్క సంగమనార్థము దీసికొనిచో మానవులను ఉత్తమ కార్యములకై సంఘటితమొనర్చుట, వారి యందు ప్రేమ మరియు ఐకమత్యమును వృద్ధి పరచుటయు 'నృమేధ' తాత్పర్యము. సామవేద, ఉత్తరార్చిక అ. ౧౪౨ 'ఆ హరయః సస్రుజిరేఽరుషీరధిబర్హిషి । యత్రాభి సంనవామహే ॥' దీనికి నృమేధ పురుమేధ ఋషులున్నారని భావము. అష్టమ ప్రపాఠకమునకు 'పర్షి తోకం తనయమ్' అను నీ మంత్ర ఋషి నృమేధయే. దీని యర్థము యజ్ఞములందు బలినిచ్చుట వంటిది గాదు. కాని మనుష్యులందు

సంగతీకరణము, లేక ప్రేమైక్యతను వృద్ధి పరచుటయే యగుననునది స్పష్టము. 'గోమేధ' మను విషయములో మేము ముందు విస్తారముగా తెలుపగలము.

అజమేధ, అశ్వమేధము మున్నగు వాని నిజమగు అర్థముకూడా వేరుగా నున్నది. బ్రాహ్మణ గ్రంథములు, మహాభారతము మున్నగు వాని యందు ఇట్లు గలదు. ఉదా :-

శతపథ బ్రాహ్మణము ౧౩-౧-౬లో 'రాష్ట్రంవా అశ్వమేధః, వీర్యం వా అశ్వః ॥' అనగా 'అశ్వ' శబ్దము వీర్యవాచకము కూడ యగును. కావున దేశవాసుల వీర్య బలములను వృద్ధి పరచుట, రాష్ట్రమును ఉత్తమముగా పరిపాలించుట మున్నగునవి యే 'అశ్వమేధ' మున కర్థములు.

'అజ' అనునది ఒక ధాన్య విశేష వాచక శబ్దము. ఇవి యజ్ఞమునందు హోమమొనర్పబడునని భారతమునందు స్పష్టపరచబడియున్నది.

**అజైర్యజ్ఞేషు యష్టవ్యమ్, ఇతి వై వైదికీ శ్రుతిః ।**

**అజ సంజ్ఞాని బీజాని, ఛాగాన్నో హన్తుమర్హథ॥**

**నైష ధర్మః సతాం దేవాః యత్ర బధ్యేత వై పశుః ॥** శాన్తి పర్వము అ. ౩౩౭ ॥

అనగా; వైదిక సాహిత్యమందు అజలచే యజ్ఞములందు హవనమొనర్పవలెనని చెప్పబడియున్నప్పుడు దాని తాత్పర్యమచ్చట 'అజ' ధాన్యములై యుండును. కాని మేకలను బలియిచ్చుట సమంజసము గాదు. పశువుల హింసించుట ఉత్తముల ధర్మము కాదు. సుప్రసిద్ధ నీతిశాస్త్రకారుడగు 'విష్ణుశర్మ' పంచతంత్ర మను గ్రంథమం దిట్లు వ్రాసియున్నాడు.

**"ఏతేఽపి యే యాజ్ఞికా యజ్ఞ కర్మణి పశూన్ వ్యాపాదయన్తి తేమూర్ఖాః,**

**పరమార్థం శ్రుతేర్న జానన్తి। తత్ర కిలైతదుక్తమ్ అజైర్యజ్ఞేషు యష్టవ్య**

**మితి అజాస్తావద్ వ్రీహయః సాప్తవార్షికాః కథ్యన్తే న పునః పశువిశేషాః ।**

**ఉక్తం చ "వృక్షాన్ ఛిత్వా పశూన్ హత్వా కృత్వా రుధిరకర్దమమ్ ।**

**యద్యేవం గమ్యతే స్వర్గం, నరకం కేన గమ్యతే"॥** కాకోలూకీయమ్ ॥

అనగా; యజ్ఞములందు పశుహింసనొనర్చు యాజ్ఞికులను అతి మూర్ఖులని యనవచ్చును. అట్టివారు వేదముల యథార్థ అర్థమును దెలిసికొనియుండలేదు.

**'అజైర్యజ్ఞేషు యష్టవ్యమ్'** ఇచ్చట అజయనగా 'వ్రీహి' లేక పురాణ (ప్రాత) ధాన్య విశేషములుగా గ్రహించవలయును. కాని మేకలని కాదు.

పశువులను జంపి వాని రక్త ధారలను ప్రవహింపజేసి స్వర్గమునకు పోవచ్చునని యనినచో నరకమునకు బోవు

మార్గమేమై యుండును? పశుహింస అనగా; పశుహింసాత్మక యజ్ఞముల ద్వారా స్వర్గమునకు గాదు గదా! తప్పక నరకమునకే పోగలరు. ఇచ్చట ఒక విషయమును చెప్పవలసి యున్నది. అదేమన; జైనుల 'స్యాద్వాదమంజరి' యను గ్రంథమందును 'అజ' యను శబ్దమునకు యజ్ఞ ప్రకరణమునందు 'ధాన్యాదులు' మున్నగు వాని పరముగానే అర్థము స్వీకరించబడినది. ఎట్లన-

**''తథా హి కిల వేదే 'అజైర్యష్టవ్యమ్' ఇత్యాది వాక్యేషు మిథ్యాదృశో ఽజశబ్దం**

**పశువాచకం వ్యాచక్షతే। సమ్యగ్ దృశస్తు జన్మాప్రాయోగ్యం త్రివార్షికం యవవ్రీహ్యాది,**

**పఞ్చవార్షికం తిలమసూరాది సప్తవార్షికం కఙ్గుసర్షపాది ధాన్య పర్యాయతయా పర్యవసాయయన్తి ॥''**

శ్లో. ౨౩ వ్యాఖ్య పుట ౧౦౭-౧౦౨

అనగా; అజలచే యజ్ఞమునొనర్చవలెనను వేద వాక్యములను అజ్ఞానులు 'అజ' శబ్దమునకు పశువాచకముగా అర్థము నొనర్చెదరు. సమ్యగ్దృష్టిగల జ్ఞానులు విత్తుటకు పనికిరాని మూడు వత్సరములయవలు, వ్రీహి మున్నగునవి, ఐదు సంవత్సరముల నువ్వులు, మినుములు మున్నగునవి, ఏడు సంవత్సరముల కఙ్గు-సర్షపములు మున్నగు ధాన్యముల పర్యాయ రూపములనే అంగీకరించెదరు. (స్యాద్వాద మంజరి పు.౧౭౫).

మహా భారతమందనేక స్థానములలో 'వేదములందు మాంసము, సారాయి, పశుబలి, మాంసమును తినుట మున్నగు వాని విధాన మెచ్చటను లేదని స్పష్టముగా చెప్పబడి యున్నది. మనువు యొక్క మనుస్మృతి సిద్ధాంతమునకు కూడా విరుద్ధమగు ఈ పశు హింసాత్మక యజ్ఞాదులను ధూర్తులు, నాస్తికులు, లోభులు, అవ్యవస్థిత చిత్తులు సంశయాత్మక మనోవృత్తి గల వారు. రాక్షస స్వభావము గల వారు ధనాపేక్షతో వేదము యొక్క వాస్తవికాభిప్రాయమును దెలిసికొనలేక ప్రారంభమొనర్చినారు. వాస్తవముగానిది అధర్మము, మహాపాపకార్యమునై యున్నది. భారతమునందలి దిగువ శ్లోకములు ఈ విషయమునం దెంతయో స్పష్టముగా నున్నవి.

**సురా మత్స్యాః పశోర్మాంసమ్, ఆసవం కృశరౌదనమ్।**

**ధూర్తైః ప్రవర్తితం యజ్ఞే, నైతద్వేదేషు విద్యతే ॥**

**అవ్యవస్థితమర్యాదైః, విమూఢైర్నాస్తికైర్నరైః।**

**సంశయాత్మభిరవ్యక్తై ర్హింసా సమనువర్ణితా ॥**

**సర్వ కర్మ స్వహింసా హి, ధర్మాత్మా మనురబ్రవీత్।**

**కామకారాద్ విహింసన్తి, బహిర్వేద్యాం పశూన్ నరాః॥**

**లుబ్ధైర్విత్త పరైర్బ్రహ్మన్, నాస్తికైః సంప్రవర్తితమ్।**

**వేదవాదానవిజ్ఞాయ, సత్యాభాసమివానృతమ్** ॥ శాంతి పర్వము ౨౬౩-౬॥

**మానాన్మోహాచ్చ లోభాచ్చ, లౌల్యమేతత్ప్రకల్పితమ్।**

విష్ణుమేవాభిజానన్తి, సర్వయజ్ఞేషు బ్రాహ్మణాః ॥
పాయసైః సుమనోభిశ్చ, తస్యాపి యజనం స్మృతమ్ ।
యే చైవ యజ్ఞియా వృక్షా: వేదేషు పరికల్పితాః ॥
తస్మాత్ప్రమాణతః కార్యో ధర్మః సూక్ష్మో విజానతా।
అహింసా సర్వభూతేభ్యో ధర్మేభ్యో జ్యాయసీ మతా ॥ మ. భా. శాం. ౨౬౫ ॥

ఈ శ్లోకములందనేకముల భావార్థము ఇంతకు పూర్వమే చూపబడినది. మిగతా శ్లోకముల భావార్థము దిగువ నీయబడుచున్నది.

శాస్త్ర మర్యాదల నెరుగని అజ్ఞానులు, అతి మూర్ఖులు, నాస్తికులు నైనవారు మాత్రమే యజ్ఞాదులందు హింసా విధానములను పొందుపరచినారు. ధర్మాత్ముడగు మనువు సమస్త కార్యములందు అహింసా విధానమునే ఏర్పరచినాడు. యజ్ఞవేదికయందు, మరియు ఇతరత్రా పశుహింసనొనర్చువారు తమ యిచ్ఛా పూర్తికై యొనర్తురు గాని ఇందు మను మహారాజు గారి ఆజ్ఞ యెంత మాత్రమును లేదు కావుననే శాస్త్ర ప్రమాణము నెరిగిన జ్ఞానులు సూక్ష్మ ధర్మ నిర్ణయమొనర్చుకొనవలయును. సకల ధర్మములందును సర్వ ప్రాణులయెడ అహింస ఎంతో గొప్పగా భావించబడి యున్నది. మద్య మాంసాదులు, మాదక ద్రవ్యాదుల సేవించు ధూర్తులే వీనిచే యజ్ఞాదుల నడిపించినారు. ఈ విధానము వేదములందెచ్చటను లేదు. అభిమానము, మోహము, లోభము మున్నగు వానిచే ఈ చంచల ప్రవృత్తి యేర్పడినది.

బ్రాహ్మణులు సకల యజ్ఞములందును సర్వ వ్యాపకుడగు పరమేశ్వరునే జూచుచుండిరి. అట్టి యజ్ఞములు పాలుగల పదార్థములు మరియు యజ్ఞీయ వృక్షముల సమిధలు మున్నగు వాని ద్వారా యగుచుండును.

దీనివల్ల మనకు యజ్ఞములందు పశుహింస యనునది ధూర్తుల కల్పితమని స్పష్టముగ బోధపడుచున్నది. కావుననే శ్రౌత సూత్రములు, గృహ్య సూత్రములు, బ్రాహ్మణ గ్రంథములు, స్మృతులు మరియు ఇతర గ్రంథములందు ఎచ్చటనైనను హింసాత్మక విషయములు గాన్పించినచో అవి వేదవిరుద్ధములగుటచే అమాన్యములు, మరియు వెనుకనుండి చొప్పింపబడి ప్రక్షిప్తములేయని ఎరుగవలెను.

ఇట్టి ప్రక్షిప్తములు ప్రాచీన గ్రంథములం దనేకము జరుగుచు వచ్చినవి. ఈ విషయమును సుప్రసిద్ధ ద్వైతవాదియగు ఆచార్య మధ్వాచార్యులు అనగా ఆనందతీర్థులు గారు 'మహాభారత తాత్పర్య నిర్ణయము' నందు ఈ శబ్దములలో తెలిపినారు.

క్వచిద్ గ్రన్థాన్ ప్రక్షిపన్తి, క్వచిదన్తరి తానపి ।
కుర్యుః క్వచిచ్చ వ్యత్యాసం, ప్రమాదాత్క్వచిదన్యథా ॥
అనుత్పన్నా అపి గ్రన్థాః, వ్యాకులా ఇతి సర్వశః॥
( మహా భారత తాత్పర్య నిర్ణయము అ.౨ సర్వమూల కుంభకోణం సంస్కరణ పు. ౯౦౭)

ధూర్తులు అనేక గ్రంథములలో ప్రక్షేపము లొనర్తురు. అనేకములందు కొన్ని వాక్యములను దొలగించెదరు. ప్రమాదవశమున అనేకములందు మార్పులు, చేర్పులు చేయుదురు. తెలిసియుండియును అనేక వాక్యములను, పదములను క్రిందు మీదులొనర్చుచుందురు. ఒకవేళ ఏదైన నష్టమునకు గురికాని గ్రంథము లున్నను వానియందును ఎంతో గందరగోళము జరిగినదనియే తలచవలయును.

కావుననే కౌశిక సూత్రము ౧౩-౧-౬ నుండి కొన్ని ఉదాహరణములు *Vedic Age* లేఖకులు ఈ దిగువ విధముగా పేర్కొనినారు.

**సింహే వ్యాఘ్రే యశోహవిరితి స్నాతకర్సింహవ్యాఘ్రబస్తక్షవృషభరాజ్ఞాం**

**నాభిలోమాని । ४ । దశానాం శాన్తవృక్షాణాం శకలాని । ౫ । ఏతయోః ప్రాతరగ్నిం**

**గిరావర గరాటేషు దివస్పృథివ్యా ఇతి సప్త మర్మాణి స్థాలీపాకే పృక్త్వాన్యశ్నాతి ॥ ౬॥**

అనగా; సింహము, వ్యాఘ్రము, క్షత్రియుడు, బ్రహ్మచారి, వృషభము, రాజు, మున్నగు వారి శరీరముల కొన్ని భాగములను గలిపి వానిని ఒక విశేష విధముగు శక్తిప్రాప్తి కొరకు తినవలెను మున్నగునవి వేద విరుద్ధము లగుటచే అప్రమాణికములుగా నెంచవలయును. ఇట్టి అంధవిశ్వాస సూచకము లగు వేద విరుద్ధ వచనము లే గ్రంథములం దున్నను అవి మాన్యములు గావని యెరుగవలయును. పైన సూచించిన మహాభారతము యొక్క ప్రబల సాక్ష్యము ననుసరించి ఈవిధముగు సకల వచనములు ధూర్తులు, నాస్తికులు, మూర్ఖులు, ధనలోభులు మున్నగువారి ద్వార కల్పితములు, కావున నవి ప్రామాణికములు గావు. సాక్షాత్కృతధర్మాత్ములగు ఋషులు ఇట్టి పశుహింసాత్మక యజ్ఞముల నెప్పుడును జేయరు. మహాభారత అశ్వమేధ పర్వ ౯౧ వ అ.న దిగువ శ్లోకములు చూడుడు.

**తతో దీనాన్ పశూన్ దృష్ట్వా ఋషయస్తే తపోధనాః ।**

**ఊచుః శక్రం సమాగమ్య, నాయం యజ్ఞవిధిః శుభః ॥**

**అపరిజ్ఞానమేతత్తే, మహాన్తం ధర్మమిచ్ఛత : ।**

**నహి యజ్ఞే పశుగణాః, విధిదృష్ట్వా పురన్దర ॥**

**ధర్మోపఘాతక స్త్వేష, సమారమ్భస్తవ ప్రభో ।**

**నాయం ధర్మకృతో యజ్ఞో, న హింసా ధర్మ ఉచ్యతే ॥**

**ఆగమేనైవ తే యజ్ఞం, కుర్వన్తు యది చేచ్ఛసి ।**

**విధిదృష్టేన యజ్ఞేన, ధర్మస్తేషు మహాన్ భవేత్ ॥ అశ్వమేధ అ.౯౧॥**

''తపోధనులగు ఋషులు దీన పశువులను గాంచి ఈయజ్ఞవిధి శ్రేష్ఠమైనది గాదని తెలిపినారు. ధర్మమును గోరునట్టి మీ యీ కార్యము గొప్ప అజ్ఞానమూలకమైయున్నది. యజ్ఞములందు పశుహింసను గూర్చిన విధాన మే వైదిక గ్రంథమందును లేదు. ఇది మీ ధర్మమును నాశ మొనర్చునదై యున్నది. మీరు ధర్మము నాకాంక్షించువా

రగుచో వేదము మున్నగు సత్యశాస్త్రముల విధానము ననుసరించి యజ్ఞము లొనర్చినప్పుడే మీరొనర్చు యీ కార్యము మహాధర్మ యుక్తమగు''నని తెలిపినారు.

**'సాక్షాత్కృత ధర్మాణ ఋషయః'** లేదా **'ఋషయో మన్త్రద్రష్టారః'** అనునవియే ఋషుల లక్షణము. ఇది నిరుక్తవచనము అనగా; వేద మంత్రముల యథార్థ జ్ఞానము (తత్త్వము) గలవారు, ధర్మమును సాక్షాత్కారమొనర్చుకొనినవారే ఋషులు. ఇట్టి ఋషులే యజ్ఞాదులందు పశుహింసాదులు అజ్ఞాన మూలకములు, ధర్మ నాశకములు, వేదాది సత్య శాస్త్రములకు విరుద్ధములు, పాపకార్యములని తెలిపియుండ అట్లు చేయుట ఘోరమగు పాపకార్యముగాక మరేమగును? మ.భా.శాంతి పర్వమున ఇంకా నిట్లు గలదు.

**ధ్రువం ప్రాణివధో యజ్ఞే, నాస్తి యజ్ఞస్త్వహింసకః।**

**తతోఽహింసాత్మకః కార్యః సదా యజ్ఞో యుధిష్ఠిర! ॥**

**యూపం ఛిత్వా పశూన్ హత్వా, కృత్వా రుధిరకర్దమమ్।**

**యద్యేవం గమ్యతే స్వర్గం, నరకం కేన గమ్యతే** ॥ శాంతిపర్వము ॥

యజ్ఞములందు పశుహింస నిశ్చయముగా విహితమైనది గాదు. యజ్ఞము లనగా; అహింసాత్మకములే. వానిని అహింసాత్మక రూపముననే సదా యొనర్చుచుండవలయును. పశువులను జంపి వాని రక్తమును ప్రవహింపజేసి స్వర్గమునకు పోవచ్చుననిన ఇక నరకమునకు బోవు నుపాయ మేది? పంచతంత్రము యొక్క కాకోలూకీయము సరస్వతీ ప్రెస్సు మురాదాబాదు. పు. ౨౬౬ నందీ శ్లోకముగలదు. **'యూపం ఛిత్వా పశూన్ హత్వా'** అను శ్లోకము గొప్ప మహత్త్వ పూర్ణమగు కారణమున ఇచ్చట సూచించబడినది. అనేక విద్వాంసులు దీనిని తమ గ్రంథములం దుల్లేఖించినారు. శ్రీ విష్ణుశర్మ తమ పంచతంత్రమునందలి కాకోలూకీయము పు.౨౬౬ దీనిలో నుదాహరించియున్నా డని పైన దెలిపియున్నాము. స్యాద్వాదమంజరి యందు శ్రీ మల్లిషేణుడు దీని నుల్లేఖించియున్నాడు. శ్రీ విజయరాజేంద్ర సూరీశ్వర కృత' అభిధాన రాజేన్ద్రము ఏడవ భాగము. పు.౧౨౨౯ లో దీని నీ శబ్దములందు ఉల్లేఖించియున్నాడు.

**తథా చ పఠన్తి పారమర్షాః -**

**యూపం ఛిత్వా పశూన్ హత్వా, కృత్వారుధిరకర్దమమ్।**

**యద్యేవం గమ్యతే స్వర్గం, నరకే కేన గమ్యతే ॥** అభిదాన రాజేంద్రము, భాగము ౭, పు. ౧౨౨౯ ॥

పరమ ఋషులు అనుయాయులు **'యూపంఛిత్వా పశూన్ హత్వా'** అను నీ శ్లోకమును పఠింతురు. దీనియందు యజ్ఞములందు పశువులను హింసించుట స్వర్గమునకు గాక నరకమునకు ద్వారమగుచున్నది. అనగా పశుహింస స్వర్గ ద్వారమగుచో అట్టి యజ్ఞముల నొనర్చు రాక్షసులకది నరక ద్వారమగును. పరమ ఋషి శబ్ద వ్యాఖ్యనొనర్చుచు సంస్కృత సుప్రసిద్ధ విశ్వకోశము, వాచస్పత్య బృహదభిధాన పు. ౪౨౩౭ లో

**'పరమర్షిః - వేద వ్యాసాదిషు ఋషిషు'**

శ్రీ రాధాకాంత దేవుడు 'శబ్ద కల్పద్రుమ' తృతీయ కాండము. పు.౫౦లో పరమర్షి యొక్క వ్యాఖ్య నొనర్చుచు ఇట్లు వ్రాసియున్నాడు.

**'వేదవ్యాసో హి పరమర్షిః యథా మహా భారతే ౧-౧-౧౭**

**ద్వైపాయనేన యత్ప్రోక్తం, పురాణం పరమర్షిణా ॥'**

వేదవ్యాసుడేగాక మరికొందరు మహర్షులకు కూడా పరమర్షి శబ్దము గ్రహించబడును. ఐనను దీనివల్ల వేద వ్యాసుడే గ్రహించబడుచుండు ననుటలో సందేహము లేదు. కాని శ్రీ విజయేంద్ర సూరీశ్వరుని లేఖానుసారము కూడా ఈ శ్లోకము మహాభారతములోనిదే యనిపించును. ఐనను దీనిని నిర్ధారించి చెప్పజాలము.

మాన్యవరులు, వేదోపాధ్యాయులు, వేదముల సుప్రసిద్ధ విద్వాంసులునగు శ్రీ పం. విశ్వనాథ విద్యామార్తాండులు, ప్రస్తుత సంపాదకులు 'వైదిక అనుసంధానము ఢిల్లీ' కూడా తన అత్యుత్తమ గ్రంథమగు 'వైదిక పశుయజ్ఞమీమాంస' లో ఇది మహాభారత, శాంతి పర్వ శ్లోకమనియే పు.౧౦౫లో ఉదాహరించినారు. జగద్విఖ్యాత విద్వాంసులు, మరియు మన సౌభాగ్యవశమున భారత దేశపు రాష్ట్రపతిగా నుండిన డా. రాధాకృష్ణ గారు కూడా కాంగ్డీ గురుకుల విశ్వ విద్యాలయమున ౧౯౫౫లో తన మహత్త్వ పూర్ణ దీక్షాంత ప్రవచనమునందు **'యూపం ఛిత్వా, పశూన్ హత్వా'** అను సంపూర్ణ శ్లోకమును ఉద్ధృత మొనర్చియుండిరి. ఏ విద్వాంసునకైనను దీని సంపూర్ణ విషయము దెలిసియున్న దయతో ఈ రచయితకు సూచించగలరని మనవి' స్యాద్వాదమంజరి యందు వ్యాసుల వారి పేర వ్రాయబడియున్న శ్లోక ముల్లేఖించవలసిన యవసర మెంతేని గలదు. కాని దీని ప్రమాణమచ్చుట కానరాదను చింత గలదు.

**ప్రాణిఘాతాత్తు యో ధర్మమ్ ఈహతే మూఢమానసః॥**

**స వాఞ్ఛతి సుధావృష్టిం కృష్ణాహిముఖకోటరాత్** ॥ స్యాధ్యాయమంజరి, పు.౮౦ ॥

ప్రాణి హింస ద్వారా ధర్మమునాశించు మూర్ఖుడు నల్లత్రాచు ముఖమునుండి అమృత వర్షము నాశించువాని వంటివాడు.

## 5.6 అశ్వమేధ యజ్ఞము - అహింసాత్మకము

అశ్వమేధ యజ్ఞమును దానియందు అశ్వములు బలినీయబడుచుండునని కొందరల్పజ్ఞులు అర్థము నొనర్చుకొందురు. *Vedic Age* లేఖకులు సైతము ఇదే భావము వ్యక్తపరచినారు. కాని మహాభారతము, శాంతిపర్వము 3-33౬లో వసు మహారాజు యొక్క అశ్వమేధ యాగ వర్ణనము గలదు. దానియందు ఆ కాలపు అనేక సుప్రసిద్ధ మహర్షులు, గొప్ప విద్వాంసులు పాల్గొనియుండిరి. అందు అశ్వమును బలినిచ్చుట యని లేదు. గాక నిమ్న వర్ణన మీ సందర్భమున స్పష్టముగనున్నది. చూడుడు.

**తస్య యజ్ఞో మహానాసీదశ్వ మేధో మహాత్మనః ।**

**బృహస్పతిరుపాధ్యాయః తత్ర హోతా బభూవ హ॥**

ప్రజాపతిసుతాశ్చాత్ర, సదస్యాశ్చాభవంస్త్రయః ॥ ౩౪॥
ఋషిర్మేధాతిథిశ్చైవ, తాణ్డ్యశ్చైవ మహానృషిః ।
ఋషిశ్రేష్ఠశ్చ కపిలః శాలిహోత్రపితా చ యః ।
ఆద్యః కఠస్తిత్తిరిశ్చ, వైశంపాయన పూర్వజః ।
కణ్వోఽథ దేవహోత్రశ్చ, ఏతే షోడశ కీర్తితాః ॥ ౬॥
సంభూతాః సర్వ సంభారాః తస్మిన్ రాజన్ మహాక్రతౌ ।
న తత్ర పశుఘాతోఽభూత్, స రాజైవంస్థితోఽభవత్ ।
అహింస్రః శుచిరక్షుద్రః, నిరాశీః కర్మ సంస్తుతః ॥ ౧౧॥

అనగా; వసురాజు యొక్క అశ్వమేధ మనుపేరుగల యజ్ఞము అత్యంత మహత్త్వ పూర్ణమై యుండెను. బృహస్పతియను ఉపాధ్యాయులు దానియందు హోతలై యుండిరి. ప్రజాపతి యొక్క ముగ్గురు కుమారులు, మరియు ఇతర అనేక సుప్రసిద్ధ ఋషులేగాక ఋషి శ్రేష్ఠులగు కపిలుడు, కఠుడు, తైత్తిరి, కణ్వుడు మున్నగువారు ఋత్విజులై యుండిరి. అది సంపూర్ణముగా హింసారహితము (అహింసః) పవిత్రము నగు మహాయజ్ఞమై యుండెను. దాని యందు ఏ మాత్రమును పశుహింస లేకుండెను. **(న తత్ర పశుఘాతోఽభూత్)** అశ్వమేధమను యజ్ఞము నందు అశ్వము బలిఈయబడుచుండెడి దను అర్థమును చెప్పు పరమ మూర్ఖు లీ అహింసాత్మక వర్ణనమును చదివికొని కనువిప్పు గలిగి పశ్చాత్తాప పడుట మంచిది. దీని హోతలందు ఆచార్య బృహస్పతి, ఋషి శ్రేష్ఠు డగు కపిలుడు మరియు కఠసంహిత, తైత్తిరీయసంహిత, కాణ్వసంహిత, మున్నగు వాని ప్రవక్తలగు ఋషు లుండిరి. వీరు సంపూర్ణ అహింసాపద్ధతిలో ఈ మహాయజ్ఞమును నిర్వహింపజేసి యుండిరి. ఈ విషయము నిచ్చట నిచ్చు అవసర మేమనగా, వర్తమాన కాలమున ప్రచలితమైయున్న తైత్తిరీయ సంహితయందును అనేక స్థలములందు యజ్ఞములందు పశు హింసాప్రతిపాదన గలదు. దానియందు వెనుక నుండి ప్రక్షిప్తములొనర్చబడినవని అంగీకరించుటకన్న వేరు మార్గము లేదు.

### 5.7 యజ్ఞములందు పశు ప్రదర్శనము

ఇచ్చట ఒక విషయము చెప్పదగినదై యున్నది. ఏమన; మేధృ ధాతువు సంగమన రూపము యొక్క అర్థము యజ్ఞ రూపములో మహాభారతమందు యజ్ఞ విషయముగా అనేక ప్రకరణములందు వచ్చి యున్నది. ఉదా:- మహాభారత అశ్వమేధ పర్వము అ.౮౫ లోని దిగువ వర్ణనమును చూడదగును.

స్థలజా జలజా యే చ, పశవః కేచన ప్రభో! ।
సర్వానేవ సమానీతాన్, అపశ్యంస్తత్రతే నృపాః ॥ ౩౨॥
గాశ్చైవ మహిషీశ్చైవ, తత్ర వృద్ధ స్త్రియోఽపిచ ।
ఔదకాని చ సత్వాని, శ్వాపదాని వయాంసి చ ॥ ౩౩॥

**పర్వతానూపజాతాని, స్వేదజాన్యుద్భిజాని చ ।**

**జరాయుజాణ్డజాతాని, భూతాని దదృశుశ్చతే ॥౩౪॥**

**ఏవం ప్రముదితం సర్వం, పశుగోధనధాన్యతః ।**

**యజ్ఞవాటం నృపా దృష్ట్వా, పరం విస్మయ మాగతః ॥ ౩౫॥** మహాభారత అశ్వమేథ పర్వ. అ.౮౫॥

యజ్ఞ మండపమునందు అనేక స్థలచర, జలచర జంతువులను ప్రజలు తేవడము చూడబడినది. ఇచ్చట అనేక విధములగు గోవులు, మహిషములు (గేదెలు) ఉండెను. వృద్ధ స్త్రీలుండిరి. జల చర జంతువులు, పక్షులుండెను. పర్వత సమానమగు స్వేదజములు, ఉద్భిజములు, జరాయుజములు, అండజము లగు జంతువులన్నియు నచ్చట ఏకత్రిత పరచబడియుండెను. ఈ విధమగు పశువులు, గోవులు, ధనధాన్యములు మున్నగు వానిచే నిండియున్న, ఆనంద పరచుచున్న యజ్ఞమండపమును జూచిన రాజు ఆనందాశ్చర్యములను పొందినాడు. దీని వల్ల గోమేధ, నరమేధ, అశ్వమేధ, అవిమేధము మున్నగువాని ప్రదర్శన స్వరూపము సంపూర్ణముగా, స్పష్టముగా సిద్ధించుచున్నది.

### 5.8 ఆలమ్భ, సంజ్ఞపన మరియు అవదాన శబ్దముల అనర్థము

యజ్ఞములందు నిందనీయమగు పశుహింసా పద్ధతి కేవలము స్వార్థము, మరియు లోభ కారణమున ప్రచలితమగుటే గాక ప్రాచీన గ్రంథములందు గల ఆలంభము, సంజ్ఞపనము, అవదానము మున్నగు శబ్దార్థములను తెలిసి కొనజాలకయు ఈ ఘోరము జరిగిన దనవచ్చును. అధ్యయనము ద్వారా ఈ విషయము స్పష్టముగా బోధపడుచున్నది. యజుర్వేదమున

**ప్రజాపతయే పురుషాన్ హస్తిన ఆలభతే, వాచే ప్లుషీంశ్చక్షుషే మశకాన్, ।**

**శ్రోత్రాయ భృఙ్గాన్** ॥ యజుః ౨౪-౨౯ ॥

**అగ్ని షోమీయం పశుమాలభేత ।**

మున్నగు వాక్యముచే పక్షపాత పశుహింసకులు పశుహింసను బలపరచెదరు. కాని ఇది యజ్ఞానమే. 'ఆఙ్' పూర్వక 'లభ్' ధాతువుచే ఆలంభ మను శబ్దము సిద్ధించును. వాని యర్థము చక్కగా ప్రాప్తించుకొనుట, స్పర్శించుకొనుట ఇచ్చుట యగును. వధార్థక ధాతువులందు నిఘంటువు మరియు ధాతు పాఠము మున్నగు వానియందు 'ఆలభ్' అను ప్రయోగ మెచ్చటను లేదు. ఈ విషయమ్మున దిగువ ప్రమాణములు ఏమాత్రము సందేహము గలుగకుండా స్పష్ట మొనర్చుచున్నవి. ఏమన;

౧. మనుస్మృతి అ.౨ లో బ్రహ్మచారుల కర్తవ్య ప్రకరణమున ఈ దిగువ శ్లోకముగలదు.

**వర్జయేన్మధుమాంసం చ, మాల్యం గన్ధం రసాన్ స్త్రియః।**

**స్త్రీణాం చ ప్రేక్షణాలమ్భం ఉపఘాతం పరస్య చ** ॥ మను. ౨ ॥

ఇచ్చుట స్త్రీలను చూచుట, స్పర్శించుట బ్రహ్మ చారులకు నిషేధము గలదు. ఆలంభమను దానికి హింసాపరకార్థ మిచ్చుట అసంగతముగనున్నది. ఏలన; స్త్రీలయొక్క హింసా నిషేధము సంపూర్ణముగా అనావశ్యకమే. దానికి స్పర్శ అను అర్థము దీసికొనుటయే సరిగా నుండును. దీనియర్థము టీకాకారు లిట్లు దీసికొనినారు.

౨. పారస్కర గృహ్యసూత్ర ఉపనయన ప్రకరణమందిట్లు గలదు.

**'అథాస్య (బ్రహ్మచారిణః) దక్షిణాంసమ్ అధిహృదయమ్ ఆలభతే** ॥ పా.౨-౨-౧'॥

అనగా; ఆచార్యుడు బ్రహ్మచారి హృదయమును స్పర్శించును. హరిహర, గదాధరులు మున్నగు భాష్యకారులు 'ఆలభతే' అర్థము 'స్పృశతి' (ముట్టుట) అని చేసినారు.

౩. పారస్కర గృహ్య సూత్రపు వివాహ ప్రకరణమందు ఈ వాక్యమును జూడనగును.

**'వరో వధ్వా దక్షిణాంసమ్ అధి హృదయమ్ ఆలభతే** ॥ పా.గృ.సూ.౧-౮-౮॥'

అనగా వరుడు వధువు యొక్క దక్షిణ (కుడి) భుజముపైనుండి తన చేతిని గొని పోయి హృదయమును స్పృశించును. ఇచ్చుట కూడా జయరామ, హరిహరాది భాష్యకారులు కూడా 'ఆలభతే' అర్థము స్పృశతి (స్పర్శించుట) అనియే చేసినారు.

౪. ఇదే విధముగా పా. గృ. సూత్రము జాతకర్మ ప్రకరణమందును ఈ వాక్యము గలదు

**'కుమారం జాతం పురాన్యైరాలమ్భాత్ సర్పిర్మధునీ హిరణ్యయేన ప్రాశయేత్'**

బాలకులుత్పన్నమైనప్పుడు ఎవ్వరును స్పర్శించుటకు పూర్వమే వారికి స్వర్ణశలాకతో ఘృతము, నేయిని చప్పరింపజేయవలెను. ఇచ్చుటను 'ఆలమ్భ' మనగా స్పర్శ యను అర్థమే అతి స్పష్టముగా నున్నది. సందేహము లేదు. మీమాంస దర్శనము. ౨-౩-౧౭ యొక్క టీక యందు 'సుబోధినీ' టీకా కారుడిట్లు వ్రాసియున్నాడు.

**'వత్సస్య సమీప ఆనయనార్థం ఆలమ్భః స్పర్శో భవతీతి** ॥ మీ.ద.౨-౩-౧౭ ॥

ఇచ్చుట 'ఆలమ్భ' అర్థము 'స్పర్శ' అని చేయబడినది. కావున,

**'ప్రజాపతయే పురుషాన్ హస్తిన ఆలభతే వాచే ప్లుషీంశ్చక్షుషే మశకాన్ శ్రోత్రాయ భృంగాన్'**

మున్నగు మంత్రముల మరియు **'అగ్నిషోమీయం పశుమా ఆలభేత'** మున్నగు బ్రాహ్మణ వాక్యములందు 'ఆలభతే' అను దానికి స్పర్శ, ప్రాప్తి యను అర్థములగును. ప్రజాపతిరాజు సేవకై వీర పురుషులు, గజములను 'ఆలభతే' ప్రాప్తించుకొనవలెను. 'చక్షుషే మశకాన్' కన్నుల కొరకు చిన్న చిన్న దోమలను జూడవలెను. కన్నులను గాంచి ముగ్ధులగునట్లు ఉత్తమ రూపములపై కన్నుల నుంచవలెను. **'శ్రోత్రాయ భృఙ్గాః'** శ్రవణేంద్రియముల సుఖము కొరకు 'భృఙ్గాః' తుమ్మెదలను గాంచవలెను. వాని చక్కనగు ఝుంకారమును వినవలెను. ప్రజాపతియగు రాజు కొరకు వీరపురుషుల, మరియు ఏనుగులను చంపుట యను అర్థమెంతయో అసంగతముగా నుండును.

**వసన్తాయ కపిఞ్జలానాలభతే గ్రీష్మాయ కలవిఙ్కాన్ వర్షాభ్యస్తిత్తిరీన్ శరదే**

**వర్తికా హేమన్తాయ కకరాన్ శిశిరాయ వికకరాన్** ॥ యజు. ౨౪.౨౦ ॥

దీనియందు వసంత గ్రీష్మ, వర్షమున్నగు విశేష ఋతువులతో 'కపింజల' ( కౌజు పిట్ట) 'కలవింక' ( ఊరు పిచ్చుక) తిత్తిరి ( తీతువు పిట్ట) మున్నగు పక్షుల సంబంధమును జూపుచు పక్షి విద్యను నేర్చుకొనుటకై ఆయా ఋతువులందు అట్టి పక్షులను సేకరించుకొని చక్కగా అనుశీలన ( పరిశీలన) మొనర్చవలయునని యుపదేశించబడియున్నది. ఇచ్చట ఆ రెండు ఋతువులకొరకు పక్షి విశేషములను చంపు అర్థమొనర్చుట పూర్తిగా అసంగతమేయగును.

## 5.9 సంజ్ఞపన శబ్దార్థము

సంజ్ఞపన శబ్ద ప్రయోగము కూడా బ్రాహ్మణ, శ్రౌత సూత్ర గ్రంథములందనేక స్థానములందు గలదు. దీని యర్థము తత్కాలమే చంపవలె ననుకొనుట జరుగుచున్నది. కాని ఈ విషయము కూడ అజ్ఞానజనకమనియే యనవచ్చును. నిమ్న అథర్వ వేద మంత్రములందు సంజ్ఞపనమ్, లేక సంజపయామి మున్నగు వాని ప్రయోగము గలదు. వీని యర్థము జ్ఞానమునిచ్చుట, ఇప్పించుట, స్నేహ పరచుటయనునదియే స్పష్టముగలదు.

**సం వః పృచ్యన్తాం తన్వః సం మనాంసి సము వ్రతా।**

**సం వో ఽయం బ్రహ్మణస్పతిః భగః సం వో అజీగమత్** ॥ అథ ౬-౧౦-౭౪॥

**సంజ్ఞపనం వో మనసో ఽథో సంజ్ఞపనం హృదః ।**

**అథో భగస్య యచ్ఛ్రాన్తం తేన సంజ్ఞపయామి వః** ॥ అథ ౬-౧౦-౭౫।

భావము : ఓ మానవులారా! మీ శరీరములు కలసియున్నచో కలసి వ్యాయామాదుల నొనర్చుడు. మీ మనస్సులు గలసియున్నచో వ్రతములొకే విధముగా నుండవలెను. జ్ఞానమునకు స్వామి యగు పరమేశ్వరుడు సదా మిమ్ము కలిపియుంచునుగాక. మీ మనస్సులు జ్ఞాన పూర్వకముగా చక్కగా గలసియుండవలెను. మీ హృదయములు జ్ఞాన పూర్వకముగ ఉత్తమరీతిలో గలసియుండుగాక. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, అనాసక్తి మున్నగు మీ పరిశ్రమలను నేను శ్రేష్ఠమగు జ్ఞానయుక్త మొనర్చి కలిపివేయుదును.

ఇదే విధముగ శత పథ బ్రాహ్మణ ఆఖ్యాయిక యం దిట్లు గలదు.

**(మనసః) శ్రేయసీ అస్మి, యద్ వై త్వం వేత్థాహం తద్ విజ్ఞాపయామ్యహం ।**

**సంజ్ఞపయామీతి ।** ॥ శ. బ్రా. ౧-౪॥

అనగా; వాణినగు నేను మనస్సువగు నీకన్న ఎంతో ఉత్తమమైనదానను. నీవు మనస్సునందు చింతన మొనర్చిన దానిని నేను ప్రకటించుచుందును. నేను దానిని చక్కగా ఇతరులకు విడమర్చి చెప్పుదును. (సంజ్ఞపయామి)

**'ఏష వా స్వర్గే లోకే యత్ర పశుం సంజ్ఞాపయన్తి'** మున్నగు వాక్యముల అర్థము పశువులవంటి అజ్ఞానులగు బాలబాలికలను ఉత్తమ జ్ఞానులుగా నొనర్చినచో అదియే స్వర్గలోకమనబడుచున్నది. గ్రంథ విస్తరణ భయముచే విశేషముగా వ్రాయబడుట లేదు.

Animal sacrifices are indicated by the Apri-Suktas and the horse sacrifice (Ashvamedha) was un-doubtedly performed (Vedic Age. P.378)

అనగా; ఆప్రీ సూక్తముల ద్వారా పశుయాగము సూచితమగుచున్నది. అశ్వమేధ మొనర్చబడుననుటయం దేలాంటి సందేహములేదు. 'వాస్తవముగ నిష్పక్షపాత భావముతో ధ్యాన పూర్వకముగా మనము ఆప్రీ సూక్తములను పూర్తిగా అధ్యయన మొనర్చినచో వాని యందెచ్చటను ఏ మాత్రమును పశుహింసను గూర్చిన వాసనయైనను గానరాదని మనము నిశ్చయముగా చెప్పవచ్చును. యజ్ఞమునకై అహింసాసూచకమగు అధ్వర శబ్దమును అనేక మార్లు ప్రయోగింపబడుట చూడనగును. ఆప్రీ సూక్తము లందు పశుహింసను సమర్థించునట్టి మంత్ర మొక్కటియును కానరాదు. అజ్ఞానము, భ్రమకు మూలకము మహాభారతమున గలదని

**అవ్యవస్థిత మర్యాదైర్విమూఢైర్నాస్తికైర్నరైః। సంశయాత్మభిరవ్యక్తైర్హింసా సమనువర్ణితా ॥**

మున్నగు శ్లోకములనుదాహరించి చూపబడును. పశుహింసాత్మక యజ్ఞముల వాడుక ప్రచలితమై అట్టి సూక్తముల వినియోగమచ్చట జేయబడినచో ఆ మంత్రములందు పశుహింసా విధానము గలదని సిద్ధిగాజాలదు. దీని వినియోగము మధ్యకాలము నందు మరియు ఈ కాలమునందును అతి విరుద్ధ వికార రూపమున ప్రచలితము కావింపబడినది. దీనికి మంత్రార్థములతో నెట్టి సంబంధమును లేదు. ఉదాహరణముగ, **'శం నో దేవీరభిష్టయే'** ఈ యీశ్వరుడు, మరియు ఆధిదైవిక దృష్టితో జలమునకు సంబంధమగు మంత్రమున కేవలము 'శం నః' శబ్దము వచ్చినందున శనైశ్చర పూజయందు **'ఉద్బుధ్యస్వాగ్నే'** ని బుధుని పూజయందు 'గణానాం త్వా గణపతిం హవామహే' జగత్పతియగు పరమేశ్వర పరకమైన ఈ మంత్రమును కల్పిత గణేశుని పూజయందు వినియోగించబడుచున్నది. ఐనను నిష్పక్ష పాత విద్వాంసులెల్లరును ఇవి యన్నియును సంపూర్ణముగ కపోల కల్పితములనియు, వీనికి మంత్రార్థములతో నెట్టి సంబంధము లేదనియు నెరుగుదురు. ఇదే విధముగా అశ్వమేధ మనగా అశ్వమును చంపుట యను అర్థమున ప్రచలితమైయున్నది కూడా సంపూర్ణముగా అశుద్ధమే. 'అశ్వమేధ, రాష్ట్రం వా అశ్వమేధః' శత ౧౩-౧-౬ ॥ ''వీర్యం వా అశ్వః'' మున్నగు అర్థములు రాష్ట్ర సంచాలనము, మరియు రాష్ట్ర శక్తిని పెంపొందించు కార్య రూపమున అవశ్యముగా ప్రచలితమై యుండియున్నవి. కాని అశ్వము మున్నగు పశు హింసా యజ్ఞములు వైదిక కాలము నందున్నట్టి ప్రమాణమేదియును లేదు. ఋగ్వేద. ౧-౧౬౨, యజుర్వేద ౨౨ మున్నగువానిలో అశ్వ విద్య మరియు రాష్ట్ర సంచాలనమును గూర్చిన ఉపదేశము గలదు. కాని అశ్వము మున్నగు పశువుల నాహుతి నిచ్చుటకు గాదు. ఋగ్వే.౧-౧౬౨-౧౭ లోను యజు. ౨౨-౪౦ లోను అధ్వర శబ్ద ప్రయోగము గలదు.

**యత్తే సాదే మహసా శూకృతస్య పార్ష్ణ్యా వా కశయా వా తుతోద ।**

**స్రుచేవ తా హవిషో అధ్వరేషు సర్వా తా తే బ్రహ్మణా సూదయామి ॥**

అధ్వర అర్థము **'అధ్వర ఇతి యజ్ఞ నామ ధ్వరతిర్హింసా కర్మా తత్ప్రతిషేధః'** ని.౧-౭॥ అను సారము హింసారహితమైనది యజ్ఞము. అట్టిచో అశ్వమును చంపు విధానమె ట్లగును? అశ్వమును ఉత్తమ రీతిలో శిక్షణ నిచ్చుట మచ్చిక చేసికొనుట గూర్చి మంత్రము నందుపదేశము గలదు. ఈమంత్ర భావార్థము మహర్షి దయానందులిట్లొనర్చినారు.

**యథా యజ్ఞసాధనైః హవీంష్యగ్నౌ ప్రేరయన్తి తథైవాశ్వాదీని ।**

**సుశిక్షితరీత్యా ప్రేరయేయుః ॥**

అనగా; యజ్ఞ సాధనములగు స్రువమున్నగు వానిచే హవిస్సులు హింసారహిత యజ్ఞములందెట్లు ప్రేరితమొనర్చబడునో, ఆహుతులీయబడునో అదే విధముగా అశ్వము మున్నగువానికి చక్కని శిక్షణారూప ప్రేరణముల నిడుడు. గుఱ్ఱములకీ విధమగు శిక్షణనిచ్చి అలవరించుటకు

**''నిక్రమణం నిషదనం వివర్తనం యచ్చ పడ్వీశమర్వతః ।**

**యచ్చ పపౌ యచ్చ ఘాసిం జఘాస సర్వా తా తే అపి దేవేష్వస్తు''** ॥ ఋ.౧-౧౬౨-౧౪॥ య. ౨౫-౩౮॥

**యదశ్వాయ వాస ఉపస్తృణన్త్యధీవాసం యా హిరణ్యాన్యస్మై ।**

**సందానమర్వన్తం పడ్వీశం ప్రియా దేవేష్వాయామయన్తి** ॥ ఋ.౧-౧౬౨-౧౬॥ య.౨౫-౩౯॥

మున్నగు మంత్రములందు అశ్వములను బయటకు దీయుట, కూర్చుండజేయుట, వ్యవహరింపజేయుట, తినిపించుట, త్రాగించుటమున్నగు ఉత్తమ పద్ధతులను, సకల కార్యములను అశ్వ విద్య యందు నిపుణులగు విద్వాంసుల (దేవేషు) కు స్వాధీనపరచవలెనని కలదు.

## 5.10 మహర్షి దయానందుల భావార్థము

**'హే మనుష్యాః । భవన్తోఽశ్వాదీనాం సుశిక్షణేన భక్ష్యపేయప్రదానేన**

**సర్వాణి కార్యాణి సాధ్నువన్తు'॥**

అనగా; ఓ మానవులారా! మీరు అశ్వములు మున్నగువానికి ఉత్తమ శిక్షణ మరియు అన్నపానీయముల నిచ్చుచు మీ సర్వకార్యములను సిద్ధింపజేసికొనుడు. అశ్వములకు ధరింపజేయు జీను, కళ్ళెము మరియు వాని సువర్ణాభూషణములు, కాళ్ళ తొడుగులు (వీని ధ్వనిచే అశ్వమునకు ఉత్సాహము గలిగించబడును) అశ్వములను (ఆయామయన్తి) ఉత్తమ నియమమునందుంచు బాధ్యత అశ్వ విద్యావిద్వాంసులకీయుడు.

భావార్థం : - **యది మనుష్యా అశ్వాదీన్ పశూన్ యథావద్ రక్షయిత్వోపకారం**

**గృహ్ణీయుస్తర్హి బహూ కార్యసిద్ధ్యుపకృతాః స్యుః**

అనగా; పశువులను, అశ్వములను యథావతుగ రక్షణ నొనర్చుచు ఉపకారమును పొందు మానవులు అనేక కార్యములందు సిద్ధిని పొందెదరు. ఈ సూక్తము నందు సుమారు అన్ని మంత్రములందును ఇదే విధముగు స్పష్ట నిర్దేశము గలదు. చివరకు కూడా ఈ విషయమే చెప్పబడియున్నది.

**సుగవ్యం నో వాజీ స్వశ్వ్యం పుంసః పుత్రాం ఉత విశ్వాపుషం రయిమ్ ।**

**అనాగాస్త్వం నో అదితిః కృణోతు క్షత్రం నో అశ్వో వనతాం హవిష్మాన్ ॥** ఋగ్. ౧-౧౬౨-౨౨ । య.౨౫-౪౫॥

సర్వ శక్తిమంతుడగు పరమేశ్వరుడు మాకు చక్కని గోవులను, ఉత్తమాశ్వములను, వీర సంతానమును మరియు అందరను పుష్టి పరచు ధనమును ప్రసాదించుగాక. అఖండిత వేదవాణి మమ్ము (అనాగస్త్వం కృణోతు) నిరపరాధుల నొనర్చు గాక. (హవిష్మాన్) ''ప్రశస్తాని హవీంషి - సుఖదానాని యస్మిన్ సః'' సుఖదాయకమగు అశ్వము (నః) మా యొక్క (క్షత్రమ్) శక్తివంతమగు రాష్ట్రమును (వనతామ్) సేవించుగాక - మా రాష్ట్రమందు సుఖదాయకమగు ఉత్తమాశ్వములుండుగాక.

ఈ ప్రార్థన ఉత్తమ సుశిక్షిత అశ్వములు మున్నగు వాని సంబంధములోనే ఉపయుక్తము గాని అశ్వములు మున్నగు ఉపకారక పశువుల హింసయందు గాదని గలదు. పశుహింస మహాపాపకార్యమే గాక అపరాధము గూడాయై యున్నది.

ఈ సూక్తము నందలి కొన్ని మంత్రములకు సాయణాచార్యుడు, ఉవ్వటుడు, మహీధరుడు మున్నగు భారతీయులు, మైక్స్ మూలర్, గ్రిఫిథ్, విల్సన్ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు పశుహింసా పరక అర్థము నొనర్చి వారు తమ అజ్ఞాన, అసంపూర్ణ విద్యాభ్రాంతులను ప్రదర్శించుకొనినా రనవచ్చును. ఏలన; మంత్రము లందు హింసా విధానము లేకపోవుటయే గాక హింసయొనర్చువారిని, మాంస భక్షణ మొనర్చు వారిని దండించు విధానము గలదు. ఉదాహరణార్థము;

**యే వాజినం పరిపశ్యన్తి పక్వం య ఈమాహుః సురభిర్నిర్హరేతి ।**

**యే చార్వతో మాంసభిక్షాముపాసత ఉతో తేషామభిగూర్తిర్న ఇన్వతు ॥** య.౨౫-౩౫॥

దీని భావార్థము మహర్షి దయానందులిట్లు వ్రాసి యున్నారు. **'యేఽశ్వాది శ్రేష్ఠానాం పశూనాం మాంసమత్తుమిచ్ఛేయుస్తే రాజాదిభిః శ్రేష్ఠైర్నిరోద్ధవ్యాః'**

అనగా; అశ్వము మున్నగు ఉపకారక జంతువుల మాంసమును భక్షించదలచువారిని రాజు మున్నగు శ్రేష్ఠ పురుషులు దండించి దానిని నిలిపివేయు చర్య దీసికొనవలెను.

**యన్నీక్షణం మాంస్పచన్యా ఉఖాయాః** ॥ యజు.౨౫-౬॥

మహర్షి దయానందుల భావార్థము

**యే కేచిదశ్వాదీనామ్ ఉపకారిణాం పశూనాం శుభానాం పక్షీణాం ।**

**చ మాంసాహారం కుర్యుస్తేభ్యో దణ్డో యథాపరాధం దాతవ్య ఏవ॥**

అనగా; ఎవరేని అశ్వములు మున్నగు ఉపకారక పశువుల మరియు ఉత్తమ పక్షుల మాంసమును దినుచో వారిని యథాపరాధము దండించవలయును. యజుర్వేద ౨౫- ౩౭ వ మంత్ర మగు '**మాత్వాగ్నిర్ధ్వనయీద్ ధూమగన్ధిః**' యొక్క భావార్థమిట్లు గలదు.

**హే మనుష్యాః! యథా విద్వాంసో మాంసాహారిణో నివార్యాశ్వాదీనాం ।**

**వృద్ధిం రక్షాం చ కుర్వన్తి తథా యూయమపి కురుత॥**

ఓ మానవులారా! విద్వాంసులు మాంసాహారుల మాంసభక్షణ యలవాటును మాన్పించి అశ్వములు మున్నగు పశువుల వృద్ధి పరచునట్లు మీరును చేయుడు.

భారతీయ, పాశ్చాత్య విద్వాంసు లెవ్వరును ఈ మంత్రములకు పశుహింసాపరమైన అర్థము నొనర్చినచో వారి విషయమున దిగువ మహాభారత శ్లోకము జ్ఞప్తికి వచ్చును.

**లుబ్ధైర్విత్తపరైర్బ్రహ్మన్, నాస్తికైః సంప్రవర్తితమ్।**

**వేదవాదానవిజ్ఞాయ, సత్యాభాసమివానృతమ్ ॥**

వేదముల వాస్తవికార్థము నెరుగజాలక పైపైగా సత్యవంతులుగా నటించువారే వాస్తవముగా అసత్యార్థములను ప్రకాశపరచినారు. కావున అట్టివారికి మహాభారతమున లోభి, నాస్తికుల వంటి కఠోరశబ్దములు ప్రయోగించబడినవి. ఇక నిట్టి నాస్తికుల వాక్యము లెట్లు గౌరవింపబడగలవు?

**యే వాజినం పరిపశ్యన్తి పక్వం య ఈమాహుః సురభిర్నిర్హరేతి ।**

**యే చార్వతో మాంసభిక్షాముపాసత ఉతో తేషామభిగూర్తిర్న ఇన్వతు ॥**

ఈ మంత్రమునకు అతిశిక్షణ (జ్ఞానము) గలిగించు అనేక అర్థములు గలవు. (యే అర్వతః) అశ్వస్య (మాంసభిక్షామ్) మాంసయాచనామ్ ఉపాసతే (యే అశ్వమ్ ఈమ్) ప్రాప్తం హన్తవ్యమ్ (ఆహుః) తాన్ (నిర్హర) దూరే ప్రక్షిప యే (వాజినమ్) వేగవన్తమ్ అశ్వమ్ (పక్వమ్) పరిపక్వ స్వభావమ్ (పరిపశ్యన్తి) సర్వతోఽన్వీక్షన్తే ఉతో అపి తేషామ్ (సురభిః) సుగన్ధః (అభిగూర్తిః) అభ్యుద్యమః (నః) అస్మాన్ (ఇన్వతు) ప్రాప్నోతు.

అనగా; అశ్వ మాంసమునుగోరువారిని, గుఱ్ఱములు చంపయోగ్యమైన వని చెప్పువారిని హరించివేయుము. లేక దూరము తరిమివేయుము. అశ్వములను శక్తివంతమొనర్చి శిక్షణ నిచ్చువారి చక్కని సుగంధము వంటి స్వభావమును ఎల్లరును ప్రాప్తించుకొనెదరు గాక. అట్టి చక్కని ప్రయత్నములు వారి ఉత్తమ కర్మలు మాకును ప్రాప్తించు గాక.

పశుహింస, మాంసభక్షణ నిషేధయుక్తమగు మహర్షి దయానందకృత అర్థ మెక్కడ? మరియు సాయణాచార్యుడు వారి అనుయాయులగు స్వదేశ, విదేశ విద్వాంసుల భ్రష్టత్వ అసంగత్వ అర్థము లెక్కడ? ఆ రాక్షస స్వభావులు అశ్వమాంసమును అగ్నియందు పక్వమొనర్చుటను జూచుచు ఈ చనిపోయిన అశ్వము

అగ్నియందు పక్వమగుటను జూచి ఎంతో చక్కని సుగంధము వచ్చుచున్నదని చెప్పుచు అట్టి అశ్వమాంసమును భిక్షగా గోరుదురు. అట్టివారి ఉద్యమము (ప్రయత్నము) మాకు ప్రాప్తించుగాక అనిగలదు. చూడుడు. ఈ యర్థమెంతటి అసంగతముగా ఉన్నదో, అల్పబుద్ధి గలవారు కూడా ఈ వేద విరుద్ధమగు వాక్యములను మన్నించజాలరు. ఈ మంత్రమునకు దిగువ చూపిన విధముగా బ్రహ్మచారి, మరియు శూరవీరుల పరమగు అర్థము కూడా వచ్చును. అది ఇట్లు గలదు.

ఏ విద్వాంసులు (వాజినమ్) జ్ఞానవంతులు, బలశాలురగు బ్రహ్మచారులను (పరిపశ్యన్తి) బహుబాగుగా జూచెదరో, మరియు వీరెవ్వరిని దృష్టియందుంచుకొని (పక్వమ్) జ్ఞానాదులను దృష్టియందుంచుకొని పరిపక్వమైనవారని యందురో, మరియు నెవ్వరు (సురభిః) ఉత్తమ ఆచార మను సుగంధముతో గూడినవారో (నిర్హర) మా భిక్షను స్వీకరింతురుగాక. (ఇతి) ఈ భావముతో (యే) ఏ గృహస్థులు (అర్వతః) జ్ఞానులు **'అర్వ-గతౌ గతేస్త్రయోఽర్థాః జ్ఞానం గమనం ప్రాప్తిశ్చ'** (మాంసభిక్షామ్) మనస్సునకు ప్రియమగు పదార్థముల భిక్షకొరకు **'మాననం వా మానసం వా మనోఽస్మిన్ సీదతీతి మాంసమ్'** (నిరుక్తే ౪-౧-౩) ప్రతీక్షించెదరో అట్టి శ్రేయోభిలాషులగు పురుషుల (అభిగూర్తిః) ఉద్యమ ప్రయత్నములు సఫలరూపమున మాకు ప్రాప్తించుగాక.

శూరవీరుల పరమగు అర్థము :- ఏ (వాజినమ్) బలశాలిని (వాజ ఇతి బలనామ నిఘణ్టౌ ౨-౯ ॥) జూచి ఆయనను పరిపక్వ శస్త్రకౌశలమునందు చక్కని అభ్యాసము గలవాడని యందురో అతడు (సురభిః) సురక్షితముగా పరరాష్ట్ర లక్ష్మిని తెచ్చునుగాక.

ఈ విధముగా ఎవడు (అర్వతః మాంసభిక్షామ్ ఉపాసతే) గతిశీల బలశాలి పురుషుని శరీరయాచనను ప్రతీక్షింతురో వారు రాష్ట్రము పట్ల యొనర్చిన పరిశ్రమ మాకు ప్రాప్తించుగాక. రాజు తన రాష్ట్రమందు బలశాలురగు వారి శక్తి సామర్థ్యములను పరిపక్వపరచి వారి శరీర బలములను యుద్ధము మున్నగు రాష్ట్ర రక్షణ కార్యములందు వినియోగించుకొనవలెనని యభిప్రాయము.

**యత్ తే గాత్రాదగ్నినా పచ్యమానాదభి శూలం నిహతస్యావధావతి ।**

**మా తద్భూమ్యామాశ్రిషన్మా తృణేషు దేవేభ్యస్తదుశద్భ్యో రాతమస్తు ॥** య.౨౫-౩౪॥

ఈ మంత్రమునకు సాయణాచార్యుడు, ఉవ్వటుడు, మహీధరుడు మున్నగు వారుగొప్ప అనర్థమునే జేసినారు. వారి ననుసరించి దీనియర్థము 'ఓ అశ్వమా! అగ్ని యందు పాకమొనర్చిన చనిపోయిన నీయవయవముల నుండి లేచి వచ్చు మాంసరసము భూమి మరియు తృణముపై పడకుండుగాక. అది దానిని కోరుకొను దేవతలకు చెందునుగాక' వాస్తవముగ నిది పైనుదహరించిన మంత్రముల భావమునకును, అధ్వరుల అహింసాత్మక అర్థములకును విపరీతమై యుండు కారణమున మన్నించదగినది గాదు. దీని వాస్తవికార్థమేమనగా; ఓ మానవులారా! **(నిహతస్య తే) విశ్వయేవ కృతశ్రమస్యతవ హన్-హింసాగత్యోరితి అత్ర గత్యర్థో** గ్రాహ్యః (అగ్నినా) **అన్తఃకరణరూప తేజసా (పచ్యమానాత్) (గాత్రాత్) యత్ (శూలమ్) శుశీఘ్రం లాతి - బోధం**

**గృహ్ణోతి యేన తద్వచః పృషోదరాదిత్వాత్ సాధు । (అభ్యవధావతి) గచ్ఛతి తత్ (భూమ్యామ్) (మా(శిషత్) (తృణేషు) (మా(శిషత్) కిన్తు తచ్చ (ఉశద్భ్యః) కామయమానేభ్యః (దేవేభ్యః) విద్వద్భ్యః (రాతమ్) దత్తమ్ అస్తు ।**

**భావార్థము :–** హే మనుష్యాః । యాని జ్వరాదిపీడితాన్యఙ్గాని భవేయు స్తాని వైద్యేభ్యో నీరోగాణి కార్యాణి తైర్యదౌషధం దీయేత తద్ రోగిభ్యో హితకరం భవతి ।

అనగా; ఓ మానవులారా! జ్వరములు మున్నగు వానిచే పీడించబడు అంగములను వైద్యులచే రోగరహితమొనర్చుకొనవలెను. ఏలన; సద్వైద్యులచే నీయబడు ఔషధము రోగులకు హితకారకమగును. మానవులు వ్యర్థ వచనములను ఉచ్చరించరాదు. కాని విద్వాంసులయెడ ఉత్తమ వచనములనే సదా ప్రయోగించుచుండ వలయును.

**'ఇమం మా హింసీరేకశఫం పశుం కనిక్రదం వాజినం వాజినేషు ॥'** య.౧౩-౪౭॥

మున్నగు మంత్రముల ద్వారా స్పష్టముగా అశ్వహింసా నిషేధము గలదు. దీని వ్యాఖ్యానొనర్చుచు అశ్వహింస నిషేధమును గురించి శతపథ కారుడిట్లు వ్రాసియున్నాడు.

**ఇమం మా హింసీరేకశఫం పశుమిత్యేకశఫో వా ఏష పశుర్యదశ్వస్తం ।**

**మా హింసీరితి** ॥ శతపథ బ్రా. పు.౬౬౮ ॥

అనగా; 'ఏకశఫ పశు' వనగా అశ్వమని తాత్పర్యము. దానిని హింసించకుము. ఈ సూక్తమందును మాటిమాటికి పశుహింసా నిషేధము గలదు.

అచ్ఛిద్రా గాత్రా వయునా కృణోత ॥ యజు. ౨౫-౪౧ ॥

అశ్వ శిక్షకులు ఈ అశ్వము యొక్క శరీరమును (వయునా) జ్ఞానపూర్వకముగా (అచ్ఛిద్ర) శక్తిమంతము, దోష రహితముగ నుండునట్లు చేయవలెను. (పరుష్పరనుఘుష్యా విశస్త) ప్రతిమర్మస్థలమును పరిశీలించి ఘోషణాపూర్వకముగా దోషములను దొలగించివేయవలయును.

**మా త్వా తపత్ ప్రియ ఆత్మాపి యన్తం మా స్వధితిస్తన్వ ఆతిష్ఠిపత్తే ।**

**మా తే గృధ్నురవిశస్తాతిహాయ ఛిద్రా గాత్రాణ్యసినా మిథూ కః** ॥ య.౨౫-౪౩ ॥

ఈ మంత్రము నందును ఇదే యుపదేశము గలదు.

**సర్వైర్మనుష్యైః స్వ స్వ ఆత్మా శోకే న నిపాతనీయః కస్యాప్యుపరి వజ్రో న**

**నిపాతనీయః, కస్యాప్యుపకారో న విచ్ఛేదనీయశ్చ ॥**

మానవులెవ్వరును తమ యాత్మలను శోకమునందు బడవేయవలదు. ఎవ్వరిపైనను వజ్రములను వేయవలదు. ఇతరులొనర్చిన ఏ యుపకారమును కూడా నష్టపరచుటగాని, నిస్మృత మొనర్చుట (మరచిపోవుట)

గాని చేయవలదు. ఇదే విధముగా 'మా స్వధితిస్తన్వ ఆతిష్ఠిపత్ తే' శబ్దముల ద్వారా పశుహింసాపరమగు అర్థములనొనర్చుట సంపూర్ణముగా అనుచితము. పౌరాణికులు, మరియు వామమార్గీయులు అజ్ఞానముచే నీచమగు కల్పనల నొనర్చినారు అనగా; యజ్ఞములందు బలియగు పశువులు మరియు ఆ యజ్ఞ యజమానులు స్వర్గమునకు జేరుదురు అని వ్రాసినారు. కాని ఇది యుక్తికి, మరియు సామాన్య బుద్ధికి కూడా విరుద్ధమే. ఇది అంధవిశ్వాసముదప్ప మరేమియును గాదు. దీనిని అపహాస్యమొనర్చుచు చార్వాక మత ప్రవర్తకు డీట్లు చెప్పినాడు.

**పశుశ్చేన్నిహితః స్వర్గం, జ్యోతిష్టోమే గమిష్యతి ।**

**స్వపితా యజమానేన, తత్ర కస్మాన్న హింస్యతే ॥** సర్వదర్శన సంగ్రహము. చార్వాక దర్శనము ॥

అనగా; జ్యోతిష్టోమ యజ్ఞమున చంపబడు పశువులు స్వర్గమునకు పోగలిగినచో యజమానుడు తన తండ్రిని చంపి నేరుగా స్వర్గమునకేల పంపుకొనలేదు?

ఈ మిథ్యా విశ్వాసమున కాధారము మధ్యకాలీన ఆచార్యులు దిగువ వేదమంత్రము యొక్క అర్థమును అనర్థమొనర్చుటయే.

న వా ఉ ఏతన్మ్రియసే న రిష్యసి దేవాం ఇదేషి పథిభిః సుగేభిః ॥ ఋ.౧-౧౬౨-౨౧, య.౨౩-౪౪॥

దీని యర్థము అశ్వ పరముగా చేయబడినది. అనగా (న వా ఉ) నైవ ఖలు ఏతన్మ్రియసే వా శబ్ద **ఏవకారార్థః । ఉ ఇత్యవధారణే । నైవేదానీమ్ ఇతరాశ్వ వన్మృతో భవసి దేవత్వ ప్రాప్తేర్వక్ష్య మాణత్వాత్ । అత ఏవ (న రిష్యసి) న హింస్యసే వ్యర్థహింసాయా అభావాత్ । అను ప్రత్యక్షోఽవయవనాశశ్చ దృశ్యతే కథమేవముచ్యత ఇతి ఉచ్యతే (సుగేభిః) శోభన గమన సాధనైః (పథిభిః) మార్గైః దేవయాన లక్షణైః (దేవాన్ ఇతి ఏషి) దేవానేవ ప్రాప్నోషి అతో యుక్తైషా యుక్తిః** సాయణ భాష్యమ్ ॥

సాయణుడీ మంత్రార్థము నిట్లొనర్చినాడు; 'ఓ అశ్వమా! నీవితర పశువుల వలె మరణించుట లేదు. ఏలన; నీకు దేవత్వము ప్రాప్తించుచున్నది. నీవు హింసించబడుట లేదు. ఏలన; ఇచ్చట వ్యర్థహింసలేదు. ప్రత్యక్షరూపములో అవయవ నష్టమగు చుండగా నీ విట్లెందు కనుచున్నావు?' అనగా, దీని సమాధానమిట్లు గలదు. చక్కని దేవయాన మార్గముల ద్వారా దేవతలకు నీవు ప్రాప్తించుచున్నావు. కావుననే మా యీ కథనము సత్యమై యున్నది. మహీధర, ఉవ్వటుడు మున్నగువారు కూడా ఇట్టి యర్థమునే చేసియున్నారు. కావున ఇది సంపూర్ణముగా అశుద్ధార్థమేయై యున్నది. ఏలన; జ్ఞాన వివేకములు లేని అశ్వమునకు దేవత్వము ప్రాప్తించుట అసంభవము. మంత్రమునకు చక్కని మరియు సత్యమగు అర్థమేమన; **(న వై) నిశ్చయే (ఉ) వితర్కే (దేవాన్) విదుషో దివ్యాన్ పదార్థాన్ వా (ఇత్) ఏవ (ఏషి) ప్రాప్నోషి (పథిభిః) మార్గైః సుఖేన గచ్ఛన్తి ఏభిః।**

**భావార్థః – యథా విద్యయా సంయుక్తైర్వాయుజలాగ్నిభిర్యుక్తే రథే స్థిత్వా**

**మార్గాన్ సుఖేన గచ్ఛన్తి తథైవాత్మజ్ఞానేన స్వస్వరూపం నిత్యం బుద్ధ్వా**

**మరణ హింసాత్రాసం విహాయ దివ్యాని సుఖాని ప్రాప్నుయుః ।**

అనగా; విద్య ద్వారా చక్కగా నుపయోగింపబడిన అగ్ని, జలము, వాయువు మున్నగు వానిచే యుక్తపరచిన రథమునందు గూర్చుండి మార్గములపై సుఖముగా ప్రయాణమొనర్చునట్లు ఆత్మ జ్ఞానము ద్వారా సదా తన స్వరూపమును దెలిసికొనుచు మరణము, హింస యను భయములను వదలి దివ్యసుఖముల ననుభవించవలెను. ఇప్పుడాలోచించుడు. మహర్షి దయానందకృత సత్యము, శ్రేష్ఠమగు అర్థమెక్కడ? మరియు మధ్యకాలీన ఆచార్యులు, మరియు వారి యనుయాయులగు మైక్స్‌మూలర్, గ్రిఫిద్, మున్నగువారు వ్రాసిన బుద్ధి విరుద్ధమగు అంధ విశ్వాస సూచకమగు, అపహాస్య జనక అర్థమెక్కడ? వీనియందు భూమ్యాకాశముల అంతరము కలదు.

గ్రంథ విస్తరణ భీతిచే అన్ని మంత్రముల సత్యార్థములను ప్రకాశపరచుట ఇచ్చట సాధ్యము గాదు. ఐనను స్థాలీపులాక న్యాయముగా కొన్ని మంత్రముల వివేచన మొనర్చబడినవి. ఇంత మాత్రముతో పక్షపాతరహితులగు విద్వాంసులు యజ్ఞములందు పశుబలుల నిచ్చుట వేదములు మున్నగు సత్యశాస్త్రములకు విరుద్ధమైయున్నదని యెరుగవలెను. అజ్ఞానము, స్వార్థ లోభ కారణములచే వానిని ధూర్తులగువారు. ప్రచార పరచినారు. ఇప్పుడు మేము గోవుల బలి, మరియుగోమాంస భక్షణము మున్నగు విషయములో 'వైదిక్ ఏజ్' మరియు ఇతర గ్రంథముల ద్వారా వ్యాప్త పరచిన భ్రమను గూర్చి ప్రమాణములతో గూడ వివేచన మొనర్చెదము. ఏలనగా, ఈ విషయము అత్యధిక మహత్వ పూర్ణమై యున్నది.

## 5.1 I వేదముల ననుసరించి గోవధ మహాపాపము

*'The RigVeda and Vedic Religion'* అను పేరు గల పుస్తక రచయిత క్లేటన్ *(Clayton)* అను వాతడు *Animal sacrifices* అనగా; పశుయాగ శీర్షికతో పైన దెలిపిన తన పుస్తకములో ఇట్లు వ్రాసియున్నాడు.

***'At one sacrifice, probably a very un-usual sacrifice, performed once in five years called the Pancha Sharadiya Sava, Seventeen young cows were offered. Bullocks, buffaloes and deer were also sacrificed, some time in large numbers. The white Yajurveda mentions 327 domestic animals, including oxen, cows, milch cows that are to be offered along with the horse at the great, horse-sacrifice' (Rigveda and Vedic Religion by Clayton)***

అనగా; ఒకగొప్ప యజ్ఞము నందు బహుశః అది అసాధారణమైనది గావచ్చును. 17 మంచి యవ్వనమందున్న గోవుల బలి ఈయబడుచుండెడిది. ఎద్దులు, గేదెలు, మరియు జింకలను గూడ అనేక సార్లు అతి పెద్ద సంఖ్యలో బలినిచ్చుచుండువారు. శుక్ల యజుర్వేదమందు 327 పెంపుడు పశువుల వర్ణన లభించుచున్నది. దీనియందు వృషభములు, గోవులు, పాడి యావులుగూడా సమకూర్చబడుచుండెడివి అశ్వమేధ యజ్ఞములందు అశ్వములతో గూడ వీని బలి ఈయబడుచుండెడిది.

క్లేటన్ యొక్క అత్యంత అశుద్ధ, అనృతమగు ఈ లేఖకు ఆధారము డా. రాజేంద్ర లాల్ మిత్ర యొక్క *Indo-Aryan* అను పుస్తకము. దీని యందాతడు ఆర్యులనుగోమాంసభక్షకులు, మరియు మద్యమును సేవించు వారని నిరూపించుటకు ప్రయత్న మొనర్చినాడు. దాదాపు పాశ్చాత్య లేఖకులెల్లరును ఈ విధమగు విషయములనే

వ్రాసినారు. వైదిక ఏజ్ లేఖకుడు సైతము అనేకాంశములందీ పాశ్చాత్యుల ఆలోచనలతోనే ప్రభావితుడైనాడు. కావుననే ఆతడు ఈ విషయములో పరస్పర విరుద్ధములగు ఆలోచనలతో 'ఖిచిడీ ' వండి పెట్టినాడు. దీనిని పరిచయమొనర్చి మేము దీని ప్రమాణయుక్తముగా మీమాంస యొనర్తుము. వైదిక కాలము నాటి వివాహ సంస్కార వర్ణన యొనర్చుచు ౩౮౯ వ పుటయందాతడు ఇట్లు వ్రాయ దుస్సాహస మొనర్చియున్నాడు.

*'The guests are entertained with the flesh of cows got killed on the occasion (of marriage)' - Vedic Age P.389*

అనగా; అట్టి అవసరమునందు వచ్చిన అతిథులు చంపబడిన గోవుల మాంసముచే తృప్తిపరచబడుచుండిరి అని వ్రాసినాడు. వాస్తవమునకు ఇది ఎంతయో అశుద్ధము, అసత్యము. వేదములందు గోవులను అంతట అఘ్న్యా, అదితి అను పేర్లతో సంబోధించబడియున్నది. అనగా, దీనియర్థము అహన్తవ్యా, అఖండనీయా అనగా వీనిని ఎప్పుడును, ఏ పరిస్థితి యందును హింసింపగూడదని అన్ని వేదములందును గలదు. వేదములం దనేక స్థానములందు మాటిమాటికి, 'అఘ్న్యా' శబ్ద ప్రయోగము గాంచగలము. ఉదాహరణముగ వాని నుండి ఈ దిగువ కొన్ని మంత్రములనుద్ధృత మొనర్చుచున్నాము. సామాన్యులు కూడా వీనిని సులభముగ గ్రహించగలరు.

**౧. సూయవసాద్ భగవతీ హి భూయా అథో వయం భగవన్తః స్యామ ।**

అద్ధి తృణమఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధముదకమాచరన్తీ' ॥ ఋ.౧-౧౬౪-౪౦॥

ఇచ్చట గోవును 'అఘ్న్యా' అను పేరుతో సంబోధించుచు 'గోవును ఎప్పుడును హింసించకూడదని' స్పష్టముగా అర్థము చేయబడినది. నీవు తృణము, మరియు శుద్ధ జలముల సేవన మొనర్చుచు సదా ఆరోగ్యముగ నుండుము. మేము కూడా నీ యుత్తమ సాత్త్వికమగు దుగ్ధముల సేవించుచు ధర్మము జ్ఞానము ఐశ్వర్యయుక్తులమైయుందుము.

**౨. హింకృణ్వతీ వసుమతీ వసూనాం వత్సమిచ్ఛన్తీ మనసాభ్యాగాత్ ।**

**దుహా మశ్విభ్యాం పయో అఘ్న్యేయం సా వర్ధతాం మహతే సౌభగాయ** ॥ ఋ.౧-౧౬౪-౨౭ ॥

ఇచ్చట కూడా గోవుకు 'అఘ్న్యా' శబ్ద ప్రయోగము గలదు. ఆవు ఆరోగ్యము మున్నగు సౌభాగ్యములకు కారణమనియు చూపబడినది.

**౩. అస్య శ్రేష్ఠా సుభగస్య సన్దృగ్ దేవస్య చిత్రతమా మర్త్యేషు ।**

**శుచిం ఘృతం న తప్తమఘ్న్యాయాః స్పార్హా దేవస్య మంహనేవ ధేనోః** ॥ ఋ.౪-౧-౬॥

ఈ మంత్రమందును గోవును 'అఘ్న్యా' అను పేరుతో సంబోధించుచు పరమేశ్వర దర్శనము యొక్క ఉపమానము పవిత్రమగు కాచిన ఆవు నేతితో పోల్చబడినది తోడ్తో ప్రభుదర్శనము ఆవు యొక్క స్పృహనీయ (కోరదగినది) శక్తి మరియు బుద్ధివర్ధక దుగ్ధధార వంటిదని చూపబడినది. ఇంకను -

**౪. ఘృతేన ద్యావా పృథివీ వ్యున్ది సుప్రమాణం భవత్వఘ్న్యాయాః** ॥ ఋ.౫-౮౩-౮॥

ఎప్పుడును చంపగూడనట్టి గోవునకు యాహార పానీయముల వ్యవస్థ అత్యుత్తముగా నుండవలయును. మరియు దాని శుద్ధ ఘృతముచే పృథివి ఆకాశములను నింపివేయువలయును. గోఘృతముతోనే హవన మొనర్చవలెనను సూచన ఈ మంత్రమున గలదు.

**౫. ఏషస్య కారుర్జరతే సూక్తైరగ్రే బుధాన ఉషసాం సుమన్మా ।**

**ఇషాం తం వర్ధదఘ్న్యా పయోభిర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥** ఋ.౭-౬౮-౯॥

ఈ మంత్రమున కర్మశీలుడగు స్తోత వర్ణన మొనర్చబడినది. ఆతడు ఉత్తమాలోచనలు గలవాడు గావున బ్రహ్మ ముహూర్తములోనే మేల్కాంచి అఘ్న్యా (ఎప్పుడును హింసించదగని) గోవునకు సేవలొనర్చి దాని దుగ్ధధారలతో ఆరోగ్యవంతుడై యుండును.

**౬. నదం వ ఓదతీనాం నదం యోయువతీ నామ్।**

**పతిం వో అఘ్న్యానాం ధేనూనామిషుధ్యసి॥** ఋ.౮-౬౯-౨, సామ. ౧౫౧౨॥

ఇచ్చట కూడా గోవులకు విశేషణముగా 'అఘ్న్యానామ్' అని వచ్చినది. ఇది అత్యంత మహత్త్వ పూర్ణమైయున్నది. మరియు ఋ.౯-౧-౯ మంత్రమందును.

**౭. 'అభీమమఘ్న్యా ఉతశ్రీణన్తి ధేనవః శిశుమ్ । సోమమిన్ద్రాయ పాతవే ॥'**

ఇచ్చట కూడా 'ధేనవః, గోవులకు విశేషణము 'అఘ్న్యా' అని వచ్చినది. ఇది ఎప్పుడును చంపగూడనిది. శిశువులకు దాని క్షీరములు అత్యధిక లాభదాయక మనియును చెప్పబడియున్నది .

**౮. 'ఉత ప్రపిప్య ఊధరఘ్న్యాయా ఇన్దుర్ధారాభిః సచతే సుమేధాః ।**

**మూర్ధానం గావః పయసా చమూష్వభి శ్రీణన్తి వసుభిర్న నిక్తైః'** ॥ ఋ.౯-౯౩-౩॥

ఈ మంత్రమున గోవులను 'అఘ్న్యా' యను పేరుతో బిలుచుచు ఉత్తమ బుద్ధి సంపన్నులు, సౌమ్య స్వభావము గల విద్వాంసులు గోక్షీరములను సేవించుచు గొప్ప లాభమును పొందుదురు అని యుపదేశించబడినది.

**౯. నీచీనమఘ్న్యా దుహే, న్యగ్ భవతు తే రపః** ॥ ఋ.౧౦-౬-౧౧॥

ఇచ్చటను గోవునకు అఘ్న్యా శబ్ద ప్రయోగమున్నది. దీనిని ఉత్తమరీతిలో సేవించు వారికెట్టి పాపములును దరిజేరవు. **'ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః'** ననుసరించి గోదుగ్ధములు మున్నగు సాత్త్విక పదార్థములను సేవించుటచే చిత్తశుద్ధియందును సహాయము లభించును.

గోవును 'అఘ్న్యా' యను పేరుతో సంబోధించుచు దాని క్షీరమయలను బలాత్కారముగా తస్కరించు, మరియు దానిని చంపువారికి అతి కఠోర దండన విధానము గలదు.

౧౦. ఋ.౧౦-౮౭-౧౬లో గోవును 'అఘ్న్యా' అని పేర్కొని దాని పాలను దొంగిలించువానిని, దానిని చంపువానిని కఠిన శిక్షకు గురిచేయవలెనని సూచించినది.

**యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే యో అశ్వ్యేన పశునా యాతుధానః ।**

**యో అఘ్న్యాయా భరతి క్షీరమగ్నే తేషాం శీర్షాణి హరసాపి వృశ్చ ॥** ఋ.౧౦-౮౭-౧౬॥

ఈ మంత్రమందు అశ్వము మరియు నితర పశువుల మాంసభక్షణమును పాపమని తెలుపుటయే గాక అట్టి 'యాతుధానా' హింసకులగు పాపులకు ప్రాణదండన విధానము కూడగలదు. దీనిననుసరించియే మనుమహారాజు కూడా:-

**యక్ష రక్షః పిశాచాన్నం, మద్యం మాంసమథాసవమ్** ॥ మనుస్మృతి. ౧౧-౯౫॥

అనగా; మాంసము, మద్యము మరియు ఆసవము మున్నగు మాదకద్రవ్యముల సేవనము యక్షులు, రాక్షసులు, పిశాచులు మున్నగు వారొనర్తురు. ధర్మాత్ములగు వారెప్పుడును వీనిని సేవించకూడదు.

ఈ పది ఋగ్వేద మంత్రములను మేము ఉదాహరణ రూపములో ఇచ్చియున్నాము. వీనియందు గోవును 'అఘ్న్యా' యను పేరుతో సంబోధించుచు అన్ని విధముల 'అహన్తవ్యా' మరియు హింసించకూడదని చూపినాము. ఇట్టివే వందలాది మంత్రములు కలవు. కాని గ్రంథ విస్తరణ భీతిని మరువలేము. అనేక మంత్రములందు గోఘాతకులను రాజ్యమునుండి వెడలగొట్టుట, మరియు వారి సర్వస్వమును హరించుటకు ఆదేశము గలదు.

ఉదా:- ఋ.౧౦-౮౭-౧౦, అథర్వ ౮-3-౧౬ నందును ఇట్లు చెప్పబడినది.

**విషం గవాం యాతుధానా భరన్తామా వృశ్చన్తామదితయే దురేవాః ।**

**పరైణైనాన్ దేవః సవితా దదాతు పరాభాగమోషధీనాం జయన్తామ్ ॥**

అనగా; ఒక వేళ (యాతుధానాః) ప్రజాపీడకులు (గవామ్) గోవులు మున్నగు పశువులకు (విషమ్ భరన్తామ్) విషమునిచ్చినను, మరియు వానిని చంపినను, మరియు నొకవేళ (దురేవాః) దుష్టాచరణపరులు (అదితయే) గోవును (ఆవృశ్చన్తామ్) కోసినప్పుడు (సవితా దేవః) సర్వజనుల ప్రేరకుడగు రాజు (ఏనాన్) వీరిని (పరాదదాత్) రాజ్యమునుండి పారద్రోలవలయును. వారి సర్వస్వమును హరించివేయవలయును. వారు (ఓషధీనామ్) అన్నము, మరియు ఓషధుల భాగమును (న పరాజయన్తామ్) పొందకుందురు గాక.

**మాతా రుద్రాణాం దుహితా వసూనాం స్వసాదిత్యానామమృతస్య నాభిః ।**

**ప్ర ను వోచ చికితుషే జనాయ మా గామనాగామదితిం వధిష్ట** ॥ఋ.౮-౧౦౧-౧౫॥

అనగా, గోవు రుద్రబ్రహ్మచారులకు తల్లి, వసు బ్రహ్మచారులకుకూతురు వలె ప్రియమైనది. ఆదిత్యబ్రహ్మచారులకు సోదరి వంటి స్నేహశీలి, క్షీరరూప అమృతకేంద్రము వంటిది. ఇట్టి (అనాగామ్) నిర్దోషి (అదితిమ్) హింసింపరానిదగు (గామ్) గోవులను ఎప్పుడును (మావధిష్ట) చంపవలదు. ఈ విధముగా నేను (చికితుషే జనాయ) ఆలోచనశీలురగు ప్రతి మనుష్యునకును (ప్రనుహోవచమ్) ఉపదేశించుచున్నాను.

''అథర్వ సంహితోపనిషచ్ఛతకము'' యొక్క లేఖకుడగు స్వ. శ్రీమహేశ్వరానందగారు 'మాతారుద్రాణామ్' అను మంత్ర వ్యాఖ్య యందు (రుద్రాణామ్) క్షత్రియాణామ్ - (వసూనామ్) వైశ్యానామ్, (ఆదిత్యానామ్), బ్రాహ్మణానామ్ అను అర్థమునిచ్చినాడు.

### 5.12 యజుర్వేదమందు గోవధ నిషేధ విషయక స్పష్టమగు ఉపదేశము

ఋగ్వేదము వలె యజుర్వేదమందును గోవు యొక్క మహత్త్వమును సూచించుచు వాని హింసను నిషేధించుటయేగాక వానిని వధించు దుష్టులకు ప్రాణదండన విధానము కూడ అనేక మంత్రము లందుగలదు. ఉదా. నిమ్న మంత్రమును జూడుడు;

**ఇమం సాహస్రం శతధారముత్సం వ్యచ్యమానం సరిరస్య మధ్యే ।**

**ఘృతం దుహానామదితం జనాయాగ్నే మా హింసీః పరమే వ్యోమన్** ॥ య.౧౩-౪౯॥

(అగ్నే) దయాస్వరూపుడవు, పరోపకారివగు ఓ రాజా! నీవు (జనాయ) మనుష్యులు మున్నగు ప్రాణులకు (ఇమమ్) ఇట్టి (సహస్రమ్) అసంఖ్యాక సుఖములకు సాధనము (శతధారమ్) అసంఖ్యాక క్షీరధారల నిమిత్తము (వ్యచ్యమానమ్) అనేక విధములుగ పాలించదగిన (ఉత్సమ్) కూపము (బావి) వలె రక్షణ చేయునట్టి వీర్యసేచక వృషభము వంటి (ఘృతమ్) నేతిని (దుహానామ్) పూర్ణమొనర్చుచు (అదితిమ్) ఎప్పుడును చంపదగనట్టి గోవును (మా హింసీః) చంపకుము. రాజు కొరకీ యుపదేశ తాత్పర్యమేమన; ఆతడు రాజ్యమునందు విధి లేదా శాసనము ద్వారా గోవధను (గోవులు, ఎద్దులు, గేదెలు, అశ్వములు, వాని దూడలు మున్నగు వాని వధను) మాన్పించివేయవలెను. దీని నుల్లంఘించునట్టి వారికి యజు.30-౧౮ వ మంత్రమున విధానము గలదు అనగా ; **'అన్తకాయ గోఘాతకమ్'** గోహత్యయొనర్చువారికి మృత్యుదండన నీయవలెను. గోహత్య మహాపాపము, మరియు మహాపరాధమని నిరూపించుట కింతకన్న అధికమేముండును?

### 5.13 అథర్వవేదమందు గోవధ నిషేధమును గూర్చిన ఆదేశములు

ఇతర వేదముల వలె అథర్వ వేదమందును గోవధ నిషేధము, మరియు గోరక్షా ప్రతిపాదకములగు అనేక మంత్రములు స్పష్టముగా గలవు. 'అఘ్న్యా' శబ్దము గోవున కనేక స్థానములందు ప్రయోగించబడినది ఉదాహరణార్థము -

**సహృదయం సాంమనస్యమవిద్వేషం కృణోమి వః ।**

**అన్యో అన్యమభిహర్యత వత్సం జాతమివాఘ్న్యా** ॥ అథర్వ. 3-30-౧ ॥

ఈ మంత్రము ద్వారా పరమేశ్వరు డిట్లుపదేశించుచున్నాడు. నేను మీ హృదయములను, మనస్సును ద్వేష భావమును దూరమొనర్చెదను. నవ జాత లేగ (దూడ)ను గోవు ప్రేమించునట్లు ఏకము చేయుదును. పరస్పరము మీరు ప్రేమగా నుండుడు. ఆవు ఎప్పుడును చంపరానిదని దీనియర్థము. ఋగ్వేదమునందు వలె అథర్వ వేదమందును గోవధ నిషేధము, గో మహిమ గలదు.

**యూయం గావో మేదయథా కృశం చిదశ్రీరం చిత్ కృణుథా సుప్రతీకమ్ ।**

**భద్రం గృహం కృణుథ భద్రవాచో బృహద్ వో వయ ఉచ్యతే సభాసు** ॥ అ.౪-౨౧-౬॥

ఓ గోమాతా! నీవు నీయమృత ధారలవంటి క్షీరములచే దుర్బల వ్యక్తులను బలశాలురుగ నొనర్తువు. నీ వాణి మహా ఉత్తమమైనది. దాని ద్వారా నీవు గృహమును కల్యాణమయ మొనర్తువు. నీ మహిమలను గొప్ప గొప్ప సభలందు గాన మొనర్చుచుందురు. ఇంతటి ఉపకారకము, మరియు ఉత్తమమగు గోవుల హత్యను గూర్చి వేదములందెచ్చటనైనను ఉపదేశముండగలదా? 'అఘ్న్యా' అను శబ్దమే దీనికి సమాధానమిచ్చుచున్నది. ఈ విషయము నింకను స్పష్టపరచుటకై;

**ప్రజావతీః సూయవసే రుశన్తీః శుద్ధా ఆపః సుప్రపాణే పిబన్తీః ।**

**మా వః స్తేన ఈశత మాఘశంసః పరి వో రుద్రస్య హేతిర్వృణక్తు॥** అథ. ४-२१-७॥

అనగా; ఓ గోవులారా! మీరు ప్రజలయందు సుసంపన్నమైయుండుడు. ఉత్తమ తృణ సమృద్ధమగు బీడులందు విహరించుడు. సుఖ పూర్వకముగ జలము త్రావగల జలాశయములందు శుద్ధ జలములను త్రావుడు, చోరులు, ఘాతకులు మీకు యజమానులు (అధికారులు)గాకుందురు గాక క్రూరుల శస్త్రములు మీపై బడకుండుగాక.

ఈ విధముగ గోవధ సంపూర్ణముగా నిషేధమొనర్చబడినది. ఐనను ఏ దుష్టుడైన ఇట్టి మహాపాపమొనర్చిన, వానికెట్టి శిక్షనీయవలెనో దీనియందు స్పష్టముగా గలదు.

**యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్ ।**

**తం త్వా సీసేన విధ్యామో యథా నోఽసో అవీరహా** ॥ అథ. १-१६-४॥

అనగా; ఓ దుష్టుడా! నీవొక వేళ మా గోవుల, అశ్వముల, గొఱ్ఱెల, మేకలు మున్నగు పశువులను లేక పురుషులను హత్యచేసినచో నిన్ను సీసపుగుండుతో గాల్చి చంపుదుము. ఇచ్చట కూడ పై దెలిపిన ఋగ్యజుర్వేద మంత్రముల వలె గోఘాతకులకు ప్రాణదండన విధించబడినది.

వేదములందు గోపాలనము, గోవధ నిషేధమును గూర్చి ఇంత స్పష్టమైన ఆదేశములుండగా వైదికార్యులు యజ్ఞములందు గోవధ నొనర్చుచుండిరను కల్పన సంపూర్ణముగ అసంగతమేయై యున్నది. (వేదములందు యాతుధాన, హింసక పేర్లతో బిలువబడు నిందనీయులు, పాపులు మున్నగు రాక్షసులు కొంత న్యూనాధికముగ అన్ని కాలములందుండి యున్నారు.) అట్లు వారి యీ నీచకార్యము ఏ విధముగానైనను శిష్టానుమోదితముగ నెంచబడదు ఇట్టివారికి వేదములు మృత్యు దండనమే విధించినవి. కావుననే మహాభారత శాంతి పర్వమునం దెంతయో స్పష్టముగ జెప్పబడియున్నది.

**అఘ్న్యా ఇతి గవాం నామ, క ఏతా హన్తుమర్హతి ।**

**మహచ్చకారాకుశలం, వృషం గాం వాలభేత్తు యః** ॥ శాంతిపర్వ. २६२-४७॥

అనగా, గోవుల నామమే 'అఘ్న్యా' యని గలదు. వానిని మానవులగువారు చంపగలరా? గోవృషభములను చంపువారు మహాపాప, అనర్థకారక కర్మల నొనర్చుచున్నారు.

### 5.14 మహాత్ముడగు గౌతమ బుద్ధుని సాక్షిత్వము

యజ్ఞములందు పశుహింసలకు ప్రబల విరోధియగు మహాత్మా గౌతమ బుద్ధుడును 'బ్రాహ్మణ ధమ్మిక సుత్త' మను గ్రంథమున ఇట్లు వ్రాసియున్నాడు. ప్రాచీన వైదికార్యులు బియ్యము, నేయి మున్నగునవి యాచించి వానిచే యజ్ఞమొనర్చుచుండిరి. యజ్ఞములయందు పశుహింసను చేయకుండిరి. వారికి ఆయన గోవుల యెడ గల శ్రేష్ఠమగు సద్భావన నిర్దేశమును గూర్చి ఇట్లు చెప్పియున్నాడు.

**యథా మాతా పితా భ్రాతా, అఞ్ఞే వాపి చ జాతకా ।**

**గావో నో పరమామిత్తా యాసు జాయన్తి ఓసధా ॥ ౧౩॥**

**అన్నదా బలదా చేతా బణ్ణదా సుఖదా తథా ।**

**ఏతమత్థవసం ఞ్ఞాత్వా, నాస్సు గావో హనింసు తే ॥ ౧౪॥**

అనగా; తల్లి తండ్రి సోదరులు మున్నగు ఇతర బంధుజనుల వలెనే గోవులు మున్నగు పశువులు పరమ మిత్రములై యున్నవి. వీని నుండి ఔషధములు సిద్ధమగును ఇవియే అన్నము, బలము, వర్ణము (రూపము) మరియు సుఖములనిచ్చును. ఈ విషయమున వారు విజ్ఞులు గావున గోవులు మున్నగు పశువులను వారు చంపకుండిరి. (ఈ బ్రాహ్మణ ధమ్మిక సుత్త- అనువాదకుడు, ధర్మ రక్షిత, ప్రకాశక - అకితమా ఆర్య సంఘారామ సారనాథ బనారస.)

లోభవశమున కొందరు బ్రాహ్మణులు వేదమంత్రములను అశుద్ధ పరచి వాని స్థానములందు కల్పిత శ్లోకములను చేర్చి, వాటిని వేదమంత్రములను భ్రమను గలిగించినారు ఇట్టి వర్ణనలు 'బ్రాహ్మణ ధమ్మియ సుత్తము' నందు విస్తారముగ గలవు. వానియుల్లేఖనమిచ్చుట అంత యావశ్యకమనిపించుటలేదు. శ్రీ ధర్మ రక్షితగారు పై దెలిపిన యనువాద భూమికయందు యథార్థముగనే వ్రాసియున్నారు. అనగా; ప్రాచీన వైదిక గ్రంథములు హింసామూలకములుగావనుట సర్వసిద్ధమైయున్నది. అవి మూలవైదిక, ధర్మ బుద్ధ, సిద్ధాంతములకు ప్రతికూలములు గావు. గోహింస యెడ బుద్ధభగవానుడిట్లు తెలిపినాడు.

**'ఏవమేసో అనుధమ్మో పోరాణో విఞ్ఞ గరహితో ॥' ఇత్యాది**

అనగా; ఈ గోహింస పూర్వ విద్వాంసుల దృష్టియందు నిందనీయ నీచకర్మయై యుండెను

### 5.15 'వైదిక్ ఏజ్' లేఖకుల పరస్పర విరుద్ధములు మరియు భ్రమలు

'వైదిక ఏజ్' లేఖకు లీవిషయములో అనేక పరస్పర విరుద్ధములు, మరియు కపోల కల్పిత విషయములు వ్రాసినారు. మేము వారి గ్రంథమునందలి కొన్ని విషయముల నెత్తిచూపుచు వానిని సప్రమాణముగా త్రోసిపుచ్చెదము. వారు తమ పుస్తకములో ఇట్లు వ్రాసినారు.

*'The cow receives the epithet Aghnya* (అఘ్న్యా) *- not to be killed in the RigVeda*

*and is otherwise a very valued possession. It is difficult to reconcile this with the eating of beef, but we may get some explanation if we remember the following -*

1. It was the flesh of the ox rather than of the cow that was eaten. A distinction was definitely made. (Vedic Age. P.393)

2. The flesh of the cow (if at all) was eaten at the sacrifices only and it is well-known that one sacrifices one's dearest possession to please the gods.

*3. Even in the Rigveda, only vashas (*oÌÙ´~ï\ *barren cows) were sacrificed. For example, Agni is called in VII. 43. 11 as* oÌÙFm`ÌÙ¬í *The expression* #gÚn½}m«í *(Cows fit for guests in X 68-3) implies the same distinction (Vedic Age P.393)*

అనగా, ఋగ్వేదములో గోవునకు 'అఘ్న్యా' అను శబ్ద ప్రయోగము గలదు. దీనియర్థము చంపకూడదని. ఇది యొక బహుమూల్య సంపత్తిగా నెంచబడినది. దీనిని గోమాంసభక్షణముతో సమన్వయ మొనర్చుట కఠినమే. ఐనను దిగువ విషయములను మనము ధ్యానమునందుంచికొనినచో కొంత వ్యాఖ్య యొనర్చబడగలదు.

౧. ఎద్దుల మాంసము దినబడుచుండెడిది. గోవులది గాదు అనియు దీని కన్న ముందు చూపబడి

*The guests are entertained with the flesh of the cows killed on the occasion of marriage. (Vedic Age. P.399)*

అనగా; వైదికయుగమున వివాహ సమయములందు తత్కాలము చంపబడిన గోవుల మాంసముచే అతిథులను తృప్తిపరచుచుండిరనియు వ్రాయుట స్పష్టముగా విరుద్ధము.

౨. ఒక వేళ గోమాంసము తినబడుచుండెడిదనియనిన *if at all* అది కేవలము యజ్ఞములందు మాత్రమే. ఏలన; దేవతలను ప్రసన్నుల నొనర్చుకొనుటకు తమ ప్రియతమ వస్తువులను సైతము మనుష్యులు పరిత్యజించుచుండి రనునది సర్వవిదిత విషయము.

**సమాలోచనము :-** ఈ విషయము కూడా సంపూర్ణముగా అశుద్ధమైయున్నది. ఏలన; వైదికసంహితలన్నింటి యందును యజ్ఞములు 'అధ్వర' మను పేరుతో సంబోధించబడినవి. ఈ విషయము నిదే అధ్యాయములో అనేక ప్రమాణముల నిచ్చి చూపబడినది. యజ్ఞములవంటి అతి పవిత్ర కార్యములందు గోమాంసభక్షణమును గూర్చిన కల్పనయు సంపూర్ణముగా అసంగతమే యైయున్నది. మాంసమును దినినచో యజ్ఞము, వ్రతము భంగమగును. మరియు వాని ప్రభావము సంపూర్ణముగా నష్టమగును. దిగువ నుదాహరించిన బ్రాహ్మణ గ్రంథ వచనముల ద్వారా స్పష్టపరచినట్లు;

**అ. న మాంసమశ్నీయాత్, న మిథునముపేయాత్ యన్మాంసమశ్నీయాత్,**

**యన్మిథునముపేయాదితి న త్వేవైషా దీక్షా ॥** శత. బ్రా. ౬-౨-౨-౩౯ ॥

అనగా; మాంసమును దినవలదు. మైథున మొనర్చవలదు. ఒకవేళ మాంసమును దిని మైథునమొనర్చినచో నది దీక్షయే గాజాలదు.

**ఆ. న మాంసమశ్నీయాత్ । న స్త్రియముపేయాత్ । యన్మాంసమశ్నీయాత్ యత్ -**

**స్త్రియముపేయాత్ నిర్వీర్యః స్యాత్నైనమగ్నిరుపనమేత్** ॥ తైత్తిరీయ. ౧-౧-౯ । ౭-౮॥

మాంసమును దినగూడదు. మైథునమొనర్చరాదు. ఒకవేళ మాంసమును దినిన, మైథునక్రియ నొనర్చినచో అట్టివారు నిర్వీర్యులు, మరియు ప్రభావరహితులైపోవుదురు. వారి సంకల్పాగ్ని ప్రజ్వలింపదు. ఇదే విధముగా తాండ్య మహాబ్రాహ్మణములోను

**'యజమానః అహతం వసానోఽవభృథాదుపైతి ।**

**న మాంసమశ్నాతి న స్త్రియముపైతి'** ॥ తాం. మహాబ్రా.౧౭-౧౩-౬, ౧౧-౧౪॥

యజమానులు శుద్ధ నూతన వస్త్రములను ధరించినవారై దీక్షాంతమున జరుగునట్టి అవభృథస్నానమొనర్చుదురు. యజ్ఞ సమాప్తి వరకు వారు మాంస భక్షణమొనర్చరు. మైథునము నొనర్చకుండా యుందురు. ఇదే విధముగ **'అమాంసాశ్యస్త్రబ్రూతే తపస్వ్యను బ్రవా ఇతి'** ॥ శత. ౧౪-౧-౧॥ మున్నగు వాని నుదాహరించవచ్చును.

ఈ విధమగు వచనములచే స్పష్టమగునదేమన; మాంసమును కేవలము సాధారణముగానే గాక యజ్ఞములు మున్నగు పవిత్ర కార్యములందు ప్రయోగించుటను కూడా సంపూర్ణముగా వర్జితమనియే యెంచనగును. అట్టిచో 'అఘ్న్యా' యను పేరుతో బిలువబడు గోమాంస విషయమును గూర్చిన మాటయే ఏముండును? గోమాంసభక్షకుని చండాలుడని యెంచబడుచుండెడిది. మరియు **'అన్తకాయ, గోఘాతమ్'** ॥ యజు 30-౧౮॥ ననుసరించి వారికి ప్రాణదండన శిక్ష వరకు విధానము గలదు. 'త్యాగ' మను దానియర్థము కామ, క్రోధ, లోభాదుల పరిత్యాగమేగాక, గోవుల వంటి ఉపకార పశువధను గూడ త్యజించవలెనని గలదు.

3. ఎద్దు మాంసమును దినుచుండెడివారను మాటయును అబద్ధమే. వేదములందు గోవులకు 'అఘ్న్యా' యను శబ్దమును ప్రయోగించినట్లే వృషభములకును 'అఘ్న్యా' అను శబ్ద ప్రయోగ మనేక స్థానములందును గాననగును. ఉదాహరణముగా;

**విముచ్యధ్వమఘ్న్యా దేవయానా అగన్మ తమసస్పారమస్య । త జ్యోతిరాపామ** ॥ యజు. ౧౨-౭౩॥

ఈ మంత్రములో 'అఘ్న్యా' శబ్దము వృషభములకు వచ్చియున్నది. సాయణాచార్యుడు కాణ్వ సంహిత అ.౧౩ భాష్యమునందు **'అఘ్న్యాః' 'అహన్తవ్యా గావో బలీర్వదాః యూయం విముచ్యధ్వమ్ యుగాని ముఞ్చత'** ॥ అని వ్రాసినాడు.

**కాత్యాయనః - అనడుహో విముచ్యధ్వమితీతి బలీర్వదాన్ విస్సృజేత్** ॥

(సాయణాచార్యకృత కాణ్వ సంహిత భాష్యము)

కాత్యాయన శ్రౌత సూత్రమునందును 'అఘ్న్యా' అర్థము 'అహన్తవ్య బలీవర్ద (ఎద్దు) అని తీసికొని పై నుదాహరించిన మంత్రమునకు **'వృషభోత్సర్గ'** యందు వినియోగమొనర్చినాడు అని ప్రమాణముగనే సాయణాచార్యుడు స్పష్టముగా నిట్లర్థము నొనర్చియున్నాడు. నిమ్న అథర్వ వేద మంత్రమున 'అఘ్న్య' శబ్దము 'వృషభ' మని చెప్పినాడు.

**శృఙ్గాభ్యాం రక్ష ఋషత్యవర్తిం హన్తి చక్షుషా ।**

**శృణోతి భద్రం కర్ణాభ్యాం గవాం యః పతిరఘ్న్యః** ॥ అథర్వ. ౯-౪-౧౭॥

అనగా; గోవుల 'అఘ్న్యా' హింసించదగని పతియగు ఎద్దుల కొమ్ములతో రాక్షసులను, అనగా విఘ్నములను, కన్నులచే జీవనా భావము నష్టమొనర్చబడును. కన్నులతో కల్యాణ కారకములగు విషయములు చూడబడును. దీని భావమేమన, ఎద్దు తన కొమ్ములతో తన రక్షణ తాను స్వయముగా జేసికొనును. కావున మానవ సమాజము దాని రక్షణ యందు శ్రద్ధ యుంచవలెను. అది తన మేతను (ఆహారమును) చూచుకొని కడుపు నింపుకొనును. ఐనను మనము కూడా దాని ఆహారమున శ్రద్ధ వహించవలయును. దానికి మధుర, మరియు ప్రేమగల మాటలను వినుటకు అభ్యాసపరచవలెను. దాని కొమ్ములు దాని రక్షణ కొరకే యుండునట్లు, ఇతరులకు హాని గలుగకుండునట్లు మనము దానికి శిక్షణాభ్యాసములనీయవలెను.

ఇదే సూక్తమునందలి ౧౯వ మంత్రమునందును 'అఘ్న్యానామ్' అనుషష్ఠీబహువచనాంత ప్రయోగము గలదు. 'అఘ్న్య', మరియు అఘ్న్యా యను రెండు శబ్దములతోను అది ఏర్పడును. వాస్తవముగనది రెండింటికిని సంబంధించియున్నది. ఎట్లన;

**బ్రాహ్మణేభ్య ఋషభం దత్వా వరీయః కృణుతే మనః ।**

**పుష్టిం సో అఘ్న్యానాం స్వే గోష్ఠేవ పశ్యతే** ॥ అథ. ౯-౪-౧౯॥

అనగా; బ్రాహ్మణులకు ఋషభము (ఎద్దు)ను దానమొనర్చినట్టి దాత తన స్వార్థ త్యాగము ద్వారా శ్రేష్ఠుడగును. ఆతడు తన గోశాలయందు ఎద్దులను, గోవులను సమృద్ధమగుటను గాంచగలడు. ధ్యానముంచదగిన విషయమేమన; గోవులను, ఎద్దులను దానము నిచ్చు విధానము దీనియందే గాక ఇతర మంత్రములందును గలదు. కాని వానిని చంపు విధానము గాదు. ఇంకను

**గావః సన్తు ప్రజాః సన్త్వథో అస్తు తనూబలమ్ ।**

**తత్సర్వమనుమన్యన్తాం దేవా ఋషభదాయినే** ॥ అథ. ౯-౪-౨౦ ॥

సత్పాత్రులకు వృషభదాన మొనర్చు వారి గోవులు ఉత్తమ సంతానాదులచే వృద్ధి చెందుచుండును. విద్వాంసుల ఆదేశానుసారము వ్యవహరించి వానిని శారీరకముగా శక్తివంతమొనర్చుచుండును ఉక్షా, ఋషభ మున్నగు శబ్దములపై ముందాలోచించుదము.

3. వైదిక ఏజ్ లేఖకులు ఈ గోమాంస భక్షణమును గూర్చి ఇట్లు వ్రాసినారు. 'ఋగ్వేదమునందు కూడా కేవలము వశములను (గొడ్డుటావులను) బలినిచ్చు విధానము గలదు. ఉదాహ:- ఋగ్వేదమున అగ్ని వశాన్నమను పేరుతో పిలువబడినది. 'అతిథినీర్గాః' అనగా, అతిథులకు యోగ్యమగు ఆవులు, అను ప్రయోగము ఋ ౧౦-౬౮-౩న గలదు'

సమీక్షా:- ఋగ్వేదములో 'వశా' యను పేర వంధ్యా గోవుల నాహుతినిచ్చు విధానము గలదనుట కూడా సంపూర్ణముగ అశుద్ధమే. దీని యర్థమును యథార్థముగ దెలిసికొను సామర్థ్యము వారి యందు లేదనవచ్చును. దానియర్థమిట్లున్నది.

**ఉక్షాన్నాయ వశాన్నాయ సోమపృష్ఠాయ వేధసే। స్తోమైర్విధేమాగ్నయే** ॥ ఋ.౮-౪౩-౧౧ ॥

ఈ మంత్రమునకు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక దృష్టితో అనేకార్థములు గలవు. 'అగ్ని' పేరుతో పరమేశ్వరుని గ్రహించునప్పుడు ''బ్రహ్మాగ్నిః'' ॥ శ.౧-౩-౩-౧౯ ॥ మున్నగు వాని యందు సూచించినట్లు దానియర్థము 'ఉక్షేతి మహన్నామ' ॥ నిఘం ౩-౩ ॥ ప్రళయకాలమున మహాసూర్యాదులు కూడా దానికి అన్నము, లేక భోజ్యము వంటివగును. మరియు ఇయం (పృథివీ) వై వశాపృశ్నిః ॥ శత. ౧-౮-౩-౧౫ ॥, ఇయం (పృథివీ) వై వశా పృశ్నిః ॥ శత. ౫-౧-౩ ॥ ననుసరించి వశా-పృథివీ యనునవి కూడా దానికి అన్నము వలె భోజ్యపదార్థములగును ఇట్లే (వేధసే) సర్వజ్ఞుడగు (అగ్నయే) పరమేశ్వరునకు ('స్తోమైః నమసా విధేమ) నమస్కారపూర్వకముగా స్తుతులచే సేవించెదము.

ఆధిభౌతికాగ్ని పరముగా అర్థమును గొనినప్పుడు ఉక్షా, మరియు వశా శబ్దముల అర్థములపై తప్పక ఆలోచించవలసియుండును. ఈ శబ్దనముల అర్థము తరచుగా ఎద్దులు, మరియు గొడ్డుటావులని దెలిసికొనబడుచున్నది. కాని వాస్తవముగ అట్లు కాదు యజ్ఞ ప్రకరణమునందు ఉక్షా, మరియు వశా అను రెండు శబ్దములకును ఓషధీపరమగు అర్థమునే గ్రహణ మొనర్చవలయును. అవి అగ్నియందు వేయబడును. ఉక్షాయను శబ్దార్థము వాచస్పత్య బృహదభిధానము నందు 'సోమ' మని, మరియు శివరామ ఆప్టే యను నాతని *Sanskrit English Dictionary* పు.౨౫౪లో 'సోమ' మరియు ఋషభౌషధి యనియును ఈయబడినది. సాయణాచార్యుడు కూడా అనేక స్థానములందు 'ఉక్ష'యనుదానికి సోమ పరమగు అర్థమునే యొనర్చినాడు. ఉదా:-

**'ఉక్షాణం పృశ్నిమపచన్త ధీరాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్'** ॥ ఋ.౧-౧౬౪-౪౩॥

ఈ మంత్ర భాష్యము నందాతడు:- **(ఉక్షాణమ్) ఫలస్య సేక్తారమ్ (పృశ్నిమ్) శుక్లవర్ణమ్ ప్రాశ్నుతే తేన ఫలమితి వా స్వయం ప్రాశ్నుత ఇతి వా పృశ్నిర్వల్లీ రూపః సోమః తం (వీరాః) వివిధ ప్రేరణాకుశలా ఋత్విజః (అపచన్త) అత్ర ధాత్వర్థానాదరేణ తిజ్ ప్రత్యయః కరోత్యర్థః స చ క్రియా సామాన్యవచనః అత్రౌచిత్యాదభిషవేణ సమ్పాదితవన్తః (తాని) తత్సాధనాని (ధర్మాణి) అనుష్ఠానాని (ప్రథమాని) ప్రథమాని-ప్రకృష్టాని ఫలపర్యవ సాయీని (ఆసన్) సమ్పాదితాన్యభవన్ యద్ వా సోమ ఉక్షాభవత్**

**పూర్వతం దేవాః శకృతాపచన్ యజ్ఞార్థేతద్భవో ధూమో మేఘ ఆసీత్ తదుచ్యతే । తత్పరత్వేన వా మన్త్రో వ్యాఖ్యేయో విచక్షణైః** ॥ వైదిక సంశోధన సంస్థా పూనా సం. భాగ.౧. పు. ౧౦౦౮-౯ ॥

ఇచ్చట 'ఉక్షా' యను శబ్దమునకు సోమ పరకార్థము అత్యంత స్పష్టముగ నున్నది. ఉక్షా పచన తాత్పర్యమేమన ఇచ్చట సోమము యొక్క పాకము, లేక ఆహుతి యను విషయమును మరువ రాదు. 'మోనియర్ విలియమ్స్ కృత సుప్రసిద్ధ *Sanskrit English Disctionary* పు. ౧౭౨లో 'ఉక్షా' పదమునకర్థ మొనర్చుచు;

*ఉక్షన్ Ukshan - Name of soma (as sprinkling or scattering small drops) name of the maruts of the sun and Agni - one of the eight chief medicaments Rishabha.*

*(Sanskrit English Dictionary by Monior Williams P. 172)*

దీనిననుసరించి 'ఉక్ష' యను శబ్దమునకు సోమ, సూర్య, ఋషభకమను ఓషధుల నామములు, ఋషభక, మరియు జీవకముల వర్ణనము 'భావప్రకాశ' మను గ్రంథమునందిట్లు గలదు.

'**జీవకర్షభకౌ జ్ఞేయౌ, హిమాద్రిశిఖరోద్భవౌ ।**

**రసోనకన్దవత్కన్దౌ, నిస్సారౌ సూక్ష్మ పత్రకౌ** ॥ భావ ప్రకాశే ॥

ఈ ఋషభకమను పేరుగల ఓషధి వర్ణనము వేదమున నిట్లున్నది.

**హిరణ్యశృఙ్గ ఋషభః శాతవారో అయం మణిః ।**

**దుర్ణామ్నః సర్వాంస్తృఢ్వావ రక్షాంస్యక్రమీత్** ॥ అథర్వ ౧౯ - ౩౬ - ౫ ॥

అనగా; ఈ సువర్ణ ప్రకాశము, శృంగములు గల ఋషభమను మహౌషధము చెడుపేర్లతో బిలువబడు త్వచా (చర్మ) సంబంధమగు సర్వ దూషిత వ్యాధులను పారద్రోలును. రోగక్రిములను నాశమొనర్చును.

**యాని భద్రాణి బీజాన్యృషభా జనయన్తి చ ।**

**తైస్త్వం పుత్రం విన్దస్వ సా ప్రసూర్ధేనుకా భవ** ॥ అథర్వ ౩-౨౩-౪ ॥

మున్నగు ప్రమాణములచే ఋషభమనునది వీర్యవర్ధక ఓషధి యగుట సిద్ధించును. అగ్నిని ఉక్షాన్న మని యన్నప్పుడు దానియర్థము అగ్నియందు సోమ, లేక ఋషభమను పేరు గల మహౌషధము వేయబడినప్పుడు అది సర్వరోగములను దొలగించి ఆరోగ్యము గలిగించునది యగును. వశా శబ్దమునకును అనేకార్థములు గలవు. ఎట్లన;

**వశా హి సత్యా వరుణస్య రాజ్ఞః** ॥ అథ ౧-౧౦-౧ ॥

ఇచ్చట 'వశా' యను దానియర్థము ఈశ్వరీయనియమము, లేక నియామకశక్తి యగును.

**ఇయం వై పృథివీ వశా పృశ్నిః** ॥ శత. ౧-౮-౩-౧౫ ॥

మున్నగు వాని వలె దానియర్థము పృథివి కూడ యగును.

**వశాయాః పుత్రమాయన్తి ॥** అథ. ౨౦-౧౦౩-౧౫॥

దీనిననుసరించి తన సంతానమును వశముననుంచుకొను ఉత్తమ యిల్లాలికి కూడా 'వశా' శబ్ద ప్రయోగమగును. ఈ విధముగా అనేకార్థములగుచుండియును యజ్ఞ ప్రకరణమునందు 'వశా' ఒక ఓషధీ వాచకమైయున్నది. ఇది 'మేదా' యను పేరుతో గూడా పిలువబడుచున్నది. మేదా యను మహౌషధి పేర్లు దిగువ విధముగా వైద్యక నిఘంటువు నందీయబడియున్నవి. 'మేధాధీరా, మణచ్ఛిద్రా, మధురా జీవనీ, రసా, మేదోద్భవా, శ్రేష్ఠా, విభావరీ, వశా, శల్య పర్ణికా, మేదసారా, స్నేహవతీ, మేదినీ, స్నిగ్ధా, ద్రవా, సాధ్వీ, మేధోవతీ, పురుషదన్తికా, పల్యపర్ణీ, ఛిద్ర బహుళా, భవ్యా, జీవనికా, అధ్వరా, స్వల్పపర్ణీ మున్నగునవి. దీని గుణములు నిఘంటు చూడామణి యందిట్లు చూపబడినవి.

**మేదా తు మధురా శీతా, పిత్తదాహార్తికాసనుత్ ।**

**రాజయక్ష్మజ్వరహరా, వాతదోషకరీ చ సా ॥ నిఘంటు చూడామణి ॥**

అనగా; నీ మేదా ( దీనికి మరో పేరు వశా కూడయగును. ) మధుర, శీత, పిత్త, దాహ, పీడనము, దగ్గు మున్నగు వానిని దూరమొనర్చుచు క్షయ వ్యాధిని దొలగించును.

'వశాన్నాయ' అను దాని తాత్పర్యమేమన; ఈ వశా లేక మేదాయను పేరుగల మహౌషధిని అగ్నికి అన్నముగా నొనర్చుటయగునప్పుడది రోగనాశకమగును. 'సోమ పృష్ఠాయ' ఈ విశేషణముచే సోమ ఓషధి దీని వీపుపై నున్నదని అభిప్రాయము. ఇదే విశేష రూపమున ధారణమొనర్చును. '**డుంధాఞ్ - ధారణ-పోషణ యోః**':- ఇట్టి రోగనాశక అగ్ని యొక్క గుణములను వర్ణించుచు దాని నుపయోగించుచు లాభమును పొందుచుందుము.

**త్వం నో అసి భారతాగ్నే వశాభిరుక్షభిః। అష్టాపదీభిరాహుతః** ॥ ఋగ్వేద ౨-౭-౫॥

మున్నగు మంత్రముల వాస్తవికార్థము కూడా 'సర్వమును భరణ పోషణములనొనర్చు ఓ అగ్నీ! నీయందు మేము వశా అనగా మేదా యను ఓషధీ పత్రములను, ఉక్షా అనగా ఋషభకమను ఓషధి యొక్క కాండములను, అష్టాపదీ, అనగా ధత్తూరము ( ఉమ్మెత్త పత్రములు) మున్నగువానిని సమర్పింతుము. ఈ ఉమ్మెత్త గుణములు దిగువ ప్రకారముగ వైద్యక గ్రంథములందు గలవు.'

**ధతూరో మదవర్ణాగ్నివాతకృజ్జ్వరకుష్ఠనుత్ ।**

**కషాయో మధురస్తిక్తో యూకాలిక్షావినాశనః।**

**ఉష్ణో గురుర్వ్రణశ్లేష్మకణ్డూక్రిమివిషాపహః।**

అనగా; ఇది జ్వరము మరియు కుష్ఠాది ( కుష్ఠువు మున్నగు) వానిని నాశమొనర్చునది, పేలు చుండ్రు మున్నగు వానిని దూరమొనర్చునది, వ్రణములు, కఫము, గజ్జి, క్రిమి, మరియు విష నాశకమునైయున్నది. కావున దీనిని హవనాగ్నియందు వేయుదురు.

ఇట్టి సత్యమగు అర్థమును దెలిసికొనక మంత్రముల అర్థములను అనర్థమొనర్చినారు. అగ్ని యందు ఎద్దులను, వంధ్యాగోవులను, ఇంతేగాక గర్భిణీ గోవులను సైతము, ఆహుతినీయవలెనను అర్థము అత్యంత హాస్యాస్పదము, నిందనీయమైనది.

**యస్మిన్నశ్వాస ఋషభాస ఉక్షణో వశా మేషా అవసృష్టాస ఆహుతాః।**

**కీలాలపే సోమపృష్ఠాయ వేధసే హృదా మతిం జనయ చారుమగ్నయే** ॥ఋ.౧౦-౯౧-౧౪॥

ఈ మంత్రమందును అశ్వ, ఋషభ, ఉక్షా, వశా, మేష మున్నగు శబ్దములు ఓషధీవాచకములు. వీనిని అగ్నియందాహుతిగా నీయవలయును. ఇచ్చట అశ్వ శబ్దమునకు అశ్వగంధి, మేష శబ్దమునకు మేషపర్ణి యను మహౌషధీవాచకములు. అశ్వ గన్ధా హయాహ్వయా అని భావప్రకాశము, తురగీ, వనజా, వాజినీహయా యని రాజనిఘంటువు నందు గలవు.

**అశ్వగన్ధానిలశ్లేష్మశ్విత్రశోథక్షయాపహా।**

**బల్యా రసాయనీ తిక్తా, కషాయోష్ణాతిశుక్రలా** ॥ భావప్రకాశము ॥

ఇది కఫము, శ్వేతకుష్ఠము, వాపు, క్షయ మున్నగు వానిని దొలగించి వీర్య వృద్ధి నొనర్చు రసాయనము. కావుననే దానిని అగ్నియందాహుతిగా నిచ్చు విధానము గలదు.

మేష యను నామము యజ్ఞ ప్రకరణమున మేషపర్ణియను దానితో సంబంధముగలదు. కాని గొఱ్ఱె, మేకల విషయముగాదు. దానిని 'ఏడక' మని పిలుతురు. శతపథ బ్రాహ్మణ ౧౨-౪లో దీని గణనము అత్యంత అపవిత్రముగా పశువులను గూర్చియున్నది. మన అజాగ్రత్త వలన నది యజ్ఞభూమి యందు ప్రవేశించినచో ప్రాయశ్చిత్త విధానము గలదు.

**త్రయో హ పశవోఽమేధ్యాః దుర్వరాహః, ఏడకః శ్వా - కా తత్ర ప్రాయశ్చిత్తిః॥**

ఇట్టి గొఱ్ఱెను అగ్ని యందాహుతినిచ్చు విధానము ఆధిభౌతిక దృష్టితో ఎట్లు సంభవము? అని ఆ మంత్రము యొక్క తాత్పర్యము ఓ మానవులారా! (యస్మిన్) ఏ యగ్నియందు (ఉక్షణః) సేచనవంతమగు, అనగా; పుష్టికారక- ఉక్ష-సేచించు ఉక్షాః- ఉక్షతేర్వృద్ధి కర్మణః- (ఋషభాసః) ఋషభమను మహౌషధి యొక్క పత్రాదుల (ఉత) మరియు (వశాః) మేషపర్ణీ ఓషధి పత్రముల (ఆహుతా అవ సృష్టాసః) ఆహుతి ఈయబడినది. ఇట్టి (కీలాలపే) జలముల ద్రావునట్టి (సోమపృష్ఠాయ) సోమ ఓషధిని మూపు (వీపు)పై తన మధ్య ధారణమొనర్చుకొను (వేధసే) సర్వప్రాణుల పాలకుడగు (అగ్నయే) అగ్ని కొరకు (హృదా) హృదయపూర్వక ప్రసన్నతతో (చారుమతిమ్) చక్కనిస్తుతులను (జనయ) ప్రకటించుడు. ఇట్టి సత్యమగు అర్థమును దెలిసికొనజాలక మధ్య కాలీన యాజ్ఞికులు మహా అనర్థమొనర్చినారు. దీనినుల్లేఖించుటకు కూడా లజ్జితుల మగుచున్నాము.

మోనియర్ విలియమ్స్ యొక్క సుప్రసిద్ధ *Sanskirt English Dictionary* యందు ఏడక, వశా, అష్టపదికా, మేద యనువానికి ఓషధి వాచక అర్థము లీయబడినవి.

వశా:- *Premna Spinosa and Lorgibolia - Latin*

According to some Lat Vacca

అష్టపదికా:- *The plant Vallaris Dichotomas Wall*

మేదః :- ***A species of Medicinal plant L. P. 832.***

పై మంత్రముల కిట్లొనర్చిన ఓషధీపర మగు అర్థములను సమర్థించుట కీ దిగువ మంత్రములను చూడుడు. ప్రాచీనార్యులు గోమాంసభక్షకులని సమర్థించుటకు ఉదాహరణముగా నిచ్చునట్టి బృహదారణ్యా కోపనిషత్తు వచనములను కూడా ఇచ్చుట చూపి అర్థ మొనర్చుట సమంజసముగా నుండగలదు. చూడుడు.

**అథ య ఇచ్ఛేత్ పుత్రో మే పణ్డితో విగీతః సమితింగమః శుశ్రూషితాం**

**వాచం భాషితా జాయేత సర్వాన్ వేదాననుబ్రవీత సర్వమాయురియాదితి**

**మాంసౌదనం పాచయిత్వా సర్పిష్మన్తమశ్నీయాతామీశ్వరౌ జనయితవా**

**ఔక్షేణవార్షభేణ వా ॥**

ఇచ్చట ఉక్షా, ఋషభ, మాంసౌదన అను నీ మూడు శబ్దములపై విశేషముగా నాలోచించుట ఎంతయో అవసరము. ఎందరో పాఠకులు వీని వల్లనే భ్రమయందుబడిపోవుదురు. అనగా; ఉత్తమ వేదజ్ఞులగు సంతానమును గోరువారు మాంసము మరియు వరియన్నము గలిపితినుట, ఎద్దు మాంసమును దినుట యను విధానమును జేసిపెట్టినారు. వాస్తవముగా వీనియర్థమిదిగాదు. సత్యార్థమిట్లున్నది.

ఉక్షా యను శబ్దమునకు సరియైన అర్థము 'వాచస్పత్య బృహదభిధానము. *Sanskrit English Dictionary by Apte and Monior Williams*' ల ప్రమాణమునిచ్చి ఇది వరకే చూపియున్నాము. సోమ, మరియు వృషభకమను ఓషధులను గర్భవతులగు స్త్రీలు, మరియు వారి పతులు సోమ, మరియు వృషభకము వంటి వీర్యవర్ధక ఔషధముల సేవనమును గూర్చిన విధానమిందు గలదు. కాని గోవృషభములు మున్నగు పశుమాంస భక్షణమును గూర్చికాదు.

సుశ్రుత శరీరాధ్యాయము ౨లో గర్భిణులకు మాంసాహారము అత్యంత హానికారకమేగాక గర్భోపఘాతకమనియును చూపబడినది.

**గర్భోపఘాతకరాస్త్విమే భావాః - న రక్తాని వాసాంసి బిభృయాత్, న**

**అభ్యవహరేత్, న యానమధిరోహేత్, న మాంసమశ్నీయాత్ ॥**

ఇచ్చట గర్భిణికి మాంసాహారము సంపూర్ణముగా నిషేధించుచు అది గర్భోపఘాతకము (గర్భపాతమొనర్చునది) అని తెలిపినప్పుడు ఉత్తమ వేదజ్ఞ సాత్విక సంతాన ప్రాప్తికి దీని సేవన విధానమెట్లుండగలదు? ఇంతకు పూర్వము సందర్భానుసారముగ క్షీరౌదనము, దధ్యోదనము, ఉదౌదనము మున్నగు వాని సేవన విధానము చూపబడినది. ఇచ్చట మాంసౌదనము గాదు, మాషౌదనము, అనగా మినుములు, బియ్యము గలిసిన అన్నముగా నుండునని విద్వాంసుల అభిప్రాయము. గర్భిణి ప్రకరణము నందు, ఇంకా అనేక స్థానములందు, వైద్య గ్రంథములందును మినుముల విధానమే గలదు.

**తతో௨పరాహ్ణే పుమాన్ మాసం బ్రహ్మచారీ సర్పిః స్నిగ్ధః సర్పిః క్షీరాభ్యాం**

**శాల్యోదనం భుక్త్వా మాసం బ్రహ్మచారిణీం తైలస్నిగ్ధాం తైలమాషోత్తరా హారాం నారీముపేయాద్ రాత్రౌ ॥**

**సుశ్రుత శరీరాధ్యాయము ౨॥**

అనగా; పాలు మరియు నేతితో గూడిన అన్నము, తైలముతో స్నిగ్ధ శరీరము నొనర్చుకొని తైలము మరియు మాష (మినుములు) వంటకములను దినిన తన పత్నితో రాత్రి గడుపుటకు పతి ఉల్లాస ఉత్సాహములతో వెళ్ళవలయును. ఇచ్చట పత్నికి విశేష రూపములో మినపపప్పు సేవన విధానము స్పష్టముగా చెప్పబడియున్నది. మరొక స్థలమందును.

**'మధురౌషధ సంస్కృతాభ్యాం ఘృతక్షీరాభ్యాం పురుషం, స్త్రియం తు తైలమాషాభ్యామ్॥'**

అనగా; ఉత్తమ సంతానప్రాప్తికై పురుషుడు మధుర ఓషధులతో గూడిన నేయి, మరియు క్షీరములను, స్త్రీలు తైలము (నూనె) మినపపప్పు వంటకములను దినవలెనను విధానము గలదు. ఇచ్చట 'మాషౌదనమ్' అనునదియే శుద్ధ పాఠము. రాక్షసతత్త్వము గల మాంసాహారియెవడో ఈ 'మాషౌదనమ్'ను మాంసౌదనముగా మార్చివేసినాడు. క్రమముగా నదియే ప్రచలితమైపోయినది.

ఇంకా ఎవరైన 'మాంసౌదనమే' శుద్ధ పాఠమని తలచినను మాంస శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము నిరుక్తము ననుసరించి వస్తువునందలి గుజ్జు, మరియు మనస్సునకు ప్రియమగు ఏవేని ఉత్తమ పదార్థముల అర్థము కూడా తీసికొనవచ్చును. మాంసముయొక్క నిరుక్తి.

**'మాంసం మాననం వా మానసం వా మనో௨స్మిన్ సీదతీతి వా'** ॥ నిరుక్తము ४-౧-3॥

దీనియర్థమేమనగా; ఏదేని మననసాధకము, బుద్ధివర్ధకము, మనస్సును తృప్తినొనర్చు వస్తువు అనగా; పాయసము, బాసంది, కోవ, ఉత్తమ ఫలముల గుజ్జు, మున్నగు వానికై దీని ప్రయోగము గలదు. చరక సంహిత, చికిత్స ౧౦వ అధ్యాయమందును **'ఖర్జూర మాంసాన్యథనారికేళ - కోలాస్థిమజ్జాంజనమంక్షికోవిట్ -** మరియు బృహన్నిఘంటువు యొక్క

**ఆమ్రస్యానుఫలే భవన్తి యుగపన్మాంసాస్థిమజ్జాదయః,**

**లక్ష్యన్తే న పృథక్ – పృథక్ స్ఫుటతయా, పుష్టాస్తఏవ స్ఫుటాః** ॥ బృహన్నిఘంటువు ॥

మున్నగు వానియందు మామిడి గుజ్జును మాంసము, మామిడి టెంకె (గింజ) కు అస్థి (ఎముక) శబ్దముల ప్రయోగము గలదు. ఖర్జూరపు మెత్తని తినదగిన భాగమునకు 'ఖర్జూర మాంస' శబ్ద ప్రయోగము చరక సంహిత వచనము నందు విశేషముగ గాన్పించును. కావున మాంస శబ్ద ప్రయోగము జూచి దానిని పశు మాంస వాచకముగా నెంచుట గొప్ప తప్పిదమే యగును.

శతపథ బ్రాహ్మణము ౧౧-౭లో **'ఏతద్ హ వై పరమమ్ అన్నాద్యం యన్మాంసం'** అని చెప్పి స్పష్టముగా పరమాన్నము (ఈ శబ్దమునకే దక్షిణ భారతమందంతటను 'ఖీర్' అని ప్రచలితమైయున్నది) కావున ఖీర్ (పాయసము) శబ్దమునకు మాంసమను ప్రయోగము గలదు.

**'పరమాన్నం తు పాయసమ్'** అమర కోశము 2-28. పాయసం పరమాన్నకే హైమచన్ద్రః, పాయసస్తు క్లీబపుం సౌ, శ్రీవాస పరమాన్నయోః - మేదినీ పరమాన్నమ్ - ఖీర్, పాలతో వండిన వరియన్నము - (సంస్కృత శబ్దార్థము. కౌస్తుభము) ఈ ప్రమాణములచే పరమాన్నమునకు ఖీర్ (పాయసము) అను అర్థము స్పష్టముగ నున్నది. యజ్ఞము యొక్క పరిభాష యందు ఖీర్ అనుదానికి రుచి, మనోహర భావన అనుసర్థముండుటచే మాంస శబ్దము ప్రయోగమైనది.

**యదా పిష్టాని అథ లోమాని భవన్తి। యదాప ఉన్నయతి అథ త్వగ్ భవన్తి॥**

**యదా సంయౌత్యత మాంసం భవన్తి।**

అట్లే గోపథ బ్రా. యొక్క ఉ.ప్ర ౪-౬ యొక్క పశవో వై ధానాః।

**దధి మధు ఘృతమాపో ధానా భవన్తి ఏతద్ వై పశూనాం రూపమ్॥**

(తైత్తిరీయ సంహిత 2-3-2-౧ పు ౧౧౬)

మున్నగు వాక్యముల చేతను, పిసికిన పిండిని, మాంసము, మరియు ధాన్యములు, దధి, ఘృతము తేనె మున్నగు వానికి పశువు మున్నగు శబ్దముల ప్రయోగము ప్రాచీన గ్రంథములందచ్చటచ్చట గాన్పించును దానిని చూచి పశుమాంసమను భ్రమయందు పడకూడదు. అధర్వ వేద, యజ్ఞ ప్రకరణమందు సుప్రసిద్ధ ఓషధి గుగ్గులును గూర్చి

**న తం యక్ష్మా అరున్దతే న తం శపథో అశ్నుతే।**

**యత్రౌషధస్య గుగ్గులోః సురభిర్గన్ధో అశ్నుతే॥** అథ.౧- ౧౯-3౦॥

ఈ మంత్రమందు గుగ్గులుకు మాంస శబ్దము ప్రయోగించబడినది ఇది రాజయక్ష్మమువంటి భయంకర వ్యాధి. కీటాణువులను సైతము నాశపరచునని చెప్పబడియున్నది.

**యన్మాంసముపభృతం తద్ గుగ్గులు** ॥ తైత్తిరీయ సంహిత ౬-2-౧ పు. 3౧౫ ॥

అనగా; యజ్ఞ సంబంధ సామగ్రి యందు గుగ్గులును మాంసమనియనినారు. కావుననే

**ఏతద్ వా ఉ స్వాదీయో యదధిగవం క్షీరం వా మాంసం వా తదేవ నాశ్నీయాత్॥**

ఈ వాక్యమును గాంచి అతిథి కంటె పూర్వమే గృహస్థులగు దంపతులు గో క్షీరములు, మాంసము దినుట నిషేధము, అశుద్ధమని ఏ మాత్రమాలోచించకుండనే చెప్పబడినది. దీనిచే గోక్షీరములు, ఖీర్ (పాయసము) మున్నగు స్వాదిష్ట పదార్థముల సేవనము నిషేధింపబడియున్నది. పైన దెలిపినట్లు **'మనో౭స్మిన్ సీదతీతి వా'** మున్నగు వ్యుత్పత్తుల ననుసరించి మాంస మను పేరు వీనికి ఈయబడినది.

**ఏతద్ వా ఉ స్వాదియో యదధిగవం క్షీరం వా మాంసం వ తదేవ నాశ్నీయాత్**

దీనికి మరొక అర్థము గూడ కలదు. దానినే ఇచట చూపదలచినాము. అది 'వా' అను శబ్దమునకు ఇవ లేక ఉపమా అర్థముల గైకొనుట ద్వారా లభించుచున్నది. దీనికి అనేక ప్రమాణముల అవ్యయార్థములు, కోశములందుపలబ్ధమగుచున్నవి. ఉదా. అవ్యయార్థమునందు - 'వా' అర్థము **'ఉపమానిశ్చయార్థ వికల్పేషు'**

ఇచ్చట 'వా' శబ్దమునకు ప్రథమ అర్థము ఉపమా ఈయబడినది. మరియు దానికి దిగున ఉదాహరణము నిచ్చియున్నారు. 'సింహో వా క్రుద్ధో భవతి' అనగా ఆతడు సింహము వలె క్రుద్ధుడగును. (అవ్యయార్థము - స్వామీ దయానందకృత వ్యాఖ్య సహితము వైదిక యంత్రాలయ, అజ్మీరు, ప్రతి ౧౮) వెంకటేశ్వర యంత్రాలయము, బొంబాయిలో ౧౯౪౭లో ప్రచురించబడినది.

పం శివదత్తశర్మా దాధీచకృత వ్యాఖ్యా సహిత అవ్యయార్థ భాగము నందు 'వా' అర్థము **'వా సముచ్చయ ఏవార్థ ఉపమానవికల్పయోః'** అని యిచ్చినాడు.

ఇచ్చట కూడా 'వా' కు సముచ్చయము, వికల్పములేగాక 'ఉపమాన' అర్థమునిచ్చి దానికి ఉదాహరణముగా 'మణీవోష్ట్రస్య లమ్బేతేప్రియౌ వత్సతరౌమమ' వాక్యమును ఇచ్చినాడు. శాశ్వతకృతకోశము (నారాయణనాథ్ ద్వారా సంపాదితము, పూనా ౧౯౩౦) నందు అవ్యయముల అర్థము నిచ్చుచు 'వా' యొక్క అర్థము 'వా వికల్పోపమానయోః' అని పు.౬౯, శ్లోక ౭౯౪ నందు చూపియున్నాడు. ఇచ్చట కూడా వికల్పమే గాక ఉపమాన అర్థము స్పష్టముగ నున్నది.

కావున **'ఏతద్ వా ఉ స్వాదీయో యదధిగవం క్షీరం'** లో 'వా' అర్థము గోక్షీరములవలె సాత్వికము, పుష్టివర్ధకముగు వస్తువు మాత్రమే నిశ్చయముగా ఇంపై, మధురమై సేవించదగినదని యగును. ఇచ్చట 'వా' శబ్దమునకు నిశ్చయార్థమును దీసికొనవలెను. 'మాంసం వా తదేవ న అశ్నీయాత్' మాంసము వంటి హింసా జనకవస్తువులను మానవు లెప్పుడును దినరాదు. 'వా' శబ్దమున కీ విధముగు అర్థము దీసికొనినచో పైన జూపిన అనేక స్పష్టముగు ప్రమాణముల యర్థము సరిపడును. ఒకవేళ మాంస శబ్దమునకు వాడుకయందున్న మాంసపరముగు అర్థమునే దీసికొనినట్లైనచో

**ఉక్ష్ణో హి మే పఞ్చదశ సాకం పచన్తి వింశతిమ్।**

**ఉతాహమద్మి పీవ ఇదుభా కుక్షీ పృణన్తి మే విశ్వస్మాదిన్ద్ర ఉత్తరః ॥** ఋ ౧౦-౮౬-౧౪॥

వైదిక్ ఏజ్ యందును ఈ మంత్రమునకు ఇంద్రుని తిండిపోతుగను, ఎద్దుమాంసమును దినువాడుగను చూపుటకు ప్రయత్నము జరిగినది ఇంకా ఇతరులెందరో దీనిచే భ్రమ యందుబడిపోగలరు. కాని వాస్తవముగ ఈ మంత్రమునకు జ్యోతిష్య పరముగా, ఆధ్యాత్మిక మరియు భౌతికముగు అనేకార్థములు గలవు. ఈ సూక్తమందంతటను జ్యోతిష పరముగు చక్కని వ్యాఖ్యయే గాంచనగును. ఈ మంత్రార్థమిట్లుండును.

ఉత్తర ధ్రువ రూప ఇంద్రుడు వృషాకపి రూప సూర్యుని పత్ని యగు రేవతీ తార (వృషాకపాయి రేవతీ) కి ఇట్లు చెప్పుచున్నాడు. 'నా కొరకే, అనగా నా ఖగోల రూప ఉదరమును నింపుట కొరకే పదునైదుతో ఇరువది అనగా ముప్పదియైదు (౩౫) ఉక్షలను నీ వీర్య సేచకములగు గ్రహోపగ్రహములను ప్రాకృతిక నియమ సంపన్న మొనర్తును, లేక వ్యక్త పరతును. (ఉత అహమ్ అద్మి) నేను వానిని ఖగోళమున గ్రహణమొనర్చెదను. (అత్తా చరాచర గ్రహణాత్ వేదాన్తము) ౧-౨-౯ ప్రమాణమునను సరించి , కావున (పీవః) ప్రవృద్ధి చెందియున్నాను. (మే ఉభా కుక్షీ ఇత్ పృణన్తి) నా రెండు ఒడులు రెండుగోళార్ధపార్శ్వములు గ్రహ ఉపగ్రహములచే పూర్ణమొనర్తును. ఇచ్చట 'ఉక్ష' శబ్దము గ్రహములకై యున్నది. ఎట్లన; అమీ యే పంచోక్ష్ణో మధ్యే తస్థుర్మహో దివః॥

ఋ.౧-౧౦౫-౧౦ ॥ యందు స్పష్టముగా మంగళ, బుధ మున్నగు గ్రహముల కొరకునట స్పష్టము. ఇక 'రేవతీ' తార యొక్క 3౫ ఉక్షా, సూర్య చంద్రాది గ్రహ ఉపగ్రహములు. వీనియందుర్ గ్రహములు ౨౬ ఉపగ్రహములు. పాశ్చాత్య జ్యోతిష్యుల పద్ధతి యందు కూడా 3౫ గ్రహోపగ్రహములగును. వారి పద్ధతి యందు సూర్యుడు చంద్రుడు మున్నగునవి ఏడు, యూరేనస్, నెప్ట్యూన్‌రెండు కలసిర్ గ్రహములు, మరియు పృథివికి౧, మంగళునకి ౨, బృహస్పతికిర్, శనికిర్, యూరేనస్‌కు ౪, మరియు నెప్ట్యూన్‌కు ౧ మొత్తము ౨౬ చెరసి 3౫ ( పం. ప్రియ రత్న ఆర్షకృత వైదిక జ్యోతిష్యము పు. ౪౧,౪౨)

వేదముల ప్రసిద్ధ విద్వాంసుడగు శ్రీ. పం. విశ్వనాథ విద్యా మార్తాండ గారు ఈ 'ఉక్ష్ణో హిమే పంచదశ' అను ఋ.౧౦-౮౬ సంబంధములో అత్యంత మహత్త్వ పూర్ణముగు జ్యోతిష పరక నిర్దేశము నిచ్చియున్నారు. వారిట్లు వ్రాసినారు. ఋ.౧౦-౮౬-౧ నుండి ౨౩ మంత్రములు జ్యోతిష సంబంధము గలవి వీనియందు వృషాకపి, మృగ, శ్వావరాహయు, ఉక్షా, వృషభ, ధన్వ, కృన్తత్ర, ఉదక్ చోగృహమ్, పర్శుః మున్నగు శబ్దములును రాశిచక్రము యొక్క వేర్వేరు భాగముల వర్ణించును. వర్షాకాల వర్ణనలో సూర్యుడు వృషభరాశి యందు చేరి వర్షమును గురిపించునప్పటి వర్ణనము. వృషభరాశినే 'ఉక్ష' యనినాడు వృషభరాశికి ౧౫ ముఖ్య తారకలున్నవి మిగతావి కలసి ౨౦ అగును. సూర్యుడు వర్షరాశి యందు తపించుటయే ఈ ఉక్షల పరిపచనము, లేక పరిపాకము సూర్యుడు వృషభరాశి యందున్నప్పుడు వృష యొక్క తారలు దృష్టిగోచరముంగా జాలవు ఇదియే వాని భక్షణము. ఇవి యన్నియు అలంకారములు.

మేమీ మహత్త్వపూర్ణ నిర్దేశము ( ఆలోచన) లకై వారికి ధన్యవాదములు నర్పించుచు వీనిని ఆలోచనాశీలురగు విద్వాంసుల యెదుట ప్రవేశపెట్టుచున్నాము. ఆధ్యాత్మిక దృష్టితో దీనియర్థము దిగువ చూపిన విధముగ నుండును.

(మే) నా కొరకు విద్వాంసులు ( ఉక్ష్ణః) వీర్య సేచనము లేక సుఖవర్షణ మొనర్చు ప్రాణములను ( పంచదశ) పదునైదు, మరియు ( వింశతమ్) ఇరువది మరియు వానియందు ప్రవిష్టమై యున్న ఆత్మను ( సాకమ్) కలిపి, ఒక చోట ( పచన్తి) పరిపక్వమొనర్తుము, తపస్సు ద్వారా వానిని దృఢ పరచెదము ( ఉత) మరియు ( అహమ్) నేను ( అద్మి) వానిని అనుభవించెదను, వానిని స్వీకరించెదను ( పీవః ఇత్) మరియు నేను అతి బలశాలినై యుందును. అవి(మే) నా యొక్క ( ఉభాకుక్షీ) రెండు ఒడలను, రెండు పొట్టలను ( పృణన్తి) పూర్ణ పరచును ఇదే విధముగా ( ఇన్ద్రః) పరమేశ్వరుడు ( విశ్వస్మాత్ ఉత్తరః) సమస్తముకన్న ఉత్కృష్టుడు ( పంచదశ) ( పదునైదు) ౫ జ్ఞానేంద్రియములు, ౫ కర్మేంద్రియములు, మరియు ప్రాణాపాన వ్యాన ఉదాన సమానములను పంచప్రాణములు చెరసి పదునైదు వాని యందు ప్రవిష్టమైయున్న ఆత్మ వింశతి ( ఇరువది) యైయున్నాది భౌతిక దృష్టితో ఉక్ష అర్థము సోమ, లేక ఋషభక ఓషధి పరకమని మొదటనే ప్రమాణయుక్తముగ చూపియున్నాము కావున మంత్రార్థమిట్లు కాగలదు.

ఋత్విజులు లేక వైద్యులు 'ఇన్ద్ర', రాజునగు నా కొరకు ( ఉక్ష్ణః) సోమము యొక్క ( పంచదశ) ౧౫ పత్రములను ( ఆకులను) ( పచన్తి) పక్వమొనర్చి వాని ద్వార ( వింశతిమ్) ౫ జ్ఞానేంద్రియములు, ౫ కర్మేంద్రియములు, పది ప్రాణములు, ఈయన్నిటిని ( సాకంపచన్తి) కలిపి పరిపుష్టమొనర్తురు. నేను వానిని ( అద్మి) భుజించి ( పీవః ఇత్) పుష్టియేయగుదును. నా రెండు ఒడులు సోమరసముచే పూర్ణమైపోవును

సోమ, లేక ఋషభకమూలికల పదునైదు ఆకులను విధిపూర్వకముగా సేవన మొనర్చుటవలన మనుష్యుడు వీర్యవంతుడు కాగలడని మంత్రములో భౌతిక దృష్టితో ఉపదేశించబడినది. ఎద్దుమాంసముగా అర్థము తీసికొనుట సంపూర్ణముగా అనర్థదాయకమే యగును. ఏలన దానిని వేదములందు 'అఘ్న్యా (అహన్తవ్య-చంపదగనిది)' అని చెప్పబడినది శతపథ బ్రాహ్మణమందును.

**స ధేన్వై చానడుహశ్చ నాశ్నీయాత్, ధేన్వనడుహౌ వా ఇదం సర్వం విభృత**

**............ తస్మాద్ ధేన్వనడుహోర్నాశ్నీయాత్** ॥ శత. బ్రా. 3-౧-౨-౨౧॥

మున్నగు వాక్యములలో గోవృషభముల మాంసమెప్పుడును దినగూడదని స్పష్టముగా ఆదేశించబడినది. ఏలన ఎద్దులు, గోవులు ఈ పృథివిని ధారణమొనర్చునవి. ఇట్టి పరిస్థితియందు 'భక్షయామి త్వహం యది అంసలం భవతి' అను నీ శతపథ బ్రాహ్మణ వచనములను ప్రక్షిప్తములని ఎంచవలసియుండును ఈ వాక్యములకు స్వ. పం. శ్రీ. బుద్ధ దేవ విద్యామార్తాండగారు వేరే అర్థమొనర్చియుండిరి. అది పాఠకుల లాభమున్కై ఇచ్చుట ఉదాహరించబడుచున్నది. వారిట్లు వ్రాసినారు.

**స ధేన్వై చానడుహశ్చ నాశ్నీయాత్.........తదు హోవాచ యాజ్ఞవ**

**ల్క్యో ఽశ్నామ్యే వాహమాంసలం చేద్ భవతి** ॥

దీని శబ్దార్థమిట్లు గలదు. - ఆ యజమానుడు గో వృషభ మాంసమును దినరాదు. దీనిపై బలవర్ధకమగుచో దీనిని నేను తప్పక తినెద నని యాజ్ఞవల్క్యుడనెను. కాని ఇచ్చుట ఆలోచించవలసిన విషయమేమన ఈ సందర్భమునందంతటను మాంస శబ్దమేలేదు. ఈ 'మాంస' శబ్దము ఎచ్చటి నుండి ఊడిపడినదో?

కల్పిత శబ్దము ద్వారానైన మాంసశబ్దము తెచ్చిపెట్టబడిన మాంస రూపమున గోవృషభముల మాంసమొక్కటియే యైనచో స్త్రీ, పురుష లింగ భేదము లెందులకు? గోమాంసభక్షక విశేషజ్ఞుల దృష్టిలో గోవుల, వృషభముల మాంసములం దేమియు భేదము లేదని యనినను **'గవ్యం మాంసం నాశ్నీయాత్'** అని చెప్పుట చేతనే సరిపడెడిది. ఈ ధేన్వై అనడుహశ్చ' ఆవుల ఎద్దుల అని వేర్వేరుగా చెప్పవలసిన యవసరమేమి?

ఈ వాక్యమును తెలిసికొనుటలో మహా తప్పిదమే జరిగినదని స్పష్టమగుచున్నది. ఈ వాక్యమును దెలిసికొనుటకు పూర్వము దీని ప్రసంగమును జూడవలసియుండును. ఇది సోమ యాగమునందు ప్రయోగమగు వాక్యము శతపథమున ఉపవాస ప్రసంగమునందు ప్రారంభములోనే 'ఉపవాస సంబంధము భోజనము చేయుట చేయకుండుటలో లేదు. దీని సంబంధము ఉపస్థితి తో గలదు. ఐతే యజ్ఞములలో దేవతల సేవ యందు పాల్గొనినచో, వారి ఉప, అనగా సమీపమునందుండినచో, అట్టి సమయములందు వారిని భుజింపజేయక తినినచో, మరియు యజ్ఞము పూర్తి గానిదే భుజించినచో దేవతల నవమానపరచుట యగును. దీనిపై ఏ మాత్రమును తినకుండ యజ్ఞమెట్లు నిర్వహించబడు'నను ప్రశ్న వచ్చినది. ఐతే తిని తిననట్లుగా హవిస్సులనం దర్పింపబడగూడని పదార్థములను, అనగా అడవి ఫల, మూల, దుంపలను దీసి కొనినచో (భుజించినచో) దీని వల్ల యజ్ఞము కూడా జరుగగలదు, మరియు దేవతల అవమానము కూడా గాజాలదు.

ఈ విషయమునే పునః చెప్పబడినదేమన గోవు యొక్క అనగా పాలచే సిద్ధపరచబడిన పదార్థములు, వెన్న, మీగడ, పెరుగు మున్నగునవి దినవలదు. మరియు ఎద్దు యొక్క అనగా పొలములందుత్పన్నమగు ధాన్యములు మున్నగు వానిని దినవలదు. దీనిపై యాజ్ఞవల్క్యులిట్లనినారు. 'సోమ యాగమనునది దీర్ఘకాల యజ్ఞము. కావున దుర్బలత్వము రాకుండుటకై ఘనపదార్థములు గాక బలవర్ధకమగు పదార్థములను కొంచెముగా భుజించినచో అభ్యంతరము లేదు' అను ఈ వాక్యమునందు 'మాంస'మను వాసన కూడా లేదు. కాని ఈ మాంస శబ్దము నేరుగా చొప్పింపబడినది. స్త్రీ లింగ, పుంలింగ మగు గోవు, మరియు ఎద్దులను వేర్వేరుగా గ్రహణ మొనర్పుదాని యుద్దేశ్యమే యుండనప్పుడు దాని సరియగు అర్థమెట్లు కాగలుగును? ఆహా! అట్టి బుద్ధి నేమనవలెనో! మనము మన నిత్య వ్యవహారములందును జూచుచుందుము అనగా ఎవరైనా తన కూతురు మెట్టినింటికి (అత్తవారి గృహమునకు) వెళ్లినప్పుడు శిష్టాచారము ననుసరించి మేము కూతురు సొమ్మును తినుట ధర్మముగాదనిన దాని తాత్పర్యము 'కూతురు మాంసమును తినమను యర్థము గాదు గదా! కూతురు సంబంధమగు వస్తువులు స్వీకరించ మని దీని తాత్పర్యమగును. ఈ ప్రసంగమునందు ఐతరేయ బ్రాహ్మణము నందొక ప్రకరణము నందలి విషయమును చూడుడు.'

**సర్వాభిర్వా ఏష దేవతాభిరాలబ్ధో భవతి యో దీక్షితో భవతి తస్మా**
**దాహుర్న దీక్షితస్యాశ్నీయాదితి । స యదగ్నీషోమావముఞ్చతమ్ గృభీ**
**తానితి వపాయై యజతి సర్వాభ్య ఏవ తద్ దేవతాభ్యో యజమానం**
**ప్రముఞ్చతి తస్మాదాహురశితవ్యం వపాయాం హుతాయాం యజమానో**
**హి స తర్హి భవతి ॥** ఐత రేయ బ్రా. ౬-౯॥

సోమ యాగమునందు దీక్షితులగు వారు తమ్ముతాము సంపూర్ణ దేవతలకు సమర్పణ మొనర్చుకొందురు. కావున దీక్షితులది తినరాదు. ఐతే ఆతడు **'అగ్నిషోమావముఞ్చతం గృభీతానితి'** ఈ యజ్వ (సంపూర్ణముగా యజ్ఞమునొనర్చినవాడు) ద్వారా నిర్వహించబడిన యజ్ఞము అనగా మనుష్యుడు గురుకులము నందు శారీరక వ్యాయామము ద్వారా క్రొవ్వును గరిగించి శరీరమున నిముడ్చుకొని చక్కగా తేలికనంతమొనర్చుకొని మస్తిష్క నిర్మాణమునందు కృషిజేయును. వ్యర్థముగా శరీరమును లావుగా నొనర్చుకొనక స్వాధీనమునందుంచుకొనినప్పుడాతడు 'సర్వ దేవతల బంధనముల నుండి విముక్తుడగును ' వారి సేవ ద్వారా కృతకృత్యుడగును. అప్పు డాతని దశ సాధారణ యజమానునిగనై పోవును. **'వపాహోమము'** తరువాత దీక్షితుని యింటి భోజనము కూడా భుజించవచ్చును. ఇచ్చట 'దీక్షితస్య నాశ్నీయాత్' అను శబ్దము గలదు. 'వైదిక్ ఏజ్' పు.౩౯౩లో గల గోమాంస భక్షణము, మరియు గోవధను గూర్చిన విషయములను మేము ఇదివరకే సప్రమాణముగ జూపియున్నాము. దాని యందు చివరకు *The expression* 'అతిథినీర్గాః' అనియు వ్రాసియున్నాము.

*(Cows fit for guests in X 68-3) implies the same distinction* అనగా ఋగ్వేద ౧౦-౬౮-౩ లోగల 'అతిథినీర్గాః' అనగా 'అతిథుల కొరకు గోవులను అను దాని భేదము యొక్క సూచనలభించును. ఇచ్చట లేఖకుని అభిప్రాయము స్పష్టముగా లేదు. ఆతడు ఋగ్వేద మంత్రాధారము నీయదలచియుండెనేమో.

**'సాధ్వర్యా అతిథినీరిషిరాః స్పార్హాః సువర్ణా అనవద్యరూపాః ।**

**బృహస్పతిః పర్వతేభ్యో వితూర్యా గా ఊపే యవమివ స్థివిభ్యః ॥** ఋగ్వేద. ౧౦-౬౮-౩॥'

ఈ మంత్రమునందు 'అతిథి నీర్గాః' శబ్దమునకు అర్థము అతిథులకు ఉపయుక్తమగు గోవులు అని యున్నది. వైదిక్ ఏజ్ పు. 3౮౭లో దాని తాత్పర్యమిట్లు గలదు. ప్రతిష్ఠావంతులగు అతిథులు వచ్చునప్పుడు గోవును చంపి దాని మాంసముచే వారిని తృప్తిపరచుచుండెడివారు. మరియు వివాహ సమయములందు గోవులను చంపి వాని మాంసమును దినిపించబడుచుండెడిది. ఈ వైదిక్ ఏజ్ భూమికా లేఖకుడు, భారతీయ విద్యా భవన సంస్థాపకుడునగు స్వ. కన్హయ్యాలాల్ మున్షీగారి 'లోపా ముద్ర' యందు 'అతిథిగ్వ' యను శబ్దము గౌరవ సూచక చిహ్నముగా నుండెను. కాని దాని యర్థము అతిథులకు గోమాంసమును వడ్డించువాడని చేయబడినది.

ఈ గోఘ్న, అతిథి గ్వ, అతిథినీర్గాః శబ్దముల అర్థ విషయమైన భ్రమను దొలగించుట చాలా అవసరమనిపించుచున్నది. సాయణాచార్యుడు మున్నగు భాష్యకారులును వీనియర్థమును **'అత సాతత్యగమనే'** అను ధాత్వర్థమును గొని **'సతతం గచ్ఛన్తీః'** అనగా నిరంతరము గతియొనర్చునది అను నర్థము నొనర్చి యున్నారు. 'గాః' అను శబ్దమునకు గోవులు గాక జలముల కని అర్థమొనర్చబడియున్నది. 'సాధునయనాదిగుణాయుక్తా గాః-ఆపః' అని గలదు. ఒకవేళ 'అతిథినీః' యందు నేరుగా అతిథి శబ్దముగా నంగీకరించినను 'అతిథిభ్యో నీయన్తే' 'అతిథులకు దానమునీయబడుగోవులను నర్థమగును. ఇట్టి 'అఘ్న్యా' అదితిః మున్నగు అహింసనీయ శబ్దములుండి యున్నను 'చంపుట' అని అర్థము నొనర్చుట సంపూర్ణముగా అనర్థకమే యగును.

'అతిథిగ్వ' అను దాని యర్థము. **'అతిథీన్ ప్రతి సేవార్థం గచ్ఛన్'** అనగా; సేవకొరకై అతిథుల వద్దకి వెళ్లుచున్నారు'. అని స్పష్టముగా గలదు. సాయణాచార్యుడు, మరియు మహర్షి దయానందులు మున్నగు భాష్యకారులు ఇదే యర్థము నొనర్చినారు. 'అతిథిగ్వ'కు అతిథులకు గోమాంసమును వడ్డించువా'డను నర్థము సంపూర్ణముగా కపోలకల్పితమే. అతిథిగ్వ శబ్దమునకు అతిథుల సేవకుడని మాత్రమే. కాని గోమాంసమును వడ్డించువాడను నర్థము స్వర్గీయ మున్షీగారెట్లు వ్రాసినారో, దానికి ప్రమాణము వారీయలేదు. ఈయరానిది కూడ. శ్రీ. కె.యం మున్షీ వంటి సంస్కృతము, మరియు భారతీయ సంస్కృతి యొక్క అతిముఖ్య విద్వాంసుడిట్టి కపోలకల్పిత అర్థము నొనర్చిలోకులను భ్రమ యందు బడవేయుట యనునది సంపూర్ణముగా అనుచితమే యైయున్నది. మోనియర్ విలియమ్స్ రచించిన సుప్రసిద్ధ *Sanskrit English Dictionary* యందును 'అతిథిగ్వ' యనుదాని అర్థము *To whom guests should go (P 14)* అతిథి ఎవని వద్దకి ప్రేమతో చేరునో అను నర్థము గలదు. శ్రీ బ్లూమ్ ఫీల్డు అనునాతడు *Presenting cows to guests* అనగా అతిథులకు గోవులను దానమిచ్చువా'డను యర్థమునే చేసియున్నాడు.

ఇక 'గోఘ్న' యను శబ్దము అతిథుల కొరకను ప్రయోగము వేదములయందెచ్చటను లేదు. ఎచ్చటనైనను 'గోఘ్న' శబ్దము చూడబడినను అందు గోహింసనుండి ఎల్లప్పుడును దూరముంచుట యను ఆదేశము గలదు. ఎట్లనగా; **'ఆరే తే గోఘ్నముత పూరుషఘ్నమ్'** ॥ ఋ.౧-౧౧౪-౧౦॥ అనగా, 'గోఘ్న' గోహత్యనొనర్చు నీచుడు నీ నుండి ( ఆరే) దూరము నుండు గాక, పురుష హత్య నొనర్చువాడును నీ నుండి దూరముగా నుండు

గాక' అనునది మొదటి యర్థము. ఇక రెండవ అర్థమేమన; అతిథి కొరకే. 'గోఘ్న' శబ్ద ప్రయోగము ప్రాచీన గ్రంథము లందెచ్చటనైనను గాన్పించినను దాని యర్థము 'ఎవరికొరకు గోవులీయబడునో, లేక ఇప్పించబడునో, మరియు ఎవరి కొరకు సదా ఉత్తమ, ప్రియ, మధుర వాణి ప్రయోగింపబడునో,' యని గలదు. గోఘ్నము యొక్క 'హన్' ధాతువు ప్రయోగము ధాతు పాఠము నందు 'హన్, హింసా గత్యోః అనగా హింస మరియు గతి యను రెండర్థము లీయబడియున్నవి. 'గోఘ్న' యందు దాని గతి, లేక జ్ఞానము, గమనము, ప్రాప్తి విషయముగు అర్థములున్నవి. ఇచ్చట 'ప్రాప్తి'యనునదే దాని ముఖ్య భావము. అనగా ఉత్తమ గోవులను ప్రాప్తింపజేయుట. **'గతేస్త్రయో ఽర్థాః జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి'**॥ అథ ౬-౧౧౧-౧ ॥ జ్ఞాన ప్రాప్తి కొర కుపదేశించబడినది

**యథాఙ్గం వర్ధతాం శేపస్తేన యోషితమిజ్జహి॥**

అనగా; నీవు వీర్య సంపన్నుడవై నీభార్య వద్దకే వెళ్ళుము ఇచ్చట గచ్ఛ శబ్దమునకు సాయణాచార్యుడు మున్నగు భాష్యకారులు 'గచ్ఛ' అనగా; వెళ్ళుము, అనియే అర్థమొనర్చినారు. ఏలన, స్త్రీని చంపివేయవలె నను నర్థము ఎంతటి మూర్ఖుడైనను చేయజాలడు. శత. బ్రా. ౧-౪-౧-౨-౧ నందు **'యజమానో వై సువ్ఘ్నయుః స హి దేవాన్ జిజీషతి స హి దేవాన్ జిఘాంసతి'** ఇచ్చట కూడా 'జిఘాంసతి' యందు స్పష్టముగా 'హన్' గత్యర్థము గలదేకాని వధార్థకము గాదు గదా! కాకున్నను యజమానుడు దేవతలను చంపదలచినాడను అర్థము కూడా చేయవచ్చును. కాని ప్రకరణానుసారముగ 'ఆతడు ప్రాప్తించదలచినా'డను నర్థమే అనువుగా నుండును సాయణాచార్యుడు తన వ్యాఖ్య యందు '(ప్రాప్తుమిచ్ఛతి' యని చక్కగా వ్రాసినాడు ఇట్టివే తనకే ఉదాహరణములీయవచ్చును. కావున; 'గోఘ్న'యనుదాని శబ్దార్థము 'గాః హన్యతే ప్రాప్యతే యస్మై' అనగా, గోవు ప్రాప్తింపజేయబడును, లేక ఈయబడు నని అగును వైదిక, మరియు లౌకిక సంస్కృతమునందు 'గౌ' అను శబ్దానికర్థము 'వాణి' యని ప్రసిద్ధమైయున్నది. నిఘంటువను 'వైదిక కోశము ౧-౧౧' నందును 'గౌ' శబ్దమున కర్థము వాణి పరముగా నీయబడియున్నది. అమరకోశమునందును అది వాణికి పర్యాయపదముగా గలదు. వర్తమానయుగపు కవికుల శిరోమణి కాళిదాసు కూడా **'ఇత్యర్ఘ్యపాత్రానుమిత వ్యయస్య, రఘోరు దారామపి గాం నిశమ్య॥'** రఘువంశము ౫వ సర్గము ॥ నందు ప్రయోగించినాడు. ఈ దశ యందు 'గోఘ్న' యనుశబ్దమునకర్థము అతిథిని దీసికొని, ఆతని కొరకు ప్రియ, మధుర వాణిని ప్రాప్తింపజేయబడుచుండెడిది. వారి యెడ మధుర ప్రియ శబ్దములచే వ్యవహరించబడుచుండెడిది అని కావున, అతిథిని, అతిథిగ్వ, గోఘ్న మున్నగు శబ్దముల గాంచి ఆలోచనాపరు లగు విద్వాంసులు భ్రమయందుబడిపోవుట శ్రేయస్కరముగాదు

## 5.16 'వశా' యను శబ్దమునకు కొంత విపులీకరణము

మనమిప్పుడాలోచించుచున్న వైదిక్ ఏజ్ పు ౩౮౩ నందలి వాక్యము లందు గల 'వశా' యను శబ్దమునకు వంధ్య (గొడ్డు) ఆవు అను అర్థము నొనర్చి వాని బలి ఈయబడుచుండెడి' దని భావము ప్రకటించబడియున్నది అది సంపూర్ణముగా అశుద్ధము, మరియు పైశాచికమైయున్నది. 'వశా' యనున దొక గొప్ప విస్తృతమగు శబ్దము. దీనికి పృథివి, మరియు ఈశ్వర సృష్టినంతయును వశమునందుంచుకొను శక్తి, ఆత్మ యొక్క ఇంద్రియములు,

మనస్సు, బుద్ధి మున్నగు వానిని వశమునందుంచుకొనునట్టి అద్భుత శక్తి మున్నగు అనేకార్థములు గలవు. కాని దానికి 'వంధ్య' పరకమైన అర్థమునొనర్చి అథర్వవేద ౧౦-౧౦ యందు దానిని బలియొనర్చు విధానము గలదని యెంచుట సంపూర్ణముగా అనర్థము, అసంగతమై యున్నది. మేముపై సూక్తమును ఆద్యోపాంతముగా ధ్యాన పూర్వకముగా పఠించియున్నాము. కాని దానియందు వంధ్యా గోవు (గొడ్డుటావు) అర్థముగాని, యజ్ఞములందు దాని బలిని గూర్చి సమర్థించు ఎట్టి ప్రమాణమును మాకు లభించలేదు. కాని ఇందుకు విపరీతమగు అనేక ప్రమాణములు లభించినవి. 'గొ' అర్థమును దీసికొనినప్పుడు మంత్రార్థము యొక్క పొందిక యుండుట లేదు. ఏలన ఈ 'వశా' విషయమున సూక్తమునందిట్లుపదేశించబడియున్నది.

**యయా ద్యౌర్యయా పృథివీ యయాపో గుపితా ఇమాః ।**

**వశాం సహస్రధారాం బ్రహ్మణాచ్ఛా వదామసి ॥** అథ ౧౦-౧౦-౪॥

అనగా; ఈ ఆకాశము, పృథివి మరియు జలము లన్నింటిని చక్కగా రక్షితమొనర్చియున్న ఆ సహస్రధారా (వేలాదులను ధారణమొనర్చియున్న) 'వశా'ను మేము వేదమంత్రముల ద్వారా అత్యుత్తమముగా ఉపదేశమొనర్చుదుము అని యుండగా 'వంధ్య' గోవు విషయములో ఇట్లు వర్ణించుట సంపూర్ణముగా అసంగతమైయుండును. ఏ విధముగానైనను దానిని 'సహస్రధారా' యని యనలేము గదా! ఇక రెండవది, పాడియావును గూడా ఈ రూపమున వర్ణించుట సంభవము గాదు. ఇది పరమేశ్వరుడీ జగమును వశమునందుంచుకొను శక్తిని గూర్చి స్పష్టముగా వర్ణించుటయే యగును. ఈ కారణముననే

**'అహోరాత్రాణి విదధద్ విశ్వస్య మిషతో వశీ'** ॥ ఋ ౧౦-౧౯౦-౨॥ యందు పరమేశ్వరుని 'వశీ' యని చెప్పబడినది. ఉపనిషత్తులందును.

**'ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా** ॥ కఠోపనిషత్తు. ౫-౧౨॥ ఈ రూపములో స్మరించబడియున్నది. ఒకవేళ గోవు పరమైన అర్థము నంగీకరించినను ఈ ౧౦-౧౦ యొక్క ప్రథమ మంత్రమునందే. 'అఘ్న్యే తే నమః' అనుదాని విషయము నాలోచింపదగినదిగా నున్నది. ఈ విధముగా 'అహన్తవ్య' అను అర్థమునిచ్చు ఈ 'అఘ్న్యా' శబ్దము ఆ 'వశా'ను గూర్చియే ప్రయోగించబడినది. అట్టిచో దానిని బలినిచ్చు విషయమెట్లు పొందికయగును? 'శతౌదనా' యనునది 'వశా' యను దాని పర్యాయ వాచకమనియే ఎంచబడుచున్నది. దీని వర్ణనము అథర్వ.౧౧-౯ మునగలదు ఇందు 'జిహ్వే సంమార్ష్టు అఘ్న్యే' (౧౦-౯-౩), 'పక్తారమఘ్న్యే మా హింసీః' ॥౧౧వ మంత్రము '॥యాని లోమాన్యఘ్న్యే' ॥ మ.౨౪॥ ఇట్లు మూడుసార్లు 'అఘ్న్యే' శబ్ద ప్రయోగము గలదు. దీనియర్థము 'అహన్తవ్యా' అనగా చంపదగనిది. 'వశా' శబ్దార్థము 'వంధ్యా గోవు పరముగా' నొనర్చినను ఇచ్చుట అథ ౧౦-౧౦-౫లో **'శతం కంసాః శతం దోగ్ధారః'** ॥ అనగా;

అనేకులు పాలు పితుకువారు, పాడిని నింపుట కనేక కాంస్య (కంచు) పాత్రలు గలవని యున్నది. అఘ్న్యా అను యావు పాలనీయదు గదా! ఐతే వందలాది పాలు పితుకువారు, పాలపాత్ర లెందుకు? ఇయం వై పృథివీ వశా ॥ శ.బ్రా. ౫-౧-౩-౩॥ అనుదానిననుసరించి పరమేశ్వరుని వశకారిణి శక్తియే గాక 'పృథివి' అర్థముదీసి

కొనినను అనేక మంత్రముల సాంగత్యము చక్కగా నగును. రెండు సూక్తములందును శతౌదనా, లేక వశా శబ్దముల అర్థము గ్రహించుటను గూర్చిన వర్ణన పదే పదే వచ్చినది. గాని చంపుట యను విషయము గాదు.

**యో దదాతి శతౌదనామ్** ॥ అథర్వ. ౧౦-౯-౫ ॥

**హిరణ్యజ్యోతిషం కృత్వా యో దదాతి శతౌదనామ్** ॥ అథ. ౧౦-౯-౬ ॥

**లోకాన్త్స సర్వానాప్నోతి యో దదాతి శతౌదనామ్** ॥ అథ. ౧౦-౯-౧౦ ॥

**యో వశాం ప్రతిగృహ్ణీయాత్** ॥ అథ ౧౦-౧౦-౨ ॥

**య ఏవం విద్యాత్ స వశాం ప్రతి గృహ్ణీయాత్** ॥ అథ ౧౦-౧౦-౨౭ ॥

**య ఏవం విదుషే వశాం దదుస్తే గతాస్త్రిదివం దివః** ॥ అథ ౧౦-౧౦-౩౧ ॥

**బ్రాహ్మణేభ్యో వశాం దత్వా సర్వాంల్లోకాన్త్సమశ్నుతే** ॥ అథ ౧౦-౧౦-౩౩ ॥

గోవును చంపుట కిచ్చుట ఎట్టి విధానము లేదు. కాని నిషేధము స్పష్టము.

**యే తే దేవి శమితారః పక్తారో యే చ తే జనాః ।**

**తే త్వా సర్వే గోప్స్యన్తి మైభ్యో భైషీః శతౌదనే** ॥ అథ. ౧౦-౯-౭ ॥

దీనియందు 'శమితా' మరియు 'పక్తా' యను శబ్దముల ప్రయోగము పృథివిపై శాంతిని విస్తరింపజేయు, మరియు దానిపై శ్రమించి ఫలప్రాప్తి నొందు విద్వాంసులను గూర్చి వచ్చియున్నది. ఈ శమితా, మరియు పక్తా విషయములో 'హే పృథివీ! నిన్ను రక్షించుదుము. నీవు భీతి జెందవలదని' చెప్పబడినది. మధ్యకాలము నందలి యాజ్ఞికులు, మరియు భాష్యకారులు ఈ శమితా, పక్తా శబ్దములకు చంపువారు, మరియు పాకమొనర్చువారని యర్థములనొనర్చి గొప్ప అనర్థమునే జేసినారు.

కావున ఈ సూక్తములకు వంధ్యా గోవులను బలియిచ్చుట మరియు; వైదిక్ ఏజ్; లేఖకులు తలచినట్టి అర్థమునే యొనర్చుట సంపూర్ణముగా అసంగతమే. మహర్షి గార్గ్యాయణకృత 'ప్రణవ వాదము' ననుసరించి గోమేధార్థము.

**'గోమేధస్తావచ్ఛబ్దమేధ ఇత్యవగమ్యతే గాం వాణీం మేధయా సంయో**

**జనమితి తదర్థాత్ । శబ్దశాస్త్రజ్ఞానమాత్రస్య సర్వేభ్యః ప్రదానమేవ**

**గోమేధో యజ్ఞః'** ॥ ప్రణవ వాదే- బ్రహ్మవాదిన్ ప్రెస్, మద్రాస్ ౧౯౧౫ ప్రకరణ 3, తరంగ ౬॥

అనగా - వాణిని మేధతో సంయుక్తపరచుట, లేక బుద్ధిపూర్వకముగా, నిదానముగా ఆలోచించి శుద్ధ శబ్దములను ప్రయోగించుట, ఇతరులకును శబ్దశాస్త్రము ( వ్యాకరణము) ను చదివించుట' గోవు యొక్క 'వాణీ' యను అర్థమును దీసికొని యను అర్థము నొనర్చబడియున్నది.

గౌ శబ్దమునకు పృథివీ పరముగా రెండర్థములగును. ఒకటి పారశీయుల 'గోమేజ్' ( ఇది గోమేధ శబ్దమునకే వికృత రూపమని స్పష్టమే) వంటిది. రెండవది. పృథివిపై ఉత్తమ కృషి యొనర్చుట, తాణ్డ్య మహా బ్రాహ్మణము. ౧౯-౧౩ ననుసరించి

**అథైష గోసవః స్వారాజ్యో యజ్ఞః॥** అనగా; లోపల, బయట సత్యమగు స్వరాజ్యమే గోమేధ, లేక గోసవ మని పిలువబడుచున్నది. ఇంద్రియములు, వాణి మున్నగువానిని ఆత్మ యధీనమునందుంచుట, మరియు వానిని పవిత్రముగా నుంచుట. ఇవి ఆంతరిక స్వరాజ్యములు మరియు పృథివిని ఉత్తమ రీతిలో స్వరాష్ట్రీయుల ద్వారానే శ్రేష్ఠ రూపమున ప్రజాశ్రేయస్సు కొరకు పరిపాలించుట బాహ్య స్వరాజ్యము. వీనికే గోమేధ, మరియు గోసవ మను నామములు ఈయబడినవి.

## 5.17 యజ్ఞ విషయములో శ్రీ సంపూర్ణానందగారి మహత్త్వ పూర్ణ లేఖ

సుయోగ్యులు, విద్వాంసులునగు ఉత్తర ప్రదేశ్ ఆర్యసమాజ ముఖ్యమంత్రి శ్రీ సంపూర్ణానంద గారు తన ఋగ్వేదీయ పురుషసూక్త 'శ్రుతి ప్రభాటీక' యందు యజ్ఞములందు పశుబలిని గూర్చి మహత్త్వపూర్ణమగు లేఖను వ్రాసియున్నారు. దానినిచ్చట ఉదాహరించుట అత్యావశ్యకమే యగును.

'బలిలేనిదే యజ్ఞము పూర్తిగాదు. పశువులను బలియిచ్చుట హింసాత్మకము, వేద విరుద్ధము 'మా హింస్యాత్ సర్వా భూతాని' ఏ ప్రాణిని హింసించ రాదని కలదు. ఇది ఘోరమగు పాప కార్యము. 'అనుద్బుద్ధ' ప్రాణులు, కామక్రోధముల చిత్రములుగా నున్నవానిని శాస్త్రములందు పశువులుగా చెప్పబడినవి. కావుననే పరమేశ్వరునికి 'పశుపతి' యనుపేరు కూడా కలదు. మానవుడు పశువుగా నున్నంతవరకు యజ్ఞమున కధికారి గాజాలడు. వాని క్రియలన్నియును తామసము, మరియు క్షుద్ర స్వార్థముచే ప్రేరితమై యుండును. సన్మార్గమున నడవదలచినవారు వారి యీ దుర్గుణములను, దౌర్బల్యమును పూడ్చివేయవలయును. దీనినే పశువు యొక్క ఆలభన (బలిదాన) మని యందురు. ఎంతటి గొప్ప యజ్ఞము ఒనర్చబడునో అంతగొప్ప పశువునే బలిఈయవలసి యుండును. యోగులకు సదా హింస, అసత్యము, పరిగ్రహము, స్తేయము, మైథునము మున్నగు ప్రవృత్తులుండగూడదు గదా! ఇవియే పశువులు, వీనినే యజ్ఞములందు బలి ఈయవలయును. ఆహుతియొసగవలెను. సమాధ్యవస్థను చేరి 'అస్మితా' నేను అను భావమును అణగద్రొక్కుటకు సమర్థుడైనప్పుడు తాంత్రిక భాషయం దాతడు మహిషము యొక్క ఆలభన మొనర్చినాడు. గేదెను బలియొనర్చినాడు.

## 5.18 సత్యమగు పశుబలి

యోగిగానివాడు, లోక కల్యాణ కారకములగు ఇతర కర్మలనొనర్చు వాడు కూడా యథాశక్తి తన పశుత్వమును చంపివేయవలెను. బలిఈయవలెను. ప్రతి విద్యాభిలాషి, ప్రతి దేశ సేవకుడు, ప్రతి ఉపాసకునకిది యనుభవమే. 'అహంభావన, మరియు మమత' లను గోడలు ఇతరులతో తన్మయత్వమునొందుటకు అడ్డము వచ్చును. నిలిపివేయును. వానిని కూల్చివేయుటయే యథార్థమగు పశుబలి. ఈ బలిచే మనలో నిద్రాణమైయున్న శక్తులు జాగృతి నొందును.

### 5.19 హింసాత్మక బలికర్మలు వాస్తవిక బలి కర్మల నవహేళన మొనర్చును.

ఈ యాత్మబలి, తన అతిప్రియమగు అహం (నేను) అను దాని బలి అందరకు సాధ్యముగాదు. ఈ అహంభావన నశించిన పిదప తన అతి చిన్నదగు 'స్వ' అతి ఉన్నతమగు విశ్వములో (స్వ) విలీనమైపోవును. ఐనను సామాన్య మానవులిందుకు సిద్ధముగా నుండరు..... సాధారణ మానవులకు సుఖము గావలెను, శక్తి గావలెను. కాని వారు దాని మూల్యమును చెల్లించుట క్లిష్టపడరు. కార్యము నొనర్చదలచెదరు. కాని నిష్కామభావన, యజ్ఞ దృష్టి కలిగియుండరు. వారు శ్రమలేని సరళమగు ఉపాయములను వెదకుచుందురు. ఇట్టి ఆత్మ వంచన ప్రభావము చేతనే శ్రద్ధ, మరియు తపస్సు యొక్క స్థానమును ధనమున కిచ్చెదరు. అప్పుడు వారి కెన్నియో సులభ పద్ధతులు లభించును. దాని ద్వారా స్వయముగా వ్రత దీక్ష నొందుటకు బదులుగా ఈ కార్యమును డబ్బు (ధనము) నొసగి ఇతరుల (కూలీల)చే చేయించెదరు. దాన దక్షిణముల రూపములో తమ అన్యాయోపార్జిత మగు సంపదనుండి అతి క్షుద్ర (చిన్న) భాగమునిచ్చి దేవగణము కన్నులలో దుమ్ము చల్లుటకు ప్రయత్నింతురు. ఇంతటితో తృప్తి గలుగదు. ఏక (ఒక) లేక అనేక అమాయక పశువులను, అప్పుడప్పుడు మనుష్యులను సైతము కోసివేయుదురు. మంత్ర ప్రభావముచే బలి పశువులో దేవత ప్రవేశించి, అది చచ్చిన పిదప యా శక్తి సంచయము యజమానులకు ప్రాప్తించును. ఎంత గొప్పగా, ఎంత అధికముగా జీవులు చంపబడునో అంత అధిక ఫలము లభించును. ఈ పరిపాటి వైదిక బలివిధానమును పరిహసించుటే. ఎంత శ్రద్ధతో జేసినను, ఎంత ధనము వ్యయమొనర్చినను యాజకులు, యజమానులు హత్యాపాపము నుండి తప్పుకొనజాలరు. తన జిహ్వా చపలతను తృప్తి పరచుటకు హత్య చేయుట, చేయించుట, మరియు ఏ దేవీ దేవతల పేరుననో హత్య యొనర్చుట, యొనర్చజేయుట మున్నగు దోషములు తమ పాపముల సంఖ్యను అధికమొనర్చును. సంపూర్ణానందకృత ఋగ్వేదీయ పురుష సూక్తము శ్రుతి ప్రభాటీక పు. ౪౨ నుండి ౪౫॥

### 5.20 మహా దేవానందస్వామి మరియు గోహత్యాదులు

హరిద్వార సన్న్యాసాశ్రమ వాసియగు శ్రీ మహాదేవానందస్వామి కలకత్తా విశ్వ విద్యాలయము ద్వారా ప్రకాశితమైన తన *'Vedic Culture'* అను పేరుగల గ్రంథములో ఒక అధ్యాయము *'Slaughter of Cows in Vedic Age'* అనగా వైదిక యుగము లో గోహత్యా విషయమును గూర్చి వ్రాసినారు. వాని నుండి కొన్ని ఉదాహరణములను ఈ య ధ్యాయమునకు పూర్వము ఇచ్చుట మాకు సమంజసమనిపించినది. వారిట్లు వ్రాసినారు.

*Slaughter of cows in the Vedic Age a misconception.*

In the RigVeda it has been clearly stated that cows are not to be killed.

*In the following mantras the term అఘ్న్యా (not to be killed) is used vide. 1-37-5; 1-164-27; 1-164-40- 4;1-6; 5-83-8; 7-68-8; 7-69-8; 7-102-19; 9-1-9; 9-80-2; 9-93-3; 10-46-3; 10-60-11; 10-87-16 and 10-102-7.*

*Yaska while recording the names (equivalents) of 'గోవు' cow has first posted the word అఘ్న్యా Aghnya - not to be killed. Vide 11-44 -33 అఘ్న్యా అహంతవ్యా భవతి - In the Zendavesto also the cow is to be venerated and not to be killed. In the Vedas also the cow is specially venerated. Rik. 4-58-10 గో దేవతా (Go-is the Devata of the sukta). That the flesh of the cow is forbidden as food is quite clear from Rik. 10-87-16 which states*

యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే యో అశ్వ్యేన పశునా యాతుధానః।
యో అఘ్న్యాయా భరతి క్షీరమగ్నే తేషాం శీర్షాణి హరసాపి వృశ్చ ॥

*"i.e. The monster, that partakes of the flesh of human beings or the meat of animals like the horse or who steals (robs) the milk of the unkillable cow, is beheaded by Agni."*

(Vedic Culture by Swami Maha Devananda Giri P. 132)

*Some observe in the text* ' ఏతద్ యథా రాజ్ఞే వా బ్రాహ్మణాయ వా మ హోక్షం మహాజం వా పచేత్' *a hint to the prevalence of a custom of slaying an ox or goat and cooking the meat there of. But it must be clearly understood that the term* మహోక్ష *(Mahoksha) used in this text does not refer to an ox. In Rik. 8-43 - 11. there occurs the word* (ఉక్షాన్నాయ) *which means edibles mixed with soma juice. Later on from the* రాజ నిఘంటు *text* ఋషభౌషధి కర్కట శృఙ్గీ *it is found that kings and Brahmans were offered on their arrival the juice of the Soma plant or some other herbal decoctions control the bile, just as tea is served in modern times to all guests. In Kashmir and Tibet this custom of offering tea has been in use from ancient times. It might also be a direction to bathe the guest in water warmed with many odorous and invigorating ingredients* సర్వౌషధి *The word* మహాజ *(Mahaja) also does not indicate a big goat but fine rice from the Sali variety of paddy In the Shanti Parva of the Maha Bharat there is a text*

అజైర్యజ్ఞేషు యష్టవ్యమితి వా వైదికీ శ్రుతిః
అజసంజ్ఞాని బీజాని, ఛాగాన్ నో హన్తుమర్హథ ॥ మ. భా. శాం. ప ॥

*It means that sacrifices should be performed with the aja. But aja according to this Vedic injunction never means the goats but cereals like wheat, Brihi etc. (Vedic Culture P. 138.139)*

*The word yajna is synonymised as* అధ్వర *of* యజ్ఞమధ్వరమ్. ధ్వర *stands for Hinsa (Killing, Violence) so* అధ్వర *is non-violence and therefore no slaughter can be part of the true sacrifice P. 141.*

ఈ యుదాహరణముల సారాంశమేమనగా; ఋగ్వేదమునందు గోహత్యను ఎట్టి రూపమున చేయరాదని స్పష్టముగా ఆదేశించబడుచున్నది. గోవుల విషయములో ఋగ్వేదము మం.౧-౩౭-౫, ౧-౧౬౪-౨౭, ౧-౧౬౪-౪౦, ౪-౧-౬ మున్నగు వానిలో అఘ్న్య శబ్ద ప్రయోగము గలదు. నిరుక్తము నందు యాస్కాచార్యులు

'అహన్తవ్యా' అనగా గోవు లెప్పుడును చంపగూడని వని అర్థము నొనర్చియున్నారు. ఋ. ౧౦-౮౭-౧౬ లో **'యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే.... యో అఘ్న్యా యా భరతి క్షీరమగ్నే ।'** అను మంత్రము ద్వారా అతి స్పష్టముగా గోమాంస భక్షణము నిషేధమొనర్చబడినది. ఎంత చెప్పినను మానక గోమాంసాదుల భక్షణ మొనర్చువారిని శిరచ్ఛేదన మొనర్చ వలయుననియును సూచించబడియున్నది. 'ఏతద్ రాజ్ఞే వా బ్రాహ్మణాయ వా మహోక్షం మహాజం వా పచేత్' మున్నగు బ్రాహ్మణ వాక్యములందు రాజనిఘంటువు ననుసరించి 'మహోక్ష' మనగా ఋషభమను ఓషధి, కర్కాటక శృంగి మున్నగు అర్థములు చెప్పబడినది. ఋగ్వేద. ౮-౪౩-౧౧వ మంత్రమున 'ఉక్షాన్న' శబ్ద ప్రయోగమున్నది. దీనియర్థము భోజనము నందు ఉక్షా పదమనబడు సోమమును గలుపుకొనవలయు నని కలదు. రాజులు మరియు ప్రతిష్ఠ గల బ్రాహ్మణులు మున్నగు వారు అతిథులుగా వచ్చునప్పుడు పిత్తాదుల శాంతి కొరకు సోమరసము పానీయముగా నీయబడుచుండెడిది. (ఈకాలములో అతిథులను తేనీటిచే గౌరవించుచుండునట్లు) సోమ, ఋషభకము మున్నగు ఓషధుల రసమును గలిపిన జలములచే స్నానము జేయించుచుండిరనియు ఇట్టి వాక్యములందు నిర్దేశించబడియున్నది. దీని తాత్పర్య మిచ్చుట మేకలు మున్నగు వానిని చంపుట గాదు, కాని 'అజ సంజ్ఞాని బీజాని ఛాగాన్నో హన్తుమర్హథ' మున్నగు నీ మహాభారత వచనానుసారము ప్రత్యేక రకముల బీజములు, మరియు బియ్యము మున్నగు వాని సంబంధమై యున్నది. యజ్ఞము యొక్క పర్యాయపదము. 'అధ్వర' మను శబ్దము హింసారహిత కర్మయని యర్థము. కావున హింస యథార్థ యజ్ఞము యొక్క భాగము గాదనియే స్పష్టమగుచున్నది.

### 5.2 । డా. రాధా కుముద్ ముకర్జీ మరియు వైదిక యజ్ఞము

భారత దేశపు సుప్రసిద్ధ ఐతిహాసికులు, లఖ్నో విశ్వవిద్యాలయ ఉపకులపతి యగు డా. రాధాకుముద్ ముకర్జీ తన *Education in Ancient India* అను పుస్తకము నందిట్లు వ్రాసియున్నారు.

"Vedic Religion did not countenance bloody sacrificing of animals by violence. As the Chhandogya Upanishad (111-6) puts it

**'న వై దేవా అశ్నన్తి న పిబన్తి, ఏతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి'**

*"The gods who do not eat or drink, should not be offered meat tainted with violence"*

"Thus Sacrifice at a yajna meant self - sacrifice."

The yajnas were evolved as modes of invocation of the Infinite and possessed of profound spiritual significance and educational value as aids to self realisation"

Education in Ancient India by Late Dr. Radha Kumud Mukerjee M.A.Ph.D

అనగా; వైదిక ధర్మము పశుహింసాత్మక యజ్ఞములను ఎంతమాత్రమును సమర్థించదు 'ఛాన్దోగ్యోపనిషత్తు' ॥ 3-౬ న వై దేవా అశ్నన్తి పిబన్తి ఏతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి' మున్నగు శబ్దముల ద్వారా హింసాత్మక కర్మలను సంపూర్ణముగా నిషేధించినది. యజ్ఞము యొక్క అర్థము స్వార్థత్యాగము, యజ్ఞములు అనంతుడగు పరమేశ్వరుని

స్తుతుల రూపములో వికసితమైనవి. అవి అత్యంత గంభీర ఆధ్యాత్మిక తత్త్వము, మరియు ఆత్మానుభవమునందు సహాయకముల రూపమున శిక్షణ దృష్టితో మహత్త్వ పూర్ణమైయున్నవి.

ఈ వివేచనము తరువాత ఇప్పుడిక మేము వైదిక యజ్ఞ విషయకమగు ఈయధ్యాయము నిచ్చటనే సమాప్త మొనర్చుట ఉచితమని యెంచుచున్నాము. యజ్ఞము లందు పరమ ఉపకారము, మరియు ఆత్మ కల్యాణార్థ మొనర్చబడు సకల శుభకర్మలు చేరియున్నవి.

ద్రవ్య యజ్ఞములందు ఆహుతులుగా నీయబడు నేయి, తేనె, చందనము, కర్పూరము, అనేక ఓషధులను కూర్చి సిద్ధపరచబడిన హవన సామగ్రి మున్నగు సుగంధిత, రోగనాశక పదార్థములచే జల వాయువులు శుద్ధమగును. మరియు క్షయ మున్నగు భయంకర వ్యాధుల సైతము ఇట్టి యజ్ఞ క్రియ ద్వారా తొలగించవచ్చును. బరేలీ నగర సుప్రసిద్ధ డా. శ్రీ. ఫున్దన్‌లాల్ ఎం.డి.గారు యజ్ఞ చికిత్స యను ఒక పుస్తకమును వ్రాసినారు. ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వము దానికి ఉత్తమ బహుమతి నిచ్చియున్నది. యజ్ఞము లందు పశుహింస సంపూర్ణముగా వేద విరుద్ధమే. అశ్వ మేధ, గోమేధ, నరమేధ మను శబ్దములకు అర్థము అశ్వములను, గోవులను, మనుష్యులు హింసించుట అని గాదు. అట్టి పదములకు, నిరుక్తము రాష్ట్రసంచాలనము, వాణి యొక్క శుద్ధ ప్రయోగము లేక కృషి, మానవుల ఐకమత్యము వృద్ధి మున్నగు అర్థములున్నవి. నేడుప లబ్ధమగుచున్న ఆరణ్యక, బ్రాహ్మణ, శ్రౌత, గృహ్యసూత్ర, మరియు ఇతర గ్రంథములందు పశుహింసా సమర్థక వాక్యములు గాన్పించినచో నవి వేద విరుద్ధములగు కారణమున అప్రమాణములు, దూషితములని యెంచవలయును. వైదిక యజ్ఞములు సత్య స్వరూపమును గూర్చి అధికముగా దెలిసికొనదలచినవారు ఈ దిగువ గ్రంథముల యధ్యయన మవశ్యముగా నొనర్చవలయును.

౧. 'వైదిక పశు యజ్ఞ మీమాంస' మాన్య వేదోపాధ్యాయ శ్రీ. పం. విశ్వనాథ, విద్యా మార్తాండకృత అత్యుత్తమ గ్రంథము, గురుకుల పుస్తక భండారము, గురుకుల్ కాంగ్డీ

౨. 'నీవు సైనికునిగా చేరునది కృష్ణుని సేనయందా,' లేక కంసుని సేనయందా? అను పేరు గల గ్రంథము. మాన్యులగు శ్రీ. పం. బుద్ధ దేవ విద్యా మార్తాండ గారు రచించినది. ప్రభాతాశ్రమము. మేరఠ్'

౩. బౌద్ధమతము మరియు వైదిక ధర్మము :- ఆర్య సమాజము, దీవాన్ హాల్, ఢిల్లీ

౪. గోరక్ష పరమ ధర్మము మరియు గోవధ మహాపాపము :- ప్రకాశకులు శ్రీ గోవిందరామ్ హాసానంద్, ఆర్య సాహిత్య భవనము, నయీ సడక్ ఢిల్లీ

౫. వైదిక కర్తవ్య శాస్త్రము :- ధర్మదేవ విద్యామార్తాండకృతము, కాంగ్డీ గురుకులము

(పై (౩,౪,౫) మూడు గ్రంథములును ధర్మదేవ విద్యా మర్తాండ కృతము, కాంగ్డీ గురుకులము)

౬. వైదిక యజ్ఞ సంస్థ :- స్వాధ్యాయమండలి ద్వారా ప్రకాశితము. ఇందు మా రచన గూడ గలదు. స్వాధ్యాయ మండలి, కిలాపారడీ, సూరత్ జిల్లా.

౭. యజ్ఞే పశువధ వేద విరుద్ధః- పం. శ్రీ. నరదేవ వేదతీర్థగారి కృతము మహా విద్యాలయము, జ్వాలాపూర్, ఉత్తర ప్రదేశ్.

******

# వేదముల యథార్థ స్వరూపము

## షష్ఠాధ్యాయము

## 'వైదిక్ ఏజ్' సందిగ్ధము సందేహజనకమునగు పుస్తకము

ఇది అచ్చమైన సంశయాస్పదమనదగిన కల్పనల భాండాగారము

'వైదిక్ ఏజ్ *Vedic Age*'., అను పుస్తకమును ఆద్యంతము వరకు ధ్యాన పూర్వకముగ చదివిన పిదప పక్ష పాత రహిత పాఠకులు తప్పక ప్రభావితులై యుందురు. ఏమన; ఇదియొక సందిగ్ధ, మరియు సందేహ జనక పుస్తకము. దీనియందు అచ్చమగు సంశయములు, కల్పనలు, రాసులు రాసులుగా నున్నవి. విద్వాంసులగు ఈ పుస్తక లేఖకులకు ఏ వస్తువును గూర్చియైన నిశ్చిత జ్ఞానము లేదు. మాటి మాటికి వారు *Probably* లేక జరుగవచ్చును కావచ్చును, పదములను ప్రయోగించినారు, ఇందువల్ల పాఠకులకు నిశ్చయమగు జ్ఞానము లభించగలదా? నిజముగా వారి జ్ఞానమింతటి సందేహాత్మకము, అనిశ్చితముగా నుండి మాటి మాటికి *Probably or Perhaps* లను నింపివేయ వలసివచ్చినప్పుడు వారిట్లు సందిగ్ధము. సందేహాస్పదమగు విషయములను వ్రాసి తమ, మరియు పాఠకుల విలువైన సమయము నెందులకు నష్టమొనర్చినారో, ఏ రత్యధికముగా పరిశోధనము, అన్వేషణ ప్రయత్నముల నొనర్చి సుధృఢమగు నిశ్చితాభిప్రాయమునకు చేరినప్పుడే దీనిని పాఠకుల యెదుటికి దెచ్చు సాహసమొనర్చవలసి యుండెను. ఇట్లొనర్చుటచే గ్రంథ ప్రకాశనము నందు ఆలస్యము జరుగవచ్చును. కాని గ్రంథ పాఠకుల భ్రమ, మరియు సందేహ నివృత్తియయ్యుండెడిది. మేమీ విషయములో అత్యుక్తికరముగా వ్రాసినామని పాఠక మహాశయులు దలచకుందురుగాక. మేమీ 'వైదిక ఏజ్ ' నుండి 29-30 ఉదాహరణములనిచ్చుటయే, సరిపడుననుకొందుము. *Probably* లేక *Perhaps* వంటి అనిశ్చయ సూచకమగు అనేక శబ్దముల ప్రయోగమిందుగలదు. ఇట్టివే వందలాది ఉదాహరణములను ఈ గ్రంథము నుండి సులువుగా నీయవచ్చును. మచ్చునకు కొన్నింటిని గాంచుడు.

*1. Regarding Race Movements and Prehistoric Culture.*

ఈ శీర్షికతో ప్రాగైతిహాసిక సంస్కృతి విషయములో వైదిక్ ఏజ్ యొక్క ఎనిమిదవ అధ్యాయము గలదు. ఇది సంపూర్ణముగా కపోల కల్పితము, ఉజ్జాయింపు, ఊహా మాత్రముగ నున్నది. ఈ విషయమును దిగువ శబ్దముల ద్వారా లేఖకు లంగీకరించి యున్నారు. వారిట్లు వ్రాసినారు.

***"It is strange (and some what difficult of explanation) that skeletal remains of Early man in India, particularly in the pre-historic and early historical times, should be so scanty. This lack of material has not allowed us to postulate with certainty about racial Movements in ancient times, and any appraisement or reconstruction of Movements of peoples in India, some four or three or even two thousand years ago is bound to remain largely hypothetical and based on or inferred from the present day situation only"***

***(Vedic Age P.141)***

మీరు ఇంతటి సందేహాస్పద కల్పనలపైననే ఆధారపడియుండి నిష్పాక్షిక ఆలోచనాపరులగు విద్వాంసులు మీ యీకపోల కల్పిత విషయములను విశ్వసించగలరని ఎట్లాశించితిరో ఆశ్చర్యమే. వాస్తవముగా ప్రాగైతిహాసిక సంస్కృతి విషయములు ఉన్నవి యున్నట్లు మీరీ గ్రంథములో వ్రాసినంతవరకు దాదాపు అచ్చముగు కల్పనామాత్రములగు కారణమున ఆదరించదగినవి గావు.

౨. మేము ముందు వ్రాయ బోవు ఆర్యులు మరియు అనార్యులు, ఆర్యులు, దాసులు, దస్యులు, ద్రవిడులు అను విషయములు గల అధ్యాయములో 'వైదిక్ ఏజ్' లేఖకులు ద్రావిడ సంస్కృతిని ఆర్య సంస్కృతి కన్న అత్యుత్కృష్టమని చూపుట కెంతయో ప్రయత్నించినారు. ఈ ప్రవృత్తి కారణమున సైతము వారనేక విచిత్ర కల్పనల నొనర్చుచు వానితో గూడ *Possibly* వంటి సందేహసూచక శబ్దములను ప్రయోగించినారు. ఉదాహరణార్థము పు. ౧౫౫లో వారిట్లు వ్రాసినారు.

*"There is evidence, both indirect and direct, that in Central India, in North India and in Western India and Possibly also in Eastern India, Dravidian was at one time fairly wide spread" (Vedic Age p 155.)*

ఇచ్చట భారత దేశ తూర్పు దిశలో ద్రావిడ భాషల ప్రసారము కొరకు వారి వద్ద ఎలాంటి ప్రమాణములు లేవని తోచుచున్నది. కావుననే ఉత్తర, పశ్చిమ, మధ్య భారతముతో గూడ 'సంభవతః' (కావచ్చును) అను ప్రయోగమొనర్చి అందు పూర్వీయ (తూర్పు) భారతమును కూడా కలిపివేసినారు. ఒకవేళ ఈ విషయమును స్థిరపరచుటకు వారి వద్ద ఏమైన ప్రమాణములున్నచో వారు వీనిని అవశ్యముగ ప్రవేశపెట్టెడివారు.

౩. హరప్పా మరియు మొహంజోదారో నగరముల నిర్మాతలు ద్రావిడ భాషా భాషీయులేయై యుండిరా, కాదా? యను విషయమును గూర్చి, 'వైదిక ఏజ్ లేఖకు లెట్టి నిశ్చయము నొనర్చలేదు. కాని సందేహాత్మక భాషలో వారు ద్రావిడ భాషీయులగు కారణమున ద్రావిడము దిశకే తమ మ్రొగ్గు చూపియున్నారు. వారిట్లు వ్రాసినారు.

*"We are not absolutely certain that the city builders of Harappa and Mohenjo-daro in South Punjab and Sind, whom the Aryans doubtless encountered, spoke Dravidian, but there is a balance of Probability that they did.*

This matter can not be proved or disproved until we find the clue to the script in the hundreds of seals found at Harappa and Mohanjodaro and others sites." (Vedic Age. P. 156)

హరప్పా మరియు మొహంజోదారో నగర నిర్మాతలు, ద్రావిడ భాషాభాషీయులే య్యైయుండిరను ప్రమాణములు మీవద్ద ఏమాత్రమును లేనప్పుడు మీ లేఖానుసార మది సమంజసమే గాదు. అచ్చట లభించిన స్వర్ణ నాణెములపై గల లిపిని గూర్చి మీ కే మాత్రము జ్ఞానము లేనప్పుడు అచ్చముగు సంశయాత్మక కల్పనలను పదే పదే యుల్లేఖించుటచే నేమి లాభము? ఇట్టి కపోల కల్పనలచే, సంభవతలచే పుస్తకమును నింపివేయుటచే ప్రజలను భ్రమయందు ముంచివేయుట కన్న సాధించిన దేమియును కానరాదు.

४. ఋగ్వేదమునందలి నిర్మాణకళను గూర్చి తాము తమ పుస్తకములోని పు.౧౯४ను గూర్చి స్వయముగా నిట్లంగీకరించియున్నారు.

*"The age of the RigVeda is not known with even an Approximate degree of certainty" (Vedic Age. P. 194)*

అనగా; ఋగ్వేదకాల నిర్ణయ విషయమును గూర్చి ఇంచుమించు జ్ఞానమైనను లేదు.

ఇట్టి స్థితిలో వీరు ఋగ్వేద నిర్మాణ కాలము దాదాపు క్రీ.పూ. ౧౦౦౦ (వేయి) సంవత్సరములుగా చూపుట ఎంతటి అనుచిత, అజ్ఞాన, భ్రమ జనకమో చూడుడు.

౫. ఋగ్వేద విషయమే యెందులకు? వైదిక కాలమును గూర్చిన ఏ యితర గ్రంథమునందును కాల నిర్ణయమును గూర్చి నిశ్చితముగా చెప్పజాలనప్పుడీ మహాపురుషులు పు.౨౨౫లో అంగీకరించినారు.

*"Not a single work of Vedic period can be accurately dated" (Vedic Age. P. 225)*

ఐనను మరల పాశ్చాత్య లేఖకుల ననుసరించి వీరు కాలమును 3000 సంవత్సరములకు ముందే నిశ్చితపరచు ప్రయత్నమొనర్చినారు. ఇది సంపూర్ణముగా అసత్యమే దీనిని మేము రాబోవు అధ్యాయమున వివరించుచున్నాము.

౬. 'కేశిన' యను పేరు గల ఒక వర్గము గూర్చి పు. ౨౫౯ లో ఇట్లు వ్రాసినారు.

*"They were probably a branch of the Panchalas"*

౭. 'వైదిక్ ఏజ్' పు. ౨౬౦లో ఇట్లు వ్రాసినారు.

*"There are various other minor tribes mentioned in Vedic texts, but we know very little of them." (Vedic Age. P. 260)*

అనగా; వేదమంత్రములందు అనేక చిన్న చిన్న జాతుల వర్ణన జూడబడుచున్నది. కాని వారి విషయములో మేము చాలా తక్కువగా నెరుగుదుము.

మా టిప్పణి, వాస్తవ విషయమేమన వారెవరినైతె *Index of Vedic names and Subjects* మున్నగు పాశ్చాత్య విద్వాంసుల కథనానుసారము జాతి వాచక నామములుగా నెంచినారో వాస్తవముగా అందు జాతి వాచక నామములు లేనే లేవు. అవి సామాన్య వాచక పదములై యున్నవి. పూరవః తుర్వశాః, యాదవః, నహుషః, ఈ శబ్దములు వైదిక కోశము, నిఘంటువు మున్నగు వాని యందు మనుష్యుల పేర్లుగా వచ్చియున్నవి. వానిని వర్గ విశేషమో, వ్యక్తి విశేష వాచకములుగానో యెంచుట గొప్ప పొరపాటే యగును. మేమిది వరకు మూడవ అధ్యాయమునందు దెలిపియున్నట్లు వేదములందు అనిత్య ఐతిహాసిక సామగ్రి ఏమాత్రమును లేదు. ఈ విషయమును గూర్చి వీరు స్వయముగా పు.౨౨౫లో ఋగ్వేద విషయమున అంగీకరించియున్నారు.

*Naturally it (The Rigveda) is poor in historical data (Vedic Age P. 225)*

అనగా; ఋగ్వేదము స్వభావ సిద్ధముగనే ఐతిహాసిక విషయములందు అత్యంత పేదరాలైయున్నది.

'అనాది నిధనా' నిత్య వాణి యగు కారణమున వేదములందు అనిత్య ఇతిహాసము సంభవములు. కావున వీరు మరియు ఇతర ఐతిహాసిక విద్వాంసులు వేదములలో ఐతిహాసిక సంఘటనలను చూపుటకు ప్రయత్నించుట వ్యర్థమే.

౮. పుట ౨౬౦లో పౌండ్రకుల విషయములో ఇట్లు వ్రాసియున్నారు.

The Paundras are probably the ancestors of the Puros, an aboriginal caste in Bengal (Vedic Age. P. 260)

౯. మరల ఆ పుట యందే శబరుల విషయములను వ్రాసియున్నారు.

"The Sabaras are probably ancestors of the Savarlu or Savras of the Vizagpatam hills, the Savaris of the Gwalior territory and the savages of the frontiers of Orissa." (Vedic Age. P. 260)

౧౦. పు. ౨౬౧లో ఆర్యులు ఆదివాసులపై ఆక్రమణ మొనర్చుట వేదములలో అనేక స్థలములలో నిర్దేశము గలదని కల్పించి వ్రాసినారు. ( ఈ విషయమును మేము ఆర్యులు, అనార్యులు అను విషయక అధ్యాయము నందు వివేచన మొనర్తుము. )

"The RigVeda repeatedly refers to the attacks on the aborigines. They are called Krishna twach (black skin) metaphorically, Kuyavach (evil speaking) a demon slain by Indra, probably personifies the barbarian opponents" (Vedci Age. P. 261)

మేమీ అచ్చమగు కపోలకల్పితము యొక్క నిస్సారత్వమును 'ఆర్యులు, అనార్యులను విషయపు అధ్యాయములో సప్రమాణముగ జూపెదము.

౧౧. వైదిక ఏజ్ పు. ౨౭౦లో ఒక నిరాధారమగు కల్పితమును చేర్చినారు. దానిని జూచిన పక్షపాతము లేని పాఠకులు అత్యంతాశ్చర్యము, ఖేదమునొందగలరు. అదిట్లు గలదు.

*"The Flood in Mesopotamia is generally held to have occurred about 3100 B.C. The flood in India **probably** occurred at the same time, and the date 3102 B.C supposed to be beginning of the Kali era, may therefore commemorate this event" (Vedic Age. P. 270)*

మెసోపోటేమియాలో జలప్రళయము వచ్చిన సమయ మిప్పుడు సాధారణముగా 3౧00 క్రీస్తు శకమునకు పూర్వమని ఎంచబడుచున్నది. ఆ కాల మందే భారత దేశమందును జలప్రళయము వచ్చి యుండును. దానినే క్రీ.శ. పూర్వము 3౧0౨ కలియుగ ప్రారంభ తిథిగా నెంచబడుట ఈ సంఘటన మనుస్మృతి యందే కావచ్చును. దీనిని నిరాధార కల్పనయనక మరేమనగలము? మన భారతీయ పరంపరానుసారముగ ఈ జలప్రళయమునకు, కలియుగ ప్రారంభమున కెలాంటి సంబంధము లేదు. శతపథ బ్రాహ్మణము, మహా భారతము మున్నగు వాని ననుసరించి దీని సంబంధము వైవస్వత మనువుతో గలదు. ఇట్టి యవస్థయందు ఎట్టి ప్రమాణమును జూపకయే వైవస్వత మనువు యొక్క కాలమును 3000 సంవత్సరములుగా నిర్ణయించి చెప్పుట నిస్సారమగు కల్పనయేగాక మరే మగును? దీని నాక్షేపించుట మా కర్తవ్యముగా నెంచుచున్నాము. మేమీ విషయమున వైదిక కాలమును గూర్చి చక్కగా, విమర్శనాత్మకముగా వివరించెదము. ఈ జల ప్రళయమునకు, మహా భారత కాలమును క్రీ. పూ. 3౧00 అని నమ్ముటకే మాత్రమును సంబంధము లేదు.

౧౨.పు. ౨౭౨లో ఒకే పరిచ్ఛేదము నందు ౨-౩ విషయములలో వారి అజ్ఞాన నిర్దేశమును జూడుడు అందిట్లు వ్రాసినారు.

*"The location of the Nabhagas ascended from Nabhaga is un-certain. They **probably** reigned in the midlands of the Gangetic Doaba, and included Rathitara from whom came the Rathitaras who were Kshatriyan Brahmanas. The Nabhaga dynasty played practically no part in traditional history and probably disappeared under the early Aila conquests. From Dhrishta came the Dharshtak Kshatriyas who **probably** ruled over Vahika in the Punjab. **Nothing farther is known about them."** (Vedic Age. P. 272)*

౧౩.వైదిక్ ఏజ్ పు. ౨౫౭ యందీ విధముగా వ్రాసియున్నారు.

*"Kuvalashva is said to have marched against an Aswa, Rakshasa or Daitya named Dhundha near a shallow sand filled sea in the Rajputana desert in order to rescue a sage named Uttanka. He destroyed the subterranean quarters of the Asura and put an end to his fiery home. This legend probably suggests that Kuvalashva subjugated the Asuras and aboriginals to the West and in the Southern parts of Rajputana and spread Aryan culture in those lands." (Vedic Age. 257)*

౧౪. ఇంకను వైదిక ఏజ్ పు. ౨౭౬లో ఇట్లు వ్రాయబడియున్నది.

*"The Bhargavas, Vasishthas and **probably** Angirasas appear to have been the earliest Brahmana families" (Vedic Age. P. 276)*

అనగా; భార్గవుడు, వసిష్ఠుడు మరియు అంగిరసుడు అతిప్రాచీన బ్రాహ్మణ కులము వారేయై యుందురు. ఒక వేళ లేఖకుల ఐయుందు రను అభిప్రాయము ననుసరించి అంగిరసుడు అందరికన్న అతిప్రాచీన బ్రాహ్మణ కులమువాడే యై యుండినచో అథర్వాంగిరస, లేక అథర్వ వేదమును నవీన వేదమని ధృవపరచు దుస్సాహస మేల యొనర్చినారు.? ఈ విషయమును గూర్చిన వీరి కల్పనను గూర్చి ప్రకరణానుసారము ముందు మీమాంసము యొనర్తుము. వీరికి సాధారణ ఐతిహాసిక విషయములు సైతము ఏమాత్రము నిశ్చయముగా దెలియనప్పుడు వైదిక కాల విషయములో సంపూర్ణముగా అసత్యము మరియు ఆర్ష పరంపరకు విరుద్ధములగు అనేక విషయములను వ్రాసి యువతరమును ఎందుకు భ్రమలో పడవేసినారో తెలియకున్నది.

౧౫.వైదిక్ ఏజ్ పు. ౨౭౮ లో నాగజాతి వారి విషయమును వారు ఆదివాసులు మరియు అసభ్యులై యుందు' అని వ్రాసినారు.

*"This shows the extension of the Aryan Culture towards the river Narmada and the land of the Nagas who were **probably** aborigines or primitive peoples." Vedic Age P. 278.*

౧౬. వైదిక్ ఏజ్ పు. ౨౭౯ లో ద్రుహ్యుల విషయమందిట్లు వ్రాసియున్నారు.

*"After a time being over-populated the Druhyus crossed the borders of India and founded many principalities in the Mleccha territories in the North, and **probably** carried the Aryan culture beyond the frontiers of Inda" (Vedic Age P. 279)*

౧౭. వైదిక ఏజ్ పు. ౨౮౧లో పరశురాముని విషయమున నిట్లు వ్రాయబడినది.

*"It appears that on the strength of the matrimonial alliances of the Bhargavas with the ruling families of Kanyakubja and also of growing discontent due to the devastating raids and consequent un-popularity of the Haihayas, Rama organised a confederacy of various kingdoms including Vaishali, Videha, Kashi, Kanyakubja and Ayodhya which fought the Haihayas on various battle fields. These are **probably** referred to by the annihilation of the Kshatriyas twenty one times."(Vedic Age. P. 281)*

౧౮. అర్జునుని పుత్రుల విషయము వైదిక ఏజ్ పు. ౨౮౩లో ఇట్లు వ్రాయబడినది.

*"Arjuna ad many sons of whom the chief was Jayadhvaja who reigned in Avanti. Surasena, another son, appears to have been associated with Mathura, while Sura, the third son **probably** was connected with Surashtra" (Vedic Age. P. 283)*

సురను సురాష్ట్రముతో గలిపి వేయుట హాస్యాస్పదముగ నున్నది.

౧౯. పు.౨౮౪లో విదిశ విషయమున సందేహాత్మక భాష యందు 'అది హైహయుల ఆధీనమునం దుండవచ్చు' నని వ్రాయబడినది.

*"Vaishali and Vidisha also were attacked by the Haihayas and Vidisha probably was under Haihaya occupation". (Vedic Age P. 284)*

౨౦. కుశికుని పుత్రుడగు గాధి విషయములో మరో కల్పనను దిగువ సందేహాస్పద వాక్యములలో పు. ౨౮౫ యందిట్లు వ్రాసినారు.

*"Kushika's son from Paurukutsi, Purukutsa's descendant in about the sixth degree, was Gadhi. Gadhi is described as an incarnation of Indra, which probably means that he had an alter native title such as Indra or one of his synonyms."(Vedic Age. P. 285)*

౨౧. విశ్వామిత్రుని తరువాత రాజెవరనునది వైదిక్ ఏజ్ లేఖకులు నిశ్చయముగ నెరుగకుండిరి. కావున అష్టకుని విషయము పు. ౨౮౫ లో సందేహ సూచకముగా నిట్లు వ్రాసియున్నారు.

"Ashtaka **probably** succeeded Vishvamitra on the throne"(Vedic Age. P. 285)

౨౨. విదిశరాజు విషయములో 'ఆతడు హైహయ ప్రముఖుడై యుండునేమో' యని సంశయాత్మకముగా పు. ౨౮౭లో వ్రాసినారు.

*"Karandhama, King of Vaishali is said to have been besieged by a confederacy of kings whom at last he defeated. He also rescued his son Avikshit, who was captured by the King of Vidisha (probably) a Haihaya chieftain" (Vedic Age. P. 287)*

౨౩. వైదిక ఏజ్ పు. ౨౮౯లో సుదాస పుత్రుడగు మిత్ర సహుని విషయములో సందేహ సూచక భాషయందిట్లు వ్రాసియున్నారు.

*"Around Sudasa's son Mitrasaha has grown a cluster of wild and fantasitc legends, invented perhaps to expalin his second name Kalmashapada"(Vedic Age. 289)*

౨౪. వైదిక్ ఏజ్ పు. ౨౮౯ లో అశ్మకుని గురించిన ఒక కథ విషయములో సందేహ సూచకముగా వ్రాయబడియున్నది.

*"But Parashu Rama flourished generations before Ashmaka, and the story has no chronological value.* ***Probably*** *it refers to the disturbed state of the Kingdom after the days of Kalmashapada when his successors were weaklings."(Vedic Age. P. 289)*

౨౫. వైదిక్ ఏజ్ పు. ౨౯౨ యందు దుష్యంతుని పుత్రుడగు భరతుని విషయములో అనిశ్చయాత్మకతను వ్యక్తమొనర్చుచు ఇట్లు వ్రాయబడినది.

*"It was* ***probably*** *during Bharata's regime that the headquarters of the state were shifted from Pratishthana to the city, called later Hastinapur, after his successor Hastin."*

ఈ దేశము పేరు దుష్యంతుని పుత్రుడగు భరతసమ్రాట్టు పేర భారత వర్షముగా స్థిరపడినదని ఎల్ల రెరిగినదే. మహా భారతమునందును ఈ విషయము స్పష్టముగా గలదు. కాని వైదిక ఏజ్ లేఖకులు మాత్రము ఇంతటి మహత్త్వ పూర్ణ విషయములో ఏ మాత్రము పరిశోధన గాని, అన్వేషణ గాని జేయుట ఆవశ్యకమని తలచలేదు. కేవలము ఈ విషయము నొకే వాక్యములో ఏక పక్షముగా జూపుచు ముందుకు సాగిపోయినారు. పు. ౨౯౨ వారిట్లు వ్రాసియున్నారు.

*"According to some accounts Bharata gave his name to our country which was hence forth called Bharatavarsha" (Vedic Age. P. 292)*

ఇదే విధముగా వేలాది సంశయాత్మక ఉదాహరణముల నీ వైదిక్ ఏజ్ అను పుస్తకము నుండి ఈయవచ్చును. కావుననే ఈ గ్రంథము అతి సందిగ్ధము, మరియు సందేహాస్పదముగా నున్నది. దీనియందు అడుగడుగున లేఖకుల అనిశ్చితాత్మక విషయములే నిండియున్నవి. వీరొక వేళ 'మాకు వేదములందును ఆర్ష సాహిత్య విషయములందును ఏ మాత్రమును నిశ్చితమగు జ్ఞానము లేదు. కేవలము మాకు పాశ్చాత్య విద్వాంసుల రచనలు,

మరియు వారి యనువాదములే (పైన స్పష్టపరచినట్లు) యాధారమని అంగీకరించినచో మాకంత బాధగా నుండకపోవును. కాని వారితర సామాన్య ఐతిహాసిక సత్యముల విషయములందును అడుగడుగున సంశయాత్మకముగా వ్రాయుచు ప్రతి పుట యందును అగునేమో, కావచ్చును. *Probably* మరియు *Perhaps* అని నింపి వేయుచు కూడా వారు వేదములు మున్నగు వాని విషయములో నిశ్చయ పూర్వకముగా సంపూర్ణముగా అసత్యవిషయములనే వ్రాయు సాహస మొనర్చినందున మాకవశ్యముగా దుఃఖము మరియు బాధ యుండును గదా! మాకే గాదు ఏ వేద విద్వాంసుడైనను ఈ బాధ యనుభూతి నొందగలడు. కావుననే వారి యీ భ్రాంతులను నిరాకరించుటయే మా ప్రథమ కర్తవ్యముగ భావించుచున్నాము.



# వేదముల యథార్థ స్వరూపము

## సప్తమాధ్యాయము

### 7.1 వేదోత్పత్తి కాల విషయ నిర్ణయమునందు కపోల కల్పనలు పరస్పర విరుద్ధములు.

ప్రాచీన పరంపరానుగత విశ్వాసముల ననుసరించి వేదములు ఈశ్వరీయ జ్ఞానమనియు, వాని ప్రకాశము సృష్ట్యారంభముననే మానవ మాత్రుల కల్యాణార్థము అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులను నలుగురు ఋషుల ద్వారా యైన'దని మేము ఈ గ్రంథము యొక్క మొదటి రెండవ అధ్యాయములందు విశద మొనర్చుటకు ప్రయత్నమొనర్చి యుంటిమి. అధ్యాపకులుగాని, మాతా పితరులు గాని శిక్షణ యొనర్చబడకున్న ఎట్టి జ్ఞానమును ప్రాప్తించదను విషయము అందరకు అనుభవసిద్ధమైన విషయమే ప్రాచీన కాలపు అనేక శిక్షణములను గురించి మేము గత అధ్యాయములందు నిర్దేశించి యుంటిమి. లక్నో నగరములనందలి గాంధీ స్మారక్ ఔషధాలయములో పెంచబడుచున్న తోడేలు బాలకుడగు 'రాము' అను వాని నిన్న మొన్నటి ఉదాహరణము ఈ విషయమున మరువదగనిదై యున్నది. అప్పటి రాజ్య పాలకుడగు శ్రీ కన్హయ్యలాల్ మున్షీగారు ఆ బాలకుని విషయములో పరిశీలనాత్మకమగు విస్తృత మగు లేఖను 30-౬-౧౯౫౪ నవ భారత్ టైమ్స్, మరియు ఇతర పత్రికలందును ప్రకటించి యుండెను. దాని వల్ల అనేక సత్యములు వెల్లడియగుచున్నవి అవి యన్నియు సృష్ట్యారంభ కాలపు ఈశ్వరీయ జ్ఞానావశ్యకతను గూర్చి తెలియపరచుచున్నవి. వారీ సంఘటనను గూర్చి ఇట్లు వ్రాసియుండిరి. ఒక తోడేలు ఆ బాలకుని పసివానిగా ఉన్నప్పుడే ఎత్తుకొనిపోయి పెంచుకొను చుండినది. ఈ లేఖను ప్రకటించు కాలము (జూలై ౧౯౫౪)లో ఈ బాలకుని (రాము) వయస్సు దాదాపు పదివత్సరములు. కాని ఆ బాలకు డితర బాలకుల వలె నిలుచుండుట, నడచుట మున్నగు చేష్టలు చేయలేక పోవుచుండెను. వాడు తోడేళ్ళ వలెనే నడచుచు, వాని వలెనే పచ్చి మాంసమునే (లఖనౌ గాంధీ ఆసుపత్రి యందు ప్రవేశింపబడువరకు) తినుచుండెను వాడు మానవ భాషను దెలిసికొనుటయో, పలుకుటయో చేయుజాలకుండెను. ఇప్పుడు మానవ సంబంధములోనికి వచ్చిన తరువాత మెల్లమెల్లగా వానియం దనేక పరివర్తనములు వచ్చుచున్నవి వాడు పచ్చి మాంసమును గాక ఇతర ఆహార పదార్థములను కూడా తీసికొనుచు, పరుపుపై పరుండుచున్నాడు. ఇప్పుడు మనుష్య సంపర్కము మరియు మాటల వల్ల పూర్వము వలె ఉద్విగ్ను డగుటలేదు. ఈ లేఖ ప్రకటమగు కాలము వరకు మనుష్య భాషను మాట్లాడకున్నను తన పేరును వినినప్పుడు అతనికి కొంత సంతోషముగా నుండును. ఇందువల్ల క్రమక్రమముగా కొంత మాట్లాడుట నేర్వగలడను ఆశ గలుగుచున్నది. కావుననే మనుష్యులకు శిక్షణ నిచ్చువారు లేకండా స్వయముగా నేర్వజాలరని తెలుపుట కన్న విస్తరించు నవసరము లేదు. తోడేలు బాలుడు *Wolf-boy* ఇప్పుడు 'రాము' అను పేరుతో ప్రసిద్ధు డగుచున్నాడు.

సృష్ట్యారంభ కాలమున ఈశ్వరుని ద్వారా జ్ఞానము ప్రాప్తించకున్నచో మానవులెల్లరును పశువులుగానే యుండిపోవుదురు. కావుననే పరమపిత పరమేశ్వరుడు మానవ మాత్రుల కల్యాణార్థము వేదముల ద్వారా జ్ఞానమును ప్రసాదించినా డను విషయము పూర్తిగా యుక్తి యుక్తము, మరియు తర్కసంగతమునైయున్నది.

ఎవ్వరును దీనిని అంధవిశ్వాస మని యనజాలరు. కావుననే ఆర్యులు పరంపరానుగత యుక్తియుక్త విశ్వాసానుసారము సృష్ట్యారంభకాలమే వేదారంభ కాలమ్మైయున్నది. సృష్టి కాల నిర్ణయ మేవిధముగా నొనర్చినను అదియే వేదకాలము అని యెంచుట సంపూర్ణముగా ఉచితమ్మైయుండును. ఐనను పాశ్చాత్య, మరియు భారతీయ విద్వాంసులు కొందరు వేదముల కాల నిర్ణయ మొనర్చుటకు సంపూర్ణ నిష్ఫల యత్నము నొనర్చినారు. దానినిప్పుడు మేమిచ్చుట విశద పరచుటకు ప్రయత్నింతుము. దీని వల్ల వానియందెంత పరస్పర విరుద్ధ అభిప్రాయములు గలవో తెలియగలదు. కేవలము వానియందు కపోల కల్పనలు గాక సార మే మాత్రమును లేదు. చివరకు విద్వాంసులెల్లరును 'ఈ విషయములో నిశ్చయముగా మేమేమియునెరుగమని' అంగీకరించుటకన్న నేమియును జేయజాల లేదు.

### 7.2 ప్రొ. మాక్స్‌మూలర్ అభిప్రాయము

వేదకాల నిర్ణయమొనర్చుటకు యత్నించు పాశ్చాత్య విద్వాంసులందు జర్మనీ యొక్క ప్రొ. మాక్స్ మూలర్ (ఈతడు ఆక్స్‌ఫోర్డులో స్థిరపడినాడు) అనునాతడు ప్రథమమున పేర్కొనదగినవాడు. ప్రొ. మాక్స్‌మూలర్ తన *History of Ancient Sanskrit Literature* (ప్రాచీన సంస్కృత సాహిత్య ఇతిహాసము) క్రీ.శ. ౧౮౫౯ లో ప్రచురితమైన పుస్తకమునందు దిగువ విధముగా తన ఆలోచనలను ప్రకటించినాడు.

*"Buddhism is nothing else than a reaction against Brahmanism, and it pre-supposes the existence of the entire Veda i.e of the literature embodied in the hymns, the Brahmans, Aranyakas and the Upanishads. The whole of this literature must have therefore been pre-Buddhistic i.ce. it must have arisen before 500 B.C. The Vedanga and the Sutra literature could be approximately simulteneous with the origin and the expansion of Buddhism in its initial stages. These Sutra works, whose origin might be attributed to the period from 600 to 200 B.C. are however so constructed that they of necessity presuppose the Brahman literature. The Brahmanas however, of which there are older and new ones, containing as they do, long lists of preceptores who handed down more ancient Brahmanas could not possibly be compressed within less than two hundred years. We must therefore regard the period 800 to 600 B.C as that required for the growth of these prose works. The Brahmanas however, pre-suppose further in their turn, the Vedic Samhitas. At least two hundred years were now necessary in order that all these collections of songs and prayers could be put to-gether; therefore the period circa 1000 to 800 B.C could be regarded as the period in which these collections were formed. Before the formation of these collections, howerver, which were already regarded as holy sacrificial songs and authoritative prayer-books, there must have preceded a time in which the hymns and the songs contained in them should have arisen as popular or religious compositions. This period must lie before 1000 B.C. two hundred years may be assigned for the growth*

*of this poetry and thus we may arrive at 1200 to 1000 B.C as the initial period of the Vedic poetry."*

ఈ లేఖ యొక్క సారాంశమేమనగా; బౌద్ధమతము బ్రాహ్మణ ధర్మమునకు విరుద్ధమగు ప్రతిక్రియకన్న వేరేమియు గాదు. కావున దీనికన్న పూర్వము వైదిక సాహిత్యమునందు సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు వీనియన్నిటి కలయిక యొక్క ఉనికి స్పష్టముగా నున్నది. ఈ సాహిత్య మంతయును బుద్ధుని కాలము, అనగా క్రీ. పూర్వము ౫౦౦ సంవత్సరములకన్నా ముందే అవశ్యకముగా ఉండియున్నది. సూత్ర గ్రంథముల నిర్మాణము ౬౦౦ నుండి ౨౦౦ క్రీస్తు పూర్వముకన్న లోపలనేయైనది సూత్ర గ్రంథముల నుండి బ్రాహ్మణ గ్రంథములందు పురాణ మరియు నవీన గ్రంథముల కలయిక గలదు. వానియందు పౌరాణిక బ్రాహ్మణకార శిక్షకుల దీర్ఘ సూచిక గాన్పించుచున్నది. అది ౨౦౦ సంవత్సరముల కన్న తక్కువ కాలమున గాజాలకుండెడిది. కావుననే క్రీ. పూ ౮౦౦ నుండి ౬౦౦ సంవత్సరముల సమయమున బ్రాహ్మణ గ్రంథముల నిర్మాణమై యుండునని మేము ఊహించగలము. బ్రాహ్మణ గ్రంథములందు మంత్ర సంహితల అస్తిత్వమును గూర్చి స్పష్టముగా చెప్పబడియున్నది కనీసము ౨౦౦ సంవత్సరముల కాలము ఈ ప్రార్థనా గీత సంగ్రహముల సంహితల నిర్మాణమునకు బట్టి యుండును. కావున అది క్రీ పూ ౧౦౦౦ నుండి ౮౦౦ సంవత్సరముల కాలమని ఎంచవచ్చును. ఈ సంహిత నిర్మాణమునకు పూర్వమే ఈ పవిత్ర, యజ్ఞ విషయక గీతముల, మరియు ప్రామాణిక ప్రార్థనా పుస్తకముల రూపము ప్రాప్తమైయుండెను ఒక కాలము నందు ఇవి లోకప్రియ ధార్మిక గీతముల రూపములో స్వీకరించబడియుండెనని యనుకొనవచ్చును ఆ కాలము క్రీ. శ. ౧౦౦౦ సంవత్సరములదై యుండును ౨౦౦ సంవత్సరము లీ పాటల ( కవితల) వికాసమునకు బట్టి యుండును. కావుననే ౧౨౦౦ నుండి ౧౦౦౦ క్రీ పూ వరకు ఈ వైదిక కవితల ( పాటల) ప్రారంభిక సమయముగా మనము ఎంచవచ్చును

ఈ ప్రొ. మాక్స్ మూలర్ అభిప్రాయములను సాధ్యమైనంత వరకు వారి శబ్దముల సారాంశమునే మేమిచ్చుట ప్రవేశపెట్టుచున్నాము.

ప్రొ. మాక్స్ మూలర్ వేర్వేరు కాలములకై ౨౦౦ సంవత్సరముల కాలము, నిర్ణయించుకొనినది ఆయన ఆలోచనలయందు కనీసమే. ఆ సమయమును అంతిమ, లేక అధిక ముగా నెంచవచ్చునని ఆతని యభిప్రాయ మందెప్పుడును లేకుండెను. ఇది ఎంతవరకు అనగా ౧౮౯౦లో ప్రకాశితమైన తన *'Physical Religion' Gifford Lectures* పేరు గల పుస్తకము ౧౮వ పుటలో ప్రొఫెసర్ మాక్స్ మూలర్ ఈ విధముగా స్పష్టమొనర్చియున్నాడు

"We could not hope to be able to lay down any terminus a quo. Whether the Vedic hymns were composed in 1000 or 1500 or 2000 or 3000 years B.C no power on earth could ever fix." (Max Muller's Physical Religion P. 18)

అనగా; మేమెట్టి చివరి హద్దును నిర్ధారణ మొనర్చుటకు ఆశించలేము ఈ వైదిక సూక్తములు రచించబడినది క్రీ.పూ. ౧౦౦౦ సం. లో లేక క్రీ.పూ. ౧౫౦౦ సం. లో లేక క్రీ.పూ. ౨౦౦ సం. లో 3000 సంవత్సరములో ప్రపంచమందలి ఏ శక్తియును నిర్ణయి మొనర్పజాలదు.

ప్రొ. మాక్స్ మూలర్ ఇంత స్పష్టముగు శబ్దములందు జెప్పి యున్నను బహుశః వారి తర్వాత విద్వాంసులెల్లరును 'ప్రొ. మాక్స్ మూలర్ వైజ్ఞానిక దృష్టితో వేద నిర్మాణకాలము క్రీ.పూ. ౧౨౦౦ నుండి ౧౦౦౦ సంవత్సరాల వరకని స్పష్టముగా నిర్ణయించి విశ్వసించుట కడు అనర్థము దుఃఖకరము' మరియు ఆశ్చర్యకరమగు విషయము. కావుననే ఇందుకు వ్యతిరేకముగా వ్రాయు సాహసము చాలా కొద్దిమంది పాశ్చాత్య విద్వాంసులకే గలిగినది. వారి యందు జర్మనీ దేశస్థుడగు *(L Von Shroeder)* మరియు 'జైకోబీ' యను వారి పేర్లు ఉల్లేఖించదగినవి. ప్రాన్ శ్రొడర్ *'Indians Literature and Culture* అను పేరుగల తన పుస్తకములో వైదికకాలమును క్రీ.పూ. ౨౦౦౦ వరకు గొనిపోవు సాహసమొనర్చుటకు యత్నించినాడు. 'జైకోబి' యనునాతడు ౧౮౯౩ లో జ్యోతిష శాస్త్ర విషయ నిర్ణయముల యాధారముపై దాదాపు ౪౫౦౦ క్రీ. పూ వరకు ఎంచి దీని కొరకు ప్రాచీన సాహిత్యమునందు మృగశిర *(Orion)*ము నందు వసంత సంపాత మగుటను గూర్చి ఆతడు *Uber das alter des RigVeda* అను పేరుగల జర్మన్ పుస్తకమునం దుల్లేఖించియున్నాడు. ప్రొ. మాక్స్‌మూలర్ యొక్క వైజ్ఞానిక రీతిలో నిర్ధారించిన వేద నిర్మాణ కాలమును ఇంత వెనుకకుదీసికొనిపోవు దుస్సాహసమొనర్చినాడు. జైకోబికి విరుద్ధముగా యూరోపులో ఇదే యాధారముపై ఆందోళన యొనర్చబడినది. వాస్తవ మేమనగా; ప్రొ. మాక్స్ మూలర్ వైజ్ఞానిక రీతిలో వేద కాలమును క్రీ పూ. ౧౨౦౦ నుండి ౧౦౦౦ అని వ్రాసినది సంపూర్ణముగా అసత్యము. ఆతడు దాని ననుసరించి మంత్ర కాలము, బ్రాహ్మణ కాలము, సూత్ర కాలము మున్నగు వానిని ౨౦౦ సంవత్సరముల కనీస సమయమును దీసినాడు ఆతడే స్వయముగా తన *Physical Religion* లో క్రీ. శ. ౧౮౯౦లో అంగీకరించు వైదిక సూక్తము ౧౦౦౦, ౧౫౦౦, ౨౦౦౦, ౨౫౦౦ లేక ౩౦౦౦ క్రీ.పూ. ఎప్పుడు నిర్మింపబడినదని ప్రపంచమునందలి ఏ శక్తియును నిర్ధారణ మొనర్చజాలదని వ్రాసినాడు. ఇట్టి స్థితియం దాతని యొక్క కల్పనను వైజ్ఞానిక రీతిలో నిర్ధారితమని అంగీకరించుట ఎంతటి ప్రబల అసత్యమో చూడుడు.

ప్రొ. మాక్స్ మూలర్ యొక్క ఈ కల్పనల విషయములో సుప్రసిద్ధ జర్మనీ విద్వాంసుడగు 'వింటర్నిజ్' అను నాతడు *'Geshcikte indishen Literature'* అను పేరుగల జర్మన్ పుస్తకము నందలి వేదకాల విషయములు గల అధ్యాయమును శ్రీ ఉద్గీర్‌కర్ *'Age of the Veda'* అను పేరుతో అంగ్రేజి భాషలో అనువదించినాడు దానియందు స్పష్టముగా నిట్లు గలదు.

*"It is now evident that the presumption of exactly two hundred years for the various literary epochs in the development of the Veda is purely arbitrary. And Max Muller himself would not properly say anything more than that one must at the least presuppose some such period and that our RigVeda Samhita had indeed been completed atleast about 1000 B.C. He has always understood his date of 1200 to 1000 B.C. only as the terminus adquem and in his lectures on Physical Religion that appeared in 1890, he as distinctively said that we could not hope to be able to lay down any terminus a quo. Whether the Vedic hymns were composed in 1000 or 1500 or 2000 or 3000 years B.C no power on earth could ever fix."*

It is how ever remarkable how persistent is the force of suggestion even in scholarship. This purely hypothetical and in itself entirely arbitrary chronological fixing of the Vedic epoches by Max. Muller, attained in course of years the respect and the character of a scientifically proved fact, no new arguments or substantial proofs were added there. All used to say-and W.D. Whitney in his book 'Oriental and Linguistic Studies' First Series (1872) P.78 has indeed reproved this habit - that Max Muller had proved the period 1200 to 1000 B.C as the date of the Rigveda. Only with timidity. could some scholars like L. Vonschroeder go back to 1500 or at most to 2000 years. B C"

అనగా; వైదిక వికాస సంబంధమగు వేర్వేరు గ్రంథముల కొరకు ౨౦౦ సంవత్సరముల కాలము నిర్ణయ మొనర్చుట సంపూర్ణముగా యుక్తిహీనము, మరియు కపోల కల్పితమని స్పష్టమగుచున్నది. స్వయముగ మాక్స్ మూలర్ సైతము 'కనీసము ఇంతకాలము కల్పన నొనర్చవలసియే యుండును. అనగా; మన ఋగ్వేద సంహిత దాదాపు క్రీ.పూ ౧౦౦౦ వరకు సంపూర్ణమైయుండు'ననియనుట కన్న ఉచిత మార్గేణ మన మేమియు నన జాలకుండెడివాడు అతడు క్రీ పూ. ౧౨౦౦-౧౦౦౦ అను నీ తిథిని కనీస పరిహద్దుగా సంకేతించియుండెను మరియు *Physical Religion* పై ౧౮౯౦లో ప్రకాశితమైన తన వ్యాఖ్యానములం దాతడు 'మన వైదిక ఋచల చివరి హద్దును నిర్ణయమొనర్పు ఆశనుంచుకొనజాల'మను వాక్యమును స్పష్టమగు శబ్దముల ద్వారా ప్రకటించియున్నాడు వైదిక సూక్తము క్రీ. పూ ౧౦౦౦ సంవత్సరముల పూర్వకాలములో చేయబడినవా, లేక క్రీ.పూ. ౧౫౦౦ లేక ౨౦౦౦ లేక 3000 సం లకాలని ప్రపంచమందలి ఏ శక్తి యును నిశ్చయించజాలదు ఐనను విద్యాక్షేత్రమునందు కూడా ఏదో ఒక నిర్ణయము, లేక సూచన యును గట్టి పట్టుదల యుండుటను విషయము ఉల్లేఖింపదగినది ఇది కేవలము కల్పితము, మరియు సంపూర్ణముగా స్వేచ్ఛాయుతము, వేద వైదిక కాల నిర్ణయము యుక్తి హీన విషయమై యున్నది మాక్స్ మూలర్ యొక్క ఈ పావన కాలము గడచిన కొలది వైజ్ఞానిక రూపమున ప్రమాణ హీనమై పోయినది. 'హ్విట్నీ' ౧౮౭౨లో ప్రకాశపరచబడిన తన ఓరియంటల్ అండ్ లింగ్విస్టిక్ స్టడీస్ అను పేరు గల పుస్తకమునందు విద్వాంసుల దూషణ గూడ గలదు. మాక్స్ మూలర్ ఋగ్వేదకాలమును క్రీ. పూ ౧౨౦౦ - ౧౦౦౦ సంవత్సరములని నిశ్చిత పరచినాడు కేవలము భయముతోనే 'ఫాన్ శ్రాడర్' వంటి కొందరు విద్వాంసులు వైదిక కాలమును క్రీ పూ ౧౫౦౦ లేక అధికాధికము ౨౦౦౦ సంవత్సరములకు దీసికొనిపోవుయత్నము నొనర్చినారు.

ఇంత వ్రాసిన పిదప కొందరు పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయముల సైతమిచ్చుట ఉదాహరించబడుచున్నది వీరిలో 'వీబర్' అనునాతడు తన *History of Sanskrit Literature* లో వేదకాల నిర్ధారణ విషయములో ఇట్లు చాటిచెప్పినాడు.

*"Any such attempt (of defining the Vedic antiquity) is absolutely fruitless" P. 7.*

అనగా; వేదోత్పత్తి కాలనిర్ణయ ప్రయత్నము సంపూర్ణముగా వ్యర్థమైనది డా. విన్టర్నిజ్ ఇట్లు వ్రాసినాడు

"In reality, nothing more has been known than that the Vedic period extends from an altogether un-defined past to the fifth centurey before Christ. Neither the Figures 1200 to 500 nor 1500 to 500 nor 2000 to 500 which are often to be met with in the popular account about the age of the Vedic literature have any justification. The only date justifiable is X to 500 B.C And as the result of the investigation of the last ten years it could be said that it is probable that in place of 500 B.C. will have to be substituted the date 800 B.C........We must however guard against any definite figures, where such a possibility is, by the nature of the case, excluded." (The Age of the Veda, by Winternitz P. 10-11)

అనగా; వాస్తవమునకు వైదికకాలము యొక్క విస్తరణ సాధ్యమైనంత వరకు అనిశ్చిత భూత కాలము నుండి క్రీ. పూ. ౫౦౦ సంవత్సరముల కాలమైయుండును. క్రీ. పూ. ౧౨౦౦ నుండి ౫౦౦, లేక ౧౫౦౦ నుండి ౫౦౦ లేక ౨౦౦౦ నుండి ౫౦౦ సంవత్సరము లనుకొనుట వైదిక సాహిత్య విషయములో లోక ప్రియ వర్ణనములందు చూడబడుచున్న దనుట ప్రామాణికము లేక న్యాయసమ్మతమైనదిగాదు. ఏదేని న్యాయ సమ్మతము, సమర్థనీయమగు తిథి గలదనియనుకొనినచో అది సంపూర్ణముగా అనిశ్చితి భూత కాలము నుండి క్రీ. పూ. ౫౦౦ ల సంవత్సరముల వరకు గత ౮ (ఎనిమిది) వర్షముల పరిశోధన ఫలస్వరూపముగా క్రీ. పూ. ౫౦౦ సంవత్సర స్థానమున ౮౦౦ సంవత్సరములని ఉంచవలసియుండును. ఐనను. మనమేదైనా నిశ్చిత సంఖ్యనిచ్చు సాహసమే చేయవలదు. ఏలన; ఈ విషయమే అట్లున్నది. ఈ విషయములో సరియగు తిథి నిచ్చు అవకాశమేలేదు.

డా. మారిస్ బ్లూంఫీల్డు' అను పాశ్చాత్య విద్వాంసుడు వేద కాల నిర్ణయ విషయము నందిట్లు వ్రాసినాడు (ఈతడు *'Vedic Concordance'* అను కోశమును సంకలనమొనర్చిన కారణమున అత్యంత ప్రసిద్ధుడైనాడు.)

"I for my part, and I think I voice many scholars now much more inclined to listen to an early date, say 2000 B.C. for the beginnings of Vedic literary production, and to a much earlier date for the beginnings of the institution, and religious concepts which the Veda has derived from those pre-historic times which cast their shadows forward into the records that are in our hands. Any how, we must not be beguiled by that kind of conservativism which merely salves the conscience into thinking that there is better proof for any later date, such as 1500, 1200 or 1000 B.C rather than the earlier date of 2000 B.C **"Once more frankly we do not know".**

Bloomfield's Religion of the Vedas, P.191

ఈ సందర్భము యొక్క భావార్థమేమన, నేను స్వయముగా దెలిసికొనుటయే గాక ఇతర విద్వాంసు లనేకుల ప్రాతినిధ్యము కూడా యొనర్చుచుందును వైదిక కాల విషయములో పూర్వపు ఏదో యొక తిథిని నిశ్చయించుటలో ఉదాహరణార్థము క్రీ. పూ. ౨౦౦౦ సంవత్సరములను దానివైపే అధికముగా మొగ్గుచూపెదము... ఏది ఏమైనను

మన మీ విధమగు లోభత్వము మోసమునందు చిక్కుకొనవలదు. కేవలము ఆత్మ సంతృప్తి కొరకై ౧౫౦౦, ౧౨౦౦, ౧౦౦౦ క్రీ. పూర్వమని నమ్ముట కన్న క్రీ.పూ. ౨౦౦౦ సంవత్సరములనునదే చక్కని ప్రమాణమై యున్నది.

ఇట్లు వ్రాసిన పిదప కూడా, డా.'బ్లూంఫీల్డు' ఉపసంహారము నందిట్లు తెలిపినాడు. మరలనొక తడవ స్పష్టముగా చెప్పవలయునన్న మేమేమియు నెరుగలేమని చెప్పగలము.

డా.బ్లూంఫీల్డు యొక్క ఈ అభిప్రాయము ప్రవేశపెట్టుచు *'The RigVeda and Vedic Religion'* లేఖకుడగు మి. క్లైటన్ అభిప్రాయమును దెలుపుదుము.

From what has already been said, it will be evident that no dates can be assigned to the origin of the hymns that make up the Vedas. Indeed it is necessary to go further and to say that there is not sufficent evidence to show with any precision when the hymns of the four Vedas were collected together and the Vedas themselves as we have them, formed. (The Rigveda and Vedic Religion, by A.C. Clayton p.45).

సారాంశమేమన, వైదిక సూక్తముల ఉద్భవమును గురించి ఎట్టి తిథియును నిర్ధారణ మొనర్చి చెప్పబడదని పైన స్పష్ట పరచబడినది. వాస్తవమును దెలుపవలెనన్న మనవద్ద తగిన సాక్ష్యము లేదనియే చెప్పవలెను. నాలుగు వేదములు సూక్తముల సంగ్రహ మెప్పుడు జరిగినది? మరియు నీ సంహిత లెప్పుడు సిద్ధమైనవి? ఇంకను పాశ్చాత్య విద్వాంసు లనేకులు ఈ యభిప్రాయమునే వెలిబుచ్చినారు. ఐనను అనేకులు ప్రొ. మాక్సు మూలర్ వచనములనే ప్రామాణికముగా నెంచి స్వతంత్రానుసంధాన మొనర్చుట అనావశ్యకమని తెలిసికొనినారు

వైదిక్ ఏజ్ రచయితలను గూర్చి మాకత్యంతాశ్చర్యము గలుగుచున్నది ఒకవైపు వారు బ్లూంఫీల్డు అభిప్రాయమునే స్వీకరించినారు. అనగా

*"The age of the RigVeda is not known with even an approximate degree of certainty." (Vedic Age P. 225)*

"Not a single work of the Vedic Period can be accurately dated." (Vedic Age P. 225)

అనగా; ఋగ్వేద కాలమును గురించి నిశ్చయముగు మాత్రా జ్ఞానము కూడా మా వద్ద లేదు. వైదిక కాలమునకు సంబంధించిన ఏ గ్రంథ విషయములోను తిథి నిర్ధారిత మొనర్చుట యనునది కాని పని అని చెప్పుచు మరోవైపు ఋగ్వేదము యొక్క నిర్మాణ కాలమును వారు క్రీ పూ దాదాపు ౧౦౦౦ సంవత్సరము అని నిర్ణయమొనర్చుచున్నారు. వైదిక్ ఏజ్ పుస్తక పుట ౨౦౮పై *The Aryan Problem* ( ఆర్య సమస్య) అను శీర్షికగల దశమాధ్యాయమందు.

*"From a purely linguistic point of view the RigVeda in its present form can not be dated much earlier than 1000 B.C. The language of the RigVeda is certainly no more*

*different from that of the Avestan Gathas than is old English from old High German and there fore they must be assigned to approximately the same age ...... Thus from general linguistic considerations, we get for the Rigvedic language, as known to us, approximate date of 1000 B.C. Although the culture represented by it must be considerably older, it can hardly be pushed back considerably before 1500 B.C ." (- Vedic Age. P.204)*

*"On linguistic grounds, the language of the RigVeda the oldest Veda, may be said to be about 1000 B.C but its contents may be - and are certainly in the oldest parts of much more ancient date and its latest parts, resembling Atharvanic charms, are as surely of much later origin " (- Vedic Age. P.225)*

భావమేమనగా; విశుద్ధమగు భాషాదృష్టి కోణముననుసరించి వర్తమాన రూపమున ఋగ్వేదమును క్రీ.పూ. ౧౦౦౦ కన్న పూర్వముదని విశ్వసించజాలము. ఋగ్వేదము యొక్క భాషా స్థితి మరియు గాథలను బట్టి పురాతన అంగ్లేజి యొక్క పురాతన ఉన్నత శ్రేణి జర్మన్ కన్న అధిక భిన్నముగా లేదు. కావుననే దాదాపు ఈరెండింటి కాలము ఒక్కటేయని ఎంచవచ్చును భాషా విషయములో ఆలోచించినట్లైన ఋగ్వేద భాషను గూర్చి మనము దాదాపు క్రీ పూ ౧౦౦౦ సంవత్సరముదని అంగీకరించవచ్చును. ఐనను నిది ఏ సంస్కృతికి ప్రతినిధిత్వ మొనర్చుచున్నదో అది దీనికన్న అధిక పురాతనమైనదై యుండవలయును. అట్లైనను మనము దీనిని క్రీ.పూ. ౧౫౦౦ సం కన్న ముందుకు తీసికొనిపోలేము - వైదిక ఏజ్. పు.౨౦౪.

౨౨౫ వ పుట ఉద్ధరణము యొక్క భావార్థమేమన భాషాదృష్టితో అన్నిటికన్న పురాతనముదైన ఋగ్వేద భాషను మనము క్రీ పూ ౧౦౦౦ సం లదని ఎంచవచ్చును. ఐనను దీనికొన్ని పురాతన భాగములు చాలా ప్రాచీనమై యున్నవి మరియు దీని క్రొత్త భాగముగు చేతబడులు, మంత్రములు మున్నగునవి గల అథర్వ వేదము నిశ్చయముగనే చాల క్రొత్తదైయున్నది - వైదిక్ ఏజ్ పు.౨౨౫.

## 7.3. ఈ భావముల అశుద్ధత్వము

'వైదిక్ ఏజ్' లేఖకుల తప్పుడు తడకల నిర్ణయ అశుద్ధత్వమును చూపుటకై ప్రబలమగు గొప్ప ప్రమాణములను ప్రవేశపెట్టవచ్చును. వానిని ప్రవేశపెట్టుదుము. కాని ఇట్లొనర్చుటకు పూర్వము మేము కొందరు భారతీయ విద్వాంసుల ప్రాచీనత్వమును గూర్చిన విషయములోని అభిప్రాయములను గూడ వెల్లడించదలచినాము. ఈ వైదిక్ ఏజ్ లేఖకుల ధ్యానము ఇతర భారతీయ విద్వాంసుల గ్రంథముల వైపు ఎందుకు పోలేదో మాకు కడు ఆశ్చర్యముగా నున్నది. ఒక వేళ వీరు వారితో ఏకీభవింపకున్నను వారి యభిప్రాయముల నుల్లేఖించి ( పాశ్చాత్య విద్వాంసుల నిర్ణయముల *References* లతో తమ పుస్తకమునందలి అధిక భాగమును నింపివేసినట్లు) తరువాత వానిని నిరాకరించుట వారి కర్తవ్యమైయుండెను.

వేద కాల నిర్ణయ విషయములో కలము నెత్తిన భారతీయ విద్వాంసులందు శ్రీ బాలగంగాధర తిలక్ గారి పేరు ప్రసిద్ధమగు కారణమున పేర్కొనదగియున్నది.

వారి కథనము యొక్క సారాంశము వారి *'Orion'* అను పేరు గల గ్రంథము ననుసరించి ఈ ప్రకారముగా నున్నది

''ఎంతవరకు మేము అన్నిటిని గలిపి మూడు విధముల పంచాంగములను గూర్చి, ఆలోచించినామో, వాని యందు మొట్ట మొదటి కాలమును 'అదితి' కాలము, లేక 'మృగశీర్ష' పూర్వకాలమని తెలుపుదుము. మరియు దీని వ్యవధి క్రీ.పూ. ౬౦౦౦ నుండి ౨౦౦౦ వరకని అంచనా వేయగలము. ఈ కాలములో సంపూర్ణ ఋచలు (ఋగ్వేద మంత్రములు) మున్నగునవి నిర్మింపబడినట్లు గాన్పించవు''

ఇక రెండవదగు 'మృగశీర్ష' కాలము, స్థూలమానముగా దాని హద్దు ౨౦౦౦ నుండి ౨౫౦౦ క్రీస్తు పూర్వ కాలము వరకున్నది. ఈ సమయము 'ఆర్ద్రా' నక్షత్రమునుండి 'కృత్తికా' నక్షత్రము వరకు వసంత సంపాతము వచ్చు కాలము. ఈ కాలము అన్నిటి కన్న మహత్త్వము గలది. ఋగ్వేదము యొక్క అనేక సూక్తములు ఈ కాలమునందే నిర్మితమైనవి. మరియు అనేక కథల రచన జరిగినది. విశేషించి ఈ కాలము సూక్త రచనల కాలము మూడవది 'కృత్తికా' కాలము, దీని యవధి ౨౫౦౦ నుండి ౨౪౦౦ నుండి ౨౪౦౦ క్రీస్తు పూర్వపు కాలము వరకు వచ్చును. అనగా కృత్తిక యందు వసంత సంపాతముండెను ఆ సమయమునుండి వేదాంగ జ్యోతిషకాలము వరకు గలదు. తైత్తిరీయ సంహిత, మరియు అనేక బ్రాహ్మణ గ్రంథముల రచనాకాలము కూడా ఇదియే ఈ కాలమున ఋగ్వేద సంహిత పురాతనమైపోయినది మరియు దాని యర్థము కూడా చక్కగా యుగుచుండెడిది గాదు. ప్రాచీన సంస్కృత వాఙ్మయము యొక్క నాల్గవ కాలము ౧౫౦౦ నుండి ౫౦౦ క్రీ. పూర్వ కాలము. దీనిని 'బుద్ధ పూర్వకాల' మనియు అనెదరు. సూత్ర గ్రంథములు, మరియు ఆరు దర్శనములీ కాలమందేరచితమైనవి

( ఓరాయనము యొక్క సారానువాదము - వేదకాల నిర్ణయము. పం. కేదారనాథ్ సాహిత్య భూషణ కృతము. అజ్మీర్)

ఏ యాధారముపై తిలక్ గారు ఉపర్యుక్త పరిణామమును దీసినారో దానిపై సంక్షిప్తాభిప్రాయము తరువాత యొనర్చెదము. కాని ఇచ్చట వారి యుపర్యుక్త *Orion* (మృగశీర్ష) గ్రంథమునుండియే ఈ యభిప్రాయమును ప్రవేశపెట్టుట ఆవశ్యక మనిపించుచున్నది. గ్రంథారంభమునందే వారిట్లు వ్రాసియున్నారు.

వేదకాల నిర్ణయము సంభవమా, అ సంభవమా? యను ప్రశ్న విషయమునందు అనేక ప్రాచీన, మరియు నవీన విద్వాంసుల బుద్ధి నేటి వరకును చలవిచలము గానే యున్నది. ఐనను మేమీ విషయమున వ్రాయుటకు సాహసించుచున్నాము. కాని **యీ కాల నిర్ణయమును విషయముపై సాంగోపాంగముగా ఆలోచించి చివరి పరిణామమునకు రాగలిగితిమా,** లేదా చెప్పజాలము ఐనను నీ పరిశోధనా ఫలితముగ ఆర్యుల అత్యంత ప్రాచీన సభ్యతా సమయముపై కొంత ప్రకాశము పడునని తలచుచున్నాను. ఐనను ఈ కాల నిర్ణయి మొనర్చుట విద్వాంసుల పనియై యున్నది. -*Orion* యొక్క అనువాదము పు ౨

ఈ పుస్తకము యొక్క చివరి భాగమునందు కూడా వారిట్లు వ్రాసినారు

ఈ విధముగా మేమిచ్చిన కాలము సంపూర్ణ సత్యమే అని తలచవలదు పు.౬

"Though I have ventured to write on the subject, I can not **claim to have finally solved this important problem in its bearing."** Orion P.2

వేదముల అనాదిత్వ విషయక ప్రాచీన విశ్వాసముల విషయమునందు ఈ గ్రంథము యొక్క చివరి భాగము నందిట్లు వ్రాసినారు.

వైదిక కాలములోని విశేషముగు ఉన్నతికాలము దాదాపు క్రీ.పూ. ౪000 సం.ల ముందుదై యుండెను మరియు బహుశః ఇంతకన్న ప్రాచీనము కూడా యైయుండవచ్చును. ఏలన; ఇట్లు చెప్పుటకు కూడా కొన్ని ప్రమాణములు గలవు.

వేదముల స్వరూపము అక్షరాక్షరము ఉన్నవియున్నట్లుగానే యున్నవి. కాల వశమున సైతము ఏ మాత్రము అక్షర, పద, వాక్యములలో మార్పులు జరుగలేదు. ఈ కారణం వల్లనే యవి ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నవి. ఇది గాంచిన జైమిని మున్నగు ప్రాచీన బ్రహ్మవాదులు వేద జగత్తు యొక్క ప్రారంభమునుండి అనగా, తెలిసికొనినట్టి మాటలు ప్రారంభకాలము నుండియే ఇవి అస్తిత్వమునందున్నవి. ఇవి అనాదులనియే నిర్ణయించినారు. ఈ విధముగా మన ప్రాచీన సాహిత్యమునందు లభించు గాధలు, మరియు జ్యోతిష విషయక వర్ణనముల అధ్యయనము వల్ల ఇవి అతిప్రాచీనము, మరియు అనాదులనియే యనవచ్చును. ఇంతకన్న లోతుగా నాలోచించుట మహా విద్వాంసుల కార్యమే.

శ్రీ. పం. బాలగంగాధర తిలక్‌గారు ఆ కాలపు పాశ్చాత్యుల ద్వారా నిర్ణయింపబడిన వేదకాల నిర్ణయమును అశుద్ధమని నిరూపించుట హర్షించదగిన విషయమే యైనను అతి దుఃఖకర విషయమేమన, వారు వేదముల అనాదిత్వము, మరియు అపౌరుషేయత్వ విషయమును అవహేళన మొనర్చినారనియే యనవచ్చును. వారు జ్యోతిష్యాధారముపై వేదములు దాదాపు క్రీ పూ. ౪000 కాలముననే చేయబడినవను విషయమును ప్రస్తుత మొనర్చిన దానిని మేము యథార్థమని విశ్వసింపము. వారు వేదములందు (మృగశీర్ష) *Orion* ను నిర్దేశపూర్వకముగా ఎచ్చటను చూపలేదు. వసంత సంపాతము పునర్వసులో నుండుట స్పష్టముగా లేదనియు అంగీకరించినారు. లోకమాన్య తిలక్‌గారి స్వంత వాక్యములు *Orion* లో ఈ విధముగా నున్నవి.

*"There is no express passage which states that Punarvasu was ever the first of the Nakshatras, nor have we in this case any synonyms like Agrahayam or Orion where in we might discover similar tradition." - Orion P.201*

రెండవ విషయమేమనగా వైదిక సాహిత్యమందు మృగశీర్షముపై వసంత సంపాతపు వర్ణన గలదని మనము స్వీకరించినను దీని యాధారముపై క్రీ శ. ౪000 సంవత్సరములకు పూర్వమే వేదముల రచన జరిగినదని యెట్లు నమ్మదగును? పండిత తిలక్‌గారు వసంత సంపాతము నడచుచుండు ననియు, క్రమముగా ఒక్కొక్క నక్షత్రముపై

వచ్చుచుండు ననియు మరియు సంపాత ప్రదక్షిణ (సంపూర్ణ సంపాత చలన చక్రము) ౨౫, ౯౨౦ సంవత్సరములలో పూర్తియగు ననియును విశ్వసించినాడు కదా? అగునప్పుడు క్రీస్తు శక సంవత్సరము ౪000 వత్సరములకు పూర్వమనియే ఏల నమ్మవలెను? అంతకు పూర్వము సంపాత ప్రదక్షిణము నందు మృగశీర్ష నక్షత్రము *Orion* వసంత సంపాతముండెను గదా! అది క్రీస్తు శకము కన్న దాదాపు 30000 సంవత్సరములు పూర్వమే గదా. అంతకు పూర్వపు సంపాత ప్రదక్షిణము యొక్క వసంత సంపాతముపై దాదాపు క్రీ.పూ.౫౬000 సం. మరియు దానికన్న పూర్వపు సంపాత ప్రదక్షిణము నందు దాదాపు క్రీ.పూ.౮౨000 సంవత్సరపు మృగశీర్ష నక్షత్రముపై వసంత సంపాతము ఇట్లే ప్రాచీనము కన్న ప్రాచీనము అతి ప్రాచీన సంపాత ప్రదక్షిణపు మృగశీర్ష నక్షత్రముపై వసంత సంపాతముండుచునే యుండెను గదా! దానినెందుకు వేద రచనాకాలమని యెంచగూడదు? కేవలము సమన్వయాలోచనలతోనే వేద రచనాకాలము క్రీ.పూ.౪000, వసంత సంపాతమునందు మృగశీర్ష నక్షత్ర వసంత సంపాత కారణమనియే ఏల విశ్వసించవలెను? ఈ విధముగా ప్రాచీన పరంపరానుగత విశ్వాసమును సంపూర్ణముగా అవహేళన మొనర్చుటయే యగును.

హర్షించదగిన విషయమేమనగా స్వయముగా లోకమాన్య తిలక్‌గారు తన *Orion* అను పుస్తకము తరువాత వ్రాసిన తన *Arctic Home in the Vedas* అను పేరుగల గ్రంధమున వేదకాలము దాదాపు ౧౦ వేల సంవత్సరముల కాలమని తెలిపినారు. ఈ విధముగా తన పూర్వ గ్రంథ విషయములను స్వయముగా తానే ఖండించి వేసినారు ఐనను ఇంత మాత్రముతోనే వేదములు అనాది, అపౌరుషేయములని నమ్మువారి కెప్పుడును సంతోషము గలుగదు. కావుననే వారి యీ యభిప్రాయమును ప్రమాణీకరింపబడదు.

శ్రీ లోకమాన్య తిలక్ గారి అభిప్రాయముల నీవిధముగా సప్రమాణముగా సమీక్షించుటకు పూర్వము మరొక భారతీయ జ్యోతిష్య విద్వాంసుడగు శ్రీ దీననాథ శాస్త్రి చులైట్‌గారి పేరును ప్రసంగవశమున నిర్దేశించుట అనుచితము గాదు. వీరు 'వేదకాల నిర్ణయము' అను గ్రంథమును వ్రాసినారు. దాని యందు జ్యోతిష్య ప్రమాణముల గాఢాధ్యయన మొనర్చి వేదము లిప్పటికి మూడు లక్షల సంవత్సరములకు పూర్వపువని వ్రాసినారు. (ఆర్యుల ఆదిదేశము - శ్రీ సంపూర్ణానందకృతము. పు.౨౨3లో)

శ్రీ దీననాథ శాస్త్రి చులైట్ తన పుస్తకమున ఇట్లు వ్రాసినాడు 'వసంత సంపాతము' అన్ని నక్షత్రములపై వామగతిలో దిరుగుచు ౨౫౮౦౦ సంవత్సరములకు మరలనదే నక్షత్రముపైకి వచ్చును. ఇది సకల జ్యోతిషుల సమ్మత సిద్ధాంతము. దీనిననుసరించి గణన మొనర్చినప్పుడు కాత్యాయన శ్రౌత సూత్ర భాష్యకారుడగు కర్కాచార్యుని కాలము వసంత సంపాతము సూర్యుని తులా సంక్రమణ కాలమగు ఆశ్వయుజ మాసమున జరుగుచుండెడిది. ఇందువల్ల దాని సమయము నేటికి దాదాపు ౨౫ వేల సంవత్సరములకు పూర్వమని సిద్ధమగుచున్నది. ఈ జ్యోతిష శాస్త్ర గణనానుసారమే పారస్కర గృహ్య సూత్రకారుని సమయము 'మార్గశీర్ష్యాం పౌర్ణమాస్యామాగ్రహాయణీ కర్మ' మున్నగు సూత్రములను ధ్యానమున నుంచుకొనిన వసంతసంపాతము మూల నక్షత్ర తారపై యుండు కారణమున నేటికి ౧౯ వేల సంవత్సరములకు దాదాపు పూర్వమని సిద్ధమగుచున్నది. (పు.౬3) వేదాంగ జ్యోతిష కాలము ధనిష్ఠ నక్షత్ర విభాగపు ఆరంభముపై వసంత సంపాతమగు కారణమున

దాదాపు నేటికి ౨౩౯౦౭౦ సంవత్సరములకు పూర్వము, మరియు వేదముల సమయము కనీసము మూడు లక్షల వత్సరములు.

**7.4. మహా భారత, రామాయణములందు సాంగోపాంగ వేద వర్ణనము.**

మహాభారతములో అనేక స్థలములలో నాల్గు వేదముల వర్ణనమేగాక వాని అంగోపాంగముల వర్ణన కూడా స్పష్టముగా గలదు.

౧. ఉదాహరణార్థము సభాపర్వములో శ్రీ కృష్ణుని విషయములో భీష్మ పితామహులిట్లు తెలిపియుండెను.

**వేద వేదాంగ విజ్ఞానం, బలం చాప్యధికం తథా ।**

**నృణాం లోకే హి కోఽన్యోఽస్తి, వశిష్టః కేశవాదృతే ॥** మ. భా. సభాపర్వ ౩౮-౧౯॥

అనగా; శ్రీ కృష్ణునకు వేదముల మరియు వేదాంగముల పూర్ణజ్ఞానము గలదు. తోడ్తో వారి యందత్యధిక బలము గలదు. కావుననే ఈ కాలములో ప్రపంచమున ఇంత గొప్ప వాని నెవనిని యెంచుకొనగలము.? ఇచ్చట శ్రీ కృష్ణుడు కేవలము వేదములేగాక వేదాంగము లందును గొప్ప విద్వాంసుడని స్పష్టముగా నుల్లేఖించబడి యున్నది.

౨. ఆది పర్వము అ ౩౮౬లో దిగువ శ్లోకము ఈ విషయములో చూడదగియున్నది.

**యో విద్యాచ్చతురో వేదాన్, సాంగోపనిషదో ద్విజః ।**

**న చాఖ్యానమిదం విద్యాద్నైవ స స్యాద్విచక్షణః ॥**

అనగా; వేదాంగముల, ఉపనిషత్తుల సహితముగా నాల్గు వేదముల నెరిగియు. ఈ ఆఖ్యానము (మహాభారతము) నెరుగనివాడు, చతుర పండితుడుగా నెంచబడడు

ఇచ్చట కేవలము నాల్గు వేదములేగాక వాని అంగములు, ఉపనిషత్తులు కూడా స్పష్టముగా ఉల్లేఖించబడినవి. దీని వల్ల మహాభారత కాలమున చతుర్వేదములే గాక వానియంగములు, ఉపాంగములు, ఉపనిషత్తులు కూడ యుండెనని స్పష్టమగుచున్నది.

3. మహాభారత వనపర్వము అ. ౪౫-౮లో దిగువ శ్లోక మున్నది.

**సాంగోపనిషదాన్ వేదాంశ్చతురాఖ్యానపఞ్చమాన్ ॥**

ఇచ్చట నాల్గు వేదములు, వానియంగములు, ఉపనిషత్తులు, మున్నగువన్నియును మహాభారత కాలమున విద్యమానమైయుండె ననున దెవరు నిరాకరించగలరు?

౪. మహాభారత ఆదిపర్వము ౨౮౬. ౨౭౮-౨౭౯ సందు నిమ్న శ్లోకములు గలవు.

**ఏకతశ్చతురో వేదాన్, భారతం చైతదేకతః ।**

**పురా కిల సురైః సర్వైః, సమేత్య తులయా ధృతమ్ ॥**

**చతుర్భ్యః సరహస్యేభ్యో వేదేభ్యో హ్యాధికం యదా ।**

**తదా ప్రభృతి లోకేఽస్మిన్, మహాభారతముచ్యతే ।**

ఇచ్చట కూడా రహస్యముల సహితముగా నాల్గు వేదముల స్పష్టవర్ణన గలదు.

౫. మహాభారత లోకపాల సభాఖ్యాన సభాపర్వము ౧౧- ౩౨లో చతుర్వేదముల, మరియు సర్వశాస్త్రముల ఉల్లేఖనము స్పష్టముగా దిగువ శ్లోకమున గలదు.

**ఋగ్వేదః సామవేదశ్చ, యజుర్వేదశ్చ పాండవ ।**

**అథర్వవేదశ్చ తథా, సర్వశాస్త్రాణి చైవ హి ॥**

దీనిపై ఎట్టి టీకాటిప్పణ మవసరము లేదు. మహా భారతకాలమున వేదములేగాక సకల శాస్త్రములును విద్యమానమైయుండె ననియు, వీనియందు వేదములు పరమ ప్రమాణములుగా నెంచబడుచుండె ననియు ఈ శ్లోకమును జూచిన తెలియును.

**యజుషామృచాం సామ్నాం చ, గద్యానాం చ సర్వశః ।**

**ఆసీదుచ్చార్యమాణానాం, నిస్స్వనో హృదయంగమః ॥**

ఇచ్చట గద్యములచే అథర్వవేద గద్యమయ మంత్రముల గ్రహణముగలదు అథర్వ వేదము యొక్క స్పష్టమగు ఉల్లేఖనము పైన చూపిన అనేక శ్లోకములందున్నది. కావున అథర్వవేదము మహాభారతము పిదప దను సమస్యయే యుండదు.

## 7.5. మహాభారతము ననుసరించి వేదము లనాదినిధనా వాక్కు

మహాభారతమునందు చతుర్వేదములు సాంగోపాంగ వర్ణన గలదు. పై శ్లోకములచే ఇది స్పష్టమగుచున్నది. ఇంతియేగాక ఉల్లేఖించవలసిన విషయమేమనగా, మహా భారతములో వేదములు నిత్యములు, అపౌరుషేయములు మరియు పరమ ప్రమాణములుగా స్వీకరించబడియున్నవి. అందులో ఋషుల, మరియు పదార్థముల పేర్లు వేదముల యాధారముపైననే యుంచబడినవని స్పష్టముగా చూపబడియున్నది. వేదవాణి అనాదినిధన మగు ఈశ్వర ప్రదత్తము. ఉదాహరణమునకు నిమ్న శ్లోకములు చూడుడు.

**అనాదినిధనా నిత్యా, వాగుక్తా యా స్వయంభువా ।**

అనగా, స్వయంభూ పరమేశ్వరుడు, ఆద్యంతరహితమైన వేదవాణిని ఒసగి

**నానా రూపం చ భూతానాం, కర్మణాం చ ప్రవర్తనమ్ ।**

**వేదశబ్దేభ్య ఏవాదౌ, నిర్మిమీతే స ఈశ్వరః ॥**

**నామధేయాని చర్షీణాం, యాశ్చ వేదేషు దృష్టయః ।**

**శర్వర్యన్తే సుజాతానాం, తాన్యేవైభ్యో దదాత్యజః ॥**

పరమేశ్వరుడు వేద శబ్దముల ద్వారా పృథివి, జలము, వాయువు, అగ్ని మరియు ఆకాశమను పంచ మహాభూతములతో అనేక రూప కర్మల జ్ఞానము మాన ిలకు ప్రసాదించి వారిని శుభకర్మలందు ప్రవృత్త మొనర్చినాడు. ఋషుల నామములు కూడా వేద శబ్దముల ననుసరించియే నిశ్చయించబడుచుండును. కావున

ఒక ప్రకారముగా అవియే వారి పేర్లుగా నుంచబడి వారికి జీవన సంబంధమునందు వైదిక దృష్టికోణమును ప్రదాన మొనర్చు చుండెడివి. వైదిక్ ఏజ్ లేఖకుల ననుసరించియును మహాభారత కాలము దాదాపు క్రీ.శ కన్న ౧౪౦౦ సంవత్సరములు పూర్వముదై యుండెను. వారు అన్నిటికన్న పురాతనమనుచున్న ఋగ్వేద నిర్మాణ కాలము క్రీ.పూ. ౧౦౦౦ సంవత్సరములని వ్రాయుట సంపూర్ణముగా అశుద్ధము మరియు హాస్యాస్పదమే గదా! ఒక వేళ మహాభారత కాలములోనే వేద ముల నిర్మాణము జరిగినచో **'అనాదినిధనా నిత్యా'** ఈశ్వరీయ వాక్యులను దుస్సాహస మెవ్వరొనర్చుచుండిరి? మహాభారత కాలమునందే నాలుగు వేదములు, అంగోపాంగముల, రహస్యముల, మరియు ఉపనిషత్తుల, మరియు శాస్త్రముల సహితములుగా విద్యమానమైయుండినట్లు నిస్సందిగ్ధముగా జ్ఞాతమగుచున్నది. ఇట్టి స్థితియందు 'వైదిక్ ఏజ్'లో వేద నిర్మాణ కాలమును క్రీ.పూ. దాదాపు వేయి సంవత్సరములు గావచ్చు నని మాటిమాటికి సంశయాత్మకముగా బేర్కొనుట అనుచిత మేయనితోచును.

*"If we remember that the RigVeda did not Probably receive its final shape long before the end of the so-called Dvapara age its testimony is decidedly fatal to the geographical views assumed in the Puranas" Vedic Age. P. 312.*

**7.6. మహా భారత కాలము ఎంత అశుద్ధమో, భ్రామకమో గ్రహించుడు.**

వైదిక ఏజ్ పు. ౩౦౦ *(Historical traditions sections)* పై *'The Bharat War-* మహా భారత యుద్ధ' మను శీర్షిక నిచ్చి కోష్ఠకములో దాని సమయము (1400 B C) అని వ్రాసినారు. ఇదే విధముగా ఇంకను అనేక స్థలములందును వ్రాయబడియున్నది. మీదు మిక్కిలి ఇతర వేలాది విషయముల వలె వీనియందు *Probably* అని వైదిక్ ఏజ్ యొక్క దాదాపు అన్ని పుటలయందును అత్యధికముగ గలదు. ఈ విషయములో వైదిక్ ఏజ్ రచయితలు స్వయముగా సందేహము నందున్నారు. వైదిక్ ఏజ్ పు. ౩౦౪లో ఇట్లు వ్రాసినారు

"Though the Mahabharata in its present form, is a late production, the kernel of the story takes us back to the period between 1400 and 1000 B.C. when, as noted above, the battle was **probably** fought"

'మహా భారత కథ మనను క్రీ.పూ ౧౪౦౦ మరియు ౧౦౦౦ మధ్య గల కాలము వరకు గొనిపోవు'నని వారిచ్చుట వ్రాసినారు. ఇట్లుగాక మహాభారతయుద్ధము క్రీ.పూ దాదాపు ౩౧౦౦ సమీపములో జరిగినట్లు ప్రబల ప్రమాణముల ద్వారా మనము ధృవ పరచవచ్చును. ఈ దిగువ వ్రాయబడు ప్రమాణము అతి ప్రబలమగు కారణమున ప్రసంగవశమున ఇచ్చుట వ్రాయబడుచున్నది.

౧. చాళుక్య వంశపు రెండవ పులికేశి మహారాజు యొక్క ఒక శిలాశాసనము దక్షిణములోని ఒక జైన మందిరమున లభించినది. అందిట్లు వ్రాయబడియున్నది.

**త్రింశత్సు త్రి సహస్రేషు, భారతాదాహవాదితః ।**
**సప్తాబ్దశతయుక్తేషు, శతేష్వబ్దేషు పఞ్చసు ॥౩౩॥**
**పంచాశత్సు కలౌకాలే, షట్సు పఞ్చశతాసు చ ।**

**సమస్తు సమతీతాసు, శకానామపి భూభుజామ్ ॥ ౩౪॥** ఐపిగ్రాఫికా ఇండికా, ఆరవ భాగము పు.౭ నుండి

ఈ శ్లోకముల అర్థమేమనగా, భారత యుద్ధము పిదప ౩౭౩౫ సంవత్సరములు గడచిన తరువాత కలియందు శకుల ౫౫౬ సంవత్సరములు గడచిపోయియుండెను.' దీని వల్ల స్పష్టమగున దేమన; శక సంవత్సరపు ౫౫౬ లేక క్రీ.శ. ౬౩౪లో భారత దక్షిణ ప్రాంతపు విద్వాంసులు మహాభారత యుద్ధమును దాదాపు క్రీ.పూ. ౩౧౦౦ సంవత్సరములను స్వీకరించుచుండిరి.

౨. వరాహమిహిరుని బృహత్సంహితయం దిట్లు వ్రాయబడియున్నది.

**ఆసన్ మఘాసు మునయః, శాసతి పృథివీం యుధిష్ఠిరే నృపతౌ ।**

**షడ్ద్వికపఞ్చద్వియుతః, శకకాలస్తస్య రాజ్ఞశ్చ ॥** బృహత్సంహితా ౧౩-౩॥

ఈ శ్లోకార్థమిట్లు చేయవచ్చును. యుధిష్ఠిర మహారాజు యొక్క రాజ్య కాలములో సప్తర్షులు మఘానక్షత్రము నందుండిరి. మరియు యుధిష్ఠిరుని నుండి తరువాత ౨౫౨౬ సంవత్సరములు గలిపినప్పుడు శకకాలారంభ మగుచున్నది.

'అలబ్రూని' యనునాత డీ విషయములో ఇట్లు వ్రాసి యున్నాడు- 'బ్రహ్మ గుప్తాదుల ననుసరించి క్రీ శ. ౧౦౩౧ వరకు కలియుగము నందలి ౪౧౩౨ వత్సరములు గడచిపోయినవి. మరియు ౧౦౩౧ వరకు భారత యుద్ధ కాలపు ౩౪౭౯ వత్సరములు గడచినవి. ఇందువల్ల నిశ్చితమగున దేమన 'అలబ్రూనీ' కాలపు ఆలోచనల ననుసరించి భారత యుద్ధము దాదాపు క్రీ.పూ. ౨౪౪౮ వత్సరములకు ముందు జరిగినది.

ఇతర అనేక విద్వాంసులు ఈ శ్లోకమునందు వచ్చిన **'శకకాలస్తస్య రాజ్ఞశ్చ'** అను దాని యర్థము శాక్య సింహుని, శకసింహుని, లేక గౌతమ బుద్ధుని కాలమని యెంచుచుండిరి. శాలి వాహనుని కాలము **'ఈసా'** జన్మ తరువాత ౭౮ సంవత్సరములకు జరిగినది. బహుశః దీనిని యూరోపియన్ విద్వాంసులు కూడా అంగీకరించినారు. గర్గ సంహిత ఏసుకుపూర్వము కనీసము ౧౫౪ సంవత్సరములకు ముందే యున్నది.

ఆచార్య రాందేవు రచన 'భారత వర్ష ఇతిహాసము. ప్రథమ ఖండము' పు. ౩౫౮

శ్రీ గౌతమ బుద్ధుని జన్మము క్రీ.పూ. దాదాపు ౬౨౩, మరియు మృత్యువు ౮౦ సంవత్సరముల వయస్సున ౫౪౩ క్రీ.పూ. జరిగియుండెను. శాక్య సింహుని శకము బుద్ధుని వయస్సు ౫౦వ సంవత్సరము నుండి ఆరంభమైనది. అనగా ఏసు జన్మకు ౫౭౪ వర్షములకు ముందు

| | |
|---|---|
| గర్గ సంహితననుసరించి శాక్యసింహుని సంవత్సరమువరకు | ౨౫౨౬ |
| గౌతమబుద్ధుని సంవత్సరారంభము నుండి ఏసు జన్మము వరకు | ౫౭౪ |
| ఏసు జన్మము నుండి నేటి వరకు ( అనగా క్రీ శ.౧౯౫౭) వరకు | ౧౯౫౭ |
| మొత్తము | ౫౦౫౭ |

౩. పైన దెలిపిన గణనము దిగువ దెలిపిన విధముగా సరియైనదే. అనగా క్రీ.శ. ౧౮౯౯ భారతీయ సుప్రసిద్ధ జ్యోతిష్యు లెల్లరును సమావేశమై మహాభారత యుద్ధకాలము లేక కలికాలారంభము యొక్క గణన మొనర్చినారు.

అట్టి సమావేశ కాలము వరకు మహాభారత యుద్ధము జరిగి ౫౦౦౦ సంవత్సరములు గడచిన వని ఏక గ్రీవముగా తీర్మానించి యుండిరి. ( భారత వర్ష ఇతిహాసము పు. ౩౧౯ )

భారత దేశములో ప్రచలితమైయున్న పంచాంగము ననుసరించి వర్తమాన కల్యబ్దము ౫౦౫౪ ఐ యున్నది. కాబట్టి మహాభారత యుద్ధము మొదటి కల్యబ్దము నందే ప్రారంభమైనట్లు దెలియుచున్నది. మహాభారత గదా పర్వమునందు భీమదుర్యోధనుల ద్వంద్వ యుద్ధము తరువాత శ్రీ కృష్ణుడు కృద్ధుడైన బలరాము నోదార్చుచు **'ప్రాప్తం కలియుగం విద్ధి'** యని శాంతపరచినాడు. దీనివల్ల మహాభారత యుద్ధము కలియుగారంభమునందే జరిగినదని రూఢీయగుచున్నది.

౪. అక్బర్ బాదుషా కాలమున బాదుషా దర్బారులో మహాపండితుల, విద్వాంసుల సభ యొకటి జరిగియుండెను. ఆ సమయములో సంస్కృత మహా విద్వాంసుల ద్వారా జ్యోతిష సిద్ధాంతములపై పరిశోధనలు జరుపబడినవి బాదుషా యొక్క ప్రధానమంత్రి వ్రాసిన ఆ సభ యందలి తీర్మానముల ఆధారముగా దెలియవచ్చినదేమనగా 'కలియుగ ప్రారంభమగుటతోడనే మొట్ట మొదటి రాజు యుధిష్ఠిరుడై యుండెను. విక్రమ శకారంభమునకు పూర్వము యుధిష్ఠిరుడు రాజైనప్పుడు ౩౦౪౪ సంవత్సరములు గడచినవి (౧౮౬౭లో కలకత్తాలో ముద్రింపబడిన ఆయీనెఅక్బరీ పు. ౨౯౬ చూడుడు.) ఈ ప్రమాణానుసారము కూడా నడచుచున్న విక్రమ సం. ౨౦౧౪లో కలియుగారంభమై ౩౦౪౪ + ౨౦౧౪ = ౫౦౫౮ సంవత్సరము లగుచున్నది.

౫. పం. మాధవాచార్య జ్యోతిషీగారు ౧౮౧౬లో రచించిన తన **'రాజావళి'** యను గ్రంథములో 'కలియుగారంభము నుండి విక్రమ సంవత్సరము వరకు ౩౦౪౪ సంవత్సరములగును. ( హరిశ్చంద్రిక పత్రిక, క్రీ శ. ౧౮౭౪ ఆగష్టు నెల పు.౮౭,౮౮)

పై ప్రమాణానుసారము కూడా కలియుగారంభము, లేక మహా భారత యుద్ధము జరిగి ౩౦౪౪+౨౦౧౪=౫౦౫౮ సంవత్సరములైనది.

౬. 'కౌంట్ జార్న్స్టు జర్నా' అను పేరు గల యూరోపు విద్వాంసుడు

కలియుగ సమయారంభమును గూర్చి ఇట్లు వ్రాయుచు తెలిపినాడు. 'ఆర్య జ్యోతిష్యులు దెలిపినట్లుగా ఆ సమయములో బహుశః గ్రహములన్నియు ఒకే వరుసలో వచ్చి చేరియుండెను. 'బేలీ' అను పేరు గల జ్యోతిష్యుని గణనానుసారము ఆ సమయము క్రీస్తు జననముకు ౩౧౦౨ సంవత్సరములకు పూర్వము ఫిబ్రవరి ౨౦వ తేది ౨ గంటల ౨౭ నిమిషముల, 30 సెకనులకు ప్రారంభమైయుండెను. ఉపర్యుక్త ప్రమాణానుసారము వర్తమానశకము ౨౦౧౪లో కలియుగారంభమై ౩౧౦౨+౧౯౫౭=౫౦౫౯ సంవత్సరములు గడచిపోయినది.

౭. 'మెగస్థనీజ్' అను పేరు గల ప్రసిద్ధ యాత్రికుడు చంద్రగుప్తుని కాలమున భారత దేశమునకు వచ్చియుండెను. మహాభారత యుద్ధ కాలమును గూర్చి వ్రాసిన అంగ్రేజి అనువాద లేఖ ఈ విధముగా నున్నది.

*From the time of Dionysos to Sandrukottas the Indians counted 153 kings and a period of 6042 years. But among these republic was thrice established. The Indians also tell us that Dionysos was earlier than Heracles by 15 generations. (Crindle's Ancient India P.204)*

This Heracles is held in special honour by the Shourseni Indian tribe who possesses two large cities, Mothora and Cleisobra. ( Ancient India P.201)

ఇచ్చట *Heracles* అను దాని తాత్పర్యము హరికృష్ణ, లేక హృషికేశ్ (శ్రీకృష్ణ) యై యున్నది. ఈతనికి శూరసేన వంశము నందు అత్యధిక ప్రతిష్ఠ యుండుట స్వాభావికమే ఆతని మధుర గొప్ప నగరము. రెండవ వికృత నామము స్పష్టముగా లేదు. *Sondrakottas* యొక్క తాత్పర్యము చంద్రగుప్తుడు దీనినను సరించి హరికృష్ణుని నుండి చంద్రగుప్తుని వరకు ౧౩౮ గురు రాజులైనారు. ప్రతివాని రాజ్య కాలము సరాసరి ౨౦ సం.లు అంచనా వేసికొన్నను ౧౩౮ గురు రాజుల శాసన కాలము ౧౩౮×౨౦=౧౭౬౦ సంవత్సరములగును చంద్రగుప్త మహారాజు క్రీ.పూ. ౩౧౨ సంవత్సరములనాడుండెను. కావున శ్రీ కృష్ణుని కాలము క్రీస్తు జన్మము నుండి దాదాపు ౨౭౬౦ + ౩౧౨ = ౩౦౭౨ అగును. అనగా ; శ్రీకృష్ణుని కాలము ఇప్పుడు సుమారు ౩౦౭౨+౧౯౫౭ = ౫౦౨౯ సంవత్సరము లగును

ఈ విషయములో ఇంకా ఇతర ప్రమాణము లెన్నియో ఈయవచ్చును. కాని గ్రంథ విస్తరణ భీతి ఇందుకు సమ్మతించుటలేదు.

### 7.7 రామాయణమునందు వేద వేదాంగముల ఉల్లేఖనము

మహాభారతములో సాంగోపాంగ వేదముల ఉనికి, మరియు వాని కాలముపై వివరించిన పిదప ఇప్పుడు రామాయణములో వేదవేదాంగముల యునికిని గూర్చి వివరించెదము. రామాయణ గాథ మహాభారతము కన్న చాలా పూర్వముదై యున్న దనుటయందే మాత్రము సందేహము లేదు. చూడుడు మహాభారతములోని దిగువ శ్లోకము

**శృణు రాజన్ యథా వృత్తం, ఇతిహాసం పురాతనమ్ ।**

**సభార్యేణ యథా ప్రాప్తం, దుఃఖం రామేణ భారత** ॥ మ. భా. ౨౭౩-౬ ॥

అనగా; భారత కులోత్పన్నుడవగు ఓ రాజా! తన పత్నియగు సీతాదేవితో గూడా శ్రీరాముడెట్టి దుఃఖముల ననుభవించినాడో అట్టి పురాతన గాథను వినుము.

శ్రీరాముడు త్రేతా యుగమునకు చెందిన వాడు. ఇక మహాభారతము ద్వాపరాంతమున జరిగినది కలియుగారంభములో మహాభారత యుద్ధము జరిగినది. కావుననిపుడు రామాయణములో ఎచ్చటనైనా వేదవేదాంగముల నిర్దేశమున్నదా లేదా! చూడవలసియున్నది. ఒకవేళ ఉన్నచో దాని లక్షల సంవత్సరముల ప్రాచీనత్వము, సిద్ధియగుననుటలో ఏ మాత్రము సందేహముండదు.

౧. వాల్మీకి రామాయణ బాల కాండము ౧-౧౪లో శ్రీరామ చంద్రుని విషయములో ఈ విధముగా వ్రాయబడియున్నది.

**వేద వేదాఙ్గ తత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః** ॥ వా. రా. ౧-౧౪ ॥

అనగా; శ్రీ రామ చంద్రుడు వేద వేదాంగముల తత్త్వమును చక్కగా నెరిగినవాడు. మరియు ఉపవేదమగు ధనుర్వేదమునందు అతి నిపుణత్వము గలవాడు.

ఈ విధముగా రామాయణ కాలములో వేదముల సత్తాయుండుటయే గాక వేదాంగములు, ధనుర్వేదము మున్నగు ఉపవేదములు కూడా యుండెను. వానిని శ్రీరామ చంద్రుడు శ్రద్ధాపూర్వకముగా అధ్యయన మొనర్చియుండెను.

౨. వాల్మీకి రామాయణ బాలకాండము ౧-౨౦లో శ్రీరాముని విషయ మిట్లు గలదు.

**సర్వ విద్యావ్రత స్నాతః, యథావత్సాఙ్గవేదవిత్ ।**

**ఇష్వస్త్రే చ పితుః శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః ॥** వా. రా. బా. ౧-౨౦॥

అనగా; శ్రీరామచంద్రుడు సకల విద్యలు, మరియు వ్రతములందు స్నాతకుడై యుండెను. అతడు సాంగోపాంగముల సహితముగ విధిపూర్వకముగా వేదముల నెరిగినవాడు. ధనుర్విద్య యందు తన తండ్రిని మించినవాడై యుండెను.

ఇచ్చట కూడా **'యథావత్ సాంగవేదవిత్'** అను శబ్దము అత్యంత మహత్వ పూర్ణమైయున్నది. వీని వల్ల రామాయణ కాలము వరకే అంగసహితముగా వేదముల ఉనికి గలదని స్పష్టమగుచున్నది.

3. ఈ ప్రసంగమున వాల్మీకి రామాయణ కిష్కింధ కాండము 3-౧౮-౨౯ నందలి దిగువ శ్లోకములు కూడా ఉల్లేఖించదగియున్నవి. దీనివల్ల శ్రీ హనుమంతుడు కూడా వ్యాకరణాది అంగముల సహితముగా వేదాధ్యయన మొనర్చియుండెనని స్పష్టమగు చున్నది. శ్రీరామచంద్రుడు హనుమంతుని విద్వత్తచే మిక్కిలి ప్రభావితుడై లక్ష్మణునితో దిగువ విధముగా ననుచున్నాడు.

**నానృగ్వేదవినీతస్య, నాయజుర్వేదధారిణః ।**

**నాసామవేదవిదుషః శక్యమేవం విభాషితుమ్ ॥** వా. రా. కి. 3-౨౮॥

**నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతమ్ ।**

**బహు వ్యాహరతానేన, న కిఞ్చిదపశబ్దితమ్ ॥** వా రా. కి. 3-౨౯॥

అనగా; ఋగ్వేదాధ్యయనము జేయనివాడు, యజుర్వేదము చక్కగా నభ్యసించి ధారణ నొనర్చనివాడు, సామవేద విద్వాంసుడు గానివాడెవ్వడును వ్యాకరణదోషములేని ఇంత శుద్ధముగ భాషణము చేయజాలడు.

నిశ్చయముగానే ఆంజనేయుడు సంపూర్ణ వ్యాకరణ శాస్త్రమును అనేకసార్లు శ్రవణాధ్యయనముల నొనర్చియుండెను. అధిక సమయమువరకు భాషణ మొనర్చినను అతని ముఖమునుండి ఎట్టి అపశబ్దము రాలేదు. ఈ శ్లోకముల వల్ల కూడా రామాయణ కాలము వరకే వ్యాకరణాది అంగముల సహితముగా వేదములు విద్యమానమైయుండెనని ప్రమాణ పూర్వకముగా స్పష్టమగుచున్నది.

ఈ శ్లోకములందు అథర్వ వేద నిర్దేశము రానందున 'రామాయణ కాలములో అథర్వ వేదము యొక్క ఉనికి లేకపోవచ్చునేమో' యను భ్రమగలుగవచ్చును. ఈ విషయములో వాల్మీకి రామాయణ, అయోధ్యాకాండము

౨౬-౨౧లోని **'మన్త్రశ్చాథర్వణాః'** యను పాఠము గలదు. ఋష్యశృంగుడు బాలకాండ సర్గము ౧౫ శ్లోకము ౨లో నిట్లన్నాడు.

**ఇష్టిం తేఽహం కరిష్యామి, పుత్రీయాం పుత్రకారణాత్।**

**అధర్వశిరసి ప్రోక్తైః మన్త్రైః సిద్ధాం విధానతః॥** వా. రా. బా. ౧౫-౨॥

అనగా; నేను అథర్వ వేద మంత్రములతో నీ యొక్క పుత్రేష్టి యజ్ఞమును జేయించెదను. ఇచ్చట **'అథర్వ శిరసిప్రోక్తైః'** కి రామటీకయందు **'అథర్వ వేదప్రోక్తైః'** యనునదే సరియైన అర్థమని తెలుపబడినది. బ్లూమ్ ఫీల్డు యనునాతడు తన *Hymns of the Atharva Veda Introdutction P IIV* లో ఇట్లు వ్రాసినాడు.

*In the Ramayana the Vedas in general are mentioned very frequently, special Vedic names appear to be rare; the SamaVeda* (సామగాః) *being mentioned at IV 27-10 The Taithiriya* (ఆచార్యః తైత్తిరీయానామ్) *at 11-32-7 The Atharva Veda* (మన్త్రాశ్చాథర్వణాః) *occurs at 11-26-21* ఇక విస్తార భయమున నీ నిస్సందిగ్ధ స్పష్ట వాక్యములతో సరిపెట్టబడినది.

**7.8 రామాయణ కాలము**

ఇక నిప్పుడు మహాభారత కాలమువలెనే రామాయణ కాల నిర్ణయమును గూర్చిన ప్రశ్న ఎదుటికి వచ్చును 'వైదిక్ ఏజ్' లేఖకులు ఈ విషయములో పాశ్చాత్య లేఖకుల పూర్ణ భక్తులైనారు వారు రామచంద్రుని కాలమును ౧౩౫౦ నుండి ౧౯౫౦ క్రీ పూర్వమని తెలుపుచు సుమారు క్రీ పూ ౧౯౫౦ అని తేల్చి వేసినారు వారి సర్వ ప్రయత్నము ఈసాయీ లేఖకుల ననుసరించి ౫౦౦౦ లేక అధికాధికముగా ౬౦౦౦, సంవత్సరములలోపలనే భారతము యొక్క సంపూర్ణ ఇతిహాసము చూపుటయై యున్నది వైవస్వతమనువును మొదటి రాజుగా జూపుచూ ఆయన కాలమును గూర్చి యిట్లు వ్రాసినారు.

*"The year 3102 B.C. thus represents the age of Manu, the first traditional king in India" - Vedic Age P. 270.*

అనగా; మెసొపొటేమియాలో గొప్ప జలప్లావనము (వరదలు) క్రీ.పూ 3000లో వచ్చినవి. ఈ మహా వరదలు భారత దేశములో బహుశః *(probably)* అదియే మొదటిది కావచ్చును. కలియుగ ప్రారంభము క్రీ.పూ. 3000 అని యెంచుకొనినప్పుడు అదియా జల ప్రళయమును జ్ఞాపకముంచుకొనుటకే దీసికొనినారేమో యనిపించును! మనువు యొక్క కాలము కూడా దాదాపు క్రీ.పూ. 3000 వత్సరమేయైయుండెను. అని వారు స్వయముగా తాము వ్రాసిన శబ్దములను గూర్చి మేము గడచిన అధ్యాయములందుల్లేఖించియుంటిమి. ఏమన;

*The flood in Mesopotamia is generally held to have occured about 3100 B.C. the flood in India **probably** also occured at the same time, and the date 3102 B.C supposed to be the beginning of the Kali era, may, therefore, commemorates this event. (Vedic India P.270)*

ఇవన్నియు లేఖకుల కపోలకల్పనలు గాక మరేమియులేదు. మెసొపొటేమియా జల ప్రళయమును భారతదేశ జలప్లావనముగా స్వీకరించుటకు వారి వద్ద ఎట్టి ప్రమాణమును లేదు. వారి లేఖానుసారము క్రీ.పూ. 3000 వ సంవత్సరము కలియుగ ప్రారంభ కాలమును సత్య యుగము యొక్క వైవస్వతమనువు కాలముగా ఎంచుకొనుట సంపూర్ణముగా అసంగతమేగాక నిరాధారమునైయున్నది. ఈ అసంగత కపోల కల్పితమును విస్తరించుచు తరువాత ఇట్లు వ్రాసినారు.

*'Yayati' who is fifth in descent from Manu and figures also in Rigveda, thus flourished (18x5) = 90 years after Manu or in (3,100-90=3010 B.C) Rama flourished 65 generations after Manu, i.e. 3100-65x18 = 1930 B.C. or roughly in 1950 B.C. These dates will, of course, have to be lowered by 400 years if the Bharat war is placed in 1000 B.C. - Vedic Age. P. 270*

అనగా; మనువు యొక్క ఐదవ తరమువాడగు యయాతి పేరు ఋగ్వేదమందును వచ్చినది. అతడు మనువునకు ౯౦ సంవత్సరముల పిదప, అనగా క్రీ.పూ. 3000 శ్రీ రాముడు మనువు తరువాత ౬౫ తరముల వెనుకవాడు. కావున వారి సయము క్రీ.పూ ౧౯30 వత్సరములు (ఒకవేళ మహాభారత యుద్ధము క్రీ.పూ. ౧000లో యని నిశ్చయించినచో) ఈ తిథులను ఇంకనూ ౪00 సంవత్సరములు తగ్గించవలసియుండును.

ఇట్టి కపోల కల్పితములన్నియు ఏయాధారము లేకున్నను నడచుచున్నవి. మహాభారత యుద్ధ విషయముగాని, మరియు ఇతర విషయములందుగాని లేఖకులకు నిశ్చయాత్మకమగు జ్ఞాన మే మాత్రమును లేకుండెను. ఒక చోట దానిని క్రీ.పూ. ౧౪00 అనియు మరొక చోట దానిని క్రీ.పూ. ౧000 సంవత్సరముల కాలమనియు, ఇంకా ఏమేమో వ్రాసివేసినారు. ఋగ్వేద ౧-3౫-౭ వ మంత్రము **'మనుష్వదగ్నే అఙ్గిరస్వదఙ్గిరో యయాతివత్ సదనేపూర్వవచ్చుచే ॥ ఋ.౧-3౫-౭** ఇచ్చట 'యయాతి' అను పదమును చూడగానే ఈయన మనువంశములో నుత్పన్నమైన ఐదవ తరము వాడగు 'యయాతిరాజు' వర్ణన మని వ్రాసికొన్నారు. ఇందులకు ప్రమాణ మేదియును లేదు. ఇందుకు భిన్నముగా నిరుక్త మీమాంసాది శాస్త్ర సమ్మత సిద్ధాంతములగు **'పరన్తు శ్రుతిసామాన్యమ్'** **'సర్వాణి నామాన్యాఖ్యాతజాని'** ఇతి నైరుక్త సమయః మున్నగు వేదములందు వ్యక్తి వాచక నామములు గావు. అవి కేవలము సామాన్య గుణ సూచకములే. ఈ శబ్దములన్నియు యౌగికములే. కావున వానిని యౌగికార్థములుగానే గ్రహించవలెను ఇది వ్యాకరణ నిరుక్తాదుల సిద్ధాంతమునకు సంపూర్ణముగా విరుద్ధము. 'యయాతి' శబ్దము. 'యతిప్రయత్నే' ధాతువుచే ఔణాదిక ఇన్ ప్రత్యయ మొనర్చుటచేనైనది. దీనియర్థము 'ప్రయత్నశీలు'డని యగుచున్నది. మహర్షి దయానందులు ఇదే విధముగా తన ఋగ్వేద ౧-3౧-౧౭ భాష్యములో వ్రాసినారు.

**యథా ప్రయత్నవన్తః పురుషాః కర్మాణి ప్రాప్నువన్తి ప్రాపయన్తి చ తద్వత్।**

**అత్ర యతీప్రయత్నే ఇత్యస్మాదౌణాదిక ఇన్ ప్రత్యయః । స చ బాహులకాణ్ణిత్ సనవచ్చ।**

కావున దానియర్థమింతయేయగును. యయాతికి ప్రయత్నశీలుడనియు, అగ్ని అనగా; అగ్రణీ నాయకుడని యొనర్చవలయును. 'మను' వనగా మననశీలుడు, 'అఙ్గిరస్వద్' తేజోవంతుని వలె అగును. దీనిని యయాతికి

ఐదవ తరము వాడనుట ఎంత యనుచితమగునో చూడుడు. మనువు వేదములను నిత్యములని ఎంతయో ప్రశంసించినాడు.

**బిభర్తి సర్వభూతాని, వేదశాస్త్రం సనాతనమ్।**

**తస్మాదేతత్ పరం మన్యే, యజ్జన్తోరస్య సాధనమ్**॥ మను. ౧౨-౯౯॥

అనగా; 'సనాతన వేద శాస్త్రము సకల ప్రాణులకు జ్ఞానమునిచ్చి ధారణమొనర్చును. అది మానవులకు సర్వాంగీణ ఉన్నతికి సాధనము. కావున నేను దానిని పరమముగా నెంచుదును' ఇతర స్థలములందును దానిని సనాతనము, నిత్యమనియే తెలిపినాడు.

**అగ్నివాయురవిభ్యస్తు, త్రయం బ్రహ్మ సనాతనమ్।**

**దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం, ఋగ్యజుస్సామలక్షణమ్**॥ మను.౧-౨౩॥

పరమేశ్వరుడు సనాతన (నిత్య) వేదములను అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరులను పేర్లు గల ఋషుల ద్వారా యజ్ఞయాగాది శుభకార్య సిద్ధికై ప్రసాదించినాడు. ఇత్యాదులు.

ఇక వైదిక్ ఏజ్ రచయితల మనువునకు ఐదవ తరములో ఉత్పన్నమైన యయాతి పేరు ఋగ్వేదములో యున్నదని యనుచున్నారు. ఋగ్వేద ౧౦-౧౦౭ వ మంత్రములో వచ్చినట్టి **'భోజస్యేదం పుష్కరిణీవ వేశ్మ'** మున్నగు మంత్రములందుగల పేర్లను చూచి ౧౧వ శతాబ్దమునందుత్పన్నమైన సుప్రసిద్ధ, సంస్కృత ప్రేమికుడగు భోజుని వర్ణనము మంత్రములందుండుటచే వేదములు ౧౧వ శతాబ్దపువని చెప్పవచ్చునా? ఇదెంత హాస్యాస్పదము? ఇట్లే వేదములందు యయాతి మున్నగు నామముల కల్పనయొనర్చుట మాననీయముగాదు. *Book four 'Historical Traditions'* అనగా; 'ఐతిహాసిక పరంపర' లను శీర్షికలతో పరంపరాగత యుగములను మరియు యుగకాలములను సంపూర్ణముగా నిరాదరణ మొనర్చుచు ఐదారువేల సంవత్సరములలో భారతీయ ఇతిహాసమును నష్టభ్రష్టమొనర్చివేసినారు. పరంపరానుసారము సృష్టినిర్మాణమై ౧,౯౭,౨౯,౪౯,౦౫౭ సంవత్సరములైపోయినదని వారెరుగరేమో!

**యుగానుసారము శ్రీ రామచంద్రుని కాలమీ విధముగా నున్నది.**

| | |
|---|---|
| **సత్యయుగము లేక కృతయుగము** | **౧౭,౨౮,౦౦౦ వత్సరములు** |
| **త్రేతాయుగము** | **౧౨,౯౬,౦౦౦ వత్సరములు** |
| **ద్వాపరయుగము** | **౮,౬౪,౦౦౦ వత్సరములు** |
| **కలియుగము** | **౪,౩౨,౦౦౦ వత్సరములు** |

వీని నుండి కలియుగము నందలి ౫౦౫౭ వత్సరములు గడచిపోయినవి. ఈ ప్రకారమొక వేళ శ్రీరాముని త్రేతాయుగపు చివరివాడని యెంచినను (౧౨,౯౬,౦౦౦) అనగా పంద్రెండు లక్షల, తొంబదియారువేల సంవత్సరములకు దరిదాపులవా డని యనవచ్చును. ఇట్టి స్థితిలో శ్రీరామచంద్రుడు, లేక రామాయణ కాలమును

కేవలము క్రీ.పూ. ౧౫౩౦ సంవత్సరవాడని చూపుట కేవలము అప్రామాణికమేగాక అభూత కల్పనయే గాగలదు. వేదముల నామ మటంకించని, వర్ణించని ప్రాచీనాతి ప్రాచీన గ్రంథమేదియును లేదు. కావున వానిని యుక్తిప్రమాణముల యాధారముతో సనాతన మని యెంచవలెను. వీనిని సృష్ట్యారంభకాలముననే మంగళమయుడగు పరమేశ్వరుడు మానవమాత్రుల కల్యాణార్థము ఆ పవిత్రాత్ములగు ఋషుల ద్వారా ప్రసాదించినాడని స్వీకరించుటయే అన్ని విధముల శ్రేయస్కరము. శ్రీ. అవినాశచంద్రదాసుతన *Rigvedic India* యందు ఋగ్వేద కాల నిర్ధారణ విషయము నందిట్లు వ్రాసినాడు.

*The RigVeda must be held to be as old as the Miocene or the Pliocene Epoch whose age is to be computed by some **hundreds of thousands, if not Millions of years**. This at first sight would seem to be extremely incredible. But it may be mentioned here in passing, that the Indo-Aryans believe the RigVeda to be as old as the creation of man, in other words to have emanated from Brahma, the Creator Himself, and is regarded as Apaurusheya, i.e. not ascribable to any human **agency,** though the Rishis or seers might have clothed the revealed truths and eternal verities in language of their own, from time to time. This bereft of all exaggerations, would mean that the **RigVeda has existed from** time immemorial. To this belief of the Indo-Aryans, how ever absurd it might seem, the results of geological investigations, undoubtedly lend some strong colour.*

*(-Rigvedic India by Dr. A.C.Das M.A., Ph.D., P. 21)*

దీని సారాంశమేమనగా; ఋగ్వేదమును ఆదియుగమంతటి పురాతనమైనదిగా నెంచవలయును. దీని కాలము అనేక కోట్ల సంవత్సరములుగాకున్నను కనీసము అనేక లక్షల సంవత్సరములని యెంచవలయును. మొదట ఈయాలోచన విశ్వసనీయముగా నుండక పోవచ్చును. కాని ఆర్యులు వేదములను అపౌరుషేయములు, మరియు మానవ సృష్టికి ఆదియందే పరమేశ్వరుని ద్వారా ప్రసాదింపబడిన జ్ఞానమని విశ్వసింతురను విషయమును మరువరాదు వీనిని మహర్షులు తమ భాష ద్వారా సమయ సమయములపై ప్రకటన మొనర్చినారు. అత్యుక్తుల నన్నిటిని వదలివేసిన తరువాత కూడా దీని తాత్పర్యము 'ఋగ్వేద మనాది కాలము నుండి విద్యమానమై యున్నదని తేలుచున్నది. ఆర్యుల యీ విశ్వాసము కొంత అసంగతముగా నసిపించినను భూగర్భ విద్య యొక్క పరిశోధనల వల్ల దీనికి కావలసినంత పరిపుష్టి లభించుచున్నది.

సూర్య సిద్ధాంతము, మనుస్మృతి మున్నగువాని ననుసరించి ౪,౩౨,౦౦౦ సామాన్య సంవత్సరముల చతుర్యుగము ౭౧ సార్లు గడచిపోయిన ఒక మన్వంతరమగును. ఇటువంటి ౧౪ మన్వంతరములకు పృథివి యొక్క ఆయుష్యమగును. ప్రతి మన్వంతరాంతమున ఒక సత్యయుగపు సంవత్సరములకు సమానమైన సంధికాలముండును. అది జల ప్రళయ రూపములో నుండును మరియు ౧౪ మన్వంతరాలకు పూర్వము కూడా అనగా; సృష్ట్యారంభమునందు కూడా ఒక సత్యయుగ కాలమునకు సరియైన సంధి యుండును. ఈ

ప్రకారముగ సంధికాల సహితముగా ౧౪ మన్వంతరముల (పృథివి యొక్క పూర్ణాయువు) మహాయోగము (మొత్తము కాలము) ౪,౩౨,౦౦,౦౦,౦౦౦ అనగా, నాలుగు అర్బుదముల, ముప్పైరెండు కోట్ల సంవత్సరము లగును. ఇందుకు అథర్వ వేదము యొక్క కాం. ౮ సూక్త ౨ మం.౮ వ మంత్రము.

**శతం తేఒయుతం హాయనాన్ద్వే యుగే త్రీణి చత్వారి కృణ్మః** ॥ అథ౮-౨-౮॥

ద్వారా సృష్టినిర్ణయ మొనర్చబడినది. ఇందిట్లు చెప్పబడినది. ఒక వంద అయుతములు అనగా పదివేలతోయుక్తముగు ౨,౩,౪ అనగా; అంకములను ఎడమవైపు వ్రాయు నియమముతో ౪౩౨౦౦౦౦౦౦౦ (నాలుగర్బుదముల ముప్పదిరెండు కోట్లు) సంవత్సరములు పృథివి యొక్క కాలము (వయస్సు) మానవుల కొరకు, సమస్త ప్రాణుల కొరకును ఏర్పరచబడినది.

ఇందులో ఆరు మన్వంతరములు గడచిపోయినవి ఏడవ మన్వంతరమునందలి ౨౭ చతుర్యుగములు కూడా ముగిసిపోయినవి. ౨౮వ చతుర్ యుగపు సత్యయుగ త్రేతాయుగ, ద్వాపర యుగముల క్రమముగా ౧౭ ౨౮,౦౦౦; ౧౨,౯౬,౦౦౦; ౮,౬౪,౦౦౦, మరియు కలియుగపు ౫౦౫౭ సంవత్సరములు అనగా మొత్తము ౧౯౭౨౯౪౯౦౫౭ సంవత్సరములు గడచిపోయినవి. ఆర్యులు యజ్ఞాదుల ప్రారంభమున,

**ఓం తత్ సత్ శ్రీ బ్రహ్మణో ద్వితీయ పరార్ధే వైవస్వతమన్వంతరేఒష్టా వింశతితమే**

**కలియుగే కలిప్రథమ చరణే ఆర్యావర్తాంతర్గతైకదేశే ఒముక నగరే........**

**అముక సంవత్సరాయనర్తుమాసే........... ఇదం కార్యం మయా కరిష్యతే ।**

ఈ విధము చెప్పుకొను సంకల్పము వల్ల కూడా పై దెలిపిన సత్యము ప్రమాణ పూర్వకముగా రూఢియగుచున్నది.

### 7.9 వైజ్ఞానికుల ద్వారా దీని పుష్టి

పృథివి ఆయువు యొక్క రహస్యమును దెలిసికొనుటకై వైజ్ఞానికులు అనేక సాధనములను ఉపాయములను వినియోగించుకొనుచున్నారు. వీనిలోని ముఖ్య సాధనములందు 'రేడియోయాక్టివిటీ' అను దాని ద్వారా దీని రహస్యమును దెలిసికొనవలసియున్నది. చట్టురాళ్ళలో యురేనియం *(Uranium)* మరియు థోరియం *(Thoreum)*, తత్త్వము కొద్ది కొద్ది పరిమితిలో నున్నవి. ఈ రెండు రేడియోయాక్టివ్‌లు అస్థిరమైయున్నవి. కావున యురేనియం ఏదో ఒక పరిమాణములో ౪,౫౦,౦౦,౦౦,౦౦౦ సంవత్సరములందు, మరియు థోరియం ఏదో ఒక పరిమాణములో ౧౬,౫౦,౦౦,౦౦,౦౦౦ సంవత్సరములలో వాని బరువు సగము మిగిలిపోవును. ఒకవేళ మనకీ ఏర్పాటు వల్ల రాతిబండలందు నిర్మితమైన యున్న సీసము, యొక్క పరిణామ మెంత గలదో విదితమగుచో మనము దాని రచనాకాలపు అవధిని లెక్కవేయవచ్చును. మరియునిదియే ఆ చట్టు బండల ప్రాచీనత్వము వాని ఆయు వగును. ఈ విధానముతోనే 'ఫిన్‌లైండు' నందలి 'కరోలియా' రాతిబండలలోని రహస్యము కనుగొనబడినది. ఈ రాతిబండలు ౧౮౫౦౦౦౦౦౦౦ (౧ అర్బుద, ౮౫ కోట్ల) సంవత్సరములు, మరియు డకోటా యొక్క బ్లైక్ హిల్ పేరుగల రాతిబండలు ౧౪౬౦౦౦౦౦౦ (౧ అర్బుద ౪౬ కోట్ల) సంవత్సరములు

పురాతనమైనవని అంచనావేయబడినది. ఈయాధారముపైననే పృథివి యొక్క ఆయువు విషయములో అంచనా వేయబడిన దానిని మేము *'Science Past and Present' by Sherwood Taylor Ph.D., M.A. B.Sc. London* గారి పుస్తకమునుండి సంగ్రహించు కొన్నాము. వారిట్లు వ్రాయుచున్నారు.

***Some good evidence that the real age of the earth is two or three thousand million years has been supplied by the study of the proportions of Uranium and isotope of lead (into which it slowly changes) in the various rocks. P.235.***

The weight of scientific evidence is against an infinitely extended past, but the past which we formerly reckoned as six thousand years, **cannot be shorter than 1800 Million and may be for longer**. - Science Past and Present by Sherwood Taylor P.237

ఈయుదాహరణముల తాత్పర్యమేమన; భూమి ఆయువు ౨ లేక 3 లక్షలు, ఈ విషయములో యూరేనియముల నిష్పత్తుల అధ్యయనము వల్ల చక్కని సాక్ష్యము లభించినది.

వైజ్ఞానికుల సాక్ష్యము అనంత విశ్వ విస్తారమునకు విపరీతముగ నున్నది. భూతకాలమున దాదాపు ఆరువేల వత్సరములుగ నెంచుచున్న భూమివయస్సు ఒక అర్బుదము, ఎనుబది కోట్ల సంవత్సరముల కన్న తక్కువ గాదు. ఐనను ఇంతకు అధికము కూడా కావచ్చును. ఆర్యుల అభిమతానుసారము భూమి వయస్సు ౧౯౩,౭౨,౯౪,౦౫౭ సంవత్సరములు. ఇది పైన దెలిపిన వైజ్ఞానికుల సాక్ష్యానికి దాదాపు సరిపోవుచున్నది.

*"An outline of Modern Knowledge" Edited by Dr. William Rose* అను సుప్రసిద్ధ పుస్తకము నందు పుట ౧౫౨ లో భూమి ఆయువు విషయము దిగువ విధముగా వ్రాయబడియున్నది.

***"The age of the earth is about two thousand Million years"***

అనగా; భూమి ఆయువు దాదాపు ౨ అర్బుదముల వత్సరములు.

ఇది స్కాట్లెండుకు చెందిన సుప్రసిద్ధ రాజకీయ జ్యోతిష్యుడగు జ్యోతిష శాస్త్ర విశారద ప్రొ. సైమసన్ *(Prof R.A Sampson M.A.F R.S. Astronomer Royal for Scotland* యొక్క *Astronomy)* లేదా జ్యోతిష శాస్త్ర విషయమును గూర్చిన రచన

ఈ విధమగా భూమి వయస్సు విషయములోనిది ఆర్యమంతవ్యమును అద్భుతముగా పుష్టిపరచుచున్నది. లెకోమ్టీ దున్వాయ్ *(Lecomte Dunouy)* అను పేరుగల వర్తమాన కాలపు సుప్రసిద్ధ వైజ్ఞానికుడు తన *Human Destiny* అను పేరుగల లోకప్రియ పుస్తకములో ఈ విధముగా వ్రాసియున్నాడు.

*"Our globe must be about two thousand Million years old and can in no case be much older" - Human Destiny P. 48*

అనగా; మన భూమి దాదాపు రెండు అర్బుద సంవత్సరముల పురాతనమైనది. ఎట్టి పరిస్థితియందైనను ఇంతకన్న పురాతనమైనది గాదు.

శ్రీ హెచ్.జి.వేల్స్ అను పేరు గల జగద్విఖ్యాత ఐతిహాసికుడు *The Outline of History* అనుతన పుస్తకము నందీ విషయమును ధృవపరచుచు ఇట్లు వ్రాసినాడు.

*"Astronomers and mathematicians give us 200 Million years as the age of the earth as a body separate from the sun" - Outline of History by H.G.Wells P.19*

అనగా; జ్యోతిష్కులు మరియు గణితజ్ఞులు సూర్యుని నుండి వేరైన పృథివి దాదాపు రెండు అర్బుద సంవత్సరముల ఆయువు గలదని తెలుపుచున్నారు.

మహాఆశ్చర్యము మరియు బాధాకరమగు విషయమేమనగా; అత్యంతాధునికులగు వైజ్ఞానికులు సాక్ష్యాధారముల ద్వారా సైతము భూమి ఆయువు ఆర్యుల అభిప్రాయములను బలపరచుచున్నప్పుడు దీనిని ఉపేక్షించుచు ఈసాయీల మంతవ్యానుసారము పృథివి వయస్సు దాదాపు ౬౦౦౦ సంవత్సరములని విశ్వసించుచు 'వైదిక్ ఏజ్' లేఖకులగు విద్వాంసులు కూడా ఈ అవధిలోనే సమస్త ప్రాచీన ఇతిహాసములను ఇముడ్చుటకు ప్రయత్నించినారు. ఇది సంపూర్ణముగా అనుచితమే. పృథివిపై మానవోత్పత్తి కాలమే వేదావిర్భావ కాలమైయున్నది. పైన అనేక యుక్తుల, సాక్ష్యముల ప్రమాణముల ద్వారా ఇది నిరూపించబడినది.

### 7.10 'మైటర్లింక్' అభిప్రాయము - వేదముల అతిప్రాచీనత్వము

ఈ యధ్యాయమును సమాప్త మొనర్చుటకు పూర్వము నోబల్ బహుమతి గ్రహీతయగు శ్రీ మైటర్లింక్ వేదముల అతిప్రాచీనత్వమును గూర్చి వ్రాసిన మహత్త్వ పూర్ణమగు లేఖ నుండి ఒక అంశమును ఉదాహరించుట అత్యావశ్యకమనిపించినది. అది

*"As for the sources of the primary source, it is almost impossible to re-discover them. Here we have only the assertions of the occultist tradition, which seem here and there, to be confirmed by historical discoveries. This tradition attributes to **the vast reservoier of the wisdom** that some where took shape **simultaneously with the origin of man**........, to more spiritual, entities to beings less entangled in matter . - (Great Secret by Materlink, Prologue P.6")*

దీని సారాంశమేమన; ఆది స్రోతస్సును మరల పరిశీలించుట అసంభవప్రాయమే. ఇచ్చట మనకు ఆధ్యాత్మవాద పరంపర కథనము లభించుచున్నది. అచ్చటచ్చట దీనికి చారిత్రిక అనుసంధాన (పరిశోధన) ము వల్ల కూడా పుష్టిలభించుచున్నది. దీని పరంపరన నుసరించి జ్ఞాన సంబంధ విశాలసామగ్రి యొక్క ఆవిర్భావము మానవోత్పత్తితో బాటు ఆధ్యాత్మిక మరియు ప్రకృతి యందు మిక్కిలి అనాసక్త వ్యక్తులపై జరిగినది.

ఈ విషయమునందే శ్రీ మైటర్లింక్ '' ప్రసిద్ధ జర్మన్ పురాతత్త్వవేత్త యగు 'హాలెడ్' *Halled* గణనానుసారము ప్రాచీన శాస్త్రము (వేదము) లు కనీసము ౭౦ లక్షల సంవత్సరములు పురాతన'' ములని వ్రాసినాడు.

- గ్రేట్ సీక్రేట్ భూమిక. పు.౧౨ చూడుడు



# వేదముల యథార్థ స్వరూపము

## అష్టమాధ్యాయము

## ఆర్యులు - అనార్యులు

### 8.1 ఆర్యుల, దస్యుల, దాసుల, ద్రవిడుల వివేచనము

ఈ యధ్యాయమున ఆర్యులు, అనార్యులు, దస్యులు, దాసులు, ద్రవిడులు అను విషయమున వివేచన మొనర్చదలచినాము. ఏలన పాశ్చాత్య విద్వాంసుల ద్వారా వ్రాయబడిన గ్రంథములం దీ విషయము సర్వత్రా తరచుగా కాన్పించుచున్న దేమన; ఆర్యులు బయట నుండి ( చాల వరకు మధ్య ఏసియానుండి) వచ్చి యుండిరి. వారికి పూర్వమువారు భారత దేశపు ఆదినివాసులు, నల్లని వర్ణము గల ద్రవిడులైయుండిరి ఆర్యులు వారికి దస్యులు, దాసులని నామముల నిడి యుండిరి. వారిపై అనేక విధములగు అత్యాచారములను జరిపి యుండి రని వ్రాసినారు. 'వైదిక్ ఏజ్' యందును చాల వరకు దీనినే సమర్థించినారు. ఈ విషయములో దిగువ విధమగు శబ్దములను ప్రయోగించియున్నారు.

*"The Aryan invaders or immigrants found in India two groups of people, one of which they named the Dasas and Dasyus, and the other Nishadas" - Vedic Age P.156*

ఆక్రమణ మొనర్చిన ఆర్యులు, భారత దేశమున రెండు విధములగు వర్గములను చూచినారు. ఒక వర్గమునకు వారు దాసులు, లేక దస్యులు మరొక వర్గమునకు నిషాదులను పేరిడినారు.

వైదిక్ ఏజ్ యొక్క అష్టమాధ్యాయ పరిశిష్టమునం దీ విధముగా వ్రాసినారు. అది కొంత హర్షించదగిన విషయమే. 'మైసూరు మహారాజా కళాశాల ప్రొఫెసరగు శ్రీ కంఠ శాస్త్రి ఒక లేఖను ప్రకాశపరచినారు. దానియందువారు భారతదేశమే ఆర్యుల ఆదిదేశమని ధ్రువపరచుటకు అనేక ప్రబల ప్రమాణముల నిచ్చియున్నారు (వైదిక్ ఏజ్ పు ౨౧౫-౨౧౭)

ఐనను వైదిక్ ఏజ్ అనేక భాగములందు ద్రవిడ సంస్కృతి, సభ్యతలను ఆర్యసంస్కృతి, సభ్యతల కన్న ఉన్నతము, మరియు పరిష్కృతమని చూపు ప్రవృత్తి దృష్టిగోచరమగుచున్నది. ఆర్యులు, మరియు దస్యులు, లేక ద్రావిడులను ఆర్యుల కన్న వేరగు ఒక జాతి *(Race)* అని యెంచు భావము గూడా అనేక స్థానములందు గానవచ్చును. మనము దానిని చక్కగా దెలిసికొనలేము.

### 8.2 ఆర్యులనగా నెవరు? ఆర్యుల దొక ప్రత్యేక జాతియా?

**'ఆర్య'** అను శబ్దమున కేమి అర్థము? ఆర్యులనగా నెవరు? ఆర్యులు, దస్యులు, ద్రవిడు లనునవి వేర్వేరు జాతులా? అను విషయముపై మొదటనే వివేచన మొనర్చుట ఆవశ్యక మని తలచుచున్నాము.

ఋగ్వేద౧౦-౬౫-౧౧లో ఆర్యుల విషయమందిట్లు వివరణ గలదు. **''ఆర్యావ్రతా విసృజన్తో అధిక్షమి''** ప్రపంచమునందు సత్యము, అహింస, పవిత్రత, పరోపకారత్వము మున్నగు వ్రతములను విశేష రూపములో

ఆచరణయం దుంచువారు ఆర్యులు. ఆర్యశబ్దము 'ఋ' ధాతువుచే సిద్ధమగుచున్నది. దీనియర్థము 'గతి ప్రాపణయోః' అగును. అనగా; గతి - జ్ఞానము, గమనములను ప్రాప్తి జేసికొనుచు, ప్రాప్తి గలిగించు వారిని 'ఆర్యు' లందురు. ఈ ధాత్వర్థము ననుసరించి జ్ఞాన సంపన్నులగువా రార్యులు. వారు సన్మార్గము నందే సదా పయనించుచుండు పురుషార్థులు. ఈశ్వరుడు మరియు ఆతని పరమానందమును ప్రాప్తించుకొనుటకై సదా ప్రయత్నశీలురై యుందురు. దీనినే దీసికొని సంస్కృతము యొక్క శబ్ద కల్ప ద్రుమము, వాచస్పత్య బృహదభిదానము, మున్నగు కోశము లందు ఆర్య శబ్దమునకు దిగువ అర్థములు గానవచ్చుచున్నవి.

**ఆర్యః :- పూజ్యః, శ్రేష్ఠః, ధార్మికః, ధర్మశీలః, మాన్యః, ఉదారచరితః, శాన్తచిత్తః**

**న్యాయపథావలంబీ, సతతం కర్తవ్యకర్మానుష్ఠాతా యథోక్తమ్ - కర్తవ్యమాచరన్ కార్యమ్, అకర్తవ్యమనాచరన్।**

**తిష్ఠతి ప్రకృతాచారే, స తు ఆర్య ఇతి స్మృతః ॥** వసిష్ఠస్మృతి ॥

**ఆర్యుడనగా;** సద్గుణముల కారణమున పూజనీయుడు, శ్రేష్ఠుడు, ధర్మాత్ముడు సదాధర్మయుక్తమైన స్వభావము, మరియు ఆచరణము గలవాడు, మాననీయుడు, జాతిభేదము, వర్ణము లేక రూప భేదము మున్నగు సంకుచిత భావములను పరిత్యజించిన ఉదారచరితుడు, మనస్సునందు సంకీర్ణత్వము లేనివాడు, ఈశ్వరభక్తి, మరియు పరమేశ్వరునిపై పూర్ణ విశ్వాస కారణమున సదా శాంత చిహ్నము గలిగినవాడు, న్యాయ మార్గమునవలంబించి ఎప్పుడును అధర్మముననుసరించని వాడు, నిరంతరము కర్తవ్య కర్మల ననుష్ఠించువాడు, అకర్తవ్య కార్యములు అనగా పాపాదుల నుండి సదాదూరమున నుండు పూర్ణ సదాచారము గలవాడు.

మహా భారతములోని దిగువ శ్లోకములు ఈ విషయమునందు ఉల్లేఖనీయమై యున్నవి.

న వైరముద్దీపయతి ప్రశాన్తం, న దర్పమారోహతి నాస్తమేతి।

**న దుర్గతోఽస్మీతి కరోత్యకార్యం, తమార్యశీలం పరమాహురార్యాః ॥**

న స్వే సుఖే వై కురుతే ప్రహర్షం నాన్యస్య దుఃఖే భవతి ప్రహృష్టః।

**దత్వా న పశ్చాత్ కురుతేఽనుతాపం, స కథ్యతే సత్పురుషార్యశీలః ॥**

**ఆర్యుడనగా;** శాంతముగానుండును, వైరమును వృద్ధినొనర్పడు, అభిమానం గలిగి యుండడు, నిరాశాపరుడుగాడు. దుర్గతిపాలైనను పాపకార్యములొనర్చడు. సుఖప్రాప్తి గలిగినను గర్వపడక తన పరిధిని వీడడు ఇతరుల దుఃఖములందు సానుభూతి గలిగియుండును. దానమునొనర్చి పశ్చాత్తాప పడడు ఇన్ని సద్గుణములు గల వాడార్యుడు. ఈ విధముగా ఆర్యుడను శబ్దమునందు అనేక అత్యుత్తమ గుణములు నిండియున్నవి ఇన్ని గుణములు గలిగియున్నవాడెవ్వడైనను, ఏ దేశము, నగరము, గ్రామము, వంశము, కులము నందుత్పన్నమైనవాడైనను, మరియు తెల్లని, ఎఱ్ఱని గోధుమ, చామన నల్లని వర్ణములు గలిగియుండినను పై గుణములు గలవాడే ఆర్యుడు. మహర్షి వేదవ్యాసుడు దిగువ ఎనిమిది గుణములు గలిగియున్నవాడార్య డని తెలిపినాడు.

**జ్ఞానీ తుష్టశ్చ దాన్తశ్చ సత్యవాదీ జితేన్ద్రియః।**

**దాతా దయాలుర్నమ్రశ్చ స్యాదార్యో హ్యష్టభిర్గుణైః ॥**

అనగా; జ్ఞానియైనవాడు, సదా సంతుష్టుడై యుండువాడు, మనస్సును స్వాధీనమున నుంచుకొనువాడు, సత్యవాది, జితేంద్రియుడు, దానశీలుడు, దయాళువు, వినమ్రుడు అను ఎనిమిది గుణములు గలవాడు ఆర్యుడు.

యాస్కముని తన నిరుక్తమునందు **'ఆర్య'** శబ్దమునకు **'ఆర్యః ఈశ్వర పుత్రః'** అను అర్థము నొనర్చినాడు. **'ఆర్య'** శబ్దమునకు స్వామి, పరమేశ్వరుడు అనియును అర్థము గలదు. **'ఆర్యః స్వామివైశ్యయోః'** సర్వజగత్తునకు స్వామియగు పరమేశ్వరుని సత్యమగు పుత్రుడు అనగా సదా అతని యాజ్ఞలను పాలించువాడే ఆర్యుడని యనిపించుకొనును. కావుననే వేదములు, ఉపనిషత్తులు, రామాయణము, మహాభారతము, మున్నగు సకల ప్రాచీన గ్రంథములందు సజ్జనులను ఆర్యులు, దుర్జనులను అనార్యులు, లేక దస్యులను శబ్దముచే సంబోధించినారు. శ్రీరాముని ఉత్తమ గుణములను వర్ణించుచు వాల్మీకి రామాయణములో నారదముని యిట్లనినాడు.

**''ఆర్యః సర్వసమశ్చాయం, సోమవత్ ప్రియదర్శనః''** ॥ వా. రా. బాలకాండ. ౧-౧౬॥

శ్రీరామ చంద్రుడు ఆర్యుడు, ధర్మాత్ముడు, సదాచారి, సర్వ ప్రాణులను సమదృష్టితో జూచువాడు. మరియు చంద్రునివలె ప్రియదర్శనీయుడై యుండెను.

కురుక్షేత్ర భారత యుద్ధమందు వీరుడగు అర్జునుడు తన క్షాత్ర ధర్మ కర్తవ్యము నుండి దిగజారి మోహమునందు చిక్కుకొనినప్పుడు భగవద్గీతయందు శ్రీ కృష్ణుడు అతనిని సంబోధించుచు ఇట్లనినాడు.

**కుతస్త్వా కశ్మలమిదం, విషమే సముపస్థితమ్ ।**

**అనార్యజుష్టమస్వర్గ్యం, అకీర్తికరమర్జున** ॥ గీత ౨ 3 ॥

అనగా; హే అర్జునా! అనార్యులు, మరియు దుర్జనుల ద్వారా సేవించబడినట్టి, నరకమునకు గొనిపోవు, అపయశమును గలిగించు కర్తవ్య హీనత్వము నీకెట్లు ప్రాప్తించినది?

కైకేయి శ్రీరాముని అరణ్యమునకు పంపించుటకు కోరినప్పుడు దశరథమహారాజు ఆమెను 'అనార్యా' శబ్దమున అనేక పర్యాయములు రామాయణమువనుసరించి ప్రయోగించినాడు. ఎట్లనగా;

**మృతే మయి గతే రామే, వనం మనుజపుంగవే ।**

**హన్తానార్యే మమామిత్రే, సకామా సుఖినీ భవ** ॥ వా రా. అయోధ్యాకాండ ౧3-౫॥

స్వయముగా వాల్మీకి అనార్యోచితమగు ఈ హానికరమగు కోరికను గూర్చి;

**తదప్రియమనార్యాయా, వచనం దారుణోపమమ్ ।**

**శ్రుత్వా గతవ్యథో రామః కైకేయీం వాక్యమబ్రవీత్ ।**

ఈ యయోధ్యాకాండమందు ౧౯-౧౯ లో అనార్య శబ్ద ప్రయోగము చేసినాడు.

## 8.3 మహాత్మా బుద్ధుడు - ఆర్య శబ్దము

మహాత్ముడగు గౌతమ బుద్ధుడు కూడా సజ్జనులను ఆర్య శబ్దముతో సంబోధించుచు ఆర్యుని లక్షణమును గూర్చి ఇట్లు చెప్పియున్నాడు.

**న తేన అరియో హోతి, యేన పాణాని హింసతి ।**

**అహింసా సబపాణానం, అరియోతి పవుచ్చతి** ॥ ధమ్మపద ౨౭౦ ॥

ప్రాణులను హింసించుట, హత్యయొనర్చుట మున్నగు కృత్యము లొనర్చు వాడెవ్వడును ఆర్యుడుగాలేడు. ప్రాణుల అహింసవల్ల మానవులు ఆర్యులు, శ్రేష్ఠులు, ధర్మాత్ములు, సదాచారులని పిలువబడుదురు.

పారసీకులు, మరియు జైనమతావలంబులందు కూడా ఆర్యశబ్దము శ్రేష్ఠ పురుషులకై ప్రయోగించబడినది. జైనుల తత్త్వార్థ సూత్రములు అ.3లో **'ఆర్యా మ్లేచ్చాశ్చ'** మున్నగు సూత్రములు గలవు. వీనియందు శ్రేష్ఠులు **'ఆర్య'** నామముచే స్మరణ మొనర్చబడినారు. ఇప్పటికిని జైనుల సాధ్వీమణులు ఆర్యా, లేక ఆరజాయని పిలువబడుచున్నారు. (శ్రీ రతన్‌చంద్ర జైన్ కృత 'అర్ధ మాగధీకోశము ౨వ భాగము పు.౮౨లో ఆరియ, లేక ఆర్య అర్థము విశుద్ధము, పవిత్రము, శ్రేష్ఠము, పాపరహితము మరియు *High in Civilization* అని గలదు.'

### 8.4 జెందావస్తాలో ఆర్య శబ్దము

పారసీకుల మాననీయ ధర్మ గ్రంథముగు జెందావస్తాయందు శ్రేష్ఠ జనులకు 'ఆర్య' శబ్ద ప్రయోగము వందల మార్లు గాన్పించును. ఉదాహరణమునకు జెందావస్తాలో సిరోజహ భాగ ౧-౨౫లో 'మజ్దా' (పరమేశ్వరుడు) ఆర్యులను ప్రతిష్ఠావంతులుగా నొనర్చినాడు. సిరోజహ ౨-౯ లో 'మేము ఆర్యుల సన్మానార్థము మజ్దాయొనర్చిన హవనమును జేయుదు' మని వ్రాయబడియున్నది.

యస్తద యశ్త యొక్క ౧౮ వ అధ్యాయము ఆర్యుల వీరత్వ వర్ణనలచే నిండియున్నది. దాని ప్రారంభిక శ్లోకమునకు అనువాదము. 'అహుర మజేదా అనునాతడు స్పితామా జరదుశ్తతో 'నేను ఆర్యులను భోజనము, పశుసమూహము, ధనము, ప్రతిష్ఠ, జ్ఞాన భండారము, ద్రవ్యరాశి మున్నగు వానిచే సంపన్న మొనర్చినాను. ఇందువల్ల వారు తమ అవసరములను సంపూర్ణ మొనర్చుకొనెద'రని యన్నాడు. (జెందావస్తా భా.-౨ పు ౨౮౩)

ఈ విషయములన్నిటిని ధ్యానమున నుంచుకొని సుప్రసిద్ధ జగద్విఖ్యాత యోగి శ్రీ అరవిందుల వారు **'ఆర్య'** శబ్ద అర్థము, మహత్వమును గూర్చి తన త్రైమాసిక *Arya* అను పత్రిక ప్రథమాంకము ౧౯౧౪లో ఈ కాలపు సుశిక్షిత వర్గము యొక్క ధ్యానమును దానివైపు దీసికొని పోవదలచినానని ఇట్లు వ్రాసినారు.

*The word Arya expresses a particular ethical and social order of well-governed life, candour, courtesy, nobility, straight dealing, courage, gentleness, purity, humanity, compassion, protection of the weak, liberality, observance of social duties, eagerness for knowledge, respect for the wise and the learned, and the social accomplishments. There is no word in human speech that has a nobler history. The Arya is he who strives and overcomes all outside him and with in him that stands opposed to human advance. Self conquest is the first law of his nature. He over-comes mind and its habits and he does not live in a shell of ignorance inherited prejudices, customary ideas, pleasant opinion, but knows how to seek and choose, to be large and flexible in intelligence even*

*as he is firm and strong in his will. For in every thing he seeks truth, in every thing right, in every thing height and freedom.*

The Arya is a worker and warrior. Always he fights for the coming of the kingdom of God within himself and the world. -( Arya Vol. I.P. 63)

**భావార్థమేమన;** ఆర్య శబ్దములో ఉదారత్వము, నమ్రత, సరళత, సాహసము, పవిత్రత, దయ, దుర్బలుల సంరక్షణ, జ్ఞానమునకై ఉత్సుకత, సామాజిక కర్తవ్య పాలనము మున్నగు సమస్త ఉత్తమ గుణములు చేరియున్నవి. మానవీయ భాషయందు ఇంతకు మించిన ఉత్తమమగు శబ్దము లేవియును లేవు. ఆర్యుడు ఆత్మ సంయమనము, మరియు అంతర్బాహ్యముగా స్వరాజ్య ప్రేమికుడై యుండును. ఆతడు అజ్ఞానము, బంధనము, మరియు ఏ విధమైన దాసత్వము నందుండుటకును ఇష్టపడడు. వాని ఇచ్ఛాశక్తి దృఢముగ నుండును. ప్రతివస్తువునం దాతడు సత్యము, ఔన్నత్యము, స్వతంత్రతలను పరిశీలించుచుండును. ఆర్యు డొక కార్యకర్త, మరియు యోధుడుగా నుండి తన యందును మరియు జగత్తునందును ఈశ్వర ప్రసాదిత వైదిక జ్ఞానమును దెచ్చుటకు అజ్ఞానము, అన్యాయము, అభావము, మరియు అత్యాచారములకు విరుద్ధముగా సమర మొనర్చుచుండును.

ఈ ప్రకరణమునందు మరొక అత్యంత మహత్త్వ పూర్ణ విషయము ఉదాహరించ బడుచున్నది.

ఉత్తర ప్రదేశములో విద్యాశాఖ 'స్యామ్ సంస్కృత మూలక శబ్దావళి' పేరు గల పుస్తక మొకటి ముద్రణ యొనర్చినది. దీని భూమికను ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ సంపూర్ణానందగారు వ్రాసినారు. ఈ స్యామ్ ఆంగ్రేజి పరిభాషా శబ్దావళిని స్వ. ఆచార్య నరేంద్రదేవ్ ద్వారా - భారత సంస్కృతి భవనము స్యామ్ నుండి లభించియుండెను. దీనియందు ఎనిమిదవ పుటపై గల దిగువ రెండు శబ్దములను జూచిన మాకు ఆశ్చర్యముతో బాటు అత్యంతానందము గూడ కలిగినది. ఈ 'స్యామ్' శబ్దములు దిగువ విధముగా నున్నవి.

*Civilisation* ఆర్య ధర్మము, = *Civilised People* - ఆర్యజనులు

ఇచ్చట సభ్యత కొరకు ఆర్య ధర్మము మరియు సభ్య జనుల కొరకు ఆర్యజనశబ్ద ప్రయోగము **'స్యామ్'** భాష యందు ప్రచలితమైయున్నదని చూపబడినది. పైనుదాహరించిన సంస్కృత గ్రంథముల ప్రమాణముచే పైదెలిపిన యర్థము ప్రకట మగుచున్నది.

## 8.5 దస్యులనగా నెవరు?

**'దస్యు'** శబ్దము 'దసు- ఉపక్షయే' అను ధాతువు నుండి జనించినది. కావున దీని వ్యుత్పత్తి మరియు అర్థము నొనర్చుచు యాస్కాచార్యులు నిరుక్తము 7-23లో **'దస్యుః దస్యతేః క్షయార్థాత్ ఉపదస్యన్త్యస్మిన్ రసాః ఉపదాసయతి కర్మాణి'** అని వ్రాసినారు.

అనగా; ఎవనియందు రసము, లేక ఉత్తమ గుణముల సార భాగము తక్కువగా నుండునో, మరియు యజ్ఞము మున్నగు ఉత్తమ కర్మల నాశమొనర్చునో, లేక వానికి విఘ్నములను గలిగించునో వాడే దస్యుడు. వేదములందు వాని లక్షణమిట్లు చెప్పబడియున్నది.

**అకర్మా దస్యురభి నో అమన్తురన్యవ్రతో అమానుషః।**

**త్వం తస్యామిత్రహన్ వధర్దాసస్య దంభయ ॥ ఋ ౧౦-౨౨-౮ ॥**

అనగా; దస్యుడెవడనగా; (అకర్మా) ఉత్తమ కర్మల నొనర్చని వాడు మరియు పనిపాటులు లేని సోమరి, (అమన్తుః) ఆలోచనారహితుడు. ఆలోచనా పూర్వకముగా కర్మలనొనర్చనివాడు (అన్యవ్రతః) సత్య, అహింస, పరోపకారము మున్నగు శ్రేష్ఠ కర్మలనొనర్చక అందుకు వ్యతిరిక్తమగు హింస, అసత్యము, చౌర్యము, కపటము మోసము, మున్నగు సంకల్పములతో దుష్కర్మల నొనర్చువాడు, (అమానుషః) మానవత్వపు పవిత్ర భావనన వదిలి కేవలము స్వార్థము, క్రూరము, కఠోరములచేయుచు మానవత్వము లేనివాడు, ఇంద్రనామము గల హే పరమేశ్వరా! ఇట్టి దస్యులను నాశపరచుము అను ఇట్టి విశేషణములతో దస్యుల పరిచయమొనర్చబడియున్నది. ఋగ్వేదమందలి మరొక సుప్రసిద్ధ మంత్రములో దస్యులన;

**విజానీహ్యార్యాన్ యే చ దస్యవో బర్హిష్మతే రన్ధయా శాసదవ్రతాన్।**

**శాకీభవ యజమానస్య చోదితా విశ్వేత్తా తే సధమాదేషు చాకన ॥ ఋ ౧-౫౩-౮ ॥**

దీనియందు దస్యుల విశేషణము అవ్రతులని యుంచబడినది. ఆర్యులను 'ఆర్యావ్రత విస్సృజన్తో అధిక్షమి' ఋ.౧౦-౬౫-౧౧ ॥ ననుసరించి సత్యము, అహింస, పరోపకారము మున్నగు వ్రతధారి గల చోట దస్యు - వ్రత హీనులు అనగా ఇట్టి ఉత్తమ వ్రతముల నొనర్చక నుందురో ఇదియే ముఖ్యముగా ఆర్యులు, మరియు దస్యుల భేదమని దెలియవలెను. ఈ మంత్రమునకు వైదిక ధర్మోద్ధారకశిరోమణి మహర్షి దయానందులు ఆర్యాభి వినయమునం దొనర్చిన వ్యాఖ్య విశేషముగా ధ్యానము నందుంచుకొనదగినది. వారిట్లు వ్రాసినారు

సర్వశక్తివంతుడవగు హే పరమేశ్వరా! నీవు (ఆర్యాన్) విద్యా ధర్మము మున్నగు ఉత్కృష్ట స్వభావాచరణములు గల ఆర్యుల నెరుగుము (యేచదస్యవః) మరియు నాస్తికులు, బందిపోటులు, చోరులు, విశ్వాస ఘాతకులు, మూర్ఖులు, విషయలంపటులు, హింసనొనర్చువారు, దోషయుక్తులు, ఉత్తమకర్మల యందు విఘ్నములు గలిగించువారు, స్వార్థ సాధనాతత్పరులు, వేద విద్యలకు విరోధులగు అనార్యులు (బర్హిష్మతే) సర్వోపకారక యజ్ఞముల విధ్వంసకులగు దుష్టులను నీవు (రన్ధయ) సమూలముగా నష్టపరచి వేయుము. మరియు (శాసదవ్రతాన్) బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసము మున్నగు ధర్మానుష్ఠానవ్రత రహితులు, వేదమార్గోచ్ఛేదకులగు అనాచారులను యథాయోగ్యముగ అదుపునందుంచుము. శీఘ్రముగా వారిని సుశిక్షితులై శిష్టులగు నట్లు వారిపై దండనిపాతమును జేయించుము. ఏలన; (శాకీ) జీవన శక్తితో గూడ వారు మాకు ఉత్తమ కర్మలందు ప్రేరణతో సహకరించు వారగుదురుగాక!. మరియు నీవు మాచుష్ట కర్మలకు విరోధివి నేను ఉత్కృష్ట స్థానమునందు నివసించుచు నీ యాజ్ఞానుకూలము సమస్త ఉత్తమ కామితములను యాచింతునుగాక. వానిని నీవు సఫలము నొనర్చుచుండుము. - (ఆర్యాభివినయము ౧-౧౪ అధ్యాయము)

ఆర్యులు, మరియు దస్యులందిట్టి భేదములుండును. కావుననే ఇట్టి దస్యులను నాశమొనర్చుట వేదముల ద్వారా బలపరచబడినది. ఏలన; వీరు స్వయముగా దుష్టులగుటయేగాక సమాజమును మరియు రాష్ట్రమును వినష్టపరచుటకు కూడా వెనుదీయరు. ఋ.౧-౧౧౭-౩లో 'దస్యు' యొక్క విశేషణము (అశివస్య) అనగా,

అశాంతి కారకులు. దుఃఖదాయకులని వచ్చినది. **'మునన్తా దస్యోరశివస్య మాయాః'** అనగా **'అశ్వినౌ అధ్యాపకోపదేశక అశ్వి'** అకల్యాణ కారకులగు దస్యుల దుష్టబుద్ధులను నాశపరచువారైయుందురు. ఋ.౪-౧౬-౯ లో దస్యు యొక్క విశేషణము **'మాయావాన్ అబ్రహ్మాదస్యుః'** అని కలదు. అనగా; కపటమోసముల నొనర్చువారు బ్రహ్మ (పరమేశ్వరుని)ను, మరియు వేదమును అంగీకరించక సంకీర్ణ హృదయము గలవారు (వృహ-వృద్ధౌ) ఇంద్రశక్తి శాలియగు రాజు వారి యీ దుష్ట గుణములను నాశమొనర్చి జ్ఞానాదులను ప్రసారపరచి వారి అబ్రహ్మత్వమును, మరియు అజ్ఞానమును నాశమొనర్చుగాక

**ఆ సంయత మిన్ద్ర ణః స్వస్తి శత్రుతూర్యాయ బృహతీమమృధ్రామ్ ।**

**యయా దాసాన్యార్యాణి వృత్రా కరో వజ్రిన్త్సుతుకా నాహుషాణి** ॥ ఋ.౬-౨౨-౧౦॥

ఈ ప్రసంగమున ఈ ఋగ్వేద మంత్రము విశేషముగా ఉల్లేఖించదగియున్నది. దీనియందు 'ఇన్ద్ర' అనగా పరమేశ్వరుడు సంపన్నుడగు రాజును సంబోధించుచు నీవు (వృత్రాదాసాని నాహుషాణి ఆర్యాణి అకరోః) ధర్మకార్యములందు విఘ్నములను గలిగించు మరియు వానిని నాశనమొనర్చుదాసులను కూడా 'ఆర్య' అనగా శ్రేష్ఠులు. ధర్మాత్ములు, సదాచారులు, ధర్మకర్మ పరాయణులుగా నొనర్తువు. శ్రీ సాయణాచార్యుని భాష్యము కూడా దిగువ విధముగా ఈ భావమునే సమర్థించుచున్నది.

**హే ఇన్ద్ర శత్రూణాం తారణాయ మహతీమ్ (అమృధ్రామ్) అహింసితామ్ (సంయతీమ్) సంగచ్ఛమానామ్ (స్వస్తిమ్) క్షేమలక్షణాం సమ్పదమ్ అస్మభ్యమ్ ఆ భర। హే వజ్ర వన్నింద్ర ।యయా స్వస్త్యా (దాసాని) కర్మహీనాని మనుష్య జాతాని (ఆర్యాణి) కర్మ యుక్తాని అకరోః (నాహుషాణి) మనుష్య సమ్బన్ధీని నహుష ఇతి మనుష్యనామైతత్ నిఘం. (వృత్రా) వృత్రాణి శత్రూన్ (సుతుకా) శోభన హింసోపేతాని అకరోః** (తిలక సంస్థాన సం. భాగ. 3పు.౯౧)

విశేషించి ఇచ్చట నొక విషయము ఉల్లేఖించదగియున్నది. సాయణాచార్యుని భాష్యము ననుసరించియును ఇంద్రుని కార్యము ఉత్తమ కర్మహీనులగువారిని శ్రేష్ఠ కర్ములగువారినిగా నొనర్చి ఆర్యులనుగా జేయునది. దీనివల్ల స్పష్టమగున దేమనగా, ఆర్యులు దస్యులు అనువారికి భేదము జాతి కారణముగాక కేవలము కర్మ కారణమేయై యున్నదని స్పష్టపడుచున్నది.

వేదముల యుపదేశము పతితులను ఉన్నతపరచుట, పాపులందు సైతము ధర్మభావనను జాగృత పరచి నవజీవనమును ప్రసారమొనర్చుట మరియు విశ్వమంతటిని ఆర్యుల (శ్రేష్ఠ - సదాచారుల)నుగా జేయుటయై యున్నది. దిగువ మూడు మంత్రములందును ఈయభిప్రాయమే సూచితముగుచున్నది.

**ఉత దేవా అవహితం దేవా ఉన్నయథా పునః ।**

**ఉతాగశ్చక్రుషం దేవా దేవాజీ వయథా పునః** ॥ ఋ.౧౦-౧౩౭-౧ ॥

**ఇన్ద్రం వర్ధన్తో అప్తురః కృణ్వన్తో విశ్వమార్యమ్ ।**

**అపఘ్నన్తో అరావ్ణః** ॥ ఋ. ౯-౬౩-౫॥

**అప త్యం వృజినం రిపుం స్తేనమగ్నే దురాధ్యమ్ ।**

**దవిష్ఠమస్య సత్పతే కృధీ సుగమ్** ॥ సామ. మం.౧౦౫ ॥

అనగా; (దేవాః) హే సత్యనిష్ఠ విద్వానో సత్య సంహితావై దేవాః సత్యమయా ఉ దేవా విద్వాంసో హి దేవాః (శత.బ్రా. 3-౭-3-౧౦) నీవు (అవహితమ్) క్రిందపడిపోయిన పతితులను (ఉన్నయథ) పైకిలేపుము హే దేవా! (ఉత) మరియు (ఆగః చక్రుషమ్) అపరాధములు, మరియు పాపముల నొనర్చువారిని కూడా ఆ పాపములనుండి విముక్తులుగ జేసి (పునః జీవయథ) వారి యందు మరల నవజీవనమును సంచార మొనర్చుము. దేవతల (సత్య నిష్ఠగల జ్ఞానుల) స్వభావము ఇందు వర్ణించబడినదని యెంచవలెను. నీవు పతితోద్ధారకుడవు. మరియు పాపాత్ములను సైతము పాపముల నుండి విముక్తుల నొనర్చి నవజీవనము సంచారపరచెదవు. అనియనుకొన్నను భావమునందెట్టి భేదమును పడజాలదు.

'ఇన్ద్రం వర్ధన్తో అప్తురః' ఈ మంత్రమత్యంత మహత్త్వ పూర్ణమైయున్నది. కావుననే ఆర్యులు తమ కొరకై దీనిని ఆదర్శవాక్యము *Moto* గా నెంచుకొనినారు. నీవు (ఇన్ద్రం వర్ధన్తః) జ్ఞానైశ్వర్యము, లేక ఆత్మిక శక్తిని అభివృద్ధి పరచుకొనుచు (అప్తురః) కర్మశీలుడవు, పురుషార్థివి, ప్రమాదరహితుడువునై (అరావ్ణః అపఘ్నన్తః) కృపణత్వము, లోభ గుణము మున్నగు వాని నాశమొనర్చి (విశ్వమ్ ఆర్యమ్ కృణ్వన్తః) విశ్వమంతటిని ఆర్యులు, శ్రేష్ఠులు, ధర్మాత్ములు, సదాచారులుగా నొనర్చుచు ప్రపంచమున సంచరించుచుండుము.

ఈ వైదికాదేశానుసారము అనార్యులు, దాసులు, దస్యులను కూడా ఆర్యులను గాజేయుట ఆర్యుల కర్తవ్యము. కావుననే **'విజానీహ్యార్యాన్ యే చ దస్యవః'** అను మంత్రమును ఆర్యాభివినయమున వ్యాఖ్యానించుచు మహర్షి దయానందు లిట్లు వ్రాసియున్నారు. అనగా; దస్యులు, బందిపోటులు, విశ్వాసఘాతకులు, విషయలంపటులు మున్నగు దుష్టులను కూడా విద్యలను నేర్చి పవిత్రాచరణము గలవారై ఆర్యులతో గలిసియుండునట్లు చేయ వలెను. సంపూర్ణముగా పతితులై చక్కబరచుటకు సాధ్యము గాక ప్రపంచ విధాయకమున ప్రాణాంతముగ నుండువారికి ప్రాణాంతమే జరుగవలెను. వారిపై భారీ సుంకము వేసి సమాజోన్నతికి ఎట్టి అపాయము, బాధ కలుగకుండు ఏర్పాట్లు చేయవలెను.

తృతీయ మంత్రమునం దీ విషయము అతిస్పష్టపరచబడినది. దీని అర్థమేమన;

హే (సత్పతే) శ్రేష్ఠుల రక్షకా ! (త్యమ్) అట్టి (వృజినమ్) పాపులు, (స్తేనమ్) చోరులు, (దురాధ్యమ్) దుష్టబుద్ధులు, (రిపుమ్) సజ్జనుల శత్రువులు మున్నగువారిని (అప దవిష్ఠమ్ అస్య) మాకు బహుదూరమున నుంచుము. లేక, అట్టి దుష్టులు, దుర్మార్గములందు నడచువారిని కూడా (సుగమ్ కృధి) ఉత్తమమార్గములందు నడచువారిగా నొనర్చుము. ఈయాదేశములు మరియు ప్రార్థనల యనుసారము ఆర్యులు దస్యులను గూడ ఆర్యులను గానొనర్చుటకు ప్రయత్న మొనర్చుచుండిరి. ఐనను అత్యధిక దుష్టులు, సమాజవినాశకులైన వారిని నాశమొనర్చుట సమాజరక్షణమునకై తమ కర్తవ్యముగా భావించుచుండిరి. దుష్టులను సంహరించుటలో ఇతరాలోచనల నేమియును జేయకుండిరి. ఆర్యవంశజులై యుండియును దుష్టులు, సమాజ నాశక కార్యములందు

ప్రవృత్తులగుచుండువారిని కూడా నాశమొనర్చుట క్షత్రియులు తమ ముఖ్య కర్తవ్యముగా దలచుచుండిరి. ఒకవేళ బ్రాహ్మణుడు జ్ఞానప్రసారము ద్వారా వారిని సన్మార్గమునకు దెచ్చుటలో సఫలము గానిచో ఈ దిగువ ఋగ్వేద మంత్రము ద్వారా స్పష్టమగునదేమన ;

**త్వం తాం ఇన్ద్రోభయాం అమిత్రాన్ దాసా వృత్రాణ్యార్యా చ శూర ।**

**వధీర్వనేవ సుధితేభిరత్కైరా పృత్సుదర్షి నృణాం నృతమ ॥** ఋ.౬-33-3 ॥

దీనియందు ఇన్ద్ర లేక శూరవీరుడగు సేనాపతిని సంబోధించుచు ఇట్లు చెప్పబడినది. హే (నృణాం నృతమ్) నాయకులందును శ్రేష్ఠుడా! నీవు రెండు విధములగు శత్రువులను, వారెట్టి స్వభావము గలవారైనను (వృత్ర, దాస) ఉత్తమ కార్యములందు బాధలను గలుగజేయువారుగాని, లేక ఆర్య వంశజులై యుండియును, ఆర్యత్వము నుండి పతనమై నీచకర్మలందు ప్రవృత్తులై యున్నవారిని నీవు ఉన్నత పరచుట గాని, నాశమొనర్చుటగాని యొనర్చుము. దీనివల్ల ఒక ఆర్యేతర జాతి విశేషముపై ద్వేష భావము సూచితము గాజాలదు. కాని సమాజ రక్షణార్థము సకల దుష్టులను నాశపరచు భావమే ద్యోతకమగుచున్నది.

ఈ ఋగ్వేద మంత్రమునందు 'ఇన్ద్రావరుణౌ (రాజు మరియు నాతని ప్రధానమంత్రిని) సంబోధించుచు ఇట్లు చెప్పబడియున్నది.

**యువాం నరా పశ్యమానాస ఆప్యం ప్రాచ్య గవ్యన్త పృథుపర్శవో యయుః ।**

**దాసా చ వృత్రా హతమార్యాణి చ సుదాసమిన్ద్రావరుణావసావతమ్ ।** ॥ ఋ. ౭-౮3-౧॥

ఇచ్చట వృత్రా, దాస అనగా స్వభావ సిద్ధముగా శ్రేష్ఠ కర్మలకు విఘ్నము గలిగించువారిని నాశమొనర్చ వలయునని చెప్పినచోట, ఆర్య వంశజులైయుండియును ఇట్టి దుష్టకర్మల నొనర్చువారిని కూడా వధించుటకై స్పష్ట నిర్దేశము గలదు. దీనిచే న్యాయ పూర్ణమగు సమదృష్టి యే సూచితమగుచున్నది. ఒకజాతి విశేషము నెడ గాని వర్గ విశేషము నెడ గాని ఏవగింపు లేక విద్వేష భావములేదు. ఈ నిమ్న ఋగ్వేద మంత్రమందును :-

**అన్తర్యచ్ఛ జిఘాంసతో వజ్రమిన్ద్రాభిదాసతః ।**

**దాసస్య వా మఘవన్నార్యస్య వా సనుతర్యవయా వధమ్** ॥ ఋ.౧౦-౧౦౨-3॥

హే (ఇన్ద్ర) శూరవీరుడవగు సైన్యాధ్యక్షా! (అభిదాసతః) మమ్ము దాసులనుగా జేసికొను కోరిక గలవారు, మరియు మా యజ్ఞాది శుభకర్మలందు విఘ్నములను గలుగజేయువారిని నీవు నాశమొనర్చుము. వారుస్వభావముగానే దాసులు, దస్యులు, మరియు దుష్టులైనను, లేక ఆర్య వంశజులై యుండి దుష్టుల సాంగత్యమున దుష్ట స్వభావము గలిగిన వారైనను సరే. ఈ విధ దస్యులను ఒక జాతి విశేషమని, గాని ఆర్యులకు వాని యెడ ఘృణత్వముగాని, ద్వేష భావము గాని వేదముల ద్వారా సమర్థించబడలేదు. దస్యులను నష్టపరచుటకు వేదములలోని విధానమును, దాని లక్షణమును పూర్వమే **'అకర్మా దస్యురభి నో అమన్తురన్యవ్రతో అమానుషః'** ఈ ఋగ్వేద ౧౦-౨౨-౮ ॥ వ మంత్రమునుదాహరించి యుంటిమి. ఈ దిగువ ఋగ్వేదమంత్రముకూడా దీనినే బలపరచుచున్నది.

**అన్యవ్రతమమానుషమయజ్వానమదేవయుమ్ ।**

**అవ స్వః సఖా దుధువీత పర్వతః సుఘ్నాయ దస్యు పర్వతః** ॥ ఋ. ౮-౭౦-౧౧ ॥

ఇచ్చట 'దస్యు' యొక్క విశేషణము (అన్యవ్రతమ్) సత్యము, అహింస, పరోపకారము మున్నగువానికి విపరీతముగా అసత్యము, హింస, స్వార్థము, మున్నగు సంకల్పములు గలవాడు (అమానుషమ్) మానవత్వమును పెంపొందించు సహానుభూతి, ప్రేమ, దయ మున్నగు భావనలు లేనివాడు (అయజ్వానమ్) యజ్ఞమును త్యజించినవాడు, (ఒనర్చనివాడు) పరోపకారము మున్నగునవి లేనివాడు, అనార్యుడు, దస్యుడు (అదేవయుమ్). దివ్య గుణములు, మరియు సత్య నిష్ఠ, విద్వాంసుల నాదరించి గౌరవించువాడు ఆర్యుడు. దీనివల్ల ఏదో యొక ప్రత్యేక జాతి విశేషముగాని, వర్గ విశేషముగాని, వీరి యెడ విద్వేషముగాని, ఘృణాత్వముగాని లేదు. ఈ దిగువ ఋగ్వేద మంత్రమును దుష్టులకు 'దస్యు' వను శబ్దమునే ప్రయోగించుచు వారి అగ్ని (జ్ఞానవంతుని చేయు) ద్వారా వినాశమును గూర్చిన వర్ణన గలదు. 'నక్రతూన్ గ్రథినో మృధ్ర వాచః పణీంరశ్రద్ధాన్ ॥ ఋ.౭-౬-౩॥ ఇట్టి దస్యులు అన్ని వర్ణములందును ఆశ్రమములందును ఉండగలుగుదు' రని మహాభారతమందును చక్కగానే చెప్పబడినది.

**దృశ్యన్తే మానవే లోకే, సర్వవర్ణేషు దస్యవః ।**

**లిఙ్గాన్తరే వర్తమానా ఆశ్రమేషు చతుర్ష్వపి** ॥ మ.భా. శాంతి పర్వ. ౬౫-౨౩॥

కావున దస్యులు, దాసులు మున్నగు వారే ఆర్యులకు భిన్నమగు జాతి, లేక భారత దేశపు మూల (ఆది) నివాసులని యనుకొనుటగాని, వేదములో వారి యెడ ద్వేష భావము గల ఉపదేశములు గలవని యనుకొనుట గాని సంపూర్ణముగా అసత్యము. వారి విషయమున కొన్ని స్థలములందు **'అసిక్నీం త్వచమ్'** శబ్ద ప్రయోగము లున్నను అవి ప్రకరణము ననుసరించి ఆలంకారిక భాష యందున్నవి. ఏలన; అదే మంత్రములో.

**ఋచా శోచన్తః సం దహన్తో అవ్రతాన్ । త్వచమసిక్నీం భూమనో దివస్పరి** ॥ ఋ. ౯-౭౩-౫ ॥

వ్రతహీనులు మేఘముల ఉపమానముతో నల్లని వారనబడిరి. ఋ.౭-౬-౩॥ వ మంత్రము యొక్క మిగతా భాగమీ విధముగ గలదు.

**'అవృధాం అయజ్ఞాన్ । ప్ర ప్ర తాన్ దస్యూంరగ్నిర్వివాయ పూర్వశ్చకారాపరాం అయజ్యూన్॥'** అనగా పణి (జూదము) వంటి వ్యాపారములందుండు స్వార్థులు (గ్రథినః) కుటిలత్వపు ముడులను వేయువారు (అక్రతూన్) శుభకర్మలనొనర్చు సంకల్పములు లేనివారు (మృధ్ర వాచః) వికృత సంభాషణమొనర్చువారు (అశ్రద్ధాన్) శ్రద్ధ, లేక సత్యధారణ భావములేనివారు (అవృధాన్) వాస్తవమగు విద్వత్త, సత్సంగము, దానము మున్నగు వాని వృద్ధినొనర్చనివారు (అయజ్యూన్) యజ్ఞములనొనర్చనివారు (అగ్నిః) అగ్రజుడగు నాయకుడు అట్టివారిని క్రిందికి కూల్చివేయును.

**'గాథా ఉస్తవైతీ'** లో జరదుస్త యనునాతడు చెప్పినదాని ఆంగ్రేజీయనువాద మిది.

*©That I will ask thee, tell me it right, thou living God, who is the religious man and who the impious, after whom I wish to inquire? with whom of the both is the **black spirit***

*and with whom the bright one? Is it not right to consider the impious man who attacks me and thee, to be* ***a black one.***

దుష్ట దురాచారుల నిచ్చట ప్రారంభమున(మొదట) నైతే *Black Spirit* లేక నల్లని ఆత్మగలవారని, ఆపిదప నల్లనివారని స్పష్టముగా చెప్పబడియున్నది. ఇట్టి ప్రయోగమే అన్ని భాషల యందును ఉండును. కావున చాల తక్కువ చోటులందు ఇట్టి ప్రయోగములను జూచి ఆర్యులు తెల్లగా నుండిరి. దస్యులు లేక దాసులు నల్లని వర్ణము గలవారై యుండిరనియు, కావుననే ఆర్యులు వారిని ద్వేషించుచుండిరని తలచరాదు. ఆర్యుల, దస్యుల మధ్య భేదము వారి వారి గుణ కర్మ స్వభావముల నాశ్రయించి యుండెను. గాని జాతీయభేదము *Rocial difference* చేతగాదు. దస్యులు కూడా తమ గుణ కర్మ స్వభావముల పరివర్తన మొనర్చుకొని ఆర్యు లగుచుండిరి. మరియు ఆర్య వంశోత్పన్నుడగు పులస్త్యునివంటి బ్రహ్మర్షి కులమున జన్మించినను రావణుని వంటివారు కూడా దురాచారులు, దస్యులు లేక 'రాక్షసు' లని యనిపించుకొనినారు.

వైదిక్ ఏజ్ లేఖకులు పు. 3౫౧వ *Reference* లో ఈవిధముగు పరివర్తనమును స్వీకరించినారు. మేము వారి ఐతిహాసిక పక్షమును ఉత్తమముగా నెంచకున్నను వారి బల్‌బూథ్‌ను సంజ్ఞావాచకముగా స్వీకరించలేము. ఐనను వారి యీ టిప్పణిని ఈ ప్రసంగమున ఉదాహరించుట ఉచితమని యెంచుచున్నాము. వారిట్లు వ్రాసినారు.

*At least one dasa chief, however, named Balbuth had adopted Aryan culture and even patronised Brahman singers. P.351*

అనగా; 'బల్ బూత్' అను పేరుగల దాస సర్దారుడు ఆర్య సంస్కృతిని స్వీకరించి యుండెను. మరియు నాతడు బ్రాహ్మణ గాయకుల, మరియు ఋషుల సంరక్షణ మొనర్చుచుండెను. ఈ విషయమే 'వైదిక్ ఏజ్' లేఖకుల మరొక టిప్పణమును ఉదాహరించుట యోగ్యమని తలచుచున్నాము.

*It is significant that as a rule Indra himself has been made to combat the Dasa princes on his own initiative and not in course of rendering merely routine assistance to Aryan chiefs for it shows that even in the heydays of Rigvedic culture there was no longer a living memory of the first encounters with the aboriginal races - Vedic Age P.347*

ఈ విషయము మహత్త్వ పూర్ణమైయున్నది. ఏమనగా; ఒక నియమానుసారము ఇంద్రుడు దస్యుల లేక దాసుల నాయకులతో స్వయముగా యుద్ధమొనర్చినాడా? లేక ముఖ్యులగు ఆర్యుల సహాయ ప్రయత్నముల ద్వారానా? దీనిచే వైదిక సంస్కృతి యొక్క పరాకాష్ఠ దినములందు కూడా భారత దేశము యొక్క ఆదివాసులతో ఆర్యుల మొదటి సంఘర్షణము లేక యుద్ధముల స్మృతి ఏదియును చేయబడకుండెనని స్పష్టమగుచున్నది.

## 8.6 మహర్షి దయానందుని లేఖ

వాస్తవమేమనగా; ఆర్యుల మరియు దస్యులు, లేక దాసుల మధ్య ఎలాంటి యుద్ధములు జరుగలేదు. ఆర్యులెక్కడో బయటనుండి వచ్చినవారు కానేకారు. వారు ఈ దేశమునందు మూల(ఆది) నివాసులు టిబ్బతు

(త్రివిష్టపము) నుండి వచ్చి ఇచ్చటనే స్థిరపడినారు. మహర్షి దయానందులు సత్యార్థ ప్రకాశము నందిట్లు వ్రాసినారు.

ప్రశ్న :- మొదట నీ దేశము (ఆర్యావర్తనము)న కేమి పేరుండెను. ఇందెవరు నివసించుచుండిరి?

**ఉత్తరము :-** ఇంతకు పూర్వ మీ దేశము పేరేమియు లేకుండెను. ఆర్యుల కన్న పూర్వ మిచ్చట ఎవ్వరును నివసించకుండిరి. ఆర్యులు సృష్ట్యాదినుండి కొంతకాలము తరువాత త్రివిష్టపము నుండి నేరుగా ఈ దేశమునకే వచ్చి స్థిరపడినారు.

ప్రశ్న :- కొందరి కథనమును బట్టి వీరు ఈరాన్ నుండి వచ్చినారు. కావుననే వీరి పేరు 'ఆర్య' అని ఏర్పడినది. వీరికన్న పూర్వ మిచ్చట ఆటవిక జాతివా రుండిరి? వారిని అసురులు, లేక రాక్షసులని యనుచుండిరి. ఆర్యులు తమ్ము తాము 'దేవత' లమని చెప్పుకొనుచుండిరి, వారితో యుద్ధము జరిగినది. దానినే దేవాసుర సంగ్రామ మనినారు గదా?

**ఉత్తరము :-** ఇది సంపూర్ణముగా అబద్ధమైయున్నది.

**విజానీహ్యార్యాన్ యే చ దస్యవో బర్హిష్మతే రన్ధయా శాసదవ్రతాన్ ॥ ఋ.౧-౫౧-౮॥**

**ఉతశూద్రే ఉతార్యే................................... ॥ అథర్వ. ౧౯-౬౨-౧॥**

ఆర్యులనగా, ధార్మికులు, విద్వాంసులు, ఆప్త పురుషులు మున్నగువారు. ఇందుకు విరుద్ధముగా దస్యులు, దుష్టులు, అధార్మికులు, అవిద్వాంసులు, చోరులు, బందిపోటులు మున్నగువారు. వేదములిట్లు చెప్పుచున్నప్పుడు విదేశీయుల కపోల కల్పితములను బుద్ధిమంతులగువా రెవ్వరును విశ్వసించరు. అని ఇంతకు పూర్వమే చెప్పినాము.

-ఢిల్లీ సార్వ దేశిక సభ ప్రచురణ, సంస్క. ౧- సత్యార్థప్రకాశము. సము.౮. పు.౨౨౮॥

## 8.7 శ్రీ అరవిందయోగి గారి మహత్వ పూర్ణ లేఖ

ఈ విషయములో పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయముల కన్న ముందు మన జగద్విఖ్యాతులగు శ్రీ అరవిందయోగి గారి 'వేద రహస్యము' మొదటి భాగము (ఆచార్య అభయదేవుద్వారా అనువదింపబడినది) లోని 'అంధకార పుత్రులు' అ.౨౫. మరియు 'దస్యులపై విజయము' 3-23 నుండి కొన్ని ఉదాహరణముల నిచ్చుట ఉచిత మనుకొన్నాము. ఇందువల్ల ఈ వివాదాస్పద విషయముపై చక్కని వెలుగు ప్రసరించ గలదు. ఇంతేగాక ఆర్యవర్ణము దస్య వర్ణము మున్నగు శబ్దముల స్పష్టీకరణము అగును. శ్రీ అరవిందుల వారు అనేక వేద మంత్రముల ఆధ్యాత్మిక, హృదయానందకర వ్యాఖ్యానమొనర్చుచు ఇట్లు వ్రాసినారు.

'ఒక్కసారిగాదు మేమనేక సార్లు చూచియున్నాము. అనగా; అంగిరసుల, ఇంద్ర, సరమల కథయందు పణుల గుహ నుండి ఉషా, సూర్య, మరియు గోవుల విజయపుగాథ యొక్క అర్థము ఆక్రాంతులగు ఆర్యుల, మరియు గుహానివాసులగు ద్రవిడుల మధ్య జరిగిన రాజనైతిక, లేక సైనిక సంఘర్షణ వర్ణనయని తలచుట గొప్ప పొరపాటేయగును. అది ప్రకాశాన్వేషకుల, మరియు అంధకార శక్తుల మధ్య జరిగిన సంఘర్షణమే. ఈ రూపమున పణులను అంధకార శక్తులు, దస్యులు, పవిత్ర వేదవాణిని ద్వేషించువారు, హవిస్సులను, సోమరసమును దేవతల కర్పించనివారు, గోవులు, అశ్వములు మున్నగు సంపదలన్నియు తమవేయని తలచువారు, వానిని ద్రష్టల (ఋషుల)

గు వారికి ఈయనివారు, యజ్ఞములనొనర్చనివా రని అంగీకరించవచ్చును. ఋగ్వేదమునందు ఎచ్చట **యుద్ధముల విషయము వర్ణన వచ్చినను అది భౌతికయుద్ధము లేక కొల్లగొట్టుట వంటిదిగాదు. అది ఆధ్యాత్మిక సంఘర్షణము, ఆధ్యాత్మిక విజయమే యనుట నిశ్చయము.** - వేద రహస్యము పు.30౮,30౯

ఈ దస్యుల సామాన్య స్వరూపమును జూపునట్టి ఋ.౫-౧౪-౪ మంత్రమిట్లున్నది.

**అగ్నిర్జాతో అరోచత ఘ్నన్ దస్యూన్ జ్యోతిషా తమః। అవిన్దద్ గా అపః స్వః॥ ఋ.౫-౧౪-౪।**

అగ్ని పుట్టి ప్రకాశించినది. జ్యోతి నుండి దస్యులను, అంధకారమును హనన మొనర్చుచు ఆయన గోవులను, జలమును, స్వః ను పొందినవాడు... ఏలన; సమరమంతయును ప్రకాశాంధకారముల మధ్య, సత్యాసత్యముల మధ్య దివ్యమాయా, అదివ్యమాయల మధ్య యనవలెను. కావున దస్యులన నిచ్చట అంధకారమనియే ఎంచబడినది. మరియు నీయగ్ని ఉత్పన్నమై ప్రకాశించునప్పుడే జ్యోతి యుత్పన్నమగును. దీని ద్వారా నాతడు దస్యులను అంధకారమును నాశమొనర్చును. ఐతిహాసిక వ్యాఖ్య ఇచ్చట ఏ మాత్రము పనికిరాదు. - వేద రహస్యము పు. 3౧౦

నాయభిప్రాయమున సత్యప్రకాశమున ఆర్య జ్యోతి యొక్క ప్రకాశమే ఆర్య వర్ణము, అనగా ఆర్యవర్ణము 'జ్యోతిరగ్రాః' అనగా జ్ఞానము యొక్క ప్రకాశము, అజ్ఞానమను రాత్రి యొక్క నలుపు పణుల వర్ణమే దాసవర్ణము. బహుశః ఈ విధముగా వర్ణముల అర్థము తెలియును. ఏలన వర్ణము స్వభావమును ప్రకటించును. ఇది ప్రాచీనార్యులందు ఒక ప్రచలిత ఆలోచనమై యుండెను. తరువాత కాలములో ఈ వేర్వేరు వర్ణము (రంగు)లు అనగా; తెల్లని, నల్లని, పచ్చని, ఎఱ్ఱని ఈ నాలుగు వర్ణముల భేదము నొనర్చుట వ్యవహారము నకు వచ్చినదని నాకు తోచుచున్నది. ( - పు.3౧౧.)

ఈ దస్యు, అనృత, అజ్ఞాన మను కుటిల శక్తులు పణియొక్క దుష్ట శక్తులే. ఇవి తమ మిథ్యా జ్ఞానము, మిథ్యాబలము, మరియు మిథ్యా సంకల్ప కర్మలను దేవతల, లేక ఆర్యుల సత్య జ్ఞానము, సత్యబలము, సత్యసంకల్పము మరియు కర్మల విరోధమున దగిలిపోవును. ప్రకాశము విజయమను భావము మిథ్యాజ్ఞానము, లేక దానవీయ జ్ఞానముపై సత్యము యొక్క దివ్య జ్ఞానము యొక్క విజయమే. ( - పు. 3౧౭)

### ౮.౮ ప్రిన్సిపల్ శ్రీనివాస అయ్యంగారి లేఖ

ప్రిన్సిపల్ పి.టి. శ్రీనివాస అయ్యంగారు ఒక సుప్రసిద్ధ దాక్షిణాత్య విద్వాంసుడు. ఆయన *Dravidian Studies* అను పుస్తకమును వ్రాసినాడు. దానియందాయన ఆర్యుల, దస్యుల భేదములను జాతీయ భేదముగా నెంచక గుణ, కర్మ, స్వభావముల నాశ్రయించిన భేదములుగనే అంగీకరించినాడు. ఆయన ఇట్లు వ్రాసినాడు.

*The Aryas and Dasyus or Dasas are referred to not as indicating different races.... The words refer not to race but to cult....... The Dasyus are without rites, fireless, non-sacrificers without prayers, without riks, haters of prayers. Thus the difference between Aryas and Dasyus was not one of race but of cult.*

వేదాదులందు నిర్దేశింపబడిన ఆర్యులు, దస్యులనునవి వేర్వేరు జాతి భేదములను సూచించునవి గావు. కానియవి భిన్న క్రియారూపములను, మన్తవ్యములను, లేక సంస్కృతిని సూచించును. దస్యు అయజ్వా ( యజ్ఞము నొనర్చని) అకర్ములు, శ్రేష్ఠ కర్మల నొనర్చని వారు. ప్రార్థన నొనర్చనివారు, వేద రహితులు ( అబ్రహ్మ) ప్రార్థనలను ద్వేషించువారు ( బ్రహ్మద్విట్) మున్నగువారు. ఈ ప్రకారముగా ఈ ఆర్యుల మరియు దస్యుల భేదము జాతి భేదము గాక సాంస్కృతిక భేదమైయున్నది. దక్షిణ భారతము నందలి ఒక సుశిక్షిత విద్వాంసుని యీ లేఖ అత్యధిక మహత్త్వపూర్ణముగలది.

## 8.9 'శ్రీరామ చంద్ర దీక్షితార్' అను విద్వాంసుని అభిప్రాయము

మద్రాసు విశ్వ విద్యాలయపు శ్రీ. వి.ఆర్. రామచంద్ర దీక్షితార్ *M.A* అను పేరుగల దాక్షిణాత్య విద్వాంసుడు ౨౯,౩౦ నవంబర్ ౧౯౪౦న మదరాసు విశ్వవిద్యాలయములో మహత్త్వపూర్ణముగు రెండు వ్యాఖ్యానముల నిచ్చియుండెను. అవి ఎడియార్ గ్రంథాలయము ద్వారా ౧౯౪౭లో *Origin and spread of the Tamils* అను పేర పుస్తక రూపములో ముద్రణమైనవి. ఆయన తన వ్యాఖ్యానముల ద్వారా ఆర్యులు, దస్యులు, ద్రావిడులను జాతీయ భేద భావములను ఖండించినాడు. ఆయన ఇట్లు వ్రాసినాడు.

*The fact is that the Dasyus were not non-Aryans. The theory that the Daysus. Dravidians inhabited the Panjab and the Ganges Valley at time of the so-called Aryan invasion of India, and overcome by the latter, they fled to South India and Adopted it as their home can not stand. To say that all India was a wild country once, and that it was civilised by the invading Dravidians first and by the invading Aryans, next cannot carry conviction home.............. P.12*

In the same way we have to look upon the theory of a Dravidian race. If the Aryan race theory is a myth, the theory of the Dravidian race is a greater myth. The word Dravida is the name for the speakers of a group of South Indian Languages. Tamil, Malayalam, Kanarese and Telugu. -(Origin and Spread of the Tamils) by V.R. Rama Chandra Dikshitar, M.A. P.14

వాస్తవమేమన; జాతీయ భేద దృష్టిచే దస్యులు అనార్యులుగారు. దస్యులు, ద్రావిడులు పంజాబు, మరియు గంగారేవు ప్రాంతములో నుండిరను ఒక వాదముండెను. ''ఆర్యులు భారతదేశముపై ఆక్రమణ మొనర్చినప్పుడు వీరు ఆర్యులచే పరాజయమునొంది దక్షిణ భారతప్రాంతములకు పారిపోయినారు. అచ్చటనే స్థిరపడినారు'' అను వాదము ప్రామాణికమైనది గాదు. భారతమంతయు భయంకర అటవీప్రాంతముగా నుండెను. దీనిని మొదటి ఆక్రాంతులు ద్రావిడులు రెండవతడవ ఆక్రమణమొనర్చిన ఆర్యులు సభ్యతగా నొనర్చినారను అపవాదము కూడా విశ్వసనీయమైనదిగాదు.

ఆర్య జాతి వలె ద్రావిడ జాతి వాదమును కూడా మేము పరీక్షించదలచినాము. ఒకవేళ ఆర్యజాతి వాదము కల్పితమగుచో ద్రావిడ జాతివాదము దానికన్న అధిక కల్పితము. ద్రావిడులను శబ్దము తమిళము, మళయాలము, కన్నడము మరియు తెలుగు అనునవి దక్షిణ భారతీయ భాషావర్గీయుల వ్యావహారిక నామములైయున్నవి.

## 8.10 కొందరు పాశ్చాత్య విద్వాంసుల సాక్ష్యములు

**మ్యూర్ :-** పాశ్చాత్య విద్వాంసులలో ఆర్య, దస్యు, ద్రవిడ మున్నగు విషయములను సంగ్రహించినవారు చాలవరకు వ్రాసినారు. అందు 'మ్యూర్' అను మహోదయుని నామము ప్రసిద్ధమైనది. వారు *Original Sanskrit Texts Vol. II. P.387* లో స్పష్టముగా ఇట్లు వ్రాసినారు.

*I have gone over the name of Dasyus or Asuras mentioned in the RigVeda with the view of discovering whether any of them could be regarded as of non Aryan or indigenous origin but I have not observed that appear to be of this character. - Original Sanskrit Texts vol. II. P.387*

ఋగ్వేదములో వచ్చిన పేర్లనుండి ఎవరైనా అనార్యులు గాని, మూలనివాసుల ఉత్పత్తిని గూర్చిగాని తెలిసికొనవచ్చునేమో నేను చాల వరకు ప్రయత్నించినాను, కాని అట్టిదేదియును నాకు చిక్కలేదు.

## 8.11 ప్రొ. మైక్స్‌మూలర్ అభిప్రాయము

సుప్రసిద్ధ పాశ్చాత్య విద్వాంసుడగు ప్రొ. మైక్స్‌మూలర్ దస్యుల విషయమున ఇట్లు వ్రాసినాడు.

*Dasyu simply means enemy, for instance when Indra is praised because he destroyed the Dasyu and protected the Aryan colour.*

'దస్యు' అను పదమునకు ఆ వాక్యమునునుసరించి ఇంద్రుని శత్రువులు కావుననే దస్యులను నాశమొనర్చి ఆర్య వర్ణము వారిని రక్షించెనను ప్రశంసగలదు. మరొక స్థానమున యాతుధానుడు మరియు రాక్షసుల విషయములో ఇట్లు వ్రాసినాడు.

*They (the epithets) are too general to allow us the inference of any ethnological conclusions.*

అనగా; పై రెండు శబ్దములు ( రాక్షసులు, యాతుధానులు) అతిసాధారణమైనవి. మరియు వానిచే ఎట్టి మనుష్యుల జాతీయ భేదమునకు సంబంధించిన పరిణామము లభించదు.

ఆర్య జాతి లేక *Aryan Race* వాదము చాల వరకు ప్రొ.మైక్స్‌మూలర్ నడిపినదే. కాని ఆయన తన జీవిత అంతిమ కాలములో క్రీ.శ. ౧౮౮౮లో ఇట్లు వ్రాసినాడు.

*I have declared again and again that if I say Aryan I mean neither blood nor bones, nor hair nor skull, I mean simply those who speak an Aryan Language... To me an*

*ethnologist who speaks of Aryan race, Aryan blood, Aryan eyes and hair, is as great a sinner as a linguist who speaks of a dolichocephalic dictionary of a brachycephalic grammar. (- Biographies of words and House of the Aryans. London 1888 P. 120.)*

ఈ వాక్యముల ద్వారా ప్రొ. మైక్స్ మూలర్ ఆర్యజాతి ఒక ప్రత్యేక జాతిరూపముగలదను సాక్షిని నిరాకరించినారు. ఎవరైన ఇట్లనిన వారు పాపమొనర్చినవారేయగుదురన్నారు. ఆర్యులనగా వారి యుద్దేశ్యములో ఆర్య భాష మాట్లాడువారే నని భావము.

### 8.12 ప్రొ.రౌథ్

సుప్రసిద్ధ సంస్కృత కోశము (నిఘంటువు)ను జర్మన్ భాషలో నిర్మించిన ప్రొ. రౌథ్ అనునాతడిట్లు వ్రాసియున్నాడు.

*It is but seldom, if at all, that the explanation of Dasyu as referring to the Non-Aryans, the barbarians is advisable,*

అనగా; ఎచ్చటనైన దస్యువునకు అర్థము అనార్యులు - అనాగరికులని చెప్పుకొను స్థలములేవైన యున్నవనిన అవి చాలా తక్కువగానే యుండవచ్చును.

### 8.13 నైస్‌ఫీల్డు అభిప్రాయము

నైస్ ఫీల్డు అను పేరు గల విద్వాంసుడు *Brief View of the Caste System of the North West Provinces and Oudh* అను తన పుస్తకమున స్పష్టముగా నిట్లు వ్రాసినాడు.

*There is no division of the people as the Aryan conquerors of India and the aborigines of the country, that division is modern and that there is essential unity of the Indian races. The great majority of the Brahmins are not of lighter complexion or of finer or better red features than any other caste or distinct in race and blood from the scavangers who swept the roads. (Brief View of the Caste System of the North West provinces and Oudh by Nesfield P. 27)*

అనగా; భారతీయులందు ఆర్యవిజేత మరియు మూల నివాసుల వంటి విభాగములు లేకుండెను. ఈ విభాగములు పూర్తిగా ఆధునికమే. ఇచ్చట సమస్త భారతీయ జాతులలో ఐకమత్యము గలదు. కొందరు బ్రాహ్మణులలో రూపవర్ణములు ఇతర జాతుల వారి కన్న చక్కగాను సుందరముగా నుండినను, జాతి మరియు రక్త దృష్టిలో రోడ్లను శుభ్రపరచు పాకీవారలకు పూర్తిగా భిన్నమైయున్నట్లెచ్చటను భేదభావము గాన్పించదు.

ఇట్లే ఇతర పాశ్చాత్య విద్వాంసుల ప్రమాణములనెన్నియో ఈ ఆర్య అనార్యుల జాతీయ భేదముల ఖండన రూపములో నీయవచ్చును.

### 8.14 మనుస్మృతిలో ద్రవిడులు మున్నగు విషయక వర్ణనము

మనుస్మృతిలో ఆంధ్ర, చౌళ, ద్రవిడ, కాంభోజ, యవన, ఖశ, చీనా మున్నగు క్షత్రియకులోత్పన్నుల ఉల్లేఖనము లభించుచున్నది. ఐనను; క్రమ క్రమముగా బ్రాహ్మణుల సంపర్కమును, వైదిక క్రియలును లోపించుటచే వారు క్షుద్రత్వము, లేక నీచత్వము పాలైనారు.

**శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రియజాతయః ।**

**వృషలత్వం గతా లోకే, బ్రాహ్మణాదర్శనేన చ ॥ మను. అ.౧౦.౪౩ ॥**

**పౌండ్రకాశ్చౌడ్రద్రవిడాః కాంబోజా యవనాః శకాః ॥**

**పారదా పహ్లవాశ్చీనాః కిరాతా దరదాః ఖశాః ॥ మనుస్మృతి ౧౦-౪౪॥**

కుల్లూక భాష్యమునందు మొదటి శ్లోకార్థమున 'ఇమా వక్ష్యమాణాః క్షత్రియజాతయః ( క్రియాలోపాత్) ఉపనయనాదిక్రియాలోపేన బ్రాహ్మణానాం చ యాజనాధ్యాపనప్రాయశ్చిత్తాద్యర్థదర్శనాభావేన శనైః శనైర్లోకే శూద్రతాం ప్రాప్తాః ॥'

ఇందువల్ల కూడా ఆర్యులు, మరియు ద్రావిడులు మున్నగు వారి భేదము జాతీయ భేదముగాక కేవలము సాంస్కృతిక భేద సూచితమనియే తెలియుచున్నది. దీనివల్ల వేద ప్రచార శిక్షా ప్రసారములకు దూరముగా నుంచబడవచ్చును.

### 8.15 ఆర్యుల - ద్రవిడుల భాషలు

అనేకుల యభిమతానుసారము సామూహిక రూపములో దక్షిణ భారత భాషల నన్నిటిని ద్రావిడభాషలని యందురు. వీనియందు ముఖ్యముగా తమిళము, కన్నడము, మళయాలము, మరియు తెలుగు గణించబడుచున్నవి. సంస్కృతముతో నెట్టి సంబంధములేదు. ఇవి సంస్కృతము నుండి పూర్తిగా స్వతంత్ర భాషలు. ఈ విషయమునే అనేక పాశ్చాత్య లేఖకులు కూడా విశేష రూపవములో రాజనైతికవముగా స్వార్థసిద్ధి కొరకు ప్రసార ప్రోత్సాహములనొనర్చినారు. వాస్తవమున ఈ విషయము సత్యముగాదు. ఉత్తర, దక్షిణ భారతవాసుల, ఆర్యుల, ద్రవిడుల, అనగా బ్రాహ్మణ మరియు బ్రాహ్మణేతరులలో పరస్పరము విరోధవము, విద్వేష భావము ఉత్పన్నమొనర్చుటకొరకు వారిలో అనేకులు ఇట్టి అసంగత (పొంతనలేని) ఆలోచనలను పుస్తకముల ద్వారా ప్రచారమొనర్చినారు. దీనిని వినిన పిదప పక్షపాతరహితులగు విద్వాంసులకు నవ్వురాక మానదు. ఉదాహరణమునకు డా. టేలర్ *(Dr. Taylor)* అను పాశ్చాత్య విద్వాంసుని ఉద్దేశ్యమును చూపుచు 'తాంబీపిళ్ళే' అను దాక్షిణాత్య విద్వాంసుడు *Tamilian Antiquary Vol. II. No.2* లోని *'Origin of the word 'Arya'* లో ఇట్లు వ్రాసినాడు.

***It was proved years ago by Dr. Taylor that a Tamiloid Language now represented by its most cultivated branch in the South, constituted the original staple of all the languages of India. The existence of a Tamilian substratum in all the modern dialects of India and of the profound influence, which the classical Tamil has exercised on the formation and***

*development of both the Vedic and Classical Sanskrit, is gradually coming to be recognised by students of Indian Philology.*

- Origin of the word Arya by Tamby Pillai, Tamilian Antiquary Vol. II. No.2

అనగా; కొన్ని సంవత్సరములకు పూర్వము డా. టేలర్ అనునాతడు తామిలాయడ్ భాష ( దక్షిణ భారత భాషలన్నిటిలో ఈ తమిళ భాషయే వికసితమైయుండి ప్రతినిధిగానుండెను) భారతీయ భాషలన్నిటికి మూలభాషయై యుండెను. భారతీయ భాషా శాస్త్ర విద్యార్థులు క్రమక్రమముగా ఈ విషయమును గ్రహింపసాగినారు. భారతీయ భాషలన్నిటికి తమిళమే మూలాధారము. ఇదియే వైదిక, మరియు లౌకిక సంస్కృత నిర్మాణము మరియు వికాసమును విశేష రూపమున ప్రభావితమొనర్చినది. ఇట్టి అభిప్రాయములోనే డా. గుండర్ట్ *(Dr. Gundert)* మరియు ఇతర పాశ్చాత్య విద్వాంసులు కూడా ఉన్నారు. వీరియందు 'రాయిస్ డేవిడ్స్' అనునాతని పేరుండుట మాకత్యంతాశ్చర్యము గలుగుచున్నది. ఆ ప్రొ. రాయిస్ డేవిడ్స్ అభిప్రాయమును దెలుపుచు "*The Ancient Dravidians*" లేఖకుడగు శ్రీ శేష అయ్యంగార్ ఎమ్ ఏ ఇట్లు వ్రాసినాడు

*Prof. Rhys Davids in his Buddhist India commenting on the evolution of the Aryan languages of India maintains that the Veidc Sanskrit is largely mixed up with primitive Dravidian. (- Buddhiist India. P.156)*

*- The Ancient Dravidians by T.R.Shesha Iyanger M.A. P.43*

అనగా; ప్రొ. రాయిస్ డేవిడ్స్ ఆర్య భాషల వికాసముపై టిప్పణ మొనర్చుచు 'వైదిక సంస్కృతమందు మూల ద్రవిడ భాషయొక్క మిశ్రణ మధికముగా నున్నదని వ్రాసినాడు.

ఈ విధమగు అభిప్రాయములను మేము సంపూర్ణముగా అశుద్ధము, అసంగతమని యెంచుదుము. బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, పంజాబీ, పాలీ మున్నగు అనేక భాషలలో అత్యధిక సంస్కృత శబ్దము లున్నవి. ఆ పదములను ప్రక్కకు దీసివేసిన ఇక నా భాషల అస్తిత్వమే శూన్యమై పోవును. ఈ భాషలన్నిటిపై సంస్కృతమునకు మాతృస్థానము గలదు. ద్రవిడ భాషలకు తమిళ భాషయే మూలమని వ్రాయుట తలతిక్కతనము కన్న మరేమియు గాదు. 'మా రాష్ట్ర భాష మరియు లిపి' అను మా పుస్తకము ( సార్వదేశిక సభా కార్యాలయము, బలిదాన భవనము ఢిల్లీ వారి నుండి పొందవచ్చును. ) లో బంగాలీ, మరాఠీ, గుజరాతీ, పంజాబీ, మార్వాడీ, ఉడియా, అసామీ మున్నగు భాషలలో 'సంస్కృతము భాష లన్నిటి జనని' అని తెలిపియుంటిమి. చూడదలచిన వారు చూడవచ్చును. కాని ఈ విషయ మిచ్చుట ఇంతకన్న అధికముగా దెలుపు అవసర మనిపించదు. మేము దక్షిణ భారతములో ౨౦ సంవత్సరము లుండుట జరిగినది. దక్షిణ భారత భాషలలో సంస్కృతమున కెట్టి సంబంధము గలదో ఉదాహరణ సహితముగా చూపదలచినాము.

### 8.16 కన్నడము - సంస్కృతము

ఇచ్చట నేను మొట్ట మొదట కన్నడ లేక కర్ణాటక భాషా విషయమే వ్రాయుదును. నేను కర్ణాటక ప్రాంతమందు అనేక చోటులందు నివసించుచు అచ్చట కన్నడమును వ్రాయుట, చదువుట, మాట్లాడుటను గూర్చి చాలవరకు

అధ్యయన మొనర్చినాను. ఇంతేకాక 'వేద సందేశము' అనునొక మాసపత్రికకు నే ననేక సంవత్సరములు సంపాదకునిగా నుంటిని. ఈ పుస్తకము వ్రాయునపుడు ఈ భాషకు సంబంధించిన ఒక పుస్తకము నా వద్ద నున్నది. దీని నుండి ఒక్క ఉదాహరణమిచ్చుట చాలు ననుకుందును. ఇది ఉత్తరాది మఠస్వామి శ్రీ సత్యధ్యాన తీర్థ గారి విరచితము. దీనిపేరు 'అద్వైత వాద విచారము' దీనియందిట్లు వ్రాయబడినది.

'ఈ జగత్తినల్లి సర్వదా సుఖవే నమగాగలి దుఃఖవు స్వల్పవాదరూ బెడెన్న సర్వరిన్దలూ ప్రార్థ్యమానవాద సుఖవు జీవన స్వరూపవాగిద్దరూ అదరవేలే ప్రకృతి రూపవాద బన్ధ (ఆవరణ) ఇరువదరిన్ద అనుభవక్కే బారదే జీవరు ఓన్దోన్దు జన్మదల్లి అనేక జన్మాపాదక కర్మగళన్నూ మాడుత్త ఆ కర్మగళిన్ద సమ్పాదిత దేహానుభవద కాలదల్లి నానావిధ దుఃఖవన్ను అనుభవిసువ జీవర దుఃఖనివృత్తి గోస్కర శ్రవణ,మనన నిధి ధ్యాసనాది సాధన గళన్ను ఉపదేశిసువ వేదఘల్ ఉపదేశానుసారవాగి భగవదర్పణ బుద్ధియిన్ద సదాచార గళన్ను మాడి అన్తఃకరణ శుద్ధియంను హోన్ది పరమాత్మన గుణగళన్ను శ్రవణమాడి ఆ విషయదల్లి అనేకవాదిగళ్ వివాదమూలక బరువ సందేహదనివృత్తియాగువదర సలువాగి 'బ్రహ్మమీమాంసా' శాస్త్రోక్త ప్రకారవిచారదిన్ద తత్వ నిశ్చయమాడికొణ్డు ఆమేలే పరమాత్మన శాస్త్రోక్త గుణగళ ధ్యానవన్ను మాడి ఆతన అపరోక్షవన్ను హోన్ది తన్నల్లియూ తన్నవరల్లియూ ఇరువ స్నేహద అనేక పాలు హేచ్చాగియూ యేష్టు ప్రతిబన్ధకగళు బన్దరూ కడిమి యాగదిరువ పరమాత్మన మహాత్మ్య జ్ఞానపూర్వకవాద స్నేహ రూపవాద భక్తియన్ను మాడి ఆ పరమాత్మన ప్రసాదవన్ను దొరకిసి ఆ ప్రసాదదిన్ద ఆవరకవాద బన్ధనివృత్తియాద మేలే వైకుంఠాదిస్థానగళల్లి భగవద్గుణగళన్ను గానమాడుత్త పరమాత్మన దర్శన సుఖవన్ను హోన్దుత్త పరమాత్మన దాసనాగి సేవేయన్ను మాడుత్తా నానావిధాహార విహార గళన్ను మాడుత్తా జీవను అక్షయ్య సుఖవన్ననుభవిస తక్కదేన్దు శ్రీ శ్రీ గళవరు ఉపదేశవన్ను మాడిదరు'' -(అద్వైతమత విచార. పు.2-3)

ఈ సందర్భ గ్రంథము విస్తారమగునను భయముచే అర్థమునిచ్చుట మాకు అనావశ్యక మనిపించినది. ఐనను క్లుప్తముగా పరిచయ మొనర్తుము. ఈ కొద్ది వాక్యములందు జగత్, సర్వదా, సుఖ, దుఃఖ, స్వల్ప, జీవ,స్వరూప, ప్రకృతి రూప, బన్ధ, ఆవరణ, అనుభవ, అనేక జన్మాపాదక కర్మ, సమ్పాదిత, దేహానుభవ, కాల, నానావిధ, నివృత్తి, శ్రవణ, మనన, నిదిధ్యాసన, ఉపదేశానుసార, భగవదర్పణ బుద్ధి,సదాచార, అన్తఃకరణ శుద్ధి, విషయ,వాదీ, వివాదమూలక, సన్దేహ, శాస్త్రోక్త ప్రకార, విచార, తత్త్వ నిశ్చయ, ధ్యాన, అపరోక్ష, స్నేహ, ప్రతిబన్ధక, మహాత్మ్య జ్ఞానపూర్వక, భక్తి, ప్రసాద, ఆవరక, స్థాన, గాన, దర్శన, సుఖ, దాస, ఆహార, విహార, అక్షయ్య' అను శుద్ధ సంస్కృత శబ్దములు అత్యధికముగా గలవు. ఇదే విధముగా కర్ణాటక భాష లేక కన్నడమందలి సర్వ గ్రంథములందును ౭౫ నుండి ౭౦ శాతము సంస్కృత తత్సమములు, మరియు తద్భవ శబ్దములుండును. కన్నడ భాషావేత్త లెల్లరును ఈ విషయము నెరుగుదురు. ఈ నిష్పత్తి 'సంస్కృత పుత్రి' యనబడు హిందీ భాషకన్న తక్కువేమి గాదు. ఇట్టి భాష విషయములో దానికి సంస్కృతముతో ఏ విధమగు సంబంధము లేదని యనుట ఎంత అసత్యమో ప్రత్యేకముగా చెప్ప అవసరము లేదు.

## 8.17 తెలుగు - సంస్కృతము

ఇప్పుడు మేము తెలుగు భాషకు సంస్కృతముతో ఏమైనా సంబంధమున్నదా, లేదా? యను విషయమును ప్రమాణ పూర్వకముగా చూపుటకు ప్రయత్నింతుము. దిగువ కొన్ని తెలుగు (ఆంధ్ర భాష) పద్యములనిచ్చుచున్నాను. చూడుడు.

ఒక సుప్రసిద్ధ సంస్కృత శ్లోకమునకు తెలుగు అనువాదమిట్లున్నది చూడుడు.

**దానము, భోగము నాశము పూనికతో మూడు గతులు భువి ధనమునకున్ ।**

**దానము భోగము నెరుగని దీనుని ధనమునకు గతి తృతీయమె పొసగున్ ॥**

ఇది దిగువ చూపబడు భర్తృహరి శ్లోకమునకు తెలుగు అనువాదము. ఈ తెలుగునకు సంస్కృత సంబంధ శ్లోకమునకెంతటి సంబంధముగలదో చూపబడుచున్నది.

**దానం భోగో నాశః త్రిస్రో గతయో భవన్తి విత్తస్య ।**

**యో న దదాతి న భుంక్తే, తస్య తృతీయా గతిర్భవతి ॥**

ఈ పద్యమునందు దాన, భోగ, నాశ, ధన, భువి, గతి, తృతీయ అను నీశబ్దములన్నియు శుద్ధ సంస్కృతమునకు చెందియున్నవని ప్రత్యేకముగా వ్రాయనవసరము లేదు.

ఈ గ్రంథమును వ్రాయునప్పుడు నాచేతిలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు వారు ప్రచురించిన 'తెలుగు స్వయం శిక్షక్' అను పుస్తకము గలదు. దానినుండి తీసిన దిగువ కొన్ని శబ్దములను పాఠకుల అవలోకనార్థ మిచ్చుట వ్రాయుచున్నాను.

ప్రతి దినము మనము వ్యవహరించు భోజనము, అన్నము, నీరు, త్వరగా, శీఘ్రముగా, ఆకాశము, స్వచ్ఛము, స్నేహితుడు, సరళము, భాష, మూర్ఖుడు, ఆనందముగా, సిద్ధముగా, జన్మభూమి, దూరము, వర్తకుడు, దాహముగా, శిష్యులు, మంచి, భార్య, సోమరి, శుభ్రము, స్నానము, దేశము, భర్త, పుస్తకము, కొంచెము, పద్యము, శాంతము, దీపము, క్షమింపుడు, అధికము, సౌఖ్యముగా, సరసము, ముఖ్యము, ఫలము, సముద్రము, మేఘము, జనము, వధువు, వరుడు, గురువు, వస్తువు, చరిత్రము, పిత, మాత, నాయకుడు, నాయిక, జనని, వనము, కవి, సూర్యుడు, నక్షత్రములు, రాత్రి, పాఠశాల, పక్షి, ఉరము, తపస్సు, మహిమము, జాము, వజ్రము, ప్రకారము, సహాయము, ఆహ్వానము, కుక్క, కాకి, అడవి, అటవి, సింహము, ఉత్తరీయము, చీర, శొంఠి, సైంధవ లవణము, ధాన్యము, ఫలాహారము, కమలాఫలము, ద్రాక్ష పండు, దానిమ్మ పండు, కంచు మున్నగు సంస్కృత శబ్దములు ఇంత అధికముగానుండునప్పుడు ద్రవిడ భాషయగు కారణమున అది సంపూర్ణముగా స్వతంత్రమే నని తెలుపుట ఎంత అసత్యమో చూడుడు. ఉత్తర భారతములో నుండు పండితు లెల్లరును ఈ భాషల నెరుగని కారణమున సంపూర్ణముగా అసత్య మగు నీవచనములను జూచి ఆ ద్రవిడ భాషలకు సంస్కృతముతో ఎట్టి సంబంధము లేదని విశ్వసింతురు.

### 8.18 మళయాలము - సంస్కృతము

మళయాల భాషలో సంస్కృత శబ్దములు తెలుగు మరియు కన్నడము కన్న అధికముగా నున్నవి. నేను దక్షిణ భారతములో చాలకాలము వరకుండుట, మరియు మలబార్, ట్రావెంకూర్ మున్నగు ప్రదేశముల యాత్రనొనర్చు అవకాశము లభించినందువల్ల ఆ ప్రాంతమువారు సంభాషించుకొను భాషయందు అత్యధికముగా సంస్కృత పదములుండుట జూచి నాకు అధిక సంతోషము గలిగినది. కొందరు ఈ మా దక్షిణ భారత భాషలకు సంస్కృతముతో సంబంధమేమియును లేదని చెప్పుట విని ఆశ్చర్యమును గలిగినది. మళయాలమహాకవి 'వల్లాథోల్ ' గారి కవిత (పద్యము) ను చూడుడు.

**గీతక్కు మాతావాయ భూమియే ధృఢమితు మతిరియోహ కర్మయోగియేప్రసవిక్కూ ।**

**హిమవద్ విన్ధ్యాచల మధ్యదేశత్తే కాణూ శమమే శీలచ్చే సువితమ్ సింహత్తినే ॥**

**గంగపారోలుకున్న నాహిలే శరిక్క్రిత మంగలమ్ కాయ కుమ్ కల్పపాదప ముణ్టాయూస్న నమస్తే గతతర్ష ।**

**నమస్తే దురాధర్ష నమస్తే ।**

**సుమహాత్మన్ । నమస్తే జగద్గురో ॥'**

ఈ చిన్న పద్యమునందు గీత, భూమి, మతి, కర్మయోగి, ప్రసవ, హిమవద్, విన్ధ్యాచల, మధ్యదేశ, శమ, శీల, సింహ, మంగలమ్, గతవర్ష, దురాధర్ష, సుమహాత్మన్, నమస్తే, జగద్గురు మున్నగు శుద్ధ సంస్కృత శబ్దములు గలవు. తద్భవ శబ్దములైతే లెక్కలేనన్ని గలవు. ఒకప్పుడు భారతీయ లోక సభ (పార్లియమెంటు) కు ఉపాధ్యక్షుడుగానున్న సుప్రసిద్ధ దాక్షిణాత్య విద్వాంసుడగు శ్రీయుతులు అనంతశయనం అయ్యంగారు ౧౯౫౩ డిసెబర్ ౧౧వ తేదీలో ఢిల్లీ విశ్వ విద్యాలయమునందు సంస్కృత పరిషత్తును ఉద్ఘాటన మొనర్చుచు ఎంత వాస్తవమును ప్రకటించియున్నారో చూడుడు.

*The Sanskrit was the fountain head of all Indian languages. All Indian languages were offshoots of Sanskrit. Bengali and Telugu had about 75 percent Sanskrit words, while Malayalam had about 90 percent. The only change was that the Sanskrit words had been absorbed with slight changes here and there. (Shri Anant Shayanam Iyangar's Speech as reported in the Hindustan Times, New Delhi 13-12-1953).*

అనగా; సంస్కృతము సమస్త భారతీయ భాషల ఆది స్రోతస్సు. భారతీయ భాషలన్నియును సంస్కృత బిడ్డలు. వంగ మరియు తెలుగులో దాదాపు ౭౫% సంస్కృత శబ్దములున్నవి. మలయాళ భాషయందు ౯౦% శాతము సంస్కృత శబ్దములు గలవు. కాని అచ్చటచ్చట సంస్కృత శబ్దములు కొంత మార్పుతో ఈ భాషలో చేర్చుకొనబడినవి. నేనచ్చట నున్నప్పుడు ౧-౫-౧౯౫౪ న ఢిల్లీ పబ్లిక్ గ్రంథాలయములో ఇంద్రప్రస్థీయ పరిషత్తు ఉత్సవములో వ్యాఖ్యానమొనర్చుచు శ్రీ అనంతశయనం అయ్యంగారిట్లన్నారు. 'తెలుగులో ౭౫%, కన్నడములో ౮౦%, మలయాళములో ౯౦%, తమిళములో ౫౦శాతము సంస్కృత శబ్దములు గలవు' అని

శ్రీ అనంత శయనం అయ్యంగార్ వంటి సుప్రసిద్ధ, నిష్పక్షపాత, దాక్షిణాత్య విద్వాంసుల యీ సాక్ష్యము అత్యంత మహత్త్వపూర్ణమైనది.

**8.19 తమిళము - సంస్కృతము**

ఇతర భాషలవలెనే తమిళ భాషకు సంస్కృతముతో గల సంబంధమును గురించి వ్రాయుచున్నాను. తమిళ భాషకు సంస్కృతముతో ఎట్టి సంబంధము లేదని తరచుగా యనబడుచున్నది. కాని ఇది నిజము గాదు. ఢిల్లీ సంస్కృత పరిషత్తులో శ్రీ అనంతశయనం అయ్యంగారు చేసిన వ్యాఖ్యానములో దక్షిణాది భాషలన్నిటికి సంస్కృతము స్రోతస్సు, మరియు ఈ భాషలన్నియు సంస్కృత మను మహావృక్షము యొక్క శాఖలు అని మనము పైన చూచినాము. తమిళ భాషకు సంస్కృతముతో గల సంబంధమును గూర్చి శ్రీ దొరైస్వామి అయ్యంగార్ అను విద్వాంసుడు 'ఢిల్లీ సార్వదేశిక్' మే నెల ౧౯౪౭లో ప్రకటించిన వ్యాసమును ఉదాహరించుట ఉచిత మనిపించుచున్నది. శ్రీ దొరైస్వామి అయ్యంగారి మాతృ భాష సైతము తమిళ భాషయే. ఈ వ్యాసమునందిట్లు గలదు.

మద్రాసు ప్రాంత తమిళ భాష ఒక సర్వతంత్ర స్వతంత్ర భాషయై యున్నదని దీనికి సంస్కృతముతో ఎట్టి సంబంధము లేదనియు యనుకొందురు. కాని యిదియును వాస్తవము గాదు. ఇందుకు ఉదాహరణము 'కంబ రామాయణము' నీయబడుచున్నది. కేవలము ఆధునిక తమిళ గ్రంథములందేగాక పురాతన తమిళ గ్రంథములందు తమిళ కావ్యములందును సంస్కృత శబ్దము లనేకములు యథాతథముగా కొన్ని అపభ్రంశరూపమున గ్రహింపబడియున్నవి. ఇంతేగాక తమిళుల సంభాషణలో సంస్కృత పదములు కుప్ప తెప్పలుగా నిండియున్నవి. సంస్కృతము లేకుండా ఏపనియు జరుగదు. కంబ రామాయణములో అనేక సంస్కృత పదములు అపభ్రంశరూపమున నిండియున్నవి. స్థాలీ పులాక న్యాయముగా, కావ్యపుష్టి కొరకు కొన్ని ఉదాహరణలీయబడుచున్నవి.

**'తిరుప్పావై'** అను పురాతన తమిళ శాస్త్రములో అనేక సంస్కృత శబ్దములు గాంచవచ్చును ఉదా:- నీరాహ ( స్నానమొనర్చుట, నీటి యందాడుకొను మున్నగునవి. 'నీరు' జలవాచక శబ్దము. ( నాలాం తిరువామ్ మొషి) తమిళవేద మనబడు దీనియందు అనేక శబ్దములు గలవు. నైట్టకలే దైవమనరులో దైవమనునది సంస్కృత శబ్దము. అంగంగిలాద పడి తంగు ప్రకాశమామ్ ఆనంద పూర్తి యహి లోని ప్రకాశ్, ఆనంద్, పూర్తి అనునవి శుద్ధ సంస్కృత పదములు, దైనిక వ్యవహార భాషలో **'జలమ్'** అను సంస్కృత శబ్దము తమిళవాడుకమునందున్నది. **'శకర్కరై'** అనునది సంస్కృత శర్కరా యను పదమునకు అపభ్రంశము **'ఆమ్'** ఔను అనునది సంస్కృత శబ్దమే.

ఈవిధముగా ఇంకా అనేక ఉదాహరణము లీయవచ్చును. తమిళ లిపియందు అక్షరములు తక్కువగానున్న కారణమున సంస్కృత శబ్దములను స్పష్టముగా వ్రాయలేము. కావుననే సంస్కృత ప్రకాశమునకై వేరే లిపి రూపు దాల్చినది. అది **'గ్రంథాక్షరమ్'** అను పేర ప్రసిద్ధమైనది. ఈ పేరులో గ్రంథ్, అక్షరము అను రెండు పదములు సంస్కృత శబ్దములే.

ఈ విధముగా తమిళ భాషయును సంస్కృత శబ్దములు లేకుండా నడవలేదు. తల్లి లేకుండా సంతానము ఉన్నతిబడయగలదా? బెంగుళూరు నగర ప్రేరణచే శ్రీ దొరైస్వామి అయ్యంగార్ లేఖ ఒకటి **'సార్వదేశిక్'** దెహిలీ మే నెల ౧౯౪౭ అంకములో ఒక తమిళ పుస్తకమును గూర్చి ఇట్లు వ్రాయబడియున్నది.

'శ్రీరామ మిథులిమ నగర చేంగూ శివధనుష్షై అతిశీఘ్ర బడైథు జనక పుత్రి సీతా దేవ్యై వివాహం ముద్నిదూం ప్రజైకల దమ్పతీకులై అతి సంతోష తుడన అజ్ఞి హోరం శైనదత్' ఈ వాక్యమునందు 'నగర, శివ ధనుష్, అతిశీఘ్ర, జనకపుత్రీ, వివాహ, ప్రజా, దమ్పతి, అతిసంతోష' మున్నగునవి శుద్ధ సంస్కృత శబ్దములు. ఈ పుస్తకమును వ్రాయునపుడు మద్రాసు దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు ముద్రింపజేసిన, మరియు శ్రీ ఎమ్. మహాలింగమ్ బి. ఏ .ద్వారా రచింపబడిన **'తమిళ స్వయం శిక్షక్'** అను పుస్తకము నా చేతిలో నున్నది. దాని నుండి దిగువ వ్రాయబడిన కొన్ని శబ్దములను పాఠకుల పరిశీలనార్థము ఇచ్చుట వ్రాయబడుచున్నది.

| తమిళము | సంస్కృతము | హిందీ |
|---|---|---|
| గ్రామము | గ్రామః | గాఁవు |
| వార్తై | వార్తా | బాత్ |
| పట్టణమ్ | పత్తనమ్ | శహర్ |
| శుద్ధమాన్ | శుద్ధమ్ | శుద్ధ్ |
| జలమ్ | జలమ్ | జల్ |
| దూరమ్ | దూరమ్ | దూర్ |
| పుస్తకమ్ | పుస్తకమ్ | పుస్తక్ |
| అదిహమ్ | అధికము | అధిక్ |
| పశు | పశు | పశు |
| మాత్రమ్ | మాత్రమ్ | కేవల్ |
| ఆమ్ ఆమ్ | ఆమ్ ఆమ్ | హాఁ |
| శీగ్రమ్ | శీఘ్రమ్ | శీఘ్ర |
| కై | కరః | హాథ్ |
| పాత్తిరమ్ | పాత్రమ్ | పాత్ర |
| ఫలమ్ | ఫలమ్ | ఫల్ |
| పాడమ్ | పాఠః | పాఠ్ |
| మనిదన్ | మనుజః | మనుష్య |
| మశి | మసిః | స్యాహి (సిరా) |

| | | |
|---|---|---|
| శత్తిరమ్ | సత్రమ్ | ధర్మశాల |
| ఉత్సవమ్ | ఉత్సవః | ఉత్సవ్ |
| నిజమ్ | నిజమ్ | నిజ |
| సాయందిరమ్ | సాయమ్ | సాయంకాల్ |
| కోబమ్ | కోపః | క్రోధ్ |
| పన్దు | కన్దుకమ్ | గేంద్ (బంతి) |
| వర్షమ్ | వర్షా | వర్షా |
| కూట్టమ్ | కూటః | భీడ్ |
| సమాచారమ్ | సమాచారః | సమాచార్ |
| జనంగల్ | జనాః | లోగ్ |
| అరై | అర్ధ | ఆధా |
| కదై | కథా | కథా |
| అనేహ | అనేకే | కఈ |
| గడియారమ్ | ఘటికా | ఘడీ |
| ఇడమ్ | ఇడా | భూమి, లేక (స్థాన్) |
| పో | ప్రయాహి | జా |
| ఆశే | ఆశా, లేక ఇచ్ఛా | ఇచ్ఛా |
| కుది | కూర్దస్వ | కూద్ |
| పరీక్షై | పరీక్షా | పరీక్షా |
| ఆరంబత్తిల్ | ఆరంభే | శురూమేం |
| జలదోషమ్ | జలదోషః | జుకామ్ |
| రత్తమ్ | రక్తమ్ | రక్త్, రుధిర్ |
| వన్దనోపచారమ్ | వన్దనోపచారః | ధన్యవాద్ |
| వివరమ్ | వివరణమ్ | వృత్తాన్త్ |
| కరగోషమ్ | కరఘోషః | తాలీ, (చప్పట్లు) |
| చిత్తిరై | చైత్రమ్ | చైత్ర్ |
| కార్తిహై | కార్తికమ్ | కార్తిక్ |

| | | |
|---|---|---|
| మార్గళి | మార్గశీర్షః | మార్గశీర్ష్ |
| మాసమ్ | మాసః | మాస్ |
| పంగుని | ఫాల్గునః | ఫాల్గున్ |
| మాసి | మాఘః | మాఘ్ |
| బుదన్ | బుధవారః | బుధవార్ |
| శనికిషమే | శనివారః | శనివార్ |
| శర్కరై | శర్కరా | శక్కర్ |
| సీతాపళమ్ | సీతాఫలమ్ | సీతాఫల్ (శరీఫా) |
| దిరాక్షై | ద్రాక్షా | కిశ్‌మిశ్ |
| ముత్తు | ముక్తా | మోతీ |
| నీలమ్ | నీలమణిః | పన్నా |
| గన్దహమ్ | న్ధకమ్ | గన్ధక్ |
| పిత్తలై | పిత్తలమ్ | పీతల్ |
| పాదరసమ్ | పారదః | పారా |
| తచ్చన్ | తక్షా | బఢయీ |
| వైద్యన్ | వైద్యః | వైద్య్ |
| హృదయమ్ | హృదయమ్ | హృదయ్ |
| నహమ్ | నఖమ్ | నఖ్ (గోరు) |
| మీన్ | మీనః | మఛలీ |

గ్రంథ విస్తరణ భీతిచే మచ్చునకు ఇంతయే చాలు ననుకొందును. ఇందువల్ల తమిళ భాషలకు సంస్కృతముతో ఎట్టి సంబంధము లేదనుట అసత్యమని సిద్ధించుచున్నది గదా! తమిళము నందును కనీసము 30% సంస్కృత శబ్దములు విరాజమానమై యున్నవని, శ్రీ అనంతశయనం అయ్యంగార్, మరియు అనేక తమిళ, సంస్కృత విద్వాంసుల అభిమతమై యున్నది. ఇకనిప్పుడు రెండు తమిళ భజనలను వ్రాయుచు ద్రావిడ భాషలకు సంస్కృత సంబంధమును గూర్చిన ప్రకరణమును త్వరగా సమాప్త మొనర్తును. ఆ భజనలు దిగువ వ్రాయుచున్నాను.

**ఓంకార సత్యజ్యోతి శుద్ధ బ్రహ్మమే నమః।**

**ఓం తత్సత్ ఓం ఏన్‌రాది వేద ఉణ్మై ఓదుమ్ పోరుళే॥**

వానుమ్ పువియుమ్ కానుమ్ కడలుమ్ వాళు యిర్గల్ యావిలుమ్ ।
తానే తానాయ్ తలైక్కుమ్ సచ్చిదానందమయ జ్ఞాన పోరుళే ॥
(౨) పరి పూరణానందమే ఓ3మ్ పరబ్రహ్మమే నమః - పరిపూరణా నంద
మే జాతిమత నిరవేదమ్ కడన్దోలిట్ ఆదియన్తమిల్లాద ఆత్మ స్వరూపమే ॥
పరినామ రూపాతీతామాన నిర్గుణమే ఓంతత్సత్ ఏన
వేదమ్ ఓదువ్ సుయం జ్యోతియే ॥ భజనకీర్తన మద్రాస ౧౨౩-౧౨౪ ॥

ఈ భజనములందు ఓంకార, సత్యజ్యోతి, పరబ్రహ్మ నమః, సచ్చిదానందమయ, జ్ఞాన పరిపూర్ణానందమ్, జాతి, మత, ఆది, అన్త, ఆత్మ, స్వరూప నామ రూపాతీతామాన, నిర్గుణమ్, సుయంజ్యోతి (స్వయంజ్యోతి) మున్నగు సంస్కృత తత్సమ, తద్భవము లెంత గొప్ప సంఖ్యలో నున్నవియో పాఠకులు చూచినారు. ఈ భజనలను సుప్రసిద్ధ తమిళ లేఖకులు, కవి, యోగి శ్రీ శుద్ధానంద భారతి గారు రచించినారు.

ఇట్లే వేలాది ఉదాహరణములనీయవచ్చును. కాని ఇంకా **'తమిళ స్వయం శిక్షక్'** నుండి ఇచ్చినట్టి ఈ యుదాహరణలే పర్యాప్తమగు ననుకొందును. తమిళమునందు సంస్కృత తత్సమ, తద్భవ శబ్దముల అత్యధిక సంఖ్యలో చూడబడుచున్నవి. తమిళ భాష లిపియందు అక్షరములు చాలా తక్కువగా నున్నవని పాఠకులు మరువకుందురు గాక. వ్యంజనములందు కేవలము క, జ, చ, ఞ, ట, ణ, త, న, ప, మ, య, ర, ల, వ, ష, ళ, ర, జ, స, హ, క్ష ఈ ప్రకారముగా కఖగఘ ఈయన్నిటికొరకు **'క'** ప్రయోగమగుచున్నది. చ ఛ జ ఝ ల పని **'చ'** ద్వారా సరిపెట్టబడును. ట ఠ డ ఢ ల కొరకు **ట**, త థ ద ధ లకు **'త'** ప ఫ బ భ ల కు **'ప'** తో పని నెరవేర్చుకొనవచ్చును. ఈ ప్రకారముగా సంస్కృత శబ్దముల స్వచ్ఛ ఉచ్చారణము జరుగుట కఠినమగును. బహుశః అపభ్రంశ మీకారణముననే జరుగుచున్నది. **'హ'** యొక్క పని చాల వరకు 'క'తో, శ, స, ల పని **'చ'**తోనే నడుచుచున్నది. ఈకారణము చేతనే సంస్కృత శబ్దములందు గలుగు అపభ్రంశమును పాఠకులు పై విషయముల వల్ల తెలిసికొనియే యుందురు. ఈ యుదాహరణములు చాల వరకు **'తమిళ స్వయం శిక్షక్'** ఆధారముపైననే ఈయబడినది.

**'తామిల్ లైక్సన్'** అను పేరుతో తమిళము యొక్క ప్రామాణిక నిఘంటువు మద్రాసు విశ్వ విద్యాలయ పక్షము నుండి ముద్రింపబడినది. అది పరామర్శదాతల సమితి అధ్యక్షుడగు శ్రీ. కె. వి. కృష్ణస్వామి అయ్యర్ గారి చే పరిష్కృతమొనర్చబడినది. దీని ప్రధాన సంపాదకులు తమిళ ఉపాధ్యాయ శ్రీ వైయ్యాపురి పిళ్లే, మరియు ఉప సంపాదకులు శ్రీ నారాయణ అయ్యర్ అనువారలు కోశసమితి యందు మ. మ. శ్రీ కుప్పుస్వామి శాస్త్రి, మ. మ. డా. స్వామి నాథ అయ్యర్, డా. కృష్ణన్‌రాజా, శ్రీ లక్ష్మణ్ స్వామి మొదలియార్, రెవరెండ్ గొర్డన్ మైథ్యూ మున్నగు విద్వాంసులుండిరి. ఈ కోశమును చూచుటచే తమిళమునందు సంస్కృత శబ్దములు చాల అధికముగా నున్నవని రూఢియగుచున్నది. ముఖ్యముగా తమిళ లిపి యొక్క విచిత్రముల కారణమున వాని రూపములలో కొంత భేద మవశ్యముగా జరిగినది. నేనిప్పుడు కేవలము ఈ కోశము నిర్దేశించిన కొన్ని సంస్కృత శబ్దములను అర్థ సహితముగా దిగువ నిచ్చుచున్నాను. దీనిని పాఠకులు ధ్యాన పూర్వకముగా చూచి పరిణామము తీయవలసి యుండును. ఈ

కోశములో అర్థములు అంగ్రేజీలో ఇచ్చియున్నారు. పాఠకుల సౌకర్యార్థము వానియర్థములను నేను హిందీలోనే యిచ్చినాను.

| తమిళ శబ్దములు | తమిళకోశముననుసరించి మూల సంస్కృత శబ్దములు, | హిందీ తెలుగు అర్థములు |
|---|---|---|
| అక్కతమ్ | అక్షతమ్ | అక్షతలు, లేక వేయించిన ధాన్యములు |
| అక్కతయోని | అక్షతయోని | అక్షత యోని కుమారి |
| అక్కమ్ | అక్షః | అక్ష( ఒకస్థిరముగు కల్పితరేఖ, పృథివిలోపలి కేంద్రము నుండి రెండువైపుల రెండు ధ్రువములపై వెడలును అక్షాంశరేఖ |
| అక్కమ్ | అర్ఘః | మూల్య ( మూల్యము) |
| అక్కరమ్ | అక్షరమ్ | ఆకాశ్ |
| అక్కరమ్ | అక్షరమ్ | ముక్తి |
| అక్కాని | అక్షాణి | ఇంద్రియములు, లేక భౌతిక శరీరము |
| అక్కితారై | అక్షితారా | ఆంఖోంకా తారా |
| అక్కియాతి | అఖ్యాతిః | అవిద్యా |
| అక్కియానీ | అజ్ఞాని | అజ్ఞాని |
| అక్కిర చన్మన్ | అగ్రజన్మా | బడాభాయీ, బ్రాహ్మణుడు |
| అక్కిరమి | అక్రమమ్ | మర్యాదారహితచెడుకార్యము, దుష్టప్రవర్తన |
| అక్కిని | అగ్నిః | అగ్ని |
| అక్కిని చన్మన్ | అగ్ని జన్మ | స్కన్ద |
| అక్కినిచిత్ | అగ్నిచిత్ | నియమపూర్వకముగా అగ్నిహోత్రమొనర్చు బ్రాహ్మణుడు |
| అక్కినితిరయమ్ | అగ్నిత్రయమ్ | మూడు యజ్ఞాగ్నులు, గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్ని |
| అక్కినినీర | అగ్నినీరమ్ | నత్రికామ్లము |
| అక్కినిప్పిరలయమ్ | అగ్నిప్రలయః | అగ్ని ద్వారా జలప్రళయము |
| అక్కినిప్పూరి | అగ్నిపూర్ణః | బన్ధాక్ |
| అక్కినిపకవాన్ | అగ్ని భగవాన్ | అగ్ని భగవాన్ |
| అక్కిని మణ్టలమ్ | అగ్నిమండలమ్ | అగ్నిమండలము |
| అక్కిని మన్తమ్ | అగ్నిమాన్ద్యమ్ | మందాగ్ని లేక అజీర్ణము |

| | | |
|---|---|---|
| అక్కినిముకచ్చూరణమ్ | అగ్ని ముఖచూర్ణమ్ | ఒక విధమగు జీర్ణకారి చూర్ణము |
| అక్కినియన్ | ఆగ్నేయః | మండల గ్రహము |
| అక్కినియారాతనైక్కారన్ అగ్ని+ రాధనాకారః | | అగ్న్యారాధకః పార్సీవారు |
| అక్కినిహోత్తిరమ్ | అగ్నిహోత్రమ్ | అగ్నిహోత్రము, లేక హవనము |
| అక్కినివీరియమ్ | అగ్నివీర్యమ్ | సువర్ణము లేక బంగారము. |
| అక్కినిష్టోమమ్ | అగ్నిష్టోమః | అగ్నిష్టోమమను నొక యజ్ఞము |
| అక్కినిస్తమ్పమ్ | అగ్నిస్తమ్భ | అగ్ని స్తంభము |
| అక్కినిస్తమ్పనమ్ | అగ్ని స్తమ్భనమ్ | అగ్ని క్రియను నిలిపి వేయు క్రియ |

పాఠకులీ శబ్దములను జూచినచో అనేక సంస్కృత శబ్దములు కొంత మార్పుతో ప్రయోగ ఉచ్చారణములు తమిళ భాషయందు జరిగినవని తెలిసిపోగలదు. పైన తెలిపినట్లు తమిళమునందు అక్షరములు చాలా తక్కువగానుండు కారణమున సంస్కృత శబ్దముల ఉచ్చారణ వేరు రూపముగా మారిపోవుచున్నది. ఉదా:- అగ్ని శబ్దములో 'గ్' కలదు. తమిళ లిపి యందు దీనికి భిన్నాక్షరము లేదు. ఒక్క 'క' అక్షరమే 'క ఖ గ ఘ' ల నాలుగక్షరముల కార్యమును నెరవేర్చును. ఉదా :-'భగవాన్' అను పదమును తమిళమునందు 'పకవాన్' వ్రాయబడినది. ఏలన ప ఫ బ భ ల పని ఒక్క 'ప' చేతనే సరిపెట్టుకొనబడినది. మరియు సాధారణముగా ఈ విధముగనే సామాన్య జనము ఉచ్చరింతురు. ఏ మాత్రము సంస్కృతము తెలిసినవారైనను ఇది 'భగవాన్' శబ్దమని వెంటనే తెలిసికొనగలరు. మణ్డలమ్ కు, మణ్టలమ్, అగ్రజన్మన్ కు అగ్గిరచన్మన్ ఇవన్నియు తక్కువ అక్షరముల కారణముననే జరుగును. ఏలన; ట ఠ డ ఢ యను నాలుగక్షరములకు 'ట' మరియు చ ఛ జ ఝ మరియు ఒక్కొక్కప్పుడు 'స' కూడా ఒక్క 'చ' ప్రయోగమే సరిపోవును. మొత్తముపై తక్కువ అక్షరములుండు కారణమున సంస్కృత శబ్దముల రూపమే మారిపోయినది. ఈ క్రింది శబ్దములను శ్రద్ధతో చూచిన ఈ విచిత్రము త్వరగా అవగాహన మగును.

| తమిళ వ్యవహార శబ్దములు | సంస్కృత మూలములు | అర్థములు |
|---|---|---|
| అకటనాకటన సామరత్తియమ్ | అఘటనాఘటన సామర్థ్యమ్ అసంభవ ఘటనమును సంభవమొనర్చు శక్తి | |
| అకణ్టాకార ఞానమ్ | అఖండాకార జ్ఞానమ్ | సర్వజ్ఞత |
| అకణ్టాకార విరుత్తి | అఖండాకార వృత్తిః | ఆధ్యాత్మికాభిలాష |
| అకతకారన్ | అగదకారః - వైద్య | వ్యాధులను దొలగించు వైద్యుడు |
| అకమ్ | అఘమ్ | పాపము, ఘృణ |
| అకమ్ పిరమమ్ | అహం పరమ్ | అహంకారము, అభిమానము |
| అకర్మ కర్తరిప్పిరయోగమ్ | అకర్మకర్తరి ప్రయోగ | వ్యాకరణమున ధాతువు అకర్మక ప్రయోగము |

| | | |
|---|---|---|
| అకిలప్పిరకాసన్ | అఖిలప్రకాశః | సర్వవ్యాపక ప్రకాశము, సుప్రసిద్ధము |
| అంకచంకమ్ | అంగసంగః | మైథునము |
| అంకచేతనవిత్తై | అఙ్గచ్ఛేదన విద్యా | *Anatomy* మరియు అంగచ్ఛేదన విద్య |
| అకూటకన్తమ్ | అగూఢగన్ధమ్ | ఇంగువ ( దీనివాసనను దాచలేము) |

ఇదే విధముగా వేలాది మనోరంజక ఉదాహరణముల నీయవచ్చును.

## 8.20 తమిళ వ్యాకరణమునకు ఆధారములు ఐన్ద్ర సంస్కృత వ్యాకరణమే

తమిళములో **'తోలకప్పియమ్'** అను నాతని సుప్రసిద్ధ, ప్రాచీన వ్యాకరణ గ్రంథమొకటి లభించినది. దీని లేఖకులు జమదగ్ని పుత్రుడు, అగస్త్య మహర్షి శిష్యుడగు **'తోల్ కొప్పియార్'**, మరొకపేరు **'తృణధూమాగ్ని'.** ఆయన సమకాలీనుడగు 'పనమ్బరనార్' అనునాతడు **'తోల్కప్పియమ్'** యొక్క భూమిక యందు 'తోల్కప్పియార్ ఇంద్రుని సంస్కృత వ్యాకరణముపై సంపూర్ణాధికారమును పొందియుండెను' 'ది ఏన్షెంట్ డ్రైవిడియన్స్ *(The Ancient Dravidians')* అను పుస్తక రచయిత శ్రీ. టి.ఆర్. శేష అయ్యంగార్, ఎమ్.ఎ. మద్రాసు విద్వాంసులు, ఈ పుస్తకము పు.౧౦౧లో ఈ దిగువ విషయము నుల్లేఖించియున్నారు. **'తోల్కప్పియమ్'** రచన క్రీ.శ. నాల్గవ శతాబ్దమునకు పూర్వముదని తెలిపినాడు. జర్మన్ విద్వాంసుడగు డా. ఏ. సి. బుర్నల్ పి.హెచ్.డి. ౧౮౭౫లో బేసల్ మిశన్ మంగ్లూర్ (ద. కర్ణాటక) నుండి ముద్రించబడిన తన *The Aindra School of Sanskirt Grammarians* అను పుస్తకము నందు **'తోల్కోప్పియమ్'** అను తమిళ వ్యాకరణము యొక్క ఆధారము సంస్కృత ఐన్ద్ర వ్యాకరణ పరంపరకు చెందినదని అనేక ఉదాహరణల ద్వారా తెలుపయత్నించినాడు. దానియం దాయన **'కాతంత్ర'** మను వ్యాకరణము, కాత్యాయన వృత్తి, మరియు ప్రాతిశాఖ్యలను కూడా చేర్చినాడు.' **'తొల్కాప్పియమ్'** ఇంగ్లీషు అనువాదకుడైన డా.పి.ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి తన భూమిక యందు ఆ తమిళ వ్యాకరణ కర్త విషయము నందిట్లు వ్రాసియున్నారు.

*Tolkappiyanar was conversant with Vedas, Dharma Shastras, Kamasutra, early Alankar literature, the Source book of Natya Shastra,Pratishakhyas, Work on Vyakarana, Nirukta in Sanskrit literature and made use of them in Planning Tolkappiyam Introduction to Tolkappiyam English translation Vol. I. P.XXXIII*

అనగా; 'తోల్కాప్పియం పేరుగల తమిళ వ్యాకరణ లేఖకులగు **'తోల్కాప్పియనార్'** వేదముల, ధర్మ శాస్త్రముల, కామసూత్రముల అలంకార సాహిత్యము, నాట్య శాస్త్రముల మూల స్రోతస్సుల, ప్రాతిశాఖ్యల మరియు సంస్కృత సాహిత్యము వ్యాకరణము, నిరుక్తము మున్నగు గ్రంథములతో చక్కని పరిచయము గలవాడని మరియు వానియందు నిపుణత గలిగియుండెను అని వ్రాసినాడు.

కేవలము కొన్ని శబ్దముల పోలిక కారణముననే గాక వ్యాకరణము, ధ్వని, రూప రచన, మరియు వాక్యరచన మున్నగువాని దృష్టితో కూడా సంస్కృతమునకు తమిళము మరియు దాక్షిణాత్య భాషలన్నిటితో విశేష సంబంధము గలదని ఈ స్థితియందు అతిస్పష్టముగా ధృవపడుచున్నది.

**8.2 । ఇతర దాక్షిణాత్య వైయా కరణుల అభిప్రాయములు**

పంద్రెండవ శతాబ్దపు కన్నడ భాష యొక్క వ్యాకరణ ప్రణేతయగు **'నాగవర్మ'** యను నాతడు తమిళము, తెలుగు మరియు కన్నడములను సంస్కృత మాత యొక్క బిడ్డలని పేర్కొనినాడు. పదమూడవ శతాబ్దపు తెలుగు భాషా వ్యాకరణ ప్రణేతయగు **'కేతన'** కూడా సంస్కృతము సర్వభాషల జనని యని వ్రాసినాడు. పదునాల్గవ శతాబ్దపు **'లీలా తిలకం'** అను మలయాళ వ్యాకరణమును సంస్కృతములో రచించిన విద్వాంసు డిట్లు వ్రాసినాడు.

'ఇహ తావత్ సంస్కృతమనాది, అన్యదాదిమత్; తస్య సంస్కృతాత్ ప్రభవః స్యాత్, తత్ర ప్రకృతిత్వేన స్థితం సంస్కృతం క్వచిదూహవిషయో భవతి, క్వచిదత్యన్త తిరోభావా దూహో న శక్యతే తత్ర రూఢత్వముచ్యతే అన్యత్ర సంస్కృతభవత్వమ్'' ॥ లీలాతిలకమ్. పు.౧౩

సంస్కృతము అనాది మరియు ఇతర భాషలన్నియు తరువాతి కాలమునకు చెందినవి. కావుననే వానియుత్పత్తి సంస్కృతమునుండియైనది. ఇతర భాషా శబ్దములు సంస్కృతము నుండి యుత్పన్నమైనవని వాని మూలముపై ఆలోచించవలసిన అవసర మేర్పడుచున్నది. ఇట్లాలోచించుట కఠినమగునప్పుడు ఆ స్థానములో ఆ శబ్దములు సంస్కృతము నుండియే ఉత్పత్తియైనవని రూఢియగుచున్నవి. దీనికి లీలా తిలక కారుడనేక ఉదాహరణముల నిచ్చియున్నాడు.

*'Heritage of India' Series* లో ప్రకటింపబడిన *"A History of Telugu Literature"* అను పేరు గల తెలుగు ఇతిహాస లేఖకులు కూడా దీనిని స్పష్టముగా అంగీకరించిరి.

*'An analysis of Telugu as it has been for centuries confirms the traditional view that Telugu is derived from Sanskrit' P. 16*

అనగా; అనేక శతాబ్దముల నుండి ప్రచలితమైయున్న తెలుగు భాష యొక్క విశ్లేషణ వల్ల తెలుగు కూడా సంస్కృతమునుండియే ఉత్పన్నమైనదని స్పష్టమగుచున్నది.

డా. నారాయణరావు తన *'History of the Telugu Language'* తెలుగు భాషా చరిత్ర అను బృహద్గ్రంథములో కూడా ఈ యభిప్రాయమునే ప్రకటించియున్నాడు. అనగా; *Telugu is one of the descendants of a main Aryan dialect.*

అనగా; తెలుగు ఒక ముఖ్య ఆర్య భాషా పుత్రికయైయున్నది. ట్రావన్‌కూర్ విద్వాంసుడగు శ్రీయుత ఎల్.వి. రవివర్మ యనునాతడు 'ఆర్య ద్రావిడ భాషా కలుటే పరస్పర సమ్బన్ధమ్' అనగా 'ఆర్య, మరియు ద్రావిడ భాషల పరస్పర సంబంధము' అను తన పుస్తకములో ఉదాహరణార్థము మలయాళము యొక్క ౭౦౦ శబ్దముల నెన్నుకొని వానిని సంస్కృత మూలములని తెలిపినాడు. (౧) ఇది అఖిల భారతీయ ప్రాచ్య విద్యాపరిషత్తు (All India Oriental Conference) దిసంబర్ ౧౯౩౭లో త్రివేంద్రములో జరిగిన నవమ సమావేశములో ద్రవిడ భాషా విభాగాధ్యక్షుడు కీ.శే. మహాకవి ఉల్లూర్ పరమేశ్వర అయ్యర్ యొక్క అధ్యక్షోపన్యాసము నుండి గైకొనబడినది - చూడుడు పై సమావేశకార్యవివరణ పుట.౧౨౩౪-౧౨౪౦.

ఈ విధముగా అనేక శబ్దములు కలయు కారణమునేగాక వ్యాకరణాదుల దృష్టి చేతనూ ద్రావిడ భాషలకు సంస్కృతముతో సంబంధము స్పష్టమగుచున్నది. వైదిక్ ఏజ్, మరియు ఇతర ఏ భాషలనైనను సంస్కృతము నుండి సంబంధము లేదని స్వతంత్రము, అసంబద్ధమని చేసిన ప్రయత్నములన్నియు నిస్సారమైపోయి నాలుగు ద్రావిడ భాషలకు సంస్కృతముతో ఘనిష్ఠ సంబంధము పై వివేచనముచే స్పష్టమైపోయినది.

## 8.22 తమిళ వేదము - వేదాది శాస్త్రములు

ఈ ప్రసంగమునందు **'తమిళ వేద'** మను పేరుగల ప్రసిద్ధమైన తమిళము యొక్క అతి విఖ్యాత గ్రంథము **'తిరు క్కురల్'** ( దీని రచయిత 'తిరువళ్ళువార్ అనునొక సాధువు) దీనికి వేదాది శాస్త్రములతో సంబంధము గలదని తెలుపుట అనుచితము గాదు. ఈ గ్రంథ నిర్మాణమునకు కాలన్నిర్ణయము సరిగా చెప్పుట సాధ్యము గాదు. కాని దాదాపు క్రీస్తుకు ప్రథమ శతాబ్దికాలమని అంచనా వేయవచ్చును. దీనియందు ఆధ్యాత్మిక, పారివారిక, సామాజిక, నైతిక, రాజనైతిక విషయములపై ఉత్తమ ఆలోచన ప్రకటించబడిన దనుటలో సందేహము లేదు. ఐనను దీనిని సంపూర్ణముగా ఆధునికము, లేక మౌలికమని చెప్పుట వేదాది శాస్త్రముల నే మాత్రము నెరుగని మూర్ఖత్వమే యగును. ఈ పంక్తులను వ్రాయుచున్నప్పుడు నా యెదుట ( సస్తా సాహిత్యమండలి ఢిల్లీ వారు ౧౯౫౦లో ప్రకాశపరచినట్టి శ్రీ క్షేమానందరాహత్ గారి అనువాద) 'తమిళవేద' మను గ్రంథము గలదు. భారత మాజీ గవర్నర్ జనరల్ అగు శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్య గారు దానికి భూమికను వ్రాసియున్నారు. వారు తమిళము యొక్క ధురంధర విద్వాంసులేగాక సంస్కృతము నందును చక్కని అధికారము గలిగి యుండిరి. వారు దాని భూమికయందు గ్రంథ మాహాత్మ్యము నుల్లేఖించుచు 'ఈ పుస్తకములో ఉత్తర భారతీయ సభ్యత మరియు సంస్కృతికి, తమిళ జాతికి ఎంతయో ఘనిష్ఠ సంబంధము మరియు తాదాత్మ్యము గలదని వ్రాసినారు.'

తమిళ వేదమును చదువుచున్నప్పుడు మనకు వేదముల, శాస్త్రముల, నీతిగ్రంథముల అనేక వాక్యములు స్మరణమునకు వచ్చును. రచయిత ఇట్టి గ్రంథములను అవశ్యముగా చదివియుందురు. లేక వినియుందురు. మరియు ఇట్టి గ్రంథములందు, మరియు ఋషి మునుల యందు అధిక శ్రద్ధ గలవారై యుందురు. **'తిరుక్కురల్'** లోని అనేక స్థలములు వేదాదుల అనువాద మనియే స్పష్టమగుచున్నది. ఉదా:- నిమ్న వాక్యములను చూడుడు.

౧. తపస్సును గూర్చిన మహిమను దెలుపుచు తిరువళ్లువార్ ఇట్లు వ్రాసినారు. 'తపస్సొనర్చినవారు శక్తిని, సిద్ధిని ప్రాప్తించుకొనినారు.' - తమిళ వేదము పు. ౩౬

ఇది స్పష్టముగా **'బ్రహ్మ చర్యేణ తపసా దేవా మృత్యు ముపాఘ్నత'** ॥ అథర్వ. ౬-౨౮॥ మంత్రమున కనువాదమే. దీనియందు బ్రహ్మచర్యము, మరియు తపస్సుచే విద్వాంసు లగువారు మృత్యువుపై కూడా విజయమును ప్రాప్తించుకొందురని కలదు.

౨. త్యాగమును గూర్చి తమిళ వేదమునందు 'త్యాగముచే అనేక విధములగు సుఖములు ఉత్పన్నమగును. వానిని నీవు దీర్ఘకాలము వరకు అనుభవింపదలచితివేని శీఘ్రముగా త్యాగమునాచరించు' మని వ్రాయబడియున్నది. - తమిళ వేదము. పు. ౪౮

ఇది **'తేన త్యక్తేన భుంజీథా'** అను యజుర్వేదము ౪౦-౧ మంత్రమునకు అనువాదము.

౩. శిక్ష విషయములో ' ప్రాప్తించుకొనదగిన జ్ఞానమును సంపూర్ణ రూపములో ప్రాప్తించు కొనవలెను. దీనిని ప్రాప్తించుకొనిన దాని ననుసరించియే వ్యవహరించవలయును. ( తమిళ వేదము పు.౫౬) ఈ మన్త్రము **'శ్రుత్యం చరామసి'** (సామవేద మంత్రము ౧౭౬) మరియు **'మయ్యేవాస్తు మయి శ్రుతమ్'** ॥ అథర్వ. ౧-౧-౨॥ ల భావానువాదమైయున్నది. వీనియందు వేద జ్ఞానమును ప్రాప్తించుకొని దానిననుసరించి ఆచరించుటకు మరియు తనయందు ధారణమొనర్చుకొనుటకు ఉపదేశించబడినది.

౪. సత్యమును గూర్చి వర్ణించుచు 'ఈ ప్రపంచములో నే ననేక వస్తువులను జూచినాను. నేను జూచిన వస్తువులలో సత్యముకన్న శ్రేష్ఠమైనది నాకు గాన్పించలేదు ( తమిళ వేదము పు.౪౩) ఇది **'నాస్తి సత్యాత్పరో ధర్మః'** అనగా; సత్యమును మించిన ధర్మము లేదు. మ. భా.శాం. పర్వము ౧౭౪-౧౬౨ లకు అనువాదము మాత్రమే.

౫. సత్యమనగా నేమి? దాని వల్ల ఇతరులకెంతమాత్రమును నష్టము, కష్టమును గలుగరాదు. అట్లు పలుకుటయే సత్యమైయున్నది. - ( తమిళ వేదము పు. ౪౧.)

**'యద్ భూతహితమత్యన్తం తత్సత్యమితి ధారణా'** (మ.భా.వన పర్వ ౨౦౮-౪) మరియు **తస్మాత్ పరీక్ష్య సర్వభూతహితం సత్యం బ్రూయాత్** ( యోగదర్శన ౨-౩౦) వీనియనువాదముగా నున్నదిది. దీనియందు సకల ప్రాణులకు హితము గలిగించునదే సత్యము, దీనిని చక్కగా పరీక్షించుకొని సర్వప్రాణులకు హితమగు సత్యమునే పలుకవలెను.

౬. ఆత్మ సత్యమును ఆస్వాదనమొనర్చుకున్నచో మానవుని వంటి ఉన్నతయోనిని ప్రాప్తించికొనినను లాభ మేమియును లేదు. ఎవడు గంభీర పూర్వకముగా స్వాధ్యాయమొనర్చుచున్నాడో, సత్యమును గూర్చి తెలిసికొనినాడో అట్టి మానవుడే ధన్యజీవి. అట్టివాడు పునః ఈ లోకమునకు రాకుండునట్టి మార్గమునందే నడువవలెను. - తమిళవేదము పు.౫౦

**'ఇహ' చేదవేదీదథ సత్యమస్తి న చేదిహా వేదీన్మహతీ వినష్టిః । భూతేషు భూతేషు విచింత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి''** కేనోపనిషత్తు ౨-౫ ॥ నకు అనువాదమనుట స్పష్టము. దీనియర్థము ఈ జీవితమునందే సత్యస్వరూపమును దెలిసికొనుట మంచిది. లేకున్న గొప్ప హాని యనియే యెంచుము. సత్య స్వరూపుడగు పరబ్రహ్మను సకలప్రాణులందును జూచువాడే మరణించి అమరుడగును.

౭. 'ఎన్నడు నీ సంపదలు తరుగకుండవలె'నని తలచినచో నీయిరుగు పొరుగువారి, నీ వారి వైభవములను మ్రింగుటకు ప్రయత్నించకుము' - తమిళ వేదము. పు.౨౮.

**'మా గృధః కస్యస్విద్ధనమ్'** యజుర్వేద ౪౦-౧ వ మంత్రమున కిది భావానువాదము.

౮. ఏ రాజ్యము నందలి ప్రజలు నిర్భయముగా రాజును దర్శించగలుగుదురో, ఏరాజు కఠిన వచనములతో ప్రజల మనస్సును బాధించడో అట్టి రాజు రాజ్యము ఉన్నతముగా, స్థిరముగా నుండగలదు. - తమిళ వేదము పు.౫

**'విశస్త్వా సర్వా వాన్ఛన్తు మా త్వద్ రాష్ట్రమధిభ్రశత్'** ॥ ఋగ్వేద ౧౦-౧౭౩, మరియు **'విశి రాజా ప్రతిష్ఠితః'** ॥ యజుర్వేద ౨౦-౯॥ ల యనువాద మాత్రమే యిది. రాజు యొక్క స్థితి ప్రజల పైననే యని స్వీకరించుచు 'ప్రజలెల్లరును నిన్నే ప్రేమింతురు గాక. అందువల్ల నీవు ఎప్పుడును రాజ్య భ్రష్టుడవు గాకుండా స్థిరముగా నుందువుగాక' అని దీని భావము.

౯. 'సాధు ప్రకృతి గలవారినే బ్రాహ్మణులని యనుకొనవలెను. ఇట్టివారే సకల ప్రాణులపై ప్రేమతో వాని హితమును కాంక్షింతురు' - తమిళ వేదము పు.౫

ఇది వేద శాస్త్రోక్త బ్రాహ్మణాదర్శమున కనుకూల వచనముగా నున్నది. ఈయాదర్శమును **'మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షామహే '** ॥ యజు ౩౬-౧౮ ॥ మరియు **'కుర్యాదన్యన్న వా కుర్యాద్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే'** ॥ మను ౨-౧౭ ॥ మున్నగువాని యందు ప్రకటింపబడినది.

౧౦. ఆత్మ సంయమనము గూర్చి తమిళ వేదములో 'కచ్ఛపము తన తలను, కరపాదములను లోపలికి తీసికొని దాచుకొనునట్లే సంయమియగు మనుష్యుడు తన యింద్రియములను లోపలికిలాగుకొని భద్ర పరచియుంచును. అట్టివాడు తన సమస్త ఆగామి జన్మల కొరకు ధనాగారమును భద్రముగా దాచి యుంచుకొనును.' - తమిళ వేదము. పు.౨౦.

ఈ ఉపమా (అర్థాలంకారము) భగవద్గీతలోని **'యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః । ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా'**॥ (భగవద్గీత ౨-౫౮) శ్లోకమును పోలియున్నది.

తాబేలు తన అవయవములను లోపలికి లాగుకొనునట్లు మనుష్యుడు తన ఇంద్రియములను బాహ్య విషయములనుండి లోపల స్థిరపరచుకొనునప్పుడు అతని బుద్ధి స్థిరమగును అని దీని భావము.

౧౧. శ్రీ తిరువల్లువారు గర్వము విషయములో ఇట్లు చెప్పినారు. అహంకారములో గర్వోన్మత్తుడై నీకెవడైన హాని తలపెట్టదలచినచో అతనిపై నీ మంచితనముతో విజయమునుపొందుము. విదురనీతి, మరియు మహాభారతములో **'అక్రోధేన జయేత్క్రోధం, అసాధుం సాధునా జయేత్। జయేత్కదర్యం దానేన, జయేత్సత్యేన చానృతమ్ ॥'** మ.భా. ఉద్యోగ పర్వము. ౭౧.౫౯॥ మరియు **'న పాపే ప్రతిపాపః స్యాత్, సాధురేవ సదా భవేత్ ॥'** మ.భా. వన పర్వము ౨౦౬.౪౪. మున్నగు వాని నుండి గ్రహింపబడినవని తోచుచున్నది. దీనియభిప్రాయము క్రోధమును అక్రోధముచే, దుర్జనత్వమును సజ్జనత్వముతో, కృపణత్వమును దాతృత్వముచే, అసత్యమును, సత్యముతో, పాపమును సాధుత్వముతో జయించవలెననియే.

౧౨. నిరామిష భోజన విషయములో శ్రీ తిరువల్లు వారి నిమ్న ఉపదేశములు అత్యుత్తమమైనవి.

౧. తన మాంసమును పెంచుకొనుటకై ఇతరుల మాంసమును భుజించువారి హృదయములందు జాలి యెట్లుండును?

౨. అనవసర వ్యయమొనర్చువారి వద్ద ధనము నిలువనట్లే మాంసాహారి హృదయములో దయ యుండజాలదు.

3. నిస్సందేహముగా ప్రాణుల హత్యయొనర్చుట క్రూరత్వమే. ఇక వాని మాంసమును దినుట ఘోర పాపమే యగును.

౪. ప్రపంచములో మాంసాహారులే లేనప్పుడు దానిని విక్రయించువా రెవరుందురు?

౫ మానవు డితర ప్రాణులకు గలిగించు పీడ, మరియు యాతనను గ్రహించ గలిగినట్లైన మరల నాతడెప్పుడును మాంసమును భుజించు కోరిక గలిగియుండడు.

౬. ప్రాణులను చంపుటను, భుజించుటను వదలివేసినచో వేలాది యజ్ఞములొనర్చు ఫలము దక్కి ఉత్తమగతులు లభించగలవు.

౭. హింసయొనర్చనివానికి, మాంసాహారిగానివానికి మొత్తము ప్రపంచము చేతులెత్తి నమస్కరించును. ప్రాణులు అట్టివారిని హృదయపూర్వకముగా ఆశీర్వదించును. - తమిళ వేదము పు. ౩౭-౩౮

**'యథా మాంసం యథా సురా, యథాక్షా అధిదేవనే । యథా పుంసో వృషణ్యతః స్త్రియాం నిహన్యతే మనః ॥'** అథర్వ వేదము ౬-౭౦-౧ ॥

**'పశూం స్త్రాయేథామ్' 'కృత్యాముపసువ'** (హింసను పరిత్యజించుము) మున్నగు వేద వచనములు మరియు

**నాకృత్వా ప్రాణినాం హింసా, మాంసముత్పద్యతే క్వచిత్ ।**

**న చ ప్రాణివధః స్వర్గ్యః, తస్మాన్మాంసం వివర్జయేత్** ॥ మనుస్మృతి ౫-౪౮॥

**సముత్పత్తిం చ మాంసస్య,వధబన్ధౌ చ దేహినామ్ ।**

**ప్రసమీక్ష్య నివర్తేత, సర్వ మాంసస్య భక్షణాత్** ॥ మను. ౫-౪౯॥

**అనుమన్తా విశసితా, నిహన్తా క్రయవిక్రయీ ।**

**సంస్కర్తా చోపహర్తాచ, ఖాదకశ్చేతి ఘాతకాః** ॥ మను. ౫-౫౧॥

మున్నగునవి మనుస్మృతి శ్లోకముల నుండి గ్రహించినట్లు తోచుచున్నది. వీనిభావార్థ మిట్లున్నది. మాంసము, సురాపానము, జూదము, వ్యభిచారము, ఇవన్నియు పరిత్యజింపవలసినవి. ఇవన్నియును మనస్సును, శరీరమును నీచపరచునవియై యున్నవి. పశువులను కాపాడుట, హింసను పరిత్యజించుట, మాంసమును భక్షించకుండా యుండుట మహా పురుషుల లక్షణము. హింస యొనర్చకుండా మాంసము లభించదు. హింస యొనర్చుటచే స్వర్గము వైపు గొనిపోవు పుణ్యకర్మ నష్టమై పోవుచున్నది. కావున మానవులెల్లరును మాంసమును భుజించుట మానివేయవలెను. మాంసము యొక్క ఉత్పత్తి మరియు ప్రాణుల బంధనము, హింస మున్నగునవి

జూచిన పిదప అన్ని విధములగు మాంసములను మానవుడు ఏవగించుకొనవలెను. ఒక్క మాంసమును దినువాడే ఘాతకుడు గాడు. మాంసమున కనుమతించువారు, కోయువారు, చంపువారు, క్రయమొనర్చు వారు, విక్రయ మొనర్చువారు, వండువారు, వడ్డించువారు, భుజించువారు వీరెల్లరును ఘాతకులుగానే గణింపబడుదురు.

౧౩. శరీర శుభ్రత జలముచే, మనస్సు పవిత్రత సత్యభాషణము చేతనే సిద్ధించును. అను నీ త్రిక్కురల్ వచనము **'అద్భిర్గాత్రాణి శుద్ధ్యన్తి, మనః సత్యేన శుద్ధ్యతి'** ॥ మను. ౫-౧౦౯॥ అను మనుస్మృతి శ్లోక సారము నుండి గ్రహింపబడినదే. - తమిళవేదము పు. ౪౨

౧౪. త్రిక్కురల్ లో 'జన్మలకు జననియగు అవిద్య నుండి విముక్తినొంది సచ్చిదానందుని ప్రాప్తించుకొను ప్రయత్నమొనర్చుటయే బుద్ధిమంతుల లక్షణము' (తమిళవేదము పు.౫౨.) అనునవి

**తస్యహేతురవిద్యా. అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణామ్ ॥ (యోగ - దర్శనము)**

**ఇహ చేదవేదీదథ సత్యమస్తి, న చేదిహా వేదీన్మహతీ వినష్టిః** ॥కేనోపనిషత్తు ౨-౫॥

మున్నగు యోగదర్శనము మరియు ఉపనిషద్వచనముల అనువాదములు. ఇంకా ఎన్నియో వచనములను **'త్రిక్కురల్'** నుండి ఎత్తి చూపవచ్చును. దీనివల్ల స్పష్టమగున దేమన; అవన్నియు వేదములు, ఉపనిషత్తులు, మనుస్మృతి మహాభారతము, యోగదర్శనము గీత మున్నగు వాని నుండి గైకొనబడినవే. అది (ద్రవిడవేదము) మౌలికమని ఖచ్చితముగా జెప్పుట, సంస్కృత సాహిత్యము నెరుగని అజ్ఞానమనియే తలచవచ్చును. 'చక్కగా స్వాధ్యాయమొనర్చి సత్యమును ప్రాప్తించుకొనినవారే ధన్యులు' - తమిళ వేదము పు. ౪.

ఈ విధమగు వాక్యములను నిర్దిష్ట రీతిలో స్వాధ్యాయమొనర్చుట వల్ల వేదాదుల స్వాధ్యాయాభీష్టము నెరవేరగలదు. వేదములు కూడా విస్మృతి యగుట వల్ల ఏమికాగలదో ఆలోచించవచ్చును. ఒకవేళ సదాచారమునుండి మనుష్యుడొక్కసారి స్ఖలితుడైపోయినచో తన స్థానమునుండి సంపూర్ణముగా భ్రష్టుడైపోవును - తమిళవేదము పు. ౨౨

ఈ విధమగు వాక్యములందును వేదములను స్మరణము నందుంచుకొనుట ఉత్తమమని అంగీకరించబడినది. ఋషి, మహర్షుల యెడ **'త్రిక్కురల్'** లేఖకుల అగాధమగు శ్రద్ధ దిగువ అనేక వచనముల ద్వారా విశదమగుచున్నది.

ఆత్మిక శక్తితో పరిపూర్ణ ఋషి గణమంతా నీపై క్రుద్ధులైనచో, అనేక విధములగు ఆనందోచ్ఛ్వాసములతో ఉల్లసితమైయున్న నీ జీవనము, మరియు సమస్తైశ్వర్యములతో పూర్ణమైయున్న నీ సంపదల, ధనముల గతి యేమగునో ఆలోచించినావా? - తమిళ వేదము. పు.౧౫.

ఫలవంతమైన పైరు పంటలచే పరిపూర్ణమైన మహాన్‌దేశము, ఋషిమునులతో, ధార్మిక దాతలగు ధనికులతో నిండియున్నదే మహాన్‌దేశము - తమిళ వేదము. పు.౯౬

(ద్రావిడ భాషయందు పరమమాన్యులైన (ఆ గ్రంథ నిర్మాత మహర్షి అను ఉన్నత పదవితో సన్మానితులైయుండిరి) శ్రీ తిరువల్లు వార్ ఆర్యధర్మము, ఆర్య సాహిత్యము, ఆర్య సంస్కృతి మున్నగువానిచే

ఎంతయో ప్రభావితులై యుండిరి. ఈతని ప్రభావము దక్షిణ భారత సాహిత్యముపై అధికముగా నున్నదని యనుట సర్వజనసమ్మతమే.

**8.23 ద్రవిడ సభ్యత యొక్క బహుమతి**

వైదిక్ ఏజ్ లేఖకులు ద్రావిడ సభ్యతను శ్రేష్ఠమని ఆర్య సభ్యతను హీనమని చూపుటకు అడుగడుగునా ఎంతో ప్రయత్నించినారని ప్రతీతమగుచున్నది. దాని ౧౫౪ వపుటపై ఇట్లు వ్రాసి యున్నారు.

**These Dravidian speaking mediterranean people in India were responsible for cities and a city culture – for a real civilisation, in the true sense of the word including international trade" - Vedic Age P.154.**

ద్రావిడ భాషీయులే నగరముల, నాగరికుల సంస్కృతిని గూర్చి, లేక వాస్తవమగు అర్థములలో సభ్యతను నెలకొల్పిరి. కాని యీ విషయమున వీరికి ద్రావిడ సభ్యత యెడగల పక్షపాతము దప్ప మరేమియును గాన్పించదు. మొట్టమొదట **'హరప్పా'** మరియు మొహంజదారో యొక్క సభ్యత ద్రావిడులనే ప్రధానముగా ప్రభావితమై యుండెననునదే సంధిగ్దము. ఏలన; దాని లిపి ఇంతవరకు యథాతథముగా చదువబడలేదు. వైదిక్ ఏజ్ రచయితలకు కూడా 'ఈ విషయమును గూర్చి నిశ్చితముగా చెప్పవీలుగా' దని అంగీకరించవలసి వచ్చినది.

***We are not absolutely certain that the city builders of Harappa and Mohanjo-daro in south Punjab and Sind, whom the Aryans doubtless encountered spoke Dravidian, but there is a balance of probability that they did. This matter cannot be proved or disproved until we find the clue to the script in hundreds of seals found in Harappa and Mohanjodaro - Vedic Age P.154.***

దీని భావమేమన; హరప్పా, మరియు మొహంజోదారో నగర నిర్మాతలు ద్రావిడ భాషను పలుకువారా? కాదా? అను విషయము నింకా సంపూర్ణముగా నిశ్చయింపలేము. అచ్చట లభించిన వేలాది బంగారు, వెండి మున్నగు నాణెముల **'లిపి'** తెలియనంతవరకు దీనిని పూర్తిగా దృఢ పరచలేము. మరియు ఖండించనూ లేము. ఈ విషయములో విద్వాంసులకు గంభీరమైన అభిప్రాయ భేదములున్నవి. వీనిని ఆర్యులే నిర్మించినారని అనేక విద్వాంసుల అభిప్రాయములు కూడా కలవు. మనము ఈ ద్రావిడులను ఆర్యులలో ఒక శాఖగా అంగీకరించినచో ఈ వాదవివాదములొనర్చుట నిరర్థకము, హానికారకము కూడా అని తలచుచున్నాము. ప్రాచీనార్యులు రామాయణము, మరియు అంతకన్న పూర్వముండిన వైదిక యుగపు వారై యుండిరి. వారు గొప్ప గొప్ప నగరములను, భవనములను నిర్మించుటలో సిద్ధహస్తులై యుండిరి. రాజులు, వారి ప్రధానమంత్రులు నివసించు భవనములు వేలాది స్తంభములు గలిగియుండునట్లు వేదములందు కూడా వర్ణించబడియున్నది. ఎట్లనగా;

**'రాజా నావనభిద్రుహా ధ్రువే సదస్యుత్తమే। సహస్రస్థూణ ఆసాతే'** ॥ఋ.౨-౪౧-౫॥

అథర్వ వేదమందలి శాలాసూక్తము ఈ విషయమున విశేషముగా చూడదగినది.

'యా ద్విపక్షా చతుష్పక్షా షట్పక్షా యా నిమీయతే ।

అష్టాపక్షాం దశపక్షాం శాలాం మానస్య పత్నీం అగ్నిర్గర్భ ఇవాశయే' ॥ అథర్వ ౯-3-౨౧॥

ఈ ప్రకారముగా మంత్రములందు ౨,౪,౬,౮,౧౦ అంతకు అధిక గదులు గల గృహముల నిర్మించు విధానమున్నది. ఈ విషయమును వదలివేసినను రామాయణ కాలము నందలి అయోధ్యా నగర వర్ణనములపై ధ్యానముంచినప్పుడు నిష్పాక్షిక బుద్ధి గల ఏ వ్యక్తియు నగర నిర్మాణ కళను ఆర్యులు ద్రావిడులనుండి నేర్చినా' రను సాహసము చేయజాలడు. ఆర్యుల వర్ణన మొనర్చుచు వాల్మీకి ముని ఇట్లు వ్రాసినాడు.

అయోధ్యా నామ నగరీ, తత్రాసీల్లోకవిశ్రుతా ।

మనునా మానవేన్ద్రేణ, యా పురీ నిర్మితా స్వయమ్ ॥

రాజమార్గేణ మహతా, సువిభక్తేన శోభితా ।

ముక్త పుష్పావకీర్ణేన, జలసిక్తేన నిత్యశః ॥

గృహగాఢామవిచ్ఛిన్నాం, సమ భూమౌ నివేశితామ్ ।

కపాటతోరణవతీం, సువిభక్తాన్తరాపణామ్ ॥

ఉచ్చాట్టాలధ్వజవతీం, శతఘ్నీశతసంకులామ్ ।

ప్రాసాదై రత్న వికృతైః, పర్వతైరివ శోభితామ్ ॥

ఉద్యానామ్రవణోపేతాం, మహతీం సాలమేఖలామ్ ।

సర్వరత్నసమాకీర్ణాం, విమానగృహశోభితామ్ ॥

చిత్రామష్టా పదాకారాం, వరనారీగణైర్యుతామ్ ।

దుర్గగమ్భీర పరిఖాం, దుర్గామన్యైర్దురాసదామ్ ॥

సర్వ యన్త్రాయుధవతీం, ఉషితాం సర్వశిల్పిభిః ।

వాజి వారణ సంపూర్ణాం, గోభిరుష్ట్రైః ఖరైస్తథా ॥

సామన్తరాజసంఘైశ్చ, బలికర్మభిరావృతామ్ ॥

నానాదేశనివాసైశ్చ, వణిగ్భిరుపశోభితామ్ ॥

సూతమాగధసంబాధాం, శ్రీమతీమతులప్రభామ్ ।

**వధూనాటక సంఘైశ్చ, సంయుక్తాం సర్వతః పురీమ్ ॥**

**తాం తు రాజా దశరథో, మహారాష్ట్రవివర్ధనః ।**

**పురీమావాసయామాస, దివి దేవపతిర్యథా ॥** వాల్మీకి రామాయణము ౧-౬॥

అనగా; అయోధ్య యను పేరుగల ఒక జగద్విఖ్యాత నగరముండెను. దానిని మను మహారాజు స్వయముగా నిర్మింపజేసి యుండెను. ఆ నగరములో మహావిశాలమగు రాజమార్గము లుండెను. ప్రతిదానిపై ప్రతిదినము **'కలయంపి'** నీరు చల్లబడుచుండెడిది. రత్న ఖచితమగు పర్వతముల వలె ప్రాసాదములచే ఆ నగరము శోభిల్లుచుండెడిది. అన్ని చోటులందును తోరణ ధ్వజములు అలరారుచుండెను. ఆ నగరవీధులన్నియు ఉత్తమరీతితో నుండెడివి. వందల కొలది ఫిరంగు లచ్చటచ్చట అమర్చబడి యుండెను. నగరమునకు నల్దిశలందును పెద్ద పెద్ద మామిడి తోటలు, సాల వృక్షములు పెద్ద సంఖ్యలో విరాజిల్లుచుండెడివి. విమాన గృహములు, నగరము చుట్టు అగాధమైన కందకము లుండుటచే శత్రువులు సులభముగా ఆక్రమణ మొనర్చజాలకుండిరి. అన్ని విధములగు యంత్రములు, అస్త్ర శస్త్రములచ్చట సానుకూల రీతిలో నుంచబడియుండెను. అన్ని రకముల శిల్పులచ్చట నివసించి యుండిరి. గజములు, అశ్వములు, గోవులు, ఒంటెలు, ఖరములు మున్నగు పశువు లచ్చట సమృద్ధముగా నుండెను. అనేక దేశములనుండి వచ్చిన రాయబారులు, వ్యాపారు లచ్చట నివసించుచుండిరి మహిళల కుపయోగమగు నాటకములు మున్నగు చక్కని వ్యవస్థలచ్చట నుండెను. అట్టి నగరమునం దా కాలమున దశరథ మహారాజు రాజ్యమేలుచుండెడివాడు.

**ఆయతా దశ చ ద్వే చ, యోజనాని మహాపురీ ।**

**శ్రీమతీ త్రీణి విస్తీర్ణా, సువిభక్తమహాపథా** ॥ వా. రా. బాల కాండము. ౫-౭ ॥

అనగా; ఈయయోధ్యానగరము ౧౨ యోజనములు (౪౮ మైళ్ళు) పొడవు, మూడు యోజనములు (౧౨ మైళ్ళు) వెడల్పుగలదై యుండెను. పెద్ద పెద్ద విశాలమైన వీధులు, అంగడులు విశేషక్రమములో విభక్తమైయుండెను. రామరాజ్యములో అచ్చటి సదాచార విషయమగు స్థితిని వర్ణించుచు ఈ విధముగా వ్రాయబడియున్నది.

**ప్రహృష్టముదితో లోకః, పుష్టస్తుష్టః సుధార్మికః ।**

**నిరామయో విశోకశ్చ, రామే రాజ్యం ప్రశాసతి** ॥ వా రా. బా. కా. ౧-౯౮ ॥

**నరాస్తుష్టా ధనైః స్వైఃస్వైరలుబ్ధాః సత్యవాదిన ః ॥**

**ముదితాః శీలవృత్తాభ్యాం, మహర్షయ ఇవామలాః ।**

**కామీ వా న కదర్యో వా, నృశంసః పురుషః క్వచిత్ ।**

**ద్రష్టుం శక్తమయోధ్యాయాం, నావిద్వాన్ న చ నాస్తికః ॥ వా. రా. ౬-౮ ॥**

**భావము :-** అచ్చటి ప్రజలందరు అత్యంత ప్రసన్నులు, సంపూర్ణారోగ్యములతో చక్కని బలశక్తులతో నిండు ఉత్సాహము గలవారై యుండిరి. తమ తమ ధనములతో సంతుష్టులు, లోభరహితులు, మరియు సత్యవాదులునైయుండిరి.

సదాచారులు, ఉత్తమ స్వభావశీలురుగానుండు కారణమున ప్రసన్నచిత్తులు, మరియు మహర్షుల వలె పవిత్రులుగా నుండిరి. అయోధ్యాపురి యందెచ్చటను కామికుడుగాని, కృపణుడు ( కుత్సితుడు)గాని, క్రూరుడు గాని, అవిద్వాంసుడు గాని, నాస్తికుడు గాని లేరు.

**నానాహితాగ్నిర్నాయజ్వా, న క్షుద్రో వా నతస్కరః ।**

**కశ్చిదాసీదయోధ్యాయాం, న చావృత్తో న సంకరః ॥౬-౧౦ ॥**

అగ్నిహోత్రాదుల నియమమును పాలించనివాడు, నీచుడు, చోరుడు, దురాచారి, వ్యభిచారోత్పన్నుడు మున్నగువారు అయోధ్య యందు లేరు. ఇట్లు ౮వ సర్గమున వాల్మీకి వ్రాసినాడు.

**శుచీనామేకబుద్ధీనాం, సర్వేషాం సంప్రజానతామ్ ।**

**నాసీత్పురే వా రాష్ట్రే వా, మృషావాదీ నరః క్వచిత్ ॥ ౧౪॥**

**క్వచిన్న దుష్టస్త్రత్రాసీత్, పరదారరతిర్నరః ।**

**ప్రశాన్తం సర్వమేవాసీద్, రాష్ట్రం పురవరంచ తత్ ॥౧౫॥**

అనగా; అయోధ్య వాసులెల్లరును జ్ఞానసంపన్నులు, పవిత్రులు, కలిసి ఆలోచించువారునైయుండిరి. ఒక్క పూర్ణ అయోధ్య నగరమునందే గాదు. రాష్ట్రమం దెచ్చటను అసత్యవాదిగాని, దుష్టుడుగాని, వ్యభిచారులు, కాముకులుగాని మచ్చుకైనా లేకుండిరి. ఈ ప్రకారముగా అయోధ్యా నగరము, మరియు రాష్ట్రమంతా శాంతి యుక్తముగా నుండెను.

మహాభారతములో నున్న ఇంద్రప్రస్థము మున్నగు ఆశ్చర్యజనక విషయములను గ్రంథ విస్తరణ భయముచే వ్రాయుట లేదు. ఇన్ని యథార్థ విషయము లుండగా 'వైదిక్ ఏజ్' లేఖకులు నగర నిర్మాణ విద్య, మరియు నాగరిక సభ్యత ద్రావిడుల నుండియే లభించిన దనుట మూర్ఖత్వము గాక మరే మగును? 'ద్రావిడులు ఓడల ద్వారా సముద్ర యాత్రనొనర్చుచు ఇతర దేశములతో వ్యాపారమొనర్చుచుండి' రను వ్రాయుట మంచిదే. కాని ఓడలలో కేవలము ద్రావిడులే యాత్ర నొనర్చుచు వ్యాపారమొనర్చుచుండిరనుట కెట్టి ప్రమాణములేదు. వేదములలో ఓడల వర్ణన గలదు.

**అనారమ్భణే తదవీరయేథామనాస్థానే అగ్రభణే సముద్రే ।**

**యదశ్వినా ఊహతుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాతస్థివాంసమ్ ॥ ఋ.౮-౮-౫॥**

**సుత్రామాణం పృథివీం ద్యామనేహసం సుశర్మాణమదితిం సుప్రణీతిమ్ ।**

**దైవీం నావం స్వరిత్రామనాగసమస్రవన్తీమారుహేమా స్వస్తయే** ॥ ఋ.౧౦-౬౩-౧౦॥

ఇట్టి విషయములనేక మంత్రములందును గాననగును. నూరుమంది గల నౌక చిన్నదెట్లగును? అది లోతైన సముద్రమున పయనించు పెద్ద నౌకయే యగును. వేదములందు నౌకావర్ణనము, ఆర్యులు నౌకాయాత్ర, విదేశీయులతో సముద్ర వ్యాపారములు చేయుచుండిరి. సుప్రసిద్ధ ఐతిహాసికుడగు డా. రాధా కుముద్ ముఖర్జీ తన *"Shipping in Anicent India"* పేరు గల పుస్తకములో ప్రమాణయుక్తముగా చూపినాడు కావున దీనిని ద్రావిడుల మౌలిక ప్రసాదిత మని యనుట పచ్ఛియబద్ధమే గద?

ధర్మము మరియు సమాజ క్షేత్రము నందు **'ద్రావిడుల'** యను విషయములో స్వయముగా సుప్రసిద్ధ ద్రావిడ లేఖకులు రచనలను చూతము ఉదాహరణ రూపేణ -

*"Origin and Spread of the Tamils"* లేఖకులగు శ్రీ రామచంద్ర దీక్షితార్ మరియు *"The Ancient Dravidians"* లేఖకులగు శ్రీ. టి. ఆర్. శేష అయ్యంగార్ ఎమ్.ఎ. గారల ననుసరించి దిగువ వ్రాయబడుచున్నవి.

౧. మాత రూపములో దేవి పూజ *"The worship of the mother goddess"* కాళి, భద్రకాళి, భగవతి, అంబా, దుర్గా మున్నగు రూపములలో జరగుచున్న పూజ ద్రావిడులు నడిపించినదే. అట్టి పూజ మద్య మాంస మీనాదుల ద్వారా తంత్ర గ్రంథములలో చూపబడినది. **'కుల్లార్ణవ తంత్ర'** మందిట్లు వ్రాయబడియున్నది. చూడుడు.

**మద్యమాంసం విహీనేన, న కుర్యాత్పూజనం శివే ।**

**న తుష్యామి వరారోహే భగలిఙ్గామృతం వినా ॥**

అనగా; హే పార్వతీ ! మద్య మాంసాదులు లేకుండా పూజలు చేయవలదు. నేను వీని ద్వారా లింగపూజాదులు లేకుండా సంతుష్టినొందను అని ఒకవేళ ఇట్టి కుత్సితరకపు పూజ ద్రావిడుల ప్రసాదితమేయని (అందరూ నమ్మినట్లు) నమ్మినచో ఎంతటి లజ్జాకరమైన విషయమో చూడుడు. వాస్తవముగా వేదాది శాస్త్రములందు పరమేశ్వరుని తండ్రి రూపముతో పాటు తల్లి (మాతా) రూపములో కూడా విశ్వసించబడినది. **'త్వం హి నః పితా వసో త్వం మాతా శతక్రతో బభూవిథ । అధాతే సుమ్నమీమహే॥'** ఋగ్వే. ౮-౯౮-౧౧ ॥ **పితా మాతా సదమిన్మానుషాణామ్''** ॥ ఋ. ౬-౧-౫ ॥ అని యుండగా; దున్నలు, గేదెలు, మేకలు, సారాయి సంభోగాదుల ద్వారా జరుగుచున్న కుత్సితమగు పూజ ద్రావిడుల ప్రసాదితమే.

౨. దీనితో గూడ సంబద్ధమైన లింగ (పురుష జననేంద్రియ, నారీయోని సంబంధ) పూజ *(Phallic worship)* ను అది ద్రావిడుల ద్వారా ప్రచలిత మొనర్చబడినదని పైన పేర్కొనిన యిరువురు మరియు ఇతర లేఖకులును విశ్వసింతురు. శివునిపూజ కూడా చాలవరకు ద్రావిడుల ద్వారా ప్రచలితమైనదే. *The Ancient*

*Dravidians* లేఖకులగు శ్రీ శేష అయ్యంగార్ ఎమ్.ఏ. డా. స్టీవన్సర్ గారి అభిప్రాయమును తెలుపుచు దీనిని సమర్థించినారు.

అనగా; ***Dr. Stevenson holds that Siva was the Tamilian God and was worshipped in two forms, one as a spiritual object of meditation and the other as a material symbol or 'Linga' to represent the invisible to the visible eyes. It is said of Ravana that he was a staunch votary of Linga which he worshipped with incense and flowers. From this, it may be inferred that Siva was a Dravidian deity. - The Ancient Dravidians, by T.R. Shesha Iyengar. P. 156***

**భావార్థము :-** 'శివుడు తమిళుల దేవుడు, ఆతని రెండు విధములుగా పూజించుచుండిరి. మొదటిది, ధ్యానము యొక్క ఆధ్యాత్మిక తత్త్వము, రెండవది, భౌతిక చిహ్నమగు లింగము ఇది అదృశ్యమునకు దృశ్య ప్రతినిధి రూపము. రావణుని విషయములో ఇట్లు కలదు. 'రావణుడు లింగపూజ యొక్క గొప్ప ఉపాసకుడు. దాని పూజ నాతడు గంధ పుష్పాదులచే ఒనర్చుచుండెను. ఇట్టి కుత్సిత లింగ పూజలను గూర్చి మనము గర్వించదగినదేమి! దీని వల్లనే మన దేశము యొక్క సదాచారము సర్వ నాశమైనది. వాల్మీకి రామాయణమునందు;

**యత్ర యత్ర ప్రయాతిస్మ, రావణో రాక్షసేశ్వరః ।**

**జామ్బూనదమయం లిఙ్గం, తత్ర తత్ర స్మ నీయతే** ॥ వా. రామాయణము ॥

'రావణుడెచ్చటెచ్చటికి వెళ్ళుచుండునో అచ్చటికి సువర్ణమయ లింగమును తనవెంట తీసికొనిపోవుచుండు' నని వ్రాయబడియున్నది.

వేదములందు శిశ్న దేవుల (కాముకుల) గూర్చి గొప్ప నింద గలదు. అందిట్లు వ్రాయబడియున్నది. **'మా శిశ్నదేవా అపి గుఋృతం నః'** అనగా; లింగపూజ యొనర్చు కాముకులు, వ్యసనపరులు మా యజ్ఞములం దెప్పుడును ప్రవేశింపకుందురు గాక. ॥ ఋ.౭-౨౧-౫॥ **శిశ్నదేవాః - అబ్రహ్మచర్యాః** ॥ నిరుక్తము ४-3-౧౯॥

3. ద్రావిడుల మూడవ ప్రసాదము వృషభము, మరియు నాగపూజ. మొహంజోదారోలో కూడా లింగపూజ, దానితో బాటు నాగపూజ (ఎద్దు, పాముల పూజ)లు ప్రచలితమైయున్నట్లు ప్రమాణములు గాన్పించినవి. ఈపై విషయములు గర్వించదగినవేనా? ఇవన్నియు అజ్ఞాన సూచక విషయములు. వీనివల్ల వ్యక్తులకు గాని, సమాజమునకు గాని, రాష్ట్రమునకు గాని ఎట్టిమేలును కలుగజాలదు. ఐనను శ్రీరామ చంద్ర దీక్షితార్ గర్వముగా ఇట్లు వ్రాసినారు.

***We in South India still worship snakes in the shape of Nagakkal. Though it is popular in South India, it is still more popular in Malabar. It is connected with the fertility cult. There is still the belief that a barren woman becomes big with a child if she offers proper prayers to the Snake Lord. - Origin and Spread of the Tamils. P.47***

అనగా; దక్షిణ భారతములో మేము నాగక్కాల (నాగదేవత) రూపములో సర్ప పూజ యొనర్తుము. దక్షిణ భారతము నందీ నాగపూజ లోకప్రియమైయున్నది. మలబార్‌లోనైతే ఇది విశేషముగా జనప్రియమైయున్నది దీనికి సంతానోత్పత్తితో సంబంధము గల దని ఎంచబడుచున్నది. ఇప్పటికిని ఈ విశ్వాసము ప్రచలితమందున్నది ఒక వంధ్య స్త్రీ సంతానవతి యైనచో నాగదేవత కృపయేయని విశ్వాసము.

ఇట్టి అంధ విశ్వాసములను, ఈ విధముగు నాగపూజాదులను మేము అత్యంత హాస్యాస్పదకము, మరియు అజ్ఞాన సూచకములుగా పరిగణింతుము. ఇది గర్వించదగినదేనా?

౪. ద్రావిడుల నాల్గవ ప్రసాదము చంద్రుని పూజ

*The authors of the early Tamil culture worshipped the moon*

- Origin and spread of the Tamil. P48

ఇదియును అజ్ఞాన సూచక ప్రథ కన్న మరేమియును గాదు. దేవదాసీల కుత్సితమగు ప్రథ సైతము ద్రావిడుల ప్రసాదమే. దేవీదేవతలకు తలవెంట్రుకల సమర్పణ కూడా ఇట్టిదే. లేఖకులు చూపినట్లు ద్రావిడుల సంపర్కముచే ఈ ప్రథ లన్నియు బైబోలోన్, సుమేరియా, గ్రీసు మరియు ఇతర దేశములందును ప్రచలితమైనవి. వాస్తవమునకు ఇవేవియును శ్రేష్ఠ, సభ్యత, మరియు జ్ఞానోన్నతికి సాధనములుగావు. ఇవి అజ్ఞాన యుగపు హాస్యాస్పద ప్రథలు మాత్రమే యై యుండెను. ఇవి ఇతర దేశములందును వ్యాపకమైపోయిన వనిన ఇదేమైన హర్షించదగిన విషయమా?

*The Ancient Dravidians* లేఖకుడగు శ్రీ టి.ఆర్. శేష అయ్యంగార్ ప్రొ. మైక్డోనల్డ్ అభిప్రాయమును ఉదాహరించుచు ఇట్లు వ్రాయుచున్నారు.

*The doctrine of Transmigration is entirely absent from the Vedas and the early Brahmanas. It seems probable that the Indian Aryas borrowed the idea in a rudimentary form from the aborigines. i.e. most probably from the Dravidians.*

*-The Ancient Dravidians P.158.*

అనగా; పునర్జన్మ సిద్ధాంతము వేదములందు గాని, ప్రాచీన బ్రాహ్మణ గ్రంథములందు గాని ఏ మాత్రము గానరాదు. బహుశః భారతీయ ఆర్యులు ఆదివాసుల నుండియో, అధిక సంభవతః ద్రావిడులనుండియో ఈయాలోచనలను పొందియుందురు.

ఇకముందు మేము సప్రమాణముగా ఈ విషయముపై వివేచన మొనర్చెదము. ఏలన 'వైదిక్ ఏజ్' లోను 'వేదములందు పునర్జన్మ ప్రతిపాదనము లే' దను అభిప్రాయము ప్రకటించబడినది. ఈ సత్యమును గూర్చి ఇదివ అధ్యాయములో సప్రమాణముగా చూపెదము. కాబట్టి ఈ విషయ వివేచనమును మేము 'సర్ విలియం హంటర్ రచన *Indian Empire* యొక్క ఒక ఉదాహరణముతో దీని నిక్కడనే సమాప్తమొనర్చెదము. సర్ విలియం హంటర్ అనునాతడిట్లు వ్రాసినాడు.

*Orthodox Hindus are un-fortunately in the habit of claiming the authority of the Veda for thier medieval institutions, for the evil as well as for the good. As a matter of fact, these medieaval institutions, which form the basis of modem Hinduism are the joint product of non-Aryan darkness and of Aryan light. The Scythic and Naga and the so-called aboriginal races with their indifference to human suffering, their polyandric house holds and their worship of fear and blood have left their mark deep in the Hindu law codes, in the terrorising of Hindu religion, and in the degradation of woman. English scholarship has shown that the worst feature of Hinduism, widow burning had no authority in the Veda. When it is equally understood that the other dark features of Hinduism also rest not upon the Vedic Scripture, but are the result of a human* ***compromise between Aryan civilisation and non-Aryan barbarism,*** *the task of the Indian reformer will be half accomplished. It is with* ***a true instinct that the great religious*** *movements of India* ***in our day reject the authority of Medieval Hinduism and appeal back to the Veda.***

- The Indian Empire by Sir William Hunter 1882 Edition.

దృఢ సంకల్పురగు హిందువులు దుర్భాగ్యవశమున మంచి, చెడు పరిపాటులన్నిటి కొరకు వేద ప్రమాణమునే స్వీకరించు స్వభావము గలిగియుండిరి. వాస్తవ సత్యమేమన; ఆధునిక హిందూ ధర్మమునకు ఆధారభూతము మధ్యకాలీన ఆచారములు అనార్యుల అంధకార, మరియు ఆర్యుల జ్యోతి యొక్క సంయుక్త పరిణామమే. శకుల, నాగుల, ఆటవికులగు మానవ కష్టముల యెడ తమ నిర్లక్ష్యము. ఉదాసీనతయే. బహుపతిత్వము, భయము, రుధిరపూజలు, మున్నగు వాని కారణమున హిందువుల విధి విధానము, హిందువుల ఆచారము, ధర్మమును భయంకరమొనర్చుట, మహిళల స్థితిని నికృష్ట మొనర్చి వేయుట వంటి వానిపై గట్టి ప్రభావమును వేసినవి. పాశ్చాత్య విద్వాంసుల పరిశీలననుసరించి హిందూ ధర్మమునకు అతిక్రూరరూపమగు సతీసహగమన విషయమునకు వేదములందెట్టి ప్రమాణములేదు. హిందూ ధర్మము యొక్క ఇతర చెడు ఆచారరూపములన్నియు వేదములపై ఆశ్రయించి గాక ఆర్యుల సభ్యత, మరియు అనార్యుల అనాగరికతల మధ్య సంక్రమించిన పరిణామమని యెరుగవలసి యున్నది. అప్పుడు సంస్కర్తల సగము కార్యము పూర్తియగును. ఇదియే సత్యమగు అంతఃకరణ శుద్ధియగు ఆలోచన. భారతదేశము యొక్క ఆధునిక ఆచారవ్యవహారములన్నియును మధ్యకాలీన అనాచారుల ద్వారా సంక్రమించినవే. స్వార్థులు ఇవి వేదములననుసరించినవి యని తెలుపుట దుస్సాహసమే. సర్ విలియమ్ హంటర్ యొక్క ఈ సంకేతము సంపూర్ణముగా వేదములపై ఆశ్రయించి నడుచు ఆర్య సమాజీయుల ఆందోళనము వైపును బలపరచుచున్నది.



# వేదముల యథార్థ స్వరూపము

## నవమాధ్యాయము

### 9.1 వేదముల అంగభంగమొనర్చు కుయత్నములు

వైదిక్ ఏజ్‌లోని ఆక్షేపణీయమగు అనేక విషయములను ఈ పుస్తకములోని గత అధ్యాయములలో నిరాకరించినాము. వానియందు వేదములను అంగభంగము, (మార్పు చేర్పు) లొనర్చుట వంటి అనుచితయత్నములు కూడా చేరియున్నవి. వాని ననుసరించి ఋగ్వేద అష్టమ మండలమందు పదకొండవ సంఖ్యగల వాలఖిల్య సూక్తము మరియు పదవ మండలము పూర్తిగా వెనుక నుండి ఋగ్వేదములో చేర్పబడినవి పదవ మండలపు దీని భాష ఇతర మండలములకు భిన్నముగా నున్నది. మరియు దీనియందు శ్రద్ధ, దానము, నాసదీయ సూక్తము మున్నగు దార్శనిక, విషయములు మరియు ఇతర విధములగు సూక్తములున్నవి.

'అథర్వవేదము యొక్క ౧౫,౧౬,౧౭,౧౯,౨౦ కాండములు వెనుకనుండి జోడించబడినవి అథర్వ వేదమంతయును వెనుకనుండి వేదములలో సమ్మిళిత పరచబడినది. మొదట లేకుండెను. యజుర్వేదము నందలి తైత్తిరీయ సంహిత, లేక కృష్ణ యజుర్వేదమే ప్రాచీనము. శుక్ల యజుర్వేదమను పేర పిలువబడు వాజసనేయి సంహిత అర్వాచీనము, సామవేదము ఋగ్వేద మంత్రముల దొంగలింతయే. దీనియందు నవీనత్వము, మౌలికత్వ మేమియును లేదు. ఇదే విధముగ ఇతర వేదముల అనేక భాగములు వేదములందు వెనుకనుండి చేర్చబడిన వని నిరూపించు ప్రయత్నమును వైదిక్ ఏజ్ రచయితలు చేయ సాహసించినారు' మేమీ యధ్యాయమునందే ఈ విషయము సప్రమాణముగా వివేచన మొనర్చుటకు ప్రయత్నింతుము. వైదిక్ ఏజ్ రచయితలు ఈ విషయములో ఎట్టి మౌలిక ప్రమాణములు ఈయలేదు. కేవలము పాశ్చాత్య లేఖకుల అవివేకములనే అనుసరించినారు వైదిక శిక్షణలను గూర్చి ఈ గ్రంథములో వ్రాయబడిన భ్రాంతులు అనగా; వేదములలో పునర్జన్మ సిద్ధాంతము లేకుండుట, అథర్వ మరియు ఇతర వేదములందు మాయమంత్రములు, చేతబడులు, బహువివాహములు మున్నగు వాని అభావమును గూర్చి వివేచనము రాబోవు ప్రకరణమున చూపుదుము.

### 9.2 దశమ మండలము తర్వాత చేర్పబడినదా?

మొట్ట మొదట మేము దశమ మండలము గూర్చి వివరింతుము. అది తరువాత చేర్చబడినదని ఏల నమ్మ వలెను? ఇతర పాశ్చాత్య విద్వాంసులు ఈ విషయము నందొనర్చిన అవివేక విషయములనే 'వైదిక్ ఏజ్' లేఖకులు ౨౨౮ పుటలో ఇట్లు వ్రాసినారు.

The tenth Mandala is manifestly a later addition, often Atharvanic in character. (Vedic Age P.228)

అనగా, ఋగ్వేదమందలి దశమ మండలము స్పష్టముగా వెనుకనుండి కలుపబడినదే. దీనియందును అథర్వ వేదమువంటి గారడి, వశీకరణము, మంత్ర తంత్రములవంటివి గాన వచ్చును, మరొక స్థలములో నిట్లు వ్రాసినారు.

That the tenth Mandala is later in origin than the first nine is however, perfectly certain from the evidence of the language. (Vedic Age P.229)

అనగా; దశమ మండలము వెనుకనుండి చేర్చబడినది. మొదటి తొమ్మిది మండలముల కన్న భిన్నమైన భాషాశైలి దీనిని నిశ్చితమొనర్చుచున్నది.

దీని యుదాహరణ రూపములో వైదిక్ ఏజ్ పు.౩౩౯లో ఏ విషయములు చూపబడియున్నవో అవి చాలవరకు కల్పితములే. ఒకే గ్రంథ కర్త తన గ్రంథమునందు సన్నివేశము ననుసరించి వివిధ శైలి గల భాషను ప్రయోగించును. ఒకచోట భాష సరళముగా నుండును. మరొక చోట అంతకన్న కఠినముగా నుండును. వేదములు సమస్త రకముల మనుష్యుల లాభార్థము కొరకై యున్నవి. అందుకొన్ని చోటులందు **'విశ్వానిదేవ సవితర్దురితాని పరాసువ। యద్ భద్రం తన్న ఆసువ'॥** వంటి అతి సరళార్థబోధక మంత్రములుండగా, మరికొన్ని స్థలములందు మహా మహా విద్వాంసుల సైతము వాని వాస్తవికార్థమును దెలిసికొనుట కొరకు మస్తిష్కము యొక్క సంపూర్ణ శక్తిని ప్రయోగించ వలసి యుండును. ఒక్కొక్కచోట ఈ విధమగు శబ్దములవశ్యముగా నుండవలెను. ఒక వేళ అట్టి శబ్దములు రాకున్న వానిని క్రొత్తవిగా నెంచవలయునను, నియమ మేదియు నుండదు. దశమ మండలములో లోక, మోఘ, విసర్గ, గుప్ మున్నగు అనేక క్రొత్త శబ్దములు వచ్చియున్నవి. అవి ప్రక్షిప్త భాగము వాలఖిల్య సూక్తములందును గాక ఋగ్వేదము యొక్క ఇతర భాగములందు గానరావని వైదిక్‌ఏజ్ లేఖకు లనుచున్నారు. అవి కాన్పించినచోట వానిని వారు నిస్సందేహముగా వారి కల్పనలతో ప్రక్షిప్తములని మొదటనే నిర్ణయించి కూర్చున్నారు. వారికి వాని విషయములో ఎలాటి ప్రమాణము లవసరము లేదు. వాలఖిల్య సూక్తములు ప్రక్షిప్తములనుట కెట్టి కారణము లేదు. వానిని గూర్చి ఈ యధ్యాయమందే ముందర ఆలోచింతము.

## ౯.౩ ఋగ్వేదము యొక్క ఇతర మండలములందు 'లోక' శబ్దము

వాస్తవమునకు **'లోకః'** అను శబ్దము దశమ మండలమేగాక దిగువ స్థలములందును వచ్చినది.

ఋగ్వేదమునందు, ౧-౯౩-౬; ౨-౩౦-౬; ౩-౨-౯; ౪-౧౭-౧౭; ౫-౪-౧౧; ౬-౨౩-౩, ౭; ౬-౪౭-౮; ౬-౭౩-౨; ౭-౨౦-౨; ౭-౩౩-౫; ౭-౬౦,౯; ౭-౮౪-౨; ౭-౯౯-౪; ౮-౧౦౦-౧౨; ౯-౯౨-౬; 'లోకాః' అను నీ బహువచనాంత శబ్దము ఋగ్వేదము నందు; ౬-౧౧౩-౯; 'లోకే' అను నీ సప్తమీ ఏకవచన ప్రయోగము ఋగ్వేద; ౩-౨౯-౮; ౫-౧-౬; ౯-౧౧౩-౭౨; ఇన్ని చోట్ల, దశమ మండలము ౧౦-౮౫-౨౪ నగాక వచ్చియున్నవి. వైదిక్ ఏజ్ వారు ఈ భాగములను ప్రక్షిప్తములుగా నెంచకపోవుట ఆశ్చర్యమే. ఇట్టి యథార్థ రహితము సత్య విరుద్ధము లగు విషయములను వారెట్లు వ్రాసినారో!.

## ౯.౪ ఇతర మండలములందు 'మోఘ' శబ్దము

'మోఘమ్' అను ప్రయోగము ఋగ్వేద దశమ మండలమందే గాక సప్తమ మండలములోని నిమ్న మంత్రములందును చూడనగును.

**యది వాహమనృతదేవ ఆస మోఘం వా దేవాం అప్యూహే అగ్నే ।** ॥ఋ.౭-౧౦౪-౧౪॥

**అధా స వీరైర్దశభిర్వియూయా యో మా మోఘం యాతధానేత్యాహ** ॥ ఋ.౭-౧౦౪-౧౫ ॥ కావున వైదికఏజ్ వారి కథనము యథార్థము కాదు.

## 9.5 సప్తమ మండలమున 'విసర్గ' శబ్దము

ఋగ్వేద సప్తమమండలము ౧౦౩ సూక్తము తొమ్మిదవ మంత్రము నందు **'సప్తా ధర్మా అశ్నువతే విసర్గమ్'** అనురూపమున విసర్గ శబ్దము వచ్చియున్నది. దశమ మండలమందును కేవలము ౧౦-౫-౬ వ మంత్రమందే గలదు. **'విజయ'** శబ్దము ఋగ్వేద దశమమండల మందును కేవలము ఒకసారే ౧౦-౮-౪; లో వచ్చినది. విజయన్తే యొక్క ప్రయోగము ఋగ్వేద ౨-౧౨-౯లో **'యస్మాన్న ఋతే విజయన్తే జనాసః'** అను రూపములో వచ్చినది. ఇంతియేగాక **జయతి** శబ్దము ఋగ్వేద౧-౩౬-౪, ౪-౫౦-౯, ౬-౭౫-౫; ౭-౩౨-౯, ౯-౮౬-౪౦లో **జయతు** శబ్దము ఋ. ౬-౪౭-౨౬ **జయన్** ఋ.౪-౧౭-౧౦; ౫-౩౧-౬; ౬-౭౩-౨, ౯-౮౫-౪౨; లో **జయన్తమ్** ఋ. ౧-౯౧-౨౧; ౫-౪౪-౧; ౬-౭౫-౧౮; లోను, **జయన్తి** ఋ.౮-౧౬-౫; లో **జయన్తీ** ౧-౧౧౬-౧౭; ౧-౧౨౩-౨ లోను, **జయన్తు** ఋ. ౬-౪౭-౩౧; లో **జయసి** ఋ. ౯-౮౫-౩లో **జయాతి** ఋ ౫-౩౭ -౫లోనూ, **జయావసి** ఋ.౪-౫౭-౧లో **జయావ** ఋ.౧-౧౭౯-౩ లో **జయేమ.** ఋ. ౧-౮-౩, ౧-౧౨౩-౫; ౮-౨౧-౧౨; ౮-౬౮-౯, ౯-౯౨-౧౧; ౯-౬౧-౨౩; ౯-౮౫-౮లో మరియు **జయేమ** ఋ.౧-౧౦౨-౪; ౨౦-౪౦-౫; ౪-౨౦-౩; ౫-౨-౧౧ ; ౫-౪౧ ౬-౮-౬; ౭-౮౨-౧; ౭-౯౮-౪; మున్నగువానిలో ప్రయోగము గలదు. కావున విజయ శబ్దము ఆధారమున దశమ మండలము అర్వాచీనమని చెప్పు ప్రయత్నము సంపూర్ణముగా వ్యర్థము మరియు దుస్సాహసమే విజయ శబ్దము రాక ఒక వేళ **వయం జయేమ త్వయాయుజా** మున్నగు ప్రయోగములు వచ్చినచో భేద మేమి వచ్చిపడినది?

**'మీమ్'** శబ్ద విషయములో ఋగ్వేదపు తొమ్మిదవ మండలములో అది ౫౦ సార్లు వచ్చినది. పదవ మండలము నందొక్కసారే వచ్చినదని వారందురు. దీనివల్ల ఏమియును సిద్ధింపదు. వచ్చిన దని వారు నమ్ముచున్నారు ఒక శబ్దము అనావశ్యక రూపములో మాటిమాటికి రావలసిన యవసరము లేదు. **ఆజ్య, కాల, లోహిత, విజయ** అను శబ్దములు మొదటిసారి దశమ మండలములో వచ్చినచో దీనివల్ల ఏమియును సిద్ధింపదు. వేర్వేరు మండలములందు వేర్వేరు విషయములు, మరియు నట్టి ప్రతిపాదక ఉనికిని చూడబడినను దీనివల్ల వాని నవీనత్వ మెట్లు సిద్ధించగలదు? **'సర్ప, ప్రాణ, భగవాన్, హృదయ,** మున్నగు శబ్దములు *Mostly, though not exclusively'* అంతటను లేవు. ఈ దశమ మండలమందే యున్న' వని వారని నారు. అట్టి శబ్దములు ఇతర మండలము లందును వచ్చియున్నచో వీరి యీ నవీనత్వపు యుక్తి యేయగును? ఒకవేళ యీ విషయమును విశ్వసించితిమే యని అనుకొన్నను కొన్ని క్రొత్త శబ్దములు (మొదట ఉపయోగింపబడనివి) వచ్చినందువల్ల నవీనత్వ సిద్ధి యగుచున్నదను దానిని మేమంగీకరించలేము. వేదమును మనము ఈశ్వరీయ వాణిగా విశ్వసింతుము. దీనియందు ఆవశ్యకత ననుసరించి సంపూర్ణ బుద్ధి పూర్వక శబ్ద ప్రయోగమున్నది. **'బుద్ధి పూర్వా వాక్యకృతిర్వేదే'** - వైశేషిక దర్శనము.

అయా శబ్దములు మొదటి మండలములం దేల రాలేదు? ఈ స్థానము, లేక ఒకానొక మండలమునం దెట్లు వచ్చిన' వని ప్రశ్నించు అధికారిము మనకు లేదు. ఇట్లు ప్రశ్నించుట మన మూర్ఖత్వము, దుస్సాహసమే యగును. విషయ భేదము ననుసరించి వేర్వేరు శబ్దముల ప్రయోగము జరుగుచుండునను మాట సామాన్య రచయితలు కూడా యెరుగుదురు.

ఒకే రచయిత తన గ్రంథములందు విషయ భేద కారణములచే అనేక విధములుగా భాషా శైలిని ప్రయోగించ గలడు. ఇందుకు కొన్ని స్పష్టమగు ఉదాహరణములివి.

౧. పాణిని యొక్క '**అష్టాధ్యాయి**' సూత్రముల భాష వారి '**జాంబవతీ విజయ**' మను మహాకావ్యము యొక్క భాషకు భిన్నముగా నున్నది.

౨. జైమినీయ మీమాంసా సూత్రముల భాషకు, జైమినీయ బ్రాహ్మణముల భాషకు అత్యధికముగా భేదము గలదు.

౩. శౌనకుని 'ఋక్కు ప్రాతిశాఖ్య భాషకు, శౌనకప్రోక్త ఐతరేయ ఆరణ్యకము నందలి పంచమారణ్యక భాషఎంతో భిన్నముగనున్నది.

౪. కాత్యాయన శ్రౌత సూత్రమునకు కాత్యాయన స్మృతి భాషకు ఎంతయో భేదమున్నది.

ఇట్టివే అనేక ఉదాహరణముల నీయవచ్చును. వర్తమాన కాలపు సుప్రసిద్ధ లేఖకుల ఉదాహరణము దీసికొనవలెనన్న శ్రీ అరవిందులవారి *Life Divine* యొక్క క్లిష్ట భాష మరియు శైలి కన్న *The yoga and its object*, మరియు *Bases of yoga* మున్నగు వాని సరళ భాష మరియు శైలి యందు ఆకాశ, పాతాళ భేదము గలదు.

సాధారణముగా మొదటి మండలము లందున్న పృత్సు, గిర్వణః, విచర్షిణిః, వీతి వంటి ప్రయోగములు దశమ మండలములో గానరావు. ఐతే నేమైనది? ఒకే రకపు శబ్దముల ప్రయోగము అంతట అవసరమా? విచర్షిణి స్థానములో **ప్రచేతా, విశ్వవేదాః** వంటి శబ్దముల ప్రయోగము దశమ మండలమందున్నచో అందువల్ల గలిగిన నష్ట మేమి? ( భేదమేమి? ) **విచర్షణిః** - శబ్దము పంచమ, మరియు సప్తమ మండలములందును లేనిచో అవి అర్వాచీనమని సిద్ధియగునా? ఈ లేఖకులు చేసిన దశమ మండల ఆక్షేపణ నిస్సారమైనదే. వాస్తవమునకు వారి విషయము లన్నియు మైక్డోనల్ మున్నగు పాశ్చాత్య లేఖకుల గ్రంథముల నుండి చూచి వ్రాసినవియే. **హిరణ్య గర్భ సూక్తము, నాసదీయ సూక్తము, శ్రద్ధా సూక్తము, మన్యు సూక్తము** మున్నగునవి చూచివారికి ఆశ్చర్యము కలిగినది. ఆధ్యాత్మిక, దార్శనిక, మనో వైజ్ఞానిక విషయములపై అటవికులు ఆలోచించగలరా? యని యెంచి వెనుక నుండి సృష్టించబడినవై యుండవచ్చు నని భావించినారు. భాషా భేదమునన దొక సాకుగా వినియోగించు కొనినారు. ఈ విషయములో సుప్రసిద్ధ భారతీయ విద్వాంసులగు శ్రీ. పం. సత్యవ్రత సామశ్రమీగారు '**త్రయీ పరిచయ**' మను పేరుగల తన విద్వత్ పూర్ణమగు గ్రంథములో చాల చక్కగా వ్రాసినాడు. అనగా;

**ఏవం దశమమణ్డలస్య ఋక్పరిశిష్ట రూపత్వం కల్పయితుం తైః (పాశ్చాత్య విపశ్చిద్భిః) భాషాపార్థక్యప్రదర్శనాదిప్రయాసః స్వీకృతః - దశమమణ్డలస్య భాషా మన్త్రార్థగతతాత్పర్యాణి చ**

ప్రథమమణ్డలాదిభ్యః పృథగేవేతి నూనం తస్య నవమమణ్డల పరిశిష్టరూపత్వమితి తదాశయః। కిమత్ర బ్రూమో వయమ్? అస్మచ్ఛ్రుతిషు హి దశమమణ్డలస్య మణ్డలాన్తరాణాం చ భాషా ఏక విధైవోపలభ్యతే, అస్మద్ బుద్ధిషు చ తథైక విధమేవ తాత్పర్యమితి న జానీమహే కేషాం బుద్ధిమాలిన్యం కేషాం వా హఠకారిత్వమితి. ॥ త్రయీ పరిచయః పు.౪౯॥

ప్రథమాది మణ్డలేషు శ్రుతానాం బహూనాం సూక్తానాం దశమమణ్డల స్థితానాం చ బహూనాం సూక్తానాం ద్రష్టారోఽభిన్నా ఏవావగమ్యన్తే పరిశిష్ట వాదినాం మతే తత్ కథముపపద్యేతేతి విచారయన్త్వత్ర మాధ్యస్థ్యపదమాదధానా ఏవేతి ॥ త్రయీ పరిచయః పు.౫౧॥

అనగా; ఈ విధముగా ఋగ్వేద దశమమండలమును పరిశిష్టము (అనుబంధము, లేక వెనుక నుండి చేర్చబడినది) అని తెలుపుటకు ప్రయత్నమొనర్చబడినది. దశమ మండలము యొక్క భాష, మరియు మంత్రముల తాత్పర్యము మొదటి మండలములకు భిన్నముగా నున్నదని వారి కథనము. కావున ఇది నవమమండలము యొక్క పరిశిష్టమై యున్నదని చెప్పుటకు ప్రయత్నించినారు. మేము చూచినంతవరకు దశమ మండలము, మరియు ఇతర మండలముల భాష ఒకే విధముగ నున్నది. మా బుద్ధి యందు వాని తాత్పర్యము కూడా ఇతర మండలములవలె ఒకే విధముగ నున్నది. ఎవరి బుద్ధిమలినముగ నున్నదో ఎవరు హఠులో పాఠకులాలోచించవలెను.

మొదటి మరియు ఇతర మండలములందలి సూక్తముల, మరియు దశమ మండలమందలి అనేక సూక్తముల ద్రష్ట ఒకే ఋషియైయున్నాడు. పరిశిష్టవాదుల అభిప్రాయానుసారమిది ఎట్లు సాధ్యమగునో పక్షపాతరహితులగు విద్వాంసులు మాత్రమే ఆలోచించగలుగుదురు.

వాస్తవమునకు పాశ్చాత్య వికాసవాదులు, మరియు ఈసాయి మత పక్షపాతులగు విద్వాంసులు హిరణ్య గర్భ సూక్తము విశేషించి, **'ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ'॥**

మున్నగు మంత్రములలో ప్రతిపాదింపబడిన ఏకేశ్వరవాదమును గాంచి అత్యంతాశ్చర్యము గలిగినది. వారు దశమ మండలమును వెనుకనుండి చేర్చినారని మైక్స్ మూలర్ కూడా ఈ విధముగా వ్రాయవలసి వచ్చినది.

*"This is one the hymns which have always been suspected as modern by European interpreters" - Vedic Hymns by Prof. Max Muller*

యూరోపీయ వ్యాఖ్యాకారులు ఎప్పుడును నవీనమని సందేహమును వెలిబుచ్చునట్టి అనేక సూక్తములలో నిదే ఈ **'హిరణ్య గర్భ'** సూక్తమని యెరుగవలెను.

**'ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ।**

క్రైస్తవ మత పక్షపాతముతో ఈ మంత్రమునకును ప్రొ. మాక్స్ మూలర్ ఇట్లు వ్యాఖ్యానొనర్చినాడు.

"The last verse is to my mind the most suspicious of all"

అనగా; ఈ అంతిమ మంత్రము అత్యంత సన్దిగ్ధమైనదని నాయభిప్రాయము అని -

ఋగ్వేదమునందలి మొదటి తొమ్మిది మండలములందును **అగ్ని, మిత్ర, వరుణ, ఇన్ద్ర,** మున్నగు నామములు ముఖ్యముగా పరమేశ్వరుని గూర్చియే చెప్పబడినవి. మొదటి మండలములోనే ఈ విధముగా చెప్పబడియున్నది.

**'ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్।**

**ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః'** ॥ఋ.౧-౧౬౪-౪౬॥

అనగా; విద్వాంసులు ఆ యొకే పరమేశ్వరుని ఇన్ద్ర, మిత్ర, వరుణ, అగ్ని, యమ, మాతరిశ్వా, మున్నగు అనేక నామముల బిలుతురు. ఋగ్వేద ద్వితీయ మండలములో

**త్వమగ్న ఇన్ద్రో వృషభః సతామసి త్వం విష్ణురురుగాయోనమస్యః।**

**త్వం బ్రహ్మా రయివిద్ బ్రహ్మణస్పతే త్వం విధర్తః సచసే పురన్ధ్యా।** ॥ఋ.౨-౧-౩॥

**త్వమగ్నే రాజా వరుణో ధృతవ్రతస్త్వం మిత్రో భవసి దస్మ ఈడ్యః।**

**త్వమర్యమా సత్పతిర్యస్య సంభుజం త్వమంశో విద థే దేవభాజయుః।** ॥ఋ.౨-౧-౪॥

మున్నగు మంత్రముల ద్వారా ఒకే పరమేశ్వరుని అగ్ని, ఇన్ద్ర, విష్ణు, బ్రహ్మ, వరుణ, మిత్ర, అర్యమా, అను అనేక నామములతో బిలుచుచు ఏకేశ్వర వాదమును గట్టిగా సమర్థించబడినది. దశమ మండలముకన్న నిది ఏమాత్రము తక్కువకాదు.

తృతీయ మండల మందును 'ఇన్ద్ర' యనుపేర పరమేశ్వరుని స్మరించుచు

**త్వం హి ష్మా చ్యావయన్నచ్యుతాన్యేకో వృత్రా చరసి జిఘ్నమానః।**

**తవ ద్యావాపృథివీ పర్వతాసోऽను వ్రతాయ నిమితేవ తస్థుః ॥ ఋ.3-30-4 ॥**

**ఉతాభయే పురుహూత శ్రవోభిః ఏకోదృలమవదో వృత్రహా సన్।**

**ఇమేచిదిన్ద్ర రోదసీ అపారే యత్ సంగృభ్ణా మఘవన్ కాశిరిత్తే ॥ ఋ.3-30-5॥**

ఇట్టి మంత్రముల ద్వారా పరమేశ్వరుడొక్కడే సమస్త విఘ్నములను, పాపములను, అజ్ఞానాదులను నష్టపరచును. పృథివి, ఆకాశము, పర్వతములు, మున్నగున వన్నియును ఆయన నియమముల ననుసరించియే కార్యములొనర్చును. వీనినన్నిటిని ఆ పరమేశ్వరుడు తన వశమున నుంచుకొన్నాడు. దశమ మండల మంత్రములన్నియును ఏకేశ్వరవాదమును ప్రతిపాదించునవియై యున్నవి. చతుర్థమండలములో

**య ఏక ఇచ్చ్యావయతి ప్రభూమా రాజా కృష్టీనాం పురుహూత ఇన్ద్రః।**

**సత్యమేనమను విశ్వే మదన్తి రాతిం దేవస్య గృణతో మఘోనః ॥ ఋ.4-17-5॥**

మున్నగు మంత్రములందును ఏకేశ్వర పూజా భావమే స్పష్టముగనున్నది. మానవులెల్లరకును ఆ ఏకైక ఈశ్వరుడే ప్రభువు. ఆ సత్య స్వరూపుడగు పరమేశ్వరుని దానమునే విద్వాంసులెల్లరును కీర్తింతురు. పంచమ మండలములోని,

**ఏకం ను త్వా సత్పతిం పాంచజన్యం జాతం శృణోమి యశసం జనేషు ।**

**తం మే జగృభ్ర ఆశసో నవిష్ఠం దోషావస్తోర్హవమానాస ఇన్ద్రమ్** ॥ ఋ ౫-౩౨-౧౧॥

ఇట్టి మంత్రములందును పరమేశ్వరుడొక్కడే, ఆయనే సర్వ ప్రాణుల స్వామి, మరియు సర్వ హితకారియునై యున్నాడని గలదు. ఆరవ మండలమున;

**య ఏక ఇత్తము ష్టుహి కృష్టీనాం విచర్షణిః । పతిర్జజ్ఞే వృషక్రతుః** ॥ ఋ.౬-౪౫-౧౬॥

మున్నగు మంత్రములందును పరమేశ్వరుడే సర్వజ్ఞుడు, సర్వమునకు స్వామి, మరియు సర్వశక్తిమంతుడునై యున్నాడని స్పష్టముగా ఆదేశించబడియున్నది. కావున మానవులెల్లరును సదా ఆయననే స్తుతించవలయును. ఇదే విధముగ ఇతర అన్ని మండలములోను మంత్రములందును ఏకేశ్వర పూజను ప్రతిపాదించు మంత్రము లనేకములుగలవు. కేవలము దశమమండలమునందే కొన్ని కొన్ని మంత్రములే ఏకేశ్వర పూజను మరియు దార్శనిక భావములను ప్రతిపాదించునవి గలవు. ఇతర మండలము లందు లేవని భావించుట సంపూర్ణ మూర్ఖత్వమే

దశమ మండలమున నున్నట్లే ద్వితీయ మండలమందును శ్రద్ధావిషయక మంత్రములనేకములు గలవు.

**స ఇజ్జనేన స విశా స జన్మనా స పుత్రైర్వాజం భరతే ధనా నృభిః ।**

**దేవానాం యః పితరమావివాసతి శ్రద్ధామనా హవిషా బ్రహ్మణస్పతిమ్** ॥ ఋ.౨-౨౬-౩॥

ఇట్లే ఇతర అనేక మంత్రములందును శ్రద్ధను ప్రతిపాదించుటతో బాటు దాని ఉత్తమ ఫలము చక్కగా వర్ణించబడినది. పాశ్చాత్య లేఖకులు దశమ మండలమును నవీనమని యెంచుట పక్షపాతమే తప్ప వాస్తవ మేమియును లేదు. భాషాభేద మనునదియును కేవలము వారి కల్పనయే. దిగువ చూపినట్లు వారియభిప్రాయములం దే మాత్రమును సారములేదు. భాషా భేదమను కల్పిత ఆధారముతో దశమమండలము వెనుకనుండి చేర్చబడినదని చెప్పుచునే ప్రొ. మాక్స్ మూలర్ ఇట్లు వ్రాయుచున్నాడు.

Never the less the supplements collected in it (Tenth Mandal) appear for the most part to be older than the additions which occur in the earlier books.

- The History of Sanskrit Literature by Macdonal. -P.44

'ఐనను దశమ మండల సూక్తములోని మిశ్రణములు ఇతర మండలములకన్న ప్రాచీనమని యనిపించును.' ఇతర మండలములందు కల్తీ కలదా, లేదా? యనునది వేరే విషయము. మేము తరువాత నిచ్చు ఆధారముతో దశమ మండలము నవీనమని తెలుపు కల్పన స్వయముగానే రూపుమాసిపోగలదనుటలో సందేహములేదు. దశమ మండలము యొక్క ఋషు లనేకులు అతిప్రాచీనులు. ఉదాహరణార్థము :-

| | |
|---|---|
| వైన్య పృథు | ౧౦-౧౪౮ । |
| అదితి దాక్షాయణీ | ౧౦-౭౨ । |
| ప్రజాపతి పరమేష్ఠీ | ౧౦-౧౨౯ । |
| నాసదీయ సూక్తఋషి వివస్వాన్ | ౧౦-౧౩ । |
| యమ వైవస్వత | ౧౦-౧౪ । |
| యమీ వైవస్వతీ | ౧౦-౧౫౪ । |
| యమయమీ | ౧౦-౧౦ । |
| నాభా నేదిష్ఠ | ౧౦-౬౧,౬౨ । |
| శర్యాత | ౧౦-౯౨ । |
| బుధ | ౧౦-౧౦౧ । |
| పురూరవా | ౧౦-౯౧ । |
| శచీ పౌలోమి | ౧౦-౧౫౯ । |
| త్రిశిరాః | ౧౦-౮౯ । |
| బృహస్పతి ఆఙ్గిరస | ౧౦-౭౧ । |
| **జ్ఞాన సూక్తము** | |
| చ్యవన | ౧౦-౧౯ । |
| మాన్ధాతా యౌవనాశ్వ | ౧౦-౧౩౪ । |
| జమదగ్ని | ౧౦-౧౧౦ । |

ఈ సూక్తుల ఋషులు ఎంతో ప్రాచీనమైన వైవస్వత మనువు కాలము వారగుచున్నప్పుడు దానిని నవీన రచనలనుట ఎంత దుస్సాహసమో చూడుడు. **'మన్యు'** అను శబ్దము ఋగ్వేద మొదటి మండలములో 3సార్లు, రెండవ మండలమందు ౨ సార్లు, నాల్గవదానియందు ౨ సార్లు, ఐదు, ఆరులో రెండుసార్లు, ఏడవదానిలో నాలుగు, తొమ్మిదిలో ఒకసారి, పదవ మండలములో ౪ సార్లు వచ్చినది. కావున; ఈ శబ్దము నవీనమైనది. ఇది దశమమణ్డలమందే మొదటిసారి వచ్చినది. కాబట్టి దీని నవీనత్వము సిద్ధియగుచున్న దని చెప్పుట సంపూర్ణముగా అబద్ధము.

**'శ్రద్ధా'** యను శబ్దము కూడా ఋగ్వేద మొదటి మండలములో 3సార్లు రెండులో ఆరు, ఏడు, ఎనిమిదిలో ఒక్కొక్కసారి, తొమ్మిదిలో రెండుసార్లు పదవమండలములో ౫ సార్లు వచ్చినది. ఈ కారణమున పదవ మండలము యొక్క ఆర్వాచీనత్వము సిద్ధ పరచు ప్రయత్నము సంపూర్ణ అశుద్ధమైయున్నది.

**'విశ్వేదేవాః'** శబ్దము ఋగ్వేదము మొదటి మండలములో మూడు సూక్తములకు దేవత మూడవ మండలములో రెండు సూక్తములకు; నాలుగు, ఐదు, ఏడు, ఎనమిదవ మండలములో ఒక్కొక్కదానికి, ఎనిమిది, తొమ్మిదిలో రెండింటికి, దశమ మండలములో మూడు సూక్తములకు దేవత ఈయాధారముపైనను పదవ మండలము ఆర్వాచీన (ఆధునిక) మని నిరూపించు ప్రయత్నము సంపూర్ణముగా పొసగదని చెప్పుటలో సందేహము లేదు.

**'ఉషస్సు'** అను శబ్దము మొదటి మండలములో ౩౨ సార్లు, రెండులో ౯ సార్లు, మూడులో ౧౬, నాల్గలో ౨౭, ఐదులో తొమ్మిది, ఆరులో ౧౪, ఏడులో ౨౯ ఎనమిదిలో ౨, తొమ్మిదిలో ౨, పదవ మండలములో ౨౩ సార్లు వచ్చినది. అనువాకానుక్రమణీక మరియు చరణ వ్యూహమునందిట్లు వ్రాయబడియున్నది.

**'అధ్యాయాశ్చ చతుః షష్టిః, మణ్డలాని దశైవ తు ।**

అనగా; ఋగ్వేదములో ౬౪ అధ్యాయములు, ౧౦ మండలము లున్నవి.

పది మండలములుండు కారణముననే ఋగ్వేదము యొక్క నిర్దేశనము యాస్కాచార్యుల నిరుక్తములో **'దాశతయీ'** అను పేర చేయబడియున్నది. దశమ మండలము యొక్క ఆధునికత్వము విషయములో **'మైక్డోనెల్'** అనునాతడు 'సూక్తములో సంఖ్య మొదటి మండలమునకు సమానమై యున్నదని చెప్పుట సంపూర్ణముగా హాస్యాస్పదమే. దీని మీమాంస యొనర్చుటయు అనావశ్యకమే. ఇప్పుడు మనము **'వాలఖిల్య'** సూక్తముల విషయములో విచారించవలసి యున్నది.

### ౯.౬ వాలఖిల్య సూక్తము ప్రక్షిప్తమేనా?

ఎనిమిదవ మండలములో ౪౯ నుండి ౫౯ వరకు ౧౧ సూక్తములున్నవి వీని ప్రచారకులు **'వాలఖిల్యు'** లగు కారణమున నవి **'వాలఖిల్య సూక్తము'**లని పిలువబడుచున్నది. ఈ విషయములో పాశ్చాత్య విద్వాంసు లనేకులు, మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసులు 'వైదిక్ ఏజ్' రచయితలు గూడ 'ఈ వాలఖిల్య సూక్తములు అష్టమ మండలములో ఎవరో వెనుక నుండి చేర్చినా' రని చెప్పుచున్నారు. ఇంతేగాక రెండు పరస్పర విరుద్ధములగు అభిప్రాయములను ఈ ఎనిమిదవ మండల విషయములో వ్రాసియున్నారు. 'వైదిక్ ఏజ్ ౨౨౯ వ పుటలో ఎనిమిదవ మండలమునకు కొన్ని ఇతర మండలములకన్న విశేషతగలదని యిట్లు వ్రాసినారు

This peculiarity of the eighth Mandala, does suggest - but by no means proves that the Eighth Mandala was subjoined at a later date to the kernal constituted by the family Mandalas. But there is positive reason to believe that there was a time when the eighth Mandala was actually considered to be the last in the Samhita, for why else should the Balakhilya hymns be thrust into the eighth Mandala and not added after the tenth. -Vedic Age P.229.

అనగా; అష్టమ మండలము యొక్క విశేషత్వముచే ఇట్టి సంకేతము లభించుచున్నది. అనునది ఏమాత్రము సిద్ధింపదు. ఏమన; అష్టమమండలమును దాని పరివారములతో సంబంధమున్న (రెండు నుండి ఏడవ) మండలములలో వెనుకనుండి సమ్మిళితపరచబడినది. కాని దీనిని విశ్వసించు కారణమేమన; ఒక కాలములో అష్టమ మండలము ఋగ్వేద సంహిత యందు చివరిదని ఎంచబడుచుండెడిది. అట్లుగాకున్న వాలిఖల్య సూక్తములను అష్టమ మండలమందే ఎందుకు దూర్చుట (చొప్పించుట) జరిగినది? దశమ మండలమందేల కలుపబడలేదు? నిష్పాక్షికముగా ఆలోచించినప్పుడు ఈ విషయము సంబద్ధరహిత మనియే యనిపించును. మొదటి విషయము లేఖకులే అష్టమమండలము సంహిత యందు నిశ్చయముగా వెనుక నుండి చేర్చబడినదే యని చెప్పలేమని, అనిశ్చిత విషయమును నిర్ధారణ చేయలేమందురు. వాలఖిల్య సూక్తమును ప్రక్షిప్తమని చెప్పుటకు ఈ దిగువ యాధారము నిత్తురు. ఐతరేయ బ్రాహ్మణములో **'వజ్రేణ వాలిఖిల్యాభిర్వాచః కూటేన'॥** వ్రాయబడియున్నది. దీని వ్యాఖ్య సాయణాచార్య లిట్లొనర్చినారు.

**వాలిఖిల్యనామకాః కేచన మహర్షయః తేషాం సమ్బన్ధీన్యష్టౌ సూక్తాని విద్యన్తే।**

**తాని వాలఖిల్య నామకే గ్రన్థే సమామ్నాయన్తే।**

దీని భావమేమన; వాలఖిల్య అను పేరు గల ఎవరో ఒక మహర్షి యుండెను. ఆతని ౮ సూక్తములు వాలఖిల్య అను పేరుతో గ్రంథములో చేర్చబడినవని అభిప్రాయ పడినాడు. శ్రీ సాయణాచార్యుని ఈ లేఖ వల్ల **'వాలఖిల్యు'** డను ఒక మహర్షి పేరును వారు వినియుందురు. కాని యథార్థముగా అట్టి మహర్షి విషయములో ఆతనికి నిశ్చితమగు అభిప్రాయము లేకుండెను. మరియు **'వాలఖిల్య'** అను పేరు గల గ్రంథమేదియును కనబడలేదు. ఋగ్వేదమునుండియే వాలఖిల్య మహర్షి ద్వారా ప్రచారమైన కొన్ని సూక్తముల గ్రహించి వ్రాసినాడని తోచుచున్నది. అవి యివి.

**యో నో దాతా వసూనామిన్ద్రం తం హూమహే వయమ్ ॥** ఋ.౮-౫౧-౫ ॥

**యస్మై త్వం వసో దానాయ శిక్షసి స రాయస్పోషమశ్నుతే।**

**తం త్వా వయం మఘవన్నిన్ద్ర గిర్వణః సుతావన్తో హవామహే ॥** ఋ.౮-౫౧-౬॥

**కదాచన స్తరీరసి నేన్ద్ర సశ్చసి దాశుషే।**

**ఉపోపేన్ను మఘవన్ భూయఇన్ను తే దానం దేవస్య పృచ్యతే ॥** ఋ.౮-౫౧-౭ ॥

**యో నో దాతా స నః పితా మహాం ఉగ్ర ఈశానకృత్ ॥** ఋ.౮-౫౨-౫ ॥

**విశ్వా ద్వేషాంసి జహి చావ చా కృధి విశ్వే సన్వన్త్వా వసు ॥** ఋ.౮-౫౩-౪ ॥

**యదిన్ద్ర రాధో అస్తి తే మాఘోనం మఘవత్తమ।**

**తేన నో బోధి సధమాద్యో వృధే భగో దానాయ వృత్రహన్ ॥** ఋ.౮-౫౪-౫॥

**యమృత్విజో బహుధా కల్పయన్తః సచేతసో యజ్ఞమిమం వహన్తి।**

**యో అనూచానో బ్రాహ్మణో యుక్త ఆసీత్ కాస్విత్ తత్ర యజమానస్య సంవిత్ ॥** ఋ.౮-౫౮-౧॥

ఏక ఏవాగ్నిర్బహుధా సమిద్ధ ఏకః సూర్యో విశ్వమను ప్రభూతః ।
ఏకైవో షాః సర్వమిదం విభాత్యేకం వా ఇదం వి బభూవ సర్వమ్ ॥ ఋ.౮-౫౮-౨॥
ఇన్ద్రా వరుణా సౌమనసమదృప్తం రాయస్పోషం యజమానేషు ధత్తమ్ ।
ప్రజాం పుష్టిం భూతిమస్మాసు ధత్తం దీర్ఘాయుత్వాయ ప్రతిరతం న ఆయుః ॥ ఋ.౮-౫౯-౭॥

వేద ప్రేమికులే విధముగా సరళార్థకములు, అత్యంత ఉపయోగకరములగు మంత్రములను సంకలితమొనర్చుకొని సంగఠన సూక్తము ॥ ఋ ౧౦-౧౯౧ ॥, స్వరాజ్య సూక్తము ఋ.౧-౮౦ ॥, శివ సంకల్ప మంత్రములు ॥ యజు. ౩౪, ౧-౬ ॥మున్నగు వానిని గ్రంథ రూపములో చేసికొనినచో అవిప్రక్షిప్తములు కాజాలవు. కాని సరళత్వ కారణమున అధిక ప్రసిద్ధి లోక ప్రియత్వమే దీనివల్ల సిద్ధియగుచున్నది.

ఇచ్చట నొక విషయము సూచించవలసియున్నది. ఐతరేయ బ్రాహ్మణమును ఆధారము చేసికొనినచో పాశ్చాత్య విద్వాంసులతోకస్వా. హరిప్రసాద్, పం. రఘునందన శర్మ వంటి వారు వాలఖిల్య సూక్తములను ప్రక్షిప్తములని నమ్మెదురు. స్వయముగా ఐతరేయ బ్రాహ్మణ విద్వాంసులు కొందరును ప్రక్షిప్తములని యెంతురు. ఉదా:- *Encyclopedia Britannica* యొక్క *Ancient Sanskrit Literature* విషయక లేఖయందు వ్రాయబడినది ఇట్టి స్థితియందు ఒక సందిగ్ధ, మరియు ప్రక్షిప్త వాక్యము ద్వారా కొన్ని సూక్తముల ప్రక్షిప్తత్వమును సిద్ధిచేయజాలము.. ఈ సూక్తము ఋగ్వేద సంహితయందు ప్రారంభమునుండియే గలదు. కొన్ని కొన్ని శాఖలందు ఇట్టి భేదము గాన్పించును. ఏలన వాని సంకలనము విశేష ఉద్దేశ్యముతో నొనర్చబడినది. వీని భాష, మరియు భావము ఋగ్వేదము యొక్క ఇతర సూక్తముల, మరియు భావముల వలెనేయున్నది. ఇందు భేద మేమియును గాన్పించదు. ప్రొ.మైక్స్‌మూలర్ యూరోపునందు వెలువరించిన ఋగ్వేద శుద్ధ సంస్కరణము నందును ఈ సూక్తము విద్యమానమై యున్నది.

జర్మనీ దేశపు సుప్రసిద్ధ విద్వాంసుడగు డా. విన్టర్నిజ్ ఈ సూక్తముల ప్రాచీనత్వము గూర్చి భారతీయ సాహిత్యపు ఇతిహాస మను పుస్తకములో ఇట్లు వ్రాసినాడు.

The word khila means 'Supplement' and this name in itself indicates that they are texts which were collected and added to the Samhita only after the latter had already been conducted. This does not exclude the possibility that some of these Khilas are of no less antiquity than the hymns of the RigVeda Samhita, but for some reason unknown to us were not included in the collection.

(A History of Indian Literature by Dr. Winternitz P. 59-60)

దీని భావార్థమేమన; ఖిల అను పదమున కర్థము పరిశిష్టము, ఈ పేరుతో 'ఇవి మంత్రములని, ఇవి సంగ్రహమొనర్చబడి సంహిత యందు చేర్చబడినవని, ఇందులో కొన్ని ఋగ్వేద సంహిత యొక్క ఇతర సూక్తముల కన్న తక్కువ ప్రాచీనమైనవేమి గావని, మనకు తెలియనట్టి ఏదోయొక కారణమున వానికి సంహితలందు స్థానము లభించలే దని యనుకొనవచ్చును.'

డా. విన్టర్నీజ్ అభిప్రాయములతో మేము ఏకీభవించలేము. ఏలన; మాకు యీ ౪౯ నుండి ౫౯ వరకు గల సూక్తములను భాష, మరియు భావ దృష్టితో ఇతర ఋగ్వేద సూక్తములకు వేరు పరచు వస్తు వేదియును గాన్పించదు. ఐనను ఆయన వీని ప్రాచీనత్వము గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయము ఆలోచించదగినదై యున్నది.

ఈ పదునొకండు సూక్తములన్నియును హస్తలిఖిత ప్రతులందును గాంచనగునని డా. విన్టర్నీజ్ స్పష్టముగా అంగీకరించినాడు. అనగా;

The eleven Bal-Khilya hymns..... in all manuscripts are found at the end of the book. -(VIII P.60)

మి. గ్రిఫ్థ్ మిక్కిలి అనుచితమగు నొక మాట యనినాడు ఏమన; ఎనిమిదవ మండల మధ్య నుండి దీసివేసి చివరలో యుంచబడినది; ఇట్లొనర్చుటకు వారికేమియు అధికారములేదు. కేవలము ఈ సూక్తముల ప్రారంభములో అథ మరియు అంతములో ఇతి అని వ్రాసి యున్నందుననే అని వ్రాసినాడు. ఇందువల్ల ఇది వెనుకనుండి చొప్పించబడిన దని యనుట సరికాదు. అధిక ప్రచారమగు కారణమున కొన్ని మంత్రములు, సూక్తములు, సంకలనమొనర్చబడి సౌలభ్యమునకై వేరు గ్రంథముగా నిర్మించి ప్రారంభమున **'అథ'** అంతమునందు **'ఇతి'** అని వ్రాయబడుచువచ్చినది. దీనిచే నీని అర్వాచీనత్వము మరియు ప్రక్షిప్తత్వము సిద్ధింపజాలదు.

## ౯.౭ వేదముల శుద్ధత్వ రక్షణము

వేదములలో ప్రక్షేపములు చేయుటకు ఎంత మాత్రము సాధ్యముగాకుండునట్లు, ఆర్యులు వాని శుద్ధత్వ రక్షణకై ప్రారంభము నుండియే చక్కని ఏర్పాట్లను గావించినారు. క్రమ పద్ధతియే గాక 'జటా, మాలా, శిఖా, లేఖా, ధ్వజా, దణ్డా, రథ, ఘన' అను ఈ యెనిమిది విధములుగా వేద మంత్రోచ్చారణకు విధానము నేర్పరచినారు. ఆ విధానము ఇప్పటికి అనేక స్థానములందు ప్రచారములో ఉన్నది.

ఇన్ని విధములగు ఏర్పాట్లున్నప్పుడు వేదమంత్రములలో ప్రక్షిప్తము లొనర్చుటగాని, చేసినచో పట్టుపడకుండా యుండుట గాని సంభవము గాదు. ఈ పాఠము అతి ప్రాచీన కాలము నుండియు నడచుచు వచ్చుచున్నది. ఐతరేయారణ్యకము, ప్రాతి శాఖ్యాదులందును దీని యుల్లేఖనగలదు. ఈ జటా, మాలా, ఘన, ధ్వజ, మున్నగు వాని నియమము **'వ్యాడి'** ఋషి ప్రణీతమగు **'వికృతవల్లి'** అను గ్రంథమున గలదు.

వీని యుద్దేశ్య సంబంధములో సుప్రసిద్ధ ఐతిహాసికుడగు డా. భండార్కర్‌గారు తన *"Indian Antiquary"* యొక్క ౧౮౭౪వ సంవత్సరపు పత్రికలో ఈ సత్యమును ఇట్లు వ్రాసినాడు. *The object of these different arrangements is simply the most accurate preservation of the sacred text.*

అనగా; ఈ వివిధ క్రమముల యుద్దేశ్యము ఈ పవిత్ర గ్రంథముల పాఠమును అత్యంత శుద్ధముగా నుంచుటయే యై యున్నది.

రెండవ ఉపాయమిట్లు గలదు; వేదముల శుద్ధ పాఠమును, సురక్షితముగా నుంచుటకై వేదముల ఛన్దస్సు సంఖ్య, మన్త్ర సంఖ్య, పదసంఖ్య, మరియు మంత్రానుక్రమముతో ఛందము, ఋషి, దేవతలను చూపుటకు

అనేక అనుక్రమణికలు సిద్ధ పరచబడినవి. అవి ఇప్పుడును 'శౌనకానుక్రమణి, అనువాకానుక్రమణి, సూక్తానుక్రమణి, ఛన్దోఽనుక్రమణి, దేవతానుక్రమణి, కాత్యాయనీయానుక్రమణి, సర్వానుక్రమణి, ఋగ్విధానము, బృహద్దేవతా, మన్త్రార్షాధ్యాయ, కాత్యాయనీయ సర్వానుక్రమణి, ప్రాతిశాఖ్య సూత్రము మున్నగు పేర్లతో గానవచ్చుచున్నవి.'

## ౯.౭ ప్రొ. మైక్స్ మూలర్ అభిప్రాయము

ఈ యనుక్రమణికలపై తనయభిప్రాయమును ప్రకటించుచు ప్రొ. మైక్స్ మూలర్ తన *Ancient Sanskrit Literature* అను తన పుస్తకములో పు.౧౧౭లో ఇట్లు వ్రాసినాడు. 'ఋగ్వేదము యొక్క అనుక్రమణికతో మనము వాని సూక్తములను, పదములను సూక్ష్మ పరిశీలనతో నిర్భయముగా చెప్పవచ్చును ఏమన, ఇప్పుడు కూడా ఋగ్వేదము యొక్క మంత్రముల, శబ్దముల, పదముల సంఖ్య కాత్యాయనుని కాలము నాటిదే సురక్షితముగా నున్నది.

ఒక స్థలములో మైక్స్ మూలర్ *'Origin of Religion'* పు ౧౩౧లో ఇట్లు వ్రాసినాడు

The texts of the Veda have been handed down to us with such accuracy that there is hardly a various reading in the proper sense of the word or even an uncertain accent in the whole of the Rigveda. ( Origin of Religion - by Prof. Max Muller P.131.)

ఎంత ప్రయత్నించినను ఏ విధమైన పాఠభేదముగాని, స్వర భేదము గాని సంపూర్ణ ఋగ్వేదమునందు లభింపకుండునట్లు వేద పాఠములు మనకు అత్యంత విశుద్ధముగా అందించబడినవి. *RigVeda Vol I P XXX* లో ప్రొ. మైక్స్ మూలర్ పునః ఈ విషయమును నొక్కి చెప్పుచు ఇట్లు వ్రాసినాడు.

As far as we are able to judge at present, we can hardly speak of various readings in the Vedic hymns in the usual sense of that word. Various readings to be gathered from a collection of different manuscripts now accessible to us there are none.

అనగా; వేదముల పాఠ భేదమును కూడా సాధారణముగా వాడుకయందున్న అర్థములో చెప్పజాలము. వాస్తవమునకు వివిధ హస్త లిఖిత ప్రతులనుండి సంగ్రహింపబడుట కెట్టి భిన్న పాఠ భేదములు లేదు

## ౯.౮ ప్రొ. మైక్డోనల్ అభిప్రాయము

ప్రొ. మైక్డోనల్ కూడా ఈ విషయమును స్పష్టముగా వ్రాసినాడు.

Extra-ordinary precautions soon began to be taken to guard the canonical text, thus fixed against the possibility of any change or loss. The result has been its preservation with a faithfulness unique in literary history. A History of Sanskrit Literature by Macdonell P.50.

అనగా; ఆర్యులు అతిప్రాచీన కాలమునుండి అసాధారణ జాగ్రత్తలతో వైదిక పాఠముల శుద్ధత్వమును కాపాడుటకు, మరియు దానిని పరివర్తనము (మార్పు) లేక నాశము నుండి రక్షించుటకై చక్కని ఏర్పాట్లను

చేసియుంచినారు. ఇవి ఇంత దీర్ఘకాలము వరకును సురక్షితముగా నుండుట కిదియే కారణము. ఇది సాహిత్య చరిత్రలో అనుపమానమైనది. వీరి యీ లేఖ వల్ల దశమ మండలము యొక్క అర్వాచీనత్వ అభిప్రాయము స్వయముగనే సమసిపోవుచున్నది.

### ౯.౯ 'కేగీ' యభిప్రాయము

డా. కేగీ గారును కనీసము మూడువేల సంవత్సరముల (వారి యుద్దేశ్యములో వేద నిర్మాణ కాలము) నుండి వేద పాఠములందు ఎలాంటి భేదమును గలుగలేదని. ఇట్లు దిగువ శబ్దముల ద్వారా స్వీకరించినాడు.

Since that time, nearly 3000 years ago, it (the text of the Veda) has suffered no changes what soever, with a care such that the history of other literatures has nothing similar to compare with it. ( Kaegi's RigVeda P.22)

### ౯.౧౦ కృష్ణ యజుర్వేదము అతిప్రాచీనమైనదేనా ?

యజుర్వేద సంబంధమున ఆర్యులెల్లరును వాజసనేయీ సంహితయే ( దీనిని మాధ్యందిన సంహితయను పేరుతో కూడా పిలిచెదరు). మూల యజుర్వేద నామముచే పిలువబడుచున్నది. తైత్తిరీయ సంహిత కృష్ణయజుర్వేద మను పేరుతో పిలువబడుచున్నది. వీని భేదమును గూర్చి ఇచ్చట విస్తారముగా ఆలోచించు అవసరము లేదు. కాని ముఖ్యవిషయ మేమనగా; శుద్ధ మూలపాఠముండుట వల్ల వాజసనేయీ, లేక మాధ్యందినీ సంహితను శుక్ల యజుర్వేద మనుపేరుతో, మరియు బ్రాహ్మణ పాఠము మరియు ఇతర మిశ్రణ ముండుట వల్ల తైత్తిరీయ సంహితనే కృష్ణ యజుర్వేదమని యందురు. ఇది శుక్ల యజుర్వేదము కన్న చాలా అర్వాచీనము ( ఆధునికము) మరియు అనేకాంశములందు మిశ్రణములు ప్రక్షేపములుండు కారణమున వేద విరుద్ధమై యుండుట వల్ల ప్రామాణికము గాజాలదు. '**ద్వివేద గఙ్గ**' యను నాతడు తన బృహదారణ్యకోపనిషత్ భాష్యమునం దిట్లు వ్రాసినాడు.

**శుక్లాని యజూంషి శుద్ధాని, యద్వా బ్రాహ్మణేన మిశ్రితమన్త్రకాణి కృష్ణాని॥**

అనగా; యజుర్మన్త్రములను శుక్లమనుపేరుతో మరియు బ్రాహ్మణములనుండి మిశ్రిత మంత్రములున్న దానిని కృష్ణ యజుర్వేద మనుపేర బిలువబడినది. దీనివల్ల శుక్ల యజుర్వేదము యొక్క ప్రామాణికత్వము, ప్రాచీనత్వము, అపౌరుషేయత్వము స్పష్టమగుచున్నది.

శుక్ల యజుర్వేదము యొక్క వాజసనేయీ శాఖలందును మాధ్యందినీశాఖ యొక్క ప్రాధాన్యత ఏల గలదో దిగువ లేఖ ద్వారా దెలియుచున్నది. ఇది గవర్నమెంటు ఓరియంటల్ లాయిబ్రేరీ మద్రాసు యొక్క సూచీపత్రము, తృతీయ భాగము పు.౩౮౭౬ పై గ్రంథ సంఖ్య ౨౮౫౬ '**మాధ్యన్దిన శాఖా విషయః**' అను పేర గలదు. అచట ఇట్లు వ్రాయబడియున్నది.

**అథ పఞ్చదశ శాఖాసు మాధ్యన్దినశాఖా ముఖ్యేతి వేదితవ్యా।**

తథా చేదం హోలీర భాష్యమ్ ॥

యజుర్వేదస్య మూలం హి, భేదో మాధ్యన్దినీయకః । తస్మాన్మాధ్యన్దిన శాఖా ॥

ఏవ పఞ్చదశసు వాజసనేయశాఖాసు ముఖ్యా సర్వ సాధారణీ చ ।

అత ఏవ వసిష్ఠేనోక్తమ్ ॥

మాధ్యన్దినీ తు యా శాఖా, సర్వ సాధారణీ తు సా ॥

అనగా; వాజసనేయీ, శాఖ యొక్క 15 శాఖలందు మాధ్యందినీ యనునదే ముఖ్యము, మరియు సర్వ సాధారణమై యున్నది. ఈ విషయమునే వసిష్ఠుల వారు కూడా యనినారు. ఇదియే మూలవేదము

ఈ పరిస్థితిని అర్థము జేసికొనజాలక 'వైదిక్ ఏజ్' లేఖకులు ఎంతో అశుద్ధమైన, మరియు అసంగతమైన విషయములను వ్రాసివేసినారు ఎట్లన.

Re Shukla and Krihsna Yajurveda -

The fact that the Gopath Brahmana (1-29) in reciting the first words of the different Vedas quotes in the case of the Yajurveda the beginning of the Vajasaneya Samhita may suggest that the white Yajurveda represents the original tradition of which the Black Yajureda with all its variations is a later variation. But the truth should rather be just the opposite, for it is hardly possible that Mantra and Brahmana kept separate as in white Yajurveda tradition, should have got mixed up at a later date. It is generally assumed there fore that the Black Yajurveda, with Mantra and Brahmana mixed up throughout is older than the white Yajurveda in which the Brahmana was separated from the Samhita, perhaps in imitation of the Rigvedic model.

In the Taittiriya Brahmana too, which is merely a continuation of the Taittiriya Samhita (but not necessarily later than it for that reason) and which too owes its origin as a separate treatise to the influence of the Rigvedic tradition Mantra and Brahmana have not been separated. It is peculiar feature of the Taittiriya texts that the Samhita and the Brahmana of this school supplement each other in such a way that each seems to presuppose the other. - Vedic Age, P.231

అనగా; గోపథ బ్రాహ్మణములో వేర్వేరు వేదముల ప్రారంభిక శబ్దముల నుల్లేఖించుచు యజుర్వేద విషయములో వాజసనేయీ సంహిత యొక్క ప్రారంభిక శబ్దములు ఉదాహరణముగా చేయబడినవి. అందిట్లు నిర్దేశమొనర్చబడినది. శుక్ల యజుర్వేదమే మూలవేదము, కృష్ణ యజుర్వేదము తన సర్వ శాఖలతో గూడ దాని వెనుక నుండి ఏర్పడిన ఒక శాఖయై యున్నది. కాని సత్యమింతకు విపరీతమైయున్నది. ఏమన; శుక్ల యజుర్వేదము

ననుసరించి వేర్వేరు మంత్రములు మరియు బ్రాహ్మణములు వెనుకబడి ఒకదాని యందే గలసిపోవచ్చునేమో యనునది సంభవమే. ఈ కారణముననే కృష్ణ యజుర్వేదము, దీనియందు మంత్రములు, మరియు బ్రాహ్మణములు అంతటను గలసియుండవచ్చునని ఎంచబడుచున్నది. శుక్ల యజుర్వేదము కన్న దీనియందు బ్రాహ్మణ భాగమును మంత్ర సంహిత నుండి ఋగ్వేదము వలె అనుకరణమునందు వేరుచేయబడిన పురాతనమైనదియనుగావచ్చును. తైత్తిరీయ సంహిత యొక్క పరంపరానుగతమైన తైత్తిరీయ బ్రాహ్మణమునందును (ఈకారణమున వేర్వేరు చేయబడలేదు) తైత్తిరీయ పాఠముల విశేష మేమనగా; ఈ సంప్రదాయ సంహిత, మరియు బ్రాహ్మణములు పరస్పరము గట్టి సంబంధము గలవిగానున్నట్లు వాని అస్తిత్వమును ధృవపరచుచున్నవి.

**సమాలోచనము :–** మేమిచ్చట అభిప్రాయ పడినది సంపూర్ణముగా యథార్థము గాక పోవచ్చును. గోపథ బ్రాహ్మణము ననుసరించి వ్రాయబడినది నిజమేగావచ్చును. ఒకవేళ కృష్ణ యజుర్వేదము లేక తైత్తిరీయ సంహితయే మూలవేదమని యెంచినచో దాని ప్రారంభిక శబ్దమును ఉపయోగించక శుక్లయజుర్వేద శబ్దములనే యుపయోగించవలసియుండెను. శుక్ల యజుర్వేదమున గల మంత్రములు, మరియు బ్రాహ్మణములు వేర్వేరుగా వెనుకనుండి గలిపివేయబడిన వనియెంచుట నిర్హేతుకము.

వాస్తవముగా శుక్ల యజుర్వేదమున బ్రాహ్మణములను గలుపుట, లేక వేరుగా నుంచుటయను ప్రశ్నయేలేదు. దానియందున్నవన్నియు మూలవేద మంత్రములే బ్రాహ్మణముల రూపములో గాన్పించు వాని వ్యాఖ్య వెనుక చూపబడినట్లు మహర్షి పతంజలి బ్రాహ్మణ శబ్దమునకు వ్యాఖ్య నొనర్చుచు ౫-౧-౧లో వ్రాసినాడు.

**చతుర్వేదవిద్భిర్బ్రహ్మభిః బ్రాహ్మణైర్మహర్షిభిః ప్రోక్తాని యాని వేద –**

**వ్యాఖ్యానాని తాని బ్రాహ్మణాని ।**

అనగా; వేదజ్ఞులగు బ్రాహ్మణ మహర్షులు బ్రహ్మ అనగా వేదముల వ్యాఖ్యానమొనర్చిన వానినే బ్రాహ్మణములని యందురు. వాని మిశ్రణము తైత్తిరీయ సంహితయందు ఉండుటచే దానిని తరువాతి రచన యని నమ్ముట సంపూర్ణముగా యుక్తియుక్తమే యగును. దాని యందు బ్రాహ్మణ రూప వ్యాఖ్యా భాగము గలిసియున్నచో మూలము లేక ప్రాచీనమని యెంచుట బుద్ధి విరుద్ధము, మరియు తర్క విరుద్ధమునై యున్నది. బృహత్పారాశరీ స్మృతియందును బ్రాహ్మణముల లక్షణమీక్రింది విధముగా నున్నది. అది యుక్తియుక్తము, యథార్థము గావున ఈ దిగువ నుదహరించబడినది.

**'అస్యమన్త్రస్య చార్థోఽయమ్, అయం మన్త్రోఽత్ర వర్తతే ।**

**తత్తస్య బ్రాహ్మణం జ్ఞేయం, మన్త్రస్యేతి శ్రుతిక్రమః ॥ బృ.పా.౨-౪౪॥**

భావము :- ఈ మంత్రార్థమేమన; ఈ మంత్ర మీకార్యమునందు వినియుక్తమై యున్నది. దీనిని జూపునట్టి గ్రంథమును ఆ మంత్రమును, మంత్ర సంహిత (వేదము)ను బ్రాహ్మణమని యెంచవలెను. దీని ననుసరించియును బ్రాహ్మణ భాగము మిశ్రిత భాగ మగుటచే మూల వేదము కన్న అర్వాచీనమగుట స్పష్టమే. మూలవేద విషయమందిట్లు వ్రాయబడినది.

క్షీయన్తే నైవ వేదాశ్చ నైవాపి ప్రభవన్తి తే।

న కశ్చిద్వేదకర్తాస్తి, వేదస్మర్తా చతుర్ముఖః ॥ బృ.పా.స్మృ॥౧-౨౦॥

అనగా; వేదము నష్టముగాదు, ఉత్పన్నము గూడా కాదు. వేదకర్త ఏదో ఒక మనుష్యుడు గాదు. శ్రీ సాయణాచార్యుడు మంత్ర బ్రాహ్మణములను వేదములని నమ్ముచుండినను ఈ సంబంధములో కాణ్వ సంహితా మరియు తైత్తిరీయ సంహితల భూమిక లో ఒకగొప్ప వాస్తవ విషయమును వ్రాసినాడు. అది ఇచ్చట ఉల్లేఖించదగినదై యున్నది. ఏమన,

తత్ర శతపథబ్రాహ్మణస్య మన్త్రవ్యాఖ్యానరూపత్వాద్ వ్యాఖ్యేయమన్త్రప్రతి

పాదకః సంహితా గ్రంథః పూర్వభావిత్వాత్ ప్రథమో భవతి।

- కాణ్వ సంహితా భాష్యమ్. పు.౧ చౌఖంబా ప్రెస్, బనారస్

అనగా; శతపథ బ్రాహ్మణము మంత్రముల వ్యాఖ్యారూపమైనది. కావున ఏమంత్రములు వ్యాఖ్యయొనర్చ బడవలసి యున్నదో వాని ప్రతిపాదక సంహిత గ్రంథము పూర్వభావీ యగు కారణమున మొదటిదిగా నుండును.

తైత్తిరీయ సంహిత విషయములో కాణ్వ సంహిత భాష్యమునందు శ్రీ సాయణాచార్యులు స్పష్టముగా ఇట్లు వ్రాసినాడు.

బుద్ధిమాలిన్యహేతుత్వాద్ యజుః కృష్ణమితీర్యతే। కాణ్వ సంహితా భాష్యమ్ పు.౧॥

అనగా; బుద్ధి మాలిన్యకారణమున ఇది 'కృష్ణ యజుర్వేద' మనబడుచున్నది ఏలన దీని యందు ఏ విధమగు వ్యవస్థ గానరాదు. మహీధరాచార్యుడును శుక్లయజుర్వేద భాష్యమునందీ విధమగు పౌరాణిక కథను ఉల్లేఖించినాడు. చూడుడు.

తత్ర వ్యాసశిష్యో వైశంపాయనో యాజ్ఞవల్క్యాదిభ్యః స్వశిష్యేభ్యో యజుర్వేదమ

ధ్యాపయత్। తత్ర దైవాత్ కేనాపి హేతునా క్రుద్ధో వైశంపాయనో యాజ్ఞవల్క్యం

ప్రత్యువాచ మదధీతం త్యజేతి। స యోగసామర్థ్యాన్మూర్తాం విద్యాం విధాయో

ద్వవామ। వాన్తాని యజూంషి గృహ్ణీతేతి గురుణోక్తా అన్యే వైశంపాయనశిష్యా

స్తిత్తిరయో భూత్వా యజూంష్యభక్షయన్। తాని యజూంషి బుద్ధిమాలిన్యాత్

కృష్ణాని జాతాని। తతో దుఃఖితో యాజ్ఞవల్క్యః సూర్యమారాధ్య అన్యాని శుక్లాని

యజూంషి ప్రాప్తవాన్। తాని చ పఞ్చదశశిష్యేభ్యః పాఠితవాన్। తథా చ శ్రుతిః

ఆదిత్యానీమాని శుక్లాని యజూంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యేనాఖ్యాయన్తే।

**బృహ. ౫-౫-33-౧ అస్యార్థః ఆదిత్యాదధీతాని ఆదిత్యాని శుక్లాని శుద్ధాని ॥**

( శుక్లయజుర్వేద సంహితా- ఉవ్వట మహీధర భాష్యసంవలితా నిర్ణయ సాగర, ముంబాయి. పు.౧)

ఇచ్చట నీయబడిన కథ అసంభవమగు అనేక దోషములతో నిండియున్నది. అనగా; ఏదో కారణముచే క్రుద్ధుడైన వైశంపాయనుడు తన శిష్యుడగు యాజ్ఞవల్క్యునితో ఇట్లనినాడు 'నీవు నా వద్ద చదువుకొనినదంతయును వదలివేయుము' అని యనగానే యాజ్ఞవల్క్యుడు తన యోగ బలముచే మూర్తరూపమునిచ్చి వమనమొనర్చినాడు. వైశంపాయనుని ఇతర శిష్యులు దానిని కౌజు పిట్టల రూపములో తినివేసినారు. బుద్ధి మాలిన్య కారణమున ఆ యజుర్వేద మంత్రములు కృష్ణ యజుర్వేదమున్గానైనవి అప్పుడు యాజ్ఞవల్క్యుడు ఆదిత్యునారాధించి ఆతని కృపవల్ల శుద్ధరూపములో యజుర్వేదమును ప్రాప్తించుకొనినాడు ఆదిత్య అనుదాని యర్థమొకవేళ :-

**తదేవాగ్ని స్తదాదిత్యస్తద్ వాయుస్తదు చన్ద్రమాః ।**

**తదేవ శుక్రం తద్ బ్రహ్మ తా ఆపః స ప్రజాపతి ః ॥** యజు. 3-౧॥

ఈ యజుర్వేద మంత్రమునసరించి పరమేశ్వరునిగా గ్రహించినచో ఇట్లు స్పష్టమగుచున్నది. అనగా; పరమేశ్వరుని కృప మరియునాతని యుపాసనచే యాజ్ఞవల్క్యుడు శుద్ధరూపములో యజుర్వేద జ్ఞానమును ప్రాప్తించుకొనినాడు ఏదియేమైనను కృష్ణ యజుర్వేదములో బుద్ధిమాలిన్య యోగము ఇచ్చటను స్పష్టముగా నెంచబడినది. 'వైదిక్ఏజ్' లేఖకులు దానిని శుక్లయజుర్వేదమునకు మారుగా ప్రాచీనమని యెంచుట సంపూర్ణముగా యుక్తి విరుద్ధము, మరియు అసంగతమైయున్నది. తైత్తిరీయ సంహిత యొక్క భాష్య భూమికయందు సాయణాచార్యుడిట్లు వ్రాసియున్నాడు.

**యద్యపి మన్త్ర బ్రాహ్మణాత్మకో వేదస్తథాపి బ్రాహ్మణస్య మన్త్ర వ్యాఖ్యానరూపత్వా న్మన్త్రా ఏవాదౌ సమామ్నాతాః॥**

ఒకవేళ పౌరాణికుల అభిప్రాయానుసారము మంత్రములు, మరియు బ్రాహ్మణములు రెండునూ వేదములే యనిపించుకొనుట సరిగాదు. ఏలన; బ్రాహ్మణములు వేదమంత్రముల వ్యాఖ్యానరూపములు, కావున ప్రథమముగా మంత్రములే చెప్పబడినవి. వైదిక్ ఏజ్ లేఖకులు ఇంత చిన్న విషయమును తెలిసికొనక తైత్తిరీయ సంహిత శుక్ల యజుర్వేదము కన్న పూర్వపుదని నిరాధారమగు కల్పన యొనర్చుట అత్యంతాశ్చర్యకరము. వాస్తవమేమన తైత్తిరీయ సంహితయందు యజుర్వేద మంత్రములు, మరియు శబ్దముల వ్యాఖ్య స్పష్టముగా గలదు. ఉదాహరణార్థము :-

యజుర్వేద మొదటి మంత్ర వ్యాఖ్య నొనర్చుచు తైత్తిరీయ సంహితలో ఇట్లు గలదు

**యజమానస్య పశూన్ పాహి - ఇత్యాహ పశూనాం గోపీథాయ ।**

**అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి తచ్ఛకేయం తన్మే రాధ్యతామ్ ।**

**ఇద మహమనృతాత్ సత్యముపైమి ॥** యజు.౧-౧-౪॥

ఈ వ్యాఖ్యయందు తైత్తిరీయ సంహితలో ఇట్లు వ్రాయబడియున్నది.

**వ్రతేన మేధ్యోఽగ్నిర్వ్రతపతిః బ్రాహ్మణో వ్రతభృద్ వ్రతముపేష్య**
**బ్రూయాద్ అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామీత్యగ్నిర్వై వేదానాం**
**వ్రతపతి స్తస్మై ఏతం ప్రతి ప్రోచ్య వ్రతమాలభత ఇతి ।**
**అనృతాత్ సత్యముపైమీతి - మానుషాద్ దైవ్యముపైమి దైవీం వాచం**
**యచ్ఛామీతి ॥ కస్త్వాయునక్తి స త్వా యునక్తి ఇతి ॥**

ఈ యజు ౧-౫వ మంత్ర వ్యాఖ్య యందు తిత్తిరి ఋషి యిట్లు వ్రాసినారు

**కస్త్వాయునక్తిర్ స త్వా యునక్తీత్యాహ ప్రజాపతిర్వైకః ప్రజాపతినైవైనంయునక్తీతి ॥**
**ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వ ॥** యజు.౧-౨॥

దీని వ్యాఖ్య యందు తైత్తిరీయ సంహితలో ఇట్లు వ్రాయబడినది.

**ధూరసీత్యాహ ఏష వై ధుర్యోఽగ్నిః తం యదనుపస్పృశ్యాతీయాత్**
**అధ్వర్యుం యజమానం చ దహేత్ । ఉపస్పృశ్యాత్యేతి అధ్వర్యోశ్చయజ-**
**మానస్య చాప్రదాహాయ । ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వ తం యో-**
**స్మాన్ ధూర్వతి । ధూర్వ తం యం వయం ధూర్వామ ఇత్యాహ । ద్వావేవ పు**
**రుషౌ యం చైవ ధూర్వతి । యశ్చైనం ధూర్వతి తావుభౌశుచార్పయతీతి శోకేన**
**యోజయతీత్యర్థః ॥**

ఇట్టివే వేలాది ఉదాహరణములను తైత్తిరీయ సంహితనుండి ఈయవచ్చును. ఇందువల్ల స్పష్టమగునదేమన, దానియందు యజుర్వేదమంత్రముల వ్యాఖ్యానము మరియు వినియోగాదులున్నవి దానిని మూలవేద మనియు మరియు మూలశుక్ల యజుర్వేదము కన్న ప్రాచీన మని నమ్ముట వైదిక్ఏజ్ లేఖకుల గొప్ప భ్రమయే.

## ౯.౧౧ అథర్వ వేదము తర్వాత వ్రాయబడినదేనా ?

అథర్వ వేద విషయములో వైదికఏజ్ లేఖకులు పాశ్చాత్య లేఖకులలో 'బ్లూంఫీల్డు' అనువాని అవివేకమైన అనుసరణ మొనర్చినారు. బ్లూంఫీల్డు యొక్క అథర్వ వేద విషయక పుస్తకము *"The Atharva Veda" by M Bloom field - Trubner 1899* విషయములో ౨౩౯ పుటలో వైదిక్ ఏజ్ రచయిత లిట్లు వ్రాసినారు.

Bloomfield's excellent monograph on the Atharva Veda like which un-fortunately there is as yet nothing on any of the other Samhitas offers practically everything that a student of the Vedic literature might wish to know about the Atharva Veda. The section on the Atharva Veda in this chapter is mainly based on Bloomfield's Monograph. -(Vedic Age P.239)

అనగా; ఇది బ్లూంఫీల్డు యొక్క అథర్వ వేద విషయములో ఆదర్శపుస్తకము 'దౌర్భాగ్యవశమున దీనికి సమానమగు పుస్తకము వైదిక సాహిత్యమున ఇతర సంహితలకై మరొకటి వ్రాయబడలేదు. అదియే సమస్తమును జూపుచున్నది. వైదిక సాహిత్య విద్యార్థులెల్లరును దీనిని తెలిసికొనుట అవసరమైయున్నది' అని వ్రాయబడియున్నది. ఈ యధ్యాయములో అథర్వ వేద విషయక పుస్తకముపైననే యున్నది. బ్లూంఫీల్డు యొక్క కథనమేమన; అథర్వ వేదము మొదట వేదముగా నెంచబడలేదు. ఇది అర్వాచీనమైయున్నది. చాలాకాలము తరువాత అది వేదములలో లెక్కింపబడినది. అని కాని ఈ విషయము సంపూర్ణముగా అసత్యము. బ్లూంఫీల్డునకిట్టి భ్రమ బహుశః 'త్రయీవిద్యా' అనుశబ్ద ప్రయోగమును జూచి కలుగవచ్చును. కాని దాని సరియైన అర్థము మీమాంసా శాస్త్రాధ్యయనము చేతనే తెలియగలదు. 'త్రయీ విద్యా' అను ప్రయోగము నాలుగు వేదములందు ప్రయోగమైన మూడు ప్రకారముల అనగా; పద్య, గద్య, గీత మయమగు శైలి, మరియు భాషా పరమైన ఆధారముపై గలదు ఋక్, యజుః, సామ మను నామములతో జెప్పుదురు. మరియు దిగువ చూపబడిన దీని లక్షణములు. మీమాంసాశాస్త్రకారుడగు జైమిని ముని ఈ విధముగా నిచ్చియున్నాడు

**తత్ర ఋగ్ యత్రార్థవశేన పాదవ్యవస్థా ॥ మీ.౨-౧-౩౨॥**

**గీతిషు సామాఖ్యా ॥ మీ ౨-౧-౩౩ ॥**

**శేషే యజుః శబ్దః ॥ మీ.౨-౧-౩౪॥**

అనగా, ఏ మంత్రములందు అర్థపరముగా పాదముల వ్యవస్థ గలదో, ఇంకా స్పష్టముగు శబ్దములందు జెప్పవలయునన్న ఛన్దోబద్ధమగు రచలను 'ఋక్' అని యందురు. గానాత్మక మంత్రములను సామములు, ఇక మిగిలిన మంత్రములన్నియు 'యజుః' అను నామమున పిలువబడినవి. ఎద్దానియందు ఏ విధమగు మంత్రముల ప్రాధాన్యతగలదో అట్టివేదము నదే పేరుతో బిలువబడుచుండును. సర్వానుక్రమణి యొక్క భూమికయందు షడ్ గురుశిష్యు డీవిషయములో చాల చక్కగా వ్రాసినాడు. చూడుడు

**వినియోక్తవ్యరూపశ్చ, త్రివిధః స ప్రదర్శ్యతే ।**

**ఋగ్యజుః సామరూపేణ మన్త్రో వేదచతుష్టయే ॥౧॥**

**అహే బుధ్నియ మన్త్రం మే, గోపాయేత్యభిధీయతే ।**

**చతుర్ష్వపి హి వేదేషు, త్రిధైవ వినియుజ్యతే ॥౨॥**

వేదములు నాల్గైనను ఋక్, యజుః, సామములు అనగా; పద్య, గద్య, గాన రూపములచే వేదమంత్రములను మూడు విధముల భేదము నొనర్చినారు. కావున; 'త్రయీ' యనుటవల్ల ఆకాలములో మూడు వేదములే నమ్మబడుచుండెనని అర్థము జేసికొనుట మూర్ఖత్వమే యగును. జ్ఞాన కర్మోపాసన లను మూడు ముఖ్య విషయముల కారణముననను నాల్గు వేదములు 'త్రయీవిద్యా' అని యనిపించుకొనినవి.

**9.12 అథర్వ వేదము యొక్క ప్రామాణికతకు స్పష్టమగు ప్రమాణము.**

బ్లూంపీల్డు మరియు ఇతర అనేక పాశ్చాత్య విద్వాంసులు మూలవేదము కేవలము ఋగ్వేదమే. మిగతా వేదములు ఆ వేద మంత్రములనే సంకలన మొనర్చుకొనియు మరి కొన్ని ఇతర మంత్రములను చేర్చుకొని చేయబడినవని అభిప్రాయపడినారు. కాని వారి యీ అభిప్రాయము సంపూర్ణముగా అబద్ధమే. ఈయన్నిటికన్న మొదటిది మరియు పురాతనమని యెంచబడు ఋగ్ వేదము నందే అనేక మంత్రముల ద్వారా నాల్గు వేదముల (అథర్వవేదసహితముగా) ఉనికిని గూర్చి స్పష్టమగు ప్రమాణము లనేకములు గలవు. ఉదా:- ఋగ్వేద ౧౦-౯౦లోని సుప్రసిద్ధ మంత్రము.

**౧. తస్మాద్ యజ్ఞాత్సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే ।**

**ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత** ॥ ఋ.౧౦-౯౦-౭ ॥

ఈ మంత్రములో ఆ పూజనీయ పరమేశ్వరుని నుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము మరియు అథర్వ వేదము లుత్పన్నమైనవని స్పష్టముగా నున్నది. అథర్వవేదమును ఛన్దోవేద మను పేరుతో గూడా బిలుచుచుందురు. ఛన్దాంసి యనగా నిచ్చట అథర్వ వేదమే గ్రహించబడినది. ఇంకా దీని స్పష్టమగు ప్రమాణము ఋ.౯-౧౧౩-౬ లో లభించును. అచ్చట **'యత్ర బ్రహ్మా పవమానశ్ఛన్దస్యామ్ వాచం వదన్'** ద్వారా బ్రహ్మతో కూడ ఛన్దస్యా వాక్య ప్రయోగ మొనర్చబడినది. బ్రహ్మను వరించు విషయములో గోపథ బ్రాహ్మణము ౨-౨౪లో విధానమున్నది.

**౨. ఋగ్వేదవిదమేవ హోతారం వృణీష్వ, యజుర్విదధ్వర్యు, సామవిదముద్గాతారమ్,**

**అథర్వాఙ్గిరోవిదం బ్రహ్మాణం తథా హాస్య యజ్ఞాశ్చతుష్పాత్ ప్రతిష్ఠతి** ॥ గోపథ బ్రాహ్మణము ౨-౨౪॥

అనగా; ఋగ్వేదము నెరిగినవానిని హోతా, యజుర్వేదమును చదివిన వానిని అధ్వర్యు, సామవేదము చదివిన వానిని ఉద్గాత మరియు అథర్వవేదజ్ఞుని బ్రహ్మగా యజ్ఞాదులం దెన్నుకొనవలెను. ఈ విధముగా అట్టి యజ్ఞము ప్రతిష్ఠితమగును. గోపథ 3-౨లో కూడా ఇట్టి విధానమే గలదు.

**ప్రజాపతిర్యజ్ఞమతనుత । స ఋచైవ హోతారమకృణోత్ యజుషాధ్వర్యవం**

**సామ్నోద్గాత్రమ్ అథర్వాఙ్గిరోభిర్బ్రహ్మత్వమ్** ॥

ఈ విధమగు విధానమే ఇతర గ్రంథములందును గలదు. బ్రహ్మ నాలుగు వేదముల జ్ఞానము గలవాడు ఆయన అథర్వ వేదమునందు విశేషజ్ఞుడై యుండును ఈ విధముగా పైన దెలిపిన రెండు మంత్రములందు అథర్వ వేదము, దానిని చక్కగా నెరిగినవాడే బ్రహ్మ గాదగినవాడని పై నిర్దేశములో స్పష్టముగా గలదు.

దశమ మండలము ప్రక్షిప్తము గాదని ఈ యధ్యాయములో మొదటనే సప్రమాణముగా ధృవపరచియుంటిమి. కావున యీ ప్రమాణముపై సందేహించుకారణమే లేదు. **'యత్ర బ్రహ్మా పవమానశ్ఛన్దస్యాం వాచం వదన్'** । ఈ వచనము నవమ మండలములోనిది.

**3. ఋచాం త్వః పోషమాస్తే పుపుష్వాన్ గాయత్రం త్వో గాయతి శక్వరీషు ।**

బ్రహ్మా త్వో వదతి జాతవిద్యాం యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉ త్వః ॥ ఋ.౧౦-౭౧-౧౧॥

ఈ మంత్రముమందును 'బ్రహ్మా త్వో వదతి జాతవిద్యామ్' అను నీపంక్తి ద్వారా అథర్వ వేద జ్ఞాతయే బ్రహ్మయని స్పష్టమైన నిర్దేశముగలదు. శ్రీ యాస్కాచార్యులు తన సుప్రసిద్ధ గ్రంథమగు నిరుక్తములో దీనివ్యాఖ్య ఈ విధముగా నొనర్చినాడు.

**ఋచాం ఏకః పోషమ్ ఆస్తే పుపుష్వాన్ హోతా । ఋక్ అర్చనీ । గాయత్రమ్ ఏకో**

**గాయతి శక్వ రీషు ఉద్గాతా । గాయత్రం గాయతేః స్తుతికర్మణః । శక్వర్య ఋచః**

**శక్నోతేః । తద్ యదాభిర్వృత్రమశకద్ హన్తుం తచ్ఛక్వరీణాం శక్వరీత్వమితి**

**విజ్ఞాయతే । బ్రహ్మైకో జాతే జాతే విద్యాం వదతి । బ్రహ్మా - సర్వ విద్యః సర్వ**

**వేదితుమర్హతి । బ్రహ్మా - పరివృద్ధః శ్రుతతః । బ్రహ్మ పరివృద్ధం సర్వతః ।**

**యజ్ఞస్య మాత్రాం విమిమీత ఏకః, అధ్వర్యుః । అధ్వర్యుః అధ్వరం యునక్తి ,**

**అధ్వరస్య నేతా, అధ్వరం కామయత ఇతి వా । అధ్వర ఇతి యజ్ఞనామ,**

**ధ్వరతిర్హింసా కర్మా తత్ప్రతిషేధః ॥ నిరుక్త. ౧-౮॥**

ఋగ్వేద దశమమండలము నుండిగాక ఇతర స్థలముల నుండి ప్రమాణము గావలె నను పట్టుదల ఎవరికైన యున్నచో ఋగ్వేదమందలి ౪-౫౮-౩ యొక్క నిమ్న మంత్రము నిరుక్త వ్యాఖ్యా సహితముగా దిగువ నొసగబడుచున్నది

**౪. చత్వారి శృఙ్గా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య ।**

**త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాం ఆవివేశ ॥ ఋ.౪-౫౮-౩ ॥**

ఈ మంత్రము అనేకార్థకమై యున్నది. కాని యాస్కాచార్యుని నాలుగు వేదముల సంబంధము గల వ్యాఖ్యయే ఇచట ఉదాహరింపబడుచున్నది

**చత్వారి శృంగేతి వేదా వా ఏత ఉక్తాః ॥ నిరుక్తము ౧౩-౭॥**

అనగా, ఈ మంత్రములో '**చత్వారి శృంగాః**' యందు నాల్గు వేదములు గ్రహింపబడుట గలదు. ఇందు అథర్వ వేదము కూడా కలిసియున్నది.

ఋగ్వేదమందలి మరొక మంత్రమందును చతుర్వేద వాణిని గూర్చిన వర్ణన గలదు.

**౫. పాహి నో అగ్న ఏకయా పాహ్యుత ద్వితీయయా ।**

**పాహి గీర్భిస్తిసృభిరూర్జాం పతే పాహి చతసృభిర్వసో ॥ ఋ.౮-౬౦-౯ ॥**

ఇచ్చట భాష్యకారులందరి ఏకమతానుసారము ఏకయా, ద్వితీయయా, తిసృభిః, చతసృభిః లకు క్రమముగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదముల వాణుల రక్షణను గురించి ప్రార్థించబడినది.

ఈ మంత్రము యజుర్వేదము ౨౦-౪౩, సామవేదము మ. ౩౬ మరియు ౧౫౫౪ లలోను వచ్చియున్నది. అథర్వా శబ్దార్థము **'థర్వతిశ్చరతికర్మా తత్ప్రతిషేధః'** అని యున్నది. అనగా; స్థిరబుద్ధి గలవాడు అథర్వ వేదములో విశేష రూపమున నిష్ణాతుడగువాడు ఇట్టి అథర్వా, లేక అఙ్గిరా యొక్క నిర్ణయము ఋగ్వేదమందలి అనేక మంత్రములందును గలదు. ఉదాహరణార్థము;

**యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే** ॥ ఋ.౧-౮౩-౫॥

**త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత ।**

**మూర్ధ్నో విశ్వస్య వాఘతః** ॥ ఋ.౬-౧౬-౩॥

॥ యజు ౧౧-౩౨, ౧౫-౨౨ సామ. మ. ౯ ॥

**అగ్నిర్జాతో అథర్వణః** ॥ ఋ.౧౦-౨౧-౫॥

**సో అఙ్గిరోభిరఙ్గిరస్తమో భూద్వృషా వృషభిః సఖిభిస్సఖా సన్ ।**

**ఋగ్మిభిర్గ్మి గాతుభిర్జ్యేష్ఠో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ** ॥ ఋ.౧-౧౦౦-౪॥

ఈ విధముగా అథర్వ వేదము ఋగ్వేదము వలె ప్రాచీనము మరియు ప్రామాణికము ననుటలో ఎట్టి సందేహము లేదు. యజుర్వేద, సామవేద విషయములందును ఇదే విధముగా నవి ప్రాచీనములే. ఏలన, ఈ మంత్రములందు వాని నిర్దేశము గలదు. వేదము లేక ఇతర గ్రంథములందును అథర్వవేద నిర్ణయము వేద రూపముననే అతిస్పష్టముగా నున్నది. కాణ్వ సంహిత ౪౦-౭లో ఇట్లు గలదు.

**ఋగ్భిః శంసన్తి, యజుర్భిర్యజన్తి సామభిః స్తువన్తి, అథర్వభిర్జపన్తి ।**

ఇచ్చట అథర్వ వేద మంత్రములకు జపముతో విశేష సంబంధము స్వీకరించబడినది. ముణ్డకోపనిషత్తులో ఇతర వేదములతో గూడ అథర్వ వేద నామము కూడా గలదు.

**తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః** ॥ ము ఉ.౧-౧-౫॥

బృహదారణ్యకోపనిషత్తు నందును ఇతర వేదములతో గూడ అథర్వ వేదము పేరు దీసికొని అది పరమేశ్వరుని నిశ్వాస ( ఊపిరి, నిట్టూర్పు) రూపమున ఈశ్వరీయ జ్ఞానమని చెప్పబడినది. ఎట్లన;

**ఏవం వా అరేఽస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతద్ యద్ ఋగ్వేదో యజుర్వేదః ।**

**సామవేదోఽథర్వ వేదః** ॥ బృహ ఉ.౪-౫-౧౧ ॥

తైత్తిరీయ బ్రాహ్మణము ౩వ కాండము, ౧౨వ ప్రపాఠకము, ౮వ అనువాకములో

**ఋచో యజూంషి సామాని అథర్వాఙ్గిరసశ్చ యే** ॥

ఛాన్దోగ్యోపనిషత్తులోను నారదుడు ఇతర వేదములతో అథర్వ వేదము పేరును కూడా పేర్కొనినాడు.

**ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేదమాథర్వణం చతుర్థమ్** ॥ ఛా.౭-౧-౨॥

ఐతరేయ బ్రాహ్మణము ౫-౮లో ఇట్లు వ్రాయబడినది.

అథర్వ క్షేత్రవాన్ బ్రహ్మ వేదేష్వన్యేషు భాగవాన్।
తస్మాద్ బ్రహ్మాణం ధర్మిష్ఠమితి హ్యారణ్యకే శ్రుతమ్ ॥

ఇచ్చట అథర్వ వేదమందు విశేష ప్రజ్ఞగలవానిని అందరికన్న అధిక ధర్మాత్ముడగు బ్రహ్మ యని చెప్పబడినది.

ఇట్టివే ఇతర వందలాది ప్రమాణములు ప్రాచీన గ్రంథములందు లభ్యమగుచున్నవి. గ్రంథ విస్తరణ భయముతో పేర్కొనుట అనావశ్యకమనిపించినది. ఈ ప్రమాణముల వల్ల బ్లూంఫీల్డు మరియు నిట్టి విద్వాంసుల 'అథర్వ వేదము అర్వాచీన' మను వాదములు యథార్థముగావని ధృవపడినది.

**౯.౹౩ పరస్పర విరుద్ధ అభిప్రాయములు**

అథర్వ వేద విషయములో బ్లూంఫీల్డు పుస్తకముపై ఆధారపడి 'వైదిక్ ఏజ్' రచయితలు అనేక పరస్పర విరుద్ధ విషయములను వ్రాసివేసినారు. ఒకవైపు అథర్వ వేదమును మిగతా వేదములకన్న నవీనము మరియు వెనుకనుండి చొప్పించబడినదని వ్రాయుచునే మరొకవైపు దీనిని అనేకాంశములందు అన్నింటికన్న ప్రాచీనమైనదనియు చూపుచున్నారు. ఈ విషయములో బ్లూంఫీల్డునే ఒక ఆప్త పురుషునిగా స్వీకరించి ఆతని శబ్దములనే ప్రయోగించినారు.

*In its present form the Atharva Veda is certainly the latest of the four Samhitas, but in contents, it is by no means so, for there can be no doubt that Bloomfield was perfectly right in charactersing the Atharva Veda as follows On the whole, Atharveda is the bearer of the old tradition not only in the line of the popular charms, but also to some extent, albeit slight, its hieratic (sacred pertaining to priests) materials are likely to be the product of independent tradition that has eluded the collectors of the other Vedas, the Rig Veda not excepted. -Vedic Age P.232*

అనగా; ప్రస్తుత రూపములో అథర్వ వేదము నిశ్చయముగా ఇతర వేదములకన్న చాలా నవీనమే. దాని ప్రతిపాద్య విషయము నవీనమైనదికాదు. ఏలన, బ్లూంఫీల్డు అథర్వ వేదమును దిగువ వ్రాసిన విధముగా చిత్రణ మొనర్చినది సరిగానేయున్నదనుటలో సందేహములేదు.

అథర్వ వేదము పూర్తిగా ప్రాచీన పరంపరను సూచించును. జనప్రియమైన గారడీ (చేతబడి- జాదూ) క్షేత్రముననే కాక కొన్ని అంశములలో దీని పవిత్రత మరియు పురోహితులతో సంబంధమేర్పరచుకొను సామగ్రి కూడ ఒక స్వతంత్ర పరంపరకు మూలము. ఇది ఇతర వేదముల సంగ్రహకర్తల ( ఇందు ఋగ్వేదము గూడ చేరియున్నది) దృష్టికి రాలేదు.

దీని తాత్పర్యమేమన; 'దీని అనేకాంశములు ఇతర వేదములకన్న ప్రాచీనమైనవి'. ఈ విధముగానిది పరస్పరము విరోధము గాక మరేమి? ఇది సంపూర్ణముగా 'మైక్డోనల్' ఋగ్వేద దశమ మండలమును గూర్చి వ్రాసినట్లే యున్నది గదా! అందలి పరస్పర విరుద్ధములను మేము ఈ యధ్యాయమునందే చూపియున్నాము.

### 9.14 అథర్వ వేదములో ప్రక్షేపములను గూర్చి నిరాధార కల్పనలు

మరొక విషయము బ్లూంఫీల్డు, మరియు నాతని పరమ భక్తులు, అనుయాయులును అగు 'వైదిక్ ఏజ్' లేఖకులు అథర్వ వేదమునే అర్వాచీనమని వ్రాయుచు దానితోబాటు దాని ౧౫,౧౭,౧౮,౧౯,౨౦వ కాండములు వెనుకనుండి కలుపబడినవని నిరూపించుటకు అనేక ప్రయత్నములొనర్చినారు. ఈ సంబంధములో వారనేక విచిత్రములగు ప్రమాణము లిచ్చియున్నారు. అందులో ఒక ముఖ్యమగు ప్రమాణము, పైప్పలాద శాఖలో శౌనకశాఖ యొక్క అథర్వ వేదములోని కొన్ని అంశములు లేవనుట, వారి యీ ప్రమాణము వారి లేఖ ద్వారానే ఖండించబడుచున్నది. ఏమన, వారు దీని అనేక భాగములు, కాండములు ప్రక్షిప్తములని స్వీకరించుచు అవియన్నియు పైప్పలాది శాఖయందు చేరియున్నవని స్వీకరించినారు. వాస్తవమునకు శాఖలందు సంపూర్ణ వేదములను దీసికొనక కొన్ని కొన్ని భాగములను మాత్రము తమ విశేష దృష్టి కోణము, మరియు ఉద్దేశ్యముతో దీసికొని వానిని సంగ్రహించి వ్యాఖ్యానము నొనర్చబడును. అనేక స్థలములందు అర్థము యొక్క దృష్టి కోణముతో పాఠభేదము కూడా ఒనర్చబడినది. వానియందే వేద భాగము యుండక పోవుట, ఆ భాగములను మూలవేదము యొక్క ప్రక్షిప్త భాగమని తలచుటకు కారణమేమియు లేదు. విచిత్ర గారడీ యొనర్చు బ్లూంఫీల్డు యొక్క వివేకములేక అనుసరించి యీ వైదిక్ ఏజ్ లేఖకులు అథర్వ వేదమునకెంతటి ద్రోహము నొనర్చినారో చూడుడు.

Of the 20 Kandas of the Atharva Veda, the last one is manifestly a later addition manufactured almost wholly out of the borrowings from the RigVeda to serve as a manual for the Priest called Brahmanac chansin who had a definite though minor role to play at the Soma sacrifice. Moreover, the Kuntap Suktas of the This Kanda are without any pada patha and nothing parallel to them can be found in the Paippalada recention showing that they had been given a place in this late Kanda of the Samhita at a very late date.

In fact, the 19th Kanda ends with a significant prayer which strongly suggests that the Samhita at one time was considered to end with it. (Vedic Age P.233)

అనగా; అథర్వ వేదము యొక్క ౨౦ కాండముల నుండి చివరి ఇరువదవ కాండము స్పష్టముగా వెనుకనుండి గలుపబడినదే. అది దాదాపు సంపూర్ణముగా ఋగ్వేదము నుండి దీసికొనబడినదే. 'బ్రాహ్మణాచ్ఛంసీ' అను పేరుగల ఋత్వికుని సోమ యజ్ఞము నందు కార్య పూర్తి కొరకు ఆదర్శ గ్రంథ రూపములో దీసికొనబడినది. ఈ కాండము నందే గల కుంతాప సూక్తములందు ఎట్టి పద పాఠమును లేదు. మరియు పైప్పలాద శాఖయందు దానికి సాటియగు వస్తువేదియును లేదు. ఇందువల్ల వానిని ఈ చివరి కాండములో చాల వెనుక నుండి కలుపబడినదని తోచుచున్నది. వాస్తవమునకు ౧౯ వ కాండపు సమాప్తి ఒక ప్రార్థనతో జరిగినది. ఒక కాలమునందు అథర్వ వేదము ఈ ప్రార్థనతోనే సమాప్త మగుచుండెడిది.

**సమాలోచనము :** అథర్వ వేదము ఇరువదవ కాండములో ఋగ్వేదములోని అనేక మంత్రములు గలవనినచో దాని అర్వాచీనత్వ మెట్లు సిద్ధించును? ఐనను మీ అభిమతము ననుసరించియే ఋగ్వేదము అన్నిటికన్న పురాతనము మరియు ఏకమాత్ర వేదము. ఇక దీనినుండియే అనేక మంత్రములు మిగతావేదములలో గైకొనబడినవి. అగుచో ఆ మంత్రముల ప్రాచీనతయే సిద్ధి యగుచున్నది. బ్రాహ్మణాచ్ఛంసీ ఋత్విక్కునకు యజ్ఞమునందు స్థానము నిచ్చుట కొరకే ఈ మంత్రములు ఋగ్వేదము నుండి దీసికొనబడిన వని యనుట సంపూర్ణముగా మీ కల్పనా మాత్రమే. వాస్తవముగా ఈ సూక్తములో ఇంద్ర సూక్తము, స్వరాజ్య సూక్తము, మరియు ఇంకా అనేక అత్యుత్తమ మరియు సరళార్థక భావపూర్ణ సూక్తములు, మరియు మంత్రములున్నవి. వానిని ఆవశ్యకతానుసారము, బలపరచుట కొరకు రెండవసారి ( మరల మరల) చదువబడినవి. ఇది పునరుక్తి కాదు. ఇది అభ్యాసము, లేక సార్థకముగు పునరావృత్తి. దీనిని ఉత్తమ రచయితలు మరియు ఉపన్యాసకులు తమ ప్రయోగములందు స్వీకరింతురు. కేవలము బ్రాహ్మణాచ్ఛంసీ పేరు గల ఋత్విక్కునకు స్థానము గల్పించుట కొరకే ఈ మంత్రములను సంకలనమొనర్చినా రనుట అసంగతము. అది మీ కల్పనయే. ఇక ఒక వేదములోని మంత్రములు, ఇతర వేదములందును గలవనుట, ఆ విషయములో వైదిక ధర్మోద్ధారక శిరోమణి, కలియుగములో అనుపమాన వేదజ్ఞుడగు మహర్షి దయానందుల నిమ్న లేఖయును సదా ధ్యానము నందుంచుకొనవలసియున్నది. అప్పుడు మాత్రమే వ్యర్థ పునరుక్తి భ్రమ ఉత్పన్నము గాజాలదు. మహర్షి దయానందులు ఋగ్వేదాది భాష్య భూమికయం దిట్లు వ్రాసియున్నారు. '**శన్నో దేవీరభిష్టయే,** వంటి మంత్రములు వేదములందు వచ్చును. అవి ఋగ్వేదములో పదార్థముల గుణ ప్రకాశము కొరకు, యజుర్వేదమందు యజ్ఞముకొరకు, సామవేదములో జ్ఞానము మరియు క్రియ, అనగా; కర్మయోగము, మరియు జ్ఞానయోగము కొరకు, అథర్వ వేదములో **'ఫలసిద్ధి'** అనగా నీతివిద్య మున్నగు తత్త్వముల ఆలోచన కొరకు వచ్చుచుండును. మహర్షి దయానందులవారి మూల సంస్కృత లేఖ ఈ దిగువ శబ్దములందు గలదు.

**అత ఏవైకస్యాపి మన్త్రస్య చతసృషుసంహితాసు పాఠః కృతోఽస్తి తద్యథా ఋగ్భిః**

**స్తువన్తి, యజుర్భిర్యజన్తి సామభిర్గాయన్తి । ఋగ్వేదే సర్వేషాం పదార్థానాం**

**గుణప్రకాశః కృతోఽస్తి ।తథా యజుర్వేదే విదిత గుణానాం పదార్థానాం సకాశాత్**

**క్రియయాఽనేక విద్యోపకార గ్రహణాయ విధానకృతమస్తి । తథా సామవేదే**

**జ్ఞానక్రియా విద్యయోర్దీర్ఘవిచారేణ ఫలావధిపర్యన్తం విద్యా విచారః షోఽన్తక**

**ర్మణి ఏవమ్ అథర్వ వేదేఽపి త్రయాణాం మధ్యే యో విద్యాఫలవిచారో ।**

**విహితోఽస్తి తస్య పూర్తికరణేన రక్షణోన్నతీ విహితే స్తః ॥**

( ఋగ్వేదాదిభాష్యభూమికా పు.3౬౪ ) ప్రశ్నోత్తర విషయః సంక్షేపతః వైదిక యన్త్రాలయ పఞ్చమావృత్తిః

మహర్షి యొక్క ఈ నిర్ణయము ద్వారా అన్ని వేదములందు వచ్చిన మంత్రముల అభిప్రాయమును మనము తెలిసికొనగలము. ఉదాహరణార్థము

**'శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయో రభిస్రవన్తు నః॥** యజు. ౩౬-౧౨. ఋ.౧౦-౯-౧౪॥'

ఈ మంత్రము ఋగ్వేదమందు వచ్చినప్పుడు దీని ముఖ్య తాత్పర్యము జలముల గుణముల ప్రతిపాదన ముండును. యజుర్వేదమందు యజ్ఞములలో ఆచమనము మున్నగు క్రియలందు దీని యుపయోగముండును. సామవేదములో ఉపాసనా విషయ ప్రధానము గావున దీనికి పరమాత్మ పరక అర్థమునే ముఖ్యముగా గ్రహించుట ఉచితముగా నుండును ఇక అథర్వ వేదమందు శిల్ప విద్య యందు జలముల ఉపయోగము, లేక స్త్రీల ధర్మము మున్నగు విషయక బోధయందు దీని సంబంధ ముండగలదు. దీనిని **'పునరుక్తి'** అని యనుకొనుట మూర్ఖతయే. కున్తాపసూక్తములు పైప్పలాద శాఖ యందుండకపోవుట, మరియు పద పాఠము లేకపోవుట మాత్రముతో వానిని ప్రక్షిప్తములుగా నెంచు కొనుట కే కారణ ముండ జాలదు. శ్రీ సాయణాచార్యుడు వ్రాసినట్లు;

**'మన్త్రేషు పాఠభేదః శాఖా భేదేన'** ( ఋగ్వేద భాష్యమునకు సాయణుని భూమిక)

ఆశ్వలాయన శ్రౌత సూత్రము నందలి; -

**తస్మా దూర్ధ్వం కున్తాపమ్ – తస్మాదితశ్చతుర్దశ విగ్రాహం నిన్దం శంసేత్,**

**చతుర్దశ్యామేకేన ద్వాభ్యాం చ విగ్రహః।**

మున్నగు సూత్రములందు కుంతాపసూత్రముల విషయములో వర్ణనయున్నది. ఇట్లే ఐతరేయ బ్రాహ్మణ పంజికా ౬, అధ్యాయము ౫, ఏడవ ఖండమందు **'ఏతశప్రలాప'** యొక్క ఏ కుంతాప సూత్రాంతర్గత వర్ణనము గలదో దానిని ప్రక్షిప్తమని విశ్వసించుట మంచిది గాదు. ౧౯వ కాండము సమాప్తమున గల యుపసంహారపు మంత్రమును 'వైదిక్ ఏజ్' లేఖకులు బ్లూంఫీల్డు ననుసరించి నిర్ణయించినారు. అది ఇట్లు గలదు

**యస్మాత్ కోశాదుదభరామ వేదం తస్మిన్నన్తరవదధ్మ ఏనమ్।**

**కృతమిష్టం బ్రహ్మణో వీర్యేణ తేన మా దేవాస్తపసావతేహ** ॥ ఋ.౧౯-౭౨-౧॥

దీని భావమేమన; వేదమును ఏమూట ( దస్త్రము) నుండి దీయుదుమో కార్యానంతరము మరల దాని నందే సురక్షణము కొర కుంచుదుము. పరమాత్మ ప్రసాదించిన శక్తితో మనము యజ్ఞాది శుభకార్యము లొనర్తుము. సత్యనిష్ఠ గల జ్ఞానులు తపస్సు ద్వారా దాని రక్షణ యొనర్చెదరుగాక! మున్నగునవి.

దీనియందు అథర్వ వేద సంహిత యొక్క సమాప్తిని సూచించు వాచక శబ్దమేదియును లేదు. అధ్యాయము, లేక కాండముయొక్క సమాప్తియందును ఇట్టి మంత్రముల ప్రయోగము జరిగియే యుండును. ౧౯వ కాండము, సమాప్తి జరిగినప్పుడు అది చక్కగా జరిగి యుండెడిది. ఈ విధముగా ఈ మంత్రము ద్వారా అథర్వ వేద సమాప్తి సూచనను నిర్ణయించిన పిదప వైదిక్ ఏజ్ లేఖకులు మరల బ్లూంఫీల్డు ననుసరించి దిగువ విధముగా వ్రాయుట ఆశ్చర్యముతో బాటు నవ్వు కూడా వచ్చుచున్నది. అనగా;

**But there are reasons to believe that the19th Kanda it self is a late compilation, for its hymns though found in the Paippalada recention, are scattered throughout that text - Vedic Age P.234.**

౧౯వ కాండము కూడా వెనుకనుండి కలుపబడినదే. ఏలన దీని సూక్తములు పైప్పలాద శాఖయందు గాన్పించినను అవి దానియందు అక్కడక్కడ వ్యాపించి అస్తవ్యస్తముగానున్న కారణమున ఇట్లంగీకరించవలసివచ్చినది.

దీని ద్వారా లేఖకుల ౧౯వ కాండముపై అథర్వ వేద సంహిత సమాప్తి యొక్క చివరి మంత్ర సూచక విషయము స్వయముగనే ఖండితమగుచున్నది. ఇది పైప్పలాద శాఖయందు లేకపోవుటచే ప్రక్షిప్తమను యుక్తి సైతము వీగిపోయినది. వారు స్వయముగానే ఈ సూక్తము పైప్పలాద శాఖయందు చూడబడుచున్నదని స్వీకరించినారు. కాని దాని క్రమము భిన్నముగా నమ్ముచున్నారు. తమ సంకలనము, మరియు విశేష ప్రయోజనము, లేక ఉద్దేశ్యమునను సరించి శాఖలందు క్రమభేదము గాన్పించుచునే యుండును. ముఖ్యముగా యజ్ఞాదులందు ఇట్లు జరుగుచుండును. పైప్పలాద శాఖ యొక్క ౨౦వ కాండమునే జూడుడు. దాని ప్రథమ సూక్తపు మంత్రములన్నియు (శౌనక శాఖ పేరుతో బిలువబడు మూల అథర్వ వేద రెండవ కాండము నుండి దీసికొనబడిన ఒక్క మంత్రము తప్ప) అనగా ౯ మంత్రములు సప్తమ కాండము నుండి దీసికొనబడినవి. ద్వితీయ సూక్తము నుండి మూడు మంత్రములు, సప్తమ మండలము నుండి ఒక్కటి, ద్వితీయ కాండము నుండి ఒక్కటి, ఒక్కటి తృతీయ, ఒక్కటి చతుర్థ కాండము నుండి దీసికొనబడినవి. తృతీయ సూక్తము యొక్క ౧౦ మంత్రముల నుండి ౯ మంత్రములు అథర్వ వేదమూలము లోని ఏడవ కాండమునుండి దీసికొనబడినవి. కావున ఈయాధారముపై ఏదో పరిణామము దీయుటయును అశుద్ధమే యగును.

### 9.15 ౧౮వ కాండము యొక్క ప్రక్షిప్తములపై సమాలోచనము

అథర్వ వేదము ౧౮వ కాండము ప్రక్షిప్తమను విషయములో 'వైదిక్ ఏజ్' లేఖకుల ఈ ప్రమాణము కూడా మన్నించదగినది కాదు.

**The Eighteenth Kanda, consisting of four funeral hymns should also be regarded as a later addition, for its contents are absent in the Paippalada recention..**

**దీని భావము :-** ౧౮వ కాండమును కూడా ప్రక్షిప్తమనియే తలచవలెను. ఏలన; పైప్పలాద శాఖయందు దీని మంత్రములు గానరావు.

మేము మొదట తెలిపినట్లు ఇదొక యుక్తి కానేకాదు. నిజముగా నీయుక్తిని ఒప్పుకొనినచో మరల నాకాండములను, సూక్తములను ప్రక్షిప్తములని అంగీకరించుటకు వారి కెట్టి అధికారమును లేదు. పైప్పలాద శాఖ యందలి మంత్రములు ప్రక్షిప్తము లెట్లగును?

### 9.16 ౧౭ వ కాండ ప్రక్షిప్తముపై సమాలోచనము

**ఉదాహరణార్థము :** వైదిక్ ఏజ్ లేఖకులు ౧౭వ కాండము కూడా ప్రక్షిప్తమనియే వ్రాసినారు. దీని యనేక మంత్రములు పైప్పలాద శాఖ యందు వచ్చి యున్నవనియు ఒప్పుకొనుచున్నారు.

**The 17th Kanda, consisting of only one hymn of purely magical contents, is a curious anomaly and must be regarded as a late accretion, though partly appearing also in the Paippalada text - Vedic Age. P.234.**

అనగా; కేవలమొక ౧౭వ కాండము మాత్రమే విశుద్ధ రూపములో గారడీ, వశీకరణము వంటి సంబంధము గలది. ఇందలి కొన్ని మంత్రములు పైప్పలాద శాఖ యందు గాన్పించినను ఇది వెనుక నుండియే చేర్చబడినదని తలచవచ్చును.

ఈ విధముగా పదునేడవ కాండమును ప్రక్షిప్తమని తలచుటకు లేఖకు లెట్టి కారణమునీయలేదు. వీరన్నంత మాత్రముననే అది ప్రక్షిప్తమైనదా? వీరీ కాండము విషయమున విశుద్ధ రూపములో గారడీ వశీకరణము వంటి కాండము *(Purely magical contents)* అని వ్రాసినారు. కాని మేము దానిని ధ్యాన పూర్వకముగా ఆద్యోపాంతము చదివినాము. ఐనను దానియందెట్టి గారడీ తమాషాల వంటివి కనిపించలేదు. దానియందు ఇంద్రుని పేరుతో పరమేశ్వర స్మరణము నొనర్చు నట్టి గొప్ప ప్రార్థనలున్నవి.

**ఉదా:-** దాని ప్రారంభిక మంత్రమిట్లున్నది.

**విషా సహిం సహమానం సాసహానం సహీయాంసమ్ । ........ ఈడ్యం నామ**

**హ్వ ఇన్ద్రమాయుష్మాన్ భూయాసమ్** ॥ మ.౧ ॥

**ప్రియో దేవానాం భూయాసమ్** ॥ మ.౨॥

**ప్రియః ప్రజానాం భూయాసమ్** ॥ మ. ౩॥

**ప్రియః పశూనాం భూయాసమ్** ॥ మ. ౪॥

**ప్రియః సమానానాం భూయాసమ్** ॥ మ.౫॥

సర్వ శక్తిమంతుడగు పరమేశ్వరుని నేను స్మరింతును. ఆయన కృప చే నేనానాయుష్మంతునగుదును గాక, నేను సత్య నిష్ఠాపరులగు విద్వాంసులకు ప్రియుడ నగుదును గాక అని రెండవదానిలో, నేను సమస్త ప్రజలకు ప్రియుడ నగుదును గాక యని మూడవదానియందు, పశుపక్ష్యాదులచే ప్రేమమయ వ్యవహారమొనర్చుచు పశువులకు కూడా ప్రియుడనగుదును గాక యని నాల్గవదానియందు, నేను సమస్త ప్రాణులకు ప్రియుడనగుదును గాక యని ఐదవ దాని యందు ప్రార్థనలున్నవి.

౬ నుండి ౧౯ వ మంత్రముల వరకు పరమేశ్వరుని విష్ణు, ఇన్ద్ర, మహేన్ద్ర, ప్రజాపతి మున్నగు నామములచే స్మరించబడినది.

**త్వమిన్ద్రస్త్వం మహేన్ద్ర స్త్వం లోకస్త్వం ప్రజాపతిః । తుభ్యం యజ్ఞో వితా**

**యతే తుభ్యం జుహ్వతి జుహ్వతస్తవేద్ విష్ణో బహుధా వీర్యాణి** ॥ య.౧౮॥

అన్నిటి చివర ప్రార్థన గలదు.

**సుధాయాం మా ధేహి పరమే వ్యోమన్ ॥**

అనగా; సర్వ వ్యాపకుడవు నగు ఓ పరమేశ్వరా! నాకు సదా భక్తి సుధను పానమొనర్చ జేయుము. హే ఉత్తమ పరమ రక్షకా! భక్తి యొక్క అమృతమయ స్థితియందు సదా నన్నుంచుము ఏలన; సకల దిశలను నీవే రక్షించువాడవు, సర్వ వ్యాపకుడవు పరమేశ్వరుడవు.

త్వం రక్షసే ప్రదిశశ్చతస్రః - త్వం శోచిషా నభసీ విభాసి। త్వమిమా

విశ్వా భువనాను తిష్ఠస ఋతస్య పన్థామన్వేషి విద్వాంస్తవేద్ విష్ణో

బహుధా వీర్యాణి ॥ మ.౧౬॥

ఇదే విధముగా ౨౭వ మంత్రములో ప్రజాపతి పరమేశ్వరుని కృపచే ఉత్తమ కర్మలనొనర్చుచు అతని సర్వ రక్షక కవచమును ధరించి నేను దీర్ఘాయువును ప్రాప్తి జేసికొందునుగాక అను ప్రార్థన గలదు.

ప్రజాపతేరావృతో బ్రహ్మణా వర్మణాహం కశ్యపస్య జ్యోతిషా వర్చసా చ।

జరదష్టిః కృతవీర్యో విహాయాః సహస్రాయుః సుకృతశ్చరేయమ్ ॥ మ.౨౭॥

చివరి 30 వ మంత్రములో ఈ ప్రార్థనతో సూక్త సమాప్తి గలదు అనగా

అగ్నిర్మా గోప్తా పరిపాతు విశ్వత ఉద్యన్ సూర్యో నుదతాం మృత్యుపాశాన్।

వ్యుచ్ఛన్తీరుషసః పర్వతా ధ్రువాః సహస్రం ప్రాణా మయ్యాయతన్తామ్ ॥ మ.30॥

అనగా; భౌతిక మరియు సర్వజ్ఞ పరమేశ్వరాగ్ని నన్ను నల్దిశల నుండి రక్షించుగాక. ఉదయించుచున్నట్టి భౌతిక మరియు జ్ఞాన సూర్యుడు మృత్యుపాశము ( రోగము మరియు ఆధ్యాత్మిక బంధనము) లను తొలగించుగాక. ఉషస్సులు మరియు పర్వతాదులు నాయందు వేలాది గుణముల ప్రాణశక్తిని ధారణ మొనర్పజేయుగాక మున్నగునవి. ఇట్టి స్ఫూర్తిదాయక ప్రార్థనలు మరియు ఉత్తమ భావనలందు మాకెచ్చటను కల్పిత మాయమంత్రములు, గారడీలు మచ్చునకైనను కానరాలేదు. ఇవి విశుద్ధమగు ఆధ్యాత్మికోన్నతి ప్రార్థనలు. బ్లూంఫీల్డు దృష్టితో జూచువారికి అథర్వమంతటను గారడీ తంత్రములే గాన్పించుట స్వాభావికము. ఈ భ్రాంతి నివారణకై మేము రాబోవు అధ్యాయములో సప్రమాణములు చూపుదుము.

### 9.17 పదునైదవ కాండము యొక్క ప్రక్షిప్తత్వము

పదునైదవ కాండము కూడా వెనుకనుండి గలుపు కొనినదేయని వైదిక్ ఏజ్ లేఖకులు నిరూపించు ప్రయత్నము జేయుచు ఇట్లు వ్రాసినారు.

The most interesting of all the Kandas is the 15th, composed not in verse but in typical Brahmana prose, and devoted to the mystic exaltation of the vratya. Probably this Vratya Kanda was the first of the additions successively made to the original text of the Atharva Veda. There is no reason to doubt the antiquity and authenticity of the other Kandas of the Atharva Veda.-Vedic Age. P.234.

అనగా ౧౫ వ కాండములో వ్రాత్యము యొక్క రహస్యమయ ప్రశంస గలదు. ఇది పద్యములందు గాక బ్రాహ్మణ గ్రంథశైలిలో గద్యములో గలదు. ఇది అన్నిటికన్న మనోరంజకముగానున్నది. ఇది పదునైదవ కాండము మూలమగు అథర్వ వేద సంహితయందు అన్నిటికన్న పూర్వమే కలిపివేయబడిన కాండమని స్పష్టముగా గాన్పించుచున్నది.

**సమీక్ష**

ఈ వ్రాత్య కాండము ప్రక్షిప్తమని స్వీకరించుటకు రచయిత లే కారణమును చూపలేదు. బహుశః వీరు వ్రాత్య శబ్దమున కర్థము పతిత ఉపనయనాది సంస్కార రహితులని యనుకొనినారు. కావున అట్టి వారి కింతటి ప్రశంస ఈ కాండమున జూచి ఆశ్చర్యమైనది కాని వాస్తవముగానట్లు లేదు. 'వ్రాత్యాః' యొక్క పాఠము నిఘంటువు ౨-3లో మనుష్య నామములందున్నది. కావున 'వ్రాత్య' అను శబ్దమునకర్థము మానవుల హితకారులగు సంన్యాసులు మున్నగు మాన్యులగు మహానుభావులని గలదు. అట్టివారిని సత్కరించు విధానము ఈ కాండమునందలి మంత్రములలో గలదు.

**తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్గృహానాగచ్ఛేత్ స్వయమేనమభ్యుదేత్య**
**బ్రూయాద్ వ్రాత్య క్వావాత్సీః వ్రాత్యోదకం వ్రాత్య తర్పయన్తు వ్రాత్యయథాతే**
**వశస్తథాస్తు యథా తే నికామస్తథాస్త్వితి** ॥ అథ. ౧౫-౧౧-౨॥

అనగా; ఎవరి గృహమునకైన ఇట్టి సర్వజన హితకారియగు విద్వాంసుడు వచ్చెనేని వారు సత్వరము లేచి ఎదురువెళ్లి మధురమగు ఉత్తమ వాణిచే యోగక్షేమాదుల నడిగి, జల, ఫల, భోజనాదుల ద్వారా సత్కరించవలెను. ఇందాశ్చర్యమునొందు విషయ మేదియును లేదు. దీనిద్వారా అతిథి సత్కార మహిమ సూచిత మగుచున్నది. వ్రాత్య శబ్దము యొక్క అర్థ మీ విధముగా దెలిసికొనవలెను. మహర్షి దయానందులు పంచ మహా యజ్ఞ విధి, మున్నగువానియందు ఈ మంత్రముల నుదాహరించుచు అతిథి యజ్ఞ ప్రకరణములో చూపియున్నారు.

ఈ కాండములో ప్రక్షిప్తమను మాటయే లేదు. మిగతా కాండముల విషయములో స్వయముగా 'వైదిక్ ఏజ్' లేఖకులు మిగతా కాండముల ప్రాచీనత్వము, ప్రామాణికత్వములో సందేహించవలసిన కారణమే లేదు.

పాణినిముని కృతమగు అష్టాధ్యాయిలో శౌనకశాఖయే గాక శౌనకీయ శిక్ష, కౌశిక శ్రౌత సూత్రాములు, అథర్వ వేదముతో సంబంధము గల ఇతర గ్రంథముల నిర్దేశము కానవచ్చును. ఉదాహరణార్థము :-

**శౌనకాదిభ్యశ్ఛన్దసి** ॥ అష్టాధ్యాయి ౪-3-౧౦౬ ॥

**కాశ్యపకౌశికాభ్యామృషిభ్యాం ణినిః** ॥ కౌశికీయ శిక్ష ౪-3-౧౦3 ॥

**ఆథర్వణికస్యేక లోపశ్చ (౪-3-౧33)। ఆథర్వణికానాం ధర్మ ఆమ్నాయో వా ఆథర్వణః** ॥ ౪-3-౧33॥

ఈ ప్రకరణము వలన కేవలము అథర్వ వేద సంహితయే గాక శౌనకీ శిక్ష, కౌశిక సూత్రములు, అథర్వ వేదీయ కల్ప సూత్రములు మున్నగు వాని జ్ఞానము పాణిని గారికుండెనని స్పష్టమగుచున్నది. 'యజుర్వేదములో

పాణినికి జ్ఞానము లేకుండెను మరియు అష్టాధ్యాయియందు శుక్ల యజుర్వేద నిర్ణయ మెచ్చటనులే' దని యనుట ఎంతటి అసత్యమో, ఎంతటి మూర్ఖత్వమో చూడుడు 'వైదిక్ ఏజ్' లో ఇట్లు వ్రాసినారు.

### ౯.౧౮ 'వైదిక్ ఏజ్' రచయితల అసత్య ప్రతిపాదన

౧. 'వైదిక్ ఏజ్' లేఖకులు పు.౪౧౬, ౪౧౭ లందిట్లు వ్రాసినారు. పాణినికి శుక్లయజుర్వేద జ్ఞానమున్నట్లు గానరాదు. ఆయన అష్టాధ్యాయీ సూత్రములందు దాని నిర్దేశము లేనందున మా కాశ్చర్యము గలిగినది. వైదిక్ ఏజ్ శబ్దములిట్లున్నవి.

It cannot be proved that Panini was acquainted with the Samhita or the Brahmanas of the white Yajurveda, though he certainly knew all the other Samhita texts known to us as well as the Aitareya Brahmana...........Vedic Age. P. 416....417.

సూత్రములపై దృష్టిపాతమొనర్చినప్పుడు 'వైదిక్ ఏజ్' లేఖకులగు విద్వాంసులు ఈ విషయములో అసత్యమును ధృవీకరించుట కొనర్చిన ప్రయత్నమును జూచి అతి దుఃఖము, ఆశ్చర్యమును గలిగినది.

### ౯.౧౯ పాణిని సూత్రములందు యజుర్వేదపు స్పష్ట నిర్దేశము

అష్టాధ్యాయి ౬-౧-౧౧౭ యొక్క 'యజుష్యురః' అను సూత్రమున కర్థము యజుర్వేదమున అకారము పిదప 'ఉరః' శబ్దమునకు ఉరో పదాన్తము ఏఙ్ అగును. అది ప్రకృతియై 'ఉరో అన్తరిక్ష' ఇది శుక్లయజుర్వేద ౪-౭ యొక్క పాఠము.

**ఆపో దేవీర్బృహతీర్విశ్వశంభువో ద్యావా పృథివీ ఉరో అన్తరిక్ష।**

**బృహస్పతయే హవిషా విధేమ స్వాహా** ॥ యజుః. ౪-౭ ॥

౨. అష్టాధ్యాయీ ౬-౧-౧౧౬ యొక్క సూత్రము.

**ఆపో జుషాణో వృష్ణో వర్షిష్ఠే అమ్బే అమ్బాలే అమ్బికే పూర్వే ॥**

యజుర్వేద మందు ఆపో జుషాణో, వృష్ణో, వర్షిష్ఠే ఈ ఏఙన్త శబ్దములు అకారమునకు పూర్వమున వచ్చినచో ప్రకృతి రూపమున నుండవలెను. అమ్బిక శబ్దముకు పూర్వము అమ్బే, అమ్బాలే యున్నచో ఈ రెండు శబ్దములు ఇదే విధముగా నుండవలెను. ఎట్లన;

**ఆపో అస్మాన్ మాతరః శున్ధయన్తు** ॥యజు.౪-౨॥

**జుషాణో అగ్నిర్వేతు స్వాహా** ॥౩-౧౦ ॥

**వృష్ణో అంశుభ్యాం గభస్తి పూతః** ॥౭-౧ ॥

**వర్షిష్ఠే అధినాకే** ॥ ౧-౨౨ ॥

**అమ్బే అమ్బాలే అమ్బికే** ॥ ౨౩-౧౮॥

3. అష్టాధ్యాయీ, ౬-౧-౧౧౭ యొక్క సూత్రము **'అఙ్గ ఇత్యాదౌ చ'** ।

అనగా; యజుర్వేదములో అకారము పరమగుచో **'అఙ్గే'** ఏజన్త పదము ప్రకృతియై ఉండవలెను అఙ్గే పరము ఆదిలో ఏజ్ యైనను ప్రకృతిగానుండును. ఎట్లన; ఐన్ద్రః ప్రాణో అఙ్గే అఙ్గే నిదీధ్యత్ మున్నగునవి యజు.౬-౨౦ ॥

౪. అనుదాత్తే చ కుధ పరే ॥ అష్టా ౬-౧-౧౧౮ ॥

యజుర్వేదములో ఏ అనుదాత్తము అకారము కన్న ముందు కవర్గము, మరియు ధకారముండిన, దాని తరువాత పదాంతము ఏజ్ ప్రకృతియై ఉండిపోవును. ఎట్లన, అయం సో అగ్నిః( యజు ౧౨-౪౭) సో అధర్వ( యజు.౨౧-౪౭)

ఇదే విధముగ ఇంకా అనేక ఉదాహరణములనీయవచ్చును. వీని వల్ల వైదిక్ ఏజ్ రచయితల మాటలు అసత్యము వెల్లడగును. విద్వాంసులగువారు వివేచనమొనర్పకుండా అశుద్ధ భ్రమజనక కల్ల మాటలు వ్రాయుట అతి హేయమగు కార్యము.

**9.20 సామవేదము స్వయంసత్తాగలది కాదా?**

వైదిక్ ఏజ్ ననుసరించి సామవేదము యొక్క మంత్రములన్నియు దాదాపు ఋగ్వేదము నుండి దీసికొనబడినవే కావున దానికి స్వయముగా స్వతంత్ర శక్తి లేదు కేవలము సోమ యజ్ఞాదులందు మాత్రమే గానము కొరకు దాని ఉపయోగముండును.

*The SamaVeda hardly counts at all as an independent text Vedic Age. P.225"*

The literary and historical value of the SamaVeda is, therefore practically nil, though its importance for the Soma-ritual can not be overestimated......... Vedic Age. P. 230.

ఈ విధమగు శబ్దముల ప్రయోగము వైదిక్ ఏజ్ యందు జేయబడినది. ఐతిహాసిక మహాత్మ్యము ప్రశ్న వేదములకు సంబంధించినది కానేకాదు ఏలన; వేదములలో ఇతిహాసమే లేదు. అది దివ్యమగు సార్వభౌమ జ్ఞాన భండారము. దాని నుండి భ్రమ పూర్వకముగా బలాత్కారముగా ఇతిహాసమును దీయుటకు విఫల ప్రయత్న మొనర్చబడుచున్నది. దానియందు సఫలత గలుగనిచో 'వైదిక్ ఏజ్' లేఖకుల వలె ఇతరులు కూడా స్వీకరించవలసి వచ్చును. ఎట్లన;

"Naturally it (Rigveda) is poor in historical data" - Vedic Age. P.229

అనగా; స్వాభావికముగానే ఋగ్వేదములో ఐతిహాసిక సామగ్రిలో అతి అల్పముగా గలదు. సామవేదము విషయమున కూడ ''యజ్ఞములలో గానమొనర్చుట కన్న మహాత్మ్యమేదియును లేదు. దీనికే మాత్రము స్వతంత్ర సత్తా లేదు. దాదాపు దీనిమంత్రము లన్నియు ఋగ్వేదము నుండి దీసికొనబడినవే' యనునది సంపూర్ణముగా అబద్ధమే. ఒక వేళ దీనికి స్వతంత్ర మరియు స్వయంసత్తా లేకున్న, దీనిమంత్రములన్నియు దాదాపు ఋగ్వేదము

నుండియే దీసికొనిన యెడల ఋగ్వేదము నందు సామవేదము మరియు దాని గీతముల గురించి అనేక స్థానములందు నిర్దేశించబడక పోవును గదా! దిగువ వ్రాసిన విధముగాను ఇతర మంత్రములందును విషయము చూడబడుచున్నది.

**ఋగ్వేదములో సామవేద నిర్దేశము**

**౧. అఙ్గిరసాం సామభిః స్తూయమానాః** ॥ ఋ.౧-౧౦౭-౨॥

**౨. అఙ్గిరసో న సామభిః** ॥ ఋ.౧౦-౭౮-౫ ॥

**3. ఉభే వాచౌ వదతి సామగా ఇవ గాయత్రం చ త్రైష్టుభం చాను రాజతి ।**

**ఉద్గాతేవ శకునే సామ గాయసి, బ్రహ్మపుత్ర ఇవ సవనేషు శంససి** ॥ ఋ.౨-४3-౧౦౨॥

ఇచ్చట ఉద్గాత మరియు సామగానాదుల వర్ణనము స్పష్టముగా గలదు.

**४. యో జాగార తమృచః కామయన్తే యో జాగార తము సామాని యన్తి** ॥ ఋ.౫-४४-౧४ ॥

ఇచ్చట ఋగ్వేదపు ఋచలతో గూడ సామవేదము యొక్క సామముల వర్ణన గలదు. దీనివల్ల సామవేదము యొక్క స్వతంత్ర సత్తా సిద్ధియగుచున్నది.

**౫. తమేవ ఋషిం తము బ్రహ్మాణమాహుర్యజ్ఞన్యం సామగాముక్థ శాసమ్** ॥ ఋగ్వేద ౧౦-౧౦౭-౬॥

ఇచ్చట సామవేదగాన మొనర్చుటకు సామగానము మరియు విశేషముగా అథర్వ వేదము నెరిగిన వారి కొరకు బ్రహ్మ శబ్ద ప్రయోగము వలన వానికి వేద రూపములో స్వతంత్ర సత్తాను గూర్చి స్పష్ట నిర్ణయమున్నది. దీని నెవ్వరును కాదనలేరు.

**౬. ఇన్ద్రాయ సామ గాయత విప్రాయ బృహతే బృహత్** ॥ ఋ.౮-౯౮-౧ ॥

ఇచ్చట పరమేశ్వర స్తుతి కొరకు బృహత్ సామగాన విధానమున్నది.

**౭. బృహస్పతిః సామభిః ఋక్వో అర్చతు** ॥ ఋ.౧౦-3౬-౫ ॥

**౮. ఋతస్య సామన్ రణయన్త దేవాః** ॥ ఋ.౧-౧४౭-౧ ॥

**౯. గాయత్రేణ ప్రతి మిమీతే అర్కమర్కేణ సామ త్రైష్టుభేన వాకమ్** ॥ ఋ.౧-౧౬४-౨४॥

**౧౦. సామకృణ్వన్ సామన్యో విపశ్చిత్ క్రన్దన్నేతి** ॥ ఋ.౯-౯౬-౨౨ ॥

**౧౧. పరావతో న సామ తద్ యత్రా రణన్తి ధీతయః** ॥ ఋ.౯-౧౨౧-౨॥

**౧౨. తస్మాద్ యజ్ఞాత్సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే**

**ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత** ॥ ఋ.౧౦-౯౦-౯॥

ఇచ్చట పరమ పూజనీయుడగు పరమేశ్వరుని ద్వారా ఋగ్వేద, యజుర్వేద, సామవేద అథర్వ వేదముల యుత్పన్నము సూచిత మొనర్చబడియున్నది.

౧౩. అభ్యాష్యం శవసానాయ సామ ॥ ఋ.౧-౬౨-౨ ॥

౧౪. యే న పరః సామ్నో విదుః ॥ ఋ.౨-౨౩-౧౬ ॥

౧౫. త్వష్టాజనత్ సామ్నః సామ్నః కవిః ॥ ఋ. ౨-౨౨-౧౭॥

౧౬. స హి ద్యుతా విద్యుతా వేతి సామ ॥ ఋ.౧౦-౯౯-౨ ॥

ఈ ప్రకారముగా ఋగ్వేదమందు సామవేదము, మరియు దాని అనేక గానముల నిర్దేశముండుట వలన నామములతో సామవేదమునకు సత్తా లేదను ఈ వాదము అసత్యమని తేలిపోయినది వాస్తవమునకు సామవేద ముఖ్య విషయము ఉపాసనయే. మరియు ఋగ్వేదము జ్ఞానము ముఖ్యముగా గలది ఋగ్వేద మంత్రములు సామవేదములో వచ్చినప్పుడు అచ్చట భక్తి ప్రధాన విషయములు, ఆధ్యాత్మిక విషయముల ప్రాధాన్యత గలదని తెలియవలెను. ఋగ్వేదము నందు జ్ఞానము మరియు యజుర్వేదములో కర్మ పరక అర్థముల ప్రాధాన్యత గలదు

యజుర్వేదములో అనేక స్థానములందు సామగానములను జూడనగును. ఎట్లన; రథన్తరమ్ ॥ యజు ౧౦౧-౦ ॥ బృహత్ ॥ య.౧౦-౧౧ ॥ వైరూపమ్ ॥ య.౧౦-౧౨ ॥ వైరాజ్యమ్ ॥ య.౧౦-౧౩ ॥ వైఖానసం వామదేవ్యమ్, యజ్ఞాయజ్ఞియమ్ ॥ య.౧౨-౪ ॥ శక్వరం రైవతమ్ ॥ య. ౧౦-౪ ॥ గాయత్రం, గౌరీవీతమ్, అభీవర్తమ్, ప్రజాపతి, హృదయమ్, మున్నగునవి అనేకములున్నవి.

ఈ ప్రకారముగా సామవేదము యొక్క వేర్పాటు మరియు దాని స్వతంత్ర సత్తా సిద్ధియగుచున్నది ఋగ్వేద మంత్రములు కూడా ఆ వేదము యొక్క క్రమములో లేవు. బహుశః దానియర్థములు కూడా స్థానపరముగా మారుచుండునని తెలిసికొనవలెను.

### 9.2 । శుక్ల యజుర్వేదమందు, హెచ్చుతగ్గులు

'వైదిక్ ఏజ్' లేఖకులు మొదటనే కృష్ణ యజుర్వేదమునకే ప్రాచీనత్వము సిద్ధింప జేయుటకు అసఫల ప్రయత్నము నొనర్చినారు. దానిని యుక్తి యుక్త ప్రమాణములతో ఈ యధ్యాయమునందే వివేచన మొనర్చియున్నాము. వైదిక్ ఏజ్ లేఖకులు పు.౨౩౨లో శుక్ల యజుర్వేద విషయములో హెచ్చు తగ్గులొనర్చుచు ఇట్లు వ్రాసినారు.

*Of the forty odd Adhyayas of the Vajasaneyi Samhita, it is quite evident that the last twenty two were added later gradually to a basic text consisting of the first eighteen. As a rule, only the fomulas formed in the first eighteen Adhyayas occur also in the Taittiriya Samhita, while those of the last 22 are met with in the Taittiriya-Brahmana. ( S e e Eggling S.B.E. XII P. XXX.)*

The next Three Adhyayas [XIX -XXI] give the Mantras of the Sautramani, a sacrifice perfomed to expiate the sin of excessive indulgence in Soma, and the following four [XXI

- XXV] those of the horse sacrifice. The remaining 15 Adhyayas (XXVI-XL) are expressly called Khila in the auxiliary literature. (Vedic Age P.232.)

అనగా; వాజసనేయీ సంహితలోని ౪౦ అధ్యాయముల నుండి చివరి ౨౫ అధ్యాయములను మొదటి ౧౫ అధ్యాయములతో కూడియున్న మూలసంహిత యందు వెనుక నుండి మెల్ల మెల్లగా కలిపి వేయబడినదనుట స్పష్టము. ఒక నియమ ప్రకారముగాదని కేవలము మొదటి ౧౫ అధ్యాయములలో ఇచ్చిన సంకేతమే తైత్తిరీయ సంహిత యందు జూడనగును. మిగతా ౨౫ అధ్యాయములు తైత్తిరీయ బ్రాహ్మణములో గాన్పించును.

**సమీక్ష**

ఏమనగా, **'ఐగ్లింగ్'** అనునాతడు ఈ విషయమును వ్రాసినాడు కావున 'వైదిక్ ఏజ్' లేఖకులు కూడా దానినే ప్రమాణముగా నెంచినారు. దాని విమర్శన గాని, పాఠకుల యెదుట దానిని స్థాపి(సిద్ధి)ంపజేయుట గాని, ప్రమాణములతో ప్రస్తుత పరచుట గాని ఆవశ్యకమని తలచలేదు. దీని వల్ల వారి దాసమనోవృత్తి సూచితమగుచున్నది. ఇది పరిశీలక విద్వాంసులకు శోభించదు. మనకు మూల యజుర్వేద సంహిత కన్న తైత్తిరీయ సంహిత ప్రమాణమైనది గాదు. ఇది వాజసనేయీ సంహితయను నామముతోనూ పిలువబడుచున్నది. తైత్తిరీయ సంహితను ప్రామాణికము, మరియు వాజసనేయీ సంహిత కన్ననూ ప్రాచీనమని ఎంచువారికి తైత్తిరీయ బ్రాహ్మణము కూడా అంతయే ప్రమాణము గలదగును. దీనియందు వారి కేమాత్రము భేదము గనిపించలేదు. కేవలము ఈ తుచ్ఛమగు ఆధారము అనగా; **'ఐగ్లింగ్'** అను పాశ్చాత్య విద్వాంసుడు వ్రాసిన మాత్రాన ౧౫ ని వదలి మిగతా అధ్యాయములన్నియును వెనుకనుండి కలిపివేయబడిన వని నమ్ముట సంపూర్ణముగా అనుచితము, తరువాత వారిట్లు వ్రాసినారు.

తరువాతి మూడధ్యాయముం (౧౯ నుండి ౨౧) లో అత్యధిక సోమరస పానమునకు ప్రాయశ్చిత్త రూపములో **సౌత్రామణి** యాగ విధానము గలదు. దాని పిదప ౪, (౨౨ నుండి ౨౫) అధ్యాయములలో అశ్వమేధ యజ్ఞ విధానమున్నది. ౨౬ నుండి ౪౦ వరకు ౧౫ అధ్యాయములు సహాయక సాహిత్యములో **'ఖిల'** మని చెప్పబడినవి.

**సమీక్ష**

కేవలము సౌత్రామణీ లేదా అశ్వమేధాదుల కొరకే యజుర్వేదము యొక్క ఈ యధ్యాయముల మంత్రములు ఉపయోగపడును. మరెందుకును గావని విశ్వసించుటయును అశుద్ధమేగాక నిరాధారమైనదే. లేఖకులు అశ్వమేధమునకు *Horse Sacrifice* శబ్దములను ప్రయోగించినారు. వారియభిప్రాయములో అశ్వమేధమునకు యజ్ఞములో గుఱ్ఱములను బలిసీయుటమేయైయున్నది. కాని ఈ యాలోచనల అశుద్ధత్వమును గూర్చి మేము వైదిక యజ్ఞ విషయకమగు అధ్యాయములో సప్రమాణముగా ఖండించియున్నాము. మహర్షి దయానందులు **'సౌత్రామణి'** శబ్దార్థము. యజుర్వేదము ౧౯ - 3౧లో ఇట్లు వ్యాఖ్యానించినాడు.

**'సూత్రాణి యజ్ఞోపవీతాని మణినా గ్రన్థినా యుక్తాని ధీయన్తే యస్మిన్ సః ।'**

మణియను ముడి యుక్తమగు యజ్ఞోపవీతమును ధారణమొనర్చవలెను. అధిక సోమపానమునకు ప్రాయశ్చిత్తరూపమని లేఖకుల కల్పన అత్యంత హేయము. శతపథ బ్రాహ్మణ ౧౨-౭-౨-౧౨ ననుసరించి **'సౌత్రామణీ'** పదమున కర్థము సోమము గూడా యగును. అచ్చట **'సోమో వై సౌత్రామణీ'** అని గలదు

యజుర్వేద ౨౬ నుండి ४౦వ అధ్యాయములందు ३౧వదగు సుప్రసిద్ధ పురుష సూక్తము . ३౨వ అధ్యాయము శాంతికి ఉపాయములను గూర్చి విశేష రూపమున ప్రతిపాదించును. ఉపనిషత్తులకు మూలమగు ४౦వ అధ్యాయము కూడా కలదు. (४౦వ అధ్యాయము యజుర్వేదమునకు చివరి అధ్యాయమగుట, మరియు దీనిపైనసే ఉపనిషత్తుల ఆధారముండుటచే దీనికి **'వేదాంత'** దీనికి శబ్దము కూడా ప్రచలితమైయున్నది ఈ యన్నిటిని వీరు ఖిలము, మరియు పరిశిష్టమని చూపినారు. ఇంతకన్న హేయము మరే ముండును? యజుర్వేదము యొక్క సరళము, మరియు అత్యన్త ఉపయోగమునగు అధ్యాయములను సమూలముగా పెరికి వేయుటకు, కించపరచుటకు జేసిన వారి ప్రయత్నము సిగ్గు మాలిన ప్రయాస అత్యంత హేయమైనది. ప్రమాణములు లేని నిరాధారమగు వ్రాతలు విద్వాంసులగు వారొనర్చదగిన పనికాదు. **'వీబర్'** గారి అధ్యాయము నందలి చివరి టిప్పణులందు అతనిని ఎంతో ఆప్త విద్వాంసుని వలె నిర్ణయించుచు ఇట్లు వ్రాసినారు.

*For further details about the Vajasaneyı Samhıta, See Weber HIL 107 ff P 239.*

మాకు **'వీబర్'** గారు వేదజ్ఞుడగు ఆప్త విద్వాంసుడు గాడు, ప్రామాణికము గాని యీతని మాటలను మేమెట్లు విశ్వసించగలము? పరివర్తిత సాహిత్యముతో పాటు ౨౬ నుండి ४౦ వరకు గల మొత్తము అధ్యాయము లాతనికి ఖిలములుగ, పరిశిష్టములుగ గాన్పించినవి. మరి వీని స్థాపన యందు వారి వద్ద ఏలాటి ప్రమాణమును లేదు. ఇంతకన్న అధిక శోచనీయ మానసిక దాసత్వమునకు ఏ ప్రమాణముండును? ఈ నిరాధారమగు తుచ్ఛ కల్పనలతో యజుర్వేదమందలి చవరి ౨౧ అధ్యాయములను ప్రక్షిప్తములు లేక పరిశిష్టములని చూపుట సంపూర్ణముగా అసంగతమే.

ఈ వివేచనముతో బాటు మేమీ యధ్యాయమును సమాప్త మొనర్తుము. దీనిపై పక్షపాత రహితులగు పాఠకులే నిర్ణయించుకొందురు గాక. వైదిక్ ఏజ్ లేఖకులు వేదములను ఛిన్నా భిన్నమొనర్చుట కొనర్చిన దుస్సాహసము సంపూర్ణముగా అనుచితమైనది. అదియంతయు పాశ్చాత్య లేఖకుల అవివేక పూర్ణమగు అనుకరణ మగుటచే అమాన్యమైనవి.



# వేదముల యథార్థ స్వరూపము

## దశమాధ్యాయము

### 10.1 వైదిక శిక్షణ విషయములో భ్రాంతి నివారణము

'వైదిక్ ఏజ్'లో వైదిక శిక్షణ గురించి దాని లేఖకులు వ్యాపింపజేసిన భ్రమలను మేమీ అధ్యాయములో తొలగించదలచినాము ఇట్టి భ్రాంతు లనేకములున్నవి. గ్రంధ విస్తరణ భీతితో ముఖ్యమైన వానిని అనగా; పునర్జన్మకర్మ సిద్ధాంతము, అథర్వ వేదములో గారడి, వశీకరణము, చేతబడులు, మంత్ర తంత్రములు, మద్యమాంసాదుల విధానము, బహువివాహము మున్నగునవి గలవను వానిపై సమాలోచన మొనర్చెదము.

### 10.2 పునర్జన్మ సిద్ధాంతము వేదములందు లేదా?

వైదిక్ ఏజ్ పృ. 381లో లేఖకులు ఇట్లు వ్రాసినారు.

*As the Rigvedic Aryans were full of the joie de viver [joy of life] they were not particularly interested in the life after death, much less had they any special doctrines about it. We can there- fore glean only a few notices of the life beyond, that are scattered throughout the Rigveda. In our search for any reference implicit or explicit, to rebirth or transmigration, we come across only a few doubtful passages. According to R.V.I. 164.30. the soul [jivah] of the dead one moves in its own power:, the immortal one having a common origin with the mortal one [the body] But this translation is not certain.*

So we may conclude that only the germs of the conception of rebirth, were there, and those developed either naturally or through the influence of ideas current among the original tribes with whom the Aryans came into contact. - Vedic Age P.381, 382.

భావమేమనగా; ఋగ్వేదకాలపు ఆర్యులు జీవనానందములో పూర్ణులైయుండిరి. మృత్యువు తరువాత జీవనము, మరియు పరలోకము మున్నగు వాని విషయములందు వారికి విశేషమగు అభిలాష లేకుండెను. ఇట్టి విషయములందు వారికి నిశ్చితమగు ఏ సిద్ధాంతమును లేకుండెడిది. కావున ఈ విషయములో మేము సంపూర్ణ ఋగ్వేదము నుండి అక్కడక్కడ చెల్లాచెదరైన కొన్నివాక్యములను మాత్రమే పొందగలుగుదుము. వానియందు పరలోక విషయము లున్నవనుట అనుమానాస్పదమే. మనము పునర్జన్మ విషయములో ఏమైనా యథార్థమా, కాదా? యని పరిశోధించినపుడు మనకు కొన్ని సందిగ్ధ వాక్యములు మాత్రమే లభించుచున్నవి. ఋ.1-164-30 ననుసరించి మృతుని ఆత్మ తన శక్తితో ఇటునటు తిరుగుచుండును. అమరశీలమగు ఆత్మకు మరణశీల శరీరముతో ఒకే యోని మాత్రముండును.

ఐనను ఈ యనువాదము నిశ్చితమైనది గాదు. కావున మేమీ విషయమున పునర్జన్మ సిద్ధాంత బీజము మాత్రము వైదిక ఆర్యులలో ఉండెనను పరిణామమునకు వత్తుము. వారు దీనిని స్వాభావిక రూపములో లేక ఆదివాసుల సంపర్కమున వారి ఆలోచనల ప్రభావముచే వికాసమునొందింప జేసికొందురు.

**సమీక్ష**

వైదిక ఆర్యులకు ఆత్మ, పునర్జన్మము మున్నగు విషయములందు నిశ్చిత జ్ఞానమేదియును లేదు. వారీ విషయములో ఏ మాత్రము అభిరుచిని గలిగియుండలేదు. కేవలము పునర్జన్మ విషయ సిద్ధాంతపు బీజము వారి యందుండెను అనునది సంపూర్ణముగా అసత్యము.

### 10.3 ఆత్మ విషయములో వైదిక సిద్ధాంతము

వేదములందు అతి స్పష్టమైన శబ్దములలో ఆత్మ, మరియు పునర్జన్మ విషయములో ప్రతిపాదనము గలదు ఉదా॰- దిగువ మంత్రములను జూడుడు.

**అయం హోతా ప్రథమః పశ్యతేమమిదం జ్యోతిరమృతం మర్త్యేషు।**

**అయం స జజ్ఞే ధ్రువ ఆ నిషత్తోఽమర్త్యస్తన్వా వర్ధమానః ॥ ఋ.౬-౯-౪॥**

ఈ (శ్రేష్ఠహోత- జ్ఞానమును గ్రహణ మొనర్చునట్టి ఆత్మను చూడుము. ( మర్త్యేషు ఇదం అమృతం జ్యోతిః) మరణశీల మానవులందు ఈ అమరజ్యోతి గలదు. ఇది ( ధ్రువః) నిత్యము, మరియు ( అమర్త్యః) మరణములేని యీ ఆత్మ శరీరమం దుండును. అది బుద్ధితో గూడ వృద్ధి యగుచున్నట్లు కనిపించును. శరీరమునకు వేరై, దానికి అధిష్ఠాతయగు నిత్యము, అమరము, చేతనము గల ఆత్మశక్తి ఇచ్చట అతిస్పష్టముగా వర్ణించబడియున్నది దీనియందెవ్వరికి ఏ మాత్రము సందేహము గలుగజాలదు.

**అయం హోతా ప్రథమః పశ్యతేమమిదం జ్యోతిరమృతం మర్త్యేషు ॥**

దీని అంగ్రేజీ అనువాద మీ ప్రకారముగా గలదు.

*Behold this (individual spirit) the first being which enjoys (conse quence of his actions) as it is the immortal light placed with in the mortal frame. That has manifested itself. This immortal soul is staying (in the body ) while it seems growing with the growth of its body.*

### 10.4 ఆత్మ - పునర్జన్మ

ఈ దిగువ ఋగ్వేద మంత్రములలో ఆత్మ మరియు పునర్జన్మమును గూర్చి అతి స్పష్టముగా ఇట్లు ప్రతిపాదించబడియున్నది.

**అపశ్యం గోపామనిపద్యమానమా చ పరా చ పథిభిశ్చరన్తమ్।**

స సధ్రీచీః స విషూచీర్వసాన ఆ వరీవర్తి భువనేష్వన్తః ॥.౧-౧౬౪-౩౧ ॥

అనగా నేను; (గోపామ్) ఇంద్రియముల రక్షకుడను (అనిపద్య మానమ్) అమరుడను అగునీ యాత్మను (అపశ్యమ్) జనన మరణ మార్గములందు విచరించు ఆత్మను నేను సాక్షాత్కారమొనర్చు కొన్నాను. ఇది తన మంచి, చెడు కర్మలననుసరించి అనుకూల, ప్రతికూలములగు అనేక యోనులందీ విశ్వమున భ్రమణ మొనర్చు చుండును. నిత్యమగు ఆత్మ, మరియు పునర్జన్మమును గురించిన వర్ణన ఇంకా ఇంతకు మించి ఏముండును?

పై మంత్రమునకు అంగ్రేజి అనువాదమిట్లు గలదు.

*May I have a glance at the indestructible lord of the sense organs (i.e. the individual soul) which ever walk, through the path ways of coming (birth) and departure (death); it traverses its path with its body and even without it and having covered itself with its actions (i.e.in accordance with its good and evil actions )it comes (takes birth) again and again in the various worlds.*

ఇంత స్పష్టమగు వర్ణన యుండియును 'వైదిక ఋషులు ఆత్మ విషయములో ఆలోచనయే చేయకుండిరని, మరియు పునర్జన్మ విషయములో వారెకెట్టి సిద్ధాంతము గూడా లేకుండె' ననియనుట వారికి వైదిక సాహిత్యములో ఏ మాత్రము జ్ఞానము లేకుండెననుటకు నిదర్శనము. అట్లు గాకున్ననిది వారి పక్షపాతమునే సూచించుచున్నదే గాని మరేమియు గాదు.

### 10.5 ఆత్మ - పరమాత్మ

ఈ యాత్మ మరియు పరమాత్మలకు గల సంబంధము, మరియు వానిలోని భేదము లను గూర్చి ఈ మంత్రములో దిగువ ప్రకారము ప్రతిపాదనగలదు. దీనియందు ఆత్మ తన కర్మానుసారము ఫలముననుభవించుటను గూర్చియు స్పష్ట విధానము గలదు. పరమేశ్వరుని కేవలము ద్రష్ట, మరియు సాక్షి మాత్రమని చూపబడియున్నది. ఈ మంత్రమును మేము మొదటనే ఉల్లేఖించియున్నాము. కేవలమిప్పుడు నిర్ణయము మాత్రము చాలు.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**

**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి** ॥ ఋ.౧-౬౪-౨౦ ॥

దీనియందిట్లు చెప్పబడినది. నిత్యప్రకృతి రూప వృక్షముపై ఆత్మ, మరియు పరమాత్మయను పేర్లు గల రెండు పక్షులు గూర్చుండి యున్నవి. అవి నిత్యత్వ దృష్టితో సమానము, మరియు పరస్పరము మిత్రులును. వానియందు ఒకటి జీవుడు తన కర్మానుసారము మధురము, లేక చేదు ఫలముల ననుభవించుచుండును. రెండవది (పరమాత్మ) భోగించకుండా సాక్షియై యుండి చూచుచుండును. ఈ విధముగా ఆత్మ పరమాత్మల సంబంధము, భేదము, మరియు కర్మ నియమము ఈ మంత్రము నందు చక్కగా నిరూపించబడినది.

**ద్వా సుపర్ణా సయుజా.............. అభిచాకశీతి** ॥ ఋ.౧-౬౪-౨౦ ॥

ఈ మంత్రము యొక్క ఇంగ్లీషు అనువాదమిట్లున్నది.

*Like two birds there are two spirits i.e. the finite and the supreme which knit with the bonds of friendship, reside on the same tree [of the material universe]. One of the twain [i.e. the finite spirit] enjoys the sweet ripe fruit [and also the bitter one] produced by his good or bad actions, whereas the other [i.e. the Supreme Spirit] simply looks all around without enjoying its fruitage.*

**10.6 అనేక యోనులందాత్మ సంచారము**

దిగువ వ్రాయబడిన రెండు మంత్రములందు ఆత్మ తన కర్మానుసారము వివిధ శరీరములను పొందుటను గూర్చి స్పష్టముగా వర్ణించబడియున్నది

**త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ।**

**త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి త్వం జాతో భవసి విశ్వతోముఖః** ॥ అథ. ౧౦-౮-౨౭॥

**ఉతైషాం పితోత వా పుత్ర ఏషాముతైషాం జ్యేష్ఠః ఉత వా కనిష్ఠః।**

**ఏకో హ దేవో మనసి ప్రవిష్టః ప్రథమో జాతః స ఉ గర్భే అన్తః** ॥ అథ. ౧౦-౮-౨౮॥

ఆత్మను సంబోధించుచు ఇట్లు చెప్పబడియున్నది.

నీవొకప్పుడు స్త్రీ రూపము, మరొకప్పుడు పురుషరూపము ధరింతువు. ఒకప్పుడు నీవు కుమారివి, మరొకప్పుడు కుమారుడ వగుదువు. మరొకపుడు నీవు చేతదండము ధరించి వృద్ధరూపములో దిరుగుదువు. మరియు నీ కర్మానుసారము నల్దిశల యందు నీవనేక రూపములలో ప్రకటమగుచుందువు

ఈ యాత్మ ఒకప్పుడు తండ్రిగాను, మరొకప్పుడు పుత్రుడుగాను, ఒకప్పుడు అన్నగాను, వేరొకప్పుడు తమ్మునిగాను, ఈయాత్మ దేవత మనస్సు నందు చేరియున్నది. ఇదియే తల్లి గర్భమందు ప్రవేశించును. పునర్జన్మమునకై ఈయాత్మ వివిధ యోనులలో తన కర్మానుసారమున సంచరించును. ఇదియెంత విశదమైన వర్ణనయో చూడుడు.

**'త్వం స్త్రీ త్వం పుమానసి'** అను మంత్రము యొక్క ఇంగ్లీషు అనువాదము.

*O individual soul! in accordance with thine actions, thou assumest the form of a woman and that of a man, some times thou becomest a virgin, thou walkest with the help of a staff when thy body becomes old and frail, thou takest birth again and again as thy face is turned towards all directions [in accordance with thy actions]. Athar va X.8 - 27.*

**'ఉతైషాం పితోత వా పుత్రః'** యొక్క ఆంగ్రేజి అనువాదము.

*This individual soul some times becomes their father and some times their son too, and some times it becomes their elder brother and some times it even becomes their younger brother. Verily the one self or luminous soul dwelling within the mind has taken birth before and verily it again enters the womb of the mother. (Atharva X.8.28)*

దిగువ యజుర్వేద మంత్రము పునర్జన్మను అతి స్పష్టముగ ప్రతిపాదించుచున్నది. అందు 'గర్భేనన్పునః' అను శబ్దముల ప్రయోగము కలదు.

**అప్స్వగ్నే సధిష్టవ సౌషధీరనురుధ్యసే । గర్భే సన్ జాయసే పునః'** ॥ యజు.౧౨-౩౬॥

అను నీ మంత్రములో ఆత్మను సంబోధించుచు, ఓ అగ్ని వంటి తేజశ్శాలివగు జీవా! సహనశీలుడవగు నీవు జలములను, సోమలతాది ఓషధులను పొందుదువు. మరియు గర్భములందు జేరి పదే పదే జన్మ మరణములను పొందుదువని యెరుగుము.

పై విధముగానే అర్థమొనర్చుచు ఈ మంత్రమునకు మహర్షి దయానంద సరస్వతి గారు ఈ విధముగా భాష్యము నొనర్చినారు.

**యే జీవాః శరీరం త్యజన్తి తే వాయ్వోషధ్యాదిషు చ భ్రాన్త్వా గర్భం ప్రాప్య యథా సమయం సశరీరా భూత్వా పునర్జాయన్తే॥**

శరీరమును వదలివేసిన జీవుడు వాయువు, ఓషధులు మున్నగు పదార్థములందు భ్రమణ మొనర్చుచు గర్భాశయమును పొంది నియమిత సమయమందు శరీర ధారణ మొనర్చి ప్రకటమగును. పునర్జన్మను గురించిన ఈ విషయమెంత విశదముగా గలదో పాఠకు లాలోచించి యుందురు.

**'అప్స్వగ్నే సధిష్టవ'** యొక్క అంగ్రేజి యనువాద మిట్లు గలదు.

*O self-luminous soul ! thow art the endurer of sufferings, thou attainest to the plants within the waters, thou takest birth again and again in the womb of the mother. - Yaj, 12 - 36.*

మరణానంతరము జీవుని గతి ఈ దిగువ మంత్రమందిట్లు గలదు.

**ప్రసద్య భస్మనా యోనిమపశ్చ పృథివీమగ్నే ।**

**సంసృజ్య మాతృభిష్ట్వం జ్యోతిష్మాన్ పునరాసదః** ॥ య.౧౨-౩౮॥

సూర్యుని వంటి ప్రశంసిత ప్రకాశుడవునగు ఓ జీవా! శరీరము దహనమైన పిదప నీవు పృథివి, అగ్ని, జలము మున్నగు వాని మధ్య దేహధారణమును పొందు కారణమున తల్లుల హృదయములందు వసించి మరల శరీరమును ప్రాప్తించుకొందువు.

దీని భావార్థమిట్లున్నది. ఓ జీవులారా! మీరు శరీరమును వదలినప్పుడు అది భస్మ రూపము దాల్చి పృథివి మున్నగు పంచ భూతములలో గలిసిపోవును. మీరు మీ యాత్మతో గూడా మాతృ శరీరములో గర్భాశయమున చేరి మరల శరీర ధారణ మొనర్తురు.

**'ప్రసద్య భస్మనా యోనిమ్'** అను దాని ఇంగ్లీషు అనువాదమిట్లున్నది.

***O self - luminous soul ! thou art full of light, after thy body becomes ashes, thou reachest water and earth, the source of birth, and dwelling with in the womb of the mother, thou takest birth again and again. (Yaj. XII. - 38)***

దీనివల్ల నిశ్చయముగా వేదములలో పునర్జన్మ విషయ సిద్ధాంతము గలదా, లేదా? యను అనుమానమింకా మిగిలి యుండినచో దిగువ ఋగ్వేద మంత్రమునందలి ప్రమాణమును గూడా చూచి నిశ్చయించుకొనవలెను.

**అసునీతే పునరస్మాసు చక్షుః, పునః ప్రాణమిహ నో ధేహి భోగమ్।**

**జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరన్తమనుమతే మృడయా నః స్వస్తి ॥ ఋ. ౧౦-౫౯-౬॥**

ఈ మంత్రములో పునః అస్మాసు చక్షుః, పునః ప్రాణంధేహి మున్నగు ప్రయోగములు వచ్చి యున్నవి వీనియందు ప్రార్థనా రూపములో పునర్జన్మను గూర్చి స్పష్టముగా నున్నది. ఏమన; జీవన ప్రదాతవగు పరమేశ్వరా! నీవు భవిష్యత్కాలములో మృత్యువు తరువాత కూడా మరల మాకు ఉత్తమ దృష్టి, ఉత్తమ శక్తితో గూడిన జన్మనిమ్ము. ఉత్తమ ప్రాణ ధారణ మొనర్చి మేము సుఖవంతముగా సూర్యుని చిరకాలము వరకును చూచుచుందుము గాక.

యజుర్వేద ४-౧౫లోనూ ఇదే విషయము అధిక స్పష్టముగా తెలుపబడినది.

**'పునర్మనః పునరాయుర్మ ఆగన్ పునః ప్రాణః పునరాత్మా మ ఆగన్ పునశ్చక్షుః పునః।**

**శ్రోత్రం మ ఆగన్। వైశ్వానరో౽దబ్ధస్తనూపా అగ్నిర్నః పాతు దురితాదవద్యాత్ ॥**

అనగా; ఈ శరీరము త్యజించిన పిదప కూడా మరల మనస్సు, ఆయువు, ప్రాణము, ఆత్మ, కన్నులు, చెవులును శక్తియు ప్రాప్తించుగాక. సర్వ జనహితకారి, సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు మాకు పాపాచరణమొనర్చకుండుటకు చక్కని బుద్ధినిచ్చుగాక. ఈ విధముగా పునః శబ్ద ప్రయోగము మాటి మాటి కున్నందువల్ల స్పష్టముగా పునర్జన్మ సిద్ధాంతము ప్రతిపాదించబడినదనుటలో అణుమాత్రము సందేహము లేదు.

**'అసునీతే పునరస్మాసు'** అంగ్రేజి అనువాదము.

*O God of Life! Please give us eyes again in our future life and give us breath in this world and confer on us all necessary objects of enjoyment; O most Gracious Being! May we see the rising sun for a long time, be kind upon us and give us blessings [R.V.X.59.6.]*

**'పునర్మనః పునరాయుర్మ ఆగన్'** ఇంగ్లీషు అనువాదము

*May I receive, through the grace of God, my mind again in future life, may I have life again, may I get breath again, may my soul return again and may g be the possessor of eyes and esrs again in future lifecars May Self, refulgent God the protector of my body who is the Ever. living God keep us safe from misfortune and dishonour. -Yaj IV.15*

అథర్వ వేదమందును **'స ఉ జాయతే పునః'** అను శబ్దములను ప్రయోగించుచు పునర్జన్మ సిద్ధాంతము స్పష్టముగా ప్రతిపాదించబడినది.

**అన్తర్గర్భశ్చరతి దేవతాస్వాభూతో భూతః స ఉ జాయతే పునః ।**

**స భూతో భవ్యం భవిష్యత్ పితా పుత్రం ప్ర వివేశా శచీభిః ॥** అథ ౧౪-౪-౨౦ ॥

'జీవుడు తల్లి గర్భములో మాటిమాటికి ప్రవేశించుచు తన శుభ కర్మానుసారము సత్య నిష్ఠగల విద్వాంసుల గృహములందు జన్మ నొందు' నని ఈ మంత్రములో చెప్పబడినది.

జీవుడు పదే పదే జన్మనెత్తును. అనగా; శరీరధారణ మొనర్చును. స్వయముగా తన నిత్యత్వ కారణమున ఆతడు భూత భవిష్యత్ వర్తమాన కాలములం దెల్లప్పుడు నుండును. అతడు తండ్రిగా నున్నప్పుడు పుత్రుని శరీరమందు తన శక్తులతో సంస్కారాదుల రూపమున ప్రవేశించును.

**'అన్తర్గర్భశ్చరతి'** అనువాదము ఇంగ్లీషులో ఈ విధముగా నున్నది.

*The individual soul wanders within the womb of mother and takes birth again and again in the bodies of enlightened persons. It exists in past, present and future; when it becomes of father, it again enters in to the body of a son with the power of his actions. (-Atharva 14-4-20.)*

ఈ ప్రసంగము ముగించుటకు పూర్వము 'వైదిక్ ఏజ్' లో ఏ మంత్రానువాదము నిచ్చి *'This translation is un-certain'* అనగా; ఈ యనువాదము నిశ్చితముగాదు. అను టిప్పణి నిచ్చియున్నారో దానిపై కొంత విచారించవలసిన అవసరమున్నది. ఆ మంత్రము దిగువన వ్రాయబడినది.

**అనచ్ఛయే తురగాతు జీవమేజద్ ధ్రువం మధ్య ఆ పస్త్యానామ్ ।**

**జీవో మృతస్య చరతి స్వధాభిరమర్త్యో మర్త్యేనా సయోనిః ॥** ఋ.౧-౧౬౪-30 ॥

ఇందు జీవుని విషయములో వర్ణించబడియున్నది. ఏమన, ఆ జీవుడు (ధ్రువమ్) స్థిరము, మరియు ధారణమొనర్చువాడు. (తురగాత్) అతి వేగముగా ఇంద్రియములలో గతినుత్పన్న మొనర్చుచు (ఏజత్) శరీరమును సంచాలితమొనర్చుచు (పస్త్యానాం మధ్యే) శరీర రూప గృహము నందు (అనత్) ప్రాణమునిచ్చుచు; చేతనా రూపుడై (శయే) వ్యాప్తుడై యుండును. అట్టి (జీవః) జీవాత్మ (మృతస్య) మరణ ధర్మముగల జడ శరీరమందు (స్వధాభిః) తన ధారణ శక్తుల, లేక అన్నము ద్వారా (చరతి) విచరించుచు స్వయముగా (అమర్త్యః) అమరుడైయుండి (మర్త్యేన) మరణముగునట్టి శరీరమున (సయోనిః) ఒకే ఆశ్రయమందుండును.

'వైదిక్ ఏజ్' పు. 3౮౧లో ఈ మంత్రము దిగువ అంగ్రేజి అనువాదము కొన్ని తప్పులతో గూడి యున్నందున భావము స్పష్టముగా దెలియదు.

*The soul of the dead one moves in its own power, the immortal one having a common origin with the mortal one - Vedic Age. P.381*

వాస్తవమున కీ యనువాదము ఇంగ్లీషులో ఇట్లుండవలెను.

*The soul of the dead one moves by its own power; being immortal, it remains in the body which is mortal.*

ఈ అనువాదమిట్లుండవలెను. అప్పుడు భావము స్పష్టమగును. ఈ శరీరమే నశ్వరము గాని, ఆత్మ సదా అమరమే. ఈ యమరుడగు ఆత్మ నశ్వరమగు శరీరమునందుండి శరీరము నష్టమగుట తోడనే తన కర్మల ననుసరించి భిన్న భిన్న యోనులందు సంచార మొనర్చుచుండును. దీనివల్ల కూడా సదా అమరుడగు ఆత్మ యొక్క సత్తా, మరియు పునర్జన్మ సిద్ధాంతము స్పష్టముగా సమర్థించబడుచున్నది

ఈ దిగువ ఋగ్వేద, యజుర్వేద మంత్రములందును ఈ విషయము స్పష్టమగును.

**పునర్నో అసుం పృథివీ దదాతు పునర్ద్యౌర్దేవీ పునరన్తరిక్షమ్ ।**

**పునర్నః సోమస్తన్వం దదాతు పునః పూషా పథ్యాం యా స్వస్తి** ॥ ఋ.౧౦-౫౯-౭॥

అనగా; పృథివి మరల మాకు జీవనము నిచ్చుగాక. అంతరిక్షము ఆకాశాదులు మాకు పునః జీవనము నిచ్చుగాక. శాంతికి మూలమగు పరమేశ్వరుడు మాకు మరల శరీరము నిచ్చుగాక. పుష్టికారకుడగు పరమాత్మ మాకు కల్యాణ పథమును చూపుగాక.

**పునర్మైత్విన్ద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ ।**

**పునరగ్నయో ధిష్ణ్యా యథా స్థామ కల్పయన్తామిహైవ** ॥ అథర్వ. ౭-౬౭-౧॥

మరల నాకు ఇన్ద్రియముల శక్తి ప్రాప్తించుగాక. నేను యజ్ఞాదులచే సమృద్ధ మగుటకు మరల నాకు ఐశ్వర్యము, బ్రహ్మ జ్ఞానము ప్రాప్తించుగాక. వేదములందీ విధముగ పునర్జన్మను సమర్థించు అనేక మంత్రములుండగా, వైదిక్ ఏజ్ లేఖకులు 'వేదములలో పునర్జన్మ సిద్ధాంతము కేవలము బీజ మాత్రముగా నున్నది, వైదికార్యులకు ఏ మాత్రము నిశ్చిత సిద్ధాంతము లేకుండె ' ననుట వారి మూర్ఖత్వమును చాటుచున్నది.

**'పునర్నో అసుం పృథివీ దదాతు'** మంత్రమునకు ఇంగ్లీషు అనువాదమిట్లున్నది.

*May the earth give us breath again and may the shining heavenly region and the atmosphere restore the same to us; may Soma, All creating God give us body again (after our death) and may the All Nourishing God lead us on the path of peace and happiness.*

**'పునర్మైత్విన్ద్రియమ్'** అను మంత్రమునకు ఇంగ్లీషు అనువాదము.

*May I again receive my sense organs in my future life and may I receive my spirit, together with worldly possessions and knowledge Divine, so that I may perform fire offering on the altars and may ever attain prosperity. -Atharva VII.67.1.*

## 10.7 ముఖస్తుతి, లోభము- న్యాయము

'వైదిక్ ఏజ్' లేఖకులలో ప్రొ. వి.కే. ఘోష్ గారు *Language and Literature* అను శీర్షికతో ౧౬వ అధ్యాయములో ఒక భయంకరమగు ఆరోపణమొనర్చినారు. దానిపై ఆలోచించుట, దాని నుండి ఉత్పన్నమైన భ్రమను దొలగించుట ఆవశ్యకమని తోచినది. ఉషాదేవతగల ఋగ్వేద సూక్తము౧-౪౮ పై తమ అభిప్రాయమును దాని కవిత్వమును ప్రశంసించుచు ఇట్లు వ్రాసినారు.

*Here it is simplicity and not greed that is begging of the goddess gifts and more gifts. But it can not escape even the most superficial reader that in hymns such as this, the means that the poets have in view for attaining their object is simply to please the deity by flattering songs and ritual sacrifices. There is no suggestion as yet of a belief in the existence of a supreme justice from which flow all punishment and reward. In the hymns to Varuna, how ever, this sentiment is already in the horizon. - Vedic Age.P.342.*

That virtue is its own reward and as a spiritual quality, is incommensurable in terms of material advantage, does not seem to have been realised by the Rig Vedic poets. The spirit of the people that peeps through the thick veil of ritual pedantry is one of gladness, aspiring ever" for more, never knowing rest or contentment. Absence of evil is not what they pray for most. Their Supreme desire is to triumph over poverty and resistance. Their chief god is Indra who does not possess a single spiritual trait. - Vedic Age. P.343.

దీని సంక్షిప్త తాత్పర్యమేమన; దేవీ ( ఉషా) నుండి అధికాధిక కానుకలను కోరుట సరళత్వమే. లోభముకాదు. తమ ఉద్దేశ్యములను పూర్తి చేసికొనుటకు ఋషులు, మరియు వైదిక కవులు దేవతలను ముఖస్తవపు గీతముల ద్వారా యజ్ఞముల ద్వారా దేవతలను ప్రసన్నులుగా నొనర్చుటయై యున్నది. ఇది సామాన్యులు కూడా ఊహించగలరు. మంచి లేక చెడు కర్మలకు ఫలము నిచ్చు ఏదో ఒక గొప్ప మహా శక్తియున్నదనుట కింతవరకు విశ్వసించదగిన నిర్ణయమేదియును లేదు. కాని వరుణ సూక్తములో ఈ విశ్వాసమునకు కొంత ఆభాసము మాత్రము లభించును. తరువాత వారిట్లు వ్రాసినారు. మంచి యను నది స్వయముగా మన మొనర్చిన కర్మఫలమే, ఆధ్యాత్మిక గుణముల రూపములో భౌతిక లాభమునకేలాంటి సంబంధమును లేదు. ఈ విషయము ఋగ్వేద కవుల అనుభవమునకు రాలేదు. యజ్ఞములను మోటు ఆవరణ, లేక తెరల వెనుక లోకుల భావన అధికాధిక కోరికలకు సంబంధించినదే, అందు సంతోషముగాని, విశ్రాంతి గాని లేదు. వారు పాపములు జేయకుండుట, లేక పాపముల నుండి ముక్తులగుట అధికముగా ప్రార్థనలనొనర్చరు. అన్నిటికన్న వారి బలమైన కోరిక, వారు సంగ్రామములందు విజయముల కొరకు, మరియు గొప్ప ఐశ్వర్యముల కొరకే అధిక ప్రాధాన్యత నిత్తురు. వారి యందర కన్న గొప్ప దేవత ఏ మాత్రము ఆధ్యాత్మిక తత్త్వము, గుణము లేని ఇంద్రుడు.

## సమీక్ష

పైన యొనర్చబడిన విమర్శలన్నియు ఉషా, మరియు రాయః మున్నగు వైదిక శబ్దముల ఆధ్యాత్మిక భావములను దెలిసికొనక జేయబడినవి. వైదిక్ ఏజ్ లేఖకులగు విద్వాంసులు సుప్రసిద్ధ యోగి, మరియు పరిశీలకులగు శ్రీ అరవిందుల వారి ఆర్య *(Arya)* అను పత్రిక యందు *Secret of the Vedas* అను శీర్షికలో ప్రచురించిన లేఖమాలను జూచినచో ఎంతో బాగుండెడిది. ఆ లేఖ మాలయందలి రాష్ట్ర భాషలో **'వేద రహస్య'** మను పేరుతో గల మూడు ఖండములందును ఆచార్య అభయ దేవుగారి ద్వారా అనువదింపబడిన గ్రంథమును జూచియుండినచో వారి భ్రమలన్నియు దొలిగిపోయెడివి ఆశ్చర్యమేమన, వారు అంగ్రేజి, ఫ్రెంచి, జర్మని మున్నగు భాషలందు యూరోప్, అమెరికా విద్వాంసుల ద్వారా వ్రాయబడిన పక్షపాతముతో గూడిన వేద విషయక పుస్తకములను చదువుటకు శ్రమపడినారు. వానినే ప్రామాణికముగా నెంచి కండ్లు మూసికొని అనుసరణ మొనర్చినారు కాని మహర్షి దయానంద కృత ఋగ్వేదాది భాష్య భూమిక, వేద భాష్యము, మరియు సుప్రసిద్ధ యోగి అరవిందుల *Hymns to the Mystic Fire, On the Vedas*, శ్రీ కపాలీ శాస్త్రి గారు వ్రాసిన *Light on the Vedas. Further light on the Vedas* మున్నగు గ్రంథములను చదువు శ్రమను దీసికొనలేదు. ముఖ్యముగా మేమిచ్చట వ్రాయదలచినదేమన ; 'ఉషా' సూక్తములో బాహ్య, ఉషను ప్రతీకమాత్రముగా గొనబడినది, ముఖ్యముగా ఈ సూక్తముల తాత్పర్యము ఆధ్యాత్మిక ఉష, లేక *Spiritual Dawn, or illumination* కు సంబంధించినది ఇది యోగ దర్శనములో **'విశోకా, వా జ్యోతిష్మతీ'** అను సూత్రములో చూపబడినది. ఋగ్వేదములో నిర్దేశింపబడిన మంత్రము యొక్క ఆధ్యాత్మిక అర్థములో స్పష్టముగా నిల్చు గలదు.

**ఉషో యే తే ప్ర యామేషు యుఞ్జతే మనో దానాయ సూరయః ।**

**అత్రాహ తత్ కణ్వ ఏషాం కణ్వతమో నామ గృణాతి నృణామ్** ॥ ఋ.౧-౪౮-౪॥

భావమేమన; మేధావులు (కణ్వ ఇతి మేధావి నామ నిఘణ్టౌ ౩-౧౫) ఉషఃకాలమున, అనగా బ్రహ్మముహూర్తములో లేచి పరమేశ్వరునిపై ధ్యానముంచి, సమాధి ద్వారా స్వయం సమర్పణమైన వారికి పరమేశ్వరుని కృపవల్ల అద్భుత జ్యోతి ప్రాప్తించగలదు. ఉషతో ఇట్లు ప్రార్థించబడినది.

**'అప ద్వేషో మఘోనీ దుహితా దివ ఉషా ఉచ్ఛదప స్రిధః'** ॥ ఋ.౧-౪౮-౮॥

అనగా; ఈ యాధ్యాత్మిక ఉషా, లేక జ్యోతి మా ద్వేష భావములను, హింసాత్మక చర్యలను దూరమొనరించుగాక ఆధ్యాత్మిక దృష్టినే స్పష్టముగా సూచించునుగాక! ఉషకు గల సూనృతా, మరియు సూనరీ అను విశేషణములయర్థము సత్యము, మరియు ప్రియ వచనములను ప్రయోగింపజేయునది. మరియు సత్యమార్గము దిశగా గొనిపోవునది ఇది ఆధ్యాత్మిక భావమునే సూచించును. ఇక రయి, లేక ఐశ్వర్య ప్రార్థన అని

**'సా నో రయిం విశ్వ వారం సుపేశ సం ఉషా దదాతు సుగమ్యమ్'** ॥ ఋ.౧-౪౮-౧౩॥

ఈ మంత్రము ద్వారా చేయబడినది. లేఖకుల ఆలోచనలు భౌతిక దిశకే పోయినవి. మా ఆలోచనలందు యీ సంపదలు భౌతికమును గూర్చి కావు. కాని జ్ఞానము, భక్తి, శ్రద్ధ, సదాచారము, శమము, దమము, ఉపరతి,

తితిక్ష, సమాధానము మున్నగు రూపములు గలవు. వీనిని వేదాంత గ్రంథము లందు షట్కా సంపత్తియని పేర్కొన్నారు. వీనినే భగవద్గీతయందు దైవీ సంపత్తి యని పేర్కొనబడిన అభయము, చిత్తశుద్ధి, జ్ఞానము, యోగసమన్వయము, దమము,సత్యము, స్వాధ్యాయము మున్నగునవి. రయి, లేక ఐశ్వర్యము కొరకు విశ్వ వారమ్, సుపేశసమ్, సుగ్మ్యమ్ అను విశేషణములు దాని ఆధ్యాత్మిక స్వరూపమును ప్రకటించును. **'విశ్వవారమ్'** అను దాని యర్థము. **'విశ్వైర్వరణీయమ్'** అందరకు స్వీకరించదగినది అని. (సుగ్మ్యమ్) అను దాని యర్థము సత్య ఆనందదాయకుడు. **సుగ్మ్యమితి సుఖ నామ.** నిఘం.౨-౬ ॥ (సుపేశసమ్) చక్కని అశ్వములు, గోవులు, శక్తి మరియు జ్ఞానమును ముఖ్యముగా సూచించుచున్నవి. సుప్రసిద్ధ యోగివర్యులగు శ్రీ అరవిందుల వారు తన **'వేద రహస్య విషయక లేఖ మాల'** యందు ఈ విషయములపై అతి చక్కగా వ్రాసినారు. దానిని దెలిసికొనలేక దేవతలను ప్రసన్నపరచు కొనుటకై ముఖస్తుతి, లేక అసత్య స్తుతియని వైదిక ఋషులపై నిందారోపణ మొనర్చుట ఎంతటి అవివేకమో చూడుడు. మహత్తమ న్యాయకారిణీ శక్తియందు విశ్వాసము లేకుండెనని వైదిక ఋషులపై లేఖకులు ఆరోపణమొనర్చినారు పాశ్చాత్య విద్వాంసుల ననుసరించుచు గ్రుడ్డివారి వలె ఏమేమో వాగినారు. వేదములు స్థాన స్థానములందును ఆ శక్తి స్వరూపుని, అర్యమా, విధాతా, మున్నగు శబ్దముల ద్వారా నిర్దేశించుచు ఆతని దృఢ నియమములను **'ఋత'** అను పేరుతో సంబోధించును.

**శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా ।**

**శం న ఇన్ద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః** ॥ యజు. ౩౬ ॥

**యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా** ॥ ఋ.౧౦-౮౨-౩ ॥

మున్నగు వందలాది మంత్రములందు పరమాత్మను (అర్యమా) న్యాయకారి (విధాతా) కర్మ ఫలదాత యను నామములచే పిలువబడినది. ఆయన వ్రతముల, దృఢ నియమములను దిగువ మంత్రములు వర్ణించుచున్నవి.

అదబ్ధాని వరుణస్య వ్రతాని ॥ ఋ.౧-౨౪-౧౦ ॥

**నిషసాద ధృతవ్రతో వరుణః పస్త్యాస్వా । సామ్రాజ్యాయ సుక్రతుః** ॥ ఋ.౧-౨౫-౧౦ ॥

**ప్ర స మిత్ర మర్తో అస్తు ప్రయస్వాన్ యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన ।**

**న హన్యతే న జీయతే త్వోతో నైనమంహో అశ్నోత్యన్తితో న దూరాత్** । ఋ ౩-౫౯-౨ ॥

**త్వం సోమ మహే భగం త్వం యూన ఋతాయతే । దక్షం దధాసి జీవసే** ॥ ఋ.౧-౯౧-౭ ॥

**ఆసీదద్ విశ్వా భువనాని సమ్రాట్ విశ్వేత్ తాని వరుణస్య వ్రతాని** ॥ య. ౪-౩౦ ॥

ఇట్టి మంత్రముల ద్వారా పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, అజ్ఞానాంధకార నాశకుడు దృఢ నియమములు గలవాడని తెలుపబడినది. వానిననుసరించి నడచువాడు. పూర్ణ దీర్ఘాయువు కన్న ముందు మరణము నొందడు. ఎవ్వరికిని భయము నొందడు. సమీపము నుండి గాని, దూరము నుండి గాని పాపములు అతని దరిజేరవు.

ఆయన ఋత. పరమేశ్వరీయ దృఢ సత్య, నియమములను పాలన మొనర్చుచున్న వారికి ( యువకుడు గాని, వృద్ధుడు గాని) శాంతి స్రోతమగు పరమేశ్వరుడు ఉత్తమ జీవనమును కొనసాగించుటకు శక్తిని ప్రసాదించును.

'గ్రిఫ్థ్' అను నాతని **'త్వం సోమ మహే భగమ్'** అనుదాని ఆంగ్రేజి అనువాదము ఈ ప్రసంగములో ఉల్లేఖించ దగినదై యున్నది.

*To him who keeps the law, whether old or young, thou givest happiness and energy that he may live well.*

ఈ ప్రకారము పరమేశ్వరుని న్యాయకారి, మరియు కర్మ ఫల దాత యని విశ్వసించు భావము వేదములందలి వేలాది మంత్రములందు విద్యామానమై యున్నది.

ఈ విషయమును ౬-౧౫-౯ ఋగ్వేద మంత్రము స్పష్టపరచుచున్నది.

**విభూషన్నగ్న ఉభయాం అనువ్రతా దూతో దేవానాం రజసీ సమీయసే ।**

**యత్తే ధీతిం సుమతిమావృణీ మహేఽధ స్మా నస్త్రివరూథః శివో భవ ॥**

**దీనియర్థము :-** ( అగ్నే) జ్ఞాన స్వరూపుడవగు పరమేశ్వరా! నీవు ( దేవానామ్) సత్యనిష్ఠ గల విద్వాంసుల ( దూతః) దుఃఖ నివారకుడవునై ( ఉభయాన్) దేవతలను, మానవులకు, అనగా; నిష్కాములగు జ్ఞానులకు, మరియు సాధారణ మానవులకు, జీవన్ముక్తులకు, మరియు మృత్యుగ్రస్తులకు ( వ్రతఅను) వారి కర్మానుసారము ( విభూషన్) విభూషితుల నొనర్చుచు, ఉత్తమ గతిని ప్రసాదించుచు ( రజసీ సమీయతే) రెండులోకములను విస్తార పరచుచున్నావు ( యత్) ఎట్లు ( తే ధీతిమ్) నీ ధ్యానము, మరియు ( సుమతిమ్) ఉత్తమ జ్ఞానమును. మేము ( ఆవృణీమహే) స్వీకరించుచున్నాము, లేక ధారణ మొనర్చుచున్నాము ( అధః) ఆ విధముగానే ( త్రివరూథః) ముల్లోకములందును సర్వశ్రేష్ఠుడవగు నీవు ( నః) మా కొరకు ( శివః స్మ భవ) కల్యాణ కారివి అగుము

పరమేశ్వరుడు ఎల్లరకు వారి కర్మానుసారమే ఫలము నిచ్చును. కేవలము ముఖస్తుతి పొగడినంత మాత్రాన పాపులకు ఉత్తమగతిని ప్రసాదించుచు, సమస్త కామితములను ఇచ్చుచుండగలడని నమ్ముట వైదిక శిక్షణ యందు సంపూర్ణముగా అజ్ఞానమే యగును. వేద శిక్షణ కేవలము పురుషార్థము, పరిశ్రమచేయుట మాత్రమే యగును. కాని ప్రార్థన,స్తుతి, మరియు యజ్ఞముల ద్వారా సర్వము సిద్ధించునని తలచుట వేద శిక్షణ గాదు.

**న వా అశ్రాన్తస్య సఖ్యాయ దేవాః** ॥ ఋ. ౪-౩౩-౧౫ ॥

ఎవరు స్వయముగా పరిశ్రమించి అలసిపోరో అట్టివారికి పరమేశ్వరీయశక్తులు గాని, విద్వాంసులు వారికి సహకరించుట గాని జరుగవు. వారు మిత్రులుగా కారు. కావున వైదిక ఏజ్ లేఖకుల టిప్పణి వైదిక శిక్షణ విషయములో వారియజ్ఞానమునే సూచించుచున్నది.

**అక్రన్ కర్మ కర్మకృతః సహ వాచా మయోభువా ।**

**దేవేభ్యః కర్మ కృత్వాస్తం ప్రేత సచాభువః** ॥ యజు.౩.౪౭॥

ఇచ్చట నీ మంత్రము కూడా ఉల్లేఖించదగియున్నది. ఇందిట్లు చెప్పబడినది. కర్మశీలురగు పురుషార్థులు మాత్రమే సుఖదాయినియగు ఉత్తమ మధురవాణితో గూడ కర్మల నొనర్చుచుందురు. కావున నో మానవులారా! మీరు కూడా విద్వాంసుల, మరియు దివ్య గుణముల ప్రాప్తి కొరకు కలిసి కర్మలనొనర్చుచు గృహములకు చేరుడు. ఈ విధముగా వేదములందు నిష్కామభావముతో కర్మలనొనర్చు సూచన అనేక మంత్రములందు గలదు.

**కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః ।**

**ఏవం త్వయి నాన్యథేతో౽స్తి న కర్మ లిప్యతే నరే ।** ॥ య.౪౦-౨॥

ఈ మంత్రములో వంద సంవత్సరముల వరకు కర్మలనొనర్చుచునే మనుష్యులు జీవించు కోరిక గలవారై యుండవలెను. ఇది తప్ప మోక్షప్రాప్తికి ఏ విధమగు మరొక మార్గమును లేదు. మానవులు కర్మలయందు లిప్తులు కాక నిష్కామ భావనచే కర్మనొనర్చుట కొరకు యుపదేశము గలదు.

సర్వ సాధారణ కోరికలచే ప్రేరితులై లేదా దుర్గతి పాలు అగుదుమేమో అను భయమువల్ల కొందరు దానములు మున్నగు కర్మ లొనర్చుచుందురు. ఐనను, ఉత్తమ శ్రేణికి చెందిన కొందరు సాత్వికులు మాత్రమే ఈశ్వర ప్రీతి బుద్ధితో కేవలము తన కర్తవ్యమని యెంచి మాత్రమే దానము మున్నగు పరోపకార కార్యము లొనర్చుచుందురు.

**దైవీ పూర్తి ర్దక్షిణా దేవయజ్యా న కవారిభ్యో నహి తే పృణన్తి ।**

**అథా నరః ప్రయతదక్షిణాసో౽వద్యభియా బహవః పృణన్తి** ॥ ఋ.౧౦-౧౦౭॥

ఋగ్వేదములోని సుప్రసిద్ధ దాన సూక్తములోని మంత్రమిది. కుత్సితాచరణమొనర్చు వారి దానాదులు పరమేశ్వర , మరియు విద్వాంసుల పూజాది కార్యములందు ప్రవృత్తిని కలిగింపజాలవు. ఐనను దానమునిచ్చు వారనేకులు నికృష్ట నిందలకు, దుర్గతి మున్నగు వానికి భయపడి దానము మున్నగు కార్యముల నొనర్చెదరు ఇచ్చట **'బహవః, అవద్యభియా పృణన్తి'** అనగా కొందరు సాత్విక సజ్జనులు మాత్రమే కేవలము కర్తవ్య భావముతో ప్రేరితులై సుపాత్రా, సత్కార్య దానము వంటి శుభకార్యములొనర్తురు. వీరియందు అసంతోషము, లోభమను మాటయే యుండదు.

వేద శిక్షయందు అధికాధికము దానమును గూర్చియే యున్నది. అంతటాదాని ప్రాబల్యమే సూచింపబడినది. ఋగ్వేద మొదటి మండలములో 3౧, ౧౨౫ మరియు పదవ మండలములోని ౧౦౭, ౧౧౭ సూక్తములు ఈ విషయమునే ప్రత్యేకించి చెప్పినవి.

**తమేవ ఋషిం తము బ్రహ్మాణమాహుర్యజ్ఞన్యం సామగాముక్థశాసమ్।**

**స శుక్రస్య తన్వో వేద తిస్రో యః ప్రథమో దక్షిణయా రరాధ** ॥ ఋ.౧౦-౧౧౭॥

అనగా; భౌతిక, మరియు ఆధ్యాత్మిక ధనములను దానమునొనర్చువారిని మాత్రమే ఋషి, బ్రహ్మ, యజమాని, సామగాయక, సత్యమైన ఈశ్వర భక్తులని యనవలెను.

**త్వమగ్నే ప్రయత దక్షిణం నరం వర్మేవ స్యూతం పరిపాసి విశ్వతః ।**

**స్వాదుక్షద్మా యో వసతౌ స్యోనకృజ్జీవయాజం యజతే సోపమా దివః ॥** ఋ.౧-౩౧-౧౫॥

హే జ్ఞాన స్వరూపుడవగు పరమేశ్వరా! ఉదార దాన పురుషులను కవచము వలె నీవు సర్వత్రల నుండి రక్షించుచుందువు. ఉత్తమ అన్నము ( ధన ధాన్యము) లచే సంపన్నులై ఇతరులకు సుఖములను గలిగించువారు, సకల ప్రాణుల కల్యాణమునకై యజ్ఞముల నొనర్చువారు ఈ పృథివిని స్వర్గతుల్యముగా నొనర్చెదరు.

**'త్వమగ్నే ప్రయత దక్షిణం నరమ్'** ॥ ఆంగ్రేజి యనువాద మిట్లు గలదు.

*O self refulgent Lord! like a well - sewn armour thou dost protect the man from all sides who is liberal in benefactions to others the man possessed of tasteful means of subsistence who remains ever engaged in gratifying others and who performs sacrifice for all the living beings, is really the type of heaven [on earth] -Rig 1.31-15.*

సుపాత్ర దానము నొనర్చు ఉదారవంతులు ఈ ప్రపంచములో వాస్తవముగా కల్యాణకారకు లగుదురు వారు యజ్ఞ భావనను గలిగియుండుట వల్ల వారిచ్చట దీర్ఘాయువును గలిగియుండి వారికి అంత్యకాలములో మోక్షము ప్రాప్తించును. ఈ విషయము ఋగ్వేదములో చక్కని కావ్యమయ ఉపదేశము గలదు.

**దక్షిణావతామిదిమాని చిత్రా దక్షిణావతాం దివి సూర్యాసః ।**

**దక్షిణావన్తో అమృతం భజన్తే దక్షిణావన్తః ప్రతిరన్త ఆయుః ॥** ఋ.౧-౧౨౫-౬॥

దీని భావార్థము పైన చూపబడినది. **'దక్షిణావతామిదిమాని'** ఇంగ్లీషు అనువాదము ఇట్లున్నది

*Surely all these wonderful objects of the world belong to such Persons who are of charitable disposition, even the Sun and the Stars shine in the heaven for the liberal minded, the benevolent men attain immortality and fully qualified persons enjoys full life.*

వేదము ఇట్టి ఉపదేశములతో నిండియున్నది. దీనికై అసంతృప్తి లేదా లోభము నారోపించుట అనుచితము, అన్యాయము.

ఋ.౧౦-౧౧౭ వైదిక్ ఏజ్‌లోను పేర్కొనబడినది. కాని ఆశ్చర్యకర విషయమేమన దాని భావమును అర్థము చేసికొనక దిగువ శబ్దములలో అసందర్భ టిప్పణి యొసగబడినది.

*The hymn [10 - 117] is packed with noble sentiments and its every word is charged with vigour. Yet it should not be forgotten that the hectoring eloquence of this energetic priest was probably directed mainly to the purpose of frightening the wealthy into ceding a part of wealth to the Brahmanas especially, and not to the poor of every class, for of genuine sympathy for the poor, there is not much in the Rigveda. - Vedic Age P.342.*

అనగా; ఈ సూక్తమునందలి ఉత్తమ భావము గొప్ప ఉత్తేజ కరమగు భాషతో నిండియున్నది. ఈ శక్తిశాలి పురోహితుని ఉత్తేజపూర్ణపు వక్తృత్వమేగాని దాని ఉద్దేశ్యము ధనవంతులను బహుశః భయపెట్టి వారి ధనములోని ఒక భాగమును విశేషించి బ్రాహ్మణులకు చెందజేయుటయే గాని అన్ని వర్గములందరి బీదలకు గాదని. ఋగ్వేదములో పేదలపై నిజమైన సానుభూతి వాక్యములు చాల తక్కువ గలవు.

**సమీక్ష**

ఈ టిప్పణి ద్వారా వైదిక్ ఏజ్ లేఖకులు, విశేషించి డా. ఘోష్ వైదిక ఋషులకే గాక తన అజ్ఞానము, మూర్ఖత్వముచే వైదిక శిక్షణలకు సైతము ఘోర అన్యాయము చేసినాడు. మేమీ సూక్తము నంతయును ధ్యానపూర్వకముగా అనేకసార్లు ఆద్యోపాంతము చదివినాము. కాని డా. ఘోష్ గారి టిప్పణి సంపూర్ణముగా, అసంగతము, మరియు అన్యాయపూర్ణమే అని తెలిసిపోయినది. పై టిప్పణియందు తెలిపినట్లు దీనియందు పురోహితుడు తన కొరకు ఏదో భిక్షనుగాని, బ్రాహ్మణుల దాన దక్షిణ విషయముగాని ఎలాటి నిర్దేశము లేదు. కాని ఆ మంత్రములందు ప్రయోగింపబడిన శబ్దములు సమస్త నిర్ధనుల, దరిద్రుల, వికలాంగుల, అణచి వేయబడిన దుఃఖితుల నాదుకొను విషయమునే సూచించుచున్నవి. ఉదాహరణమునకు ఈ సూక్తమందలి రెండవ మంత్ర మిట్లు గలదు.

**య ఆధ్రాయ చకమానాయ పిత్వోఽన్నవాన్ రఫితాయోప జగ్మషే ।**

**స్థిరం మనః కృణుతే సేవతే పురోతో చిత్ స మర్డితారం న విన్దతే ॥**

అనగా, ( అన్నవాన్ సన్) అన్నము గలవాడై ( పిత్వః చకమానాయ) అన్నమును కోరువారు ( రఫితాయ) దీన స్థితియందుండి, ( ఉప జగ్మషే) తన వద్దకు వచ్చియున్న ( ఆధ్రాయ) పేదవారికై తన ( మనః స్థిరం కృణుతే) మనస్సును కఠోర పరచుకొనువాడు ( ఉతపురః సేవతే) మరియు వారి సమక్షమందే ఆనందముగా అన్నమును దినువాడు ( చిత్ సః) నిశ్చయముగా నాతడు ( మర్డితారం న విన్దతే) సుఖముల గలిగించునెద్దానిని గూడ పొందజాలడు.

ఆధ్రాయ, పిత్వః చకమానాయ, రఫితాయ, మున్నగు ఈ విశేషణములన్నియు దురవస్థయందున్న దుఃఖితులను, నిర్ధనులను మాత్రమే సూచించును. బ్రాహ్మణుల పేరు గాని, ఏదో ఒక వర్గ విశేషమునకు చెందిన వారి పేరు మాత్రమైనను ఈ సూక్తములం దెచ్చటను లేదు.

**'య ఆధ్రాయ చకమానాయ పిత్వః'** యొక్క అంగ్రేజి అనువాదము.

*The man possessing means of subsistence; to whom when any needy person, fallen in miserable condition, comes begging for food, hardens his heart against that poor man and enjoys [his food] in his very presence, such a person does not find any comforter when he falls in need.*

**స ఇద్ భోజో యో గృహవే దదాత్యన్నకామాయ చరతే కృశాయ ।**

**అరమస్మై భవతి యామహూతా ఉతాపరీషు కృణుతే సఖాయమ్** ॥ ఋ.౧౦-౧౧౭-3॥

ఈ మంత్రమందును భోజ అనగా ఉదారవంతుని ప్రశంసయే గలదు (అన్నకామాయ కృశాయ గృహవే దదాతి) అన్నమునకై ఇంటింటికి దిరుగుచుండు దుర్బలురకు, భిక్షార్థము దిరుగుచుండు నిర్ధనులకు అన్నాదుల నిచ్చు వారి వద్ద ఈశ్వర కృపవల్ల కావలసినంత ఆహారాది సంపద యుండును అట్టివారికి ఆపద సమయములందు ఆదుకొను మిత్రులెందరోయుందురు. ఇచ్చట కూడా భిక్షుకుల విశేషణము అన్నకామ, కృశ అను అనేక శబ్దములున్నవి. ఇవి యన్నియు దరిద్రుల మరియు దుర్బలురగు వ్యక్తులనే సూచించును ఇచ్చట బ్రాహ్మణ వర్గ విశేష నిర్దేశమెచ్చటను లేదు.

**'స ఇద్ భోజో యో గృహవే దదాతి'** యొక్క ఇంగ్లీషు అనువాదము.

*Verily that man takes delight in his possession who gives liberally to such a feeble person that comes to his house being in need of food. Such a man gets sufficient means for charity at proper time and he befriends others on the occasion of his future difficulties.*

వైదిక శిక్షణా జ్ఞానము కలిగించు దృష్టి తో ఎంతయో మహత్త్వపూర్ణమగు ఈ సూక్తమందలి మరొక మంత్రము నుదాహరించుచు ఈ సమీక్ష నింతటితో సమాప్తమొనర్చెదము.

**మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్ స తస్య ।**

**నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ** ॥ ఋ.౧౦-౧౧౭-౬॥

అనగా; ఎవరు (అప్రచేతాః) వ్యర్థముగా అన్నాది పదార్థములను సమకూర్చుకొని పెట్టి యుందురో అట్టి అజ్ఞానులకు నేను (సత్యం బ్రవీమి) అట్టి ధన ధాన్యాదులు వారి వినాశనమునకే కారణమగు నని నేను సత్యముగా చెప్పుచున్నాను. ఎవరు (న అర్యమణం పుష్యతి నో సఖాయమ్) న్యాయకారులను, మరియు వారి ద్వారా నడుపబడునట్టి శుభ కర్మలను పోషించరో, మరియు మిత్రులనైనను ఆదుకొని సహకరించరో, అట్టివారు (కేవలాదీ) కేవలము తమ పొట్ట నింపుకొను స్వార్థపరులు (కేవలాఘో భవతి) కేవలము పాపములనే భుజించువారగుచున్నారు.

కేవలము స్వార్థముతో ధనధాన్యాది ఆహార పదార్థములను స్వంతము కొరకే వినియోగించుకొనువారిని వేదములు కఠోర శబ్దముల ద్వారా నిందించుచు, పరోపకారమును గూర్చి ప్రేరణ నిచ్చుచున్నవి మరియు **'తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్య స్విద్ ధనమ్'** అను మంత్రము ద్వారా ప్రపంచ మందలి పదార్థములను త్యాగపూర్వకముగా అనుభవించుటకు, లోభమును వదలివేయుటకు చక్కగా ఉపదేశించబడినది.

**'మోఘమన్నం విన్దతే అప్రచేతాః'** అనుదాని అంగ్రేజి అనువాదమిట్లున్నది.

*The foolish man acquires means of subsistence with fruit-less labour or in vain. I tell you the truth that the very means of subsistence and his wealth will be the cause of his*

*ruin for with that he neither serves his friends nor does good to the noble minded justice - loving persons. Verily the man who enjoys his wealth alone without utilising it for the good of others is the embodiment of sin only. - Rig Veda 10-117-6.*

ఈ విధముగా 'వైదిక్ ఏజ్' లేఖకులు వేదముల అత్యంత సరళ మరియు స్పష్టమగు సూక్తములను దెలిసికొనుటలో కూడా అనేక స్థలములలో భయంకరమగు దోషముల నొనర్చినారని మనము చూడగలము.

### 10.8 పాపరాహిత్యమును గూర్చి వేదములందు అధిక ప్రోద్బలము లేదా?

'వైదిక్ ఏజ్' పు 343 ను గూర్చి మేము కడచిన పుటలందు టిప్పణిని విమర్శన నిచ్చి యుంటిమి. దానియందు అత్యధిక భయంకరమగు ఆరోపణము వైదిక ఋషుల పై ఈ ప్రకారముగా నొనర్చబడినది.

*Absence of evil is not what they pray for most. Their supreme desire is to triumph over poverty and resistance. - Vedic Age. 343.*

అనగా వారు చాలవరకు పాప రహితమును గూర్చిన ప్రార్థనల నొనర్చకుండిరి. వారు పేదరికము, వివాదములపై విజయము పొందుటకు అధికముగా ప్రయత్న మొనర్చుచుండిరి.

### సమీక్ష

ఈ వ్యాఖ్య సంపూర్ణముగా అన్యాయ పూర్ణము, అర్థ రహితము, అసత్యమునై యున్నది. నాలుగు వేదములందలి ప్రార్థనలందధికముగా పాపరాహిత్యమును గూర్చియే గలదు. ఇట్టి మంత్రములే అత్యధికముగా కలవు ఉదా - కొన్ని స్పష్ట సరళార్థక మంత్రము లిచ్చుట చూపబడుచున్నవి.

ఋగ్వేదము మొదటి మండలములో ౯౭ వ సూక్తములో ౮ మంత్రములున్నవి. వీనిలో ప్రతిదాని చివరిలో 'అప నః శోశుచదఘమ్' అనగా, హే పరమాత్మా! మా పాపములను సదా నష్ట పరచుము (మమ్ము పాపములొనర్చకుండా కాపాడుము).

౧. ప్ర యత్ తే అగ్నే సూరయో జాయేమహి ప్ర తే వయమ్ । అప నః శోశుచదఘమ్ ॥ ౪॥

**భావము:-** జ్ఞాన స్వరూపుడవగు హే పరమేశ్వరా! విద్వాంసులమగు మేము నీవారమే యగుదుము గాక. నీ కృపచే మా పాపములు సర్వథా నష్టమగును గాక.

**౨. త్వంహి విశ్వతో ముఖ విశ్వతః పరిభూరసి । అప నః శోశుచదఘమ్ ॥ ౬॥**

**భావము :-** హే పరమేశ్వరా! నీవు సర్వ వ్యాపకుడవు. నీ కృపచే మాపాపములు సదా నష్టమగును గాక. అనగా; నీ సర్వ వ్యాపకత్వమును సర్వజ్ఞత్వమును దెలిసికొని మేమెప్పుడును పాపకార్యములందు ప్రవృత్తులము గాకుందుము గాక.

**3. స నః సిన్ధు మివ నావయాతి పర్షా స్వస్తయే । అప నః శోశుచదఘమ్ ॥ ౮॥**

**భావము:-** ఓడల ద్వారా సముద్రమును దాటునట్లు ఓ పరమేశ్వరా! ఆ విధముగానే మ మ్మీ భవ సాగరమునుండి మా కల్యాణమునకై తరింప జేయుము. మరియు మా పాపములను సంపూర్ణముగా నష్టమొనర్చివేయుము. పాపరాహిత్యమునకై వేదములం దెంతటి ఉత్సుకతతో ప్రార్థనలు గలవో చూచుచున్నాము గదా!

**౪. యుష్మాకం మిత్రా వరుణా ప్రణీతౌ పరిశ్వభ్రే వ దురితాని వృజ్యామ్ ॥ ఋ.౨-౨౭-౫॥**

**భావము :-** అధ్యాపకోపదేశకులారా! మీ నేతృత్వములో నేను పాపము లను అగాధమునబడకుండ సదా తొలగియుందును గాక.

**౫. అరే అస్మదమతిమారే అంహ ఆరే విశ్వాం దుర్మతిం యన్నిపాసి ॥ ఋ.౪-౧౧-౬॥**

జ్ఞాన స్వరూపుడవగు హే పరమాత్మా! నీవు (యత్ నిపాసి) మమ్ము చక్కగా కాపాడువాడవు. కావున నిన్నే మేము ప్రార్థిస్తున్నాము. (అస్మత్) మానుండి (అమతిమ్) బుద్ధిహీనతను, లేక అజ్ఞానమును (ఆరే) దూరమొనర్చుము. (అంహః ఆరే) మమ్ము పాపములకు చాల దూరమందుంచుము. మరియు (విశ్వాం దుర్మతిం ఆరే) మా సమస్త దుర్బుద్ధులను కూడా సదా దూరమందుంచుము.

**౬. అయా ధియా స్యామ దేవగోపా అయా ధియా తుతుర్యామాత్యంహః' ॥ ఋ.౫-౪౫-౧౧॥**

విద్వాంసులారా! ఈ విశుద్ధమగు బుద్ధితో మేము ఈశ్వర భక్తుల మగుదుము గాక (అయాధియా) ఈ శుద్ధ బుద్ధిచే (అంహః అతి తుతుర్యామ) పాపములకు చాల దూరము తొలగియుందుము గాక.

**౭. అగ్నే రక్షా ణో అంహసః ప్రతిష్మ దేవ రీషతః । తపిష్ఠైరజరో దహ ॥ ఋ.౭-౧౫-౧౩॥**

ఓ జ్ఞాన స్వరూపుడవగు పరమేశ్వరా! నీవు (అంహసః న రక్ష) పాపముల నుండి మమ్ము రక్షింపుము. హింస నుండి మమ్ము గాపాడుము. అజరామరుడవగు నీవు దుష్ట సంతాపకమగు నీ శక్తులచే మా పాపములను దహించివేయుము.

**౮. త్వం నః పాహ్యంహసో దోషావస్తరఘాయతః । దివా నక్తమదాభ్యః ॥ ఋ.౭-౧౫-౧౪॥**

జ్ఞానస్వరూపుడవునగు నో పరమేశ్వరా! (త్వమ్) నీవు (అంహసః) పాపములనుండి (నః పాహి) మమ్ము రక్షింపుము (అఘాయతః) పాపకామితములు గలవారి నుండి (దోషావస్తః దివానక్తం) దివారాత్రములు, నిరంతరము మమ్ము రక్షించుచుండుము.

**౯. ఋతస్య మిత్రావరుణా పథా వామ్ అపో న నావా దురితా తరేమ । ॥ ఋ.౭-౬౫-౩॥**

అందరను మిత్ర దృష్టితో జూచుచు, అజ్ఞానాంధకారము నుండి దూరముగా నుంచునట్టి అధ్యాపకోపదేశకులారా! మీరు చూపినట్టి (ఋతస్య పథా) సత్యమార్గమున నడచుచు (నావా అప ఇవ) నౌక ద్వార నదిని తరించినట్లు (దురితా తరేమ) సమస్త పాపముల నుండి మేము దూరము తొలగిపోవుదుముగాక - పాపనదిని తరింతుము గాక!

**౧౦. ఉరుష్యా ణో మా పరా దా అఘాయతే జాతవేదః । దురాధ్యే మర్తాయ ॥** ఋ.౮-౭౧-౭॥

సర్వజ్ఞుడవు, సర్వ వ్యాపకుడవునగు నో పరమాత్మ! నీవు (మా ఉరుష్య) నన్ను సదా రక్షించుము. (అఘాయతే దురాధ్యే మర్తాయ మా పరా దాః) పాపములను గోరువారి, దుష్ట బుద్ధులు గలవారి స్నేహమున బడకుండా నన్నెప్పుడును కాపాడుము.

ఈ పదిమంత్రములను మేము ఋగ్వేదము నుండి ఇచ్చినాము. మిగతా మూడు వేదముల నుండియు ఈయవచ్చును. వీని వల్ల పాపముల నుండి విముక్తులగు భావన వేదములందు ఓతప్రోతమైయున్నదని స్పష్టమగును. మరియు అత్యధిక బలము దీనిపైననే గలదు. గ్రంథ విస్తార భీతిచే మేము అధిక మంత్రములు నుదాహరించ లేకపోయితిమి. పరమాత్మ యొక్క స్తుతి ప్రార్థనోపాసనముల ముఖ్యఫలము వేదముల ననుసరించి పాపములనుండి తప్పుకొనుటయే యైయున్నది.

**న తమంహో న దురితం కుతశ్చన నారాతయస్తితిరుర్న ద్వయావినః ।**

**విశ్వా ఇదస్మాద్ ధ్వరసో వి బాధసే యం సుగోపా రక్షసి బ్రహ్మణస్పతే॥** ఋ.౨-౨౩-౫॥

అనగా; ఓ జ్ఞాన నిధీ! నీవు రక్షించు (తమ్ అంహః కుతశ్చన న దురితం న) వాని వద్దకు ఎక్కడినుండి గాని పాపములు తొంగిచూడవు. దుఃఖములు కూడా రాజాలవు.

## ౧౦.౨ యజుర్వేద మందలి మూడు మంత్రములు

ఋగ్వేదము వలెనే యజుర్వేదమందును పాప రాహిత్యము మరియు పవిత్రతను గురించి అధికముగా ప్రోత్సాహము గలదు.

**౧. 'యద్ గ్రామే యదరణ్యే యత్సభాయాం యదిన్ద్రియే ।**

**యదేనశ్చకృమా వయమిదం తదవయజామహే'** ॥ యజు.౩-౪౫॥

అనగా; గ్రామము, వనము, సభ యందు, మరియు వ్యక్తిగత ఇంద్రియ వ్యవహారములందు (యత్ ఏనః వయం చకృమ) మేమేమైన పాపములొనర్చినచో (ఇదం తత్ అవ యజామహే) వానిని మేము మా నుండి సంపూర్ణముగా దూరమొనర్చి వేయుదుము. భవిష్యత్తులో మేమెప్పుడును ఏ విధమగు పాపములను జేయకుండుటకై దృఢ నిశ్చయ మొనర్చుకొందుము.

**౨. చిత్పతిర్మా పునాతు వాక్పతిర్మా పునాతు దేవో మా సవితా పునాత్వచ్ఛిద్రేణ**
**పవిత్రేణ సూర్యస్య రశ్మిభిః । తస్య తే పవిత్రపతే పవిత్ర పూతస్య**
**యత్కామః పునే తచ్ఛకేయమ్** ॥ యజు.౪-౪ ॥

ఇందు పవిత్రతను గూర్చి ఎంత చక్కని ప్రార్థన గలదో చూడుడు. చిత్తమునకు స్వామివగు పరమేశ్వరా! నన్ను పవిత్రునిగా నొనర్చుము. వాణికి స్వామీ! నన్ను పవిత్ర పరచుము. సర్వోత్పాదకుడవగు పరాత్పరా! నన్ను సదా పవిత్రునిగా చేయుము.

**3. పరిమాగ్నే దుశ్చరితాద్ బాధస్వా మా సుచరితే భజ ॥** యజు.౪-౨౮॥

హే జ్ఞాన స్వరూపా! (మా దుశ్చరితాత్ పరి బాధస్వ) నన్ను దుశ్చరితము, లేక పాపాచరణము నుండి పూర్తిగా దూరముంచుము. (మా సుచరితే భజ) నన్ను సంపూర్ణ సదాచారములో స్థిరపరచుము ఇట్టివే పందలాది మంత్రములు గలవు.

## ౧౦.౧౦ సామవేదములోని మూడు మంత్రములు

సామవేదము ముఖ్యముగా ఉపాసనను ప్రతిపాదించు వేదము. ఐనను దానియందును పాపరహితమును గురించిన ఉపదేశములు మరియు ప్రార్థనలు అంతటను ఓతప్రోతమై యున్నవి. ఉదాహరణార్థము పూర్వార్చిక ౩౭౭-౧-౭ లో ఆదిత్య సమాన తేజోవంతులగు విద్వాంసులను సంబోధించుచు ఇట్లు ప్రార్థించబడినది.

**అపామీవామప స్రధమప సేధత దుర్మతిమ్।**

**ఆదిత్యాసో యుయోతనా నో అంహసః ॥** సా.పూ. ౩౭౭-౧-౭॥

సూర్యుని వంటి తేజోవంతులు, జ్ఞాన ప్రకాశకులునగు విద్వాంసులారా! మీరు మా నుండి రోగములను, హింసలను, చెడు బుద్ధులను దూరమొనర్పుడు. మరియు (నః) మమ్ము (అంహసః) పాపాచరణమునుండి (యుయోతన) దూరముగ నుంచుడు.

పరమాత్ముని ఉపాసనయే పాపముల నుండి కాపాడును. యజుర్వేదములో

**శునం హువేమ మఘవానమిన్ద్రమస్మిన్ భరే నృతమం వాజసాతౌ।**

**శృణ్వన్తముగ్రమూతయే సమత్సు ఘ్నన్తం వృత్రాణి సం జితం ధనాని ॥** యజు.3-౨౯॥

మనము జ్ఞానప్రాప్తి కార్యములలో ఆ పరమేశ్వరుని సర్వదా మన రక్షణార్థము స్మరణ మొనర్చవలెను ఆయనయే మనసత్యమగు ప్రార్థనలను వినువాడు. మరియు (వృత్రాణి ఘ్నన్తమ్) (పాప్మా వై వృత్రః - శత బ్రా. ౧౧-౧-౫-౭) పాపములను రానీయక కాపాడువాడు. ఇదే విధముగా యజుర్వేదములో.

**హన్తా యో వృత్రం సనితోత వాజం దాతా మఘాని మఘవా సురాధాః ॥**

ఏ పరమేశ్వరుడు మన సకల పాపములను నాశమొనర్చుకొను జ్ఞానము, శక్తిని ప్రసాదించువాడో, ఆయన ఉపాసనయే మనము సదా యొనర్చుచుండవలెను.

## ౧౦.౧౧ అథర్వ వేదములోని మంత్రములు

అథర్వ వేదమును వైదిక్ ఏజ్ లేఖకులు మతిభ్రమణముచే చేతబడుల, యంత్ర తంత్రముల గ్రంథమని వ్రాసినారు. పాపముల నుండి విముక్తులగు భావన లిందు అంతటా ఓతప్రోతమై యున్నది. ఉదారణమునకు ;-

**౧. 'యద్ విద్వాంసో యదవిద్వాంస ఏనాంసి చకృమా వయమ్।**

**యూయం నస్తస్మాన్ముఞ్చత విశ్వే దేవాః సజోషసః' ॥** అథ.౬-౧౧౫॥

సత్యనిష్ఠగల విద్వాంసురాలా! తెలిసీ తెలియక మేమేమైన పాపములొనర్చినచో మీయుపదేశముల ద్వారా వానినుండి మమ్ము విముక్తులుగా నొనర్చుడు. (ఐతే పాపములను వదలివేయుటకు దృఢ భావన కలిగి మన ఇచ్ఛాశక్తిని వినియోగించు కొనవలెను.)

**౨. యో నః పాప్మన్ న జహాసి తము త్వా జహిమో వయమ్** ॥ అథ.౬-౨౬-౨॥

ఓ పాపమా! నీవు మమ్ము వదలవు. మేమే నిన్ను సంపూర్ణముగా వదలివేయుచున్నాము. ఇక మే మెన్నడునును పాపములందు ప్రవృత్తులముగాకుండెదము.

**౩. అజైష్మాద్యాసనామాద్యా భూమానాగసో వయమ్** ॥ అథ౧౬-౬-౧॥

నేడే మేము పాపత్యాగములో విజయులము కాగలము. మేము సుఖ శాంతి, ఆనందాదుల ననుభవించగలము. మేము నేడే (అనాగసః అభూమ) పాపరహితములమైతిమి.

**౪. వ్యహం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ సమాయుషా** ॥ అథ.౩-౧౩॥

అథర్వ వేదము నందలి ఒక సూక్తమున కాధారమిది. దీని భావము :- (సర్వేణ పాప్మనా) నేను సకల పాపములనుండి దూరముందును. (వి యక్ష్మేణ) సమస్త వ్యాధుల నుండి దూరముగా నుందును. మరియు (ఆయుషా సమ్) శ్రేష్ఠమగు దీర్ఘజీవనము గలవాడనై యుందును.

విస్తార భయమున ఇంతటితోనే సరిపెట్టుచున్నాము. దీని వల్ల 'వైదిక ఋషులు పాపముల నివారణకు గాక, పేదరికము, యుద్ధము లందు విజయప్రాప్తికే అధికప్రాముఖ్యత నిచ్చుచుండి' రనువైదిక్ ఏజ్ లేఖకులఆరోపణ సంపూర్ణముగా అసత్యమే యని తెలిసిపోయినది.

### 10.12 ఇన్ద్రుని విషయములోనూ అసత్య కథనము

'వైదిక్ ఏజ్'లో ప్రొ. మైక్డోనెల్ మున్నగు పాశ్చాత్య లేఖకుల మాటలననుసరించుచు ఈ విధముగా వ్రాసినారు.

Their Chief God is Indra who does not possess a single spiritual trait. Vedic Age.P.343

అనగా వైదిక ఋషులగు ఆర్యుల ముఖ్య దేవత ఇంద్రుడు. ఆతని యందెట్టి ఆధ్యాత్మిక గుణములు లేవు.

### సమీక్ష

**'ఇన్ద్ర'** శబ్దమునకు వాస్తవికార్థము మరియు దాని స్వరూపమును దెలియని కారణముననే ఇట్లు వ్రాయబడినది. మేము అనేక దేవతలు మరియు ఏకేశ్వర పూజ అను విషయము గల అధ్యాయములో సప్రమాణముగా జూపినట్లు **'ఇన్ద్ర'** శబ్దము ముఖ్యముగా పరమేశ్వరుని నామమే. ఆధిభౌతిక దృష్టితో రాష్ట్రపతి మరియు ఆధ్యాత్మిక దృష్టితో ఆత్మ, మరియు శుద్ధమగు మనస్సునకు గూడా ఈ శబ్ద ప్రయోగము గలదు.

వైదిక సూక్తములలో వచ్చియున్న ఇంద్రుని వర్ణనములో ఆధ్యాత్మిక గుణముల ప్రాధాన్యత గలదు. ఉదా:- ఋగ్వేద ౨-౧౨ వ సూక్తములో ప్రతి మంత్రము యొక్క చివరలో **'స జనాస ఇన్ద్రః'** అని వచ్చును. మొదటి మంత్రములో ఇట్లున్నది.

**యో జాత ఏవ ప్రథమో మనస్వాన్ దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్ ॥**

అనగా; జ్ఞాన సంపన్నుడగు పరమేశ్వరుడు విశ్వ నిర్మాణ మొనర్చిన తోడనే విద్వాంసులకు పరిపూర్ణ జ్ఞానము నిచ్చినాడు. మం.౧౫లో ఇట్లు గలదు.

**వాజం దర్దర్షి స కిలాసి సత్యః । వయం త ఇన్ద్ర విశ్వహ ప్రియాసః సువీరాసో**
**విదథమా వదేమ॥**

హే పరమేశ్వరా! నీవు (వాజమ్) ఉత్తమ జ్ఞాన శక్తులను చక్కగా ప్రసాదింతువు. కావున (స కిల సత్యః అసి) నీవు నిశ్చయముగా సత్య స్వరూపుడవు. మేము సదా నీకు ప్రియులమైయుండి సువీరులమై జ్ఞానోపదేశ మొనర్చుచుందుము గాక. ఋ.౨-౧౫-౧ లోను ఇన్ద్రు (పరమేశ్వరు) ని సత్య స్వరూపుడని పేర్కొనబడినది.

**ప్ర ఘా న్వస్య మహతో మహాని సత్యా సత్యస్య కరణాని వోచమ్**

అనగా ఈ సత్య స్వరూపుడగు మహాన్ పరమేశ్వరుని సమస్త కార్యములు కూడా అత్యంత అద్భుతము, సత్యమునై యున్నవి సత్యము ద్వారానే ఆ సత్య స్వరూపుడగు పరమాత్ముని ప్రాప్తి గలుగును ఋగ్వేద ౮-౬ ౨-౧౨ లో

**సత్యమిద్ వా ఉ తం వయం ఇన్ద్రం స్తవామ నానృతమ్ । మహాఁ అసున్వతో**

**వధో భూరి జ్యోతీంషి సున్వతః । భద్రా ఇన్ద్రస్య రాతయః ।** ॥ఋ.౮-౬౨-౧౨॥

ఆ సత్య స్వరూపుడగు ఇన్ద్రు (పరమేశ్వరు) ని మనము సత్య రూపములో ఎల్లప్పుడును స్తుతి ఉపాసన లొనర్చవలెను. ఎప్పుడును అసత్య రూపములో చేయవలదు. ఆయన ఉపాసన, మరియు యజ్ఞాదుల నొనర్చనివారికి మహా వినాశము తప్పదు. మరియు యజ్ఞాదుల నొనర్చువారికి మహాజ్యోతి ప్రాప్తించును. ఆ యిన్ద్రు (పరమేశ్వరుని) కృపచే అనేక కల్యాణకరములు ప్రాప్తించును.

ఈ విధముగా ఇంద్రుని వాస్తవిక సచ్చిదానంద స్వరూపమును దెలిసికొనిన పిదప ఆతని ప్రాప్తి సత్యము, అహింస, పరోపకారము మున్నగు వాని ద్వారా కాగలదు. అప్పుడు ఇంద్రునిలో ఆధ్యాత్మిక గుణ మొక్కటియైనను లేదను భ్రమ గలుగదు. ఆయన సమస్త శ్రేష్ఠ గుణములకు సముద్రుడు.

**అయం సహస్రమృషిభిః సహస్కృతః సముద్ర ఇవ పప్రథే ।**

**సత్యః సో అస్య మహిమా గృణే శవో యజ్ఞేషు విప్ర రాజ్యే ।** ॥ఋ.౮-3-౪॥

వేలాది ఋషులు, తత్త్వ జ్ఞానులు ఏ యింద్రుని మహిమను గానమొనర్చుచుండిరో, ఎవడు సముద్రమువలె గుణ సముద్రుడై సర్వత్ర వ్యాప్తుడై యున్నాడో, ఆతని మహిమలన్నియును సత్యములే, కల్పితములు గావు. ఆశ్చర్యమేమన 'వైదిక్ ఏజ్' లేఖకులు ఇన్ద్రాదుల తత్త్వమును దెలిసికొనజాలక వేదములపై ఎంతటి భయంకరమైన ఆరోపణములను జేసినారో చూడుడు. ఇన్ద్రుడు తన తండ్రియగు త్వష్ట యనువానిని చంపివేసినా డను నిరాధారమగు

విషయములను 'వైదిక్ ఏజ్' లేఖకులు మైక్డోనల్ అనువాని పుస్తకము *Hymns of the Vedas. P 46* నుండి గ్రహించినారు. **'త్వష్ట'** అను శబ్దమును ఐతరేయ బ్రాహ్మణములో ఈ దిగువ విధముగా ఇన్ద్రుని మరోపేరుగా చూపబడినది. అనగా; **'ఇన్ద్రో వై త్వష్టా'** ॥ ఐ ౬-౧౦॥

### ౧౦.౧౩ వేదములందు బహువివాహము మున్నగు భ్రాంతి నివారణము

'వైదిక్ ఏజ్' లేఖకులు వేదముల విషయములో అనేక భ్రమలు గలిగించినారు. వానిలో వేదములందు బహువివాహము ల అనుమతి అనున దొకటి. ఒక వివాహ నియమమే గలదని అంగీకరించియు వారిట్లు వ్రాసినారు.

*The Rigveda certainly permits polygamy, though monogamy may have been the rule. Whether monogamy developed from Polygamy in the Rigvedic Age as Zimmer thinks in 'Altindische Leben' or whether Polygamy is secondary as Weber believes in "Indische Studiern" can not be decided. Probably Polygamy though allowed was practically confined to the Rajange class. Polyandry is not referred to any where in the Rig Veda. - Vedic Age. P.390.*

అనగా; బహు వివాహముల అనుమతి ఋగ్వేదీయ కాలములో నిశ్చయముగా నుండెను. అయినప్పటికి నియమమొకే వివాహముగా నుండెను. ఋగ్వేదములో బహు వివాహమనునది గౌణముగా వచ్చును. నిశ్చయము చెప్పలేము. బహు వివాహానుమతి ఒక్క వేళ ఈయబడినను అది క్రియాత్మక రూపములో క్షత్రియ వర్గము వరకే పరిమితమై యుండెనేమో? ఋగ్వేదములో బహు పతిత్వమును గూర్చి ఎచ్చటను నిర్దేశము లేదు.

### సమీక్ష

వైదిక కాలములో ఒక్క వివాహ నియమమే యుండెను. దీనిని 'వైదిక్ ఏజ్' లేఖకులు కూడా అంగీకరించినారు. ఇదియే ఆదర్శము, వేదములం దంతటను ఇట్టి నిర్దేశమే గలదు. 'వైదిక్ ఏజ్' యందును ఇట్టి కొన్ని నిర్దేశము లీయబడినవి. ఉదా:- ఋగ్వేద ౧-౧౨౪-౭, ౪-౩-౨, ౧౦-౭౧-౪లో **జాయేవ పత్య ఉషతీ సువాసాః** అను శబ్దములు వచ్చినవి. దీనితాత్పర్యమేమన; ఉత్తమ వస్త్రధారణ మొనర్చి, కోరికలు గలిగిన పత్ని తన పతి సమ్ముఖమునకు వచ్చునట్లు విద్య తన స్వరూపమును విద్వాంసుని యెదుట ప్రదర్శించును.

**ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉషతీ సువాసాః** ॥ ఋ.౧౦-౭౧-౪॥

జాయా మరియు పత్యే అను రెండు స్థలములందును ఏకవచన ప్రయోగము ఒక్క వివాహము యొక్క ఆదర్శమునే ప్రతిపాదించుచున్నది. ఋగ్వేదము ౧-౩-౩లో

**దేవో న యః పృథివీం విశ్వధాయా ఉపక్షేతి హితమిత్రో న రాజా ।**

**పురః సదః శర్మసదో న వీరా అనవద్యా పతిజుష్టేవ నారీ ॥** ఋ.౧-౩-౩॥

ఇచ్చట పరమేశ్వరుని పతిని అధికముగా ప్రేమించునట్టి సచ్చరిత్ర గల సాధ్వియగు పత్నితో పోల్చబడినది. దీనివల్ల కూడా ఒక్క వివాహాదర్శమే సూచితమగుచున్నది.

**దేవో న యః పృథివీం.........** అను మంత్రాను వాద మిట్లున్నది.

*He who is like the sun, the supporter of the universe; Who abides on earth like a king with good friends, Who is like heroes at home that sit in front, And who is like the irreproachable wife beloved of her husband. The Call of the Vedas by Dr.A.C.Bose. P.99.*

ఈ దిగువ ఋగ్వేద మంత్రము కూడా ఈ విషయములో ఉల్లేఖనీయము

**గావ ఇవ గ్రామం యుయుధిరివాశ్వాన్ వాశ్రేవ వత్సం సుమనా దుహానా।**

**పతిరివ జాయాం అభి నో న్యేతు ధర్తా దివః సవితా విశ్వవారః॥౧౦-౧౪౯-౪॥**

ఈ మంత్రములో అనేక ఉపమాలంకారముల ద్వారా పరమేశ్వరుని యందు ప్రేమను ప్రకటించబడినది. ఆతని కలయిక్కై ఆతురత ప్రదర్శించబడినది.

మొదటి పోలిక గోవులు గ్రామములకు తిరిగి వచ్చుట, రెండవది యోధులు తమ అశ్వములను ప్రేమించుట, మూడవది, గోవులు తమ వత్సము ( లేగ)లను ప్రేమించుట,నాల్గవది. పతి తన పత్నిని ప్రేమ పూర్వకముగా గలియుటను గూర్చి కలదు.

**'జాయా, పతిమ్'** రెండు స్థానములందును ఏకవచన ప్రయోగము గలదు.

**గావ ఇవ గ్రామమ్.........** విశ్వ వారః' దీని అంగ్రేజి అనువాదము

*As kine turn to the village as warriors to their steeds, as loving milk- giving cows to their calves.*

**As the husband to the wife, so may the Deity, the upholder of the heavens Lord of all bliss, turn towards us.**

కేవలము ఉపమాల పైననే మా దృష్టిగాదు. ఏలన, వేదములందు ఏకాంశమును దీసికొని అనేక విధములగు ఉపమాలంకారములు చూడబడుచున్నవి. ఐనను వేదముల శిక్షణ లన్నియును ఒక్క వివాహాదర్శమునే సమర్థించుచున్నవి. ఋ.౧౦-౮౫ వ వివాహ సూక్తములో దీనికి స్పష్టమగు నిర్దేశము గలదు. ఉదా:-

**ఆ రోహ సూర్యే అమృతస్య లోకం, స్యోనం పత్యే వహతుం కృణుష్వ**

పై ఋగ్వేద మంత్రము౧౦-౮౫-౨౦లో సూర్య కాంతి వంటి తేజస్వినియగు కన్యను సూర్య నామముతో సంబోధించుచు, 'హే సూర్యకాంతి వంటి తేజోవంతురాలవగు సుదతీ! నీ వీ రథము నధిరోహించుము. నీ పతి కొరకు సదా సుఖములను విస్తారమొనర్చుము' అని ఉపదేశించబడినది.

**సం జాస్పత్యం సుయమమస్తు దేవాః ॥ ౨౩॥**

ఈ పతీపత్నుల సంబంధము ఉత్తమ నియమిత రూపములో సంయమ పూర్వకముగా సదా నడచుచుండుగాక.

**ఋతస్య యోనౌ సుకృతస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా దధామి ॥ ౨౪॥**

హే వధూ! నిన్ను పతితో గూడ సదా పుణ్యము, సత్యమునైన మార్గములో చక్కని ఆరోగ్యకరముగా సంయుక్తమొనర్తును.

**ఇహైవ స్తం మా వియౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతామ్ ।**

**క్రీడన్తౌ పుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వే గృహే ॥** ఋ.౧౦-౫-౪౨॥

అనగా; మీరిరువురు ఈ సంసారములో గృహస్థాశ్రమమందు సుఖపూర్వకముగా నివసించుడు. మీకెప్పుడును పరస్పర వియోగము గలుగకుండుగాక. మీరు సదా ప్రసన్నపూర్వకముగా మీ గృహమునందుండుడు.

**సమంజన్తు విశ్వే దేవాః సమాపో హృదయాని నౌ।**

**సం మాతరిశ్వా సం ధాతా సము దేష్ట్రీ దధాతు నౌ ॥** ఋ. ౧౦-౫-౪౭ ॥

వధూవరులమగు మేమిరువురము సమస్త విద్వాంసుల సమక్షములో ఘోషణ మొనర్చుచున్నాము. మా యిరువురి హృదయములు జలముల వలె శాంతము, మరియు పరస్పరము కలిసియుండగలవు. ప్రాణ వాయువు వలె మా ప్రేమ పరస్పరము ప్రియముగా నుండును. ఇట్టి కృపను పరమేశ్వరుడు మాయుభయులపై నుంచుగాక. ఈ విధముగా వేదముల సంపూర్ణ శిక్షణ ఒక్క వివాహమునే ఆదర్శముగా నెంచినదనుటలో సందేహము లేదు. అథర్వ వేదములోని వివాహ విషయక నాల్గవ కాండము నుండి మరియు ఇతర సూక్తములలోను ఈ విషయమే సమర్థించబడినది. అథర్వ. ౭-౩౫-౪॥ లో పతీపత్నులు;

**అన్తః కృణుష్వ మాం హృది, మన ఇన్నౌ సహాసతి ॥** అథ. ౭-౩౫-౪॥

నీవు నన్ను నీ హృదయములో కూర్చుండబెట్టుకొనుము. మనయిరువురి మనస్సులు ఒక్కటే యగుగాక అని పతియనిన పిదప పత్ని -

**మమేదసస్త్వం కేవలో నాన్యాసాం కీర్తయాశ్చన ॥** అథ. ౭-౩౦-౪॥

నీవు కేవలము నావాడవేయై యుండుము. ఎప్పుడును ఇతర స్త్రీలను వర్ణించుటయో, లేక వ్యర్థముగా ప్రశంసించుటయో యొనర్చకుము.

ఇట్టి వచనములచే ఒకే వివాహ సమర్థనయగుచున్నది.

**ఇహేమావిన్ద్ర సంనుద చక్రవాకేవ దమ్పతీ।**

**ప్రజయై నౌ స్వస్తకౌ విశ్వమాయుర్వ్యశ్నుతామ్ ॥** ఋ.౧౪-౨-౬౪॥

**జాయా పత్యే మధుమతీం వాచం వదతు శాన్తివామ్** ॥ అథ. 3-30-౨॥

మున్నగు మంత్రములలోను పతీపత్నులను చకోరపక్షి జంటవలె పరస్పరము ప్రేమయుక్తముగా నుండుమని పరమేశ్వరుని ప్రార్థించబడినది. మరియు నీవిధముగా మధురమైన వాణిలతో శాంతిదాయకముగా జీవించుమని ఒకే వివాహము సమర్థించబడినది. 'వైదిక్ ఏజ్' లో కొన్ని మంత్రములందీయబడిన ఉపమాలంకారముల ఆధారమున బహు వివాహముల అనుమతి కలదనుట ఇన్ని ప్రబల సాక్ష్యముల, ప్రమాణముల ముందు తుచ్ఛమై పోవును. ఈ ఉదాహరణములలో రెండింటి బహువివాహము స్పష్టముగా నిందింపబడినది. చూడుడు-

**సం మా తపన్త్యభితః సపత్నీరివ పర్శవః** ॥ ఋ.౧౦-౧౦౫-౮॥

ప్రాపంచిక వ్యథలు నన్ను సవతులవలె సంతప్త మొనర్చుచు దుఃఖములను గలిగించుచున్నవి. ఈ యుపమాలంకారము బహు వివాహములు దుఃఖదాయకములని స్పష్టపరచుటకే ఈయబడినది. ఈయుపమా బహువివాహమును సూచించదు

**ఉభే ధురౌ వహ్నిరాపిబ్దమానోఽన్తర్యోనేవ చరతి ద్విజానిః** ॥ ఋ.౧౦-౧౦౧-౧౧॥

ఇది బహు వివాహ పద్ధతిని నిందించుచున్నది. ఈ మంత్రార్థమిట్లున్నది సకిలించు గుఱ్ఱము రథము యొక్క రెండు నొగల మధ్య అణగిపోయి నడచునట్లు ఇరువురు భార్యలను వివాహమాడిన (ద్విజానిః) భర్త అణగి యుండిపోవును.

ఒంటెద్దు బండి రెండు నొగల మధ్య గట్టబడిన గుఱ్ఱము అటు నిటు గదల జాలనట్లే ఇరువురు భార్యల భర్త సంపూర్ణముగా పరతంత్రుడై పోవును. కావున ఒక్క సమయములో ఇరువురు లేక బహుపత్నుల వివాహమొనర్చుకొనుట ఉచితముగాదు.

ఆపద్ధర్మ రూపములో వేదములందు నియోగ విధానమున్నది. ఈ ప్రకారముగా వేదోక్తమగు ఏకపత్నీ వివాహమునే ఆదర్శముగా నెంచవలెను.

కేవలము ఏకవచన, బహువచనముల తోనే పరిణామము దీయదలచినచో

**తాం పూషన్ శివతమామేరయస్వ యస్యాం బీజం మనుష్యా వపన్తి ।**

**యా న ఊరూ ఉశతీ విశ్రయాతి యస్యాముశన్తః ప్రహరామ శేపమ్** ॥ ఋ.౧౦-౮౫-౧౭॥

దీనియర్థము ఈ విధముగా భావించవలెను. ఒక్క స్త్రీకి అనేక భర్తలుందురు. వారు ఆమె యందు వీర్యాధానమొనర్తురు. (యస్యామ్) స్త్రీ లింగము, సప్తమీ విభక్తి, ఏక వచనము (మనుష్యాః) బహువచనము (యస్యామ్) స్త్రీలింగము, సప్తమీ విభక్తి, ఏకవచనము, (ఉషన్తః) ప్రథమావిభక్తి, బహువచనము

దీనివల్ల బహుపతిత్వము *(Polyandry)* సిద్ధియగుచున్నది. దీనిని 'వైదిక్ ఏజ్' లేఖకులు కూడా అంగీకరించరు. నిజమునకు ఉపమానము లందు వచనము అవివక్షిత మగును. ఏలన; **'ఉపమా'** ఏకదేశీయమగునని నమ్ముటయే యుచితము. ఒక వేళ సపత్నీఘ్న సూక్తమునకు బాహ్యముగా ప్రతీయమానార్థము దీసికొనినను (అది వాస్తవముగా అవిద్యా విషయకమే) కావున సపత్ని యొక్క ద్వేషభావముల ప్రదర్శన రూపమున బహు వివాహ పద్ధతిని నిందించుటే యగును.

ఈ విషయమును ముగించుటకు పూర్వమొక వేద మంత్రముపై ప్రకాశము వేయుట ఆవశ్యకమనిపించుచున్నది. భారతీయ మరియు పాశ్చాత్య విద్వాంసు లనేకులు వేదములందు బహు వివాహ పద్ధతిగలదని నిరూపించుటకు ప్రాయః దిగువ ఈ మంత్రము నుదాహరించుచుందురు.

**అదాన్మే పౌరుకుత్స్యః పఞ్చాశతం వధూనామ్ । మంహిష్ఠో అర్యః సత్పతిః ॥ ఋ.౮-౧౯-౩౬ ॥**

ఈ మంత్ర ఋషి **'సౌభరిః కాణ్వః'** మరియు దేవత లేక ప్రతిపాద్య విషయము **'త్రసదస్యోర్దానస్తుతిః'** ఐయున్నది. సాయణాచార్యుడు మున్నగువారి ననుసరించి దిగువ కథ ప్రతిపాదనము ఈ సూక్త మంత్రములందు చేయబడినది. విష్ణుపురాణము మరియు భాగవతము మున్నగు వానియందు కొంత భేదముతో గాన్పించును.

**'సౌభరి'** యను ఋషి జలములందు ౧౨ సంవత్సరములు ఘోరముగు తపస్సు చేయుచుండెను. ఒకనాడు 'సంమద' మను పేరు గల ఒక మీన (మత్స్య) రాజు తన పరివారముతో గూడ క్రీడలొనర్చుచు సమీపముననే యుండెను. ఋషియును అట్టి క్రీడలను గాంచి ముగ్ధుడై 'నేను కూడా ఈ మత్స్య రాజు వలె భోగముల ననుభవించినచో ఎంతయో ఆనందముగా నుండెడి దని తలచి వివాహార్థియై **'మాంధాత'** యను రాజు వద్దకు వెళ్ళినాడు. ఆరాజునకు ఏబది మంది కన్యలుండిరి. రాజు మునిని గాంచి నా కన్యలు స్వయంవర విధిగా వివాహమాడెదరేగాని వృద్ధుడవగు నీతో వివాహమాడజాలరని యనినాడు. ఋషి తన యోగ బలముతో తరుణ వయస్కుడై అంతః పురమున నాకన్యల యెదుట నిలచినాడు. ఆ కన్యలెల్లరును నాతనిని వివాహమాడుటకు కుతూహల పడుచుండిరి. కావున నారాజు కన్యలెల్లరను నా ఋషి వరునికిచ్చి వివాహమొనర్చినాడు. వారి యందా ఋషికి ౧౫౦ శిశువులు జన్మించిరి అని కథా కల్పన యొనర్చినారు. కాని వాస్తవముగా మంత్రములందీ కథను గూర్చిన వర్ణన ఎచ్చటను లేదు **'సౌభరి'** యను శబ్దము మంత్రములందు రెండు తడవలు వచ్చినది. ఈ దిగువ రెండు మంత్రములను జూడుడు.

**విభూతరాతిం విప్ర చిత్రశోచిషమగ్నిమీడిష్వ యన్తురమ్ ।**

**అస్య మేధస్య సోమ్యస్య సోభరే ప్రేమధ్వరాయ పూర్వ్యమ్ ॥**

ఈ మంత్రములో **'సోభరి'** అనగా; **'సుష్ఠు విద్యయాత్మానం భరతీతి సోభరిః'**

చక్కని విద్యలచే తాను పరిపూర్ణుడైన విద్వాంసుని సంబోధించుచు ఇట్లుపదేశింపబడినది. హే సోభరే (విప్ర) ఓజ్ఞానవంతుడా! నీవు (విభూతరాతిమ్) అనేక విధములుగా దానమొనర్చు (చిత్ర శోచిషమ్) అద్భుత తేజోవంతమగు (అస్య సోమ్యస్య మేధస్య యన్తురమ్) ఈ సుందరమగు ప్రపంచరూప యజ్ఞము లేక కర్మనియామకుడగు (అగ్నిమ్) జ్ఞాన స్వరూపుడు, శ్రేష్ఠుడు నాయకుడునగు పరమేశ్వరుని (అధ్వరాయ) హింసారహితమగు శుభకార్యముల పూర్తి కొరకై (ఈడిష్వ) స్తుతియొనర్చుము. ఈ సోభరి అనగా ఉత్తమ శక్తి, మరియు విద్యాదులను తనలో ధారణ మొనర్చు జ్ఞానిని సంబోధించుటయైయున్నది. ఇదొక వ్యక్తి విశేషమని యెంచరాదు. ఈ సూక్తము నందే ౩౨వ మంత్రమునందు **'సోభరయం'** అను బహువచనాన్త ప్రయోగము గలదు అనగా

**తమాగన్మ సోభరయః సహస్ర ముష్కం స్వభిష్టిమవసే ।**

**సమ్రాజం త్రాసదస్యవమ్** ॥ ఋ.౮.౧౯.౩౨ ॥

విద్యాదులలో సంపూర్ణుడవు నగు ఓ యుపాసకుడా! (అవసే) రక్ష, జ్ఞానము, మరియు వృద్ధి కొరకు (తమ్) అట్టి (సహస్రముష్కమ్) అపరిమితమగు తేజోవంతులు **'సహస్రాణి - అసంఖ్యాతాని మృష్ణన్తి- తమాంసి హరన్తీతి ముష్కాణి తేజాంసి యస్య తమ్'** (స్వభీష్టమ్) **'శోభనమిష్టమ్ ఇష్టమ్ ఉత్తమ ఇష్టదేవం** (సమ్రాజమ్) సర్వత్రా చక్కని ప్రకాశవంతమగు (త్రాసదస్యవమ్) 'స్యస్తి బిభ్యస్తి దస్యవో దుష్టా యస్మాత్ తం దుష్టనియన్తారమ్' దుష్టులకు నియన్తయగు పరమేశ్వరుని (అగన్మ) ప్రాప్తించుకొని ఆతని శరణమునకే జేరినారు (త్రాసదస్యవః) దీనియందు 'స్వార్థేఽణ్' ప్రత్యయ ప్రయోగము త్రసదస్య అర్థమునకే యైనది ఈ విధముగా **'సోభరి'** అను వ్యక్తి విశేష నామము గాక తమ జ్ఞానోపాసనల ద్వారా రక్ష, మరియు జ్ఞాన బుద్ధుల కొరకు సర్వమునకు సామ్రాట్టగు, దుష్టులకు నియంతయగు పరమేశ్వరుని శరణమును బొందుట గూర్చియే మంత్రము నందుపదేశము గలదు. మరియు **'అదాన్మే పౌరుకుత్స్యః'** ఈ మంత్రములో ఆ పరమేశ్వరుని అద్భుత ప్రసాదముల వర్ణనయే గలదు. మేము పైన దెలిపినట్లు **'సౌభరి'** జ్ఞాని ఉపాసకుడే యగును. మరియు జ్ఞానము, శక్తి, శాస్త్ర మున్నగు వానితో తనను పరిపూర్ణునిగా నొనర్చుకొనినవాడే యగును తుష్ఠు భరణ కర్త సోభరిః దీనికొరకు **'కాణ్వః'** అను ప్రయోగము కూడా వచ్చినది. ఏలన నాతడు మేధా బుద్ధి సంపన్నులగు తండ్రులకు నిజమైన పుత్రుడై యుండును **'కాణ్వ ఇతి మేధావి నామ'** ॥ నిఘం ౩-౧౫॥

ఇట్టి మేధావి విద్వాంసుని సత్యమగు పుత్రుడు లేక శిష్యుడగు **'సోభరి'** ద్వారా ఈశ్వరుని ప్రదానముల వర్ణన ఈ రూపములో యొనర్చబడినది

**అదాన్మే పౌరుకుత్స్యః పంచాశతం వధూనామ్ ।**

**త్రసదస్యుర్మంహిష్ఠో అర్యః సత్పతిః** ॥ ఋ.౮-౧౯-౩౬॥

అనగా; అట్టి (పౌరుకుత్స్యః) పురవః బహవః కుత్సాః పాపదుఃఖనివారకబలరూప వజ్రా యస్య కుత్సు ఇతి వజ్రనామ ॥నిఘం. ౨-౨౦ ॥ పురుకుత్స ఏవ పౌరుకుత్స్యః స్వార్థేష్యఞ్ నతని పద్ధ పాపములను, దుఃఖములను దొలగించు బల రూపమగు అనేక వజ్రములు గలవాడు. అట్టి (మంహిష్ఠః) మహోదాత (సత్పతిః) సజ్జనపాలకుడు, మరియు (త్రసదస్యుః) దుష్టులను అదుపులోనుంచువాడు (అర్యః) విశ్వమునకు స్వామియగు పరమేశ్వరుడు **'అర్యః స్వామివైశ్యయోః** ॥ అష్టాధ్యాయి ౩-౧-౧౦౩ ॥ (మే) నా కొరకు (వధూనామ్) వహన్తి ప్రాపయిన్తి సుఖమితి వధ్వః తాసామ్ సుఖప్రాప్తిని గలిగించు శక్తులను, మరియు పదార్థములను (పంచాశతమ్) ౫౦ సంఖ్యకు (అదాత్) ఇచ్చినాడు, లేక ఇచ్చును. **'ఛన్దసి లుఙ్ లఙ్ లిటః ॥ అష్టా ౩-౪-౬ ॥** ను అనుసరించి సామాన్య కాలము నందీ ప్రయోగము గలదు. ఆ ఏబది విధములగు సుఖప్రాప్తిని గలిగించు శక్తులు, లేక పదార్థములు ఈ దిగువ ప్రకారముగా నుండును.

౧౦ ఇంద్రియములు, ౧౦ ప్రాణములు, ౪ (మనోబుద్ధి, చిత్తాహంకారములు) నాలుగు అంతః కరణములు, విద్య, స్వభావము, శరీరము, బలము ఈ విధముగా ౨౮యైనవి. పైన దెలిపిన విధముగా వీని గణనము మహర్షి దయానందులు '**అష్టావింశాని శివాని శగ్మాని సహయోగం భజన్తు మే క్షేమం ప్రపద్యే చ యోగం ప్రపద్యే క్షేమం చ ।నమో ఽహోరాత్రాభ్యామస్తు**'। ఈ అథర్వ వేదము యొక్క ౧౯వ మంత్రముయొక్క వ్యాఖ్య యందు ఋగ్వేదాది భాష్య భూమిక ఉపాసనా ప్రకరణము నందు చేసినారు. ౪ వేదములు, ౪ ధర్మ అర్థ కామ, మోక్షములు, అను నీ పురుషార్థములు గలసి 3౬ ఐనవి. ౬ షట్క సంపత్తి (శమ, దమం, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము) ఇవన్నియు గలసి 3౬ + ౬ + ౪౨ యైనవి. దిగువ ౮ ఎనిమిది (అష్ట) సిద్ధులను గలుపుకొని వీని మొత్తము '**ఊహాదిభిః సిద్ధిః**' ఈ సాంఖ్య సూత్రపు వ్యాఖ్యయందు దెలిపిన ఈ ౫౦వ సంఖ్య పూర్తియైనది.

**ఊహః శబ్దో ఽధ్యయనం, దుఃఖ విఘాతాస్త్రయః సుహృత్ప్రాప్తిః ।**

**దానం చ సిద్ధయోఽష్టౌ, సిద్ధేః పూర్వోఽకుశస్త్రివిధః ॥**

(తారానాథ తర్కవాచస్పతి కృత వాచస్పత్య బృహదాభిధానము. పు.౫౨౯3)

**ఊహః**- పూర్వజన్మయందలి అభ్యాసము, మరియు ప్రబల సంస్కారముల కారణమున ఈ జన్మమందు ఉపదేశ విశేషములు మున్నగునవి లేకుండా కూడా తత్త్వ బోధ గలుగుట, ఇతరులెవరిచేతనైనను ఉపదేశమువల్ల జ్ఞానము గలుగుట, వేదములు మున్నగు సత్యశాస్త్రముల అధ్యయనముచే గలుగు సిద్ధి, ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతిక దుఃఖముల నివృత్తి, తత్త్వ జ్ఞానులగు మిత్రుల ప్రాప్తి మరియు దానము అను నీయెనిమిది సిద్ధుల ప్రాప్తి పరమేశ్వరుని కృప వల్లనే సత్యమైన ఉపాసకునకు గలుగును. కావుననే వారు అనుదినము పరమేశ్వరునకు ధన్యవాదములర్పించు చుందురు. ఈ సూక్తము నందలి

**తవ క్రత్వా సనేయం తవ రాతిభిరగ్నే తవ ప్రశస్తిభిః ।**

**త్వామిదాహుః ప్రమతిం వసో మమాగ్నే హర్షస్వ దాతవే** ॥ ఋ.౮-౧౯-౨౯ ॥

**ప్ర సో అగ్నే తవోతిభిః సువీరాభిస్తరతే వాజభర్మభిః ।**

**యస్య త్వం సఖ్యమావరః** ॥ ఋ. ౮-౧౯-3౦ ॥

మున్నగు మంత్రములందు జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరుని (రాతిభిః) ప్రదానము వల్లనే మానవులు సుఖమును పొందుదురని స్పష్టముగా నిర్దేశించబడియున్నది. ఆయన మిత్రత్వము నెవరు ప్రాప్తించుకొనెదరో అట్టివారే ప్రపంచములో వృద్ధిని, ఉన్నతిని పొందుదురు. 3౨వ మంత్రములో గల '**త్రాసదస్యవః**' మరియు 3౬ మంత్రములో గల '**మంహిష్ఠః ఆర్యః, సత్పతిః**' మున్నగు విశేషణములతో గూడిన '**త్రసదస్యుః**' పరమాత్మయే యగును. కాని ఏదో రాజు విశేషము గాదు. మరియు '**సోభరిః**', సోభరయః మున్నగు పదములచే ఉత్తమ విద్యాదులను తనలో చక్కగా ధారణమొనర్చుకొనిన జ్ఞానులు, ఉపాసకుల గ్రహణము సిద్ధించును. పరమేశ్వర కృపవల్ల వారికి **సుఖదాయకమగు ౫ జ్ఞానేంద్రియములు, ౫ కర్మేంద్రియములు;** ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములు, దేవదత్త కూర్మ కృకల, నాగదత్త, ధనంజయములను నీ పది ప్రాణములును; మనస్సు, బుద్ధి, చిత్తము,

అహంకారములు; విద్యా స్వభావము శరీరము బలములు; నాలుగు వేదములు, ౪ పురుషార్థములు, శమాదిషట్కసంపత్తులు; ఊహ శబ్ద అధ్యయన త్రివిధ దుఃఖ నాశనములు అష్ట సిద్ధులు అను నీ ౫౦ వధువులు అనగా వహన్తి ప్రాపయన్తి సుఖమ్ ఇతి. ఉణాదికోశము ౧-౮౩॥ 'వహేర్ధశ్చ వహతి సుఖాని ప్రాపయతీతి వధూః'॥ '౫౦ వధువుల తాత్పర్యము పది ఇంద్రియముల శక్తిని ఐదు గుణములుగా పెంచుట' యనునది గూడా యగును. దీనియందు ఏబదిమంది కన్యలచే వృద్ధ సోభరి నామక ఋషితో వివాహమును గూర్చి ఏ విధమగు చర్చయును లేదు. సాయణాచార్యుడు మున్నగు వారు, మరియు పాశ్చాత్య లేఖకులు భ్రమలో పడి తప్పులుగా వ్రాసివేసినారు. వేదములందు **సంబాధతపన్త్యభితః సపత్నీరివ పర్శవః** ॥ ఋ.౧౦-౧౦-౫-౮, మరియు **ఉభే ధురౌ వహ్నిరాపిబమానో౽న్తర్యోనేవ చరతి ద్విజానిః** ॥ ఋ. ౧౦-౧౦-౧-౧౧ ॥ వీనిద్వారా సపత్నీ, మరియు ద్విభార్యత్వము ఎంతో నిందనీయమని, దుఃఖదాయకమునియు చూపబడియుండగా ౫౦ మంది స్త్రీలతో వివాహ ప్రతిపాదన మెట్లు సిద్ధియగును?

### 10.14 అథర్వ వేదము చేతబడులు, మంత్ర తంత్రముల వేదమా?

వేదములన్నిటిని గూర్చి 'వైదిక్ ఏజ్'లో నికృష్టమగు అనేక అభిప్రాయములను వ్రాసి యున్నారని మేము గడచిన అధ్యాయములలో తెలిపియున్నాము. ఐనను అథర్వ వేదమును గూర్చి 'వైదిక్ ఏజ్' లేఖకులు అశుద్ధమగు భ్రాంతి పూర్వక అజ్ఞానముచే దీనిని చేతబడులు, మంత్ర తంత్రముల పుస్తకమని వ్రాసినారు. ఇట్లనే పాశ్చాత్య విద్వాంసులనేకులు, మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసులు కొందరు వ్రాసినది వారి యజ్ఞానము, మరియు సంపూర్ణముగా అసత్యము. అథర్వ వేదములో బ్రహ్మ విద్యను ప్రతిపాదించు అనేక సూక్తలు విద్యమానమై యున్నవి. దీని యనేక సూక్తములందు యోగ విద్యను గూర్చిన ప్రతిపాదనము గలదు. కావుననే అథర్వ వేదమొక్కదానికే **'బ్రహ్మ వేద'** మను పేరు గలదు. దీనిని బలపరచు అనేక ప్రమాణములు ప్రాచీన గ్రంథములందు మనకు లభించును. ఉదాహరణమునకు గోపథ బ్రాహ్మణము ౨-౧౬లో ఇట్లు గలదు.

**'చత్వారో వా ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో బ్రహ్మవేదః'**

దీనియందు అథర్వ వేదమును 'బ్రహ్మవేద' మని చెప్పుటయేగాక

**'తమ్ ఋచః సామాని యజూంషి బ్రహ్మ చానువ్యచలన్**॥ అథ ౧౫-౬-౮॥'

మున్నగు మంత్రములలో **'బ్రహ్మవేద'** శబ్ద ప్రయోగము గలదు. పలువురు విద్వాంసులనుకొనునట్లు ఇది కేవలము బ్రహ్మ యొక్క ముఖ్య వేదమగుటచే బ్రహ్మ వేదము గాదు. దీనియందు బ్రహ్మ విద్యను గూర్చిన ప్రతిపాదనలు ప్రబలముగా నుండుటచే దీనికి **'బ్రహ్మవేద'** మను పేరు సార్థకమైనది.

**దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతిరేక ఏవ నమస్యో విక్ష్వీడ్యః ।**

**తం త్వా యౌమి బ్రహ్మణా దివ్య దేవ నమస్తే అస్తు దివి తే సధస్థమ్** ॥ అథర్వ ౨-౨-౧॥

వరుణ సూక్తము, ౪-౧౬, అథర్వ ౧౦-౨ కేన సూక్తము ౧౦-, స్కంభ సూక్తము ౧౦-౮ బ్రహ్మ సూక్తము

**'తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః'**, ఉచ్ఛిష్ట సూక్తము ౧౧-౭ మున్నగు వానియందు బ్రహ్మ విద్యను గూర్చి అతి ఉత్తమమగు ప్రతిపాదన గలదు. నిష్పక్షపాత వ్యక్తులెవ్వరును దీనిని కాదనలేరు. ఈ విషయమును 'బ్లూంఫీల్డ్' యను నాతడు స్వీకరించినాడు. చూడుడు.

*The Atharvan is a sacred text in more than one respect, aside from the material which it shares with the Rig and Yajurvedas, many of its hymns and practices are benevolent [bheshaj] and are in general well-regarded though even these; as we shall see, do not altogether escape the blight of contempt. Many hymns of the Atharvaveda are theosophic in character; in whatsoever ground they found shelter in the Atharvan collection, they can not have been otherwise than highly esteemed. The class of charms designed to establish harmony in family and village life and reconciliation of enemies [the so called Sammanasyani] and the royal ceremonies [Raj Karmani] are obviously auspicious in their nature. Even the sorceries of the Atharvans necessarily show a double face, they are useful to one self, harmful to others.*

*(Hymns of the Atharva Veda Translated by. M.Bloomfield Introduction P.XXIX.)*

ఈ సందర్భ భావమేమన; అథర్వ వేద మొక పవిత్ర గ్రంథము. అనేక దృష్టులతో ఋగ్వేదము,సామవేదముల వలె ఇందులోనున్న మంత్రములేగాక అనేక క్రియలు మరియు సూక్తములు లాభదాయకములు (భేషజములు)నైయున్నవి. మరియు వీని విషయములో లోకులు ఆదర భావము నుంచుదురు. ఈ వేదమునందలి అనేక సూక్తములు బ్రహ్మ విద్యతో గూడ సంబంధము గలిగినవియై యున్నవి.

పరివారము, గ్రామీణ జీవనము, సౌమనస్యము, మరియు రాజకర్మవిషయక వశీకరణములు ప్రాకృతికమున మంగళ స్వరూపములై యున్నవి. దీనియందలి కృత్యా అభిచారాది క్రియలు కూడా రెండు విధములవియై యున్నవి. అవి ప్రయోగించువారికి లాభదాయకములు, మరియు ఇతరులకొరకు హానికారకములై యున్నవి.

పాశ్చాత్య, మరియు వారి అనుయాయులగు భారతీయ విద్వాంసులు తమ యజ్ఞానము, మరియు మూర్ఖత్వముచే వ్రాసినట్లు అథర్వ వేదము గారడి, వశీకరణము, క్షుద్ర ప్రయోగము వంటి పుస్తకము గాదు. ఈ విషయము మేము ముందర వివరించెదము. బ్రహ్మ విద్య, ఆత్మవిద్య మరియు యోగ సంబంధమగు సూక్తములు దీనియందు అధిక సంఖ్యలో నున్నవి. అథర్వ శబ్దము యొక్క అర్థము **'థర్వతిశ్చరతికర్మా తత్ప్రతిషేధః'** అగును. అనగా; చంచలత్వ నిషేధము, మరొక విధముగా జెప్పవలయునన్న చిత్తవృత్తి నిరోధమును మరియు స్థిత ప్రజ్ఞత్వస్థితిని దాని సాధనములను ప్రతిపాదన మొనర్చునుగావున దీనికి అథర్వ వేదమను నామము సార్థకమైనది.

ఈ వేదములో చికిత్సకు సంబంధించిన సూక్తములు కూడా చాలా కలవు. కావుననే అథర్వ ౧౧-౬-౧౪లో **'ఋచః సామాని భేషజా యజూంషి'** ద్వారా దీనికొరకు **'భేషజ'** ప్రయోగము గలదు.గోపథ బ్రా. పూర్వార్థము 3-౪లో **'యోఽథర్వాణస్తద్ భేషజం యద్ భేషజఽం తదమృతం తద్ బ్రహ్మ'** అను వాక్యమువచ్చినది. దీనివల్ల

శారీరక, మానసిక, ఆత్మిక సంబంధ సర్వ విధములగు వ్యాధుల నివృత్తికి ఉపాయముల ప్రతిపాదన మిందు గలదు. అథర్వ వేద సూక్త విషయము తాణ్డ్య మహాబ్రాహ్మణమునందిట్లు గలదు.

**భేషజం వా అథర్వణాని** ॥ ౧౨-౯-౧౦ ॥

**అనగా;** అథర్వ వేదములోని చాల సూక్తములు చికిత్సకు సంబంధించినవి ఈ చికిత్సలు శారీరక, మానసిస, ఆత్మికమగు సమస్త వ్యాధులకు సంబంధించినవి.

తాణ్డ్య బ్రాహ్మణము ౧౬-౧౦-౧౦ యందును ఈ విషయమే స్పష్టముగా చెప్పబడినది.

**భేషజం వై దేవానామథర్వాణః** ( అథర్వణా ఋషిణా దృష్టా మన్త్రాః) **భైషజ్యాయై వారిష్ట్యై**

అనగా; అథర్వా ఋషి ద్వారా దృష్టమగు ఈ అథర్వ వేదమంత్రములు దేవతలకు ఔషధమును ప్రతిపాదించునవి. వీని వల్ల ఆరోగ్య ప్రాప్తి గలుగగలదు

శారీరక రోగముల చికిత్స యున్నందున ఆయుర్వేదమునకు మూలము ఈ వేదమని తెలుపబడుచున్నది.

**'ఇహ ఖల్వాయుర్వేదో నామ యదుపాంగమథర్వ వేదస్య'** ॥ సుశ్రుత సూత్ర స్థానము అ.౧౦ ॥ ఇదే విధముగా చరక సూత్ర స్థానము అ. 30-౨౦లోను

**వేదో హ్యాథర్వణః.......** చికిత్సాం ప్రాహ ॥ చరక సూత్ర స్థాన 30-౨౦॥

అథర్వ వేదము చికిత్స విషయము ప్రతిపాదించుచున్నది.

వాస్తవమునకు అట్టి ఆయుర్వేద, వైజ్ఞానిక మరియు మనో వైజ్ఞానిక ప్రయోగములు అథర్వ వేదమునందు ప్రతిపాదింపబడియున్నవి. వీనిని భ్రమ మూలకమున గారడీ, చేతబడులు, మంత్ర తంత్రము అని భావింపబడుచున్నది. ఇందలి మంత్ర విద్యను ఐదు విధములుగా విభజించవచ్చును.

**౧. సంకల్పము మరియు ఆవేశము,**

**౨. అభిమర్శనము, మరియు మార్జనము** *(Mesmerism)*

**3. ఆదేశము** *(Hypnotism)*

**౪. మణిబంధనము.**

**౫. కృత్యా మరియు అభిచారము**

వీనియందు సంకల్పము మరియు ఆవేశ విషయములో అధికముగా వ్రాయు నవసరములేదు. పాపములను దొలగించుకొను సంకల్పము

**పరోపేహి మనస్పాప కిమశస్తాని శంససి** ॥ అథర్వ. ౬-౪౫-౧॥

సఫలత ప్రాప్తి కొరకు సంకల్పము.

**కృతం మే దక్షిణే హస్తే జయో మే హస్త ఆహితః ॥** అథ. ౭-౪౮-౮॥

వ్యాధులను దొలగించుకొను సంకల్పము.

**అపేహి మనసస్పతేఽపక్రామ పరశ్చర ॥** అథ. ౨౦-౯౬-౨౪॥

గజ బలమును తనయందు ధారణ మొనర్చుకొనుటకు సంకల్పము.

**హస్తివర్చసం ప్రథతాం బృహద్ యశో అదిత్యాయత్ తన్వః సంబభూవ ॥** అథ . ౩-౨౨-౧॥

మున్నగు మంత్రములందు స్పష్టముగా జూడవచ్చును. ఈ సంకల్ప శక్తి విషయము మనో విజ్ఞానమునకు సంబంధించినది. ఇందు గారడీ, చేతబడులు తంత్రముల విషయమే లేదు. ఇది స్పష్టముగానే గానవచ్చుచున్నది.

**అభిమర్శనము :-** ఇది శరీరమందొక విధముగు తన్మయానందమును ఉత్పన్నమొనర్చు స్పర్శనామము. అభిమర్శనముచే అనేక వ్యాధులు, మరియు మానసిక దోషములు దొలగించవచ్చును. పాశ్చాత్య విద్వాంసు లీ అభిమర్శ న విద్యను **'మిస్మరిజం'** *Mesmerism* అను పేరుతో చెప్పుకొందురు. అభిమర్శన విద్య యొక్క మూలమంత్ర మిది

**అయం మే హస్తో భగవాన్, అయం మే భగవత్తరః ।**

**అయం మే విశ్వ భేషజోఽయం శివాభిమర్శనః ॥** అథ. ౪-౧౩-౬ ॥

**హస్తాభ్యాం దశశాఖాభ్యాం జిహ్వా వాచః పురోగవీ ।**

**అనామయిత్నుభ్యాం హస్తాభ్యాం తాభ్యాం త్వాభిమృశామసి ॥** అథ. ౪-౧౩-౭ ॥

ఈ నా హస్తము భాగ్యవంతము, యశోవంతమునైనది. ఇది నాకు అత్యధిక భాగ్యవంతము, యశోవంతము (అయం మే విశ్వ భేషజః). ఈ నా చేయి సకల రోగములను శాంతింప జేయు ఔషధమైయున్నది. (అయం శివాభి మర్శనః) ఇది సుఖ శాంతులను గలిగించు స్పర్శ గలిగియున్నది. ॥౬ ॥

పదివ్రేళ్లతో గూడియున్న చేతులతో, మరియు ఆరోగ్యమును గలిగించు ఈనా హస్తములతో (త్వా అభిమృశామసి) ప్రియమైన వ్యాధిగ్రస్తులారా! మేము నిన్ను స్పృశించు చున్నాము. మరియు శుద్ధమగు ప్రబల వాణుల ద్వారా మిమ్ము వ్యాధి రహితులగుటకు ఆదేశించుచున్నాము ॥ ౭ ॥

అనుభవ సిద్ధ విషయమేమన; అధిక ప్రేమయుక్త పవిత్ర భావనతో ఈ విధముగా వ్యాధిగ్రస్తుని రీరావయవములను స్పర్శించు చుండునప్పుడు రోగియందును తన రోగము, ఆ సంబంధమగు కష్టములు క్రమముగా తొలగిపోవుచున్నవను అనుభూతి గలుగుచుండును. అప్పుడు ఈ ప్రభావము రోగిపై తప్పక పడుచుండును. అప్పుడా రోగికి తన రోగము, మరియు దాని సంబంధమగు బాధలు తగ్గుచుండును.

ఈ హస్తాభిమర్శతో సంబంధము గలిగియుండు మరో వస్తువు మార్జనము, లేక పురశ్చరణము. అది జలము, వస్త్రము, మరియు చామరము (చమరీగోవుతోక సంబంధ కేశముల కుచ్చు) తో కూడ చేయబడును. దీని సంబంధము సైతము మనో విజ్ఞానము, ఆయుర్వేద మరియు జీవన విద్య గలిగియున్నది. దీనిని కూడా మాయమంత్రములుగా యనుకొనుట వారి భ్రమ, అవివేకమే యనవచ్చును.

ఆదేశ విద్య, లేక సంవశీకరణము కూడా అథర్వ వేదపు అనేక మంత్రములందు ప్రతిపాదించబడినది. ఆదేశము ద్వారా దాదాపు వ్యాధులన్నిటి యందును మేలు గలుగును. కాని మానసిక, మరియు మస్తిష్క సంబంధ వ్యాధులందు విశేష లాభము చే కూరును. ఒక రోగిపై ప్రభావము వేయవలయునన్న మొదట వారి మనస్సును తనవైపు ఆకర్షించుకొనవలెను.

**యద్ వో మనః పరాగతం యద్ బద్ధమిహ వేవ వా ।**

**తద్ వ ఆవర్తయామసి మయి వో రమతాం మనః ॥** అథర్వ. ౭-౧౩-౪ ॥

ఇట్టి మంత్రముల భావన ద్వారా ఇవి జేయబడును. నీ మనస్సు నల్దిశలకు పరిగెత్తుచున్నది దానిని నేను నావైపునకు ఆకర్షించుకొనుచున్నాను. ఆ నీ మనస్సు నాయందే విహరించుచుండు గాక అని ఇందు చెప్పబడినది

**అహం గృభ్ణామి మనసా మనాంసి మమ చిత్తమను చిత్తేభిరేత ।**

**మమ వశేషు హృదయాని వః కృణోమి మమ యాతమనువర్త్మాన ఏత** ॥ అ. 3-౮-౬ ॥

దీనియందు రోగులను సంబోధించుచు ప్రయోజకుడు 'నేనాదేశించుచున్నాను. నేను మీచిత్తములను, మనస్సులను నా మనోచిత్తములతో గలుపుచున్నాను. మీ హృదయములను నేను నా వశమొనర్చుకొనుచున్నాను. దీని వల్ల మీరు నాకు వశవర్తులైయుందురు.

ఈ విధమగు ఆదేశముల ద్వారా రోగులను తనకు అనుగాములుగా నొనర్చుకొని ప్రయోజకుడు వారి ఈర్ష్యా ఉన్మాదములు మున్నగువానిని దొలగించుటకు ప్రయత్నమొనర్చును. తరచుగా వానియందు సఫలీకృతుడగుచుండును. ఆత్మ విశ్వాసముతో ఆతడు రోగులను సంబోధించుచు ఇట్లనును;'

**అగ్నిష్టే నిశమయతు యది తే మన ఉద్యతమ్ ।**

**కృణోమి విద్వాన్ భేషజం యథానున్మదితోఽససి** ॥ అథ. ౬-౧౧౧-౨॥

అనగా; ఓ రోగ బాధితుడా! రోగ కష్టములతో నీ మనస్సు విరక్తి జెందినను, అవ్యవస్థితమైనను అగ్ని దానిని శాంతపరచుగాక. విద్వాంసుడనగు నేను నీవు ఉన్మాద రహితుడ వగుటకు సాధనములను సమకూర్చెదను. అగ్నిని ప్రజ్వలింపజేసి దానియందు కర్పూరము, చందనము, తులసి విత్తనములు ( దళములు) మున్నగునవి వేయుచు హవన మొనర్చినచో ఉన్మాదరోగికి లాభముండు నని మంత్రములో జూపబడినది. యక్ష్మ జ్వరములు అనగా క్షయ రోగము తొలగించుటకును వేదములందు ఉపదేశము గలదు. ఈ నిమ్న మంత్రములను జూడుడు.

**మా బిభేర్న మరిష్యసి జరదష్టిం కృణోమి త్వా।**

**నిరవోచమహం యక్ష్మం అంగేభ్యో అంగజ్వరం తవ** ॥ అథ. ౫-3-౮ ॥

**అంగభేదో అంగజ్వరో యశ్చ తే హృదయామయః ।**

**యక్ష్మః శ్యేన ఇవ ప్రాపప్తద్ వాచా సాఢః పరస్తరామ్** ॥ అథ. ౫-3-౯ ॥

అనగా; నీవు భయభీతుడవు గాకుము. నిన్ను నేను దీర్ఘాయుష్మంతునిగా నొనర్తును. నేను నీ అంగాంగముల నుండి జ్వరమును తొలగించెదను. నీయొక్క ఈ యంగములు శిథిలమగుట, అంగములలోని జ్వరము, హృద్రోగము మున్నగు వాని నన్నిటిని నేను వాణి, మరియు యజ్ఞాదుల ప్రభావముచే తొలగించి వేయుదును.

మరొక మంత్రము నుల్లేఖించి మేము మణి బంధన విషయమునకు వత్తుము.

**ఉద్యానం తే పురుష నావయానం, జీవాతుం తే దక్షతాతిం కృణోమి।**

**ఆ హి రోహేమమమృతం సుఖం రథం అథ జిర్వ్రిర్విదథమావదాసి।** ॥అథ.౮-౧-౪॥

ఓ మానవా! నీకు సదా ఉన్నతి గలుగుగాక, నీకెప్పుడును అవనతి ప్రాప్తించకుండుగాక. నీ ఉత్తమ జీవనమునకై నీ శక్తిని విస్తార పరచెదను. ఈ అమృతమయ శరీరమను రథముపై యాసీనుడవగు నీవు వృద్ధుడవు, అనుభవశాలివియునై తోటి మానవులకు జ్ఞానము నుపదేశించుము.

ఈ విధమగు ఆదేశ విద్యల మంత్రములతో గూడిన అథర్వ వేద సూక్తము లెన్నియో గలవు. వీనిని కూడా, మాయ, గారడి, చేతబడులని యనుట అవివేకముగాక మరేమగును?

### ౧౦.౧౫ మణి బంధనము మున్నగు విషయముల సమాలోచనము

ఈ మణి బంధ విషయము! అనేక విద్వాంసులను సైతము భ్రమ గలుగ జేయునదిగా నున్నది. నిజముగా అథర్వ వేదములో గారడి, చేతబడులు, మంత్ర తంత్రములు *(Talisman)* మున్నగు బంధనములవంటి ఎన్నో విషయములు గలవు. చక్కగా ఆలోచించినట్లైన వానికి ఆయుర్వేదము మరియు యుద్ధ విద్యలతో సంబంధము గలదని స్పష్టమగును. ఉదా :- అథర్వ వేదములో

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౪వ కాండము, | ౯వ సూక్తములో | | ఆంజన మణి | ౪వ కాండము, | ౧౦వ సూక్తములో | | | శంఖమణి |
| ౧ | ,, | ౨౯ | ,, అభీవర్తమణి౮ | ,, | ౫ | ,, | | ప్రతిసరమణి |
| ౧౦ | ,, | ౩ | ,, వరణ మణి౨,౧౯ | ,, | ౪;౩౪;౩౫లో | | | జంగిడమణి |
| ౩ | ,, | ౫ | ,, పర్ణ మణి౧౯ | ,, | ౩౬ | ,, | | శతవారమణి |
| ౨,౮ | ,, | ౧౧;౫ | ,, స్రాక్త్యమణి౧౯ | | ,, | ౩౧ | ,, | ఔదుంబరమణి |

మున్నగు వాని వర్ణనము చూడబడుచున్నది. వీనికి సంబంధించిన సూక్తములపై ఆలోచించినచో వీనికి రెండు అర్థములు లభించును. వీనిని ధ్యానము నందుంచుకొనిననే మంత్రముల ఉద్దేశ్యమవగాహన మగును కాని అన్యథా కాజాలదు. ఈ విషయములో ముందుగా **'మణి'** శబ్దమును చక్కగా అర్థము జేసికొనుట అత్యంతావశ్యకము.

మణి శబ్దము కొన్ని ధాతువులచే సిద్ధమగును. ఉణాదికోశము ౪-౧౧౮ సర్వధాతుభ్యఇన్ సూత్రము ననుసరించి మణి శబ్దము 'మణ్ శబ్దే' ఈ ధాతువుతో ఇన్ ప్రత్యయమొనర్చుటచే సిద్ధమగును. ఈ విధముగా ఉత్తమ వక్త, నాయకుడు మణి నామముచే సంబోధించ బడును.

**మణతి శబ్దయతీతి మణిః వాగ్మీ నేతా ॥**

మను - జ్ఞానే, (దివాదిః) మన-స్తంభే, మను-అవబోధనే (తనాది) ఈ మూడు ధాతువులతో గూడా మణి శబ్దము సిద్ధింపగలదు. దీనియర్థము జ్ఞానవంతుడు, శత్రువులను, మరియు వ్యాధులను స్తంభింపజేయువాడు. ఇతరులకు జ్ఞానమును ప్రసాదించువాడని యగును.

ఈ యర్థములందును విద్వాంసులను, జ్ఞానులను, నాయకులను మణి లేక నరమణి యనియు అనవచ్చును. ఇంతేగాక వ్యాధులను స్తంభింపజేయు ఓషధాదులకు కూడా మణి శబ్దము ప్రయోగించవచ్చును. పై సూక్తములను ధ్యానపూర్వకముగా చదివినచో వానియందు ఈ రెండర్థము లందును మణి శబ్ద ప్రయోగ మున్న దని స్పష్టపడగలదు. అట్టి జ్ఞానులకు మరియు వీరనాయకులకు ఈ మణి శబ్దము ప్రయోగింపబడినప్పుడు ఈ బంధము యొక్క అర్థము వారి నట్టి పదవులపై బంధించుట, లేక నియుక్త మొనర్చుటయని యగును. ఉదా:- స్రాక్త్యమణి సంబంధములో

**స్రాక్త్యేన మణినా ఋషిణేవ మనీషిణా ।**

**అజైషం సర్వాః పృతనా విమృథో హన్తి రక్షసః** ॥ అథ . ౮-౫ ॥

అనగా; ఋషి, మరియు తత్త్వ జ్ఞాని వంటి ఏ బుద్ధిశాలియైన ఈ స్రాక్త్య మణి ద్వారా నేను వారితో గూడ శత్రువుల సమస్త సేనలపై విజయము సాధించగలను. మరియు హింసకులగు శత్రు రాక్షసులను నాశమొనర్తును. ఇచ్చట వచ్చిన స్రాక్త్య శబ్దమునకు అర్థము ౨-౧౧-౧ మంత్రమునను సరించి వీరుని సంబోధించి చెప్పినట్లు స్పష్టపడగలదు.

**స్రక్త్యోఽసి ప్రతి సరోఽసి ప్రత్యభిచరణోఽసి ।**

అనగా; నీవు (స్రక్త్యోఽసి) గతిశీలుడవు (ప్రతిసరోఽసి) శత్రువులనెదిరించుటలో నీవు సమర్థుడవు. (ప్రతిచరణోఽసి) నీవు నీ శత్రువులపై ఆక్రమణ మొనర్చి విజయుడవు కాగలవు. అందుకొరకే దిగువ యాదేశము గలదు.

**ప్రతి తం అభిచర యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః ॥**

అనగా; మమ్ము ఎవరు ద్వేషింతురో, ఆ కారణమున మేమెవరిని ద్వేషింతుమో వారిపై నీవు ఆక్రమణ మొనర్చుము. అట్టి ప్రగతి శీలుడగు వీర శిరోమణి నుద్దేశించి ముఖ్యముగా స్రాక్త్యమణి శబ్ద ప్రయోగ మీ సూక్తమునందు గలదు.

ఇదే విధముగా ఇతర అనేక సూక్తములందును నరమణి, లేక వీర శిరోమణి కొరకు మణి శబ్ద ప్రయోగము గలదు. ఇంతియే గాక పై యర్థములు పొసగని చోట దిగువ అర్థమును జేసికొనుట ఉచితము. ఆయుర్వేద గ్రంథములందును వేదముల యాధారముపైనను వీని నిరూపణ గలదు. విస్తార భయముచే ప్రతి దానికి ప్రమాణములిచ్చుట సంభవముగాదు. ఈ విషయమున విస్తార పరిచయము చేసికొనదలచిన వారు శ్రీ.

పం. ప్రియరత్న ఆర్ష గారు (ఇప్పుడు స్వామి బ్రహ్మముని పరివ్రాజక్ గారు) రచించిన 'అథర్వ వేదీయ చికిత్సా శాస్త్రము' (ఢిల్లీ సార్వదేశిక సభ ద్వారా ప్రకాశితము) మరియు 'వైదిక మంత్ర విద్య (కాంగ్డీ గురుకులము ద్వారా ప్రకాశితము) ఈ రెండు గ్రంథముల నవశ్యముగా చదువ వలయును.

**౧. అంజనమణి :-** తాత్పర్యమేమన; అంజనము, లేక 'సుర్మా' తో చేయబడిన వటకము, లేక మాత్ర. దీనిని ఉచిత రూపములో ప్రయోగించి అనేక నేత్ర వ్యాధులను దొలగించవచ్చును. అథర్వ వేదములో స్పష్టముగా ఇట్లు కలదు.

**'అథో అసి జీవభోజనం అథో హరితభేషజమ్'** ॥ అథ. ౪-౯-౩ ॥

అనగా; ఈ యంజనమణి జీవధారులకు పుష్టిని గలిగించి ధారణ శక్తిని గలిగించును. మరియునిది హరిత రోగ (పాండువు, కామలా) వ్యాధికి చక్కని ఔషధము.

ఇచ్చట భేషజ శబ్ద ప్రయోగముచే ఇది ఆయుర్వేద విజ్ఞానముతో సంబంధించినదేగాని మాయమంత్రములకు సంబంధించినది గాదని స్పష్టమగుచున్నది గదా!

**౨. శంఖమణి :-** ఈ విషయము అథర్వ. ౪-౧౦-౩ లో

**శంఖో నో విశ్వభేషజః కృశనః పాత్వంహసః** ॥ అథ. ౪-౧౦-౩॥

అనగా; ఇది ముత్యము జాతికి సంబంధించిన శంఖము అనేక రోగములను దొలగించు సమర్థత గలిగియున్నది. అది మనను (అంహసః) వ్యాధి, మరియు పాపజన్య దుఃఖములనుండి రక్షించుగాక. **'అంహః'** శబ్దమునకు పాపమనియే అర్థమగును. ఐనను ఉణాదికోశము ౪-౨౧౩ **'అమేర్హుక్ చ'** ను అనుసరించి నిమ్న వ్యుత్పత్త్యర్థమగును.

**'అమన్తి ప్రాప్నువన్తి దుఃఖం యేన తత్ అంహః'** ॥ ఉ.కో. ౪-౨౧౩ ॥

ఎద్దాని వల్ల దుఃఖ ప్రాప్తి గలుగునో, మరియు రోగ ప్రాప్తి గలుగునో దానివలన కూడ అంహః అను ప్రయోగము వచ్చును. కావుననే ఈ సూక్తమునందు ఇది రెండుసార్లు వచ్చినది.

**౩. జంగిడ మణి :-** ౨-౪, మరియు ౧౯-౩౪, ౩౫లో జంగిడమణి శబ్దము సోమమునకు ముఖ్యముగా ప్రయోగింపబడినది. **జఙ్గిడో నామక కశ్చిదోషధివిశేషః స చోత్తర దేశే ప్రసిద్ధః** ఇట్లని చతుర్వేద భాష్యకారుడగు సాయణాచార్యుడు (అథ. ౧౯-౩౪-౧) భాష్యమునందు వ్రాసినాడు. అథర్వ వేద 'బృహత్సర్వానుక్రమణి' లో అం.౨-౪లో ఇట్లు వ్రాసినాడు.

**దీర్ఘాయుత్వాయ ఇతి చాన్ద్రమసమ్ ఉత జఙ్గిడదేవతాకమ్॥**

అథర్వ బృహత్సర్వానుక్రమణి యందు ౧౯-౩౪లో ఇట్లు వ్రాయబడినది.

**జఙ్గిడోఽసి జఙ్గిడ ఇతి ద్వే ప్రథమం దశకం ద్వితీయం పఞ్చకమఙ్గిర ఉభే మన్త్రోక్త దేవత్యే ఉత వానస్పత్యే ॥**

ఇదే విధముగా అథర్వ. కాం.౧౯ సూ.౩౪లో **'జంగిడ'** వనస్పతి మరియు ఓషధి యను పేరుతో పిలువబడినది.

**ఉగ్ర ఇత్ తే వనస్పత ఇన్ద్ర ఓజ్మాన మాదధౌ ।**

**అమీవాః సర్వాశ్చాతయన్ జహి రక్షాంస్యోషధే** ॥ అథ. ౧౯ - ౩౪ ॥

చంద్ర మరియు సోమ అను శబ్దములు పర్యాయ వాచకములు. చంద్ర వాచక నామములన్నియు **'సోమ'** మను ఓషధికి కూడ కలవు. 'చన్ద్రమాః సోమలతా భేదే' (వైద్యక శబ్ద సిన్ధుః)

**అంశుమాన్ ముంజవాన్శ్చైవ, చన్ద్రమా రజతప్రభః ।**

**ఏతే సోమాః సమాఖ్యాతాః వేదోక్తైర్నామభిః శుభైః** ॥ సుశ్రుత చికి. స్థానము ౨౯ - ౩ - ౬॥

ఈ విధమగు ప్రమాణములచే ఈ విషయము స్పష్టమగుచున్నది. కావున జంగిడ సోమౌషధి పేరేయని దృఢమగుచున్నది. అథర్వ కా.౧౯, సూక్త ౩౪, ౩౫లో

**ఆశరీకం విశరీకం బలాసం పృష్ట్యామయమ్ ।**

**తక్మానం విశ్వశారదమరసాం జఙ్గిడస్కరత్** ॥ అథ. ౧౯ - ౩౪ - ౧౦॥

మున్నగు మంత్రముల ద్వారా సోమరస రూప జంగిడను విషదోషనాశకము, కృత్రిమ విషక్రియలను దొలగించునది, శరీర అంగములందు సంభవించు అనేక వ్యాధులను, కఫ రోగము, పార్శ్వ పీడ, జ్వరాదులు, శరీర శిథిలత్వము, హృదయ రోగములు, నేత్ర వ్యాధులు, మరియు అనేక కఠిన వ్యాధులను దొలగించునదని, ఆరోగ్య దాయకము, ఆయుర్వర్ధక మని చెప్పబడినది. ఇది వరకు తెలిపిన ౯వ మంత్రమునందు వలె ఇది వనస్పతి మరియు ఓషధిగా ప్రయోగింపబడునది. అథ. ౧౯ - ౩౫ - ౧, ౫లో దానికి భేషజము, మరియు విశ్వభేషజ శబ్దము ప్రయోగించబడినది. దీనివల్ల స్పష్టమగునదేమన; అదియొక అత్యుత్తమ మగు ఔషధము.

**ఇన్ద్రస్య నామ గృహ్ణన్త ఋషయో జఙ్గిడం యదుః ।**

**దేవా యం చక్రుర్భేషజమగ్రే విష్కన్ధదూషణమ్** ॥ అథ. ౧౯ - ౩౫ - ౧ ॥

**య ఋష్ణవో దేవకృతా య ఉతో వవృతేఽన్యః ।**

**సర్వాంస్తాన్ విశ్వ భేషజోఽరసాం జఙ్గిడస్కరత్** ॥ అథ. ౧౯ - ౩౫ - ౫ ॥

జంగిడి యను ఓషధి సేవనము ఆయుర్వేదముతో వైద్యక విద్యతో సంబంధము గలిగియున్నది. ఇందు యంత్ర తంత్ర విషయ మెచ్చటను లేదు. ఆశ్చర్య మేమన; విద్వాంసులగు వారు ఓషధి, వనస్పతి, భేషజము, విశ్వభేషజము మున్నగు స్పష్టమగు పేర్ల ప్రయోగమును జూచుచును జంగిడ మున్నగువానిని మాయమంత్రములతో సంబంధము గలవని ఎట్లు విశ్వసించినారో!

౪. **పర్ణమణి** - సోమ - అథర్వ ౩ - ౫లో పర్ణమణి యొక్క వర్ణన గలదు. శతపథ బ్రా. ౬ - ౫ - ౧ - ౧ ననుసరించి పర్ణ అనునది సోమము పేరు. **'సోమో వై పర్ణః'**

ఈ సూక్తమునందే ౧౯-౩౫-౪వ మంత్రమునం దిట్లు కలదు.

**సోమస్య పర్ణః సహ ఉగ్రమాగన్నింద్రేణ దత్తో వరుణేన శిష్టః।**

**తం ప్రియాసం బహురోచమానో దీర్ఘాయుత్వాయ శత శారదాయ।**

ఇచ్చట సోమముతో పర్ణమణి యొక్క సంబంధము అతి స్పష్టముగా గలదు. జంగిడ మణి సోమము యొక్క రసక్రియ యొక్క గుటిక ( మాత్ర) యే ఐయున్నది. పర్ణమణి కేవలము ఆకుల రూపముననే యుండును.

**ఓజో దేవానాం పయ ఓషధీనాం వర్చసా మా జిన్వత్వ ప్రయుచ్ఛన్॥**

ఈ ఒకటవ మంత్రములో ఓషధుల పయః అనగా రసమనియును నిర్దేశించబడినది. ఈ విధముగా ఈ పర్ణమణి పత్రముల రూపము గల వానిని సేవించినట్లైన ఆయుర్వర్ధకము, మరియు వ్యాధిరహితముగా నుండగలరు.

**పర్ణోఽసి తనూపానః సయోనిర్వీరో వీరేణ మయా।**

**సంవత్సరస్య తేజసా తేన బధ్నామి త్వామణే॥౮॥**

ఈ ఎనిమిదవ మంత్రములో పర్ణమణిని **'తనూపానః'** శరీర రక్షణ మొనర్చునదనియు, వీర్య వర్ధకమనియు చెప్పబడినది.

ఏష వై సంవత్సరో య ఏష తపతి ॥శతపథ. ౧౪-౧-౧-౧౭॥

దీనిననుసరించి సంవత్సర మనగా సూర్యుడు. ఆతని తేజము కొరకు పర్ణమణిని ( సోమమును) సేవించుట కిందు విధానము గలదు.

**మయి క్షత్రం పర్ణమణే మయి ధారయాద్ రయిమ్।**

**అహం రాష్ట్రస్యాభీవర్గే నిజో భూయా సముత్తమః॥౨॥'**

**పర్ణమణి అనగా;** సోమమును సేవించుట వల్ల క్షాత్రబలము, జ్ఞానము మున్నగు ఐశ్వర్యములు వృద్ధి యగుననియు మరియు ప్రభావశీలురు కాగలరనియు తెలియుచున్నది. ఇదే విధముగా వైద్యకగ్రంథములందును చూపబడినది.

సుశ్రుత చికిత్సా స్థానము ౨౯-౧౯-౨౪ నందిట్లు వ్రాయబడియున్నది.

**ఓషధీనాం పతిం సోమం, ఉపయుజ్య విచక్షణః**

**దశవర్షసహస్రాణి, నవాం ధారయతే తనుమ్।**

**నాగ్నిర్న తోయం న విషం, న శస్త్రం, నాస్త్రమేవ చ।**

**తస్యాలమాయుః క్షపణే, సమర్థాశ్చ భవన్తి హి।**

**సాఙ్గోపాఙ్గాంశ్చ నిఖిలాన్, వేదాన్ విన్దతి తత్వతః ॥**

అనగా; ఓషధులకు నాయకుడు ఈ సోమమును సేవించువాడు గొప్ప దీర్ఘాయువు గలవాడగును. అగ్ని, జలము, విషము, అస్త్రము, శస్త్రములకు ఆతనిపై ఆయువును క్షీణింపజేయు ప్రభావముండ జాలదు. ఆతడు వేదములను సాంగోపాంగముగా అవగాహన మొనర్చు కొనుట యందు సమర్థవంతుడగును - మున్నగునవి.

**10.16 శతవారమణి వివేచనము - (ఋషభక ఓషధి)**

**శతవారో అనీనశద్ యక్ష్మాన్ రక్షాంసి తేజసా ।**

**ఆరోహన్ వర్చసా సహ మణిర్దుర్ణామచాతనః** ॥ అథర్వ. ౧౯-౩౬-౧ ॥

**అనగా;** నీ శతవారమణి తన తేజముతో, మరియు (రక్షాంసి) **'రక్షితవ్యమస్మాదితి రక్షః'** ఏ క్రిముల నుండి మనము జాగ్రత్త పడవలసియుండునో అట్టి భయంకర రోగక్రిములను నశింపజేయును. ఇది మనుష్యులను తేజోవంతులనుగా జేయగలదు.

**యే యక్ష్మాసో అర్భకా మహాన్తో యే చ శబ్దినః ।**

**సర్వాన్ దుర్ణామహా మణిః శతవారో అనీనశత్** ॥ అథ. ౧౯-౩౬-౩ ॥

అనగా, ఏవి (అర్భకాః యక్ష్మాసః) చిన్న రోగములు కలవో మరియు ఏవి (మహాన్తః) పెద్ద వ్యాధులో, మరియు (శబ్దినః) శబ్దమొనర్చు వదరుట వంటి రోగములో వాని నన్నిటిని ఈ శతవారమణి నాశమొనర్చును. ఈ శతవారమణికి ఆయుర్వేద గ్రంథములందీయబడిన నామనిర్దేశము కూడా ఈ సూక్తము యొక్క ఐదవ మంత్రమునందు గలదు. దానినిచ్చట చూపుచున్నాము.

**హిరణ్యశృఙ్గ ఋషభః శాతవారో అయం మణిః ।**

**దుర్ణామ్నః సర్వాంస్తృడఢ్వావా రక్షాంస్యక్రమీత్ ॥**

ఇచ్చట ఋషభ శబ్ద ప్రయోగము ఈ శాతవార ఓషధి కొరకేయై యున్నది. దీనిని **'మనుష్యేభ్యో రోగస్తంభక,'** లేక రోగ నివారక మగుట వల్ల **'మణి'** యను పేరుతో గూడా పిలువబడినది. ఈ ఋషభకము యొక్క విశేషణము. **'హిరణ్య శృఙ్గః'** అని ఈయబడినది. దీనియర్థము 'బంగారు అగ్రభాగ' ము గలదని యగును. శృఙ్గాభ్యాంరక్షోనుదతే ॥ మం.౨॥ లో కూడా దానికి శృంగములని నిర్దేశము గలదు. ఇట్టి ఓషధి పేరు ఆయుర్వేద గ్రంథములలో **'ఋషభ'** మని యున్నది. రాజనిఘంటువు నందు దాని పర్యాయ శబ్దమిట్లున్నది.

**ఋషభో గోపతిర్ధీరో, విషాణీ దుర్ధరో వృషః ।**

**కకుద్మాన్ పుంగవో వోఢా, శృఙ్గీ ధుర్యశ్చ భూపతిః ॥**

**విషాణీ**, శృంగీ అను పేర్లతో చూపబడినది. భావ ప్రకాశ నిఘంటువు నందు దాని వర్ణన మొనర్చుచు అది ఎద్దు కొమ్ముల వంటి ఆకారము గలదని చెప్పబడినది.

**జీవకర్షభౌ జ్ఞేయౌ, హిమాద్రిశిఖరోద్భవౌ।**

**రసోనకన్దవత్ కన్దౌ, నిస్సారౌ సూక్ష్మపత్రకౌ ॥**

**జీవకః కూర్చికాకారః ఋషభో వృషశృఙ్గవత్।**

ఈ ఋషభ ఓషధి ( మూలిక) ఇప్పుడు దుర్లభమని చెప్పబడుచున్నది. కాని ఇది సంపూర్ణముగా లభించదని కాదు. ఇప్పుడు సాధారణముగా లభించునట్టి **'సాలంమిశ్రి'** యనునదే ఋషభకము. ఈ విధముగా నీరెండింటి గుణము, ఆకారముల పరీక్షణము వల్ల తెలిసిపోయినది.

ఈ సూక్తమునందు ఋషభకరూప శతవారమణి క్షయవంటి కఠిన రోగములను, రక్తాదులను భక్షించు క్రిములను, గర్భ సంబంధముగు గుప్త వ్యాధులను, జ్వరము మున్నగు పురాణ వ్యాధులను నివారించునది, మరియు సంతానోత్పత్తి శక్తిని పెంపొందించునది యని చెప్పబడినది. వైద్య గ్రంథములందిట్టి గుణమునే ఋషభక మూలికకు గూడా చూపబడినది. నిఘంటు రత్నము నందిట్లు గలదు.

**ఋషభకో మధుః శీతో గర్భసన్తానకారకః।**

**శుక్రధాతుకఫానాం చ, కారకో బలదాయకః।**

**వృష్యః పుష్టికరః ప్రోక్తః, పిత్తరక్తాతిసారజిత్।**

**రక్తరుక్ కృశతా వాత జ్వర దాహక్షయాపహః।**

ఇచ్చట వేదములందలి శతవారమణి వలెనే ఋషభకమును గర్భధారకము, మరియు సంతాన కారకము, బలవీర్య వర్ధకము, రక్త వికారము, జ్వరము, దాహము, క్షయ మున్నగు వానిని నాశమొనర్చునది యని పేర్కొనబడినది. దీనియందు, మరియు ఇతర సూక్తములందును ఏ రక్షాంసి, లేక రాక్షస, గంధర్వ, అప్సరసల శబ్దములు వచ్చియున్నవో వాని తాత్పర్యము భూత, ప్రేత, పిశాచాదులు గాదు. ఇవి రోగోత్పాదములగు క్రిములను విషయమును చక్కగా దెలిసికొనవలెను. రక్షాంసి, లేక రాక్షసులను విషయములో 'కాషీతకీ బ్రాహ్మణము ౧౦-౪లో ఇట్లు గలదు. ''అసృగ్భాజాని హ వై రక్షాంసి'' అనగా; రక్తమును ద్రావి జీవించు క్రిములు రక్షాంసి, లేక రాక్షసులని పేర్కొనబడినవి. శతపథ బ్రాహ్మణ ౧౦-౫-౨-౨౦ ననుసరించి

**''గన్ధ ఇత్యప్సరస ఉపాసతే''** అనగా వాసనవచ్చు స్థానములందుండు సూక్ష్మ క్రిములను అప్సరలని యందురు. ఈ సూక్ష్మ క్రిములు రోజా (గులాబీ) వంటి సుగంధిత పుష్పములందుండును. పూలుగోసి వెంటనే ముక్కు సమీపమున నుంచి వాసన పీల్చిన తోడనే నాసికానాళము లందు చొచ్చుకొని పోయి మస్తిష్కమునందు జేరి పలురోగముల నుత్పన్న మొనర్చును.

**గంధర్వక్రిమి:– 'రూపమితి గంధర్వా ఉపాసతే** ॥ శత. బ్రా. ౧౦-౫-౨-౨౦॥

అనగా; రూపమును సేవించునట్టి, లేక రూపముపై పడిపోవు క్రిములను గంధర్వము లని యనెదరు.

**పిశాచక్రిమి :–** శబ్ద కల్పద్రుమ మందు పిశాచమును వర్ణించుచు ఇట్లు గలదు.

**పిశితం మాంసమ్, అశ్నాతీతి పిశాచః॥**

వాచస్పత్య బృహదభిధానములో **'పిశాచ'** శబ్ద నిరుక్తమొనర్చుచు ఇట్లు చెప్పబడినది

**పిశితం మాంసమ్ ఆచామతీతి పిశాచః ॥**

ఈ వ్యుత్పత్తులననుసరించి మాంసమునుదిను, లేక మాంసమును నాకివేయు క్రిములను గూడ పిశాచము లందురు. దిగువ అథ. ౫-౨౯-౫ మంత్రములో.

**యదస్య హృతం విహృతం యత్పరాభృతమ్ ఆత్మనో జగ్ధం యతమత్ పిశాచైః ।**

**తదగ్నే విద్వాన్ పునరాభరా త్వం శరీరే మాంసమసుమేరయామః ॥** అ.౫-౨౯-౫॥

ఈ మంత్రము ద్వారా పిశాచములన, మాంస భక్షకములు, మాంసమును నాకునట్టి సూక్ష్మ క్రిములను అర్థమును సంపూర్ణముగా బలపరచుచున్నది పిశాచ క్రిములు మనుష్యుని మాంసమును నాకివేయుట, పీకివేయుట, శరీరము నుండి వేరు చేసి తినివేసినచో ఆ శరీరమందు ఈ మూలిక ద్వారా అగ్నిని నింపి - గాయములను నింపి స్వాస్థ్యమును గలిగించవలెను.

ఈ విధముగా రాక్షస, అప్సర, గన్ధర్వ, పిశాచాది రోగోత్పాదక సూక్ష్మ జంతువులు, లేక క్రిములు ఋషభక, లేక శాతవారమణి ఓషధుల ప్రయోగముచే నశించి మనుష్యులకు ఆరోగ్యము గలుగునని స్పష్టమగుచున్నది ఈ విషయము గారడి, చేతబడి, మంత్ర తంత్రములకు సంబంధించినది గాదు.

**వరణ మణి :-** అథర్వ. ౧౦-3 లో వరణ మణిని గూర్చిన వర్ణన గలదు. ఈ సూక్తము నందలి మూడవ మంత్రములో వరణమణి **'విశ్వభేషజః'** అనగా, సకల వ్యాధుల నివారకౌషధ మని చెప్పబడియున్నది.

**అయం మణిర్వరణో విశ్వ భేషజః** ॥ అథ. ౧౦-3 ॥

**తతో నో వారయిష్యతేఽయం దేవో వనస్పతిః** ॥ అథ.౧౦-3-౧॥

ఇది వ్యాధినివారక వనస్పతియని చెప్పబడినది.

**అయం మే వరణ ఉరసి రాజా దేవో వనస్పతిః ।**

**స మే శత్రూన్ వి బాధతామ్ ఇన్ద్రో దస్యూనివాసురాన్** ॥ అ. ౧౦-3-౧౧॥

ఈ శబ్దముల ద్వారా వరణమును వనస్పతి యని సంబోధన మొనర్చుచు దానిని వక్షమునకు అభ్రకమువలె కవచము జేసికొని ధరించవలెనని నిర్దేశించబడినది. ఇది హృద్రోగములను దూరమొనర్చును. ౫వ మంత్రమందును వరణమునకు వనస్పతి శబ్దమును ప్రయోగించుచు ఇది రోగనాశకమని స్పష్టపరచబడినది.

**వరణో వారయాతా అయం దేవో వనస్పతిః ।**

**యక్ష్మో యో అస్మిన్నావిష్టస్తము దేవా అధారయన్** ॥ అ.౧౦-3-౫॥

ఈ వర్ణనలన్నిటిని జూడ వరణమను పేరుగల ఒక వనస్పతివని స్పష్టమగుచున్నది. దీనిని వ్యావహారిక భాషలో **'వరనా'** మరియు ఆయుర్వేద గ్రంథము లందు దీనిపేరు వరుణ, మరియు వరణయని గలదు. భావప్రకాశ నిఘంటువులో

**''వరుణో వరణః సేతుః, తిక్తశాకః కుమారకః''**

నిఘంటు రత్నములో దాని గుణములిట్లు వర్ణింపబడియున్నవి.

**వరుణః క్రిమీన్ రక్తదోషం శీర్షవాతం మూత్రాఘాతం చ హృద్రుజమ్ ।**

**హృద్ రోగం నాశయత్యేవ ॥**

అనగా; ఈ వరుణ, లేక వరణ కృమి, రక్త దోషములు, శిరోవాతములు, మూత్ర దోషములు, హృద్రోగములు మున్నగువానిని దొలగించగలదు. రోగ స్తంభకమగుట చేతనే ఇది మణియను పేరుతో బిలువబడినది. ఎట్లన; **'మన-స్తంభే'** యాధారముపై ఇది వరకు చెప్పబడియుండెను. దీని ప్రయోగము లేత చిగురుల రసము వస్త్రమునకు పట్టించి పట్టీవలె వేయవలెను. ఓషధీ రూపములో మాత్రలుగా జేసి సేవించవలయును. ఇట్టి ప్రయోగముల వలన చాల లాభముండును. దీనియందును మంత్ర తంత్రములు లేవు.

వైద్య మొనర్చువారు ఈ వనస్పతి వంటివాటిని అజ్ఞానము, భయము మున్నగు వానిని నివారించు **'నరమణు'** లను గూడా **'వరణ'** మని పేరుతో బిలుచుకొననచ్చును.

### 10.17 దర్భమణి (అభ్రకము)

అథర్వ. ౧౯-౨౮, ౨౯-30-3౨ లందు దర్భమణి వర్ణనము గలదు. 3౨-౧ యందు ఈ విధముగా స్పష్ట పరచబడియున్నది. **'దర్భో య ఉగ్ర ఓషధిః'** అనగా దర్భ ఒక ఉగ్రమగు ఓషధి. 3౨-3లో **'దర్భ'** కొరకు **'దివి తే తూలమోషధే'** అని ఓషధి శబ్ద ప్రయోగము వచ్చినది. 3౨-౧౦లో నిది ఓషధులందు శ్రేష్ఠము, రక్షకము, అని గలదు.

**'సపత్నహా శతకాణ్డః సహస్వాన్ ఓషధీనాం ప్రథమః సం బభూవ ।**

**స నోఽయం దర్భః పరిపాతు విశ్వతః' ॥**

ఈ ప్రకారముగా ఇది ఓషధీ రూపమని స్పష్టమగుచున్నది. ఈ దర్భ శబ్దమిచ్చట కుశ, తృణము, గడ్డి వాచకములు గావనియు స్పష్టమగుచున్నది. ఇది **'దృదలిభ్యాం భః'**॥ ఉణాదికోశము 3-౧౫౧ ॥ చే నిది సిద్ధించుచున్నది. మరియు నిది రోగములు, మరియు శత్రువులను ఛిన్నా భిన్నమొనర్చునట్టి ఏదోయొక వజ్ర రూప వస్తువునకు ప్రయుక్తమగుచున్నది. రాజనిఘంటువు ౨3లో దర్భ వజ్ర వాచకముగా కూడా జూపబడినది. **'దర్భో చ కుశికే వజ్రమ్'** అభ్రకము కూడా వజ్రమను పేరుతో పిలువబడినది.

**నీలాభ్రం దర్దురో నాగః పినాకో వజ్ర ఇత్యపి** ॥ రాజనిఘంటువు. వ.౨3॥

దర్భ శబ్దమీ సూక్తము లందు అధికముగా అభ్రక వాచకముగా నున్నది. దీని గుణములకు ఆయుర్వేదమందు ఈ సూక్తములో వర్ణించబడిన గుణములకు చక్కని సామ్యము గలదు.

అ. అథర్వ ౧౯-౧౦-౧లో దర్భ విషయములో ఇట్లు వ్రాయబడియున్నది. **'ఇమం బధ్నామి తే మణిం దీర్ఘాయుత్వాయ తేజసే'**, భావప్రకాశ నిఘంటువు నందును అభ్రకము **'అభ్రం కషాయం మధురం శ్రశీతం, ఆయుఃకరం, ధాతువివర్ధనం చ'** మున్నగు వాని ద్వారా ఆయుర్వర్ధకమని తెలుపబడినది.

ఆ. అథర్వ. ౧౯-౩౩-४లో ధర్భ విషయములో **'బధ్నామి జరసే స్వస్తయే'** । అనియు, భావ ప్రకాశ నిఘంటువు నందు అభ్రక విషయములో **'దృడయతి వపుః'** అనగా; అభ్రకము శరీరమును దృఢముగా నొనర్చు ననియును వ్రాయబడినది.

ఇ. అథర్వ ౧౯-౩౨-౧లో దర్భ విషయమున **'సహస్రపర్ణ ఉత్తిరః'** వేలాది పర్ణములు గలది. ఈ విషయమే శాలిగ్రామ నిఘంటువు నందు అభ్రక విషయములో **'అభ్రకం.... అబ్దం వ్యోమఘనం, శుభ్రం, బహుపత్రం ఘనాహ్వాయమ్'**

ఈ బహు పత్రమను శబ్దము **'సహస్రపర్ణ'** కు అనువాదమే.

ఈ. **'దర్భేణ దేవజాతేన దివిష్టమ్భేన శశ్వదిత్'** ॥ అథ ౧౯-౩౨-౭లో ఇట్లు గలదు.

ఇచ్చట దీనిని ద్యులోకమునందు స్తంభింపబడినది అనగా; వ్రేలాడబడినది అని చెప్పబడినది. ఈ విషయమే భావప్రకాశ నిఘంటువులో అభ్రక విషయక వర్ణననుం దిట్లున్నది.

**గగనాత్ స్ఖలితం యస్మాద్, గగనం చ తతో మతమ్॥**

ఇదే విధముగా అనేక ఇతర విషయములందును సమానత్వము గలదు. దీనివల్ల వైదిక దభ్ర శబ్దము భౌతిక దృష్టితో ఆయుర్వేదోక్త అభ్రక వాచకమే. దీనిని కవచ రూపములో ధరించుటకు, ఓడలందు గాజు ( అద్దము) ల స్థానములో బిగించుటకు, మరియు వజ్ర రూపములో నుండుటచే అస్త్రశస్త్రాదుల నిర్మాణ యోగము లందు గలుపుట వల్లను ఇది సంగ్రామము మున్నగు వాని యందుపయోగింపబడును. భావప్రకాశ నిఘంటువు నందు దర్దుర జాతి అభ్రక విషయమునందిట్లు వ్రాయబడియున్నది.

**దర్దురం త్వగ్నినిక్షిప్తం, కురుతే దర్దురధ్వనిమ్ ।**

**గోలకాన్ బహుశః కృత్వా, స స్యాన్మృత్యుప్రదాయకః ।**

ఈ దర్దుర జాతి అభ్రకమును అగ్నియందు వేసినచో అది గడగడయను ధ్వనిని గలిగించును. దీనిని పెద్ద పెద్ద ఫిరంగి గుండ్లుగా జేసి ప్రత్యర్థులను మృత్యులోకమునకు బంపవచ్చును. ఇట్టి స్థితియందు ఈ యభ్రకమును యుద్ధములలో అత్యంతోపయోగ మని తెలుపుట, దానిచే నిర్మించబడిన కవచములను ధరించుట పూర్తిగా ఉచితమే.

ఈ విధముగా అథ. ౧౯-౩౨లో వర్ణించబడిన ఔదుంబరమణి మేడి సమూహవాచకము, ఫాలమణి కృషి వాచక, మరియు అస్తృతమణి వ్యాఘ్రనఖము (పులిగోరు) ను తాపిన శస్త్రము వ్యాఘ్రనఖాది వాచకములు. ఇట్లు వివేచనమొనర్చుటచే జ్ఞానము గలుగును. గ్రంథ విస్తరణ భీతిచే మణి బంధ విషయమింతటితో విరమింతుము.

శరీర రక్షణము, మరియు ఆరోగ్య దృష్టితో ఈ మణులను ధారణమొనర్చుటను గూర్చి వర్ణింపబడినది. సుశ్రుత సూత్ర స్థానము అ.౪౬లో సువర్ణాది వర్గములం దిట్లుగలదు.

**ముక్తావిద్రుమవ జ్రేన్ద్ర వైడూర్య స్ఫటికాదయః ।**

**చక్షుష్యా మణయః శీతా లేఖనా విషసూదనాః ॥**

**పవిత్రా ధారణీయాశ్చ, పాపలక్ష్మీమలాపహాః ॥**

అనగా; ముత్తెములు, పగడములు, వజ్రములు, వైడూర్యములు, స్ఫటికములు మున్నగు మణులను ధరించుటవల్ల నేత్రముల వేడిని బో(ద్రో)లి, వాని శక్తిని వృద్ధిపరచును. మనస్సునందు పవిత్రతను గలిగించి అందము నభివృద్ధి పరచును. విషములను హరించును. దీనియందును గారడీ మాయ మంత్ర తంత్రముల విషయ మేదియును లేదు.

## 10.18 కృత్యా మరియు అభిచారము

కృత్యా శబ్దము **'కృఞ్' – హింసాయామ్'** అను ధాతువుచే సిద్ధమైనది. దీనియర్థము శత్రువులను, శత్రు సైన్యములను హింసాక్రియల ద్వారా మట్టు బెట్టుటకు ప్రయోగింప బడుటయని-

అభిచార ప్రయోగము వలన అది శత్రువుల శరీరమందు చేరి వారిని రోగగ్రస్తుల నొనర్చి చంపివేయుట యందు సమర్థత గలిగియుండును. శబ్ద కల్ప ద్రుమ మందు అభిచారమునకీ యర్థమున్నది. **'అభిచారః ఆభిముఖ్యేన శత్రువధార్థం చారః కార్యకరణమ్'** అనగా శత్రువులను నాశమొనర్చు కార్యములందు అది ఆక్రమణ రూపమున గాని, ఇతర రూపమునందుగాని కృత్యా, మరియు అభిచార సంబంధము యుద్ధ విద్యతో గూడియున్నది. కావున అట్టి వాని సంబంధములో విశేష జ్ఞానము క్షత్రియుల (సైనికుల) కుండవలెను. కౌటిల్య అర్థ శాస్త్రము నందు పురోహితుల విషయములో ఇట్లు వ్రాయబడియున్నది.

**పురోహితపురుషాః కృత్యాభిచారం బ్రూయుః ।**

అనగా; పురోహితుడు రాజు, మరియు పరివారమునకు కృత్యా, మరియు అభిచారముల విషయములో ఆవశ్యక విషయము లన్నింటిని చక్కగా బోధింపవలయును. అథర్వ౦-౫-౫ ఆధారముతోనే కౌటిల్యాచార్యుడు ఈ విషయమును తన గ్రంథమునందు వ్రాసియున్నట్లు దెలియుచున్నది. ఆ మంత్రములో

**తే మే దేవాః పురోహితాః ప్రతీచీః కృత్యాః ప్రతిసరైరజన్తు ।** ॥ అ.౦-౫-౫ ॥

అనగా; విద్వాంసుడగు పురోహితుడు శత్రువుల ద్వారా ప్రయోగింపబడిన హింసక క్రియలకు ప్రతీకార మొనర్చవలయును. ఈ కృత్యాదుల నివారణమునకై అనేక ఓషధులను, మణుల ననుభవింప జేయవలె ననియును చూపబడినది. ఉదాహరణార్థము అ.౧౯-౩౪-౪లో జంగిడమణి, లేక సోమ విషయమునందిట్లు గలదు.

**'కృత్యా దూషణ ఏ వాయమథో అరాతి దూషణః ।**

**అథో సహస్వాన్ జఙ్గిడః ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥**

**కృత్యాదూషిరయం మణిరథో అరాతిదూషిః ।**

**అథో సహస్వాన్ జఙ్గిడః ప్రణ ఆయూంషి తారిషత్ ॥**

అనగా; ఈ సోమ, కృత్యల హింసక క్రియలను నాశమొనర్చు, మరియు ఆయుర్వర్ధకములు నగు ఓషధులను అధర్వ. ౧-౭-౧౦ యందును చక్కగా వర్ణింపబడి యున్నది.

**ఉన్ముఞ్చన్తీర్వి వరుణా ఉగ్రా యా విషదూషణీః ।**

**అథో వలాసనాశనీః కృత్యా దూషణీశ్చ యాస్తా ఇహాయన్త్వోషధీః' ॥ అ.౧-౭-౧౦॥**

ఇచ్చట విషనాశకారి ఓషధులు కృత్యానాశనీ యనబడినవి. దీనివల్ల శత్రు సైన్యముల నాశమొనర్చుటకు అగ్ని జ్వాలల ద్వారా విష ఓషధులను, మరియు ఖనిజ పదార్థముల ప్రయోగమునకే కృత్యా యని తెలియుచున్నది

**అమా కృత్వా పాప్మానం యస్తేనాన్యం జిఘాంసతి ।**

**అశ్మానస్తస్యాం దగ్ధాయాం బహులాః ఫట్ కరిక్రతి ॥ అథర్వ. ౪-౧౮-౩॥**

ఈ మంత్రములో ఇట్లు తెలియుచున్నది. హింసారూప ప్రయోగమును రహస్య స్థానము నందు సిద్ధ పరచుకొని హింసాకారక ప్రయోగము ద్వారా శత్రు నాశమొనర్చబడును. అట్టి కాలినట్టి కృత్యా యందు అనేక రకములగు మణిశిల, పొటాసియం మున్నగు శిలలను చూర్ణమొనర్చు ఫట్ శబ్దము పదే పదే లేక అత్యంత మొనర్చుచున్నది.

**యాః కృత్యా అఙ్గిరసీర్యాః కృత్యా ఆసురీర్యాః ।**

**కృత్యాః స్వయం కృతా యా ఉ చాన్యేభిరాభృతాః ॥ అథ. ౧-౨౮-౯ ॥**

ఇట్టి మంత్రముల ననుసరిచి ఈ కృత్యములు రెండు విధములని తెలుపబడినది ౧. అఙ్గిరసీ, స్ఫోటక పదార్థములచే నిండినది. ఇది పడిన గృహభవనాదులు ముక్కచెక్కలగును. మరొకటి విష వస్తువులతో గూడి మానవులను నాశమొనర్చి వేయుదానిని ఆసురీయందురు.

**అనయాహమోషధ్యా సర్వాః కృత్యా అదూదుషమ్ ।**

**యాం క్షేత్రే చక్రుర్యాం గోషు యాం వా తే పురుషేషు ॥ అథ. ౪-౧౮-౨॥**

క్షేత్రములందు, గోవులమందలందు, మానవ సమూహములందు, ఈ కృత్యా (హింసక క్రియ)ను ప్రయోగించినచో ఓషధుల ద్వారా నేను దానిని నిర్వీర్యమొనర్చి వేయుదును. అని ఈ మంత్రము ద్వారా చెప్పబడినది. ఇచ్చట మాయమంత్రముల ద్వారా గాక ఉత్తమ జంగిడ మున్నగు ఓషధుల ద్వారా కృత్యా వంటి విష ప్రయోగములను నష్టమొనర్చి వేయుదు' నని చెప్పబడినది.

**యత్ తే పితృభ్యో దదతో యజ్ఞే వా నామ జగృహిః ।**

**సన్దేశ్యాత్సర్వస్మాత్ పాపాదిమా ముఞ్చన్తు త్వౌషధీః ॥** అథ.౧౦-౧-౧౧॥

**దేవైనసాత్ పిత్ర్యాన్నామ గ్రహాత్ సందేశ్యాదభినిష్కృతాత్ ।**

**ముఞ్చన్తు త్వా వీరుధో వీర్యేణ బ్రహ్మణ ఋగ్భిః పయస ఋషీణామ్ ॥** అథర్వ. ౧౦-౧-౨౨ ॥

ఈ మంత్రములందు **ఓషధీః, వీరుధః** శబ్దముల ప్రయోగము ద్వారా కృత్యల మరియు ఘాతక క్రియల ప్రభావము నంతయును ఓషధుల ప్రయోగము ద్వారా మరియు ( బ్రహ్మణా) జ్ఞానాదుల ద్వారా దూరమొనర్చు ఉపదేశము గలదు. ఈ బ్రహ్మ శబ్దము ఇతర వేదముల వలె అథర్వ వేదమందును అనేక స్థలములందు వచ్చియున్నది. దీనియర్థము, పరమేశ్వరుడు, వేదము, లేక జ్ఞానమని యగును. కాని ఆశ్చర్య విషయ మేమన; **'బ్లూంఫీల్డు'** మున్నగు పాశ్చాత్య అనువాదకులు తమ అజ్ఞాన వశమున దీనియర్థము సర్వత్ర, *Charm* లేక గారడి ( జాదు) అని చేసినారు.

నిరపరాధులపై ఈ ఘాతక క్రియా ప్రయోగము సంపూర్ణముగా నిషిద్ధము. అది అతి భయంకర పరిణామము గలిగించునదై యుండును. కావున ఏమరుపాటున కూడా చేయవలదు. ఈ విషయము అథర్వ. ౧౦-౧-౨౯ లో,

**అనాగోహత్యా వై భీమా కృత్యే మా నో గామశ్వం పురుషం వధీః।**

**యత్ర యత్రాసి నిహితా తతస్త్వోత్థాపయామసి పర్ణాల్లఘీయసీ భవ ॥** అథర్వ. ౧౦-౧-౨౯ ॥

ఈ మంత్రము అత్యధిక మహత్వ పూర్ణమగు శబ్దముల ద్వారా హెచ్చరింప బడినది. వీనియందు గోవులను, అశ్వములను, మరియు నితర పశుసంపదలను, నిరపరాధ వ్యక్తులను ఈ ఘాతుక క్రియల ప్రయోగము ద్వారా నాశమొనర్చుట అతి భయంకర పరిణామమని దెలుపబడినది. అట్టి కృత్యాల ప్రతీకారమొనర్చుటయు అత్యావశ్యకమని తెలుపబడినది. ఈ ప్రకారము వీని ప్రయోగము రక్షాత్మకము, లేక *Defensive* ఐ యున్నది. స్వయముగా ఆక్రమణాత్మకము, లేక *Offensive* కాదు. ఇది ఈ మంత్రముల నిరంతరాధ్యయనము వల్ల స్పష్టపడగలదు. బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము, వైద్యుతాస్త్రము, సౌమ్యాస్త్రము, వాయవ్యాస్త్రము మున్నగు వాని ప్రయోగము. ఈ రక్షాత్మక భావము చేతనే **'కృత్యా'** నివారణార్థము చూపబడియున్నది. ఇదియును యుద్ధము మరియు శస్త్రా స్త్ర విద్యలతో సంబంధము గల విషయమే. దీని గారడి, చేతబడి, మంత్రతంత్రములు తాయెత్తు క్రియ *Charms, Amulets, Sorcery* మున్నగు పేర్లొసగి, వానినినమ్ముట గొప్ప అజ్ఞానము, మూర్ఖత్వమగును.

### 10.19 అభిచారము

అభిచారము యొక్క శబ్దార్థము ఎవరి శరీరముపైనను ఆక్రమణమొనర్చుట, లేక శరీరములో ప్రవేశించి, దానిని దినివేయుట వంటి విషప్రయోగము. దీనిని శబ్ద కల్పద్రుమము మున్నగు వాని యాధారముతో ఇది వరకు తెలుపబడినది. ఇట్టి హానికారక క్రియలనుండి తప్పుకొనుటకు రెండే ముఖ్య ఉపాయములు గలవు. వీనిని

ఉన్మోచనము మరియు ప్రమోచనములను నామములతో వేదము లందు పేర్కొనబడియున్నది. అథర్వ వేదమునందు.

**యత్ త్వాభిచేరుః పురుషః స్వో యదరణో జనః ।**

**ఉన్మోచనప్రమోచనే ఉభే వాచా వదామి తే ॥** అథర్వ. ౫-30-౨ ॥

తన సంబంధీయులు, లేక ఇతరులు ఏ అభిచార క్రియను ప్రయోగించినారో, దాని ప్రతీకారార్థము వైద్యుడ నగు నేను ఉన్మోచన, మరియు ప్రమోచన క్రియల నుపదేశమొనర్చెదను. ఉన్మోచన మనగా విషమయ పదార్థములను వమనము, మరియు విరేచనము ( వాంతి భేదు) ల ద్వారా వెలుపలకి నెట్టి వేయుట, మరియు నా విష ప్రభావమును ఘృతము, తేనె మున్నగు వాని ప్రయోగముచే లోలోపలనే శాంత మొనర్చివేయుట, సుశ్రుతకల్పస్థానము ౧-౭ ౫, ౭౬లో ఈయుపాయ వర్ణనము గలదు.

**మహాసుగన్ధమగదం యం ప్రవక్ష్యామి తం భిషక్ ।**

**పానాలేపననస్యేషు విదధీతాఞ్జనేషు చ ।**

**విరేచనాని తీక్ష్ణాని కుర్యాత్ప్రచ్ఛర్దనాని చ** ॥ సు.క.స్థా. ౧-౭౫-౭౬ ॥

అతి సుగంధితము, శీతలత్వము గల ఓషధులను ద్రాగించుట, లేపనమొనర్చుట, మరియు నస్యము, అంజనముల వంటి వైద్యక ఉపాయముల నొనర్పవలెను. విరేచనము ( భేది) మరియు ప్రచ్ఛర్దనము ( వాంతి లేక వమనము) ల ద్వారా విషమయ పదార్థములను బయటికి దీసి వేయవలెను.

ఈ రెండు క్రియలు, లేక వాని ప్రతీకార క్రియలు వైద్య విద్యతో సంబంధము గలవి. వీనికి కల్పితమగు తాంత్రిక గారడి మంత్ర తంత్రములతో ఎలాటి సంబంధమును లేదు. అథర్వ వేదములో గల ఓషధులు, సంకల్పములు, మార్జనములు, ఆదేశములు, మణిబంధన కృత్యా అభిచారముల ప్రతీకారమునకు సంబంధించిన వర్ణనలు సంపూర్ణముగా వైజ్ఞానిక, మనోవైజ్ఞానికములు. వానిని మంత్ర తంత్రములు, చేతబడులు, లేక *Charms, Amulets, or Sorcery* అని వేదములు చెప్పుచున్నట్లుగా వైదిక్ ఏజ్ లేఖకులు, బ్లూంఫీల్డు, హ్విట్నీ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు చెప్పుట వారి అవివేకము గాక మరేమగును?

## 10.20 బ్లూంఫీల్డు యొక్క భయంకరమైన పొరపాట్లు

బ్లూంఫీల్డు యొక్క అథర్వ వేద విషయక పుస్తకము 'వైదిక్ ఏజ్' లేఖకులకు అత్యంత ప్రామాణికమైనది. ఈ విషయములో స్వయముగా దానియందు గొప్ప అశుద్ధములు, అసత్యములు గలవు. బ్లూంఫీల్డు *Charm* శబ్దమును సంపూర్ణముగా అనావశ్యక రూపములో ప్రయోగ మొనర్చి వైదిక శిక్షల మహత్వమును కించపరచు ప్రయత్నమొనర్చినాడు. ఉదాహరణము;

*Hymns of the Atharvaveda by Bloomfield* లో అన్నిటికన్న ముందు అథర్వ వేదము ౫-౨౨ యొక్క అనువాదము నిచ్చుచు *Charm against Takman (fever) and related diseases* అను శీర్షిక

నిచ్చినాడు. ఐనప్పటికి ఇచ్చట బ్లూంఫీల్డు జ్వరాదుల చికిత్స ఓషధుల ద్వారా యని యుండినను తన అనువాదము నందు

*The Takman that is spotted, covered with spots, like reddish, sediment, him thou (O Plant) of un-remitting potency, drive away down below.*

ఇదే విధముగా ౧-౨౨లో పాండు రోగ చికిత్సను గురించిన వర్ణన గల చోట ఈ బ్లూంఫీల్డు దానికి క్రింది శీర్షిక నిచ్చినాడు.

*Charm against jaundice and related disease. P.7*

అనగా పాండు రోగము, తత్ సదృశమగు వ్యాధులకు విరుద్ధముగా గారడి

౬-౧౦౫లో కాస, లేక దగ్గు చికిత్స గురించిన వర్ణన యుండగా బ్లూంఫీల్డు దానికి **'పక్షపాతముతో'** *Charm against cough* అనగా దగ్గు అను దానికి విరుద్ధముగా గారడి అనుశీర్షిక నిచ్చినాడు.

ఇదే విధముగా అ. ౨-౮ యొక్క అనువాదమునిచ్చు బ్లూంఫీల్డు దాని కొసగిన శీర్షిక *Charm against hereditary disease* ఆ సూక్తమునందు వంశపరంపరాగత రోగముల చికిత్స గురించి స్పష్టమైన వర్ణన యున్నది. ఇది స్వయముగా బ్లూంఫీల్డు అనువాదముతోనే ఈ విషయము స్పష్టమగుచున్నది. 3వ మంత్రానువాదమును జూడుడు.

*With the straw of thy brown barley, endowed with white stalks, with the blossom of the sesame-may the Plant, destructive of Kshetriya (hereditary disease) shine the Kshetriya away.*

అ ౪-౧౭ యొక్క దేవత **అపామార్గో** వనస్పతిః. దీనియందు అపామార్గ (ఉత్తరేణు) పేరు గల ఓషధి గుణముల వర్ణన గలదు. మరియు ప్రథమ, ద్వితీయ, అష్టమ మంత్రములందు అపామార్గ పదముతో ఓషధి శబ్దము ప్రయోగించబడినది.

**ఈశానాం త్వా భేషజానాముజ్జేష ఆ రభామహే ।**

చక్రే సహస్రవీర్యా సర్వస్మా ఓషధే త్వా ॥ ౪.౧౭-౧ ॥

బ్లూంఫీల్డు దీని యనువాదము నిట్లు జేసియున్నాడు.

*We take hold, O Victorious one of thee, the mistress of remedies. I have made thee a thing of thousand fold strength for every one, O Plant.*

**సత్యజితం శపథయావనీం సహమానం పునః సరామ్ ।**

**సర్వాః సమహ్వ ఓషధీరితో నః పారయాదితి ॥ ౪.౧౭-౨॥**

దీనికి బ్లూంఫీల్డు జేసిన యనువాదమిట్లు న్నది.

*Her, the un-failingly victorious one, that wards off curses, that is powerful and defensive; (her and) all the plants have I assembled, intending that she shall save us from this trouble.*

**అపామార్గ ఓషధీనాం సర్వాసామేక ఇద్ వశీ।**

**తేన తే మృజ్మ ఆస్థితమథ త్వమగదశ్చర ॥ ౪.౧౭.౮ ॥**

దీనియనువాదము బ్లూంఫీల్డు జేసినదిట్లు గలదు.

*The apamarga is sole ruler over all plants, with it do we wipe mishap from thee; do thou then live exempt from disease.*

ఓషధుల పేర్లు మరియు వాని గుణ ధర్మములు ఈ విధముగ వర్ణించి యుండగా బ్లూంఫీల్డు దీని శీర్షికను ఈ క్రింది విధముగా నిర్ణయించినాడు.

*Charm with the apamarga plant, against sorcery, demons and enemies.*

అనగా అపామార్గ ఓషధి ద్వారా భూత, ప్రేత, రాక్షసులకు, మరియు శత్రువులకు విరుద్ధముగా ఒక గారడి బ్లూంఫీల్డు మస్తిష్కమునందు అథర్వ వేదమందలి గారడి అతని తలలో భూతము వలె కార్యమొనర్చినది. ఓషధుల పేర్లు, వాని గుణముల వర్ణనములు స్పష్టముగా వేదములందుండగా ఆతడు భూత, ప్రేత, రాక్షసాదులని భ్రమపడినాడు. దిగువ మంత్రములందు ఇతర సూక్తములందు ఆతనికి గారడి మున్నగు ప్రయోగములే గాన్పించినవి. ౬వ మంత్రములో ఈ అపామార్గ (ఉత్తరేణి) ఓషధి ద్వారా నిమ్న వ్యాధులు మున్నగువాని చికిత్సలు చూపబడినవి.

**క్షుధామారం తృష్ణామారమగోతామనపత్యతామ్।**

**అపామార్గ త్వయా వయం సర్వం తదపమృజ్మహే ॥**

బ్లూంఫీల్డు దీనియనువాద మిట్లొనర్చినాడు.

*Death from hunger and death from thirst, poverty in cattle, and failure of off-spring, all that, O apamarga, do we wipe out with thee.*

ఈ మంత్రములో (క్షుధామారమ్) ఆకలిని చంపు వ్యాధులు, అగ్నిమాంద్యము (తృష్ణామారమ్) తృష్ణ అనగా దాహమును చంపునట్టి రోగములు, వమనము, అలసటను గలిగించు వ్యాధులను, (అగోతామ్) వంధ్యత్వమును దొలగించి స్త్రీలను సంతాన వంతులుగా జేయువర్ణనగలదు. ఇట్టి స్త్రీ **'సా ప్రసూర్ధేనుకా భవ'** ॥ అథ. 3-23-౪ ॥ లో 'గౌ' అనియనబడినది. కావున. **'అగోతా'** యను శబ్దమున కిచ్చుట వంధ్యత్వము, లేక గొడ్డుమోతు తనమని తాత్పర్యము. కాని *Poverty in Cattle* వంటిదని బ్లూంఫీల్డు చూపినాడు. (అనపత్యతామ్)

సంతానమును గాకుండజేయు రోగము మున్నగు వాని నన్నింటిని అపామార్గ ఓషధి ద్వారా తొలగించవచ్చును. ఇట్లు ఆయుర్వేద వైద్య గ్రంథములందు ఈ అపామార్గౌషధి విషయమునందిట్లు గలదు.

**అపామార్గః సరస్తీక్ష్ణో దీపనస్తిక్తకః కటుః।**

**పాచనో రోచనశ్ఛర్దికఫమేదోఽనిలాపహః॥**

నిహన్తి హృద్రుజాధ్మార్శః - కణ్డూశూలోదరాపచీః ॥ భావప్రకాశ నిఘంటువు ॥

**గృహీత్వా శుభనక్షత్రే, త్వపామార్గస్య మూలకమ్ ।**

**గృహీత్వా లక్షణామూలం, ఏకవర్ణగవాం పయః ।**

**పీత్వా సా లభతే గర్భం, దీర్ఘజీవీ సుతో భవేత్** ॥ దత్తాత్రేయ తంత్రము ॥

ఈ వచనము లందు శ్వేత అపామార్గము (తెల్ల ఉత్తరేణి) ఆధ్మా (అఫారా) ఉదర వ్యాధులను, వాంతులను దొలగించునది, రుచిని బుట్టించునది, జీర్ణమును వృద్ధి పరచునది, అగ్ని దీపనమును గలిగించునదని చెప్పబడినది. ఇది వంధ్యత్వమును కూడ దూరమొనర్పునదనియును చెప్పబడినది. ఈ స్థితియందు ఈ యౌషధ ప్రయోగమును గారడి *(Charm)* ప్రయోగమని పేరిడుట ఎంతటి భ్రాంతిజనకమో చూడుడు.

అధర్వ . ౪-౧లో రాజ్యాభిషేకము మున్నగు వానిని గూర్చి ఎంతో ఉత్తమమైన వర్ణన గలదు. ౪వ మంత్రములో రాజును సంబోధించుచు **'విశస్త్వా సర్వా వాఞ్ఛన్తు'** ప్రజలెల్లరును నిన్ను కోరుదురుగాక అనియుండగా **'బ్లూంఫీల్డు'** దీని యనువాదము *"All the clans shall wish for thee"* ఈ విధముగా నొనర్చియు దీని శీర్షిక *'Charms pertaining to Royalty'* (రాజకర్మాణి) అనగా; రాజ్య విషయక గారడి, మాయ అని పేర్కొనినాడు. ఇది ఎంత నికృష్ట భావమో చూడుడు. అధర్వ వేద. 3-౪వ మంత్రమున రాజనెన్నుకొను విషయములో అత్యుత్తమ ప్రతిపాదన గలదు. ఈతని అనువాదమందు చక్కని ప్రజాతంత్ర ఆదర్శముల వర్ణనలభించుట అసంభవమే. దీనియందిట్లు చెప్పబడియున్నది.

**'త్వాం విశో వృణతాం రాజ్యాయ త్వామిమాః ప్రదిశః పఞ్చదేవీః ।**

**వర్ష్మన్ రాష్ట్రస్య కకుది శ్రయస్వ తతోన ఉగ్రో విభజా వసూని?** ॥ 3-౪-౨ ॥

దీనియనువాదము బ్లూంఫీల్డు ఇట్లొనర్చినాడు.

***Thee the clans, thee these regions shall hoose for empire; Root thyself up on the height, the pinnacle of royalty. then do thou mightly, distribute goods among us.***

**ఇన్ద్రేన్ద్ర మనుష్యాః పరేహి సంహ్యజ్ఞాస్థా మరుణైః సంవిదానః॥**

దీనికి బ్లూంఫీల్డు అనువాదము :- *O Indra, come thou to the tribes of men, for thou hast agreed, concordant with the Varunas (as if the electros)* అని చేసినాడు. వరుణుల అర్థము

ఎన్నుకొనువారు *electors* ఓటర్లు అనియే యగును. కాని బ్లూంఫీల్డు వ్యర్థముగా *As if* అనుదానిని ప్రయోగించినాడు. ఇవన్నియునుండగా బ్లూంఫీల్డు *Charms pertaining to Royalty* అనగా; రాజకర్మ విషయక గారడి అను శీర్షిక నిచ్చి దీనిమహత్త్వమును నష్టమొనర్ప యత్నించినాడు.

అథర్వ :- 3-30 సూక్తము పారివారిక, సామాజిక కర్తవ్యములను ప్రతిపాదించు చున్నది. దీనిలో కొన్ని మంత్రములను మేము బ్లూంఫీల్డు అనువాద యుక్తముగా ఉదాహరించుచున్నాము. వానియందు పారివారిక ప్రేమ మరియు కర్తవ్యములను గురించి ఎంత చక్కగా చిత్రణము గలదో పాఠకులు జూతురుగాక.

సహృదయం సాంమనస్యమవిద్వేషం కృణోమి వః ।

అన్యో అన్యమభిహర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥ 3-30-1॥

దీనికి బ్లూంఫీల్డు అనువాదము.

*Unity of heart and unity of mind, freedom from hatred, do I procure for you. Do ye take delight in one another, as a cow in her new born calf.*

అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః ।

జాయా పత్యే మధుమతీం వాచం వదతు శాన్తివామ్ ॥ 3-30-2 ॥

దీనికి బ్లూంఫీల్డుకృత అనువాదము .

*The son shall be devoted to his father, be of the same mind with his mother, the wife shall speak honied, sweet words to her husband.*

మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసారముత స్వసా ।

సమ్యఞ్చః సవ్రతా భూత్వా వాచం వదత భద్రయా ॥ 3-30-3॥

*The brother shall not hate the brother, and the sister not the sister! Harmonious, devoted to the same purpose, speak ye words in kindly spirit.*

'జ్యాయస్వన్తశ్చిత్తినో మా వియౌష్ట సంరాధయన్తః సధురాశ్చరన్తః ।

అన్యో అన్యస్మై వల్గు వదన్త ఏత, సధ్రీచీనాన్ వః సంమనసస్కృణోమి ॥ 3-30-5॥'

శ్రీ బ్లూంఫీల్డు జేసిన యనువాదమిట్లు గలదు.

*Following your leader, of the same mind, do ye not hold yourselves apart! Do ye come here, co-operating, going along the same wagon-pole, speaking agreeably to one another! I render you of the same aim, of the same mind.*

*- Hymns of the Atharva Veda by M.Bloomfield. P.134.*

ఈ యుత్తమ సూక్తమునందు సహృదయత్వము, సౌమనస్యము, ద్వేషరహితము, పరస్పర ప్రేమ, సహయోగము, మధుర భాషణము మున్నగు మహత్త్వములను అత్యుత్తమ ఉపదేశములను బ్లూంఫీల్డు *'Charm to secure harmony'* అనగా, సౌమనస్యము స్థాపితమొనర్చు వశీకరణ మను శీర్షికనిచ్చి ఎంతో ద్రోహమొనర్చినాడు.

### 10.21 బ్రహ్మ శబ్దమునకు అశుద్ధార్థము - గారడి

ఈ సూక్తము నాల్గవమంత్రములో బ్రహ్మ శబ్ద ప్రయోగమున్నది. దీనియర్థము పరమేశ్వరున కతిరిక్తముగ గలదని తెలియుచున్నది మంత్రములో ఈ విధముగా నుపదేశింపబడియున్నది. నేనునీకిచ్చు జ్ఞానమును పొంది దేవతలు (సత్యనిష్ఠగల విద్వాంసులు) 'పరస్పరము విరుద్ధముగ నుండరు. పరస్పరము ద్వేషించుకొనరు. సర్వజనులను పరస్పరము మిత్రులుగా నొనర్చుదు' రని యుండగా ఈ '(బ్రహ్మ' శబ్దము యొక్క అర్థము బ్లూంఫీల్డు *Charm* అనగా గారడి యని అనువాదమొనర్చి సమస్త ఉత్తమ ఉపదేశములపై ఘోర అపచార మొనర్చినాడు. అతడీ మంత్రమునకు ఈ ప్రకారముగా అర్థము చేసినాడు.

*That charm which causes the gods not to disagree, and not to hate one another, that do we prepare in your house, as a means of agreement for your work* ఇచ్చుట *Charm* స్థానములో *Knowledge* మరియు *Gods* స్థానమున *Wise men* అని యుండవలసియుండెను. మిగతా అనువాదము బాగున్నది.

తత్ కృణ్మో బ్రహ్మ వో గృహే సంజ్ఞానం పురుషేభ్యః ॥

### 10.22 సాంమనస్యం దేవతా

అథర్వ ౬-౬౪ యొక్క దేవతా, మరియు ప్రతిపాద్య విషయముకూడా **'సాంమనస్య'** మే. మేమందలి మూడు మంత్రముల బ్లూంఫీల్డు గారి అనువాదమును ఉద్ధృత పరచుచున్నాము. దీనివల్ల ఈ సూక్తమునందు సామాజికోన్నతిని గూర్చి ఎంతటి ఉత్తమ తత్త్వముల ప్రతిపాదనగలదో దెలిసిరాగలదు.

సం జానీధ్వం సం పృచ్యధ్వం సం వో మనాంసి జానతామ్ ।
దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥ ౧ ॥
సమానో మన్త్రః సమితిః సమానీ సమానం వ్రతం సహ చిత్తమేషామ్ ।
సమానేన వో హవిషా జుహోమి సమానం చేతో అభి సంవిశధ్వమ్ ॥ ౨ ॥
సమానీవ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥ 3 ॥

ఈ మంత్రములకు బ్లూంఫీల్డు అనువాదమిట్లొనర్చినాడు.

1. Do ye agree, unite yourselves, may your minds be in harmony just as the gods of old in harmony sat down to their share!

2. Same be their counsel, same their assembly, same their aim, is common their thought! The same oblation do I sacrifice for you, do ye enter upon the same plan.

3. Same be your intention, same your hearts! Same be your mind, so that it may be perfectly in common to you. -Hymns of the Atharva Veda. P.136.

ఈ సూక్తము ఋగ్వేదము ౧౦-౧౯౧ సూక్తమునకు దాదాపు సమానముగా నున్నది. భేదమున్న స్థలములో అర్థము దృష్ట్యా ఎంతో మహత్త్వము గలదే. **'సమానం చేతో అభిసంవిషధ్వమ్'** మీరందరును ఒకే చిత్తముగా గలిసి యుండుడు. మీ మనస్సులు సదా కలసియుండును గాక మీ యుద్దేశ్యములు ఒకే విధమున నుండుగాక మున్నగు భావము లెంత ఉత్కృష్టముగ నున్నవియో చూడుడు. కాని బ్లూంఫీల్డు వీనిమహత్త్వమును *Charm to allay discord* అనగా, విరోధములను దొలగించు వశీకరణమని అనువాదమొనర్చి దీని మహత్త్వమును నష్టమొనర్చినాడు ఇట్టివే వందలాది ఉదాహరణ తీయవచ్చును. వీనివల్ల మనకు అథర్వ వేదములో గారడి, వశీకరణము, ప్రయోగములు, మాయమంత్రములు, గలవను భ్రాంతి పూర్ణ భావము తొలగి అత్యంత మహత్త్వ పూర్ణము, సర్వోపయోగమగు ఎట్టి ఉత్తమ ఉపదేశములు గలవో తెలిసినవి. బ్లూంఫీల్డు మున్నగు వారు ఈ మహత్త్వమును నష్టమొనర్చు ప్రయత్నము శక్తి వంచన లేకుండా జేసి యున్నారని స్పష్టమగుచున్నది.

## 10.23 అథర్వ. ౭-౧౨ లో సభాసమితిః, పితరశ్చ దేవతాః.

రాష్ట్రీయ దృష్టితో ౭-౧౨వ సూక్తము ఎంతయో మహత్త్వ పూర్ణమైనది. దీనియందు ఇప్పటి లోక సభ *Parliament*, మరియు రాజ్య పరిషత్తు *Council of state*వంటి సభా మరియు సమితులను గూర్చి చక్కని ప్రతిపాదనము గలదు దాని సదస్యులను **'పితరః'** అను పేరుతో సంబోధించుచు వారి సలహాలతో లాభమును పొందుటకు, మరియు వారి యెడ నమ్రతా పూర్వకముగా వర్తించుటకై రాజులకు ఉపదేశము గలదు. దానియందలి మొదటి రెండు మంత్రములకు బ్లూంఫీల్డు యొక్క దోషపూర్ణమైన అనువాదమును మేము పాఠకుల పరిచయమునకై ఉదాహరించుచున్నాము.

**సభా చ మా సమితిశ్చావతాం ప్రజాపతేర్దుహితారౌ సంవిదానే ।**

**యేనా సంగచ్ఛా ఉపమా స శిక్షా చ్చారు వదాని పితరః సంగతేషు** ॥ అథ ౭-౧౨-౧॥

**విద్మతే సభే నామ నరిష్టా నామ వా అసి ।**

**యే తే కే చ సభాసదస్తే మే సన్తు సవాచసః** ॥ అథ. ౭-౧౨-౨॥

వీనికి బ్లూంఫీల్డు అనువాదమిట్లు గలదు.

*May assembly and meeting, the two daughters of Praja Pati, concurrently aid me! may he with whom I meet, co-operate with me! May I, O Ye Fathers, speak agreeably to those assembled. We know thy name, O assembly, 'Mirth' verily is thy name; may all those that sit assembled in thee utter speech in harmony with me.*

*- Hymns of the Atharva Veda by M.Bloomfield. P.138*

ఈ యనువాదము దోష పూర్ణమైయున్నది. **'నరిష్టా'** అనువాదము *'Mirth'* అని చేయుట సరిగాదు. దీనియర్థము *'Benevolent to the People* నృ + ఇష్టా సకల మానవులకు ఇష్టము, హితము గలిగించునది. *or that which does not allow people to suffer* అనగా; ప్రజలకు కష్టములు గలుగనీయనిది' అని యుండవలసి యుండెను.

ఐనను ఈ యనువాదమును సంపూర్ణముగా దోషములతో గూడినదని యనవలదు. కాని సూక్తము యొక్క శీర్షికను జూచినప్పుడు ఆశ్చర్యము, బాధ తప్పకగలుగును. బ్లూంఫీల్డు యొక్క తలలో అథర్వ వేదమందలి భూతప్రేత పిశాచాదులు, మరియు మాయ మంత్రతంత్రములే కలవర పరచుచున్నందున దాని శీర్షిక *'Charm to procure influence in the assembly'* అనగా; సభలో ప్రభావమును వేయు మంత్రతంత్రము అని చేయుట ఎంతటి భ్రాంతి పూర్ణమో చూడుడు.

ఇదే విధముగు ఇంకా ఎన్నియో దోషములు బ్లూంఫీల్డు, హ్విట్నీ మున్నగు వారు అథర్వ వేదము యొక్క అర్థములను, భావములను దెలిసికొనక చేసినారు. బ్లూంఫీల్డు యొక్క అథర్వ వేదానువాద **'భూమిక'**ను గూర్చి ఈ కొన్ని శబ్దములను జూచినప్పుడు మాకు కొంత సంతృప్తి మరియు ప్రసన్నత గలిగినది. ఏమన;

*I do not consider any translation of the Atharva veda, at this time as final. The most difficult problem, hardly as yet ripe for final solution, is the original function of many mantras, after they have been stripped off certain adaptive modifications imparted to them to meet the immediate purpose of the Atharva vedin, etc.*

- Introduction to the Hymns of the Atharva Veda.P.IXXIII

అనగా; ఇప్పుడు నేను చేసిన అథర్వ వేదానువాదము కూడా సంపూర్ణము, లేక చివరిదని యనుకొనను. అన్నిటికన్న కఠిన సమస్య ఏమనగా; దీనికి సమాధానమిచ్చుటకు సమయ మింకా పరిపక్వముగాలేదు. అనేక మంత్రముల మూలము వినియోగమందున్నది. ఏవేని విశేష ఉద్దేశ్యములను పూర్తిజేసికొనుటకు అథర్వ వేదములో ఎట్టి పరివర్తన మొనర్చి యున్నారో, వాని నుండి పరివర్తన రహితమైనప్పుడే పరిపక్వముగా నెంచబడగలదు. మున్నగునవి -

మధ్య కాలీన భాష్యకారులు, మరియు శ్రౌత, కల్ప సూత్రకారాదులు అథర్వవేదము, మరియు ఇతర వేదముల మంత్రములను అనేక స్థానములందు మంత్రార్థములకు భిన్నముగా, సంపూర్ణ అసంబద్ధమగు

కపోలకల్పితములను వినియోగించుకొనినారు. వానిని దొలగించి వాస్తవికమగు మూలార్థములు మరియు వినియోగాదులను దెలిసికొనుటయు ఎంతో అవశ్యకము. ఈ వాక్యములనిచ్చుట ఉదాహరించు మా ఉద్దేశ్యమేమనగా; బ్లూంఫీల్డు అథర్వ వేదానువాదమును చివరిది, మరియు ప్రామాణికమైనదని తెలిసికొనుటగాని, విశ్వసించుట గాని చేయలేదనిన వేదముల వాస్తవికార్థములను దెలిసికొనుటయందు కఠిన సమస్యలు,గలవనియే వానిని సమాధానపరచు సమయ మింకను రాలేదని స్వయముగా అభిప్రాయపడినాడు గదా! ఇట్టి యెడ ఆతని అనేక దోషములను, తప్పులను, పక్షపాతముతో గూడిన అశుద్ధానువాదమును ప్రామాణికమని యెంచి వైదిక శిక్షణలను సమాలోచించు 'వైదిక్ ఏజ్' మున్నగు వాని లేఖకుల గతి ఏమియో ఆలోచించదగినది. బ్లూంఫీల్డు చేసినట్టి దోషములను వారు కూడా చేసినారు. కాని వారు తమ భ్రాంతులు, కల్పనలలో తమ గౌరాంగ గురువుల కన్నను ఇంకా పదడుగులు ముందుకే యున్నారనవచ్చును. వారి అసంగతమగు, భ్రాంతి పూర్వకమగు వ్యాఖ్యల ఆలోచనలను మచ్చుగా చూడుడు.

*Medicinal Charms,* లేక ఓషధీ సంబంధమగు గారడి ( జాదూ ) అను శీర్షికతో వారిట్లు వ్రాసియున్నారు.

*Quite a number of medicinal Charms are included in the Atharva veda. The chief malady that was sought to be treated magically is the Takman. From the symptoms described, it is almost certain that it was nothing but Malarial Fever. The Plant Kushtha is maintained as potent in fighting Takman, but Whether as medicine or as amulet is not quite clear. - Vedic Age P.4.5.*

అనగా అథర్వ వేదములో అనేకములగు ఓషధీ విషయక మగు మంత్ర తంత్రములు వర్ణించబడియున్నవి. '(తక్మా' దీనివర్ణనవల్ల స్పష్టమగున దేమన ఇది మలేరియా జ్వరము కన్న వేరేమియును గాదు) యొక్క చికిత్స వర్ణనము విశేషముగా నున్నది. కుష్ఠ నాశక వనస్పతి **'తక్మా'** లేక జ్వరనాశకమని తెలుపబడినది. కాని యది ఔషధ రూపముననా, లేక మంత్ర తంత్ర, రూపముననా తాయెత్తు రూపముననా లేక కవచ బంధన రూపముననా స్పష్టముగా లేదు. కాని అది జ్వర నాశకమని ఎంచబడినది.

**సమీక్ష :–** ఈ లేఖ గొప్ప భ్రాంతి గలిగించునదైయున్నది. అథర్వ వేదములో ఒక జ్వరమే గాదు, మూత్ర వ్యాధులు, నపుంసకత్వము, క్షయరోగము, వన్ధ్యత్వము, కుష్ఠ రోగము మున్నగు వందలాది రోగనాశకములగు అపామార్గ, కుష్ఠ, అసిక్నీ, పృశ్నిపర్ణీ, సోమ, దర్భ మున్నగు ఓషధుల వర్ణన కుష్ఠ ద్వారా జ్వర చికిత్సను గూర్చి అథర్వ .౫-౪, మరియు ౧౯-౩౯ లో వర్ణన యున్నది. దానిని ఓషధ రూపములోనే వాడవలయునని గలదు. కాని గారడి, తాయెత్తు, బంధనము మున్నగు వాని రూపమున గాదు. ఈ విషయము పై రెండు సూక్తముల మంత్రముల ( ఒకవేళ బ్లూంఫీల్డు అనేక స్థలములందు జేసిన అశుద్ధానువాదమును నమ్మినను) చే సంపూర్ణముగా స్పష్టమగును. 'వైదిక్ ఏజ్' లేఖకులకిందు ఎందుకు సందేహము గలిగినదో తెలియదు. ఉదాహరణార్థము ఆ సూక్తముల నుండి ౨, 3 మంత్రముల నిచ్చిన సరిపడగలదు.

**యో గిరిష్వజాయథా వీరుధాం బలవత్తమః ।**

**కుష్ఠేహి తక్మనాశన తక్మానం నాశయన్నితః ॥** అథ ౫-౪-౧॥

బ్లూంఫీల్డు జేసిన అనువాదమిట్లు గలదు.

*Thou that art born upon the mountains; as the most potent of plants, come hither O Kushtha, destroyer of the Takman to drive out from here the Takman (fever).*

**'కుష్ఠ'** నిచ్చట స్పష్టముగా **'వీరుధాం బలవత్తమః'** అనగా; ఓషధులందు అధికప్రభావ శాలిని ఓషధి యని చెప్పబడినది. దీనియనువాదమును 'బ్లూంఫీల్డు' *The most potent of plants* అని వ్రాసినాడు. అథర్వములో మరల

**శీర్షా మయముపహత్యామక్ష్యోస్తన్వో 3 రపః ।**

**కుష్ఠస్తత్ సర్వం నిష్కరద్ దైవం సమహ వృష్ణ్యమ్ ॥** అథ. ౫-౪-౧౦ ॥

దీనియనువాదము బ్లూంఫీల్డు జేసినదిట్లు గలదు.

*Pain in the head, affliction in the eyes and ailment of the body, all that shall the Kushtha heal-a divinely powerful remedy.*

ఇచ్చట కూడ తలనొప్పి, నేత్ర రోగములు, ఒళ్ళు నొప్పులు మున్నగువాని చికిత్స **'కుష్ఠ'** ఓషధి ద్వారా చూపబడినది. బ్లూంఫీల్డు అనువాదము *A powerful remedy* అనునదే సందేహ నివారణమునకు సరిపోయెడిది. ఐనను 'వైదిక్ ఏజ్' లేఖక విద్వాంసులకు ఇంకా సందేహము మిగిలియే యుండుట ఆశ్చర్యమే. మా యీ కథనము ననుసరించి 'వైదిక్ ఏజ్' అను పుస్తకము వాస్తవముగా ఒక సంద్దిగ్ధము, సందేహ జనకమునైన దనుటలో అత్యుక్తి ఏ మాత్రమును లేదు. అథర్వ ౧౯-౩౯ లో **'కుష్ఠ'** నుగురించి ఐదు తడవలు **'విశ్వభేషజః'** అను శబ్ద ప్రయోగము గలదు. దీనియనువాదము బ్లూంఫీల్డు *Universal remedy* అని చేసినాడు.

ఇదే సూక్తము ౪ వ మంత్రములో ఇట్లు చెప్పబడినది.

**ఉత్తమో అస్యోషధీనామనడ్వాన్ జగతామివ ।**

**వ్యాఘ్రః శ్వపదామివ నాద్యాయం పురుషో రిషత్**

**యస్మై పరిబ్రవీమి త్వా సాయం ప్రాతరథో దివా ॥** అథ. ౧౯-౩౯-౪॥

బ్లూంఫీల్డు దీనియనువాద మిట్లొనర్చినాడు.

*Thou art the most superior to the plants, as a steer among cattle, as the tiger among beasts of prey. Verily no harm shall suffer this person here, for whom I bespeak these morn and even, aye the entire day.*

*(Hymns of the Atharva Veda by M.Bloofield. P.6.)*

ఇచ్చట 'కుష్ఠ' అను మూలిక విషయములో 'ఉత్తమో అసి ఓషధీనామ్' అనగా నీవు ఓషధులందు ఉత్తమమైనదాన'వని చెప్పబడినది. ఇంకా ప్రాతఃసాయంకాలములందు, మరియు దినము నందును నిన్ను సేవించుచుండినచో రోగులు రోగములచే బాధింపబడ కుందురనియును, ఆరోగ్యవంతులగుదురనియును చెప్పబడినది.

ఈ విధముగా కొన్ని ఓషధులను సేవించు చుండినచో జ్వరములు మున్నగు వానిచికిత్స జరుగునను విషయము సదా స్పష్టముగా నున్నది. గారడి, మంత్రము, లేక తాయెత్తు రూపములో ధరించుటను గురించి ఏ సూక్తములందును నామమాత్రముగానైనను లేదు.

### 10.24 ఒక భ్రాంతిని గలిగించు సమాలోచనము

'వైదిక్ ఏజ్' పు.౮౧౫లో అత్యంత భ్రమలో బడవేయునట్టి ఒక టిప్పణి ఈయబడినది. ఈ ప్రసంగములో దాని సమాలోచన మొనర్చుట ఆవశ్యకమనిపించినది. ఆటీక ఇట్లున్నది.

*It is interesting to note that in one hymn (5.22) takman has been asked to seize the shudra and the Dasi or to go away to Mujavats or to the valhikas further beyond, and the last verse, the author says quite Maliciously that he is sending Takman to the Gandharis, Angas and Magadhas like one sending a treasure to a person.*

*- Vedic Age. P.815.*

అనగా అథర్వ.౫-౨౨లో ఈ విషయము గొప్ప మనోరంజకముగ నున్నది. దీనిలో 'తక్మా' ( మలేరియా జ్వరము) ఇట్లు చెప్పబడినది. అట్టి శూద్రురాలు, లేక దాసిని పట్టుకొనవలెను. లేక మూజావాన్ పర్వతము, లేక దూరమందుగల వాహ్లీక దేశమునకు వెళ్లిపోవలెను. చివరి మంత్రములో లేఖకులు అశుభమగు వాంఛ, లేక శత్రుత్వముతో నిల్లనుచున్నారు. 'అట్టి తక్మా ( జ్వరము)ను, నిధులను ఒక పురుషునికి పంపునట్లు, గాంధార, అంగ, మగధ దేశములకు పంపించబడుచున్నది.'

**సమీక్ష :-** వైదిక్ ఏజ్ లేఖకులు అజ్ఞానవశమున టిప్పణి ( టీక) నిచ్చిన మంత్రములివి.

**తక్మన్ వ్యాల వి గద, వ్యఙ్గ భూరి యావయ ।**

**దాసీం నిష్టక్వరీమిచ్ఛతాం వజ్రేణ సమర్పయ ॥** అథ. ౫-౨౨-౬॥

**తక్మన్ మూజవతో గచ్ఛ, బల్హికాన్ వా పరస్తరామ్ ।**

**శూద్రామిచ్ఛ ప్రఫర్వ్యం, తాం తక్మన్ వీవ ధూనుహి ॥** అథర్వ. ౫-౨౨-౭॥

**గన్ధారిభ్యో మూజవద్ భ్యోఽఙ్గేభ్యో మగధేభ్యః ।**

**ప్రైష్యన్ జనమివ శేవధిం, తక్మానం పరిదద్మసి ॥** అథర్వ. ౫-౨౨-౧౪ ॥

ఈ మంత్రములందు గల దాసీ, శూద్రా, గన్ధారీ, మూజువాన్, అంగ, మగధ, శబ్దముల అర్థము తెలిసికొనుటలో వారికి గొప్ప పొరపాటు జరిగినది. దాని నివారణ అత్యావశ్యకము.

**10.25 'దాసీ' యనుపేరు గలది ఒక మూలిక (కాక జంఘ)**

పై మంత్రము లందు పేర్కొనబడిన 'దాసీ' శబ్దము 'కాకజంఘ' అను ఓషధి పేరు. రాజ నిఘంటువులో దాని పర్యాయ వాచక శబ్దము నిచ్చుచు ఇట్లు వ్రాయబడియున్నది.

**కాక జంఘా ధ్వాంక్ష జంఘా, కాకపాదా తు లోమశా।**

**పారావతపదీ దాసీ, నదీకాన్తా ప్రచీవలా।**

**కాకజంఘా చ తిక్తోష్ణా రక్తపిత్తజ్వరాపహా** ॥ రాజ నిఘంటు ॥

'కాక జంఘా' యను మూలికకు గల నామములందు దాసీ శబ్దము వచ్చినది. మరియు దానిని రక్త, పిత్త, జ్వరము మున్నగు దోషములను దొలగించునదని చెప్పబడినది. 'దాసీ' శబ్దమున కీయర్థమును దెలిసికొనక ప్రచారములో నున్న అర్థమును గొని ఎంత అనర్థమొనర్చియున్నారో చూడుడు.

**10.26 'శూద్రా' అను పేరు గల ఓషధి (మూలిక)**

'దాసీ' శబ్దము ఓషధీ వాచకమైనట్లే 'శూద్రా' శబ్దము కూడా ఇచ్చట 'ప్రియంగులత' కొరకు ప్రయోగమైనది. వైద్యక శబ్ద సింధువులో ప్రియంగులతకు వైదిక శూద్రురాలి వలె 'శూద్రార్తా' శబ్ద ప్రయోగము చూడబడుచున్నది. ఎట్లన; 'శూద్రార్తా ప్రియంగులతాయామ్' (వైద్యక శబ్ద సిన్ధు శ-చ) ఈ ప్రియంగులత భావప్రకాశ నిఘంటువు నందు చెప్పినట్లు జ్వరనాశకమనియు దెలియుచున్నది.

**ప్రియంగుః శీతలా తిక్తా, తువరానిలపిత్తహా**

**రక్తాతిసారదౌర్గన్ధ్య స్వేదదాహ జ్వరాపహా ।** ॥ భావ ప్రకాశ నిఘంటు ॥

ఇచ్చట ప్రియంగులతను జ్వరనాశకమని స్పష్టముగ చెప్పబడినది. ఈ ప్రకారముగా 'శూద్రా', మరియు 'దాసీ' శబ్దముల అర్థమును సరిగా దెలిసికొనినచో మంత్రముల అర్థము చక్కగా బోధపడగలదు.

**తక్మన్ వ్యాల విగద........ సమర్పయ** ॥ అథ. ౫-౨౨-౬॥

(వ్యాల) సర్పవిషము వలె శరీరములో వ్యాప్తి నొంది బలహీనమొనర్చజేయు (విగద) విశేష రోగములను! (వ్యఙ్గ) ఏదో యొక ప్రత్యేక అంగమని గాకుండా సమస్త శరీరమున గలుగునట్టి (తక్మన్) ఓ జ్వరమా! నీవు (భూరియవయ) అతి దూరము పారిపొమ్ము (నిష్టక్వరీ దాసీమ్ ఇచ్ఛ) విరిసిన (విప్పుకొనిన) పువ్వులు గల కాకజంఘోషధిని కోరుము. (తామ్) దాని యెడ (వజ్రేణ సమర్పయ) జ్ఞానముతో (వజ-గతౌ) ఆత్మ సమర్పణ మొనర్చుకొనుము.

వికసించిన పుష్పములు గల కాకజంఘ మూలిక సేవనము వల్ల జ్వరములు దొలగిపోవునని ఈ మంత్రము యొక్క నిర్దేశము.

**తక్మన్ మజావతః ............... వీవ ధూనుహి** ॥ అథ. ౫-౨౨-౭ ॥

(తక్మన్) హే జ్వరమా! నీవు (మూజవతః) మూంజలు గల దేశములందు (వా) మరియు (బహ్లికాన్) ఆచ్ఛాదిత [(కప్పబడిన)] స్థానములందు (పరస్తరాం గచ్ఛ) అతిగా తిరస్కరింపబడినదానవై పారిపోదగిన దానవు. అనగా; జ్వరములు గడ్డిగాదముతో నిండి, గాలి వెలుతురు చక్కగా ప్రసరించని చీకటి స్థలములకు (తక్మన్) ఓ జ్వరమా! నీవు (ప్రఫర్వ్య శూద్రామ్) పుష్పములతో నిండిన ప్రియంగుమూలికను (ఇచ్ఛ) కోరుకొనుము. (తామ్) దానిని (వీవధూనుహి) అత్యంతముగా కంపింపజేసి దానిపై నీవే శక్తిని సమాప్తమొనర్చుము.

ఎక్కువగా గడ్డిగాదము గల మరియు వాయువు, ప్రకాశములు ప్రసారముగాని కప్పులచే మూయబడియున్న స్థలములో జ్వరప్రకోపమధికముగా నుండును. అది ప్రియంగులత యొక్క సేవనము వల్ల దూరము గాగలదు.

**10.27 వహ్లీక మను శబ్దమునకు అర్థము.**

**పఞ్చానాం సిన్ధు షష్ఠానామన్తరం యే సమాశ్రితాః ।**

**వహ్లీకా నామ తే దేశాః న తత్ర దివసం వసేత్ ॥**

ఇతిహాసము, భూగోళమును నమ్మువారు వహ్లీక మనుపేరును దేశ విశేషమనియనుకొందురు పై శ్లోకముననుసరించి పంజాబు రాష్ట్రమనియు గ్రహించెదరు. కాని ఇందువల్ల అర్థము సంగతము గాకపోవుటయే గాక, వేదభావము గూడా తెలియకపోవుట జరుగును. ఐతిహాసికమునకు సంబంధించినదని తలచు వారు 'వైదిక ఋషులు అధికముగా పంజాబు ప్రాంతములందే వేదమంత్రములను రచించు చుండిరనియు జ్వరమును పంజాబు ప్రాంతములందే వ్యాపకమగునట్లు శపించినారని యనుకొనుట సంపూర్ణముగా అసంగతమే. వాస్తవమునకు నిత్యములగు వేదములందు ఇట్టి దేశ విశేషమును గూర్చిన కల్పనలు సర్వథా అసత్యమే. మేమింతకు పూర్వము **'పరన్తు శ్రుతి సామాన్య మాత్రమ్'** (మీమాంస) **'వాచావిరూప నిత్యయా'** ॥ (ఋ.౮-౭౫-౬) మున్నగు ప్రమాణముల ద్వారా చూపియున్నాము. కావున ఇప్పుడు వహ్లీక శబ్దము యొక్క యౌగికార్థమునే దీసికొనవలసియుండును. అది ఇట్లున్నది. **'వహ్ల'** - (భ్వా) 'పరిభాషణ హింసాచ్ఛాదనేషు' తో **'వహ్లీక'** శబ్దము సిద్ధమగును. **'వహ్ల'** యొక్క ఈ మూడర్థములనుండి ఆచ్ఛాదనపరమైన అర్థమును పైన నిర్ణయించియుంటిమి. అదే మనగా; అచ్ఛాదిత ప్రదేశమనగా; గాలి, వెలుతురులు చక్కగా ప్రవేశించని స్థానము. దీనికి హింసాపరమైన అర్థము కూడా దీసికొనబడుచున్నది. పశువులను చంపు కారణముననచ్చట దుర్గంధము వ్యాప్తి జెంది అచ్చట కూడ జ్వరాదుల ప్రకోపముండును. **'బవయోరభేదః'** ననుసరించి వహ్లీక, మరియు బహ్లీక ఒకే విధముగా నెంచబడినవి.

**'బహ్ల'** - ప్రాధాన్యముగా **'భ్వాది'** గణమునొక ధాతువు గూడ గలదు. **'బహ్లీక'** శబ్దమును సిద్ధి పరచవలెనన్న అపవిత్రత, లేక అంధకారము మున్నగు వాని అవసరము గల చోట ఇట్టి అర్థమును దీసికొనవచ్చును. ఈ ప్రకారముగా వైదిక శబ్దములకు సరియైన అర్థమును దీసికొనిన ఇట్టి ఆక్షేపణలకు ఎట్టి స్థానమును ఉండజాలదు. వైదిక ఋషులు దుర్భావనచే జ్వరమునకు శూద్ర మరియు దాసిని బట్టుకొనుట కాదేశించినా రనియన సహించజాలరు.

### 10.28 గన్ధారి, అఙ్గ మరియు మగధ శబ్దముల అర్థములు

గన్ధారి యను శబ్దము గన్ధ పలాశీ, లేక కర్చ్యూర పేర్ల గల ఓషధీ వాచకమై యున్నది.

**'గన్ధారిః గన్ధ పలాశ్యామ్'** ॥ 'వైద్యక శబ్దసిన్ధు' ॥

**శఠీ పలాశీ షడ్గ్రన్థా, సువ్రతా గన్ధమూలికా ।**

**గన్ధారికా గన్ధవధూర్వధూః పృథుపలాశికా** ॥ భావప్రకాశ నిఘంటు ॥

గన్ధ పలాశీ యొక్క పర్యాయమైన కర్చ్యూరము జ్వర నాశకమనబడినది ఎట్లన;

**సముగన్ధః కర్చ్యూరస్తీక్ష్ణో దాహీ కటుః స్మృతః ।**

**.......... కాస శ్వాసజ్వరాపహః** ॥ నిఘంటు రత్నాకరము ॥

కాబట్టి గంధ పలాశీ, మరియు కర్చ్యూరమను ఓషధులను గ్రహించుట చాలా అవసరము. మూజవాన్, లేక ముంజవాన్ సోమవాచకము ఈ విషయము **సోమస్యేవ మౌజవతస్య భక్షః** ॥ ఋ. ౧౦-౩౪-౧ ॥ అనువచనము నందును నిర్దేశించబడినది. కావున వైద్యక శబ్దసిన్ధులోని **'మంజవాన్ సోమే'** అను వచనము స్పష్టముగ నున్నందున పేర్కొనదగినది.

ఐతిహాసికులుల కల్పననుబట్టి **'అంగ'** శబ్దము ఏదో యొక దేశ విశేషముగా గాదు. ఇది 'బోల' అను పేరు గల ఓషధీ వాచకము. **'వైద్యక శబ్ద సింధు'** యొక్క 'అఙ్గే బోలే 'అను వచనమే దీనికి ప్రమాణము. నిఘంటు రత్నాకరములో **'బోల'** యొక్క గుణ విశేషములను దెలుపుచు ఇది జ్వర నాశకమని చూపబడినది ఎట్లన;

**రక్తబోలః కటుస్తిక్తః, తువరోష్ణశ్చ పావనః ।**

**ప్రదరాశ్మరీ మేహఘ్నో యోనిశూలజ్వరప్రణుత్** ॥ నిఘంటు రత్నాకరము ॥

ఐతిహాసికుల కల్పనలననుసరించి **'మగధ'** శబ్దము ఏదో యొక దేశ విశేషము గాక **'పిప్పలీ'** యను ఔషధీ వాచకము. **'మగధ'** అను శబ్దము పుంలింగము. **'మగధా'** యనునది స్త్రీ లింగముగును. దీని **పర్యాయములు** అదే నిఘంటువు నందిట్లు గలవు.

**పిప్పలీ మాగధీ శౌణ్డీ, వైదేహీ చపలా కణా ।**

**కృష్ణోపకుల్యా మగధా, శ్యామాహ్వా తీక్ష్ణతణ్డులా ।**

ఇచ్చట పిప్ప మాగధి యొక్క పర్యాయ వాచకముగా చూపబడినది. దీనిని గురించి భావప్రకాశ నిఘంటువు నందిట్లు స్పష్టపరచబడినది.

**పిప్పలీ రేచనీ హన్తి, శ్వాసకాసోదర జ్వరాన్**

అనగా; పిప్పలీ విరేచనాకారి, దమ్ము, దగ్గు, జ్వరములను తొలగించునది.

(గన్ధారిభ్యః) గంధ, పలాశీ, అనగా; కచ్చూరములను ఓషధి కొరకు (మూజవద్భ్యః) సోమఓషధికొరకు (అఙ్గేభ్యః) బోల ఓషధికొరకు (మగధేభ్యః) పిప్పలి ఓషధి కొరకు (తక్మానమ్) జ్వరమునకు (పరిదద్మసి) ఒప్పగించును (ప్రైష్యంజనమివశేవధిమ్) రక్షణ యోగ్యమగు కోశమును రక్షక భటులకు ఒప్పగించునట్లు;

**భావార్థము :** కచ్చూరము, సోమ,బోల, పిప్పలి అనుపేర్లు గల ఓషధుల సేవనచే జ్వరములను దొలగించవచ్చును. కావుననే జ్వరములను తొలగించుటకు పై యోషధులను ఉపయోగించవలెను. అనగా ; పై యోషధులు జ్వరాదులను దొలగించునని భావము.

ఈ ప్రకారముగా గన్ధారి, మూజవాన్, అఙ్గ, మగధ, మున్నగు శబ్దముల అర్థమును చక్కగా దెలిసికొనినప్పుడు మంత్రములందెట్టి పొసగని విషయమును ఉండజాలదు. మరియు నీయోషధుల సేవనము వల్ల జ్వరముల చికిత్సయగునని దెలిసిరాగలదు. ఈ విధముగ వైజ్ఞానికము, ఆయుర్వేదకమునైన అర్థములను దీసికొనక అంగ, మగధ, బహ్లీక, గాంధారము మున్నగు దేశములను, దేశస్థులను, మరియు మూజవాన్ పర్వతముపై జ్వర ప్రకోపము పెచ్చురిల్లునుగాక యను శాపము నిచ్చినట్లు వ్రాయుట ఎంతటి అసంగతమో ఆలోచించుడు.

## 10.29 బ్లూంఫీల్డు దోషములనే పునరుద్ఘాటించుట

ఇదివరకు మేము కడచిన పుటలందు నిర్ణయించిన బ్లూంఫీల్డు దోషములు 'వైదిక్ ఏజ్' లో మాటిమాటికి వ్రాయబడినవిది. ఉదా:- అథర్వ 3-30లోని సాంమనస్య సూక్తము యొక్క అనువాదము నిచ్చుచు (దీని ప్రారంభము నందలి రెండు మంత్రముల భావము ఉదాహరణార్థము) వ్రాయబడుచున్నది.

*Like in heart, of like intent non-hostile do I make you; one another you should love, as the cow loves her new born calf. May the son do the father's will and be of one mind with the mother; may wife to husband honeyed words and peaceful always speak.*

Of the same type but much more elevated in stone, is the oft-quoted and justly celebrated Charm for securing concord. - Vedic Age P.420.

ఇది బ్లూంఫీల్డు యొక్క *Charm to secure harmony* అనుసరణమే యనుటలో సందేహము లేదు. ఇచ్చట చేతబడుల వంటివి మచ్చుకైనను లేవు. ఇవి సౌమనస్య విషయక ఉత్తమ శిక్షణలు. కావున దీనికి *Teachings to secure harmony* వంటి శీర్షిక నిచ్చుట ఎంత యనుచితమో చూడుడు.

బ్లూంఫీల్డు దోషములను నిర్ణయించుచు మేము అథర్వ. ౭-౧౨ యొక్క సభ, సమితి మున్నగువాని విషయమునందలి రాజనైతికాదేశములలోని కొన్ని అంశములను అనువాద సహితముగా నిచ్చియుంటిమి. ఆ దోషములనే 'వైదిక్ ఏజ్' లేఖకులు పు. ४౧౧లో ఇట్లు వ్రాసినారు.

*A number of hymns of the Atharva veda are on the bordering of magic and politics - P.411*

అథర్వ వేదము యొక్క చాల సూక్తములు గారడీ, చేతబడులు, మరియు రాజనైతికముల మధ్య రేఖపై నున్న వని వ్రాసినారు. వాస్తవమున కవి విశుద్ధమగు రాజనైతిక యుపదేశమొనర్చునవియై యున్నవి. వానియందు మాయ మంత్ర తంత్రముల కల్పన నొనర్చుట సంపూర్ణ అసత్యము 'వైదిక్ ఏజ్' లో ఈ సూక్తముల మొదటి రెండు మంత్రముల అనువాదమిట్లున్నది.

1. May the assembly and the council protect me the two daughters of **Praja** pati in agreement. May he whom I meet seek to help me. May I speak pleasantly at the meeting O fathers.

2. Of those seated here together, I take away splendour and discernment. Of this whole gathering, O Indra, make me the possessor of fortune. - Vedic Age.P.412.

ఈ యనువాదమును సత్యమని నమ్మినను ఇచ్చట విశుద్ధముగా రాజనైతికముల ఆదర్శములే ఉపదేశించబడిన వని స్పష్టమగుచున్నది. ఇందులో మంత్ర తంత్రముల మాట మచ్చుకైనను లేనప్పుడు ప్రజలలో భయోత్పాతములను గలుగజేయుచు ఈ సూక్తము మంత్ర తంత్రముల మరియు రాజనైతికముల మధ్యరేఖ యని వ్రాయు నవసరమేమి? ఇది కేవలము బ్లూంఫీల్డు యొక్క అనుకరణము మాత్రమే. వీరు దాదాపు ఈ విధమగు అనువాదములనే శీర్షికగా నిచ్చి *'Charm to procure influence in the assembly'* అనగా; లోక సభయందు ప్రభావమును ప్రాప్తించుకొను తంత్ర మని చెప్పినారు.

## 10.30 'అభిచార' విషయముతో అసత్యకల్పన

వేదోక్త అభిచార విషయమును గూర్చి మేమీ అధ్యాయమందే వివరణ నిచ్చి యుంటిమి. ఐనను ఈ విషయములో 'వైదిక్ ఏజ్' లో గొప్ప అసత్య విచారములను ప్రకటించియున్నారు. వారిట్లు వ్రాసినారు.

*Least savoury of the magic charms of the Atharva Veda are those of witch craft and the like which constitute the Angirasa part of Samhita. The purpose of some is defensive, but the majority of them are offensive in purpose and directed against human enemies.*

Law and Primitive morality speaks in these hymns. - Vedic Age P.410.

ఇచ్చట అభిచారము లందు అధికముగా మేలుకలిగించునవి గావు కాని ఇది సంపూర్ణముగా అబద్ధము. ఇందు ఒక నీచమైన ఆటవిక, ఆచార పరిచయం లభించుననుటయును అసత్యమే. దీని సంబంధము యుద్ధ విద్య, మరియు దేశరక్షణతో నున్నది. దీనిలో నికృష్టాచార కల్పనజేయుట భ్రమమూలకమే.

## 10.31 వైదిక బ్రాహ్మణులపై స్వార్థాంధత్వ ఆరోపణము

'వైదిక్ ఏజ్' లేఖకులు ఒక అశుద్ధ కల్పన నొనర్చినారు. ఏమన; అథర్వ వేదపు బ్రాహ్మణులు, పురోహితులు తమకన్న హీనులు, నిర్ధనులు, అశిక్షితులగు గ్రామీణుల సంపర్కములో ప్రవేశించి వారి ఆటవిక అంధ

విశ్వాసములతో లాభపడుచు స్వార్థమును పూర్తి యొనర్చుకొనుచుండిరి ఇట్టి భయంకరమగు ఆరోపణలను వారిపై వేసినారు. వానిని మేము ఉపేక్షింపజాలము. విశేషించి ఈ లేఖకులు కొన్ని వేద మంత్రముల అర్థము కూడా అశుద్ధముగా ఊహించి ఈ విధముగా వ్రాసినారు. మేము వారి కొన్ని వాక్యములనుల్లేఖించి సమాలోచన మొనర్చెదము. వారిట్లు వ్రాసినారు.

*Here in the Atharva Veda the Brahman priest is addressing his social inferior from whom he need not turn off the shady side of his character. Thus in the hymn on the Brahman's wife (Brahma jaya) the priest has demanded a remarkable privilege for his class. - AVV.17.8.*

Even though there were ten Non-Brahmana previous husbands of a woman. The Brahmana alone becomes her husband if he seizes her hand.

ఇచ్చట వారిట్లు చెప్పినారు. బ్రహ్మజాయా సూక్తము (౫-౧౭) లో పురోహితులు తమ బ్రాహ్మణ వర్గము కొరకు గట్టిగా చెప్పుకోదగిన అధికారములను కోరుకొంటాడు. ఏమన; ఒక వేళ ఏ స్త్రీకైనను ఇదివరకే బ్రాహ్మణులుగానట్టి పదిమంది భర్తలైనను బ్రాహ్మణుడామె కరగ్రహణమొనర్చినను (చేయిపట్టుకొనినను) కేవలము ఆతడు మాత్రమే ఆమెకు పతియగును. దీనిని ముందరి మంత్రములో ఇంకను బలపరచి ఆమెకు కేవలము బ్రాహ్మణుడే ఏకైక పతి యగును గాని క్షత్రియుడుగాని, వైశ్యుడు గాని కాజాలరు. మానవ మాత్రులకెల్లరకును సూర్యుడీ విషయమును చాటుచున్నాడు.

*The Brahmana indeed is the husband, neither the Rajanya, nor the Vaishya, this the sungoes on proclaiming to the five tribes of men.*

ఇట్టి మరియు ఇతర అథర్వ వేద మంత్రముల అనువాదము నాధారముగా గొని 'వైదిక్ ఏజ్' లేఖకులు ఇట్టి భయంకరమైన ఆరోపణలు అథర్వ వేదీయ బ్రాహ్మణులపై జేయు దుస్సాహస మొనర్చినారు. వారి యీ టిప్పణి చదువ దగినదై యున్నది.

*In rendering the passages of the Atharva Veda I have, as far as possible, followed Whitney's translation, though it is wooden and purely etymological, for what ever it may be in other respects, it is at least literally correct. - Vedic Age P.422.*

అనగా; అథర్వ వేద మంత్రముల అనువాదమును నేను అవసరమునుబట్టి **'హ్విటనీ'**నే అనుసరించినాను. ఐనను ఇది వంట చెరకు వలె శుష్కము (భావనారహితము) మరియు శబ్దములధాత్వర్థములు మున్నగు వానిపైననే ఆధారపడియున్నది. ఇతర విషయముల దృష్టితో ఈ యనువాదమెట్లున్నను కనీసము శాబ్దిక దృష్టితో బాగానే వున్నది.

వైదిక్ ఏజ్ విద్వాంస లేఖకులు **'హ్విటనీ'** యొక్క భావనాశూన్యమగు అనువాదమునే అనుసరించినారు. ఏమన ఆ యనువాదము బ్లూంఫీల్డు అనువాదములో వలె అనేక భయంకర తప్పులున్నవి. కావున అట్టి అనువాదమునునుసరించి చేయబడిన టిప్పణలు కూడా భ్రాంతి పూర్ణ ములే యనుటలో సందేహము లేదు.

పైన పేర్కొన్న మంత్రములు దిగువ చూపబడుచున్నది.

**ఉత యత్ పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః।**

**బ్రహ్మా చేద్ హస్తమగ్రహీత్ స ఏవ పతిరేకధా।**

**బ్రాహ్మణ ఏవ పతిర్న రాజన్యో న వైశ్యః।**

**తత్ సూర్యః ప్రబ్రువన్నేతి పఞ్చభ్యో మానవేభ్యః।**

**10.32 బ్రహ్మ జాయా శబ్దమున కర్థము**

బ్రహ్మజాయా శబ్దము యొక్క అర్థమును తెలిసికొనుటలో బ్లూంఫీల్డు, హ్విట్నీ, మరియు వారిననుసరించునట్టి 'వైదిక్ ఏజ్' లేఖకులు పొరపడినారు. కావున పైన వ్రాయబడిన వారి టిప్పణి సైతము భ్రాంతి మూలకమే. **'జాయా'** శబ్దము ఉణాదికోశము ౪-౧౧౧ **'జనేర్యక్'** సూత్రముననుసరించి **'జన్'** ధాతువుతో సిద్ధమగును. దీనియర్థము జననము. లేక ఉత్పన్నము చేయునది కావున **'జాయా'** శబ్దమునకు అర్థము ఇచ్చట జనయతి, ఉత్పాదయతి, సుఖానీతి జాయా, విద్యా యగును. బ్రహ్మజాయా శబ్దమునకర్థము బ్రహ్మ విద్య, లేక వేద విద్య యగును.

**'ఉత యత్ పతయో దశస్త్రియాః పూర్వే అబ్రాహ్మణా'** యందు స్త్రీ యొక్క అర్థము ఉణాదికోశము ౪-౧౬౬ నందు **'స్త్యాయతేర్డ్రట్'** సూత్రముననుసరించి **'స్త్యైశబ్ద సంఘాతయోః'** ఈ ధాత్వర్థము యొక్క ఆధారముపై చేయవలయును. ఇట సాధారణ లౌకిక స్త్రీతో తాత్పర్యము గాదు. కాని ఉపదేశమొనర్చునట్టి జ్ఞాన సంధాత లేక జ్ఞానభండారమగు వేదవిద్య చే నున్నది. 'స్తృఞ్' ఆచ్ఛాదనే (వ్యాది గణము) ఈ ధాతువుతో గూడ స్త్రీ శబ్దమగును. ఈ విధముగా దీనియర్థము జ్ఞానముతో ఆచ్ఛాదిత మొనర్చునట్టి వేద విద్యయే యగును. ఎట్లన; 'ఛన్దాంసి' ఈ శబ్దమునకు దిగువ అర్థమగును.

**యదేభిరాచ్ఛాదయంస్త చ్ఛన్దసాం ఛన్దస్త్వమ్।**

**ఛన్దాంసి ఛాదనాత్** ॥ నిరుక్త ౭-౧౨ ॥

మున్నగు వాని ద్వారా ఈ విషయమే స్పష్టమగుచున్నది. కావుననే స్త్రీ శబ్దమునకిచ్చట వేద విద్య యగును. మరియు దాని విషయములో సత్యమగు బ్రాహ్మణుడు, స్వార్థరహితుడు, సకల విద్యలను నేర్చిన (ఎరిగిన) వాడు, వానినే **'బ్రహ్మా చేద్ హస్తమగ్రహీత్'** యందు **'బ్రహ్మా'** యను పేరుతో గూడా పిలువబడినది.

**బ్రహ్మా పరివృఢః సర్వతః బృహ వృద్ధౌ బ్రహ్మా సర్వవిద్యః** ॥ నిరుక్త ౧౧-౭ ॥

ఉత్తమ తపస్వియే అట్టి వేద విద్య, లేక బ్రహ్మ విద్య యొక్క స్వామి యగును. ఒకవేళ పదిమంది బ్రాహ్మణులు అనగా పరమేశ్వరుని, మరియు వేద స్వరూపము నెరుగని వారు, నిఃస్వార్థులు, పరిశుద్ధులు, సదాచారులు, తపోధనులు గానివారు వేద విద్య మరియు బ్రహ్మ విద్యకు అధిపతులు - సత్యమైన రక్షకులు కాజాలరు. ఏలన; వేద విద్యలరహస్యము కేవలము తపస్వియగు బ్రాహ్మణుల ఋషులయెదుటనే వెల్లడియగును.

**న హ్యేషు ప్రత్యక్షమస్త్యనృషేరతపసో వా** ॥ నిరక్త అ.౧॥

ఋషులు, తపస్వులు, గానివారికి వేదమంత్రముల ప్రత్యక్షము, లేక సాక్షాత్తు, యథార్థ జ్ఞానము గలుగజాలదు. ఇట్టి ఋషులు, తపస్వులే బ్రాహ్మణులు, వారి జన్మము యే కులమందైనను పై గుణములు గలవారే బ్రాహ్మణ శబ్దమునకర్హులు. జన్మతో బ్రాహ్మణుడెవ్వడును గాజాలడు. దీనియందు జాత్యభిమానమను మాటయే యుండదు. మరియు స్వార్థాంధత్వము కూడా అట్టివారి ఛాయలకు రాజాలదు.

బ్రాహ్మణ ఏవ పతిర్న రాజన్యో న వైశ్యః ॥ ఇట్టి బ్రాహ్మణుని లక్షణములు.

**సత్యం దానమథాద్రోహ ఆనృశంస్యం త్రపా ఘృణా ।**

**తపశ్చ దృశ్యతే యత్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః** ॥ మ. భారత శాంతిపర్వ. అ.౧౮౯ ॥

**శమో దమస్తపః శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।**

**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్** ॥ భగవద్గీత ౧౮॥

శాస్త్రములందు జెప్పబడిన ఇట్టి శుభ గుణములు గలవాడే బ్రాహ్మణుడు. వేద విద్య, లేక బ్రహ్మ విద్యకు సత్యమగు యజమాని, మరియు రక్షకుడు కాగలుగును. రాజస, తామస గుణయుక్తులు, స్వార్థ సంపన్నులునగు క్షత్రియులు, వైశ్యులు గాజాలరు.

ఇచ్చట సూర్యుడు - జ్ఞాన ప్రకాశకుడగు పరమేశ్వరుడు స్వయముగా మానవమాత్రులందరి కొరకు ఇట్లు ఘోషణ మొనర్చుచున్నాడు. ఇచ్చట బ్రహ్మజాయా, మరియు బ్రాహ్మణ శబ్దముల నిజమగు అర్థములను దెలిసికొనని కారణముననే ఇట్టి భ్రాంతి గలిగినది. అథర్వ. ౫-౧౮-౧౯ ను ఉదాహరించుచు 'వైదిక్ ఏజ్' లేఖకులు ఈ విధముగా వ్యాఖ్యను వ్రాసినారు.

*Not only the Brahman's wife, but also his property was sought to be protected by a similar appeal to people's superstition.*

అనగా బ్రాహ్మణ స్త్రీనే గాక, అతని సంపదలను గూడ లోకుల అంధ విశ్వాసములను జాగృతపరచి రక్షింప యత్నించబడెననుట భ్రాంతి మూలకమే. అథర్వ ౫-౧౮-౧౯ను నిష్పక్షిక భావముతో చదివినప్పుడు దానియందెట్టి ఆరోపణకును అవకాశముండదు. దానియందెచ్చటను సంపత్తిని గూర్చి నిర్దేశముగాని పేరు గాని లేదు. బ్రాహ్మణుని **'గోవు'** అనగా అతని వాణియే. దానిని నిరోధించు ప్రయత్నము పూర్తిగా అనుచితము, మరియు హానికరమే యగును. 'వైదిక్ ఏజ్' లేఖకులు వాస్తవముగా బ్రాహ్మణ శబ్దమునకు యథార్థ అర్థము దెలిసికొనినట్లైన ఈ విధమగు విమర్శనాత్మక సమాలోచన మొనర్చు సాహసము జేయకుండెడి వారు ఇచ్చట బ్రాహ్మణుని తాత్పర్యము జాత్యభిమానులగు భోజన భట్టులు గాదు. దీనితాత్పర్యము సత్యమైన బ్రహ్మజ్ఞానులు, మరియు ఈశ్వరుని నిజమైన భక్తులు మాత్రమే. దీని నిర్ణయము ఈ రెండు సూక్తములందును ఈ శబ్దముల ద్వారా చూపబడినది.

**న బ్రాహ్మణో హింసిత వ్యోఽగ్నిః ప్రియతనోరివ ।**

**సోమో హ్యస్యదాయాద ఇన్ద్రో అస్యాభిశస్తిపాః ॥ ౬ ॥**

అనగా; నిజమైన బ్రాహ్మణునెప్పుడును హింసించరాదు. ఆతడు రాష్ట్రమను శరీరమునకు అగ్ని వంటి వాడు. శాంతి స్రోతయగు పరమేశ్వరుడీతనికి సంబంధించినవాడేయని, మరియు నాతనికి ( అభిశస్తిపాః) హింసనుండి రక్షకుడు, నిజమగు బ్రాహ్మణుని, కోమలత్వమును గలవాడు, దుర్బలుడని దలచి ( దేవపీయుః) విద్వాంసుల హింసకుల ( ధనకామః) ధన గర్వముతో అజ్ఞాన కర్మలొనర్చువారు నష్టపడుదురు. బ్రాహ్మణుని విషయములో నిట్లు వ్రాయబడినది. ఆతడు **'దేవబన్ధు'** వగును. అనగా; దివ్య గుణములను తనయందు ధారణ మొనర్చుకొని ఆతని నిజమగు హితకారి మిత్రుడగును. ఇట్టి నిజమైన బ్రాహ్మణుని తిరస్కరించువారికి ఎప్పుడును శుభములు గలుగవు.

**యో బ్రాహ్మణం దేవబన్ధుంహినస్తి న స । పితృయాణమప్యేతి లోకమ్** ॥ అథ. ౫-౧౮-౧౩ ॥

౧౪వ మంత్రములో బ్రాహ్మణులు అనగా తపస్వులు, స్వార్థరహితులు, బ్రహ్మజ్ఞానులనైనవారి కొరకు **'బ్రహ్మ అధీతే తద్ వేద వా తద్ ధీతేతద్ వేద - బ్రాహ్మణః వేధసః'** అను శబ్ద ప్రయోగము వచ్చినది. దీనికి నిఘంటు 3-౧౫లో **'మేధావి'** నామములందు పేర్కొనబడినది. గౌరవించదగిన బ్రాహ్మణుని ఆతని సత్యమయ వాణి ని నిరోధింపరాదని ఈ సూక్తములందు వర్ణన గలదని దీనివల్ల స్పష్టమగుచున్నది. ఏదో యొక విశేష జాతి, లేక జన్మసిద్ధ వర్గముతో సంబంధము గలవా రని కాదు. కాని 'వేధసః' మానవమాత్రులు ధారణమొనర్చునట్టి మేధాబుద్ధి సంపన్నులు, తపోధనులగు మహానుభావులకే ఈ బ్రాహ్మణ నామము సార్థకమని తెలియవలయును. ఆ మంత్రమిది.

**అగ్నిర్వై నః పదవాయః సోమో దాయాద ఉచ్యతే ।**

**హన్తాభిశస్తేన్ద్ర స్తథా తద్ వేధసో విదుః ॥ ౧౪ ॥**

అనగా ; ( అగ్నిః) జ్ఞాన స్వరూపుడగు పరమేశ్వరుడు (వై) నిశ్చయముగా (నః) మాయొక్క (పదవాయః) ముందరికిగొనిపోవునట్టి మార్గదర్శకులు ( పదం - ప్రాప్తవ్యస్థానం వాయయతి - గమయతీతి పదవాయః) (సోమః) శాంతిస్రోతయగు జగదీశ్వరుడు ( దాయాదః ఉచ్యతే) మన సంబంధియని చెప్పబడును. ( ఇన్ద్రః అభిశస్తిహా హన్తా) పరమైశ్వర్య సంపన్నుడగు ఆ ప్రభువు మమ్ము హింసనుండి రక్షణ నొనర్చువాడు ( తద్ తథా వేధసః విదుః) ఈ సత్యమును మేధావులగు బ్రాహ్మణులు మాత్రమే అనుభవ పూర్వకముగా నెరుగుదురు. ఇట్లు సత్య తపస్వి మేధావంతులగు బ్రహ్మవేత్తలపై స్వార్థాంధత్వ దోషమాపాదించుట 'వైదిక్ ఏజ్' లేఖకుల మహా అనుచితమగు దుస్సాహసమే. తాము బలవంతుల మనుకొని సత్యమగు బ్రాహ్మణుల నవమానపరచువారు, మరియు వారి గౌ- ఓజస్విని, జనహితకారిణి, కల్యాణప్రదమగు **'వాణిని'** స్వార్థ వశమున నిలిపి వేయుటకు ప్రయత్నించురాజు ఎచ్చటనున్నను ఆతని రాష్ట్రము నష్టమైపోవుననుటలో సందేహము లేదు.

ఉగ్రో రాజా మన్యమానో బ్రాహ్మణం యో జిఘత్సతి।

పరాతత్ సిచ్యతే రాష్ట్రం బ్రాహ్మణో యత్ర జీయతే ॥ అథర్వ ౫-౧౯-౬ ॥

తద్ వై రాష్ట్రమాస్రవతి నావం భిన్నామివోదకమ్

బ్రహ్మాణం యత్ర హింసంతి తద్ రాష్ట్రం హన్తిదుచ్ఛునా ః ॥

పడవ పగిలి పోయిన అందు నీరు ప్రవహించి పోవునట్లుగా సద్గుణమహాత్ముడు, సర్వవిద్యాసంపన్నుడు, తపస్వి, మేధావి యగువారిని హింసించు రాష్ట్రము దుర్గతి పాలై నష్ట భ్రష్టమై నశించిపోవును. బ్రహ్మ శబ్ద ప్రయోగము ఇచ్చట ఒక విశేష వర్గమని భ్రమపడకుండుటకై ప్రయోగించబడినది. బ్రహ్మ అను పదమునకు నిరుక్తకారుడగు యాస్కాచార్యుడీ విధముగా అర్థము చేసినాడు.

బ్రహ్మ - సర్వ విద్యః, సర్వం వేదితుమర్హతి, బ్రహ్మ పరివృఢః శ్రుతతః, బ్రహ్మ

పరివృఢం సర్వతః ॥ నిరుక్తము ౧-౮ ॥

సకల విద్యా సంపన్నుడు, తీక్షణమగు మేధాబుద్ధి కారణమున సర్వమును దెలిసికొనగలవాడు, శాస్త్ర శ్రవణ కారణమున అన్ని వైపుల వృద్ధిని పొందగలిగినవాడే బ్రాహ్మణుడు. ఇట్టి సర్వ విద్యా సంపన్నులగు మేధావులను అవమాన పరచు రాష్ట్రము నష్ట భ్రష్టమై పోవుననుటలో సందేహము లేదు. దీనిని స్వార్థ పరాయణ బ్రాహ్మణత్వాభిమానుల కథనముగా చూపుట సంపూర్ణముగా పొసగనిది. వాస్తవమునకు ఇచ్చట కూడా 'వైదిక్ ఏజ్' లేఖకులు క్రొత్త విషయమేమియును వ్రాయలేదు. దిగువ వ్రాయబడిన బ్లూంఫీల్డు వ్రాసిన భావములనే బ్రాహ్మణ శబ్దమున కర్థము. ఏ మాత్రము ఆలోచించకుండానే ప్రకరణము, మరియు అనుసరణ మొనర్చినారు. బ్లూంఫీల్డు *Hymns of the Atharva Veda* పు. ౪౩౦లో ఇట్లు వ్రాసినాడు.

*The object of the two hymns V.18 and 19 is clearly to present in the most drastic language the danger which arises from the oppression of Brahmans and usurpation of their property.*

మాకు 'వైదిక్ ఏజ్' లేఖకులగు విద్వాంసులపై ఆశ్చర్యము, మరియు ఖేదమును గలుగుచున్నది. ఏలన, వారు ఏ మాత్రమును ఆలోచించకుండా పాశ్చాత్య అనువాదకుల అనువాదములను, లేఖలనే ప్రామాణికముగా నమ్మి అప్రియము, కటువు, అసత్యములగు విచారములే వేదవిద్యలని వ్రాసినారు. ఉదా॥ వారి యీ శబ్దములెంత అసత్యము, అప్రియములైనవో చూడుడు.

*The Brahmana's supposed privileges have thus been **shamelessly** asserted in the Atharva Veda, **of his obligation there is hardly any mention**....... To the Brahmanas of the Atharva Veda it was evidently more important to be dear to the bestowerer of Dakshina than to be dear to the gods. V.A.P.409.*

ఈ వాక్యములందు వారు ' అథర్వ వేదములో నిర్లజ్జతా పూర్వకముగా బ్రాహ్మణులకు కల్పిత అధికారముల ప్రతిపాదన గలదని వారి కర్తవ్యములను గూర్చి ఎంతో కఠినముగా కొంత వర్ణన గలదని పేర్కొన్నారు. బ్రాహ్మణులు తమకు దక్షిణ నిచ్చు వారికి దేవతలకన్ననధిక ప్రియులగుటకు ఎక్కువ మహత్వమునిచ్చి నారనియు వ్రాసినారు. మేము పైన ప్రమాణములుగా వ్రాసినవానిని చూచినచో వారు వ్రాసిన కల్పనలు స్పష్టముగా గలవు. బ్రాహ్మణ, బ్రహ్మ, వేధాః, దేవ బంధుః మున్నగు శబ్దములే వారి యీ అసత్యమును నిరూపించ గలవు. నిష్పక్షపాత భావముతో ఈ విషయములను పునః చక్కగా మననమొనర్చి, సత్యమును గ్రహించి ప్రకటించుటలో వారేమాత్రమును సంకోచించకుందురు గాక. అని యాశించుచున్నాము.

### 10.33 మద్య, మాంస, జూదముల సేవనము వేద విరుద్ధము

చివరకి 'వైదిక్ ఏజ్' లేఖకులు గలిగించిన మరొక భ్రమను స్థాన స్థానములందును వ్యాప్తపరచినదానిని దూరమొనర్చి, గ్రంథ విస్తార భయము వలన ఈ యధ్యాయమును ముగించి వేయదలచినాము. ఈ విషయములో యజ్ఞప్రకరణమునందును మేము ప్రకటించి యుంటిమి. ఐనను భ్రమ నివారణార్థము మరియు కొంత స్పష్టీకరణము ఆవశ్యక మనిపించినది. 'వైదిక్ ఏజ్' పు.౪౫౭లో మద్యము, మాంసము, ద్యూతము ( జూదము) మున్నగువాని సేవన విషయములో నిమ్న వాక్యములు చూడబడుచున్నవి.

Dice was another amusement. The number of dice, the method of dice-playing and the names of the throws are all described in detail in the various texts of this (Yajur Vedic) period. A ritual game of dice is played at the Agnyadheya and the Rajasuya ceremonies. So gambling is probably sought to be restricted by elevating racing and dicing to the rank of religious ceremonies.

#### *FOOD AND DRINK*

Meat-eating seems to be fairly common, as in the Rig Vedic age. The Shatapatha Brahmana prescribes the killing of a great ox or goat in honour of a guest. Generally meat was eaten on the occasion of some ceremony or other, but such ceremonies were performed almost every day. Its use is forbidden during the observance of a vow. It appears that the killing of cows gradually come into disfavour. The normal meat diet consisted of the flesh of the sheep, the goat and the ox, the usual scrificial victims. What man ate, he offered to the gods. – Vedic Age P.457.

Sura, an intoxicating spirituous, liquor already known in the Rig Vedic age is often mentioned. Though tolerated as an ordinary drinking (the drink of the people in the Sabha) it is condemned as leading to quarrels and as seducing men from the path of virtue like dicing and meat eating. - Atharva Veda VI. 701.

The Sautramani sacrifice is of the nature of an expiation or penance for an indulgence in Sura. The method of its **preparation can not be ascertained. Probably** it was prepared from fermented grains and plants. - Vedic Age. P.457.

మేమీ దీర్ఘమగు ఉదాహరణమును 'వైదిక్ ఏజ్' లేఖకుల దృష్టికోణము జూపుట కొరకు ఇచ్చినాము. ''యజుర్వేద కాలములో జూద మొక లోకప్రియ మనోరంజక సాధనము, దీని సంబంధమున విస్తృత నిర్ణయము యజుర్వేదము నందు చూడనగును. అగ్న్యాధేయ, మరియు రాజసూయములందు జూదమాడబడుచుండెడిది. దీనిప్రయోగముపై ప్రతి బంధకముంచుట, లేక దీనిని పరిమిత పరచుటకై దీనికి ధార్మిక క్రియారూపము నిచ్చియున్నా రనిపించుచున్న'' దని వీరి కథనము.

**సమీక్ష :** నిజమునకు వీరి యీ నిర్ణయము అశుద్ధమే. యజుర్వేదములో ద్యూతము, లేక జూదము విషయములో విస్తృత నిర్ణయము గలదానికి 'వైదిక్ ఏజ్' లేఖకులు ఎట్టి ప్రమాణములుగాని, గుర్తులు గాని చూపలేదు. ప్రమాణములు లేకుండా కేవలము వారి కథనముతో ఏ విషయమునైనను ఎట్లు నమ్మవచ్చును ? మేము చూచినంత వరకు ఋగ్వేదము నందు ఒక సంపూర్ణ సూక్తము (౧౦-౩౪) ఈ ద్యూతము యొక్క చెడుగులను చూపుటకొరకే యున్నది. దీనియందు పాచికల విషయములో ఇట్లు వ్రాయబడి యున్నది.

**దివ్యా అఙ్గారా ఇరిణే న్యుప్తాః శీతాః సన్తో హృదయం నిర్దహన్తి** ॥ ౧౦-౩౪-౯ ॥

**జాయా తప్యతే కితవస్య హీనా మాతా పుత్రస్య చరతః క్వ స్వి్త్** ॥ ౧౦-౩౪-౧౦ ॥

అనగా; ఈ జూదపు పాచికలు నిప్పు రవ్వల వలె పై నుండి శీతలముగా నుండియును, హృదయమును కాల్చివేయును. జూదరి భార్య మహా దుఃఖమున మునిగియుండును. వాని తల్లి పిచ్చిదానివలె దిరుగుచుండును. వాని అత్తయును వాని నసహ్యించుకొని చీదరించుకొనును. వాని భార్య ఋణదాతలకు వానికి అప్పు లీయకుండుటకై హెచ్చరించుచుండును. **'న నాథితో విన్దతే మర్డితారమ్'** వాని తల్లిదండ్రులు, సోదరులు మున్నగువారు 'వీనిని మేమెరుగము, బంధించి తీసికొనిపొండని' అందురు. మున్నగునవి.

చివరకు స్పష్టమగు శబ్దములలో ఇట్లు హితము బోధించబడినది. **'అక్షైర్మా దీవ్యః'** ఓ మానవులారా! జూద మెప్పుడును ఆడకుడు

**కృషిమిత్కృషస్వ విత్తే రమస్వ బహు మన్యమానః ।**

**తత్ర గావః కితవ తత్ర జాయా తన్మే విచష్టే సవితాయమర్యః** ॥ ఋ. ౧౦-౩౪-౧౩ ॥

కృషి మున్నగు పరిశ్రమ సాధ్యమగు కార్యములను జేయుము మరియు నీవిధముగ ధర్మము మరియు పరిశ్రమ పూర్వకముగా ధనము నార్జించుము. ఓ జూదరీ! ఇట్లు చేయుట వల్లనే నీకు ఉత్తమ గోసంపద ప్రాప్తించును. మరియు కుటుంబ సుఖముచేకూరును. ఇది ఈశ్వరాజ్ఞ అని ఇంత స్పష్టమగు శబ్దములలో వేదములలో జూద నిషేధముండగా, అగ్న్యాధేయము, రాజసూయములందు జూదమాడబడుటనుగూర్చి ఎవరో

స్వార్థులు వ్రాసినది వేద విరుద్ధమగుటచే అది సదా మన్నించదగినది గాదు. ధర్మ రాజని యెంచబడు యుధిష్ఠిరుడు కూడా జూదమాడి యుండెను. కాని దానివల్ల ఆతని గౌరవము నష్టమైనది. ఎన్నియో కష్టముల పాలైనారు. శ్రీ కృష్ణుడాతనిని గలిసినప్పుడు కూడా ఇట్లు చెప్పియుండెను.

**నైతత్కృచ్ఛ్రమను ప్రాప్తో భవాన్ స్యాద్ వసుధాధిప।**

**యద్యహం ద్వారకాయాం స్యాత్ రాజన్ సన్నిహితః పురా॥**

**ఆగచ్ఛేయమహం ద్యూతమ్, అనాహూతోఽపి పాణ్డవైః।**

**వారయేయమహం ద్యూతం, బహూన్ దోషాన్ ప్రదర్శయన్॥**

**స్త్రియోఽక్షా మృగయాపానం, ఏతత్కామ సముత్థితమ్।**

**దుఃఖం చతుష్టయం ప్రోక్తం, యైర్నరో భ్రశ్యతే శ్రియః॥** మహాభారత వనపర్వ. అ.౧౩॥

అనగా; ఒక వేళ నేను ద్వారకలో నుండియున్న నీకీదుఃఖము ప్రాప్తించకుండెడిది. ఏలన; నేను పిలువబడకున్నను జూద స్థానమునకు చేరి దాని అనేక దోషములను జూపి అందరను ద్యూతము నుండి దొలగించియుందును. స్త్రీలు, ద్యూతము, వేట , సారాయి మున్నగు మత్తు పదార్థ సేవనమను ఈ నాల్గు కామముచే నుత్పన్నమగు దుఃఖదాయక వ్యసనములు. దీనివల్ల మనుష్యులు శోభ, మరియు లక్ష్మి ( సంపదలు) నుండి భ్రష్టులై పోవుదురు.

ధర్మాత్ములెల్లరి విచారము లీవిధముగానే యుండును. వేద విరోధియగు దుష్టుడెవడో జూదమాడి యుండిన యాతనినే యాధారముగా గొని దానిని సమర్థించుట ఉచితముగాదు. వైదిక కాలములో ధర్మాత్ముడైనను జూదము నాడుచుండెను. అది మంచిదని యెంచబడుచుండె ననుటకెట్టి యాధారములు లేవు. వేదములలో దీని నిషేధమును గూర్చి 'అక్షైర్మా దీవ్యః' నీవెప్పుడును జూదమాడకు' మని స్పష్టముగా చెప్పబడియున్నది.

## 10.34 మద్య నిషేధము

జూదము వలెనే వేదములందు మద్యపానమును గూర్చి కూడా స్పష్టముగా నిషేధము గలదు

**సప్తమర్యాదాః కవయస్తతక్షుం స్తాసామేకాది మభ్యంహురో గాత్** ॥ ఋ. ౧౦-౫-౬॥

ఈ మంత్రములో నిషేధించబడిన ఏడు మర్యాదలలో ఏ యొక్కదాన్నైనను సేవించువాడు పాపాత్ము డగును. వానియందు మద్యపానము కూడా ఒకటి. యాస్కాచార్యులు తన నిరుక్తము ౬-౫లో ఈ యేడు మర్యాదల నిట్లు లెక్కించి నాడు.

**స్తేయం, తల్పారోహణం, బ్రహ్మ హత్యాం, భ్రూణహత్యాం, సురాపానం, దుష్కృ**

**తస్య కర్మణః పునః పునః సేవాం, పాతకేఽనృతోద్యమితి** ॥ నిరుక్త ౬-౫ ॥

వీనిలో చౌర్యము, వ్యభిచారము, బ్రహ్మహత్య, గర్భపాతము, అసత్య భాషణము, పదేపదే చెడు కర్మల నొనర్చుట వీనితోగూడ మాదక పదార్థ సేవనము కూడా లెక్కింపబడినది.

**హృత్సు పీతాసో యుధ్యన్తే దుర్మదాసో న సురాయామ్ ।**

**ఊధర్న నగ్నా జరన్తే ॥** ఋగ్వేద ౮-౨-౧౨ ॥

'త్రాగు బోతులు మత్తులో మునిగి ఒండొరులు నగ్నవేషులై పోట్లాడుచు అసంబద్ధమగు ప్రేలాపనము లాడుచుందు' రని ఈ వేదమంత్రములో ఉపమాన మిచ్చి చూపబడినది.

**'న స స్వో దక్షో వరుణ ధ్రుతిఃసా సురా మన్యుర్విభీదకో అచిత్తిః ।**

**అస్తి జ్యాయాన్ కనీయస ఉపారే స్వప్నశ్చనేదనృతస్య ప్రయోతా ॥** ఋ. ౭-౮౬-౬ ॥

ఈ మంత్రములో వస్తునిర్దేశమొనర్చబడినది. వీని వల్ల మనుష్యులు అధర్మములందు ప్రవృత్తులగు చుందురు. దీనియందే సురా (సారాయి) మరియు విభీదకః (జూదము) కూడా పరిగణించబడినది. దీనిని 'వైదిక్ ఏజ్' లేఖకులు కూడా;

*Drink is condemned as leading to quarrels and as seducing men from the path of virtue like dicing and meat eating. - Atharva. VI.70-1.*

ఇట్లు వ్రాసి అంగీకరించినారు. ఇచ్చట నీయబడిన మంత్రము 'వైదిక్ ఏజ్' ననుసరించియు ధర్మ మార్గము నుండి తొలగించునది. వాద వివాదము, పోట్లాట లందు ప్రవృత్తుల నొనర్చునది యని చూపబడినది అది యిట్లు గలదు.

**యథా మాంసం యథా సురా యథాక్షా అధిదేవనే ॥** అ. ౬.౭౮.౧ ॥

మాంసము, సారాయి, జూదము, ఈ మూడింటిని ఒక వరుసలో నుంచి ఇవి నిందనీయము, వర్జనీయ మని చూపబడినది. ఇందు సందేహ మేమియును లేదు.

## 10.35 వేదములందు మాంసనిషేధము

ఈ విషయములో కొన్ని మంత్రములను మే మిదివరకే ఉదాహరించియుంటిమి. మరికొన్నిటి నిచ్చట ఉల్లేఖించుచున్నాము. వీనియందు హింస, తజ్జన్య (వాని ద్వారా బుట్టిన) మాంసాదుల నిషేధము, మరియు సకల పశువుల రక్షణను గూర్చిన ఉపదేశము గలదు. ఆ మంత్రములివి;

**౧. మా స్రేధత సోమినో దక్షతా మహే కృణుధ్వం రాయ ఆ తుజే ।**

**తరణిరిజ్జయతి క్షేతి పుష్యతి న దేవాసః కవత్నవే ॥** ఋగ్. ౭-౩౨-౯ ॥

దీనియర్థమేమన; (సోమినః) శాంత పురుషులారా! మీరు (మాస్రేధత) హింసనొనర్చకుడు. **'స్రిధ-హింసాయామ్'** సకల విధములగు శక్తి సంపదల కొరకు ప్రయత్నశీలు రగుడు. ఎవడు (తరణిః) రక్షకు డగునో ఆతడే జయమునొందగలడు. అంతటా ప్రేమ పూర్వకముగా వర్తించుచు అందరిని విద్యలందు

బలపరచును. (దేవాః) సత్యనిష్ఠకల జ్ఞానులు (కవత్సవేన) హింస మున్నగు కుత్సిత ఆచార వ్యవహారములు గలవారిని బుద్ధిశాలురెవ్వరును సమర్థించరు. ఎంతో ఉత్తమముగా మంత్రములో హింస నిషేధించబడినది. ఈయజుర్వేద మంత్రములో,

**౨. ప్రేదగ్నే జ్యోతిష్మాన్ పాహి శివేభిరర్చిభిష్ట్వమ్ ।**

**బృహద్భిర్భానుభిర్భాసన్ మా హింసీస్తన్వా ప్రజాః ॥ యజు.౧౨-౩౨॥**

ఇచ్చట మనుష్యునకుపదేశించుచు నీవు (బృహద్భిః భానుభిః) మహాన్ జ్ఞాన కిరణములచే ప్రకాశితుడవగుము మరియు (తన్వా) నీ శరీరము ద్వారా (ప్రజా మా హింసీః) ప్రాణులను హింసించకుము. ఈ దిగువ అథర్వ వేద మంత్రమందును, బుద్ధి భ్రష్టమగుటతోడనే మనుష్యుడు పశుహింసవంటి వానియందు ప్రవృత్తుడగునని కలదు.

**౩. యత్ర జాయతే యమిన్య పర్తుః సా పశూన్ క్షిణాతి రుఫతీ రుశతీ** ॥ అథ. ౩-౨౮-౧॥'

అనగా; (యత్ర) ఎట్టి స్థితి విశేషములో (యమినీ) మానవులను నియమమందుంచు బుద్ధి (అపర్తుః జాయతే) భ్రష్టమగునో అప్పుడు వారు పశువులను శస్త్రాఘాతముచే, లేక మరొక విధముగా హత్యానొనర్చుచు పశువులను నష్టమొనర్చుచుండును. రిఫ, రిష ధాతువులు హింసార్థకములు, ధర్మాత్ములు సమస్త పశుపక్షులను రక్షించుచుందురు. దీని యుపదేశము ఈ అథర్వ వేద మంత్రములో ఈ విధముగా గలదు.

**౪. యే రాత్రిమనుతిష్ఠన్తి యే చ భూతేషు జాగ్రతి ।**

**పశూన్ యే సర్వాన్ రక్షన్తి తే న ఆత్మసు జాగ్రతి తే నః పశుషు జాగ్రతి** ॥ అథర్వ ౧౯-౪౮-౫ ॥

అనగా; ఏ ధర్మాత్ములు రాత్రులందు ధ్యానము మున్నగు యోగాభ్యాసముల నొనర్చు చుందురో, ఎవరు సర్వ ప్రాణుల విషయములో సదా జాగ్రత్తగ నుందురో, ఎవరు సమస్త పశుపక్ష్యాదులను రక్షించుచుందురో, అట్టివారే సర్వాత్మల ఉన్నతి విషయములో జాగరూకులై యుందురు. ఏ ప్రాణులకును మా వ్యవహారములచే కష్టములు గలుగవల దను విషయమును మరవకుందురు. అథర్వ వేదమందలి ఈ ప్రార్థనను ప్రతి మనుష్యుడొనర్చవలెను.

**౫. ప్రియః పశూనాం భూయాసమ్** ॥ అథ ౧౭-౪॥

అనగా; నేను ప్రాణులకు ప్రియుడ నగుదును గాక, పశురక్షణ నొనర్చువారు మరియు వానిని ప్రేమ దృష్టితో జూచువారు మాత్రమే వానికి ప్రియు లగుదురు. కాని వానిని హత్య చేయువారు, హింసించువారు మాత్రము కాజాల రని స్పష్టమగుచున్నది.

**౬. దృతే దృంహ మా మిత్ర, స్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తాం మిత్రస్యాహం చక్షుషా**

**సర్వాణి భూతాని సమీక్షే మిత్రస్య చక్షుషా సమీక్షామహే** ॥ యజు. ౩౬.౧౮॥

ఈ మంత్రము మేము ఇది వరకే అనేకసార్లు ఉల్లేఖించియుంటిమి. వేదముల దృష్టిలో సమస్త ప్రాణులను మిత్ర దృష్టితో జూడవలె నను ఉపదేశముగలదు. వానిని చంపి, లేక చంపించి వాని మాంసమును దినవలె ననున దెచ్చటను లేదు.

౭. యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే యో అశ్వ్యేన పశునా యాతుధానః ।

యో అఘ్న్యాయా భరతి క్షీరమగ్నే తేషాం శీర్షాణి హరసాపి వృశ్చ ॥ ఋ.౧౦-౮౭-౧౬ ॥

పరిపాలకులు మాంసమును భుజించువారు, అనగా అశ్వముల, మరియు ఇతర పశువుల మాంసమును దినువారు, గోవులు మున్నగు పశువులను జంపి వాని క్షీరముల నుండి ప్రజలను వంచించు వారిని శిక్షించవలెనని కలదు. ఇతర దండనలచే ఇట్టి **'యాతుధాన'** హింసకులు, రాక్షసవృత్తిగల మనుష్యులు చక్కబడకున్న నీ తేజముతో వారి తలలను నరికివేయుము. ఇదియే చివరి దండనము. అవసరమును బట్టి దీనినాచరించవచ్చును

౮. య ఆమం మాంసమదన్తి పౌరుషేయం చ యే క్రవిః ।

గర్భాన్ ఖాదన్తి కేశవాస్తానితో నాశయామసి ॥ అథ. ౮-౬-౨౩॥

ఈ మంత్రములో పచ్చి మాంసమును దినువారిని, ఇతరుల ద్వారా వండించిన మాంసమును దినువారిని, గర్భ రూపమగు గ్రుడ్లను దినువారిని వారి యీ దుష్ట వ్యసనము ను నాశపరచవలెనని కలదు. ఈ విధముగా వేదములందు మాంస భక్షణము సంపూర్ణముగా నిషేధింపబడిన దని మనకు స్పష్టమగుచున్నది. ఇందుకు వ్యతిరిక్తముగా ఎచ్చట నేమైనా వ్రాసియున్న దనిన అది నమ్మదగినది కాదని తెలియవలెను.

**యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే** ॥ ఋ ౧౦-౮౭-౧౬॥

ఈ మంత్రము మాంసభక్షణ నిషేధ దృష్టితో అధిక మహత్త్వమైనది. కావున దీని సాయణాచార్య కృత భాష్యమునీయబడుచున్నది.

యః యాతుధానః - రాక్షసః ( పౌరుషేయేణ (క్రవిషా) పురుష సంబంధినా మాంసేన సమఙ్క్తే ఆత్మానం సంగమ యతి( యశ్చఅశ్వ్యేన) అశ్వసమూహేన తదీయేన మాంసేనత్యర్థః ఆత్మానం సంగమయతియో వా యాతుధానః అన్యేన పశునా ఆత్మానం సంగమయతి యో వా యాతుధానః (అఘ్న్యాయా) గోః ( క్షీరమ్) ( భరతి) హరతి హే అగ్నే త్వం తేషాం సర్వేషామపి రాక్షసానామ్ ( శీర్షాణి) శిరాంసి ( హరసా) త్వదీయేన తేజసా ( వృశ్చ) ఛిన్ధి'' దీనియర్థము మేమిదివరకిచ్చినదే.

ఋ.౧౦-౮౭లో యాతుధానుల, లేక రాక్షసుల స్వభావము వర్ణించబడియున్నది. దానిలో 3,4 స్థానములందు **'క్రవ్యాదః'** విశేషణ ప్రయోగము గలదు. దీనియర్థము మాంస భక్షకులనియున్నది. **'యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే'** ఇది మేము సాయణుని భాష్య సహితముగా నుల్లేఖించిన సూక్తమునందలి మంత్రమే. అదే సూక్తములోని దిగువనీయబడిన రెండు మంత్రములను కూడా ఇచ్చట వ్రాయుట ఆవశ్యకమనిపించుచున్నది.

౯. ''అయోదంష్ట్రో అర్చిషా యాతుధానానుపస్పృశ జాతవేదః సమిద్ధః ।

ఆ జిహ్వయా మూరదేవాన్ రభస్వ క్రవ్యాదో వృక్త్వ్యపి ధత్స్వాసన్ ॥ ఋ.౧౦-౮౭-౨॥

దీని సాయణాచార్యుని భాష్యము 'హే ( జాతవేదః) జాత ధన జాత ప్రజ్ఞ వాత్వం సమ్యగ్ దీప్తః తీక్ష్ణ ఎంష్ట్రః సన్ ( యాతుధానన్) రాక్షసాన్ ( అర్చిషా) జ్వాలయా సందహ । కించత్వం ( మూరదేవాన్) మూఢదేవాన్ మారక వ్యాపారాన్ రాక్షసాన్ ( జిహ్వయా) జ్వాలయా రభస్వ - మారయ స్వేత్యర్థ ః । మారయిత్వా చ ( క్రవ్యాదః) మాంసభక్షకాన్ రాక్షసాన్ ( వృక్తవీ) ఛిత్వా ( ఆసన్) ఆస్యే ( పిదత్స్వ) అపిధేహి ఆచ్ఛాదయేత్యర్థః ॥'

ఇచ్చట కూడా క్రవ్యాద్ అనగా మాంసభక్షకులగు రాక్షసులని చెప్పబడినది. ఒకవేళ జ్ఞానవంతులగు బ్రాహ్మణులు చెప్పినను వినకపోయినచో చివరకు దండన రూపములో వారిని నాశపరచు విధానము గలదు.

**౧౦. సనాదగ్నే మృణసి యాతుధానాన్ న త్వా రక్షాంసి పృతనాసు జిగ్యుః ।**

**అనుదహ సహమూరాన్ క్రవ్యాదో మా తే హేత్యా ముక్షత దైవ్యాయ** ॥ ఋ.౧౦-౮౭-౧౯॥

హే జ్ఞాన స్వరూపుడవగు పరమేశ్వరా! లేక జ్ఞానివగు బ్రాహ్మణా! నీవు రాక్షసులను సదా నాశమొనర్తువు. నీయెదుట వారు నిలువజాలరు. హింసకవ్యాపారులగు మాంసభక్షకులను, మరియు వారి యీ మాంస భక్షణము మున్నగు దుర్వ్యసనములను గాల్చివేయుము. వారు నీ యీ దివ్యమగు అస్త్రము చేతప్పుకొనలేరు. వారిపైన నీ ప్రభావము అవశ్యముగా నున్నది.

**సాయణ భాష్యము : సత్వమ్ అధునా అన్వనుక్రమేణ (సహ మూరాన్) మూలేన సహితాన్ మారకవ్యాపారేణ యుక్తాన్ (క్రవ్యాదః) మాంసభక్షకాన్ రాక్షసాన్ (దహ) తేజసా భస్మీకురు కించ తవ సంబంధినో దివ్యాదాయుధాత్ తే యాతుధానా ముక్తా మా భూవన్ ॥**

ఈ మంత్రము స్పష్టముగా మాంసాహారమును నిషేధించుచున్నది, మరియు మాంసమును రాక్షస భోజనమని దెలుపుచున్నది. ఇది ఋగ్వేద ౧౦-౮౭-౧౯, సామవేదము ౮౦ మరియు అథర్వ ౫-౨౯-౧౧ మరియు ౮-3-౧౮లో వచ్చియున్నవి. మూడు వేదములందును ఇది వచ్చుట వల్ల వేదముల మాంస నిషేధ విషయక ఆజ్ఞలను బలపరచుటకే అని తెలియవలెను.

**౧౧. క్రవ్యాదమగ్నే రుధిరం పిశాచం మనోహనం జహి జాతవేదః ।**

**తమిన్ద్రో వాజీ వజ్రేణ హన్తు చ్ఛినత్తు సోమః శిరో అస్య ధృష్ణుః** ॥ అథ. ౫-౨౯-౧౦॥

ఈ ప్రకరణము నందు తెలిసికొనదగిన విషయమేమన మాంసభక్షణమొనర్చుటయందు ప్రాణ దండన విధించబడదు. ఎవడు మాంసభక్షకుడై హింసక వ్యాపారము గలవాడై, సమాజము, మరియు రాష్ట్రమునకు విఘాతకుడగునో అట్టివానికి శిరచ్ఛేదము అంతిమ దండనము. కావున ఈ మంత్రముల ద్వారా వేదములందు మాంస భక్షణము రాక్షసుల, మరియు పిశాచముల నికృష్ట భోజనమని స్పష్టమగుచున్నది. కాని ఆర్యుల, లేక ఉత్తమ జనములకు ఇది అసహ్యకరము నిందనీయమని తెలియుచున్నది. కావుననే మనుస్మృతి ౧౧-౬౫లో ఇట్లు చెప్పబడినది.

**యక్షరక్షః పిశాచాన్నం, మద్యం మాంసమథాసవమ్** ॥ మను.౧౧-౬౫॥

అనగా; మద్యమాంసాదులు యక్షుల, రాక్షసుల, పిశాచుల భోజనము. దానిని ఉత్తములగువారెప్పుడును గ్రహణ మొనర్చరాదు.

**౧౨. బ్రహ్మద్విషే క్రవ్యాదే ఘోరచక్షసే ద్వేషో ధత్తమన వాయం కిమీదినే** ॥ ఋ.౭-౧౦౪-౨॥

ఈ మంత్ర వ్యాఖ్య నిరుక్తము ౬-3-౧౧లోనూ వచ్చినది. (బ్రహ్మద్విషే) బ్రాహ్మణ ద్వేష్ట్రే (క్రవ్యాదే) క్రవ్యమదతే, క్రవ్యం వికృత్తాజ్జాయతే ఇతి నైరుక్తాః (ఘోరచక్షసే) ఘోరఖ్యానాయ (ద్వేషః) (ధత్తమ్) (అనవాయమ్) అనవయవమ్ యదన్యేన వ్యవేయురద్వేషస ఇతి వా(కిమీదినే) పశునాయ ।

ఇచ్చట రాజు, మరియు న్యాయాధీశుడు మున్నగువారిని సంబోధించుచు ఇట్లు చెప్పబడినది నీవు బ్రాహ్మణుల, అనగా, బ్రహ్మ జ్ఞానులతో ద్వేషముంచు వారికి, మాంస భక్షకులను, కుదృష్టిగలవారిని, నీచులను, కొండెములు చెప్పువారు మున్నగు వారి యెడ సజ్జనులు అనుమోదించిన విరోధము నుంచకుము. వారిని దుర్వ్యసనముల నుండి దూరముంచుటకు ప్రయత్నించుము. ఈ విషయములో నూర్లకొలది మంత్రముల నుద్ధృతపరచవచ్చును. కాని గ్రంథ విస్తరణ భీతిచే రెండు మంత్రములను మాత్రముల్లేఖించబడుచున్నది. వీనియందు బియ్యము, యవలు, మినుములు, నువ్వులు మున్నగు ఉత్తమాన్నములు సేవించుటకు, మరియు పశువుల క్షీరములనే సేవించుటకుపదేశించబడినది.

**౧౩. వ్రీహిమత్తం యవమత్తమథో మాషమథో తిలమ్ । ఏషవాం భాగో నిహితో**

**రత్నధేయాయ మా హింసిష్టం పితరం మాతరం చ ॥** అథర్వ ౬-౧౪౦-౨॥

స్త్రీ పురుషులు మీరెల్లరును (వ్రీహిమ్) బియ్యము (యవమ్) యవలు, గోధుమజాతి (మాషమ్) మినుములు (అథోతిలమ్) నువ్వుల వంటి ఉత్తమ సాత్త్విక ధాన్యములను (అత్తమ్) భుజించుడు (రత్నధేయాయ) ఉత్తమ బుద్ధి, మరియు ఆరోగ్యమును పొందుటకై (ఏషవాం భాగో నిహితః) ఇవియే మీ కొరకు భాగ్యము, కీర్తించదగినవి, మరియు సేవించదగిన ఆహారముగా ఏర్పరచబడినవి. మీ తల్లిదండ్రుల, మాననీయ జనములనెప్పుడును హింసించరాదు. కీర్తించదగిన, పూజించదగిన, సేవించదగిన పదార్థములందు బియ్యము, గోధుమలు (యవలు) మినుములు, నువ్వులు మున్నగునవి గణనీయమైనవి. ఇవి మాంసము వలె హింసతో ప్రాప్తించునవి గావు.

**౧౪. పుష్టిం పశూనాం పరిజగ్రభాహం చతుష్పదాం ద్విపదాం యచ్చ ధాన్యమ్**

**పయః పశూనాం రసమోషధీనాం బృహస్పతిః సవితా మే నియచ్ఛాత్ ॥** అ ౧౯-౩౧-౫॥

ఈ మంత్రమందిట్లు చెప్పబడినది. నేను పశువుల పుష్టిలేక శక్తిని నాలోనికి గ్రహించు చున్నాను మరియు ధాన్యములను సేవింతును. సర్వోత్పాదకుడు, జ్ఞానదాత యగు పరమేశ్వరుడు నా కొరకు ఈ నియమముల నేర్పరచినాడు. ఏమన; (పశూనాం పయః) గోవులు, మేకలు మున్నగు పశువుల దుగ్ధము (క్షీరము)లనే గ్రహించవలెను. కాని నికృష్టమగు మాంసాదులను గాదు. మరియు ఆరోగ్యము కొరకు ఓషధుల రసములను సేవించవలెను. ఇచ్చట కూడా **'పశూనాం పయ ఇతి బృహస్పతిః మే నియచ్ఛాత్'** అనగా; జ్ఞానప్రదాతయగు పరమేశ్వరుడు నా కొరకు గోవులు మున్నగు పశువుల క్షీరములనే గ్రహించవలెనను నియమమేర్పరచినాడు. కాని మాంసాదులు గావు.

**౧౫. శివౌ తే స్తాం వ్రీహియవావబలాసావదోమధౌ ।**

**ఏతౌ యక్ష్మం విబాధేతే ఏతౌ ముఞ్చతో అంహసః ॥** అథర్వ ౮-౨-౧౮॥

మానవా! నీ కొరకు బియ్యము, యవలు మున్నగు ధాన్యములు సుఖసౌభాగ్యములను గలిగించునవి. ఇవి రోగములను దొలగించును. మరియు సాత్త్వికమగు కారణమున పాపవాసనల నుండి నిన్ను దూరముగ నుంచును.

ఇందుకు విరుద్ధముగా మాంసాదులు పాపవాసనలను పెంపొందించునట్టి అనేక రోగోత్పాదకములని దెలియుము. మాంస శబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థము నిరుక్తము ४-౧-3 నందిట్లు చూపబడినది.

**'మాంసం మాననం వా, మానసం వా, మనోఽస్మిన్ సీదతీతివా'** ॥ నిరుక్తా. ४-౧-3॥

మాంసమని ఏల పిలువబడుననగా మా+ ఆననమ్ ఊపిరిని బయటికి నెట్టునది. అనగా; దీని ద్వారా దీర్ఘ జీవనము ప్రాప్తించదు ఇందుకు విరుద్ధముగా ఆయువును క్షీణమొనర్చునది. (మానసం వా) ఇది హింసాజన్యమగుటచే మానసిక పాపములను ప్రోత్సహించునది. (మనోఽస్మిన్ సీదతీతి వా) దేనియందు మనుష్యుని మనస్సు లాగబడునో, ఎయ్యది మనస్సునకు ఇష్టమగు పదార్థమో దానిని మాంసమనవచ్చును. కావుననే పరమాన్నము, పాయసము మరియు ఫలములు, వాని గుజ్జు, రసము మున్నగు వానిని **'మాంస'** మను శబ్దము అనేక స్థలములందు వచ్చినది. దీనినిదివరకే ప్రమాణ సహితముగా చూపబడినది. ఈ విధముగనే మాంసము అభక్ష్యనీయమని వేద ప్రమాణముల ద్వారా స్పష్టముగా సిద్ధిపరచవచ్చును. ఇందుకు విరుద్ధముగా బ్రాహ్మణగ్రంథములు, స్మృతులు, గృహ్యసూత్రములు, శ్రౌతసూత్రములు, కల్పసూత్రములు, మహాభారతము మున్నగు వానియందెచ్చటనైనను వచ్చినను వేద విరుద్ధమగు కారణమున అప్రమాణికముగా నెంచవలెను. 'వైదిక్ ఏజ్' లేఖకులు శతపథ బ్రాహ్మణము పేరుతో ఇట్లు వ్రాసినారు. అతిథి వచ్చిన పెద్ద ఎద్దు లేక మేకను చంపవలె'నని వ్రాసినారు. కాని యది ఆ గ్రంథములో లేదు యాజ్ఞవల్క్య స్మృతి యందు **'మహోక్షం వా మహాజం వా శ్రోత్రియా యోపకల్పయేత్'** ఇట్టి పాఠము లభించును. దానికి **'మితాక్షరా టీక'** లో అర్థమిట్లున్నది.

పెద్ద ఎద్దును, లేక మేకను వేదపాఠకునికి అర్పించవలెనని కలదు. కాని ఇచ్చట చంపుటకెట్టి విధానము లేదు. వాస్తవమునకు మేమిదివరకే ఉక్ష, మరియు అజ శబ్దముల పై వివరముగా వ్రాసి చూపి యుంటిమి. దానిచే **'సోమ'** మను పేరు గల ఓషధి, మరియు **'అజాస్త్రేవద్ బ్రీహయః సప్తవార్షికాః కథ్యన్తే'** పంచతంత్ర కాకోలూకీయమ్ ॥ మున్నగు వానినసురించి ప్రాతబియ్యమని గ్రహించవలెను.

'వైదిక్ ఏజ్' లేఖకులు ఇట్లు వ్రాసినారు. **'మాంస సేవనము'** యజ్ఞముల అవసరములపై చేయబడుచుండెడిది అని కాని యజ్ఞావసరము ప్రతిదినము ఉండును కదా! దీని సంబంధములో మేమిది వరకు ప్రమాణ యుక్తముగా చూపియే యున్నాము యజ్ఞము వంటి పవిత్ర కర్మయందు మాంసము వంటి అతినికృష్ట పదార్థము అతి ఘోరమగు విరుద్ధమే యగును. శతపథ బ్రాహ్మణము ౬-౨లో స్పష్టముగా నిట్లు గలదు.

**'న మాంసమశ్నీయాత్, యన్మాంసమశ్నీయాత్ యన్మిథునముపేయాదితి న త్వేవైషా దీక్షా**

॥ శతపథ బ్రాహ్మణము. ౬-౨ ॥'

యజ్ఞదీక్షను దీసికొనినవారు మాంసమును దినగూడదు. ఒకవేళ నాతడు మాంసముదినినను, స్త్రీ సంభోగమొనర్చినను అది దీక్షయే యనిపించుకొనదు. తైత్తిరీయోపనిషత్తునందును ఇట్లు చెప్పియున్నది.

**న మాంసమశ్నీయాత్, న స్త్రియముపేయాత్**

**యన్మాంసమశ్నీయాత్ యత్ స్త్రియముపేయాత్ నిర్వీర్యః స్యాత్** ॥ తైత్తిరీయ ఉపనిషత్తు ౧-౧-౯-౭౮॥

మాంసము దినవలదు. స్త్రీ సంభోగమొనర్చవలదు. యజ్ఞావసరమందు మాంసము దినినను, స్త్రీ సంభోగమొనర్చినను మనుష్యుడు నిర్వీర్యుడగును. తాణ్డ్య బ్రాహ్మణమందును

**'అహతం వసానోఽవభృథాదుదైతి చతురో మాసో న మాంసమశ్నతీ, న స్త్రియము' పైతి** ॥ తాం. బ్రా. ౧౭-౧౩-౬, ౧౧-౧౨॥

అనగా యజమాని శుభ్రమగుదీక్షా వస్త్రములను ధరించియుండును. కావున యజ్ఞమొనర్చు నాలుగు నెలల వరకు మాంసమును దినవలదు, స్త్రీ సంభోగమొనర్చవలదు మున్నగునవి.

ఈవిధముగా 'వైదిక్ ఏజ్' లేఖకులు వైదికార్యులు ఎద్దు, మేక, గొఱ్ఱెలు మున్నగు పశువులను యజ్ఞ కాలములందు జంపి విశేష రూపములో వాని మాంసమును దినుచుండిరని వ్రాసిన లేఖలు పై యుదాహరణములచే అసత్యమని సిద్ధియగుచున్నది. మేము వేదముల ప్రబల, స్పష్ట ప్రమాణముల ద్వారా మాంస భక్షణము రాక్షసుల, మరియు పిశాచుల కార్యమని చూపినాము. ఈ కార్యమున సంపూర్ణముగా వేద విరుద్ధము, వర్జనీయమని తెలుపుచు ఈ యావశ్యక విషయములను ప్రకాశపరచుచు మేమీ యధ్యాయమును పరిసమాప్త మొనర్చుచున్నాము.

### ఉపసంహారము

మేమీ గ్రంథమును పది అధ్యాయములందు విభక్తపరచినాము. మొదటి అధ్యాయము యొక్క మూడు ఖండములందు క్రమముగా మేము ప్రాచీన, మధ్యకాలీన, అర్వాచీన, విద్వాంసుల వేద విషయమునకు సంబంధించిన అభిప్రాయముల నుల్లేఖించి వానిని నిష్పక్షపాత భావముతో వివేచన మొనర్చినాము.

రెండవ అధ్యాయములో వేదముల మహత్త్వము, మరియు అందుకు కారణము లను నిర్ణయించుచు పారసీ, బౌద్ధ, జైన, ఈసాయి, ఇస్లాం మున్నగు భిన్న భిన్న మతావలంబులగు నిష్పక్ష పాత విద్వాంసుల ద్వారా వేదముల యెడ సమర్పించిన శ్రద్ధాంజలులను సంగ్రహించి చూపబడినవి.

మూడవ అధ్యాయములో 'వైదిక్ ఏజ్' లేఖకులు మరియు అనేక ఇతర విద్వాంసుల **'ఋషుల వేదమంత్రముల కర్తలైయుండి'** రను వారి వాదములను సప్రమాణముగా నిరాకరించినాము. ఋషులు వేద మంత్ర ద్రష్టలు, లేక వాని రహస్యముల ప్రకాశకులు, ప్రచారకులని స్పష్టపరచినాము.

నాల్గవ అధ్యాయములో దేవతల విషయములో విస్తృతముగా నాలోచించుచు సప్రమాణముగా వేదములందు విశుద్ధ రూపములో ఏకేశ్వర పూజయే ప్రతిపాదించబడి యున్నదనియు, వేదము అనేకేశ్వర వాదములను, **'హినోథీఇజమ్'**, లేక అద్వైత వాదమును ప్రతిపాదించలేదని ధృవపరచినాము.

ఐదవ యధ్యాయము నందు వైదిక యజ్ఞముల వాస్తవిక స్వరూపమును ప్రకాశపరచుచు వైదిక్ ఏజ్, మరియు అదే విధమగు సాహిత్యమునందు 'వైదిక యజ్ఞముల లో పశుబలి విధానము గల' దను వాదనను ప్రమాణ సహితముగా నిరాకరించినాము. అశ్వమేధ, గోమేధ, నరమేధము మున్నగువానిని వాస్తవిక రూపములో చూపియున్నాము.

ఆరవ అధ్యాయములో 'వైదిక్ ఏజ్' అను పుస్తకము నుండి అనేక ఉదాహరణము లనిచ్చుచు ఇదియొక సందిగ్ధ మరియు సందేహ జనక పుస్తకమని చూపినాము.

ఏడవ అధ్యాయములో వేదోత్పత్తి కాల విషయములో అనేక కపోల కల్పనలను నిర్దేశించుచు, వాని పరస్పర వైరుధ్యములను జూపుచు 'వేదములు అన్నిటికన్న పురాతనములు, మరియు నిత్యములని సిద్ధిపరచినాము.'

ఎనిమిదవ అధ్యాయములో ఆర్య, దస్యు, దాస, ద్రవిడ మున్నగు శబ్దముల వివేచన మొనర్చుచు ఆర్యుల, దాసుల, దస్యులను వారి యందు ఎట్టి జాతికృత భేదము లేదని చూపియున్నాము. ఆర్య, మరియు ద్రవిడ భాషల సంబంధములో కావలసినంత విస్తారముగా నిరూపణ మొనర్చబడినది.

తొమ్మిదవ యధ్యాయమందు 'వైదిక్ ఏజ్' లేఖకుల ద్వారా యొనర్చబడిన వేదముల కొట్టివేయుటలు, తీసివేయుట ప్రయత్నము సంపూర్ణముగా అనుచితమని చూపుచు వారి సమాలోచనము (విమర్శ)లకు సప్రమాణముగా సమాధానమీయబడినది.

పదవ అధ్యాయములో 'వైదిక్ ఏజ్' మరియునదే విధముగు సాహిత్యమునందు వైదిక శిక్షల విషయములో అశుద్ధమగు విషయములను ప్రకటించినారు. పునర్జన్మ సిద్ధాంతము యొక్క భావము, అథర్వ వేదములో గారడి, మంత్ర, యంత్ర, తంత్రములు, చేతబడులు, రక్షాబంధనములు, మరియు వేదములందు మద్యము, మాంసము, ద్యూతము మున్నగు వాని విధానము, బహువివాహములు మున్నగువాని విషయములో సప్రమాణముగా వివేచనమొనర్చబడినది.

– ఇయ్యది –

కాంగ్డీ గురుకుల విశ్వ విద్యాలయాచార్యులగు శ్రీమాన్ పండిత ధర్మదేవ విద్యావాచస్పతి,
విద్యామార్తాండగారి **'వేదోంకా యథార్థ స్వరూప్'** అను హిందీ మూల
గ్రంథమును ఆర్యావర్తమునందలి ఆంధ్రప్రదేశ్లో ఇందూరు మండలాంతర్గత బీబీపేట
కాపురస్థులగు శ్రీ లోకాలక్ష్మయ్య వేంకమాంబార్యుల ద్వితీయ పుత్రుడు, శిష్యుడును నగు
**''చతుర్వేద భాష్యానువాద భాస్కర''** బిరుదాంకితులు, శతాధిక గ్రంథానువాదకర్తలు
**వేదగిరి పీఠాధిపతులు బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య**
గారిచే నొనర్చబడిన ఆంధ్రానువాదము ; పాలమూరు జనపదమందలి కొందుర్గు మండలాంతర్గత
రావిర్యాల గ్రామవాస్తవ్యులు ***స్వర్గీయ శ్రీమతి శివనీలమ్మ,***
***స్వర్గీయ శ్రీ బుగ్గారెడ్డి గార్ల పుత్రుడు,*** కళాప్రపూర్ణ,
వేదతత్త్వవేత్త పండిత గోపదేవ శాస్త్రి దర్శనాచార్యుల శిష్యుడునునగు
సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద
**వేదగిరిస్థాపకులు ఆచార్య డా॥మర్రి కృష్ణారెడ్డి**
సంపాదకత్వమున పరిష్కరింపబడిన
**'వేదముల యథార్థ స్వరూప'**
మను ఈ మహాగ్రంథము సమాప్తము.
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# వేదగిరిపై 'వేదపీఠ, వేదమందిర, వేదాశ్రమ' నిర్మాణం

నాలుగు వేదములలోని మంత్రములను సంపూర్ణముగా [illegible] వేదమందిరము [illegible]

**వేదగిరి, తూంపల్లి గ్రా॥, కొందుర్గు మం॥, మహబూబ్‌నగర్ జి॥**









**అనువాదకర్త**

**వేదగిరి పీఠాధిపతి, వేదభాష్యానువాదభాస్కర బిరుదాంకితులు, శతాధిక గ్రంథకర్త**

**బ్రహ్మశ్రీ [illegible]**



వేదగిరి స్థాపకులు

ఆచార్య డా॥ **మట్టి కృష్ణారెడ్డి**, M.A., M.Ed., Ph.D.